వ్యసంవత్సరములు తపంబులు చేసి చరితార్థులైన మహాయోగులకు దుర్లభుఁ డగుమహేశ్వరుఁడు నాకుం బ్రసన్నుఁ డగుటకు నాయందలి మహిమలు గాని వేఱు కావు. శ్రితజనపారిజాత మగునమ్మహాదేవునకు నాపైఁ బొడమిన నిర్హేతుకజాయమానకృపయే కారణము."

ఆమఱునాఁ డుదయమున నేను గాల్యకృత్యములు నిర్వర్తించికొని పరమేశ్వరుఁ డిచ్చినపాదుకలు దొడుగుకొని కైలాసంబునకుఁ బోవలయు నని మనంబున సంకల్పించి కన్నులుమూసికొంటిని. ఆసంకల్పించుటయే యెఱుంగుదును గాని యవ్వల నేమైనదో యొక్కముహూర్తమువఱకు నెఱుంగ. ఒక్కనిముసములో నేను కైలాసంబున నుంటిని. అచ్చటివైభవం బేమని వర్ణింప? అందఱు మూఁడుకన్నులు గలవారె. అందఱు లేఁతచందురుని దాల్చినవారె. అందఱు పులితోలు గట్టినవారె. అందఱు పాముకడియంబులం బెట్టినవారె. పసిఁడిపావలు దొడిగి టక్కుటిక్కు మని నడచుచు నేను మహేశ్వర సన్నిధి కరుగుచుండ నమ్మహాదేవుఁడు నన్నల్లంతదవ్వులఁ గని సబహుమానంబుగఁ దోడ్కొని రమ్మని నందీశ్వరుం బుత్తెంచె. మర్త్యలోకంబునుండి వచ్చిన మనుష్యమాత్రుని మహేశ్వరుఁడంతవాఁ డంతగౌరవించుటం జేసి నాయం దేదోగొప్పమహిమ మున్నదని శంకించుచు బరివేష్టించిన వేలుపులందఱుఁ దలంచిరి. నందీశ్వరుఁడు నన్నెదుర్కొని కౌఁగిలించికొని చేయిపట్టుకొని దేవదేవునిసన్నిధికిఁ దోడ్కొనిపోయెను. శంకరుండును కృపారసపూరితంబు లగుచూపులతో నన్నుం గనుఁగొనెను. నేను మరసి దేవసేనాపతియుఁ దనకు గారాపుకుమారుఁడు నగుకుమారస్వామిని బీఠమునుండి లెమ్మనియాసనమిచ్చి యాపీఠమున నన్నుం గూర్చుండఁ బనిచె.

అది ప్రాతఃకాల మగుటచే శంభుని సేవింప నచ్చటికి వచ్చిన మహేంద్రాదిదిక్పాలకులు దక్కినవేలుపులు బ్రమథగణంబులును

నన్నె చూడనారంభించిరి. అనంతరము భర్గుఁడు, కైలాస మంతయుఁ జూచిరమ్మని యానతిచ్చి నందీశ్వరుని దోడిచ్చి పంపెను. నేను నందుఁగల వైచిత్ర్యంబులనెల్ల మనసారఁగనుంగొని మరలివచ్చి భవునకు మ్రొక్కి నిలువ నతఁడు వత్సా! నీ కేమి కావలయునది కోరుమని యానతిచ్చె. అప్పుడు నేను భయసంభ్రమంబులతో దేవా! మరల నరలోకంబున కరుగ కుండ నిచ్చటనే యుండవలఁతు నంటి. అనవుఁడు చంద్రశేఖరుఁడు కుమారా! నరలోకంబు పాపభూయిష్ఠమై యున్నయది. నీవింకం గొంతకాల మందుండి పాపాత్ములఁ బవిత్రులుగఁ జేయవలయు. అట్లు చేసి జీవన్ముక్తినొంది యిచట నుందువుగాక యని సాదరంబునఁ బలికి వెండియు నన్ను నరలోకంబునకుఁ బొమ్మని యానతిచ్చె.

---

## పదిమూఁడవప్రకరణము.

“అయ్యా! ఈప్రసంగమునుబట్టి నన్ను నేఁ గొనియాడుకొనుచున్నవాఁడ నని మీరు తలంప వలదు. హరిద్వారముకడకు నేను రావలసినకారణంబును మీకెఱుంగఁజేయక తప్పదు. కావున దాని నానుపూర్విగ నెఱిఁగించితిని.” అనిహరిశర్మవలుకుచుండ వానిమాటకడ్డమువచ్చి నిగమశర్మ “మేలుమేలు! మిమ్ము మీరుపొగడుకొనుచున్నవారని యెట్టిచెనఁటియైన ననఁజాలునే. జగంబులు మీమహిమంబుల వేనోళ్ళం బొగడుచుండ మీరే కొండాడుకొన వలయునా? మేమట్లుతలంచుకొనువారముగాము సుఁడీ!”యనివాక్రుచ్చి చిత్రభానువృత్తాంతము నెఱిఁగింపుమని వానిం గోరెను. హరిశర్మచేసినయాత్మప్రశంసవిని మణివర్మ “ఏమిది? ఇతఁడపస్తుతము లయినయంశములను మిక్కిలి పెంచి చెప్పుచున్నాఁడు. చిత్రభానునివృత్తాంతము

చెప్పుటకన్న తనమహిమలు చెప్పుకొనుటయే యాతనికిఁ బ్రస్తుతమని తోఁచెఁ గాఁబోలు" నని మనలో విచారించికొని యూరకుండెను. హరిశర్మ నిగమశర్మపలుకుల నాలకించి తనయందు వారికి భక్తితాత్పర్యంబులు మందగింపక యెప్పటియట్లున్నవని తెలిసికొని చిత్రభానుని వృత్తాంతము నిట్లని చెప్పఁదొడంగె.

అట్లు భగవానుఁ డగునిందుశేఖరునిచేత నాజ్ఞాపితుఁడనై వెండియుఁ బసిఁడిపావలఁ దొడిగికొని బ్రహ్మకపాలంబునొద్దభూలోకముఁ బ్రవేశించితిని. ఆతావు చేరినపిదప నా మహేశ్వరుఁ డిచ్చినపాదుకలకుఁ దొంటియద్భుతశక్తి పోయినది. అందుచేత నేను పాదచారినై మార్గమధ్యమున నాశిష్యు లగుభైరవునిఁ గాలకంఠునిఁ గలిసికొని యెడనెడ జుట్టుప్రక్కలనున్న పుణ్యక్షేత్రంబుల సేవించుచు దివ్యతీర్థములఁ మునుఁగుచు హరిద్వారము చేరితిని. నే నెక్కడికిఁ బోయినను గ్రామమధ్యమున వసించుట కిష్టము లేనివాఁడ నగుటచే హరిద్వారమునఁ గూడ నూరువెలుపల నొకపెనుమఱ్ఱిక్రింద విడిసితిని. అదిభాగీరథీతీరముననే యుండుటం జేసియు చాలనేల నావరించుటం జేసియు బాటసారులకు నత్యంతోపయుక్తముగ నుండును. ఆమఱ్ఱిక్రింద విడిసి యచ్చట నొకశిష్యునుండుమని రెండవశిష్యుఁడును నేనును గంగాస్నానమున కరిగితిమి. అప్పుడు త్రోవలో నొకమూరేడుచెట్టుక్రింద మూలుగుచువట్టి నేలంబొరలుచు బాధపడుచున్నయొకమనుష్యుని గాంచితిమి. కౌపీనం బొక్కటిదక్క వానిమేనిమీఁద వస్త్రము లెవ్వియు లేవు. మంటిముంత యొండు దప్ప పాత్రములు లేవు. అతఁ డెప్పుడు మృతినొందునా యెప్పుడు పొడుచుకొని తినఁగలుగుదుమా యని కనిపెట్టుకొనియున్న కాకులు గ్రద్దలు తప్ప వేఱుచుట్టములు లేవు. వాని ముఖలక్షణముల నవలోకింప నతఁడు సత్కులీనుఁ డనియు మిక్కిలి గారాముగం బెరిఁగి యుండఁబోలు ననియు మహారాజకుమారుఁడైన నై యుండవచ్చు

ననియు నాకును నావెంట నున్న కాలకంఠునకును దోఁచినది. ఆపన్నుల సంరక్షణమునందును భగవత్కైంకర్యమునందును శరీరమువిని యోగింప దీక్షఁబూనినవాఁడ నగుటచే నే నప్పుడ శిష్యసమేతుఁడనై యయ్యనద పజ్జకుం బోయి కూరుచుండి నీ కేమి కావలయు నని బిగ్గఱగ నడిగితిని. అతఁ డప్పుడు కన్నులు దెఱచి నావంకఁ దేరిపాఱ జూచి నోటమాట లేమిం దనకోరిక చెప్పలేక నోరు తెఱచెను. అతనికి దాహము గావలయుఁగాఁబోలు ననుకొని నేనప్పుడ కాలకంఠుని బంచి గంగాజల మించుక తెప్పించి మెల్లమెల్ల వానినోటం బోసితిని. ఆజలబిందువులు ద్రావి యతఁడించుక సేద దేఱినపిదప "నాయనా! నీ వెవ్వరివాఁడవు నీ కింతగతి ప్రాప్తించుటకుఁ గారణ మేమి? నీకిప్పుడు గలబాధ యెద్ది" యని యడిగి వాని దేహతాపము నుపశమింపఁజేయుటకై యుత్తరీయపుకొంగుతో నించుక విసరు మని కాలకంఠుని నియోగించితి. అతఁడు నటు సేయ నారోగి మఱింత సేద దేఱి మిక్కిలిహీనస్వరముతో సంగ్రహముగాఁ దనవృత్తాంతము నిట్లని చెప్పె. "స్వామీ! మీ రెవ్వరో నే నెఱుఁగను గాని నాపాలిదైవంబవని భావించు చున్నాఁడ. నేనింక బ్రతుకుట యబద్ధము. అయినను నిన్నటినుండి నోరాఱుకొని పోవుచున్నది. కాళ్ళలోఁ బటుత్వము లేమి గంగకుఁ బోయి జలంబు దెచ్చికొనఁజాలనైతి. దారిం బోవువారిఁ బిలుచుటకైన నోపిక లేఁదయ్యె. మీయనుగ్రహమున నిప్పుడు ప్రాణ మించుక చల్లఁబడినది. నాకథ సంగ్రహముగాఁ జెప్పెద వినుఁడు. "నేను గాశ్మీరమహీపాలుఁడగు హేమచంద్రునితమ్ముఁడను. చిత్రభానుఁడనువాఁడను. నేను దనకు ద్రోహము తలపెట్టితి నని మాయన్న నన్ను దేశంబునుండి వెడల నడిచె. అదిమొదలు దారపుత్రుల విదర్భ కంపి యేకాకినై యనేక దేశంబులఁ దిరిగి యాఁకలి కుడిచిన చోటఁ బండుకొనక పండుకొన్నచోటఁ గుడువక వ్యాధిగ్రస్తుఁడనై తుద కీగతికి వచ్చితిని. దైవవశమున

మాయన్నను మీరు కనుఁగొందు రని తనయెడ నెన్నండు నేను ద్రోహము చేసియెఱుంగ ననుఁడు. తాను జేసినజోగ్యినై యాలుబిడ్డల నెడఁబాసి యొకచెట్టుక్రింద దిక్కులేక మృతినొందుచుంటి ననుఁడు. మందభాగ్యు లగు నాబిడ్డలఁ గరుణింపుమనుఁడు. నాపైఁ గోపమున వారి నిరాకరింపవల దనుఁడు. ఒకవేళ నే నేయపరాధంబునైనఁ దన యెడఁ జేసితినేని క్షమింపు మనుఁడు. తనపాదపద్మములకుఁ గడసారి మ్రొక్కితి ననుఁడు. తనకొడుకుల నిరువుర ముద్దాడితి ననుఁడు." అని చెప్పి యొక్కనిముస మూరకుండి "స్వామీ నాకాయాసము వచ్చుచున్నది. నేనింక మాటలాడఁ జాల' నని యూరకుండి కన్నులనుండి సంతతధారగా బాష్పములు విడువఁజొచ్చె. అనంతర మొకదినమతఁడు జీవించెను; కాని మరలమాటాడలేదు. మఱునాఁడు మధ్యాహ్నమతఁడు పరలోకగతుఁడు కా ననాథప్రేతసంస్కారము మిక్కిలి పుణ్యప్రద మనునార్యోక్తియందు నమ్మకఁగలవాఁడ నగుటచే నేను నాశిష్యులం బురికొల్పి వానికగ్నిసంస్కారంబు గావించితిని. మరణకాలమునందు నా కతఁడు చెప్పినపలుకులు విన్నవించి కృతకృత్యుఁడ నైతిని. కాని మీ కధికమనస్సంతాపము గలిగించితిఁ గదా యని చాల వగచుచున్నాఁడ. ఏకారణమున నైన మనుష్యుల దుఃఖింపఁజేయుట మా యాశ్రమంబున కనుచితము. అదియునుఁ గాక బంధుమరణముచేత దుఃఖపడుచున్న వారిసమీపమున నేనుండఁజాల" నని హరిశర్మ వెండియు నేదో చెప్పఁబోవుచుండ హేమచంద్రుఁడు దుఃఖావేశపరవశుఁడై గోడకుఁ జేరఁబడి మొగంబున నుత్తరీయాంచలము వైచికొని తమ్ముని గూర్చి బిట్టువగచెను.

మణివర్మయు మాధవసేనుఁడును రాజును బట్టుకొని దుఃఖోపశమనవాక్యంబులు బలికిరి. ధైర్యమువిడిచి యంగలార్చు రాజుదుఃఖము నుపశమింపఁ జేయఁ దలఁచి హరిశర్మయు నిట్లనియె. "రాజా యీ

శరీరములు వినశ్వరములని యెఱింగియు నీవింతవిచారింపనగునె. వినశ్వరంబులగుపదార్థములఁగూర్చి విచారించుట వివేకులకు ధర్మముకాదని భగవంతుం డగుశ్రీకృష్ణుం డర్జునున కుపదేశింపలేదె. భగవద్గీతలు పిచ్చికూఁతలని దుర్వాదములు చేయుబౌద్ధులు భగవంతునిమాటలపై విశ్వాస ముంచరుగాని యాస్తికులమగు మనము విశ్వాసముంచి జ్ఞానవంతులము కావలదె. ఆత్మ నిత్యము దేహమనిత్యము. ఇదియెఱిఁగి నడచుకొన్నవాఁడే వివేకి. అందుచేత నీవు విచారింపఁజెల్లదు." అని పలుకుటయు హేమచంద్రుఁడు కన్నీరుదుడుచుకొని "స్వామీ నా తమ్మునిమరణకాలంపుఁబలుకులు ములుకులై నన్నుంబీడించుచున్నవి. వానిచరమావస్థం దలఁచుకొన్న నాకడుపు చుమ్మలుచుట్టుచున్నది. "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను మాట సత్యము. కటకటా! నిరపరాధుఁడగుసోదరుని నేలపాలు జేసికొంటిఁగదా. విమర్శించి కార్యంబులఁజేయనివారికి ప్రాపించుగతులిట్టివియే కదా. ఈభ్రాతృద్రోహి మీవంటి మహాత్ములపవిత్రచరణంబులను ముట్టఁదగఁడు. నాచేసిన దోసంబునకు శాపంబే దేని నిచ్చి నన్ను దుదముట్టించి నాయలమట దీర్పఁగదవే" యని ప్రార్థించి వాని యడుగులపయింబడెఁ;

అడుగుల వ్రాలిననేలఱేని గ్రుచ్చియెత్తి నేలవేల్పు "చాలు చాలు రాజా! చాలు నీ బేలతనము. నీగురువులు నీకు రాజనీతి నుపదేశించుటయే కాని బ్రహ్మవిద్యోపదేశంబు జేయరని తోఁచెడిని. నీమనోవైకల్య మడఁగువఱకు నీకు మేము తత్త్వోపదేశంబు జేయఁదలఁచుకొన్నారము. ఇదనీకు సమ్మతంబ యగునేని మాకడ కప్పుడప్పుడు వచ్చుచుండునది" అని మందలించి మంత్రిపురోహితులం జూచి "యమాత్యా! ఈతనివైఖరి జూడ నాత్మహత్య జేసికొనువాఁడవోలెఁ గనంబడుచున్నాఁడు. తొల్లి యొక్కనరపాలుఁడు తద్దయు సొగసులాఁడి యగుతన రెండవయిల్లాలు చెప్పినకొండెములు విని పట్టపుమహిషివలనఁ

దనకుఁ గలిగిన జ్యేష్ఠకుమారుని నిరపరాధుని నిష్కారణముగ వధియించి పిమ్మట కొంతకాలమున కతఁడు నిర్దోషియని విని యాదుఃఖము పట్టఁజాలక తన్నుఁ దాఁ బొడుచుకొని ప్రాణములు విడిచె. కావున నీతని దెస మీరపరిమత్తులై యుండునది" అని హితోపదేశంబు జేసి తరకను స్థానకాలము మీఱుచుండుటచే వారి నవ్వలకుం జను మని వేఁడుకొనియె. హేమచంద్రుఁడు హరిశర్మకుం బ్రణామంబు జేసి సెలవు గైకొని సపరివారముగ మరలఁ బాదచారియై మందిరంబునకుం జని సోదరవియోగమును గూర్చి పరిపరివిధంబుల విలపింపఁ జొచ్చె.

రాజునకు మాధవసేనునకు నిగమశర్మకు హరిశర్మపై నింతింతయనరాని భక్తి కుదిరెనుగాని మణివర్మకు మాత్ర మాతనిసంభాషణంబులు వినినదిమొదలు కొన్ని యనుమానంబులు పొడకట్టె; సంపర్కము పొసఁగియుండకపోయినను హరిశర్మ తనప్రశంస మెండుగఁ జేసికొనుటయు దుఃఖముచేత మనోవైకల్యము నొందినమహారాజునకు నుదాహరణపూర్వకముగా నితిహాసంబును పేరు పెట్టి యొకదుష్కథ జెప్పుటయు మణివర్మకు వానిపైఁగల గౌరవంబును గొంత తగ్గించెను; తన మనంబునకుం బొడకట్టినయనుమానంబులు రాజునకు విన్నవింపఁదలఁచి యుఁ దగినయదను వచ్చినప్పుడట్లు చేయునగునని యూరకుండెను.

హేమచంద్రున కరవిందాదేవియుఁ బెక్కండ్ర యంతఃపురపరిచారకులు నెట్టెటో దుఃఖోపశమనంబు జేసిరి. వారి యుపచారవాక్యముల వలన రాజునకు బాహ్యదుఃఖము కొంతయడంగిన నంతస్తాపము నూనదాయె. అందుచేత నతఁడు దినమున కొక్కొకసారియైన హరిశర్మయున్న నెలవునకుం బోయి వారివలన వేదాంతవిద్య నుపదేశము నొందుచునచ్చె. తఱుచుగ నతఁ డొంటిగఁ బోవుచుండుటఁ జూచి మణివర్మ ప్రాణ్యుఁ డెంతయోగ్యుఁడైనను వానికడ కేకతంబుగఁ బోవుట రాజున కుచితంబు కాఁదని సందలించుచునచ్చె. హరిశర్మభగవంతుఁడే

యని మనంబునఁ దృఢవిశ్వాసము నెలకొని యుండుటచే రాజు వాని మాటలు పెడచెవిని బెట్టెను; హరిశర్మయు రాజును మిక్కిలి గౌరవించుచు వాని మేన సింగనైన వాలనీయక చీఁకటిపడువఱకు వానిం దనకడ నుండనీక యొకవేళ నట్లుండెనా భైరవకాలకంఠులను సాయమిచ్చి పంపుచు కన్నబిడ్డనట్లు కాపాడుచుండె.

## పదియాఱవప్రకరణము.

హేమచంద్రున కరవిందాదేవివలన నిరువురుకుమారు లుద్భవించిరని యీవఱకు చెప్పఁబడినది. అందు జ్యేష్ఠునకు హేమచంద్రుఁడు తనతండ్రిమంచిభక్తిఁ బెంపున విక్రమసేనుఁ డనునామమిడియె. రెండవకొమరునకు హర్షవర్ధనుఁ డనుపేరం బరఁగుచుండె. ఆయిరువురుబిడ్డల యందుఁ దలిదండ్రులయిరువురలావణ్యంబును నిరువురసౌజన్యతయు నిరువురమనీషావిశేషంబును సంక్రమించె నని ప్రకృతిజనంబులు ప్రమోదభరితులుగా విక్రమసేనహర్షవర్ధను లల్లారు ముద్దుగఁ బెరుఁగుచుండిరి. విక్రమసేనునియాకృతి తండ్రివిగ్రహమునుబట్టి యచ్చుగుద్దినట్లు వెలయుచుండు. హర్షవర్ధనుఁ డచ్చముగఁ దల్లిపోలిక నుదయించె. అందుచే విక్రమసేనుఁడు దృఢమనస్కుఁడై గంభీరుఁడై తన యీడునకుఁ దగనిపరాక్రమంబుల నప్పుడప్పుడు చూపి సార్థకనామధేయుఁ డయ్యె. హర్షవర్ధనుని మనస్సును వానిశరీరంబునట్ల కడుమెత్తనై యుండుటం జేసి యతఁడు సాహసంబునకుఁ బరాక్రమంబునకుఁ జేటుపడక సంగీతాదివిద్యలకును భూతదయకుం బేరువడియె. తమ్ముని యందు భూతదయ సంగీతప్రౌఢిమ గలవనుటచే నన్నయం దాగొనములు కొఱవడియె నని చదువరులు తలంపవలదు. విక్రమసేనుఁడు

భూతదయావిషయమునఁ గాని వేఁటాండుప్రజ్ఞయందుఁగాని తమ్మునకుం దీసిపోవఁడు. అయినను జను లాతనిసాహసంబులఁ బలుమాఱు గాంచి వానికి సాహసవిక్రమసేనుఁ డనియుఁ దమ్మునకు సుకుమారహర్షవర్ధనుఁ డనియుఁ బేళ్ళు పెట్టిరి.

ఇప్పటికి విక్రమసేనుఁడు పండ్రెండేండ్లప్రాయము గలవాఁడు. హర్షవర్ధనునకుఁ బదియవయేఁడు. క్షత్రియునకుఁ బదునొకండవయేట నుపనయనము చేయవలసిన దని ధర్మశాస్త్రములయందు విధింపఁబడుటచే హేమచంద్రుఁడు పెద్దకొడుకు నొకసంవత్సరముక్రిందట వడుగు చేసి వేదాభ్యాసము చేయించుచుండెను. ఆయన్నదమ్ముల మైత్రి యిట్టిదనివర్ణింప నలవిగాదు. ఒకనివిడిచి యొకరు నిముసమైన నిలువఁజాలరు. ఇరువు రొక్కచోటనే కూర్చుందురు. ఒకమాఱే భుజియింతురు. ఒక్కపాన్పుననే పవ్వళింతురు. ఇరువురు తలిదండ్రుల యెడ భక్తులు. గురుజనంబుల యెడ విధేయులు. భృత్యజనంబుల యెడ దయాళుదు. ప్రకృతిజనంబుల యెడ ననురక్తులు. సుగుణాలోభులు. దుర్జన విముఖులు. అయ్యిరువురుబిడ్డలు సరవింధా హేమచంద్రునకుఁ బున్నెములప్రోవులై నోములపంటలై పుట్టి, కన్నులచందమామలై ముద్దులమూటలై పెరుగుచుండిరి. చదువులనే కాక యాయుధక్షేపంబుట, గజాశ్వంబుల నధిరోహించుట, మున్నగుపౌరుషక్రీడలను గమమిలాకువతో నేర్చి బాలురు కాలక్రమంబున సమర్థులైరి. ఆకుమారసింహములలో సాహసుండని బిరుదు నందినవిక్రమసేనుని పరాక్రమంబుల నొకటి రెంటిఁ బేర్కొని యతఁ డాబిరుదమునకుం దగినవాఁ డని చూపవలసియున్నది.

ఒకనాఁడు హేమచంద్రుఁడు సేనాపతియగు దండపాణిని బాలుఁ డగువిక్రమసేనునఁ గొంతపరిజనంబును వెంటఁబెట్టుకొని యడవికి వేఁటకుఁ జనియె. హేమచంద్రుఁ డొకమూల సింగపువేఁట సాగించుచుండె.

దండపాణి యింకొక నెలవున పులివేఁట సలుపనెంచి మృగయాక్రీడ లలోఁ దాను నెఱప్రోడ యగుటచేఁ దనకెట్టి యపాయంబును లేఁదని మాటున నిర్భయముగ నొకమఱ్ఱినీడను నిలిచి పులిరాక కెదురుచూచు చుండెను. విక్రమసేనుఁడు వాని వెనుకఁ గొంతదవ్వున నొకమెట్టపై నిలుచుండి యావినోదంబుజూడ నుత్సుకుఁడై యుండెను. అంతట వేఁటకాండ్రు తప్పటలం జఱచుచు బెబ్బులిం దఱుముటయు నమ్మృగ ము తనపొదవిడిచి సహజముగఁ జింతనిప్పులచొప్పున మెఱయుకన్నులు మఱింత యారుణ్యముఁబూని చూపఱకుఁ వెఱపుగలిగింప దండపాణి యున్నవలనునకుఁ బఱతెంచె. సేనాపతియుఁ బ్రత్యాలీఢపాదుఁడై వింట నమ్మునదొడిగి గుఱిచూచి బెబ్బులి నేసె. దైవవశమున వాని యేటు చాలమికంబునకుం దగులక చెవిపొంతనుండి దూసికొనిపో యెను. పోవుటయు నాశార్దూలము తొలుతకంటె నినుమడించినయలుక తోడను ముమ్మడించినవేగముతోడను బాణము వచ్చినదారింబట్టి రివ్వునదండపాణిమీఁద నెగసిపడుటకు నేలయదుగునట్లు పఱువెత్తి రాఁ జొచ్చెను. మృత్యుదేవతఁబోలు దానియుగ్రరూపమును జూచి దంట లగుబంటులు ప్రాణభీతిని యథాయథలై పఱతెంచిరి. వేఱొక్కయ మ్మునదొడిగి యేయుటకు దండపాణికి నవకాశము లేకపోయెను. ఆయ పాయమ్మును దవ్వుననుండిచూచి విక్రమసేనుఁడు సత్వరంబ తనవిల్లుఁ బూని విసముఁబూసినవాలుటమ్ముఁదొడిగి యెక్కియున్న మెట్టదిగి వలదు వలదని సేవకులు మొఱలిడుచున్నను వినక దండపాణివెనుకకు వచ్చి బరిమీఁదఁ బఱతెంచువ్యాఘ్రంబును గాటంబుగ నాటనేసె. అయ్యేటు దిని యాక్రోలుపులి దండపాణికి రెండుబారల దూరంబునఁ జుట్టు ప్రక్కల కొండలు ప్రతిధ్వనులీయ వేఁటకాండ్రగుండెలవియ నొక్క యఱపఱచి నెత్తురుకంఁగలుదొరఁగ నేలంగూలె. విక్రమసేనుఁడు పిఱికి బంటులమాటవిని యొక్కనిమున మూరకుండినయెడఁ దనబాణాగ్ని

యను కాఱుచిచ్చున శత్రుసైన్యమహారణ్యంబులం గాల్చు దుర్జయ బాహుశాలి దండపాణి, బెబ్బులినోటి క్రొక్కఁ కబళమై యమపురిని బ్రాఁతకాపై యుండియుండును. దండపాణియు మృత్యుముఖమునుండి వెలువడి బాలునకుం గడుకృతజ్ఞుఁడై వానిం గౌఁగిలించికొని వాని కావించినమేలు మఱువననియు వానిఋణ మెన్నఁడును దీర్చుకొను టకుఁ దనకలవి కాఁదనియుఁ జెప్పి యనేకవిధంబుల నుగ్గడించె. హేమచంద్రుఁడు పుత్రునిసమయజ్ఞత చాకచక్యము విలువిద్యయందలి నేర్పు విని తనకుమారుఁడు వంశప్రదీపకుఁ డగునని సంతసించె. అరవిందాదేవియుఁ దన చిన్నిపాపని మిన్నచెయువులు విన్నయప్పుడు కన్నుదమ్ముల నశ్రుజలంబులు కాఱఁ గన్నబిడ్డ నెత్తికొని ముద్దాడి జనులదృష్టిదోషముదగులకుండ వానికిదృష్టిపరిహారములు చేయించెను.

మఱియొకసారి విక్రమసేనుఁడు హర్షవర్ధనుఁడు వైశాఖమాసమున నొకసాయంకాలమున నుద్యానవనమున నొకకొలనియొద్దనవిహరించుచుఁ జల్లగాలిననుభవించుచుండ దండపాణికొడుకు హర్షవర్ధను యీడువాఁడు తోడిబుట్టియలఁగూడుకొని యాకొలంకున జలక్రీడలు సేయుచు నాటలనందడి నపాయ మెఱుంగక నోలయోలయని కేకలు వేయుచు లోఁతునీళ్ళకుఁబోయె. ఆబాలకుఁడు సరిగ నీఁత నేరనివాఁ డగుటచే మునుముందుఁ బోవుటయే కాని లోఁతునీళ్ళనుండి మరల నేలకు రానేరక యలసి నీటనొకటిరెండు మున్కలువైచె. అదిగట్టున నుండి చూచి విష్ణుదత్తుఁడు మునిఁగె మునిఁగె నని హర్షవర్ధనుఁ డన్నతోఁ జెప్పెను. అప్పలుకులు వినినతోడనే విక్రమసేనుండు జాలినొంది తలమీఁది రత్నాలకుళ్ళాయి నేలం బాఱవైచి విలువదువ్వలువలు తడిసి చెడిపోవు నని వగవక తనచేత నప్పని యగునా కాదా యని విచారింపక తనసాయంబున కెవ్వరిం జీరక గుభాలున నీటం దుమికి వడివడి విష్ణుదత్తునియొద్దకుఁ దుముకొనిపోయి యామందభాగ్యుని జుట్టు

పట్టుకొని యావలకు లాఁగికొనివచ్చి బ్రదికించెను. తననందనునకు వాటిల్లిన యపాయంబును రాజనందనుఁడు గావించిన సాయమును విని దండపాణి సత్వరంబ యచ్చోటునకుఁబోయి కుమారునకుఁ గాలోచితము లగు నుపచారములు చేయించి యతఁడు తెలివొందినపిదప రాజకుమారుని బిగ్గఁ గౌఁగిలించుకొని, "వత్సా! నాకును నాకుమారునకును నీవ ప్రాణప్రదాత వైతివి. మేమిరువురమును మాశరీరచర్మములుగోసి నీకుఁ బాదరక్షలుగఁ గుట్టించి యిచ్చినను మీఋణంబు తీరదును మీ" యని కొనియాఁడి తనపట్టిని వెంటఁబెట్టుకొని యింటికిఁబోయెను. అసమానమగు రూపంబునకుఁ దగినవిక్రమంబును విక్రమంబునకు వన్నె వెట్టు సుగుణసంపదయుఁగల విక్రమసేనునిజూచి రాజబంధువులు ప్రకృతిజనంబులు మహానందమగ్నులయిరి. ఈవ్రికరణంబునం బేర్కొనఁబడినపరిధమసాహసకార్యము హరిశర్మ యవ్వీటికి వచ్చుటకు నాలుగు మాసములక్రిందటను రెండవది నెలక్రిందటను జరగెను. పండ్రెండేండ్లప్రాయమునాఁడె యింతమగంటిమిఁ జూపినయీబాలకుండు యుక్తవయస్కుఁ డై రాజ్యమును వహించుపిదప వానిపేరు శత్రుమహీపాలురకు హృదయశల్యంబు గాక యుండునా యని తలంచి మణివర్మ మాధవసేనుఁడు మొద లగు మంత్రులు సంతసించి కాశ్మీరమున కంతకంతకు మంచిదినములు వచ్చుచున్న వని సంతృప్తహృదయు లైరి.

హేమచంద్రుఁడు చిత్రభానుని దుర్మరణంబును విని దురపిల్లినప్పుడు విక్రమసేనుఁడును చిన్నతండ్రిచావునకు బిట్టువగచెను. కాని బాలుఁ డగుటచే వానిదుఃఖము తండ్రివగపుంబలెదీర్ఘకాల ముండక మఱునాఁడె యుపశమిల్లె. అదినము మొదలు హేమచంద్రుఁడనుదినము సాయంకాలమున రాజకార్యంబులు ముగించిహరిశర్మయొద్దకుంబోయి వేదాంతగోష్ఠి సడుపుచుండుటచే విక్రమసేనహర్షవర్ధనులు, మహామహిమములకుఁ జేరువడి యున్న హరిశర్మ నొక్కసారి చూడఁగోరియొక

నాఁడు సంజకడఁ దండ్రికడకుఁ బోయి నీ వడుగుము నీ వడుగు మని యిరువురు వంతులు పోయిరి. బిడ్డలుతన్నే దియోకోరదలఁచిభయంబు పెంపున నడుగ సాహసింపఁజాల కున్నవా రని హేమచంద్రుఁడు గ్రహించి వారిఁ జేరఁజీరి మేనులు దువ్వి "వత్సలార! మీ కేమి కావలయును. భయము లేదు చెప్పుఁ" డని హెచ్చరించెను. అప్పటికిని విక్రమసేనుఁడు తనకోరిక బయలుపుచ్చక యూరకుండె. తండ్రి బుజ్జగింపుచే భయము విడిచి హర్షవర్ధనుఁడు మెల్లన నిట్లనియె. "మీవంటి యుత్తము లనుదినంబును బోయి కొలువందగినమహిమలు గలహరిశర్మనొక్కసారి చూడ నభిలాష పడుచున్నవారము. మాకోరిక కోరరానిది కాదేని మమ్ము మీవెంట రా ననుగ్రహింపుఁడు" అన వుడు చిఱునగవు నవ్వి వత్సలారా! ఈపని కింత వేడఁవలయునే. మీ కొకసారి యమ్మహాత్ముని జూపవలయునని నేనుం దలంచుచున్నవాఁడ. ఇప్పుడ నేనచ్చటికిం బోవుచుంటి. నావెంటరండు.మునింజూచివత్తురుగాని" యని పలికి తన కొడుకులు వెంబడింప గుహకుఁ జనుమృగరాజు చందంబునఁ గాశ్మీరరాజు కుమారసింహములు వెంట రాఁమునియున్న గుహకుఁ జనియె. మునియు రాజును సూర్యచంద్రులంబోలె వెలయు నక్కుమారులను గారవించి వారు నమస్కరింప నాశీర్వదించివ్యాఘ్ర చర్మముల పైఁ గూర్చుండఁజేసి తనయొద్ద నున్నబూడిద సంచికవారి నొసళులఁ బ్రామి చేని నుద్దేశించి "హేమచంద్రా! నీ వదృష్టవంతుఁడవు. నీకడుపునం బొడమిన యీరత్నంబు లమూల్యంబులు. దైవము రక్షించిన నింక నైదా ఱేండ్లలోన పెద్దబిడ్డఁడు రాజ్యభారమును వహించి నీకు విశ్రాంతి నొసంగఁ గలఁడు." అని బహూకరించెను. రాజు వాని బహూకరణమునకు లోనఁ గడునలరి "దైవానుగ్రహంబును మీ యాశీర్వచనంబును జల్లఁగ నుండునేని మీరన్నయట్లు కాఁగలదు. దానిమాట యటుండ నిండు. నాచిత్తంబు తమ్మునిదెసనుండి

మరలింపఁ జాలకున్నవాఁడ. కుమారుఁడు యుక్తవయస్కుఁడు కాక మున్న మహీరాజ్యమునకు వాని నభిషిక్తుని చేసి మీయనుజ్ఞయగు నేని నేను విరాగినై కాలము బుచ్చువాఁడ" నని చిత్తంబునఁ గల యుత్తలంబు సంగ్రహంబుగఁ దెలిపె.

తండ్రిపలుకులు చెవులఁ బడినతోడనె బాలకులిరువురు తెల్ల బోయి యొండొరుల మొగంబులఁ జూచుకొనసాగిరి. దానికిం దోడుగ హరిశర్మ రాజు నుద్దేశించి యిట్లనియె. "నీకంత వైరాగ్యంబు జూన నిచ్చ గల దేని యడవుల నుండ నక్కఱ లేకయె రాజ్య మేలుకొనుచు సకలోపభోగంబుల ననుభవించుచు నిఖిలలౌకికవ్యాపారంబుల మెలం గుచు జనకచక్రవర్తియట్లు శరీరసన్యాసంబు గాక యాత్మసన్యాసంబు స్వీకరించి మంటిలో నుండియు మున్నంటనికుమ్మరిపురుగు తెరంగున సంసారంబునందుండియు లేనట్లు వర్తింపవచ్చును. నీవు తరియించుటకు సాధకం బగుమంత్ర మొకటి నీ కుపదేశించెద. అది పుణ్యదినమున నర్ధరాత్రమున నుపదేశము కావలయును. దానిపురశ్చరణ ముచురఱకు. మంత్రోపదేశమును పునశ్చరణమును మూఁపులు మాఁగుహాయందచేయం దగు. దీన నీయమంబులు యఖిలంబుపశమిల్లు. భవరోగంబులకు మహా మంత్రంబులు దివ్యౌషధంబులు గదా"! అని హరిశర్మ పలుకుటయు బాలురనెమ్మొగంబులు మఱింత తెలివిదప్పి నెలవెలఁబోయెను. హేమ చంద్రుఁడు హరిశర్మపలుకులకుఁ దద్దయు నలరి వానిచరణంబులకు సాష్టాంగనమస్కార మొనర్చి "స్వామీ! మీకు నాపై నింతమాత్ర మనుగ్రహ మెన్నఁ డయినఁ గలుగునా యని మేలుసమయంబునకు, స్వాతివానకు ముత్తెపుచిప్పయట్లు, నామనంబు ప్రతీక్షించుచున్నయది. పుణ్యదినంబును సుముహూర్తంబును మీరె యేర్పఱుపుఁడు. అర్ధరాత్ర మందా మంత్రరాజంబు నుపదేశ మొంది మాఁపు లిచ్చుటనే పురశ్చరణ ము చేసెద. సిరిరా మోకాలొడ్డువా రెవ్వరు!" అని నుడివి వాని

యొద్ద సెలవుం గైకొని కుమారద్వయసమేతుండయి యంతఃపురికిం జనియె. అంతఃపురిం జొచ్చినతోడనె బాలకు లిరువురు పరుగుపరుగునం దల్లికడకుం బోయి తండ్రికోరికలు, ముని యిచ్చినవరంబులు పూసగ్రుచ్చినట్లామెకుం జెప్పిరి. అరవిందాదేవియుం దద్వచనముల నాలకించి మహారాజు విరాగియై, యేయడవులకుం జనునో, యెప్పుడుసన్యసించునో యేమిసాహసంబు గావించునోయని భయపడి యడుగుటకు నడుగకపోవుటకుం గూడ వీలు లేనియవస్థ వచ్చినది కదా యని యెద్దియుం దోఁచక విచారించుచుండె.

---

## పదియేడవ ప్రకరణము.

“కాలకంఠా! భైరవు నిక్కడ నుండుమని నీవు పోయితివో నీవిక్కడనుండి భైరవు నంపితివో యెట్లయినసరియె. అనుకొన్న పని చాలవఱకు నెఱవేఱిన దని నమ్మకమిాఱంబలికి దేవశర్మను నత్వరంబ నాకడకుం గొనితేవలయును. ఇక్కడకు వచ్చి మనతోం గలసి యుండుట కతం డొల్లకపోయిన నీప్రాంతములయందె మన కొక్కపూంట పయనములో నుండునది యని నొక్కి వక్కాణింపుము. మునుముందు నన్నుం గలిసి మాటలాడి పొమ్మనుము” అని హరిశర్మ రాజు తన్ను వీడ్కొని పోయినవెంటనె ప్రియశిష్యుండగు కాలకంఠు నడిగెను. వాండును వినయంబునం జేతులు గట్టుకొని విప్రునియెట్టయెదుట నిలిచి “స్వామిా! ఈపని మనభైరవునివలన గాదు. దేవశర్మచీమలు దూఱని చిట్టడవులలోను, కాకులు దూఱనికాఱడవులలోను నున్నవాండు. వానిజాడలు నేను తీసినట్లు వాండు తీయం జాలండు. కావున నేను బోయెద” నని యాఱేయి యచ్చటినుండి జాముంరాత్రివేళ లేచి వెండేని జనియె.

కాలకంఠుండు గుహ విడిచిన పిదప భైరవుని బిలిచి హరిశర్మ దాపునఁ గూర్చుండ నియమించి "భైరవా నీతో నొక్క రహస్యమును జెప్పవలయు నాచెప్పినచొప్పున నీవు మెలంగుదువ యేని మనకార్యం బతిశీఘ్రంబ యగు. ఇప్పటినుండి నీవు యత్నంబు సలుపకున్న నప్పని యగుట యరిది" అని యనుడు భైరవుఁడు భయభక్తులు మెఱయ స్వామీ! దేవర యాజ్ఞ శిరసావహించి యప్పని నెఱవేర్చెద. నాప్రజ్ఞ మా కెఱుంగదా? మహాప్రభువు నన్ను మీ కప్పగించినపుడు మీతోడ నెన్ని యుపదేశములు జెప్పె నన్ని యుత్తరములు నేను జరపువాఁడ" నని ప్రత్యుత్తర మిచ్చెను. పిదప హరిశర్మ వానిని మిక్కిలి దాపునకుఁ బిలిచి చెవిలోఁ గొంతసే పతడను గుసగుసలాడెను. ఆవిస్రంభసంభాషణము ముగిసిన తోడనే భైరవుఁడు తనపనిమీఁదికిం బోయె. అంతలోఁ దెల్లవాఱుటయు హరిశర్మ ప్రాతఃకాలకృత్యములం దీర్చి భక్తిమై తన్నుం గొలువవచ్చువారికి దర్శనము నిచ్చుటకు సిద్ధముగ నుండెను. అంతం గొంతసేపటికి వాని యెట్టయెదుట నేడడుగులు పొడవు, పొడవునకుం దగినలావు, లావున కనుగుణ మగుబలము గల యొకపురుషుఁడు వచ్చి నిలిచి 'స్వామీ! నమస్కార' మని ప్రణమిల్లెను. హరిశర్మ యప్పురుషు నెన్నఁడుం గనియుండక పోవుటచే ముందుగ వాని నేమని పలుకరింపవలయునో యెఱుఁగక యాశీర్వదించి కూర్చుండు మని యానతిచ్చెను. అప్పురుషుఁడు దాపుననున్న వ్యాఘ్రచర్మము పై నాసీనుఁడై హరిశర్మచేఁ దన్నెఱిఁగించుకొనుతలంపున వినయమున నిట్లనియె. "దేవా! ఇంతవఱకు నేనెన్నఁడు మీదర్శనము జేసి ధన్యుఁడఁ గా, లేదు. జగద్విశ్రాంతకీర్తు లగుమి మ్మొకసారి గాంచి నాశరీరము పావనముఁ జేసికొనవలయు నని వచ్చితిని. కాశ్మీర రాజసైన్యమునకు నేను సేనాపతిని. నన్ను దండపాణి యందురు." అని విన్నవించుకొనుటయు హరిశర్మ "నాయనా! నీయాకారమే నీయుద్యోగమును మును

ముందు దెల్పుచున్న యది. పగతురమూఁకలకు తాముఁడవై యుండువు గావున దండిపాణి యను నీపేరు సార్థక మైనది. నిన్ను నాకడకుం దెచ్చి నపని యేదియో నాకెఱిఁగింపు" మని వాక్రుచ్చుటయు దండపాణి యిట్లని చెప్పఁదొడంగె. "దేవా! దేవరవారు దీనులపాలిటికిఁ గాలు సేతులు గలకల్పవృక్షమనియు మాటలు నేర్చినమందారమనియు సంచ రింపఁ గలసంతానమనియు జీవముగల చింతామణి యనియుఁ గోవిదులు చెప్పికొనుచున్నారు. కోవిదులకైన సమగ్రముగ లోఁతు తెలియరాని మీమహిమాసముద్రము నెఱుంగుట మాకు వశమా. మహాత్మా! మిమ్ము నేనొక్కచిన్నకోరికఁ గోరవచ్చితిని. అది యెఱిఁగింతు మన్నించి సావధానుల రై విందురు గాక! హేమచంద్రమహారాజుగారి జనకులగు విక్రమసేనమహారాజుగారు నాతండ్రినిగను నల్పస్థితిలో నుండియున్నత స్థితికిం దెచ్చి నన్ను దనపుత్రు లగుచిత్రభానుహేమచంద్రులతో సమ ముగఁ బెనిచిరి. చిత్రభానునకు నాకు మేను లు రెండుగాని ప్రాణ మొక్క టియే యని చెప్పఁదగినంతమైత్రి కలదు. హేమచంద్రుఁడు నాయం దిప్పటికిని భ్రాతృవాత్సల్యము నిలిపి యున్నవాఁడు. చిన్నయుద్యోగ ములో నుండి క్రమక్రమంబున నన్నింత మహాపదవిం దెచ్చెను. నాకు మణిమాలిక యను పుత్త్రిక యొకర్తు కలదు. నే నసఁగూడదు, కాని మీయాశీర్వచనమున నబ్బాలిక కడుఁ జక్కనిదనియు రాజాంతఃపుర ములనుండఁదగిన దనియు మిముబోటిమహాత్ములు సెలవిచ్చిరి. తత్కా రణమున నాముద్దుకూఁతును తన జ్యేష్ఠకుమారుఁ డగుసాహసవిక్రమసే ననకుఁ బెండిలి జేసికొమ్మని కన్నియ పుట్టినది మొదలు హేమచం ద్రుని వేఁడుకొనుచుంటి. మూర్ధాభిషిక్తు లగునరపాలురు నలువురు రత నాలకుప్పలు ధనసంచయములు దేశంబులు కానుకలు బెట్టి నాకూఁ తుల విక్రమసేనున కిచ్చెద మని బాలకుఁడు జన్మించినది మొదలు హేమచంద్రునకు రాయబారములఁ బంపుచున్నవారు. అందుచేత

నావంటి యల్పునితో వియ్యమందుటకిష్టము లేక గాఁబోలునతఁ డీసంబంధంబు నొల్లక యెప్పటికప్పు డెద్దియో వంక చెప్పుచున్నాఁడు. బాలకుఁడు యుక్తవయస్కుండు గాకమున్న వివాహము చేయ నని యొక్కమాఱు, నరవిందాదేవి కిష్టము లేదని యొక్కమాఱు, మేనరికమున్న దని మఱియొకమాఱు చెప్పుటచే నేను విసికి కొంతకాలము క్రిందట నాకుం బ్రాణమిత్రుం డగుచిత్రభానునియొద్దకుఁబోయియాతనికొడు కగువిజయసేననకు నాబిడ్డను జేసికొమ్మని ప్రార్థించితి. అతఁడందుకు సమ్మతించె. ఇంతలో నాభాగ్యదోషమున నతఁడు బంధుమిత్రులకు దూరుఁడై కన్నుల కఱవై పోయె. ఏదేశాంతరముల నైన జీవించి యుండక యతఁ డస్తమించెననికూడ తెలిసినది. నామిత్రుఁడు చిత్రభానుఁడు జీవించియుండిన నామనోరథంబు సఫలం బగును గాని యిప్పుడు విజయసేననకు నాబిడ్డ నిచ్చుట యసాధ్యము కదా. కావున మీరు సన్ననుగ్రహించి నాకూఁతును విక్రమసేనునకుం జేసికొమ్మని హేమచంద్రునకు నొక్కి చెప్పవలయును. అతనికిమీనోటిమాట వేదవాక్యము. మీయాన వానికి శిరోభూషణము. నాబిడ్డకిప్పుడు పదవయేఁడు. వాండ్రికిరువురకు నీడుజోడు తగియున్నది. కట్నములు కానుకలు కోరిన ట్లిచ్చెద. వియ్యపుం దగవులు సరిగ నడపెద. ముద్దుముచ్చటలు దీర్చెద. రాజుగౌరవంబునకుం దగినరీతి నేనా శ్యంపెద. సంకల్పసిద్ధుల రగుమీరు దీని జేయఁదలంతు రేని యిది నెఱవేరుట నిశ్చయము." అని ప్రార్థించుటయు హరిశర్మ వాని వేఁడికోలు విని యెద్దియుం బలుకక కొండొకసే పూరకుండి మనంబున నెద్దియో తలంచి చిఱునవ్వు నవ్వుచు దండపాణితో నిట్లనియె.

"అహహా! లోకులయజ్ఞానమునకు మేర లేదు గదా! ధగధగ వెలుఁగుదీపము దివ్యసుందరపదార్థమని భ్రమసి దాని పై వ్రాలి నశియించుపురుగులకును జ్ఞానసంపన్నులగుమనుష్యులకును భేదముగానఁ

బడకున్నది. క్షణములో ముక్కముక్కలగు గాజురాలును సుస్థిరము లగుమాణిక్యంబులయట్లు తళతళ మెఱయుచుండుటం జేసి లోకులు ప్రమాదవశంబున మణులు గ్రహింపఁబోయి వట్టిగాజులు గ్రహించుటయుఁ గలదు. ఎంతో ప్రాజ్ఞుఁడ వనుకొంటిఁ గాని నీవింత పామరుఁడవని మొదటఁ దలంపనైతి" అని హరిశర్మ పలుక నాపలుకులు దండపాణిపినులకుఁ గఠోరములై మనస్సున కద్భుతములై కోఁపయొక్క నిముసమువఱకు వానిం బిచ్చివానినట్లు చేసెను. దండపాణి తెల్లతెల్ల బోవుటయు నెద్దియుం బలుకఁజాలకుండుటయుఁ జూచి హరిశర్మ వానికిఁ దనమాటలయర్థము చెప్పఁదలంచి యిట్లనియె. "నీవు తెల్లబోవుచుంటివేమి? నామాటలయర్థము నీ వెఱుంగవా? మీరు రాజునకత్యంతప్రియసేవకులు. మీతోడ మావంటివారు ముందు రాఁగలయరిష్టంబులం జెప్పరాదు. చెప్పినచో నీసందేహంబు లన్నియు నడంగు" నన దండపాణి సంభ్రమమును విడిచి తెలివి దెచ్చుకొని "స్వామీ! మీరానతియ్యదలంచిన దానటియ్య నచ్చు. మీనోట వెడలిననుడువులు తేనికిఁ గాని మఱియెవ్వరికిఁ గాని యెఱిఁగింపనని మీరు సేయు మన్న ఘోరప్రమాణంబు జేయువాఁడ" నని చేతులు జోడించి మనవిచేసెను. ఆతనివినవి చిత్తగించి హరిశర్మ వానిచే గొప్పయొట్టు బెట్టించుకొని చెప్పఁబోయి మరల చెప్పఁ సందేహించి యెట్టకేల కిట్లనియె.

"దండపాణీ! 'గతానుగతికో లోకః న లోకః పారమార్థికః' యనునట్లు లోకు లొకరిని జూచి యొకరు నడచుటయే కాని పరమార్థ మెఱుఁగరు. నిన్న హేమచంద్రునితోఁగూడ వానికొడుకు లిరువురు నాకడకు వచ్చిరి. ఆబాలకులఁ జూచినది మొదలు రాగవిహీనమయ్యు మామనస్సెంతయుఁ గంతాకులమై యున్నయది. అంతచక్కఁదన మున్నందుకు నట్టి తెలివితేటలున్నందుకు సంతతివంశమునఁ బుట్టినందుకు నాబాలకుల కిరువురకు దీర్ఘాయుఃప్రమాణమున్న పక్షమున నెంత

బాగుండును! బ్రహ్మ యెంతచూపోపనివాఁడో కాని యీముద్దుకొడుకుల నిద్దఱ నర్ధాయుష్కులఁ జేసెఁగదా! మాదివ్యదృష్టిచేత మే మెంత చక్కఁగఁ బరికించి చూచినను విక్రమసేనహర్షవర్ధనులు కొలఁదికాలములోనే తీఱిపోదు రని తోఁచుచున్నది. వానితలిదండ్రులపుణ్యమే మో కాని విజయసేనుఁడు దీర్ఘాయుష్మంతుఁ డని నాదివ్యదృష్టికిఁ బొడకట్టుచున్నది. ప్రస్తుతము వాఁడు పితృవిహీనుఁడై నిలుపేదయై దిక్కుమాలినవాఁడై యున్నను గాలక్రమంబునఁ గాశ్మీరరాజ్యంబున కేలిక కాఁగలఁడు కావున నా సేయుహితోపదేశంబు విని నీకూఁతును విజయసేనున కిచ్చి పెండ్లి సేయఁ దలంచుకొనుము. విక్రమసేనుని మాట మఱచిపొమ్ము. మొదట విజయసేనునకే యీమెను గూర్పఁ దలంచితివి గావున నీప్రథమసంకల్పమే నెఱవేర్చుకొనుము. నీయల్లుఁడు మూర్ధాభిషిక్తుఁడై చిరకాలమవని నేలును. నీకూఁతురు కాశ్మీరదేశపు రాణియగును. లోకతంత్రసంబంధములు లేనిమాకు విజయసేనుఁడు విక్రమసేనుఁడు నొక్కచందంబ. ఉన్న దున్నట్లు వెల్లడింపవలసి వచ్చెఁ గావున మీ కప్రియము జెప్పవలసినవార మైతిమి.

భావికాలగతుల నుద్దేశించి దివ్యదృష్టి పరిభావమున హరిశర్మ నోట వెడలినయీనుడువులు దండపాణికి వేదవాక్యములట్లు దృఢవిశ్వాసము గలిగింప నతఁడు భక్తితత్పరుఁడై లేచి నడుమున కుత్తరీయంబు జుట్టుకొని 'స్వామీ! మీరు నన్ను బ్రదికించిరి. మీ రీహితోపదేశంబు జేయకుందు రేని నే నెట్లో మొదలు విఱిచి రాజు నొప్పించి నిష్కారణముగ నాకూఁతుగొంతు కోసికొన్నవాఁడనగుదు నాకు మీరు నేఁ డొనర్చినమేలు మఱువఁజాల' నని చాగిలంబడి మ్రొక్కి మఱల నిట్లనియె: "స్వామీ! విజయసేనుఁ డిప్పు డెందున్న వాఁడో నే నెఱుంగను. ఇది సమకూరు టెట్లు? ఇప్పుడు చిత్రభానుఁడు లేకపోయెఁ గదా! హా మిత్రమా! చిత్రభానుఁడా! నీవు జీవించి

యుండగ నీతోడ నేను వియ్యమంద లేక పోయితిఁగదా! ప్రియదర్శనుఁడ వగునీవు నీమనోహరాకారమును నొక్క సారి నాకన్నులు చల్లఁబడ జేయరాదె" అని పలుకుచుండగనే యుదకన్నులయందు ముత్తెముల వంటి బాష్పములు వచ్చుటయు నటమీఁద మాటలాడఁజాలక యతఁడు గోడం జేరఁబడి మొగమున నుత్తరీయాంచలమును వైచికొని కూర్చుండెను. ఆతని నసమాశ్వాసింపఁ దలఁచి హరిశర్మ మొగమునుండి చేలాంచలమును దొలఁగించి "మోయి పామరుఁడువోలె నీవిటు చేయఁ దగునా? సజ్జనులు పుత్రవియోగమైన సహింతురుగాని మిత్రవియోగము సహింపరు. మిత్రుఁడు దుష్టుఁడైనను సజ్జనుఁడు వాని పక్షమునె పూనును. నీమిత్రుఁడు రాజద్రోహము చేసినందులకు దేశమునుండి వెడలఁ గొట్టఁబడి జననింద్యుఁ డయినను నీవు వానిదెస ననురాగంబు చెడకపోవుట నీయోగ్యతను ప్రకటించుచున్నది. ప్రపంచమునం గలజనులందఱు చిత్రభానునియెడ ద్వేషము పూనినను నీవు మాత్రము వానియెడ నెయ్యమును విడువకుము. ఆతనియాత్మ దీనికెంతయు సంతసించును. చిత్రభానుని నీవు నిజముగఁ జూడఁదలఁతు వేని వాని మూర్తి నీకన్నుల కొకసారి యగపడునట్లు నేఁజేయఁగలను. ఇది పరమరహస్యము సుమీ!" యని పలికెను.

"చిత్రభానునిమూర్తి కన్నులకగపడునట్లు చేయఁగల" నని బ్రాహ్మణుఁడు పలికినపలుకులు మిక్కిలి యద్భుతావహములై దండపాణిమనస్సునకు నాటెను. "మృతినొందిన పురుషుఁ డేమి నాకన్నులకుఁ గ్రమ్మఱఁ గానఁబడుట యేమి? చచ్చినవారి నితఁడు చూపఁ గలఁడా? ఏమో! వీనియొద్ద నెట్టిమహిమ లున్నవో! ఒకవేళ చిత్రభానుఁడు బ్రదికియే యున్నాఁడో "యని దండపాణిమనంబున నప్పుడు వెంటవెంటనే కొన్ని సంశయము లుత్పన్నము లయ్యె. అడిగి తన సంశయము దీర్చికొనుట మంచిదని యతఁడు బ్రాహ్మణునితో

స్వామీ! చచ్చినవారు మఱలఁ గానఁబడుట సృష్ట్యాదినుండి యీ వఱకు నెన్నఁడు వినలేదు. అదియైనచో మీప్రభావమువలనఁ గావలయు' నని పలుక హరిశర్మ తనమాటల నతఁడు విశ్వసించుట లేదని తెలిసికొని తనయం దతనికి దృఢభక్తి నెలకొనునట్లు చేయఁదలఁచి యిట్లనియె. "ఓయువివేకి! యిటువినుము. చిరకాలము భూలోకసుఖంబుల ననుభవించి వార్ధకముచేత నవయవపటుత్వముదప్పఁ బెట్టుల ముగ్గినపండునేల రాలునట్లు కాలము తీఱి మృతినొందునతఁడు ముక్తుఁడయి భూలోకవాంఛలు విడుచును. నిండుప్రాయమున గంపెడాసలులోనఁబెట్టుకొని యొకదానియందును మనోరథసిద్ధి బొందక యకాలమున మృతినొందునతని యాత్మ ముక్తినొందక సంసారప్రపంచమును విడువఁజాలక యిందే విహరించుచుండును. శరీరము కాలిపోవునుగాని యాత్మ కాలదు గదా. దేహంబునకుఁ జావున్నది కాని యాత్మకుఁ జావు లేదు కదా. ఇఁకను నామాటలు నీవు విశ్వసింపవేని సోమవారమునాఁడు రాత్రి రెండుజాములప్పుడు నీ వొక్కఁడవు మాగృహమునకు రమ్ము. చిత్రభానునియాత్మ నీతోడ మాటలాడఁ గలదు. మృతినొందినవారియాత్మలను మాటలాడింపఁగలప్రభావము నాకు బరమేశ్వరునియనుగ్రహము వలనఁ గలిగినది. అట్లు చేసినాఁడె నీకు నామహత్వంబు దేటపడఁ గలదు." అని ప్రతిజ్ఞాపూర్వకముగ హరిశర్మ నుడువుటయు దండపాణి మహాశ్చర్యరసనిమగ్నుఁడై యదివఱ కెన్నఁడు నెవ్వరుఁ గని విని యెఱుఁగనయీయింత జూచుభాగ్యము దనకు లభింపనందులకు మహానందభరితుఁడై బ్రాహ్మణునియొద్ద సెలవుపుచ్చుకొని సోమవారమెప్పుడు వచ్చునాయని యువ్విళులూరుచుఁ గాలముగడుపుచుండెను.

ఇది జరిగిన మూఁడవనాటి రాత్రి బ్రాహ్మణుఁడు భైరవునితోఁ గూడి గృహములోఁ గూర్చుండి యనేకవిషయములం గూర్చి ప్రసంగించుచుండ నంతలో వసారాల నడచినయలికిడి వారికి వినవచ్చెను.

అతనిమనస్సు నిత్యము శంకాసంకలితమై యుండుటం జేసి యతఁడు భైరవునిం బిలిచి "వత్సా! ఆయలుకుడు మనుష్యులదేమో కనుఁగొని మనుజులదే యైనయెడ వారెవ్వరో, యెందునిమిత్త మిచ్చటి కరుదెంచి నారో కనుఁగొని ర" మ్మని పంపెను. భైరవుఁడు గండ్రగొడ్డలి చేతఁబూని యావలకుంబోయి మెల్లగ నెవరువారని యడుగ నేను గాలకంఠుఁడను తక్కినవారిమాట నడుగకుమని ప్రత్యుత్తరము వినఁబడెను. భైరవుఁడు కాలకంఠుని వాని ననుసరించివచ్చుచుమఱియొక మనుష్యునిదోడుకొని బ్రాహ్మణునియొద్దకుఁబోయి "స్వామీ! కాలకంఠుఁడు దేవశర్మను దోడ్కొనివచ్చెను. ఆయలుకుడు మనవాండ్రదే. క్రొత్తవాండ్రెవ్వరును లే" రని విన్నవించెను. అమ్మాటలువిని కడు నలరి హరిశర్మ 'యోరీ! హోమగుండమును విసరి చక్కగ మంటచేయుము. దేవశర్మనుజూచి చాలకాల మయినది. మనసార వానిమొగ మొకసారి వెలుఁగునం జూడవలయు' నన భైరవుఁడు కొన్ని యెండు చిదుగులు హోమగుండమున వైచి విసరి జ్వాలచేయ నారంభించెను. ఇంతలో హరిశర్మ కాలకంఠునిబిలిచి కుమారా! నీవేగమువాయువేగ మనోవేగముల మించెను. నీశరీర మినుముతోఁ జేయఁబడినదని తోచుచున్నది. నీవి లేడికాళ్ళు. అందుచేతనే చెక్కుచెదరక నడవరానినట్టడవులఁ జొచ్చి సత్వరంబ దేవశర్మను దోడ్కొనివచ్చితివని బహూకరించి యింతలో భైరవుఁడు చేసిన మంటవెలుఁగున దేవశర్మమొగమును బరీక్షించిచూచి "మిత్రుఁడా! నీముఖదర్శనముచేత నేనిప్పుడు మిక్కిలి సుఖవంతుడనైనాను. ఆహాహా! ఏమి నీ వచ్చముగ ఋషివలె నున్నాఁడవు! నిన్నానవాలు పట్టుటే దుర్ఘటముగ నున్నది. నీతలను మొలిచినవిగాకున్న నీకెంజెడలు సరిగ మొలచినట్లేయున్నవి. నీవు తొల్లి నాకగపడినప్పటికంటె చిక్కియున్నాఁడవు. కాని నీకష్టములు గట్టెక్కుకాలము వచ్చినది. నీతోడ మాటలాడి చేయఁదగు

కార్యములనేకము లున్నయవి. నీవీదినము మొదలిచ్చటనేయుండుము; పగలు నీవు ప్రజలకంటఁ బడకుండఁ దగునేర్పాటులు గావించెద; నీకి చ్చట నుండుట యరిష్టముకాదు గదా" యని యడిగెను. అప్పలుకులు విని దేవశర్మ మిక్కిలి సన్నికంఠముతో "స్వామీ! మీయండ నుండుట నాకు మహేంద్రపీఠము నెక్కుట; మీపలుకులకును బ్రాజఁ దువులకును భేదము లేదు. మీరు రమ్మనిన వత్తు. పొమ్మనినఁ బోవు దు. వీఁడునిత్యము మీదాసుఁడు సుఁడీ" యని బదులుచెప్పి నాకుఁజే యవలసిన హితోపదేశ మేమో చేయుమని వానిని వేఁడెను.

వేఁడుటయు హరిశర్మ దేవశర్మను భైరవకాలకంఠులసమీపము ననుండి గుహాగర్భమునకుఁ దోడ్కొనిపోయి చాలసేపు వానితోరహ స్యములు మాటలాడెను. ఆసంభాషణము ముగిసినపిదప భైరవుఁడు హరిశర్మతో 'నేను మీసెలవుచొప్పున నంతయు సిద్ధము చేసితిని. మొన్న నన్ను జేయు మన్నపని యెప్పుడు గావలయు నప్పుడచేసెద. మీయాజ్ఞ కెదురు చూచు చున్నవాఁడ' నని విజ్ఞాపన మొనర్చు కొనెను.

'అ య్యదను నీకు నే నెఱిఁగించెద వేగిరపడకుము. పచ్చికా యలు గోయుట మంచిది కాదు గదా! ఇంక మీరు నిద్రింపుఁడు. చాలప్రొద్దు పోయినది.' అని చెప్పి తక్కినవారి నిద్రపుచ్చి తాను నిదురించెను.

---

## పదియొనిమిదవప్రకరణము.

---

మనుష్యునకు మనసున నున్నయుబలాటము దీరువఱకు నేపని యుం దోఁచదు. అందసంభవము లగువింతలఁ జూచునాస మనంబున నెలకొనియున్నప్పుడు నరునిమనంబున నభిలాష మెట్లుండునో యనుభ

వించినవారికే తెలియవలయుఁ గాని తదితరుల కెత్తెఱుంగున నెఱుఁగ
నగు. హరిశర్మ చిత్రభానునియాత్మ జూపుదు నని చెప్పినది మొద
లతఁడు ప్రగల్భములు వలికెనో నిక్కువంబు వక్కాణించెనో తెలియఁ
గోరి దండపాణి యాదివారమునాఁడు రేయి తిన్నగానిదురపోవక నాలు
గుజాములకు నాలుగుమాఱులు లేచి తెల్లవాఱిన దేమోయని చూచి
యెంతకుం దెల్లవాఱదని విసిగికొని యెట్టకేలకుఁ గాకులుకూయుసమ
యమున లేచి కాల్యంబులఁ దీర్చికొని తెల్లవాఱినది మొదలు మఱు
నాఁడు సాయంకాల మెప్పుడగునని కనిపెట్టుకొని యుండి సంధ్యా
సమయమున గుహకుఁ బోయి బ్రాహ్మణునింజూచి నేఁటిరేయి
రెండుజాములవేళ వత్తునా యని యడిగెను. తప్పకరమ్మని హరిశర్మ
యానతిచ్చుటయు దండపాణివడివడి గృహంబునకుఁబోయి భోజనము
చేసిపోవలసినతావు నిర్జనప్రదేశమగుటచేతను సేవింపఁ బోవుచున్న
మనుష్యుఁడుక్రొత్తవాఁ డగుటచేతను సమయ మర్ధరాత్రి మగుట
చేతను గొప్పపదవిలో నున్నపురుషులు దారపుత్రుల నైననమ్మి నిర్భ
యముగ విహరింపఁగూడ దనునమ్మిక యతని కుండుటచేతను నక్క
డకుఁ బోయినవెనుకఁదనస్థితి యెటుపోయి యెటువచ్చునోయనిస్వసం
రక్షణము కర్తవ్యమని తల నినుపబొమిడికంబువెట్టి మేన శస్త్రదు
ర్భేద్యం బగుకవచంబు దొడిగి యనేకరణరంగముల నప్రతిహతముగ
సంహారక్రీడ గావించి యెన్నండు మొక్కవోనితనకఱకుకత్తి నొరలో
వైచి పాదరక్షలు దొడిగికొని సంకేతస్థలమునకుబయలువెడలెను; ఆ
స్థానమునకుఁ దానుబోవుట యొరులెఱుంగకుండ వలయునని యతఁడు
మొదటనె పట్టణము మాటుమణఁగినవెనుక బయలుదేఱి రాజవీథిని
బోయినపక్షమున నిశాసమయంబుల సంచరించువారు తన్నానవాలు
పట్టవచ్చు నని శంకించి సందుగొందులదారులబట్టి నూరుబైటికివచ్చి
మెల్లమెల్లన నడుగులు లెక్కబెట్టుకొనుచు గుహకడకు వచ్చె. అప్ప

టికి హరిశర్మ సామగానముచేయుచు వ్యాఘ్రచర్మముపైఁగూర్చుండెను. భైరవకాలకంఠులు గుహాద్వారముకడ జేరియొకగోడకుం జేరబడికునుకుపాట్లు పడుచుండిరి. దండపాణిపోయి ద్వారముకడ నిలిచినతోడనే హరిశర్మచూచి ‹దండపాణీ!'యని పలుకరించి యతఁడు పలికినతోడనె రమ్మని సమ్మానించి కూర్చుండఁబెట్టి కూర్చుండియే నిదురించుచున్న సేవకు లిరువుర లేపి ద్వారముకడ జాగరూకతతో నుండుమని యానతిచ్చెను. అనంతరము హరిశర్మయు దండపాణియు గాశ్మీర రాజువిషయికము లగుప్రసంగంబులు కొంతతడవు నెఱపినపిదప దండపాణి "స్వామీ! అప్రతిహత మగు మీప్రభావమున నామిత్రునియాత్మను జూచుటకు నామనంబు త్వరపడు చున్నది. ఈరైదాఱుదినంబులు నాయభిలాషను నే నెట్లులాపుకొనఁజాలితినో నే నెఱుంగను. కావున నిపు డైననించుకయు జాగుసేయక నా వచ్చినపని నిర్వర్తింప వేఁడెద" నని యెంతయు నాత్రమున విన్నవించె. హరిశర్మయు వాని యుబలాటమునుజూచి వానితోఁ దాను జెప్పవలసినమాటలు చెప్పుటకదియ లెస్సయగునద నని వానికిట్లనియె. ‹చిత్రభానుఁడు మృతి నొందుటచే వానిశరీరము దగ్ధమైనదని నీ వెఱుంగుదువు. ఆత్మ నిరాకారమగుటచే నది నీకుఁ గానఁబడదు. ఇప్పుడు నేను జేయగలఁదే మనిన వానియాత్మ నీతో మాటలాడునట్లు చేసెద. నీ పరమ మిత్రుని యాత్మనిన్ను గాంచినతోడనె యెట్టికోరికలు కోరునో మన మెఱుంగము గదా? చిరమిత్రుఁడ వగునీవు వానికోరికలను ద్రోసిపుచ్చ రాదు సుమీ!' అనవుఁడు దండపాణి నాబహిఃప్రాణ మగు సంగడికాఁడు నాచీనులకు వినదగునట్లు పలుకుటయె చాలు. వానికోరికలు నేను నిరాకరింతునే యని ప్రత్యుత్తరము చెప్ప హరిశర్మ వాని యుత్తరంబులకు సంతసించిలేచి చేతులు పైకెత్తి కొన్ని మంత్రములఁ బఠించి ‹శ్రీపరమేశ్వరుండు నాకిష్టదైవత మగునేని భగవతి మహిషా

సురమర్దనికి నే నభిమానపుత్రుఁడనేని సత్యసంధుఁడనేని చిత్రభానుని యాత్మ దండపాణితోఁ బలుకుఁగాక" ! యని తనయావాహనము ముగించెను. ముగించినతోడనే "హా! అన్యాయము: అన్యాయము అన్యాయ" మని మూఁడుమాటలు వినఁబడియె. అప్పలుకు లచ్చముగ జిత్రభానునినోటనుండి వెడలినపలుకులట్ల యుండుటం జేసి దండపాణి యద్భుతసంభ్రమంబులు పెనఁగొనఁ జెవులు రిక్కఁబెట్టి నలుఁగు నా ధ్వనినిమిత్తము నిరీక్షించుచుండెను. అంతలో 'హేమచంద్రునినిడువుము. మాకు నీకుఁ గలమైత్రి నాటిం గను. విజయసేనునకు నీకూఁతు నిచ్చి పెండ్లిసేయుము. నీయల్లుఁడు రాజుకాఁగలఁడు. అనునాలుగు మాటలు తూర్పునుండి యొకటియు, దక్షిణమునుండి యొకటియు, పడమటినుండి యొకటియు, ఉత్తరమునుండి యొకటియు వినఁబడెను. అనంతరము మఱికొన్నిమాటలు దండపాణి వినఁగోర నొక్కపలుకును వినఁబడదయ్యె. అతఁడు మాటలాడుట చాలించెనాఁడని హరిశర్మ దండపాణితోఁ జెప్పెను. దండపాణి 'స్వామీ! మొట్టమొదట నన్యాయమన్యాయ మని మనకు వినఁబడినమాటల కర్థ మేమి' యని విప్రు నడిగెను. బ్రాహ్మణుఁడు మంచిమాటనే నీ వడిగితివి. తన్ను దేశమునుండి వెడలనడచుట యన్యాయ మని యతఁడు మున్మాటికి నొక్కి పలికె. నీవు విజయసేనునిపక్షమున సర్వప్రాణములు ధారపోయుదువని నీ మిత్రునికోరిక. అట్లుచేయుదునని యగ్నిసాక్షిగ నీవిహోమగుండము నొద్ద ప్రమాణము చేయుము. చేసిన ప్రాణలు నిలిపికొనుము. నీతికి నిలువంబడుమని పురికొల్ప దండపాణి భయాద్భుతములచేత నావేశింపఁబడి విజయసేనునిపక్షమునందునని విప్రుఁడు చేయించినప్రమాణములన్నియుఁ జేసి పెట్టుకొన్నయొట్టు లన్నియుఁ బెట్టుకొనియె. ఆశపథంబులు ముగిసినపిదప నాతఁడు నచ్చట జరిగినవింతమాటల మఱునాఁ డెక్కడ నెత్తనని దండపాణిచేత హరిశర్మ వెండియుం గొన్ని

బాసలు చేయించెను. అనంతరము దండపాణి "ఇపుడు రెండు జాముల కంటె నెక్కువయైనది. నేనింటికిఁబోయెదను. మీపునర్దర్శన మెల్లుండి చేయువాఁడ. ప్రస్తుతము నాకు సెలవొసంగుఁ" డనుచు లేచినిలువ హరిశర్మయు మంచిదని భైరవకాలకంఠులను వానివెంటఁ గొంతదవ్వు పంపి వారు మరలివచ్చినపిదప సుఖముగ నిద్రించెను.

దండపాణి గుహ విడిచి స్వగృహాభిముఖుఁడై నదిమొదలు బ్రాహ్మణపరిభావమును గూర్చియుఁ దన కాతేయి వినంబడిన మాటలఁగూర్చియు దనలోఁ దానిట్లని వితర్కించుకొనఁ జొచ్చె. "ఈబ్రాహ్మణునిచేతలు మాయలా యింద్రజాలములా లేక నిక్కువములా? ఘట్టిబుద్ధినెఱిఁగి యిట్టివింత లెన్నఁడును గనివిని యెఱుంగ. చిత్రభానుండు నిజముగ మృతినొందియుండునా? లేక యెందేనిఁ బ్రదికి యుండునా? బ్రదికియుండినచో మృతినొందెననియీవిప్రుఁడు రాజుతో నేల చెప్పవలయు. కావున తప్పక మృతినొందియే యుండును. అట్లయినచో మృతినొందినవారు మరల మాటాడుట యెట్లు? ఇతఁడే పురుషునిచేతనైన మాటలాడించి నన్ను వంచించి యుండడు కద! అట్లయిన సరిగఁజిత్రభానునికంఠముతో మాటలాడఁ గలపురుషుఁ డెవ్వఁడు దొరకును. మనుష్యుని బోలినమనుష్యుఁ డుండవచ్చును గాని యచ్చుగ్రుద్దిన ట్లంతసరిగా నుండు టరిది. కావున నిది తప్పక బ్రాహ్మణునిపరిభావమే యై యుండవలయు. ఒకవేళ చిత్రభానుఁడు జీవించియే యుండి యిటవచ్చి నాతోడం బలికినాఁ డని మాటవరుస కనుకొందము. అటులైన నాకూఁతు నతనికుమారున కిచ్చి పెండ్లి సేయ నిశ్చయించుకొంటిఁ గావున హేమచంద్రుని విడిచి చిత్రభానుని జేరవలయు. విక్రమసేనహర్షవర్ధనులు నిశ్చయముగ నల్పాయుష్కు లని యితఁడు చెప్పెఁ గదా; అందుచేత నెప్పటికైన విజయసేనుఁడు రాజు గాక తప్పఁడు. నాపేరుఁ దీసి వానిమెడ వేయఁదలంచుకొన్నపుడు

వాని సుఖదుఃఖములు నావియు నాసుఖదుఃఖములు వానివియు నై యుండుట ధర్మము." ఈవితర్కముచేతఁ బరాయత్తచిత్తుఁడై యతఁడు తనయిల్లు దాఁటి కొంతదూరము పోయి మరల వెనుకకు వచ్చి యిల్లు చేరి పండుకొని గుహలో జరిగినవింతలు స్వప్నమునం గాంచుచుఁ గలతనిద్దుర వోయెను.

---

## పందొమ్మిదవప్రకరణము.

---

ప్రాణనాథునితోడిదే లోకము నమ్మి మగనియడుగుఁదామరలు దన కేడుగడయుగ నెంచుకొని జీవయాత్రగడపుచున్న పతివ్రత హృదయేశ్వరుఁడు ఖిన్నుఁడై విమనస్కుఁడై యున్నప్పుడు తానట్లే ఖిన్నయై విమనస్కయై యుండుటయు సహజము గావె. కలనయిన వియోగము దలపోయక పరిహాసమునకైనఁ బ్రణయకలహమాడక మితిలేనిచనువులు మేరలేనిమమతలుగలిగి రెండుమేను లొక్కమే నగునట్లు కలసిమెలసి పూవుందావియుం బోలియున్న దంపతులలో మగఁడు వేఁడుకలకు వెలియై యమ్మాలికమున కునికిపట్టయి యుండు తఱి కులకాంత మనస్థితి యెట్లుండునో యిచట వర్ణింపనక్కఱ లేదు. కుమారు లిరువురు తండ్రివెంట గుహకుఁ జని యచట జరిగినప్రసంగములు తల్లికిం దెలిపినది మొదలు మనసు మనసులో లేక యరవిందాదేవి మొగము వైవర్ణ్య మొందనేపనిం జేయక యేసౌఖ్యముం గోరక చింతాక్రాంతచిత్తయై యుండె. దానికిం దోడుగ హేమచంద్రుఁడు రాజకార్యములు చాలవఱకు మంత్రుల కప్పగించుటయు నెచ్చెలులతోఁడఁదొల్లిటియట్లు కలయక పోవుటయు రాయబారుల కతికష్టమునఁ గాని దర్శన మీయకపోవుటయు నంతఃపుర సేవకులఁ బరిచార్యలమునుపటియట్లు లంతగా నపేక్షింపకపోవుటయుఁ బలుకరించిన సందర్భమున్నను

లేకున్నను వేఱొంతప్రసంగములు నెఱపుటయు మున్నగుమార్గములు రాణిచింతాజ్వరమునకు మఱింతదోహదము చేసెను.

అట్లరవిందాదేవి కొన్నినాళ్ళు వగచి హిమవంతునివంటి ధైర్యసారము గలమహేంద్రదేవునికాంతు రగుటచే ధైర్యము దెచ్చికొని రాఁ దలంచినయుపాయములను దగునుపాయములచే నివర్తింపఁజేయుట యుత్తమజనలక్షణ మగును గాని విచారించుట పామరలక్షణ మని తెలివినొంది యొకనాఁడు సాయంకాలము మేడమీఁద నొక్కరిత కూర్చుండి తనచెలికత్తెయు, బుట్టినింటినుండి తనకు బ్రాణపదముగ నుండు నని యెఱిఁగి [illegible]దియు, [illegible]లకు [illegible]సము నేర్పఁ గలదానియు నగుసర్సికను జేరఁ బిలిచి “ఓసీ! సర్సికా! మాయయ్యగారున్న తెఱంగు జూచు చుంటివా?” యని యడిగెను. “ఎఱుఁగ కేమి గుహాలో నున్న బాపనదయ్యమును జూచినది మొదలాయనచిత్తము చెడిపోయిన” దని యామె బదులు చెప్పెను. అట్లయిన నెఱిఁగియుండియు నీ విన్నాలయుపేక్ష చేసితివే!” యని రాణి క్రమ్మఱ నడుగ “నమ్మా! నేనే ముందుగ మహారాజుగారిమాట నెత్తుట మంచిది కాదేమో యని యూరకుంటి” నని వెండియు నామె ప్రత్యుత్తర మిచ్చెను. “అట్లయిన నావిషయమున నీ వించుక శ్రమపడవలయు. అది రెండవకంటివారెఱుఁగకుండ నిర్వర్తింపఁదగినది. అట్లు చేయఁగలవా” యని దేవి యడుగుటయు “నమ్మా! నాకు మీరు పని చెప్పుట నాయందనుగ్రహము జూపుట కదా!” యని యది బదులుచెప్పెను.

అంతట నరవింద సర్సికను దాపునం గూర్చుండఁ బెట్టుకొని “సఖీ! మహారాజుగా రెందుచేతనో మనలో లేరు. చిత్తముగుహాలోను శరీరము గృహములో నున్నట్లు తోఁచు చున్నయది. ఎంతచనవున్నను మహారాజుగారు సముద్రమువలె గుణరత్నాకరు లయ్యు గంభీరులగుటచే వారినడుగుటకు నామనసొప్పకున్నది. అఖిలభాగ్య

ములు విడిచి వైరాగ్యమును బూనవలయు ననియు రాజహంసమునకు దలఁపు గలిగినది. ఆయనయిచ్ఛానుసారముగ నింట రాజయోగి యై యుండవచ్చుఁగాని యర్ధరాత్రముల, నపవేళలఁ గానిచోటుల నెన్నఁడును ముక్కుమొగ మెఱుంగని విదేశీయులయొద్దకుఁ బోయియుండ దగునా? మహామంత్రము లఁట, పునశ్చరణము లఁట నిశలఁ జేయ వలయు నఁట. బాలకుల మొగంబుల నిది విన్నది మొదలు నామనసు మనసున లేదు. నీవంతయుఁ జూచుచునే యున్నావు; నీకుఁ జెప్పవలసినది లేదు; కాని కన్నులు మూతఁబడవు. అన్నము విస మయినది. అభిముశుభ మఱుఁగిసి బాలకులే తద్దయు బెంగఁ గొని యున్నారు. ఇంక నామాట చెప్ప నేల? జీవితేశ్వరునిచిత్తము నీయపూర్వవైరాగ్యమునుండి తొలఁగించుటకు నాకొక్కయుపాయము పొడకట్టినది. అది విని నాచెప్పినచొప్పున నీ వానరింపుము. కాశ్మీరరాజ్య మను మందిరమునకు దృఢస్తంభములు రెండు గలవు; మణివర్మయు మాధవసేనుఁడు ననుమంత్రులే యా స్తంభములు. వారిరువురు నాకుం బితృసమానులు; మహారాజుగారును వారి నట్లే భావింతురు. నన్నిక్కడకుఁ బంపునాఁడు మాయయ్య నాసేమము నిరంతరము కనుఁగొను మని మణివర్మతో మఱిమఱి చెప్పె; కావున నీవు ముందుగా మణివర్మయొద్దకుఁ బోయి నాప్రణామంబు లెఱిఁగించి నాపడుచున్నయులమట వానికిం దెలిపి పరాయత్త మయినప్రభుచిత్తము మఱల నెప్పటిచోట నిలుపు మని చెప్పుము. సంశయస్థితికి వచ్చినహాయదృష్టమును జక్కఁ జేయు మనుము. మాయయ్యతొల్లి తనతోఁ జెప్పినపలుకులు జ్ఞప్తికిం దెచ్చి కొమ్మనుము. తానుదక్క నొరు లీపనికి సమర్థులు కారనుము. ఇంతియె కాక నీకుం దోఁచినతెఱంగున సమయోచితముగఁ బలికి కార్యసాఫల్యముఁ జేసికొని రమ్ము పొమ్ము" అని పీడుకొలుప నర్మద యట్లుచేసెద నని యామెను వీడ్కొని యప్పుడ యేరికిం జెప్పక మణి

వర్మ మందిరమునకుం జని వానిని సందర్శించి దేవిసన్నిధినుండివచ్చిన ట్లువానికిఁ దెల్పి సమ్మానితుఁడై వచ్చినపని దెల్పు మని యాతఁడు కోర నిట్లనియె.

"స్వామీ ! మహారాజుగారిచ్చె ఖరి మాటిపోవుట మీరును నెఱుఁగుదురు. ఊరుబైట ముక్కుమూసికొని బకధ్యానము చేయు దొంగలగురువు కపటము కల్ల నెఱుంగనివెఱ్ఱివానిం జేసి మహారాజు చిత్తము నపహరించినాఁడు. ఇఁకమీఁద విత్తము హరించి సంకల్ప సిద్ధుఁ డగును. రాజుగారు నడిరేయి నొంటిగ గుహకుఁ బోయి యా టక్కరిబాపనయ్యవలన నేవియోమంత్రములు నేర్చుకొను నఁట. అక్కడకుఁ బోయిన నపాయము వాటిల్లునని దేవి శంకించి భీతచిత్త యై యున్నది. సాధ్వీచిత్తమునకు స్వస్థతఁ దెచ్చుభారము మీపై నున్న దన్నది. ఈకార్యమును నిర్వహించుటకుమీకన్న సమర్థులెవ్వరు లేరన్నది. మీరేతల్లియుఁ దండ్రియు నన్నది. వేయేల? అనవలసిన వన్నియు నన్నది. ఆబాల గుండె బెదరియున్నది. కావున మీరామె ననుగ్రహించి మహారాజుగారిమనస్సు నాయుద్యమమునుండిమఱలింప వలయు." అనవుడు మణివర్మ తుల్లిపడి యిట్లనియె. "ఏమీ! అను దినము సాయంకాలము హరిశర్మదర్శనార్థమై పోవు చున్నా రని యెఱుంగుదును. కాని యామంత్రోపదేశవృత్తాంతము వినలేదు. ఇది యొకక్రొత్తయూహ యని తోఁచెడు. ఏదోయపాయము కలుగ వచ్చునని నేను శంకించు చున్నాఁడ. ఈవఱకే తలుచుగ గుహకుం బోవల దని రాజుగారితోఁబలుమాఱుచెప్పితిని. ఎంతచెప్పిననామాట వారు పాటింపరైరి. అయిన మఱలం జెప్పి చూచెద. పట్టి చెప్పు టయె కాదు. ఆ యుద్యమము మాను మని గట్టిపట్టు పట్టెద. అర. విందాదేవి నన్నింతవేఁడవలయునా ? నేనామెకు సేవకుఁడను. పితృ సమానుఁడను. కావున శక్తివంచన లేక యీవిషయమునఁ బాటు

పడుదునని మనవి చేయుము." అనవుడు నర్మద "స్వామీ నామీఁద మీకుఁ గోపము వచ్చినను సరే కాని రాజుగారిబుద్ధి యీపనినుండి మరల్చుటయే కాదు. ఈయూరినుండి యీబ్రాహ్మణపిశాచమును వెడలఁ గొట్టింప వలయు" నని పలికి వాని వీడ్కొని రాణీసదనము నకుఁ బోయి యమాత్యునిసముఖమున జరిగినవృత్తాంత మంతయుఁ జెప్పి భయము లే దని యామె నూరడించెను.

ఆమఱునాఁ డుదయమున దూరదేశమునుండి కొందరువేగుల వాండ్రు వచ్చి కొన్నివార్తలు విన్నవింపరా,జదర్శనమునుగోరహేమ చంద్రుఁడు మంత్రిసమేతుఁడై యీవార్తలు వినఁదలఁచి మణివర్మను బిలిపించి సగౌరవంబుగఁ గూర్చుండఁ బనిచి వేగులవాండ్రను లోనికి రావించి వారు చెప్పఁ దలఁచుకొన్న దంతయుఁ జెప్పు మని యాన తిచ్చె. అంతట నాచారులలో నొకఁడు విహంగకుఁ డనువాఁ డిట్లు విన్నవించె. "దేవా చెప్పుటకు నాకునోరు రా కున్నది. దేవరవారి సోదరుఁడు యువరాజు చిత్రభానుఁడు హారిద్వారముకడ" నని మీఁద చెప్ప లేక కన్నులనీరు పెట్టుకొన మంత్రి వానియభిప్రాయ మెఱిఁగి యీవృత్తాంతము నీవు చెప్పనక్కఱ లేదు. అది యిదివఱకే రాజు గారికి విదితము. తక్కినది చెప్పు మని యానతిచ్చుటయు, వాఁడిట్లు చెప్పెను. "విజయసేనకు మారునకునర్ధరాజ్యము రావలయునఁట. అది యిచ్చెదరా లేదా యని విదర్భమాళవరాజులు తద్బాలకునిపక్షమున మనపై దండెత్తి వచ్చెద రని లోకులు చెప్పుకొను చున్నారు. మీఁద దేవర చిత్తము" అని వాఁడూరకుండ "దీనినిజస్థితి దెలియు వఱకు మన మేమియు ననరా" దని హేమచంద్రుఁడును "వచ్చిన రానిండు. అంతమాత్రముచేత భయపడువా రెవ" రని మణివర్మయు పలికి వాని నావలకుఁబంపి తక్కిన చారులవలన నెన్నియో వృత్తాంత ములు విని వారికందఱకు సెలవిచ్చిరి.

---

## ఇరువదియవప్రకరణము



పిమ్మట మణివర్మ హేమచంద్రున కభిముఖుఁడై "దేవా! సేవకుఁ డొక్కమనవి చేసికొనఁదలఁచి యున్నాఁడు. ఆగ్రహింపక యవధరింప వలయు. అన్యదేశస్థులు తమ దేశమున నేరములు చేసి దండనార్హులై యాదండన తప్పించుకొనుటకో యప్పు లెఁగబెట్టుటకో తమకు లేనిగౌరవమును సంపాదించుకొనుటకో స్వదేశమువిడిచిమాఱు వేసములు వైచికొని యోగులమని జోగులమని మంత్రవేత్తల మని బ్రాహ్మణులమని వేదవిదులమని తమ్ముఁదారెపొగడుకొనుచులోకుల వంచింతురు. అట్టివారిని జిరకాలము శోధించినపిదపఁ గాని జనులు విశ్వసింపరాదు. అన్నదమ్ములైనఁ దలిదండ్రులైన రాజులు పూర్ణముగనమ్మి వర్తింపఁగూడదని రాజనీతి శాసించుచుండ నెన్నఁ డెఱుఁగనియొక్కవిదేశీయుని నమ్మి మీరిట్లు మెలఁగుట లోకవిరుద్ధముగ నున్నయది. హరిశర్మ దుష్టుఁడని నే ననఁజాలను. దుష్టుఁడై కాని శిష్టుఁడై కాని యెఱుంగనివారివిశ్వసింపఁ జనదు. పరరాజులచేత బంపఁబడుచారులు కూడ నొక్కప్పుడు మన యానుపానులు లోటు పాటులు నెఱుంగుటకు బిక్షుకవేషంబులు మునివేషంబులు వేయుట కలదు. జాలిచేత బిచ్చగాండ్రను భక్తిచేత మునిజనంబులను జనులు గౌరవింతురుగావున నట్టివేసములు పొసఁగియుండు. లోకము మూర్ఖబహుళ మగుటచే గడ్డములు కావిగుడ్డలు బోడితలలు బూదిపిండికట్లు తులసిపూసలు మున్నగునవి నరునకు గౌరవముం దెచ్చిపెట్టు. గడ్డము పెంచినవాఁ డెల్ల యోగి కాఁడు. జందెపుఁబోగులుద్రెంపినవాఁ డెల్ల సన్యాసి కాఁడు. అట్టివారిని మనము చిరకాలము దేశమున నిలుపనీయరాదు. నిలువచ్చిన మెలఁకువతో నుండవలయు. పగలు హరి

శర్మయొద్దకుఁబోవుటయే నాకసంగతముగనుండమాధవులుగూడ మీరు మంత్రోపదేశమునకై వానికడకుం బోవుదురని కర్ణాకర్ణిగ వింటిని ఈపని శ్రేయఃకాము లగుమీకుఁ దగదు. ఆ యుద్యమము మాని మాభయం బుడుపవలయునని వేఁడుకొను చున్నాఁడ. ప్రాజ్ఞు లగు మీకు మాదృశులు చెప్పనక్కఱలేదు; కాని 'ప్రమాదో ధీమతా మపి' యను లోకోక్తినిబట్టి నేను మీకుపదేశించితిని. పురజనులు నంతఃపురజనులు, నేను, నిగమశర్మ, మాధవసేనుఁడు మొదలగు మీ బాగుఁగోరుజనంబులు మీచిత్తము నాయుద్యమమునుండి నివర్తింపఁ జేయుఁ దలఁచు చున్నాము. వారుభయంబున మీయెదుటకురాజంకు చున్నారు. నేనుమీకడ నెక్కుడచనవులు గలవాఁడ నగుటను మీరు మాతప్పుల సైరింపు కృపాసముద్రు లగుటను వచ్చితిమి. నానోట వెడలిన మాటల వారియంతఃకరణపువులుగ గ్రహింపవలయు నేకాని నాయొక్కనివిగ గ్రహింప వలదు."

అని మంత్రిహితోపదేశము చేసి యూరకుండ నప్పలుకులు సావధానముగఁ జిత్తగించి హేమచంద్రుఁడు మణిశర్మచేయిబట్టుకొని "యమాత్యా! నీవునాకుఁ బిత్రుసముఁడవు. నీవు హితోపదేశము జేయ నేనిందు క్షమింపవలసిన దేమున్నది? నీవు నాకడ నింతకన్న నెక్కుడుచనవులు గైకొన వచ్చును. నీయాలోచనలు మాకు వజ్ర కవచంబులు. నీమంత్రములు పరసైన్యంబుల భంజించుమంత్రములు. ఎల్లవిధములు నీబుద్ధి మెచ్చఁదగినదియైనను 'ప్రమాదోధీమతామపి యని నీవన్నట్లు నీబుద్ధికే ప్రమాదము గలిగినది. నాచెప్పెడిపలుకులు వినుము. ఈప్రపంచము వినశ్వరము గాని శాశ్వతము కాదు. యుగ యుగంబులనుండి నిలిచియున్న హిమాలయమువంటిపర్వతములకును నట్టిపర్వతముల ధరించువసుంధరకును,నట్టివసుంధరలనుధరించుబ్రహ్మాం డములకును నాశము గలుగు చుండ నొక్కయాయువుతోనైనఁ బోలని

యీచర్మభస్త్రి శాశ్వత మయి యుండునా? కలకాలము రాజ్యతంత్రములయందే తగిలి యుండవలయునా? ఏనాటి కయిన భోగపరాఙ్ముఖుండను గావలదా? రాజ్యతంత్రములం దగిలి యీవఱకు చేసినదోసంబులు చాలవా? నేను మీకు రాజునై సేవ్యుండ నైతిని. నాకు సేవ్యుఁడును రాజులకు రాజును జక్రవర్తులకుఁ జక్రవర్తియు, నింద్రుల కింద్రుడును, నగ్ని కగ్నియు నగు పరమేశ్వరుఁ డొకఁడు లేఁడా? మాచేయు కలుషంబులకు మీ రుత్తరవాదు లగుదురా? నీవు గాని యరవిందాదేవి గాని తక్కినమంత్రులు గాని నావెంట వత్తురా? ఈపువ్వుఁదోఁట లీకోట లీసిరులు నన్ను రక్షించునా? నేఁ డింట రేపు మంట నుండువారము కామా? చిత్రభానునిగతి చూడ లేదే? ఎట్టివంగసంబునఁ బుట్టి, నెట్టివారిబిడ్డఁ డయ్యె, నెంతగా రాముతం బెరిగె. తుద కెట్టులయ్యె? ముక్తికాంత ముందట నరవిందాదేవి యేల? పరిణయపీఠములుండ గద్దె లేల? ఉపనిషద్వీథుల విహరించువారికి రాజవీథు లేల? పరమపదమున కరుగఁదలఁచువారి కీపట్టణము లేల? అశాశ్వతపదంబు విడిచి శాశ్వతపదవికిఁ బోవఁ దలఁచుచున్నవాఁడఁ గాని యధమగతికిం బోవుట లేదు. కావున నావిషయమున మీరు విచారింపవలదు. లౌకికవ్యాపారముల విడిచితినని నన్నుగూర్చి మీరు విచారింప జ్ఞాననేత్రంబుఁ దెఱువలేక లోకతంత్రంబులం దగుల్కొని యాగచాట్లుపడుచున్నవారలని మిమ్ముగూర్చి నేవిచారించెద. అవి యటుండనిండు. మహానుభావుఁడు హరిశ్చంద్రు దుష్టుఁడని లోకులు చెప్పుకొనుట పాపము మూటఁగట్టుకొనుట. లోకపరివాదములు మన మెన్నఁడు నమ్మరాదు. ఒక్కయుదాహరణము చూపెదము. పూర్వేంద్రుఁ డగుసుదర్శనుఁడు నాకు రెండవతండ్రి యైయుండు నతఁడు నాపై నెత్తివచ్చునని లోకమునం బ్రవాదము గలిగె. ఇట్టికత లుండునా? గగనంబు విరిగిపడనీ సూర్యుఁడు పడమట నుదయించనీ నాకును సుదర్శనునకుం బగలుజని

యింపవు. సుదర్శనునిగూర్చి పుట్టినట్లె హరిశర్మనుగూర్చి కల్లవాడుకలు పుట్టినవి. ప్రాజ్ఞుఁడ వగునీ వట్టివి నమ్మఁజనదు.

అని రాజు కేవలపారమార్థికచింతతోఁ బలుకుటయు హరిశర్మమీఁదిభక్తి వాని కించుకేనియు సందగింప లేదనియుఁ దనకువృథా శ్రమయేకాని తనచెప్పిన బుద్ధులవలన నొందవలసినలాభము హేమచంద్రుఁడు పొందలేదనియుగ్రహించి మణిశర్మ వెండియుఁ గొండొక సేపు విచారించి రాజునుద్దేశించి యిట్లుపలికెను. "దేవా! మీకు హరిశర్మయొద్ద మంత్రోపదేశముబడయ దలంతురేని పడయవచ్చునుగాని వానిగుహకుఁ బోవక మనకోటకు వానిం బిలిపించి యుపదేశముకొనుఁడు. మీకెంతచాటుచోటు కావలయునన్న నంతచాటుచోటు జూపెద. కావలయు నన్న నచిరకాలమున నిందునిమిత్తము క్రొత్తమందిర మొండు నిర్మింపఁ జేసెద. ఎటులయిన మంత్రోపదేశ దీక్ష మమ్మనుగ్రహింపవలయు." అని మంత్రి మానినయొప్ప హేమచంద్రుఁడు వాని కిట్లనియె. "నీకు నాయెడఁ గలప్రేమ మహాత్ములయెడ నుండవలసిన గౌరవమును దగ్గించుచున్నయది. మహానుభావుఁడగుహరిశర్మ యెక్కడ, కించిజ్ఞుఁడనై వాని పాదరేణువునైన శిరమునఁ దాల్పఁ దగని యపవిత్రుఁడ నే నెక్కడ? మీకంటెను నేను రాజునై యుంటి గాని యాయతిరాజునకు నేను సేవకుండనె. నాగృహంబునకు రమ్మని నేను వాని నడుగఁజాల." అనుటయు మణిశర్మ యూరకుండుటకు సందియంపడుదురేని మీవెంట వచ్చి వినయంబును భక్తియుఁ గదుర వానిని నేన యడిగెదను. అతఁడు మనకోటకు వచ్చుట కంగీకరించునేని మీరాయనపలుకుల కడ్డము చెప్పవలదు." అని వేఁడుకొనెను. హేమచంద్రుఁడును వాని పలుకులు విని కొంచెము విచారించి "సరే! ఈసాయంకాలము హరిశర్మ దర్శనార్థము నేను బోవుచున్నాను నీవు నావెంట వచ్చి యామహాత్ముఁడు ప్రశాంతుఁడయియున్నప్పుడు వాని

కలుగక వాఁడవమునుండునట్లు భక్తితాత్పర్యంబులు మెఱయ వాని నడుపు దుము. అతఁ డొకవేళ యలుకఁ బూనినను రానని విస్పష్టముగఁ జెప్పి నను జన్మబుద్ధికొఱకు నాప్రయత్నమునకు వెండియు విఘ్నములు సేయఁదలంచక యూరకుండవలయు." అని పలికి మణివర్మ రాకఁ గను మతించి వాని నంపె మందిరంబునకుం జనియె.

మహారాజు మందిరమునకు వచ్చినతోడనే యువతిందాదేవి వస్త్ర దంబిలిచి మగనికి మంత్రికిఁ బరిపక్వలిపిసంభాషణఫలితము దెలిసికొని రమ్మని పంపెను. అదియు మణివర్మ యొద్దకుఁ బోయి యడుగ నతఁడు జరిగినవృత్తాంత మంతయుం దెలిపి యించుక ధైర్యముచెప్ప నర్మదయు మరల నంతిపురికిం జని దేవి కాయుదంత మెఱింగించెను. అది విని దేవి మంత్రిమాటలు పనిచేసినవని ధైర్యముదెచ్చుకొని సాయంకాల మేమగునో యని భయపడుచుండెను.

సాయంకాలము మణివర్మ రాజమందిరమునకువచ్చి తనరాక తెలిసి కెఱింగింప మహారాజు సంధ్యాకృత్యములఁ దీర్చుకొని మంత్రి సమేతుఁడై హరిశర్మయొద్దకుఁ బోయెను. బ్రాహ్మణుఁడువారిరువురను గౌరవించి కూర్చుండఁజేసి యేదో సందర్భము తెచ్చి వివాహమును మానుకొని రాజ్యమును విడిచిన భీష్మునిచరితంబును రాజ్యంబుతమ్ముని కిచ్చి తపోవనంబున కరిగిన దేవాపిచరిత్రంబును విన సొంపుగ నుండు నట్లు వర్ణించి వారిని శ్లాఘించి రాజుమనంబున కానందముగలిగించెను. ఆకథ లతఁ డేలచెప్పెనో రాజు గ్రహింపలేదుగాని మణివర్మయొక్క నిముసములో గ్రహించెను. హరిశర్మ చేయవలసిన హితోపదేశ మంతయు ముగిసినపిదప మణివర్మ చేతులు జోడించి విప్రునితో నిట్లనియె. "మీతో నేనొక్కమనవి చేయవచ్చితిని. తప్పు లున్న మన్నింపవలయు. మహారాజుగారు మీయొద్ద మంత్రముల నుపదేశ ముపొందుచున్నవారు. మీయుపదేశములు భయలోకతారకము

అద్భుత మగునావృత్తాంతము నాకర్ణించి దండపాణి మొట్ట
మొదట నది నమ్మజాలక వెనుక తనయెదుటం జరగినవిషయముల
జ్ఞప్తికిఁ దెచ్చుకొని చిత్రభానునిమాటలను వానితోఁ బోల్చి చూచు
కొని యెట్టకేలకు దనమిత్రునిమాటలే తన కెక్కుడువిశ్వాసము గలి
గింపఁ గొండొకసేపటికిట్లనియె. "చెలికాఁడా! ఇంతకాలము నేను
హేమచంద్రుని నీవ కడతేర్చితివని దురభిప్రాయము పడియుంటి.
ఇప్పుడది నామనంబుననుండి తొలఁగె. నీవు చెప్పినది నిజము మణివర్మ
నన్ను సరిగా నమ్ముటలేదు. నామీఁద వాని కేదో యనుమాన ము
న్నది. నేను నీవాఁడనె. నిన్నటిసభలో రాజునెదుట మణివర్మ నిన్ను
చేసిన నింద లిన్ని యన్ని యని చెప్పఁజాలము. అధికారగర్వముచేత
వాఁడు మిక్కిలి విఱ్ఱవీఁగుచున్నాఁడు. మనమిరువురముం గలిసి వాని
గర్వ మడఁప వలయు. నేను నీవిచ్చట నుండునట్లు జాగ్రత్త పెట్టెద"
నని యూరకుండుటయు నంతవఱ కేమియుం బలుకక మౌనముద్ర
వహించినరుద్రభట్టు లేచి "మీస్నేహబంధ మంతకంతకు దృఢ మగు
గాక! మీయిరువురమనోరథములు సఫలములగుఁగాక! భక్తవత్సలుఁడు
పరమేశ్వరుఁడు మీకుఁ దోడ్పడుఁగాక" యని యాయిద్దఱికుడిచేతులం
బట్టుకొని యొకరిచేతిలో నొకరిచేయి వేయించి రహస్యములు వెలి
పుచ్చకుండున ట్లొండొరులనిమిత్తము ప్రాణము లయిన విడుచునట్లు
వారిచేఁ బ్రమాణములు చేయించెను.

అట్లిరువురును శపథములు గైకొన్న పిదప దండపాణి చిత్ర
భానునివంకఁ జూచి "సఖుఁడా! నేను వచ్చినప్పటినుండి నిన్నడుగఁ
దలఁచుచున్నాఁడను. శరీరము దాల్చిన బ్రహ్మతేజ మట్లున్న యీ
మహాత్ముఁ డెవ్వఁడు. పోలిచిచూడ హరిశర్మమొగము నీయన మొగము
నొక్కలాగుననున్నది. మనుష్యులఁ బోలిన మనుష్యు లుండకపోదురా
ఈతఁ డతఁడు గాఁడని తలంచెద. ఈయన యెవ్వరో నాకెఱింగింప

వలయు నని యడిగెను. చిత్రభానుఁడు "మిత్రుఁడా! యితఁడు మనకుఁ బరమాప్తుఁడు బ్రాహ్మణుఁ"డని వానికి బదులు చెప్పె. అంతలో రుద్రభట్టు దండపాణినిజూచి "నాయనా! నేను హరిశర్మను గాను కాని నాకును హరిశర్మకును ముఖలక్షణంబుల నేల పోలిక కలదో కాలాంతరంబున మీకు నే నెఱింగింతు"నని పలికి పరమించెను. అంతట జాముకోడి కూయుటచే దండపాణి సత్వరముఁ బో వలయు నని చిత్రభానుని వీడ్కొని యెప్పటియట్లు ముసుఁగు బెట్టుకొని స్వగృహమునకుఁ జనియె.



## ముప్పదిమూఁడవ ప్రకరణము.

చిత్రభానుఁడు మరునాఁ డంతిపురమునకువచ్చునని యరవిందా దేవి నిగమశర్మవలన విని వాని నెదుర్కొని సంభావించుటకుఁ బ్రవేశము నడపుటకు మణివర్మను రమ్మని యాహ్వాన మంపెను. ఆ యాహ్వానమువిని మణివర్మ తనరాణికి క్రిందిసందేశ మంపెను. "అమ్మా మీరు నిప్పులం జొరఁబడు మన్నఁజొచ్చెద. ఏట దిగు మన్న దిగియెద. విసము ద్రావుమన్నఁ ద్రావెద. కాని చిత్రభాను నెదుర్కొని సంభావింపఁజాల. నేను జీవించి యుండగాఁ జిత్రభానుఁడు మరల బురప్రవేశము జేసినాఁ డన్న యపకీర్తియే నాకుఁజాలు. కావున నన్ను క్షమియించి యీకార్యమునకు నొరుల నియోగింపవలయు."

ఆసుందేశమువిని యరవిందాదేవి సందిగ్ధమనస్కయై సత్వరము మాధవసేనుని రప్పించి మణివర్మ పంపినసందేశ మెఱింగించి వెండియు నిట్లనియె. "ఆర్యా! చిత్రభానునిరాకకు నే ననుమతించుట మొగమోటముచేతఁగాని ప్రేమచేతఁగాదు. అది నీవు నెఱుంగుదువు. మణివర్మకీ కార్యం బింత యనిష్టముగా నుండు నని నే ననుకొనలేదు. ఇప్పుడు కర్తవ్య మేమి? రా వలదని చిత్రభానునకు వర్తమాన మంపుదునా? మొదట రమ్మని పిదప నిట్లనుట వెనుకటి క్రోధాగ్నిని నేయి వోసి మంటచేయుట. పండుకొన్నతాఁచును లేపఁగొట్టుట. కావున జేయఁదగు దానినుపదేశింపుము. అనవుఁడు మాధవసేనుఁ డించుకవిచారించి తల్లీ! మొదట వానిరాక కనుమతి నియ్యనే కూడదు. ఇచ్చినపిదప వెనుదీయఁగూడదు. ప్రవేశంబు నేనడిపెద. కానున్నదికాక మానదు కదా యనిపలికి యామెచేత ననుజ్ఞాతుఁడై వాని ప్రవేశంబునకుఁ గావలసినయత్నంబుచేసి గృహమునకుఁజనియె.

అట్లుదండపాణి గుడారమువిడిచి చనునప్పటికి జామురాత్రి మాత్రమే యుండుటచేఁ జిత్రభానుఁ డటమీఁద నిద్రపోక మిగిలిన కాలము రుద్రభట్టుతోఁ బ్రసంగించుచుఁ గడపెను. అంతలోఁ దెల్లవాఱుటయు నారాజకుమారుఁడు సమయకృత్యముల నిర్వర్తించి స్నానము జేసి సంధ్యావందనము గావించి పార్థివలింగపూజ యొనర్చి రుద్రభట్టుపాదములకు నమస్కరించి దీవనలు వడసి పయనమయ్యెను. అంతలో నిగమశర్మకోటనుండి యొక్కరథము దోలించుకొని చిత్రభానుని నెలవునకుం జని యయ్యరదమధిష్ఠించిరాజమందిరమునకురా నోపునని యారాజకుమారున్ బ్రార్థించెను. చిత్రభానుఁడు వల్లెయని తేరునెక్కి నిగమశర్మ సమేతుఁడై పురముఁ బ్రవేశించెను.ప్రవేశించుటయుఁ బురజనంబులు వానింజూచి విస్మితులై వానిరాక యశుభ సూచకమని భావించిరి. పురాంగనలుకొందరు రథముమీఁదఁ బోవు వారినామధేయములు పురుషులనడిగి తెలిసికొని యసంతుష్టలై "యమ్మక్కా! యిదియేమమ్మా రాజకుటుంబము నిప్పులొడిలోఁ గట్టుకొన్నట్టు మరల నీయువరాజహంతకునిఁ దెచ్చిపెట్టుకొనియె. వాని మొగములోనున్న గ్రూరభావమునువెలిపుచ్చుచున్నట్లుభయంకరముగ నున్నది. వాని కన్బొమలు వానిమనోమాలిన్యమును దేటపఱచున ట్లున్నయవి. కటకటా! రాజకుమారు లేమికానున్నవారో కదా యని తమలోఁ దారు చెప్పుకొనసాగిరి. అంతఁ గొంతసేపటికి రథము కోట సమీపమునకుఁ బోవుటయు నిగమశర్మయుఁ జిత్రభానుఁడు గ్రిందికిం దిగి సింహద్వారమువైపు నడచిరి. రథావతరణంబు జేసినయారాజకుమారునిగని యదిపఱకే వానినిమిత్త మక్కడ నరవిందాదేవిశాసనంబున వేచియున్న మాధవసేనుఁడుదండపాణివజ్రపాణి వానికెదురు గాబోయి సమ్మానించిరి. చిత్రభానునకు స్వాగత మని మాధవసేనుఁడు పలికెను. యువరాజున కనంతాభ్యుదయములు గలుగుఁ గాక

యని దండపాణి వచియించె. ఈ యాగమనము శుభారంభమగుగాక యని దండపాణి నుడివెను. అనవుడు "లోకైకపూజ్యయగుమావదినె మేలుతలంపులచేత నాకుమువల మిమ్మిందఱ సందర్శించుమహాభాగ్య మబ్బెనని చిత్రభానుఁడు పలికె వారు ముందునడువ సింహద్వారము దాఁటి లోనికిం జనిరి. చని కొన్నియడుగులునడచి తన నడచుదారి కిరుగెలంకులఁ బారఁజూచి పూర్వస్మృతి గలిగి మాధవసేనుని డాసి జాలిగదురనిట్లనియె అయ్యా! ఈకోటం జొరకమునుపు నేనెపుడు కోటలో రెక్కలు గట్టుకొని వ్రాలుదునాయనియువ్విళులూరుచుంటి గాని ప్రవేశించినదిమొదలు నాకడుగైన సాగుటలేదు. ఏమిచెప్పుదు నాయవస్థ. కోటగుమ్మము దాటినతోడనే నామనస్సునకు మాయన్న హేమచంద్రమహారాజుమాట జ్ఞప్తికి వచ్చెను. ఈమొగసాలలు నీలాయములు నీయేనుంగుసాలలు నీసైనికనివేశములు నీపసులకొట్టములు మొదలగు సమస్తప్రదేశములు మాయన్ననే తలపునకు దెచ్చుచున్నవి. చెవులం గొలువదగిన వెడఁదకన్నులతోడను నిరంతరమగు చిఱునవ్వుతోడను విశాలమగు ఫాలముతోడనునేనుఁగుదంతపుంబలకలవంటి చెక్కులతోడను త్రిలోకసుందరమగు నాతనిముఖమండలము పోతబోసిన బంగారు విగ్రహమువంటి వాని యాకారము నాకిప్పుడు కన్నుల గట్టినట్లగపడు చున్నది. ఇవిచూచినప్పుడె నామనస్సెంత దుఃఖానలంబున మరుగుచుండ నాయన్నబిడ్డలనువదినెనుజూచినప్పుడు దుఃఖమును నేనెట్లుభరింపజాలుదునో తెలియకున్నాడ.

అని రెండునేత్రములనుండి జారిన బాష్పబిందువులనుదనయుత్తరీయాంచలమునఁదుడుచుకొనిమాధవసేనుని మీఁద జేయివైచి మెల్లగ నడచుచుండె. మాధవసేనుఁడు వాని దుఃఖమునుజూచి యది నిజమయినమనఃపరితాపమని నమ్మక తనలో నీవెంతకయిన సాహసుఁడవురా, చేతులార నతిఘోరములు చేయుటకుఁగల్లబొల్లియేడ్పు లేడ్చు

టకు నీవే తగుదు వని యనుకొని ప్రకాశముగా మృతినొందినవాని కొఱకు విచారించుట పగిలిపోయినకుండకొఱకు వగచుట కావున నూరకుండు మని సమాశ్వాసించెను. సోదరస్నేహ మెంతకుఁజాల దని దండపాణి పలికెను. దుఃఖితుని మనస్సు దుఃఖముఁ జేయుచుండును. కాని పైవారి కెఱుంగనలవికాదుగదా యని వజ్రపాణి యూరడించెను. అట్లుసంభాషించుచు మెల్లమెల్లనడచి యనేకవాటంబులు దాఁటి వారు కొలువుకూటముం జేరిరి. నిగమశర్మ రథము దిగినతోడనే చిత్రభానునిబాసి యంతఃపురమునకరిగి మఱఁది వచ్చినవార్త నామె కెఱింగించి విక్రమసేనహర్షవర్ధనులను వెంటబెట్టుకొని యదివరకే కొలువుకూటమునకు వచ్చియుండెను.

కొలువుకూటంబుజూచినతోడనే చిత్రభానుని దుఃఖవార్ధి మరియాద నతిక్రమించి పొంగిపొరల నతఁడు మాధవసేనునితో నిత్తెఱంగునఁ జెప్పుకొని విలపించె. అయ్యో! నేనెంతో మందభాగ్యుఁడను. మున్ను మాయన్న విదేశమునుండి వచ్చినరాయభారులు బ్రహ్మసమానులగు వేదవేత్తలు శేషుని ధిక్కరించుపండితులు తనయాస్థానకవీంద్రులు మంత్రులు సామంతులుమిత్రులుబంధుజనులు పరివేష్టించియుండఁ బేరోలగంబుండగాఁజూచినయాకన్నులతోడనేయీశూన్యసభాభవనంబు జూడవలసె. ఈకొలువుకూటంబుకాదె శారదాదేవికి రంగస్థలంబు. ఈ సభామండపము కాదె చతుష్షష్టి విద్యారత్నములకు గని. ఈ సభాభవనంబె కాదె కవిజనంబులమనోరథములు పంటపండు శాలిక్షేత్రము. అయ్యో! యిదియెంతచిన్నవోయె. ఎంత శోభావిహీనమయ్యెనని దుఃఖాతిశయముచే నడువజాలక యొక్కచో చదికిలంబడి యొక స్తంభమునకు జేరఁబడి కూర్చుండివిలపింపఁజొచ్చె దండపాణియు వజ్రపాణియు వారికిరుగెలంకులఁ గూర్చుండియుతఁడు నేలఁ బడకుండ సంరక్షింపఁజొచ్చిరి. మాధవసేనుఁడు వానిని విశేష

ముగా నూరడింపక "విషాదము గతజలసేతుబంధనముగదా" యని యొక్కటి రెండుసారు లనియె. అంతలో నిగమశర్మ రాజకుమారుల నిరువురం దోడ్కొని వచ్చి "యయ్యా! వీరె నీయన్నకుమారులు విక్రమసేనహర్షవర్ధనులనువారిం జూపించెను. నిగమశర్మ యట్లనిన తోడనే బాలకులిరువురు పినతండ్రిపాదములకు నమస్కరించి నిలువం బడిరి. చిత్రభానుఁడు వారిప్రణామములకు బ్రత్యుత్తరములుగ దీవనలేమియు నొసగకయే నాతండ్రులారా రండురండని తన రెండు చేతులతో వారిం జెరియొక హస్తమును బట్టుకొని చెరియొక తొడపై గూర్చుండబెట్టుకొని దుఃఖపూరితమనస్కుఁడై యేమియుం బలుక నోపక మొగమున గుడ్డవేసుకొని కొండొకసేపు బిట్టుగ దుఃఖించెను. అదివరకు తండ్రిమాట క్రమక్రమంబుగ మరచుచుండిన యాబాలకులు పినతండ్రిదుఃఖముచేత బితృవియోగముజ్ఞప్తికి దెచ్చుకొని వలవల యేడ్చిరి. అంతట మాధవసేనుఁడు నిగమశర్మ వారిం డాసి యిద్దరుఁ జెరియొకరిమీఁదఁ జేతులువేసి వగవవలదని కొన్ని మాటలఁజెప్పి యూరడించిరి. చిత్రభానుఁడంతలో దండపాణి వజ్రపాణులసమాశ్వాసవచనములం దేది యంచుక ధైర్యము దెచ్చుకొని బిడ్డలంకౌగిలించుకొని యిట్లు విచారించెను నాచిన్నయన్నలారా మీరెంతమందభాగ్యులరో నేనునంతియమందభాగ్యుఁడను. తండ్రిలేక మీరు, తండ్రివంటి యగ్రసోదరుఁడు లేక నేను, యావజ్జీవము విలపించునట్లు బ్రహ్మ మనలలాటముల వ్రాసి యుండె. అంతటి సోదరుండు నావంటిమందభాగ్యునకు దక్కునా? నాదుఃఖము పరమాత్ముఁడెఱుఁగును నేనెఱుంగుదును. నన్నాతండు ప్రమాదవశమున మనపురము వెడలనడచినను నాకు విషాదము లేదు. ఏలయన నేనెక్కడ నున్నను నాకు గొడుగులాగున మాయన్న యుండెఁ గదాయని ధైర్యముతోఁ బ్రతుకు చుంటి. ఇంకనాకు దిక్కెవ్వరు? నన్ను మాయన్న

యవ్వలకుం దోలె నని నాకుఁ గోపము లేదు. తండ్రివెనుక తండ్రి యంతవాఁడు. నన్ను దండించుటకు గారవించుటకు నతనికి స్వాతంత్ర్యము గలదు. బిడ్డలారా! మీవంటికుమార రత్నములఁ జూచి యానందించుభాగ్య మాతనికి లేదు. నాకు సోదరుఁడనియే కాదు నే విచారించు చుండుట. లోకములో నంతటిగుణవంతుఁడు లేఁడు. అంతటిదయావంతుఁడు లేఁడు. అంతటిసత్యవంతుఁడు లేఁడు. మాయన్నను దారుణమరణంబు నొందించినదురాత్ము లెవ్వరో నేనెఱుంగుదును. వారలందఱు తత్ఫల మఱుకాలములోనే యనుభవింతురు గాక! ఇట్టిబాలకులం దండ్రిలేని బిడ్డలుగఁ జేసినయాదురాత్ముల కేమి దుర్గతు లున్నవో కదా! ఎంతవిచారించిన నేమి ఫలము? మాయన్న నాకుఁ గానబడఁడు గదా! ఈబాలకులకుం దండ్రి దొరకఁడు కదా! అయ్యా నిగమశర్మ! పూజ్యురాలైనమావదినెసన్నిధికి నన్ను దోడ్కొని పొమ్ము. ఒక్కనమస్కారమామెకుం జేసి వచ్చెద. ఈయవస్థతో నున్నయాదేవిని నేఁ జూడఁజాలకున్నను దప్పునా! ఆమె నన్నుం జూడ ననుగ్రహించు నేని నే నటకు వచ్చెద" అనవుడు నిగమశర్మ మారువలుకక లేచి సత్వరము లోనికింబోయి యొక్కనిమేషమున మరలి వచ్చి దేవిం జూడవచ్చునని చిత్రభానునకుం జెప్పెను. చిత్రభానుఁడును మెల్లగ లేచి నిగమశర్మమీఁదఁ జేయి వైచి నడవ లేక నడచుచు, "అయ్యా! నేనామెవదన మెట్లు చూతును. నీలోత్పలముల వంటి యావిశాలనేత్రములు బాష్పపూరితములై యుండునుగాఁబోలు. పరమపవిత్రచరిత యగునీదేవికింతదురవస్థ కలుగుట కేమికారణమో. ఇది పూర్వజన్మకృతమై యుండ వలయు" నని విచారించుచునరవిందాదేవి యున్నగదిఁ బ్రవేశించెను. ప్రవేశించినతోడనే భర్తృవియోగదుఃఖభారవినమ్రమై కళావిహీనమైనమొగముతోను జిక్కి సగమై నగలు లేనిశరీరముతోడను బాష్పధారాపూరితములైనకన్నులతోడను

దల వంచుకొని కూర్చుండిన యాదేవి వానికిం గనఁబడియె. కనంబడుటయుఁ జిత్రభానుఁడు ముందుకు సాగి నడువఁజాలక యచటనే చతికిలంబడి "హాతల్లీ కాశ్మీరరాజ్యలక్ష్మీ! హా పరమపవిత్రచరిత్ర! హా లోకైకపూజ్య! ని కెంతదురవస్థ ప్రాప్తించె. నాకన్న లెంతపాపము జేసికొనిరొ. ఓమాలదైవమా! నీవు దయాశూన్యుఁడ వనుమాట నేఁడు స్పష్టమైన"దని కొంత వగచి యొకనిమేష మూరకుండి మరల నిట్లనియె. "తల్లీ! మాయన్ననిమిత్తము నీ వెంత కుందుచుంటివో నేనును నంతియె కుందుచుంటి. నన్నుఁ గూర్చి కిట్లని వాండ్రు చెప్పినపలుకులు నీవు పాటింపవలదు. నీకు ముగ్గురు కొమారు లున్నవా రనుకొనుము. అందు జ్యేష్ఠుఁడు చిత్రభానుఁడు. తక్కినవారు విక్రమసేన హర్షవర్ధనులు. నేను నీతోడి కోడ లిందుమణియు నీగారాబుకూఁతురు కర్పూరమంజరియు నాకొడుకు విజయసేనుఁడు ని న్నింటఁ జూచి పోవలయు నని సంకల్పించుకొంటిమి. మగవాఁడ నగుటచే నే నించుక ధైర్యముఁ బూనియుంటిఁ గాని నీచెలియలుం గూఁతురు పట్టశక్యముగాక యున్నవారు. ఎప్పుడు వచ్చి యిక్కడ వ్రాలగలుగుదుమా యని వారు మిక్కిలి తత్తరపడు చున్నవారు. వారి నిక్కడికి రప్పించుటయు వారు వచ్చువఱకు నే నిందుండుటయు మీ కిష్టమగు నేని యట్లు చేసెద. కాదేని యీక్షణంబ పోవువాఁడ నన్నుగురించి మీరును లోకము నెట్లనుకొన్నను నాయన్న బిడ్డలవిషయమున నాకుం గలప్రేమ దైవమెఱుంగును. ప్రేమసంబంధము పోమ్మన్నఁ బోవునా సోదరునిమరణవార్త వినినది మొదలు బాలకు లిద్దఱే మైరో యని నాపడిన పరితాపమింతింత కాదు. నన్నుఁ గూర్చి నేఁ జెప్పుకొనుట భావ్యము గాదు. ఇప్పు డిక్కడ నాయునికిచేత మీమనోవేదన మతిశయమగునట్లు తోఁచుచున్నది ప్రస్తుతము నేను సెలవు గైకొని మరల దర్శనము చేయువాఁడ"నని లేచి దూరమునుండియే చేతులు జోడించి యామెకు నమస్కరించి గది విడిచి యావలకుఁ బోయెను.

అరవిందాదేవి చిత్రభానుఁడు వచ్చినదిమొదలు గది విడుచు వఱకు వంచినతల యెత్తక మొగమునఁ జేయిపెట్టుకొని ప్రవాహములై పాఱుకన్నీళ్ళు తుడుచుకొనక మఱిదిమాటలకు బ్రత్యుత్తరము చెప్పక యొక్కమచ్చుననే విలపించెను. చిత్రభానుఁ డీవలకు వచ్చి యన్నకుమారులను మరలఁ గౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొని మాధవసేనప్రముఖులను వీడ్కొని మున్నెక్కినయరదము నెక్కి తనగృహారమునకుఁ బోయెను.



# ముప్పదినాలుగవప్రకరణము.

చిత్రభానుఁడు కోటవిడిచి పోయినతోడనే మాధవసేనుఁడు ప్రధానమంత్రి యగుమణివర్మకు యువరాజసందర్శనమునుగూర్చి తెలియఁజేయుటకుఁ వానిగృహమునకుఁ బోయెను. మణివర్మవానిని సత్కరించి యువరాజు రథముడిగి కోటలోఁ బ్రవేశించినది మొదలు కోట విడుచువఱకుఁ జరిగినవృత్తాంత మంతయుఁ బూసగుచ్చినట్లు చెప్పుమని మాధవసేను నడిగెను. మాధవసేనుఁడు తూచ తప్పకుండ నావృత్తాంతము సవిస్తరముగా నెఱింగించి పిదప నిట్లనియె. ఇందుముఖ్యముగా మనమాలోచింపవలసినయంశములు మూఁడునాల్గున్నవి. తన యన్న నెవ్వరో చంపిరఁట. ఆదురాత్ములు తత్ఫల మచిరకాలమున ననుభవింతురఁట. తనయాలుబిడ్డలు దేవిఁజూడవత్తురఁట. వారు వచ్చునఱకు దానిక్కడ నుండు నఁట. అన్నబిడ్డలమీఁద తనకుం బ్రేమ హెచ్చుగ నుండఁ బోదఁట. సోదరమరణవార్త చెవి సోఁకటాడిగా బాలకు లెట్లుబ్రతుకుదురో యని తనకు మిక్కుటం బగుమనఃపరితాపము గలిగెనఁట. పూర్వోత్తరసందర్భములంబట్టి యీమాట లరసిచూడ నీతని కేదో దుస్సంకల్ప మున్నట్లు తోఁచుచున్నది. మిత్రమా నీవు చూడ లేదు కాని వానికల్లబొల్లిదుఃఖములు వానిదుర్వ్యసనములు వాని తియ్యమాటలు విన్నవారు వాఁడు నిర్దోషి యని తలంపకపోరు. నాటకమందు వేషగాఁడు తనపాత్రమును జక్కఁగాఁ బ్రయోగించుట కభినయించినట్లు యీకటిలుఁడుగూడ నెంతోనటన చేసెను. దీని కిప్పుడు ప్రతిక్రియ యేమి? యని పలుకుటయు మణివర్మ యాతనిమాట లా[illegible] "దేవి యాతని మాటల కేమిప్రత్యుత్తరమిచ్చిన"దని య[illegible]గెను. "[illegible] దివ్యతకు దేవి కన్నీరు విడిచెనే కాని మఱి [illegible] లేదు. వానిపలుకులకు బదులుచెప్ప లేదు. వాని నంతు

మన లేదు. వెళ్లు మన లేదు. ఉండఁగలిగినంతసే పచ్చట నతఁడుండి మరలివచ్చునట్లు చెప్పిపోయె" నని మాధవసేనుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

అది విని మణివర్మ తలయెత్తి మీఁదికిం జూచి యించుక యాలోచించి, మిత్రుఁడా మగనిఁజంపి మొగసాలకుఁబోయి మొరలెత్తిన దన్నమాట నేఁటికినిజమగును. భ్రాతృద్రోహియైనయీదురాత్ముఁడు తనయన్నమరణ మితరుల కెవ్వరికో యారోపింపఁ దలఁచు చున్నాఁడని నే నూహించెద. ఆలుబిడ్డల నిచ్చటికిఁ బిలిపింపఁ దలంచుట నీయూర నతఁడు నివాసము 'చేయఁదలఁచుటయే. ఇది యాతనిభవిష్యచ్చరిత్రమునకుపోద్ఘాతము. బిడ్డలయెడ ననురాగము జూపుటయువారి సేమము గోరిన ట్లభినయించుటయు మనపై నాతఁడు స్వకపోలకల్పితముగా రచియింపఁబూనినసింహానాటకమునకుఁ బ్రస్తావన. మన మేమయినను నాకు విచారము లేదు కాని వీఁడు తనకుటిలోపాయములను వలలోఁ దగిలించి దేవిని రాజపుత్రులను నేమిసేయునో యని విచారించు చున్నవాఁడ. రాజు యుక్తవయస్కుఁడు కాని బాలుఁ డగుట చేతను సంరక్షణ చేయునది కౌటిల్య మెఱుఁగనిశుద్ధస్ఫటికమువంటి యాఁడు దగుటచేతను బ్రతిక్రియ తగినట్లు చేయ వీలు లేదు. ఇది యిట్టి దని చెప్పుటకు వీలు లేదు. చెప్పకపోవుటకు వీలులేదు. చెప్పుట తప్పు; చెప్పకుండుట ముప్పు. ఏమైనంగానిమ్ము. కార్యభారముమనతల పైనున్నది. కావున మనము హితోపదేశము జేయకపోవుట తప్పు. ఈవఱకే చెప్పవలసిన దంతయుమనమామెతోఁ జెప్పినారము. చర్విత చర్వణ మైనను సరే నీవు పోయి దేవింగాంచి మఱఁదిని శ్రీనగరము నుండి సాగందోలుటకు మన కనుమతినిమ్మని వేఁడుము. చిత్రభానుఁడు ప్రకటశత్రుఁడై చేయఁదలఁచిన ఘాతలు సంపూర్ణముగఁ జేయ లేక

మిత్రవేషమున వచ్చినాఁ డని చెప్పుము. భయమునఁ బాలు త్రాగిం పఁజాలము కాని వేఁడుకొని విసముద్రావింపవచ్చునను సామెత సార్థకమగు ననుము, తనయాజ్ఞ యగుచేని కార్యము మించకుండ వానిని సాగఁదోలఁ గలమనుము. దూర మాలోచింపు మనుము. పై మెఱుంగులచేత మోసపోవల దనుము. కుమారుల సేమము జూచుకొమ్మనుము మిత్రు లెవ్వరో శత్రు లెవ్వరో చక్కఁగా నరయుటకు సమయ మిదే యనుము. సత్వరంబ చను" మని పలికి పీఠమునుండి తాను లేచి తత్క్షణము మాధవసేనని రాజమందిరమునకుఁ బంపెను. అట్లు మాధవసేనునిం బంపి యెప్పటికిని మనస్స్థిమితము లేక మణివర్మ తనమాటలకు దేవి యేమనునో యనియుఁ గార్యసరణి కత్తియంచు మీఁదనడకవలె నుండుటచే నెటు పోయిన నెటువచ్చునో యనియుఁ జింతించుచు నిట్టటు దిరుగుచు వేగముగ నడచు చున్నాఁడో లేదో యని మాధవసేనుని పోయినదారిం జూచుచు మిక్కిలి కళవళము పడఁజొచ్చెను.

చిత్రభానుఁడు కోట విడిచి యరద మెక్కి తన నెలవునకుం జని వికసించిన ముఖపద్మముతో సంతుష్టమైనహృదయముతో గుడారముఁ బ్రవేశించెను. రుద్రభట్టు వానియాగమనము నిరీక్షించుచు నతనిం జూచినతోడనే "మిత్రుఁడా! ప్రథమదర్శనము మంగళముగాఁ బరిణమించెనా? విశేషము లెవ్వియును లేవుగదా! విలాసవంతమైననీముఖవైఖరియే కార్యపద్ధతికి వ్యాఖ్యానమై యున్నది సుమీ!" యని యెదురుగా వచ్చి బహూకరించెను. హితాభిలాషియైనయాబ్రాహ్మణునిపలుకులు విని చిత్రభానుఁడు "దేవా! మీయాశీర్వచనమునఁ బ్రథమసందర్శనము శుభోదర్కముగా నున్నది. మనతలపెట్టినకార్యమింక నిర్విఘ్నముగ సాగునని శుభసూచనలు గానఁగట్టుచున్నవి" యని పలికి తాను గుడారము విడిచి మరల జొచ్చువఱకు జరిగినయావద్వృత్తాంతము వాని కెఱిఁగించెను. ఆవృత్తాంతము విని రుద్రభట్టు మిక్కి

లినంతసించి చిత్రభానునిబహూకరించి "మిత్రమా! మనముతరుచుగా దండపాణిం గలిసికొను చుండవలయును. కలిగినఁగార్యసిద్ధి వానివలన నే కలుగవలయు" నని యుపదేశింప "నిజము నిజము. మీరు చెప్ప గా(ఁ) బలికినారు. అతఁడు తలంచిన నెంతపనికైన నగు" నని చిత్రభా నుఁడుచెప్పి పిదప భోజనప్రయత్నము చేసెను.

మణివర్మ మితిమీఱిన యుత్తలపాటుతోఁ దన మేడమీఁదఁ బిచ్చివాఁడువోలె తిరుగుచు మాటిమాటికిమాధవసేనుఁడు వచ్చుచుం డెనేమోయని వీథివంకఁజూచుచుఁ గొంతసేపుగడపునప్పటికి మాధవ సేనుఁడు రెండుమూడుసారులిట్టటుం దిరుగుటచేతఁ గడు డస్సినమేని తో నసురసురని యాయాసపడుచు వచ్చి మేడయెక్కి మణివర్మను సమీపించెను. మణివర్మ మిక్కిలియాత్రముతో "దేవి యేమన్నది దేవియేమన్న" దని యడిగెను. మాధవసేనుఁడు బిక్కమొగముపెట్టి "మిత్రమా! నిరర్థకము లగుసంభాషణలు చెప్పక సారాంశముఁ జె ప్పెద వినుము. దేవి దోషికోడలిని గర్పూరమంజరిని జూచునుబలాట ము పడుచున్నది. అంతవఱకు పుణుని యిచ్చటనే యుంచునాఁడఁట. అనంతరము వానిని వెడలగొట్టుటకు మనకు సర్వస్వాతంత్ర్యమిచ్చునఁట. ఇదియే జరిగిన కార్యనిశ్చయ" మని మొఱఁగించెను. అప్పలుకలు విని మణివర్మ కార్యసరణి చక్కఁజేయు నాశయిన్నియు నడుగంటిన వని దేవి మూఢత్వమునకు వగచి మూఁడఁదలంచినయాపదలు దలంచి భయపడి యిట్లనియె. "వినాశకాలే విపరీతబుద్ధి" యనువాక్యము "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" అను లోకోక్తినేఁడు సార్థకములైనవి. మ నము దైవముమీఁద భారమువైచి యూరకుండవలసినదే.

సమాప్తము.



శ్రీరస్తు.

# కర్పూరమంజరి—ద్వితీయభాగము

## మొదటి ప్రకరణము.

---

"సఖీ! కర్పూరమంజరీ! మహారణ్య మతిక్రమించి బయలుగా నున్న భూమికిమనము వచ్చుటచే సంధ్యాసౌందర్యముఁ జూడఁగలిగితిమి. చూడు! చూడు! దాని రమణీయకము వర్ణనాతీతమై యున్నది. తన ప్రభావముచేఁ బగలు గలిగించి యసాధారణతేజంబున జగమెల్ల నాక్రమించి భువనంబులు సంతాపింపఁజేసి యెట్టకేలకుఁ గాలవశమున నిజతేజముఁ గోల్పడి పగతులచేఁ బరాజితుఁడై కాయమునుండి క్రొన్నెత్తురులు దొఱఁగ నస్తమించుమహావీరుఁడుంబోలె భాస్కరుఁడు పడమటికొండలోఁ గ్రుంకుచున్నాఁడు. ఎంతలెంతలకైన నీయవస్థ తప్పదుకదా". అని మల్లిక పలుకుటయుఁ గర్పూరమంజరి యిట్లనియె. "మల్లికా! ఈసూర్యాస్తమయసమయము నాకు మఱియొకలాగుఁ దోచుచున్నది. చూడు! పరమేశ్వరనిర్మితమైనజగన్నాటకమునకీ సంధ్యాసమయము ప్రస్తావనవలెఁ గనఁబడుచున్నది. కాలపురుషుం డను సూత్రధారుఁడు బిలువ రాగమనియెడు కుసుంభారుణచేలముఁ గట్టి కట్టెఱ్ఱయైనభానుబింబంబను కాశ్మీరతిలకంబు వెట్టి సంధ్య యను నటి ప్రవేశించి రాఁగలనిశానాటకమును సూచించుచున్నది. పులుఁగుల యెలుంగు నటిసేయుగానమువలె వినఁబడుచున్నది. అదే ప్రభాకరుఁ డస్తమించినాఁడు. ఇఁక నిశానాటకప్రథమరంగమును మనము దర్శింపఁగలము. అల్లదే! కథానాయకుఁడైనరాజు చంద్రుఁ డుదయించుచున్నాఁడు. చూడు! ఆకాశంబను నింద్రనీలమణిమయంబయినగద్దియ నాతఁ డెక్కినాఁడు. నిగనిగలాడు నాగద్దియపైఁ జెక్కినవజ్రంబులట్ల

లెక్కకుమీఱినచుక్కలు మెఱయుచున్నవి. ఈతఁడు చల్లనిరాజయ్యు మహాతేజశ్శాలియై సహజశత్రువైనయంధకారమును బటాపంచలుగఁ దోలియున్నాఁడు" అని కర్పూరమంజరి ప్రత్యుత్తర మీయ మల్లిక "సఖీ! నీయూహ సరసముగా నున్నది. కాని యిది విను. ఈనిశాసౌందర్యము నాకు మఱియొకలాగు కనఁబడుచున్నది. గగనలక్ష్మిషోడశకళాపరిపూర్ణమైన చంద్రమండలము నెమ్మోముగా నందలికళంకము కస్తూరితిలకంబుగా నీలనీలం బగునాకసంబు కొప్పుగాఁ జుక్కలు కొప్పునం దుఱిమినమల్లెపూవులుగా నలుగడల నలముకొను తేటవెన్నెలలు నవ్వులుగా హాయిలు గులుక జగన్మోహనంబగు నాకృతిఁ దాల్చి యీసమయమున విశ్వమెట్లున్నదో చూచుటకు బయలుదేరినది. చెలీ! యీనభోలక్ష్మి యెల్లతెఱఁగుల నిన్నుఁబోలియున్నయది" యని పలికెను.

"సఖీ! నీవు నాపైఁ గలప్రేమచే నన్ను గగనలక్ష్మితోఁ బోల్చుచుంటివి గాని ప్రకృతి సౌందర్యమునకు నావంటిదానిపోయఁగ మీ దగునే? దాని కదె సాటి. చిత్రకారుఁడు బుద్ధికుశలతచేతను, హస్తనైపుణిచేతను వృక్షమునో పూవునో పండునో యొకఫలకముమీఁదఁ జిత్రించుఁ గాక! ఆయాచోటుల కనువుగా రంగులు పులుముఁగాక! ఎన్నియందములఁ దేవలయునో యన్నియందములఁ దెచ్చుఁగాక! ఎట్లయిన దేవదేవనిర్మిత మయినవృక్షమట్లు ఫలమట్లు, పువ్వట్లు చిత్తరు వుండునా?"

అని వారిరువురు ప్రకృతిసౌందర్యమును జూచి మెచ్చి యానందము నొందుచుండ నంతలోఁ జంద్రిక వచ్చి "అమ్మా! గడియరాత్రి యైనది. అమ్మగారు గుడారములోనికి రమ్మనుచున్నారు. రండు. పోదము" అని పిలిచెను. పిలుచుటయు వారిరువురు "ఇదే వచ్చుచున్నార"మని గుడారములవంక కరిగిరి.

జయంతుఁడు వెంటవచ్చినపరివారమునకు బసలనిమిత్తము భోజనములనిమిత్తము దగినయేర్పాటులఁ గావించెను. చెట్లక్రింద గుడ్డములం గట్టిరి. రాజకుటుంబము దట్టమైనగుడారములలో విశ్రమించెను. ఇందుమణియుఁ, గర్పూరమంజరియు, విజయసేనుఁడును బెండలకడ భోజనము చేసిరి. అనంతరము జయంతుఁడు మొదలగు ప్రధానపురుషు లారగించిరి. పగలెల్లఁ బయనము సేయుటచే బడలికల పెంపున గుడ్డపురోతులుఁ బదాతులు భోజనములు సత్వరమ ముగించి చెట్లనీడలఁ జాఁపలు, కంబళ్ళుఁ బఱచుకొని నిమేషమాత్రమునఁ గనులు మూసికొని నిద్రించిరి. ప్రయాణములలో సైతము రాజకుటుంబములకు సకలసౌకర్యములు జరుగవలసి యుండెను గనుక మంచములు, పానుపులు, పల్లకులు, దీపస్తంభములు, రత్నకంబళములు, బహువిధఫలములు, నానావిధభోజనపదార్థములు వారివెంట నుండునట్లు రాజవాహనుఁ డేర్పాటు చేసెను. పరిచారికలు పానుపులు పఱువ నిందుమణియు విజయసేనుఁడును బవ్వళించి నిద్రించిరి.

పండువెన్నెలలు గాయుచుండెను. మలయమారుతతరంగములు యథేచ్ఛముగ శరీరముల సోఁకి హాయి యనిపించెను. కొన్ని పులుఁగుల యెలుఁగులు వీనులకు విందగుగానమునలె మనమున కానందముఁ గూర్చెను. నేలయంతయుఁ దెల్లదుప్పటిపఱచినట్లు గానబడెను. వెండిపూత పూసినట్లు, కప్పురపుంబొడి చల్లినట్లు, పాలగచ్చుచేసినట్లు గానఁబడెను. ఆసమయమునఁ గర్పూరమంజరి నాఁడు మకరందుఁడు తనరుగ్ణతలోఁ దనకుఁ గావించిన భేషజరూపకమహోపకారముం దలఁచి యాతనియాకారమును స్మరించి యాతని మృదుమధురసంభాషణలను మందహాసములను సుందరవిలాసములను జ్ఞప్తికిం దెచ్చికొని వెండియు నతనితోడికూటమి సంప్రాప్తించుపుణ్యకాలము గలుగునా యని తలపోయుచు నిద్రపోవక యుండెను. మల్లికయు

రెండుమూఁడుసారు లామెను బలుకరించి ప్రత్యుత్తరము గానక "ఏమమ్మా! నామాటలు వినఁబడుట లేదా? నీమనంబు మకరంద రసము నాస్వాదించిన తుమ్మెదవలె మత్తిల్లి యున్నది గాఁబోలు! నీచెవిలో మకరందబిందువు లడ్డుపడెనేమో? కానిచో నాపిలుపు లేల వినఁబడవు?" అని చిఱునవ్వు మొలకెత్తినమోముతో నర్మగర్భముగాఁ బలికెను. అప్పలుకులు విని "మూర్ఖురాలా! చమత్కారముగా మాటాడఁగలనని గర్వించి నీయిచ్చవచ్చినట్లు నన్ను దెప్పుచున్నావు. చాలు చాలు! నోరు మూసికొనియుండుము." అని కర్పూరమంజరి సుంకలించునంతలో "సందెకబళమమ్మా! సందెకబళము. పట్టెడన్నము పెట్టుఁడమ్మా పెట్టుఁడు" అని యొకకేక వినఁబడెను. గుడారముచుట్టుఁ గావలిగాచుచున్న యామికులు కేక వైచిన యాపడఁతుకను లోపలికిఁ బోనీయక నిరోధించిరి. అది యొక్కపెట్టున మొఱవెట్టఁజొచ్చెను. కర్పూరమంజరి దాని కుయ్యాలించి మల్లికం బిలిచి "దానిమొఱ యేమో తెలిసికొని తనకడకుఁ దోడుకొనిరమ్మ" ని పంపెను. మల్లికయు గుడారము దాఁటి యావలకుఁ బోయి కావలివాండ్రకుఁ గర్పూరమంజరియాన దెలిపి యాచెలంతను లోపలికిం దోడ్కొనివచ్చెను. మెడనిండ గురివెందపూసలసరములు, చేతుల గవ్వలగుత్తులకంకణములు, గలిగి కడుమాసినపాతబట్టగట్టి, చేత నొకకుండ దాల్చి కట్టెదుట నిల్చెను. ఆయంగనంజూచి కర్పూరమంజరి "నీ కేమి కావలయు? నీ వెవ్వతవు?" అని యడిగెను. అప్పడంతుక రాజపుత్రికం జూచి కుండ క్రిందఁబెట్టి దండముఁబెట్టి "తల్లీ! నే నెఱుకలదానను. ఈసమీపముననే మాపల్లియ కలదు. మా కన్నవస్త్రములు లేవు. మిక్కిలి పేదవాండ్రము. ఈదారిని బోవుబాటసారులం జేరి కూఁడుగుడ్డ నడుగుకొని తెచ్చుకొనుచుందుము. ఇంటికడ నాబిడ్డ లన్నము లేక మాడుచున్నారు. గొప్పదొరలు

గుడారములువైచికొని దిగినారుగదా పట్టెడన్నము దొరుకకపోవునా యని యాసపడి వచ్చితిని. నే నెఱుక జెప్పఁగలను. కావలయునేని మీకుఁగూడఁ జెప్పఁగలను" అని విన్నవించెను. దానిదీనాలాపముల నాలించి కర్పూరమంజరి జాలి పొంది దాని కేమైన నాహార మిడుమని మల్లికతోఁ జెప్పెను. "అమ్మా ! అట్లె చేసెద" నని చెప్పి మల్లిక చెంచెతం జూచి నవ్వుచు "నోసి! యెఱుక జెప్పఁగలనంటివి. మారాజపుత్రికకు నీ వెఱుక జెప్పు" మని హెచ్చరించెను. వలదు వలదని కర్పూరమంజరి పలుకుచున్నను నయ్యెఱుకలసాని యూరకుండక చేత నొకపుల్ల బట్టుకొని క్రింద నేల రెండుమూఁడుగీట్లు గీచి యాకసమువంకఁ జూచి చేయి చాఁపుమని కర్పూరమంజరిని వేఁడి హస్తపరీక్షఁ జేసి యిట్లనియె.

భాగ్యశాలివే తల్లి! అదృష్టం గలదానవే తల్లి! చుట్టాలసుగభివే తల్లి! కొడుకులకోట నవుదువే తల్లి. నీమనసులో నున్న రాచబిడ్డఁడే నిన్నుఁ బెండ్లాడఁగలఁడె తల్లి! దాపున నున్నాఁడె తల్లి! దగ్గఱ నున్నాఁడె తల్లి! నీపంట పండునే తల్లి! సిరి నీకన్నుల కాఁపురమున్నదే తల్లి! వరాలబొజ్జవే తల్లి! నీదారకు గలసినప్పుడు నన్ను మఱచిపోకు తల్లి! ఒకపాఁతచీర యియ్యవే తల్లి!" అని యెఱుక చెప్పుటయుఁ గర్పూరమంజరి ముసిముసినవ్వులు నవ్వి "దానినోటికి వచ్చినట్లు ప్రేలినది. ఈచెంచుపడఁతు లందఱకు నీవిధముగానే చెప్పుదురు. ఇందువిశేష మేమియులేదు." అనిపలికి దానికిం బిల్లలకు సరిపడినయాహారముం బెట్టించి గట్టిచీరలు రెండిచ్చి పంపెను.

మల్లికయు దానిని సాగనంపి "సఖి! దాఁపుననే యున్నది దగ్గఱనే యున్నది" యని చెప్పినది. అచిరకాలములోనే నీవు నీప్రియునిఁ గలిసికొందువు గాఁబోలు" నని పరిహసించెను. "చాలు చాలు. నీయొగతాళి కట్టిపెట్టు. నాకు నిద్రవచ్చుచున్నది. నా పండు

కొండ" మని రాజపుత్రిక మేను సెజ్జం జేర్చెను. మల్లికయు నామె దగ్గఱనే తనపానుపుమీఁదఁ బండుకొనెను. అందఱు గుఱ్ఱుగొట్టి నిద్రించిరి. యామికులు మాత్రము మేలుకొని కావలిగాఁచుచుండిరి. ఎడనెడ బెబ్బులులయఱపులు సింగపుఁబొబ్బలు నక్కకూఁతలు భయంకరములై వినఁబడుచు రాజపుత్రికనిద్రకుఁ గొంతభంగము గలిగింప "మకరందుఁడా! మకరందుఁడా! రక్షింపుము. రక్షింపుము" అని యొకటిరెండుసారు లామె పలువరించెను.



రెండవ ప్రకరణము.



"చంద్రచూడుఁడా! నాయనగారి యాజ్ఞాప్రకారము మనము మాళవదేశమంతయుఁ దిరిగితిమి గదా. రాజధానియగు నుజ్జయిని యతిదూరమున నుండుటచేఁ బ్రజ లంతదవ్వు నడచిపోయి తాము చేసికొనవలసినమనవిసనవులఁ బ్రభువుతో సరిగాఁ జేసికొనుటకవకాశము గలిగియుండదని పాలితు లగు జనుల సుఖదుఃఖముల నారయుమని మహారాజుగారు మనలఁ బనిచినందుకుఁ బ్రజలు మిక్కిలిసంతోషభరితు లైరి. వారు నాకుఁదెలిపినయిబ్బంది లన్నియు మహారాజుగారికి విన్నవించి యచిరకాలమున వానిందొలఁగించుటకుఁ దగినప్రయత్నముఁ జేసెద. రాజాజ్ఞ సరిగా నెఱవేర్చుటచే నాతలపై భారమిప్పుడు దిగినట్లున్నది. నాహృదయమిప్పుడుచులకనైనది. కార్యవ్యగ్రతయడఁగినందున నీవెన్నెలసుఖ మనుభవించుటకు మన సుత్సహించుచున్నది. కాలపురుషుఁడు బ్రహ్మాండభవనమునకు వైచినవెల్లతెఱఁగునఁ గర్పూరపరాగము చల్లినభాతిని నెల్లయెడల వసుంధర తెల్లనై యొప్పె. పైతృకంబగురాజ్యంబు రెండుభాగములుచేసి సమానముగఁ బంచుకొను నన్న

దమ్మునలట్లు దివాకరనిశాకరులు క్రమముగా నహర్నిశలఁ బంచుకొని నైజతేజములచేఁ జగమున కుపకారము సేయుచున్నారు. ఈచల్లదనము నీవుఁగూడ ననుభవింపుము." అని మాళవేంద్రనందనుఁ డగుమకరందుఁడు వేడుకచెలికాఁ డగుచంద్రచూడునిఁ జూచి పలికెను. చంద్రచూడుఁడు వాని మనోభావ మెఱిఁగి మెల్లగ నిట్లనియె. "మిత్రుఁడా! నీవంటిమహారాజకుమారుఁడు సౌందర్యసుధాధవళము లగుమేడలనుండువాఁడు వనాంతరములకు వచ్చుటంజేసి వనలక్ష్మి గౌరవపురస్సరముగా నీకు స్వాగతమియ్యఁదలఁచి వెన్నెల కురిసినను బ్రహ్మాండమంతయుఁ బూయించినది. కర్పూరపరాగము జల్లినట్లు విశ్వము తెల్లనై యుండుట నిజమే! అంతేకాదు. చెట్లనున్నపూలగుత్తులు పండ్లగుత్తులు వెన్నెలకతమునఁ దెల్లనై కర్పూరమంజరులట్లు వెలయుచున్నవి." అని నర్మగర్భముగఁ బలికినఁ జంద్రచూడునిం గని మకరందుఁడు "మిత్రుఁడా! నీమాటనిజము. పుష్పఫలగుచ్ఛము లన్నియుఁ గర్పూరమంజరు లట్లే, వెలయుచున్నవి. ఈగగనలక్ష్మియుఁ గర్పూరమంజరివలెనే యున్నది. ఏది చూచిన నా కాపద్మాక్షియే జ్ఞప్తికి వచ్చుచున్నది. అది లావణ్యరాశి. అంగనాకృతిఁ దాల్చిన శృంగారరసాధిదేవత; నడకలు మాటలు నేర్చినజాళువా పసిఁడిబొమ్మ. పూఁబోఁడి యనుశబ్ద మన్యకాంతలయందు నిరర్థకమే గాని కర్పూరమంజరియం దది సార్థకము. పలుకుపలుకున నది యమృతమొలుకుచుండును. ఆమెనోట వెడలునవి మాటలు గావు, చెవులతుప్పుల దుల్లఁజేయుపాటలుగాని. ఆమెలోచనము పద్మగర్వనిర్మోచనము. ఎవఁడైన నొకసారి యామెంజూచిన నేత్రములు చరితార్థము లగును. పలుకులువిన్న వీనులుచేసికొన్నపాపంబు వోలంగును. మిత్రుఁడా! ఆమెం జూచి యెంతకాలమైనది! నాఁడు విదర్భాపురము బాసినదాదిగా నామనసు మనసులో లేదు. ఆత్మ నిరంతరము విదర్భలో నుండు

ప్రాణము ప్రాణములో లేదు. నన్నెవరి కప్పగించి పోయెదవు? అయ్యో! పడవాఁడను. బ్రాహ్మణుఁడను. మాతల్లి కొక్కఁడనే కుమారుఁడను. నా ప్రాణము రక్షింపుము" అని యతనిని బిగ్గరగాఁ గౌఁగిలించుకొనెను. మకరందుఁడు వానిపిరికితనమునకు నవ్వుకొని "వయస్యా! భయములేదు. నీప్రాణమునకు నాప్రాణ మడ్డము వైచెదను. నీ వీగుడారములో నుండుము. నీ కిరువురు సేవకుల నప్పగించెదను. వారు నిన్ను గట్టిగాఁ బట్టుకొందురు." అని చెప్పి ఖడ్గము ధరించి మెఱుపునంటి పోటుబంటులఁ బదుగురఁ గొని వెంట రమ్మని యార్తధ్వని వచ్చినవైపునకు విసవిస నడచిపోయెను. విండ్లు నమ్ములు బల్లెములు మొదలగు సాధనంబుల ధరించి దంట లగుబంటులు పదుగురేగాక పెక్కండ్రు రాజకుమారుని వెంటఁ దిరిగిరి.

"వెఱువకుఁడు వెఱువకుఁడు! ఇదే నేవచ్చుచున్నాఁడ" నని యుచ్చైస్స్వనముతో దెసలు మాఱుమ్రోఁగునట్లు కేకలు వేయుచు మకరందుఁడు మిక్కిలి వేగముతోఁ బరుగెత్తి గుడారములకడ కరిగెను. వీరభటులు యజమాను ననుసరించి గమ్యస్థానముఁ జేరిరి. అప్పు డేమి చెప్పను! మొగమున జేగురుబొట్లు తలలపై నెమలిపింఛియములు గుచ్చినతీఁగచుట్టలు, చేత విండ్లు, నమ్ములు, భుజముల నీఁతాకులతో నల్లినయమ్ములపొదులు, మెడలలో గవ్వలసరములు, గుఱివెండేరులు, ముంజేతుల దండల నెముకలకంకణములు, నన్నఁడు కట్టింపుబడని బారుమీసములు గడ్డములు వ్రేలుచున్న కెంజడలు పుఱ్ఱెగోచులు, వెడఁదఱొమ్ములు, చింతనిప్పులట్లు మెఱయుకన్నులుఁ గల భిల్లులు దిక్కులు చిల్లులువడునట్లు అఱచుచుఁ గుహ్వారమొనర్చి యిందుమణి యున్నగుడారములోఁ బ్రవేశించి కొల్లపెట్టఁ జొచ్చిరి. వాండ్రు క్రొవ్విలులవలె నుగ్రమూర్తులై యిప్పు డనుముందుఁ గాంచి వాండ్రం గడతెచ్చి నిద్రించుచున్నవారు నిద్రించుచుండఁగనే కుత్తుక లుత్త

రించి బరిమార్చి యాకస్మికముగా లేచి చేతికి దొరకినయాయుధంబు లంబట్టి, తమ్మెదిర్చిన జోదులంగాయపఱచి కొందఱినిఁ జెట్లకు బంధించి యథేచ్ఛముగఁ బ్రవర్తించుచుండిరి.

జయంతుఁడు వారిచే బంధింపఁబడెను. బాలుండైన విజయసేనుఁడు గాయము దగిలి నేలఁ బడెను. కల్పలతయుఁ జంద్రికయు మల్లికయు "రక్షింపుఁడు. రక్షింపుఁ డని యఱువఁజొచ్చిరి. ఇందుమతి దొంగలంజూచి తనమేలినగలు కర్పూరమంజరి యొడలియలంకారములు దీసి యిచ్చి తమ కేవిధమునకీడు సేయకుండ గావలసిన దంతయు దోచుకొనిపొమ్మని యమూల్యాభరణంబులు చీనిచీనాంబరములు విలువగల దువ్వలువలు సేలువలుఁ గలపెట్టెలం జూపెను. కర్పూరమంజరి మూర్ఛిల్లెను. భిల్లులు కొల్లలుగొట్టుటకుఁ జక్కని యవకాశము దొరకెనని సంతసించి యాఁడువాండ్రజోలికిం బోక తమవచ్చినపని చేయఁజొచ్చిరి.

అంతలో మకరందుఁడు సపరివారముగా నచ్చటికరుదెంచి భిల్లులం దాఁకెను. రాజవాహనునిభటు లెవ్వరో దొంగ లెవ్వరో తెలిసికొనుట యటవికులవేసములంబట్టి యతనికి సులభమయ్యెను. నిశాచరులట్లు భయంకరకాయులై నిర్భయవిహారము సేయుచున్న నిర్దయాత్ములఁ గఱకుఁటెఱుకులఁ గఱుకుకత్తులతో మకరందుఁడును సమరకుశలు రగునాతనియనుచరులును నఱఁటిబొందల నఱికినట్లు నేటునకు రెండు తునియలుగా నఱుకఁజొచ్చిరి. దోఁపుడుగొడవలోనున్న భిల్లులు మింటనుండి పిడుగులుపడినట్లు హఠాత్తుగా మహాశూరులువచ్చి తమ్ము దాఁకుదురని యూహింపలేక చెట్లుకూలినట్లు గూలిరి. కొందఱు మకరందునికవిక్రియవిహారముఁ నెదురనిలువలేక చేతనున్నపెట్టెలు మొదలగునవి జాఱవిడిచి పాఱిపోయిరి. రాజవాహనునిభటుల కళేబరముల తోను, భిల్లులపీనుఁగులతోను నచ్చోటు భయంకరమై యుండెను. ఒ

క్కముహూర్తములో దొంగలలో ననేకులు హతులైరి. తక్కినవారు పలాయితులైరి.

---

## మూఁడవప్రకరణము.

ఆపద్బాంధవు లయినమహనీయు లెవరో తమ కుయ్యాలించి వచ్చి సాయముచేసి ముచ్చులపీచమడఁచి తమ్ముఁ గాపాడిరని యిందుమణియు మల్లికాచంద్రికలు జరిగినచిన్నికయ్యంబువలన గ్రహించిరి గాని వచ్చినవా రెవ్వరో వా రెఱుఁగరు. దొంగలదాడివలనఁ గలిగినభయము రవంత శమించుచుండ గాదిలికూఁతురగు కర్పూరమంజరిమూర్ఛవలన నిందుమణికిని, మల్లికాచంద్రికలకును వెండియు మునుపటికన్న నధికమైనమనోవేదన కలిగెను. యోధులగంభీరభాషణంబులవలనఁ గాని, మృతినొందువారియార్తనాదమువలనఁ గాని కర్పూరమంజరికిఁ దెలివిరాలేదు. మల్లికాచంద్రికలు శైత్యోపచారములు చేయుచుండిరి. ఇందుమణి పక్కనఁ గూర్చుండి మీఁదఁ జేయి వైచి "బిడ్డా! తాతయుఁ దండ్రియు దగ్గఱలేనితఱి మహారణ్యమధ్యమున దిక్కుమాలి నీ వీలీల నాకు దవ్వగుదువని నెన్నఁడుఁ దలంపనైతినమ్మా. అక్కటా! నీదేహస్థితి యెట్లున్నదో తెలియఁజేయుటకై వైద్యులయిన లేరుగదా. దంట లగుసూరులు హతులైరి గదా. తల్లీ! తెల్లదామరవంటిమొగము నల్లఁబడినది. ఇఁక నేటిబ్రతుకు? ఏటి యాస? మల్లికా! నీప్రాణసఖి చైతన్యముదక్కి యున్నది. చంద్రికా! ఇంక నీ వెవ్వరితో నర్మోక్తు లాడుదువే?" యని పలువిధముల వగచుచు నొక్కముచ్చున నోడికగట్టుచున్నకన్నీటి సోనలచే నప్రయత్నముగ దుఃఖవర్షము పుత్రికపైఁ గురిపించుచుండెను.

మకరందుఁడు భిల్లులుపలాయితులైనవెనుక వాండ్రు తీసికొనిపోక విడచిన పెట్టెలను నగలను వెదకి తెమ్మని తనభటులకు నానతిచ్చి పట్టునకు బంధింపఁబడిన జయంతుని విడిపించి భుజాదండముమీఁదఁ గాయము తగులుటం జేసి కదలలేక జొటజొటఁ గారుచున్న నెత్తురు నాఁపుటకై ప్రయత్నించియు నట్లు సేయలేక సొక్కియున్న విజయసేనునిఁ గని లేవఁదీసి మాతులుని మొగముఁ జూచి యాశ్చర్యపడి జయంతుని నానవాలుబట్టి "ఎవరో యనుకొంటిని మీరా? ఆఁడువాండ్రతోఁ గూడ వచ్చిరా" యనియడిగిన వాఁడు "మేము స్త్రీలతోఁగూడ వచ్చితిమి. వారు గుడారములలో నున్నారు. అటకుఁ బోదము రండు" అని యుత్తరమీయ వారలందోడ్కొని పటకుటీరములకడ కరిగెను. అరిగి లోనఁ బ్రవేశించి చూచునప్పటికి మోహపరాయణయై కనుగవమూసికొని వివశయై పండుకొనఁబెట్టిన బంగారుబొమ్మవలె నున్న కర్పూరమంజరి ప్రియతమనేత్రములకగపడెను. ఇందుమణియు మల్లికాచంద్రికలును వానింజూచి తెల్లఁబోయిరి. సుదర్శనుఁ డగుసుదర్శననందనునిఁ జూచినతోడనే వారికందఱకుఁ బ్రాణములు లేచివచ్చెను. నూఱుమంది యాప్తబంధువులఁ జూచినట్లు వారికి ధైర్యముగలిగెను. కాని కర్పూరమంజరియవస్థ వారియుత్సాహమున కంతరాయము గలిగించెను. కుమారునకు గాయముతగిలినదని యిందుమణి యెఱుంగదు. నెత్తుటం దడిసినవస్త్రములతో నున్న కొడుకుం జూడ నిందుమణి వగపి నుమడించెను. ఆవిధముగా నున్న కుమారికం గనుఁగొని యీవిధముగా నున్న కుమారునిం గనుఁగొని యిందుమణి ధైర్యము చిక్కఁబట్టజాలక కొడుకుం గౌఁగిలించుకొని "కుమారా! మీయిరువురకేకకాలమందే యాపద సంభవించెఁగా" యని వాపోయెను. మకరందుఁడు జయంతునిఁ జూచి "విజయసేనునిగాయము మిక్కిలి గొప్పదిగాదు. వెంటనే వ్రణపట్టికలు వైచి చికిత్సఁ జేయుఁడు. అచిరకాలంబున గా

యము మాను" నని చెప్పి బాలిక యిట్లుండుట కేమికత మని యడి
గెను.

మల్లిక నేత్రములనుండి బాష్పము లురుల "దేవా! నాంగ
లం జూచి యీయామె మూర్ఛిల్లి పరవశయైనది. ఇంకం దెలివి రాలేదు.
కొనయూపిరి మాత్రము మున్నది. నాఁడు మాచెలి విద్యానగరమున
ధారుణజ్వరపీడిత యైనప్పుడు మీరె మాదేవికిఁ బుత్రిభిక్షము బె
ట్టిరి. నేఁడును మరల మీరే వచ్చిరి. మీరు వచ్చుట యీయామెకుఁ
బ్రాణము వచ్చుట మాకు శుభము వచ్చుట." యని పలికెను. "కు
మారా! ఈమె మేనఁ బ్రాణము లున్నవో లేవో నిశ్చయముగ జెప్పు"
మని యిందుమతి మకరందుని నడిగెను. మకరందుండు "అమ్మా! భ
యపడకుము. ఇది మూర్ఛ గాని మరణము గాదు. దురాత్ములైన
భిల్లులదుండగములచేత భయంపడి యీతీఁగబోఁడి మూర్ఛిల్లినది."
అని చేయి జూచి "నాడి స్పష్టముగా నున్నది. ఉచ్ఛ్వాసనిశ్వాస
ములు సరిగా నున్నవి. శబ్దముఁ జేయక మీరు దూరముగా నుండుఁడు
క్రమక్రమముగ నామెకుఁ జైతన్యము వచ్చు" నని పలికి వారికి
ధైర్యముఁ గొలిపి తా నామెపరిక్కను గూర్చుండెను.

మోహావస్థ క్రమక్రమముగా సడలుటచేతనో మకరందుని
హస్తస్పర్శసుఖముచేతనో బాలిక కాలు సేతులుగదలిచి కొంతసేపటి
కిఁ గనులు విచ్చిచూచి యెట్టయెదుట సాక్షాత్కరించిన మన్మథునట్లు
కూర్చున్న మకరందునిఁ గనుగొని సిగ్గుచెందిన మొగముఁగనులుమూసి
మరలఁ గన్నులుదెఱచి యాలావణ్యరసమునఁ దననేత్రమీనముల నో
లలాడించెను. అట్లాండొరులుదర్శన స్పర్శన సుఖముల ననుభవించు
చు వారిరువురుఁ గొండొకసేపు పరమానందసముద్రమునఁ దేలి యా
డుచుండ నంతలో మల్లికా చంద్రికలు వేఱొకపాన్పు నమర్చి మూర్ఛి
తయైనప్పుడు నేలఁబడియున్న కతమున ధూళిధూసరితమైన బాలిక

మేను దులిపి లేవఁదీసి యాశయ్యం బండుకొనఁబెట్టిరి. ఈయంతరాయము వారి కిరువుర కనిష్టమైనను సహింపక తప్పినదిగాదు.

జయంతుఁడు విజయసేనుని గాయమునకుఁ దగిన చికిత్సలఁజేసి రక్తస్రావముఁ గట్టించియతనినిఁ గూడఁబవ్వళింపఁజేసి నిహతులయిన పరిజనులకు నగ్నిసంస్కారవిధానము దుస్సాధ్యమని హతశేషుల చేతవారికిఁ దగినట్లు ఖననక్రియలు జేయించెను. పరిజనులలో గాయములు దగిలినవారికిసైతము చికిత్సలు చేయఁబడెను. పూరిపుల్లయైన దొంగలపాలు గాకుండ స్త్రీల కవమానము గలుగకుండఁ దమ్ముఁ గాపాడిన మకరందుని జయంతుఁడును దక్కినపరిజనులును బలుతెఱంగులఁగొనియాడిరి. తనకుఁ బుత్త్రపుత్త్రికాభిక్షము నాఁడు మకరందుఁడు ప్రసాదించె నని యిందుమణి పలుతెఱంగుల నాతని నుతియించె.

ఆనడిగేయి యానట్టడవిలో వారుండుటకుఁ గారణమేమని మకరందుఁడు ప్రశ్నించెను. అప్పుడు జయంతుఁ డిట్లనియె. "కుమారా ఎఱుఁగుదువుగదా హేమచంద్రుని యనుజుఁడును విదర్భరాజగు రాజవాహనునకల్లుఁడు నగుచిత్రభానుఁడు గలఁడని. కర్పూరమంజరి యాతని గారాబుకూఁతురు. చిత్రభానుఁడు శ్రీనగరమందున్నాఁడు. ఇందుమణీదేవియుఁ గర్పూరమంజరియు హేమచంద్రుని రాణియగు నరవిందాదేవిని, వాని గారాబుకొడుకు లగు విక్రమసేన హర్షవర్ధనులను జూచి పరామర్శించుట బంధుధర్మముగదా! అక్కారణంబున వీరు చిత్రభానుప్రేరితులై రాజవాహనుని యనుమతంబున వచ్చుటకిఁ బోవుచున్నారు. విదర్భేశ్వరుఁడు తగుపరిజనంబు నిచ్చి యశ్వములిచ్చి యందలములిచ్చి యఖిల ప్రయాణసాధనంబులనిచ్చి పెద్దవాఁడను లోకానుభవముగలవాఁడను గనుక నన్నుఁ దోడిచ్చి కాశ్మీరమునకు వీరిని బయనముచేసి పంపెను. మందభాగ్యుఁడనైన నేను వీరికీయవస్థఁదెచ్చితిని. సమరమున ముక్కాకలు దేరిన వీరులు నిష్క

రణముగా మ్రుచ్చులచేతఁజిక్కి చచ్చిరిగాని హతాశుఁడనైన నేను కడతేఱిన భాగ్యుండనుగదా. నీవు సమయమునకు రాకున్న క్రూరులు నీతిదూరులు నగుచోరులు మమ్మేమి చేసియుందురో! ఆర్తత్రాణపరాయణుఁడవైన నీచరిత్రము శ్లాఘాపాత్రము" అనవుఁడు మకరందుఁడు జయంతు నుద్దేశించి "అయ్యా! ఇందు మీతప్పులేదు. కాలవశమున నెటువంటి తేజమైన నొకప్పుడు మందగించును. అంతమాత్రమున మీ యట్టివారు మందప్రజ్ఞులుగారు. నేను మానవధర్మమును జేసితినిగాని శ్లాఘింపవలసినంత ఘనకార్యమేమియుఁ జేయలేదు. హేమచంద్ర మహారాజుమాట మీరిప్పుడు తలపెట్టుటం జేసి వారి దుర్మరణము నాకు జ్ఞప్తికివచ్చి నామనంబు గాసిల్ల జేయుచున్నది. పుంభావముదాల్చిన ధర్మదేవతగదా యతఁడు! హేమచంద్రాస్తమయమునఁ గాశ్మీర దేశము-కాశ్మీరమననేల? ప్రపంచము, చంద్రాస్తమయమైన నిశవలె నున్నది. నాతండ్రికి నతనికి నొక్కటే ప్రాణమని చెప్పవచ్చును. కాలగతి మరలించువా రెవ్వరులేరు."

అనిపలుకుచుండఁ గర్పూరమంజరియుఁ బెదతండ్రిం దలంచి కన్నుల నీరు నించెను. ఇతరవిషయములఁగూర్చి కొంత ప్రసంగమైన వెనుక జయంతుఁడు తమప్రయాణముమాట యెత్తి "మేము మరల విదర్భాపురమునకుం బోవలయునా, హతశేషపరివారముతోఁ గాశ్మీరమునకుఁ బోవలయునా యని నామనంబు సందేహడోలికలోఁ బడి యూఁగుచున్నది. బాలుఁడవైనను నీవు జ్ఞానమున వృద్ధుఁడవు. ఇందు నీ యాలోచనమేమో చెప్పుము" అని యడిగెను.

అంతలో నిందుమణి యందుకొని "పరిజనములో సగము కడతేరినది. ఈయల్పపరివారముతో మనము పయనము సేయఁజాలము. పైఁగా విజయసేనునకు గాయము తగిలినది. బాలిక మిక్కిలి భయవిహ్వలయైనది. కావున విదర్భకరిగి తగినంత పరివారము వెంటబెట్టు

కొని పోవుట మంచి" యని పలికెను. "అయ్యో! ఇంతలోనే వియోగముగలిగెనా" యని కర్పూరమంజరి తనలో ననుకొని నిట్టూర్పు విడిచెను. మల్లికా చంద్రిక లిందుమణితో నేకీభవించిరి.

అప్పుడు మకరందుఁడు వారితో నేకీభవింపక వారందఱు వినునట్లు జయంతున కిట్లనియె. అయ్యా! మీరిప్పుడు మాళవదేశపు సరిహద్దులలో నున్నారు. నాకడఁ దగినపరివారమున్నది. మీరు నావెంట నుజ్జయినికి రండు. అచ్చటనుండి మీకుఁ గావలసినపరిజనంబును బరికరములను నిచ్చి మాజనకుఁడు మిమ్ము సురక్షితముగాఁ గాశ్మీరదేశము జేర్పఁగలఁడు. అది కర్తవ్యము గాని వెనుకకుఁబోవుట సముచితము గాదు. ఈ రేయి మీరందఱు నాలోచించుకొనుఁడు. ఇంక నేను నా శిబిరంబున కరిగెద." అదివిని కర్పూరమంజరి మల్లికం జేరఁబిలిచి చెవిలో "ఓసీ! తెక్కలికాండ్రు మరల వత్తురేమో? ఆయన నిందే యుండుమని చెప్పవే" యని మెల్లగఁ బలికెను. "అట్లకాక" యని మల్లిక మకరందు నచ్చటనుండుమని ప్రార్థించెను. ఆవేడికోలు కర్పూరమంజరీముఖంబుననే వచ్చినదిగా భావించి మకరందుఁ డియ్యకొనియె. నిద్రించుటకు వారు ప్రయత్నించిరిగాని, వారికందఱకుఁ ముఖ్యముగాఁ గర్పూరమంజరికిఁ గనులుమూసినతోడనే వెఱపుఁగొలుపుకఱకుటెఱుకల మోటురూపములు గనబడుటంజేసి యామె పలుమాఱు త్రుళ్ళిపడి లేచుచువచ్చెను. మల్లికాచంద్రికలు గుఱ్ఱుపట్టి నిద్రించిరి. తెలతెల వేగుళ్లప్పుడు మకరందుఁడు తన సైనికులలోఁ గొందఱ నచ్చట నునిచి తక్కినవారితోఁ గలిసి తన నెలవున కరిగెను.

అతఁడు చనినపిదప నిందుమణియు జయంతుఁడు మున్నగు వారందఱుఁ గలిసికొని తమప్రయాణ విషయమును జర్చించి మకరందునిమాటలు సహేతువులుగా నున్నవని తలంచి యాతనివెంట నుజ్జయినికిఁ బోయి యటనుండి శ్రీనగరమునకరుగుట సముచితమని

నిశ్చయించి యావార్తనతని కెఱింగించిరి. ఈనిశ్చయము చెవినిబడినతో డనే కహ్లారమంజరీ మకరందుల యానందము మిన్నుముట్టెను. కొంతకాలమైన మరల వనోద్యానావలోకన సుఖము సంప్రాప్తమగుటచే వారిహృదయములు ప్రశాంతములయ్యెను. అమఱునాఁడు కహ్లారమంజరీ ప్రముఖస్త్రీజనమును, విజయసేనుని, జయంతాదులను దోడుకొని మకరందుఁడు తనపరివార మంగరక్షకగా నచ్చోటు గదలి యుజ్జయినికిఁ బయనమయ్యెను.

మకరందుఁడు మార్గమధ్యమున వనవాసులు మిక్కిలివినయంబునఁ గొని తెచ్చియిచ్చు, నెమలిపింఛములు, పులికళాసములు, జింకకొమ్ములు, తేనెపెఱలు మొదలగు నూడిదల నాదరపూర్వకంబుగ నందుకొనుచు వారు గావించువిన్నపములు సావధానుఁడై యాలకించుచుఁ జెంచులుగావించు విపరీతనృత్యములఁ గనుంగొని యానందించుచు నాకులు, చిగురులు, పండ్లు గాయలు దిని దిగంబరులై వృక్షశాఖలు నిలయంబులుగ మహాతపశ్శాలుల విధంబున నుండెడునానా విహంగముల సందర్శించి యక్కజంపడుచు బయనముచేసెను. కహ్లారమంజరియు నమాయిక వేషభాషలుగల చెంచుకన్నియలంజూచి యచ్చెరువడుచు నవ్యక్తమధురములైన పులుఁగుల గానములకు మెచ్చుచు నల్లజింకకొమ్ముకొనయందుఁ దనకన్నుఁ జేర్చి దురదవోవ రాచుకొను నాఁడుజింకంగని కన్నులు చరితార్థములైనవని తలంచుచు సింహవ్యాఘ్రాది క్రూరసత్వంబుల బొబ్బలువిని యులికిపడుచుఁ బ్రకృతిసౌందర్యమంతయుఁ గన్నులం జుఱ్ఱుచు మకరందుని వెంటనరిగెను. ఎడనెడ విడిసినతావుల గూఫులు వీణబూని యామెల నాఁగ దాని నాదములోఁ దన కంఠస్వరముగలిపి యేదికంఠమో యేది వీణానాదమో తెలియనట్లు వినువారల మేనులు గగుర్పొడుచునట్లు వారు తన్మయత్వము నొందునట్లు పాడి పరిజనంబులకును, జెలి

మిక తైలకును ముఖ్యముగా మకరందునకును మార్గశ్రమ మపనయించుచుండును. మకరందసాహచర్యంబునఁ గర్పూరమంజరికిని, గర్పూరమంజరి సహవాసంబున మకరందునకును మార్గాయాసమున్నది కనఁబడలేదు. ఉజ్జయిని సమీపించినకొలఁది సంతోషముకలుగుటకు మాఱుగాఁ బరస్పరవియోగము గలుగునేమో యని భయముపొడమ జొచ్చెను. గమ్యస్థానము నానాఁటికి దవ్వయియున బాగుండునని వారికిఁ దోఁచెను. బౌద్ధుఁడైన మకరందుఁడు జీవహింసావిముఖుఁడుగావున నొక్క జీవజంతువునైనఁ జంపక శాఖాహారముతోడనే కాలము గడపెను. భూతదయాపరుఁడైన యాతని నియమంబులు బాగున్నవని కర్పూరమంజరియు మాంసాహారము వర్జించెను. వ్యసనంబులలో నొక్కటియై పాపహేతువైనవేఁట నారాజనందనుఁడు చిన్ననాఁటంగోలె వర్జించెను. మనుష్యులకు హానిసేయు క్రూరమృగంబులం దక్క నాహారమునిమిత్త మతఁడెన్నఁడు నేజంతువును జంపి యెఱుంగఁడు.

ఈవిధంబున బయనంబు చేసి కతిపయదివసంబులకు వారు తమ కన్నిదినము లాతిథ్యమిచ్చి చెక్కుచెదరక తమయింటికిఁ జేర్చినఁ వనలక్ష్మియొద్ద సెలవుగైకొని యుజ్జయినీ పురలక్ష్మిం జేరిరి. కుమారుని రాకకు సుదర్శనుఁడు సంతసించి వానింగాఁగిటఁ జేర్చి కర్పూరమంజరీప్రముఖస్త్రీజనంబుల రాక విని యానందమొంది వారల సగౌరవంబుగా సాదరంబుగా సస్నేహంబుగాఁ దోడ్కొనిరమ్మని చంద్రప్రభా దేవినిఁ బంపెను. ఆమెయు శుద్ధాంతకాంతాజనోచితమైన గౌరవాదరంబులు నెఱపి వారలనంతఃపురము బ్రవేశింపఁజేసెను. ఇందుమణి రెండుమూఁడుదినములైనతరువాతఁ దమ్ముఁ గాశ్మీరమంపుమని చంద్రప్రభాదేవీముఖంబున సుదర్శనునకు విన్నవించెను. అటనుండి పోవుటకుఁ గర్పూరమంజరి కిష్టములేదు. పంపుటకుఁ మకరందుని కిష్టము

లేదు. అటమీఁదఁ జతుర్భాను పుత్రికకు దేహపీడయుఁ మనఃపీడయుఁ గలుగఁజొచ్చెను. పయనమునకొన్నప్పుడెల్ల నామెకొకనాఁడు తలమేఱు, మఱియొకనాఁడు బద్ధకము వేఱొకనాఁడు నిద్రాభావము లన్యదినంబున మనోవికారము మొదలగు విపరీతచేష్టలు పొడమెను. మకరందుఁడు వైద్యుఁడగుటచేఁ బ్రతిదినమామె చేయిజూచి రోగము చిన్నదైనను బ్రశ్నలధికముగ నడిగి పేరునకేదో మందిచ్చి చికిత్సచేయుచుండును. అతఁడు సన్నిధి నున్నంతసేపు, చేయి చూచునంతసేపు, మాటలాడునంతసేపు ప్రేమరసము జాల్కు చూపులు చూచునంతసేపు నామె కేవిధమైన బాధయుఁ గనఁబడదు. అతఁ డావలకేగినతోడనే మరల నెప్పటి నొప్పులు తలయెత్తఁ జొచ్చెను. మల్లికాచంద్రికలు మాత్రము రోగకారణ మెఱుఁగుదురు. ఇందుమణి యది తెలియక తామేదో దుర్ముహూర్తమున విదర్భాపురము వెడలిన ట్లొకమాఱు దలంచును. ఎఱుకలసాని యేదో క్షుద్రదేవతను బ్రయోగించియుండునని యొకమా ఊహించును. అడవిలో నేదోపిశాచ మావహించియుండునని యొకసారి తలపోయును. ఉజ్జయినీ జలమామెకు సరిపడలేదని యింకొకసారి భావించును. ఎట్లయిన శ్రీనగరమును ద్వరగఁ జేరుట మంచిదని యామె నిశ్చయించి సత్వరముతమ్ముఁ బంపుమని యామె సుదర్శనునకు వర్తమాన మంపెను. కొన్ని యేనుఁగులు గుఱ్ఱములు రథములు నందలములు సిద్ధముచేయించి చోరులు మఱి యేకూరులు దుండగములు చేయుటకవకాశము లేనంతబలము నిచ్చి సుదర్శనుఁడు వారిం బంపుమని మకరందున కానతిచ్చెను. మకరందుఁ డట్లుచేసెను.

కర్పూరమంజరి మనస్సునుజ్జయినిలో మకరందుని కడఁగుదువబెట్టి శరీరముమాత్ర మందలములోఁ జేర్చెను. మకరందుఁడు తన మనస్సు నామెకు సాయమంపి నిర్మనస్కుఁడై నిర్విణ్ణుఁడై చాల

దూరము వారిని సాగనంపి జయంతునికడ సెలవుపుచ్చుకొని విజయసేనుని బలుమాఱు పలుకరించి క్షేమవార్త నంపుచుండుమని చెప్పి స్వగృహాభిముఖుఁ డయ్యెను. నదీప్రవాహమున కెదురువోవు నావవలె నతనిమేను బహుప్రయత్నమునఁ గాని ముందుకు సాఁగిపోవదయ్యె.

---

## నాల్గవప్రకరణము.

---

ఆశ మనుష్యునకు మైకము గల్గించి వివశునిఁ జేయుటలో మద్యమును మించి యుండును. ఆశామద్యపాయి యొడలుమఱచి తిరుగును. తనతలలో వేయిపన్నుగడలు పన్నును. ఆకసంబున నందలములెక్కును. సముద్రములో సౌధములఁ గల్పించును. మహావాయుపథమున మనస్సును సంచరింపఁ జేయును. అదియే వానికి జీవగఱ్ఱ. ఆశయను గుఱ్ఱము నెక్కిన వాఁడు మహావేగముగఁ బదునాల్గులోకములు సంచరించి యది మొట్టకేలకు నడువలేక కూలి తన్నుఁగూల్చినపుడు భగ్నమనోరథుఁడై కూలి మరల వెనుకకుఁబోవుట కవకాశములేని యపుడు గాఢపశ్చాత్తాపమునొంది నాశనము నొందును. తాఁ జెడుటయేగాక తన సంబంధముగలవారి నందఱను జెఱుపును. ఆశ విషముకన్న దహనముకన్న దారుణమైనది. ఇదివీరికి వారికనక యెల్లవారికి వారివారియవస్థలకుం దగినట్లు లాశ్రయమై దుస్తరమగు జంబాలపటలమున దింపును.

హేమచంద్రుని మరణమునకుఁ బూర్వము దండపాణి రాజకుటుంబమునకు మిక్కిలి కూర్చువాఁడు. తనకుమారికయైన మణిమాలికను హేమచంద్రుని జ్యేష్ఠనందనుఁడగు విక్రమసేనునకిచ్చి వివాహము చేయవలెనని ప్రయత్నించుచుండెను. కాని నాఁడుగుహలో

హరిశర్మ విక్రమసేనుఁడు మందభాగ్యుఁడనియుఁ జిత్రభానుపుత్త్రకుఁ డగు విజయసేనుఁడు మిక్కిలి యదృష్టవంతుఁడనియుఁ జెప్పి మణిమాలికను విజయసేనునికే యిమ్మని హితోపదేశము చేసినదాదిగా దండపాణి మనస్సు నావమీఁదిసూచీ యంత్ర ముత్తర దిక్కువైపు దిరిగియుండునట్లు నిరంతరముఁ జిత్రభానునివైపు దిరిగియుండెను. చిత్రభానుఁడు కాశ్మీరదేశాధీశ్వరుఁడు గావలెననియు, వానిసూనుఁడు విజయసేనుఁడు యువరాజు గావలెననియుఁ దనకూఁతురు మణిమాలిక మొదటయువరాజపత్నియై, పిమ్మటఁ గాశ్మీరరాజ పట్టమహిషిగావలెననియుఁ గోరి యామనోరథసిద్ధికి నేకార్యము లవశ్యములో వానిం జేయుటకును నేదారింబోయిన గమ్యస్థానముఁ జేరవచ్చునో యాదారింబోవుటకును నిశ్చయించుకొనెను. కాశ్మీరరాజ్యసైన్యములు వానియధీనమం దుండుటచే సేనాచక్రమునకెల్ల నియామకుఁడయిన తనగీచినగీటు దళములు దాఁటవనుదృఢవిశ్వాసమున నెల్లయెడలఁ దాను చిత్రభానునకుఁ బాసటయైయుండ నిశ్చయించుకొనెను. దండపాణితమ్ముఁ డగువజ్రపాణి చిన్నసేనాపతియై మొదటినుండియు హేమచంద్రునిఁ గొలిచి యుండియుఁ జిన్ననాఁటంగోలెఁ గర్పూరమంజరిపైఁ గన్నువైచి తన్నిమిత్తము చిత్రభానునియెడఁ బక్షపాతము గలిగి యుండెను. అహల్యాసంగమాభిలాషియై తొల్లి వజ్రపాణి కోడియై మునిగృహముఁ జొచ్చినట్లు, కర్పూరమంజరీసమాగమముఁగాంక్షించి యీవజ్రపాణి చిత్రభానునియింటికుక్కయై తిరుగుచుండెను. అపరమమూర్ఖుఁడు కర్పూరమంజరి తనపై వలపునిలుపుచున్నదో లేదో తెలిసికొనఁజాలక చిత్రభానునిపాదసేవ యనునోరి నిచ్చినఁ గన్య యన్యవశము గాక తనచేఁజిక్కు నని యూటలూరుచుండెను. స్వసుఖాభిలాషియై తమ్ముఁడును, స్వపుత్రికాసుఖాభిలాషియై యన్నయును జిత్రభానునికనుసన్న మెలంగుచుండిరి. అయన్న

దమ్ము లిరువురు బ్రతిదినము రాత్రులు చిత్రభానుని నెలవున కరిగి యతనితోఁ గాశ్మీరరాజ్యసంబంధము లైన ప్రసంగములు సేయుచుండురు. రంధ్రాన్వేషి యైనచిత్రభానుఁడు కాశ్మీరరాజ్యమందలి లోటుపాటులు దౌర్బల్యములు వారివలనఁ దెలిసికొనుచుండును. రాజకుటుంబముపై నిర్హేతుకముగా వారు పూనినద్వేషాగ్ని ని రుద్రభట్టు తనవాక్సమిధలచేతఁ బ్రజ్వలింపఁ జేయుచుండును. ఈయిరువురఁ దన వశవర్తులుగాఁ జేసికొనుటతోఁ దనివినొందక చిత్రభానుఁడు శ్రీనగరవాసులలో ముఖ్యపురుషులఁ దనకడకు రావించియు వారియిండ్లకు స్వయముగాఁ బోయియుఁ, బూర్వముతన్న హేమచంద్రుఁడు నగరమునుండి వెడలనడఁచి నప్పుడుగాని, తరువాతగాని దనయెడ నెంతమాత్రము దోసములేదనియు దురాత్ము లెవ్వరో మహర్షితుల్యుఁడైన తన యన్నను సంహరించిరనియు భ్రాతృహననదోషము తన కారోపించిన దురాత్ములు తత్కార్యముచేసిన వారిదుర్గతులకే పోవుదురనియు నొక్కివక్కాణించి యొట్టుపెట్టుకొని ప్రమాణములుచేసి వారిలోఁ గొంతఱిమనస్సులు తాననిర్దోషి యని నమ్మునట్లు జేసెను. కొందఱతని మాటలు నమ్మినను మఱికొందఱు వాని బలుకులకుం దలయూఁచి యట్లె కావచ్చునని పలికి మనసులెప్పటియట్ల నుంచుకొనిరి.

చిత్రభానుని నంతఃపురికి రానిచ్చినందునను, నదిచాలక నగరమున నుండనిచ్చి నందునను వానియాలు బిడ్డలువచ్చితన్ను సందర్శించుటకు సమ్మతించినందునను నరవిందాదేవిమీఁద మణివర్మకుఁ బట్టరాని కినుక పొడమెను. కొన్ని దినములతఁడు రాజ్యవ్యాపారములం జూడనే లేదు. అంతఃపురి కరుగనే లేదు. ఇల్లు కదలనే లేదు. వైదేశికులగు రాయబారులకుఁ గొన్ని ముఖ్యాంశములపైఁ దగినయుత్తరములీయ లేదు. అరవిందాదేవి రాచనగరునకు రమ్మని యంతఃపురపరిచారకుల చేతను, నిగమశర్మచేతను మాధవసేనునిచేతను నెన్నోసారులు వర్త

మానమంపినను మణివర్మ "యిదేవచ్చెద నదేవచ్చెద శరీరమస్వస్థము గానున్నది. పెద్దవాఁడనగుటచే మునుపటివలె రాజ్యవ్యాపారముల యందు బుద్ధి ప్రసరించుటలేదు. అని యెన్నోవంకలు చెప్పి తప్పించు కొనుచుండును. కాని యాతని మనంబుననాశ్రయించిన తిక్క తిరుగ దయ్యెను. అరవిందాదేవి యెట్టకేలకు మణివర్మ తనపై బిట్టలుక బూనినాఁడని యూహించి యొకనాఁడు విక్రమసేనహర్షవర్ధనులను బి లిచి "మీరిరువురు రథారూఢులై మణివర్మయొద్దకుఁ బోయి యతని యలుకఁదీర్చి మననగరునకుఁ గొని రాఁగలరా నాయనలారా!" యని యడిగెను. "తప్పక దీసికొనివచ్చెద" మని వా రుత్తరమిచ్చి మఱు నాఁడుదయమున సముచితవస్త్రాలంకారములు ధరించి, తల్లికి వందన మొనర్చి స్యందనమెక్కి నందను లిరువురు తగుపరివారము వెంటఁ గొని కాశ్మీరరాజ్యవజ్రవర్మమగు మణివర్మగృహమున కరిగిరి. వారి రాకవిని మణివర్మ విస్మయమునొంది "అయ్యో! నామౌఢ్యమువలన నతిసుకుమారులగు రాజకుమారు లిల్లువెడలి రావలసివచ్చెఁ గాదా యని నొచ్చుకొని విసవిస మేడదిగి యెదురువోయి యిరువుర బిగికౌఁ గిటఁ జేర్చి ముద్దులాడి చేతితోఁ దలమీఁద వీపుమీఁద నిమిరి "నాయనా! మిమ్ము నేను నకారణముగా మిక్కిలి శ్రమపెట్టితిని. ఈ మందభాగ్యుని కతమున మీ రంతఃపురము వెడలవలసివచ్చెఁగదా! ఛీ! నాబతుకు కాల్పనా" యని మనంబున హేమచంద్రునిం దలఁచి బిగ్గరగా వాపో యినవారు శోకింతురని శంకించి సమ్మలిక నెమ్మనమున నడంచు కొని వారి నుచితాసనంబులఁ గూర్చుండఁబెట్టి సేమమడిగి గౌరవించి వచ్చినపని యేమనియడిగెను.

అడుగుటయు విక్రమసేనుఁడు మెల్లగ నిట్లనియె. "తాతగారు! నేను రాజును మీరు మంత్రియను సంబంధముచేత నిచ్చటికి రాలేదు. మాతండ్రిగారికి మీరు పితృప్రాయులై యుండిరి. మాకు మీరెపితా

మహాలు మీరె మాతామహులు మాకు నిజమైన పితామహుఁడు లేనే లేఁడు. మా తాతామహుఁడు మహేంద్రదేవుఁడు మాయమ్మను మమ్మను మా తండ్రిగారి మరణానంతరమునఁ బరామర్శచేసి తనరాజ్యమున కరిగెను. ఆపత్సముద్రమును జెలియలికట్టయై నిరోధించి శుభపరంపరలనొడఁగూర్చుటకై మిమ్ముం జూపి మాజనకుఁడు స్వర్గస్థుఁడయ్యెను. రాజ్యమునకు రాజులేని వెలితి, మాకుఁ దండ్రిలేని వెలితి నీవలనం దీఱునని మేము పుట్టెఁడాస పెట్టుకొని యుంటిమి. అట్టియాసలెల్లఁ జెడిపోయినవి. నవవైధవ్యదుఃఖభారమున నడఁగిపోయిన మాయమ్మకు మీ దర్శనాభావ మంటేసినపుండున నుప్పుపెట్టినట్లయినది. ఇంతలోనే మీకు మాపై నింత యనుగ్రహము తప్పియుండురని మేమెన్నఁడుఁ దలంపలేదు. మాధవసేనుఁ డొక్కఁడే మంత్రాలోచనముచేసి కార్యభారము నిర్వహింపఁజాలఁడు కావున నెప్పటియట్లు మీరు రాజకార్యంబుల నిర్వర్తింపవలయునని నేను వేఁడుచున్నాను. మాయమ్మ మిమ్ము రమ్మని వేఁడుచున్నది." అనుచుండ నంతలో హర్షవర్ధనుఁడందుకొని "తాతగారూ! మీరు రాకపోవుటచేత మాకోట చిన్నపోయినది. మీరిచ్చటికి రానియెడల మేమే మీయింటిదగ్గఱనుందుము. మమ్ము గెంటివేసిన నిక్కడనుండి వెళ్ళము" అని ముద్దులొలుకఁ బలికెను. అంతకుముందు విక్రమసేనుని పలుకులకే సగము కరఁగిన యయ్యమాత్యుని హృదయము సహజమధురములై జాలిగొలుపు హర్షవర్ధనుని పలుకులకు నీరైపోవ మణిసర్మ లేచి యిద్దఱిబిడ్డల మరల కౌఁగిలించుకొని "నాచిన్నియన్నలారా! ముద్దులమూటలగు మీమాటలు వినినవాఁడు మీ చెప్పినచొప్పునఁ జేయకయుండగలఁడే? మీ నుడువులకుఁ గరఁగని డెందము ఱాయిగాని డెందము కాదు. నేనిప్పటికి మీవాఁడనేగాని యన్యుఁడను గాను. విధినిగ్రహమునకు నున్న ప్రాణము నామేనున నెంతకాలము నిల్చియుండునో యంతకాలము

నేను మీ క్షేమమే కోరుచుందును. ఎందుకట్టవలెనన్న యీ దేహ మక్కఱకువచ్చినంతకాలము మీనిమిత్తమె పనిచేసి మీనిమిత్తమె వినియోగింపఁబడును. ఈదేహమే మీకవసరమైన పక్షమున నిర్వ్యాజారముగా నేను దీనిని మీకు సమర్పింతును. కాని నాఁడు నాచేసినయుపదేశము సరకుగొనక మీతండ్రి స్వబుద్ధిచే మరణంబు దెచ్చుకొనియె. నేఁడు మీతల్లి నాపలుకులు ద్రోసిపుచ్చి చిత్రభానునిఁ జేర్చినది. మీరు పసికూనలు కార్యాకార్యము తెలియఁగరు. మీపినతండ్రి దురాత్ములలో నగ్రగణ్యుఁడు. కొలువువార్ల నితఁడు వైదర్భులం గొందఱఁ జేర్చి కుట్రపన్ని మీతండ్రిం గడతేర్పఁజూచెను. అయ్యది నేనును మాధవసేనుఁడును మహాప్రయత్నంబునఁ గనిపెట్టి లిఖితమూలకమగు సాక్ష్యముతోఁగూడ మీతండ్రి కెఱిఁగించితిమి. దానంజేసి మీయయ్య చిత్రభానుని దేశమునుండి వెడలనడఁచెను. అనంతరము హరిశర్మయను దురాత్మునిఁ బంచి యితఁడే మీజనకుని వంచించి చంపించెను. చంపించెనననేల! స్వహస్తములతో నితఁడే చంపె నని నానమ్మిక. నేను కన్నులారఁ జూడలేదుగాని, మీపినతండ్రి స్వభావమునుబట్టి యితఁడే స్వయముగాఁ జేసినాఁడని యనుచుంటిని. రాజభక్తిపూరితమైన మనస్సుతో నే నిట్లనుచున్నాఁడను గాన నాయాలాపములలోఁ బాపమున్నయెడల సకలపాపపరిహర్తయగు నుమాభర్త నన్ను క్షమియించుగాక! మీపినతండ్రి తేనెబూసినకత్తి. వానిమాటలనియెడి నురులలో నెట్టివారు దగుల్కొనుచుందురు. మేఁక వన్నె పులి. మాటలలోఁ దేనియలుట్టిపడుచుండును. హృదయము విషకుంభము. అట్టివానిని జేరనిచ్చుటంజేసి నామాట చెల్లదు గదాయని నాచేసిన హితోపదేశములు నిరర్థకములని నే ననవచ్చుటలేదు. అంతియేగాని మీ మీఁదఁగాని మీ యమ్మమీఁదఁగాని నాకు రవంతయు నలుకలేదు. ప్రత్రికకుఁ నరవిందాదేవికి నెట్టిభేదములేదు. ఇదె యామె

దర్శనము జేయ మీతోడ వచ్చుచున్నాఁడ'' నని మేడమీఁదికిఁ బోయి తలపాగయు నిలువుటంగియుఁ దాల్చి బిడ్డలతోఁగలిసి రథ మెక్కి రాజాంతఃపురమునకుఁ బోయి యరవిందాదేవిని సందర్శిం చెను. ఆదేవియు నతనికి నమస్కరించి తనవలనఁ దప్పులున్న క్షమి యింపుమని ప్రార్థించి యెప్పటియట్ల రాజకార్యంబులఁ జూడుమని కోరెను. మణివర్మ విక్రమసేనునితోఁ జెప్పినట్ల యామెతోఁగూఁడ జెప్ప కడపట నిట్లనియె. "తల్లీ! నాకన్న నీవు జిన్నదానవు. నీబిడ్డలు పసిపాపలు. చిత్రభానుఁడు బెబ్బులులకన్న సింగములకన్నఁ గోడె త్రాచులకన్నఁ గ్రూరుఁడు. నిజముగా నతఁడు దానవుఁడుగాని మాన వుఁడుగాఁడు. అతఁడు నీకు నీబిడ్డలకు హానిసేయఁజూచు. దండపాణి యు వజ్రపాణియుఁ బ్రతినిశియు వానికడకుఁబోయి యిక్కడివృత్తాం తమంతయు వాని కెఱిఁగించుచున్నారనియు వారే వానికి వేగులవాం డ్రైగ నున్నారనియు నాగూఢచారులవలన నే వినియుంటిని. సైన్యమంతయు వారియధీనములో నున్నది. అందుచేత మనము జాగ్రత్తగా నుండవలయును.'' అనవుడు నరవింద "తండ్రీ! నాచేసిన పొరపాటు క్షమింపుము. నాతోడికోడలు, కర్పూరమంజరియు రేపో నేఁడో వత్తురు. వారువచ్చి నన్నుఁజూచినతరువాతఁ గార్యపద్ధతియం తయు నీచెప్పినచొప్పున జరుగుఁగాక! ఇఁకమీఁద నీగీచినగీటు దాఁటు దానను గాను. నేను నీబిడ్డను. నాబిడ్డలు నీమనుమలు నన్నును నాయ నుంగునిసువ్రుబ్బను నీకప్పగించి కాదె మహారాజుగారు స్వర్గస్థులైరి. అని యనివార్యమై వచ్చు కన్నీటిసోనల నాపలేక వలవల నేడ్చెను. మణి వర్మయు దుఃఖము నాఁపలేక వేఁడికన్నీళ్ళువిడిచి "అమ్మా! నాశక్తి వంచనలేక నేను పాటుపడియెద. అవసరమైన మీనిమిత్తము నాప్రా ణములైన నర్పించెద'' నని యభయప్రదానమిచ్చి కొన్నియితర విష ముల మాటలాడి సెలవుగైకొని యింటికిఁబోయెను.

---

# అయిదవప్రకరణము.

---

ప్రియజనవిరహము దుస్సహము. అది జీవితమును దుఃఖభాజనముఁ జేయును. ప్రియజనవియోగమైనకాలమున భానుఁడు సహస్రమయూఖములతో నైజతేజమున వెలుగుచున్నను జగమంధకారమై తోఁచును. చలువలు వెదఁజల్లుచు మింటఁ జందమామ వెలయుచున్నను జంతువు దుర్భర సంతాపము నొందుచుండును. సౌఖ్యప్రదములగు వస్తువులన్నియు దుఃఖప్రదములట్లు కనఁబడును. ఉజ్జయినినుండి బైలుదేరిననాఁటఁగోలెఁ గర్పూరమంజరి సరిగా నన్నము ముట్టక, నీరు ద్రావక, నిదుర వోవక, మునుపటియట్లఁ గలకలలాడు నెమ్మోముతో సఖీజనమును బలుకరింపక విధిలేక పయనము సేయుచుండెను. ఆమె యందలమందున్నను సెజ్జమీఁదనున్నను మకరంద నామస్మరణమే సేయుచుండును. పరమయోగిని కన్నులుమూసి పరమేశ్వరుని ధ్యానించునట్లు మకరందుని సుందరమూర్తిని ధ్యానించుచుండును. కన్నులు మూసిమూసి తన్మయత్వముజెంది మైమఱచి తనమనోనాథుఁ డెట్టయెదుటనున్నట్లు భావించుకొని చేతులుచాఁచి బయలు గౌఁగిలించుకొనును. అత్తఱి నెవ్వరయిన దాఁపుననున్నయెడల వారింజూచి సిగ్గుపడును. తానొక్కతెయున్న హాయని నిట్టూర్పు విడుచును. ఇత్తెఱంగున నత్తలిరుఁబోఁడి మకరందుని వియోగమునకుఁ జిత్తమున నుత్తలపడుచు నెట్టెటో తల్లితోడను నెచ్చెలులతోడనుఁ గలసి పయనముచేసి తనువు శ్రీనగరముఁ జేర్చెను.

జయంతుఁడు తమరాక ముందుగాఁ జిత్రభానునకుఁ దెలియఁ జేసియున్నకతమున నాతఁడు దారపుత్రుల నూరుబయట నెదుర్కొని సంభావించెను. జయంతుఁడు వనములో దొంగలుకొట్టుట మగంటిమిగల జంట్లుమూలుట, విజయసేనుఁడు గాయపడుట, కర్పూరమంజరి

మూర్ఛిల్లుట, మాలవ రాజనందనుఁడు సాయపడి వారినపాయము నుండి యుద్ధరించుట, పిమ్మట నుజ్జయినిలోఁ గొంతకాల ముండుట, సుదర్శనుండాదరించి తగుపరిజనమునిచ్చి పంపుట మున్నగువృత్తాంత మంతయుఁ జిత్రభానునకు విన్నవించెను. అదివిని యతఁడు విస్మయం బును విషాదంబునుబొంది మకరందుని తోడ్పాటునకును, సుదర్శనుని యాదరంబునకును దద్దయుసంతసించి వారినందఱఁ దన గుడారంబుల యంద యారేయినిలిపి వారిరాక మఱునాఁ డరవిందాదేవికిఁ దెలియ బఱచెను.

ఆ దేవి వారిరాకకనుమతించుటయు నాఁటియపరాహ్ణమున నిం దుమణి కర్పూరమంజరిని విజయసేనునిఁ బరిచారికాజనమును వెంటఁ బెట్టుకొని రాచనగరునకుం జనియెను. కర్పూమంజరి కంటికి మొగసా లలు, కొలువుకూటములు కళాహీనములై కానఁబడ నామె మొగము గాఢవిషాదమును దెలుపుచుండెను. దేవింజూచి యందఱు దుఃఖా క్రాంతచిత్తులైరి. కర్పూరమంజరి చిన్ననాఁటనుండియు హేమచం ద్రునిఁ దండ్రిగ నరవిందను దల్లిగ భావించి వారు కన్నబిడ్డయట్లై పె రుఁగుటం జేసి హేమచంద్రుని మృతికిఁ దన పెదతల్లిదురవస్థకు నామె యెంతేని యుమ్మలికముఁ జెందెను. అరవిందాదేవి తనదుఃఖమును మాటలచేతఁగాక బొటబొటదొరఁగు బాష్పములచేతనే వెలిబుచ్చెను. విజయసేనుఁడు విక్రమసేన హర్షవర్ధనుల నోదార్చెను. ఇందుమణి సమయోచితవచనములఁ దోడికోడలిని సమాశ్వాసించెను. పరామర్శ ముగిసినపిదప నందఱు మరల గుడారములకుఁబోవఁ బయనమగుచుం డ నరవింద కర్పూరమంజరిం బిలిచి "బిడ్డా! నీవిచ్చట నిలువుము. మీయమ్మయుఁ దక్కినవారుఁ బోయివత్తురుగాక!" యని పలికెను. ఇందుమణియుఁ గర్పూరమంజరి యచ్చటనుండుటకు సమ్మతింప నా మె పెదతల్లికడ నిలిచి పోయెను. తక్కినవారందఱు గుడారములకుం

జనిరి. ఆబాలిక యంతిపురినుండుట విక్రమసేన హర్షవర్ధనులకును సంతోషకరముగా నుండెను. అరవిందాదేవి నిరంతరము భర్తృమరణదుఃఖమునఁగడుంగడు గుందుచుండుటంజేసి యామెదుఃఖోపశమనార్థము కర్పూరమంజరి పురాణములనుండియుఁ బూర్వరాజుల చరిత్రములనుండియు మనోహరములైన కథలనేర్చి పెదతల్లికిఁ జెప్పుచుండును. విక్రమసేన హర్షవర్ధనులుగూడ మిక్కిలి తమకముతో వానినాలకించుచువచ్చిరి. ఒకసారి తనప్రయాణమును గుఱించి ముచ్చటించి త్రోవలోఁ జెంచుపడఁతి చెప్పిన యెఱుక తెలిపి యామె వారినినవ్వించెను. వెంటనే యానడిరేయి జరిగినభిల్లుల బందెపోటుజెప్పి వారందఱికి భయము గొలుపును. ఒకతూరి విదర్భాపుర వృత్తాంతములు, మఱియొకసారి యుజ్జయినీ విశేషములు దెలిపి వారినానందింపఁ జేయును. ఒకసారి మకరందుని సాహసౌదార్యగుణములు వర్ణించి వారి వీనులకువిందు సేయును. మఱియొకతూరి హేమచంద్రుని మరణవృత్తాంతము సవిస్తరముగా నర్మదనడిగి దెలిసికొని పెదతండ్రికంత దుర్మరణము సంభవించినందుకు బిట్టువిచారించుచుండును. విద్యావతి యగుటచే నాబాలిక శోకవిహ్వలయగు నరవిందకు నప్పుడప్పుడు వేదాంతవాక్యములుచెప్పి యామెయలమట నుడిగింపఁ జేయును. ఈవిధముగాఁ దనకుశక్యమైనంతవఱకుఁ బెదతల్లిమనస్సునుండి శోకాంధకారమును వెడలద్రోలుటకు సర్వప్రయత్నములఁ జేయుచుండును. అందుచే నరవిందాదేవి కర్పూరమంజరినివిడిచిపెట్ట నిచ్చగింపఁదయ్యె.

విదర్భాపురమునుండి తనకుటుంబము వచ్చినవెనుకఁ జిత్రభానుఁడు రమారమి యొకవారముదనుక గుడారములయందు బసచేసి పిమ్మట దండపాణిప్రముఖులు తననిమిత్తము మరసి సమకూర్చిన భవనమునఁ గాపురముండ వెళ్ళెను. ఆగృహము విశాలమైన యావరణము గలిగి వెనుకప్రక్క చిన్నయుద్యానము గలిగి ముందు విశాలమైన వాకిలి

గలిగి రమణీయములగు మేడలుమిద్దెలు గలిగి రాజబంధువులు సపరివారముగా వసియించుట కనువుగానుండెను. అందువిడిసిన రెండుమూఁడు దినములకుఁ గర్పూరమంజరి తండ్రి పిలువనంప నాభవనమును దల్లిదండ్రులను జూడఁబోయెను. మాతాపితలు బాలికను రెండుమూఁడుదినములాఁపిరి. ఆలో నరవింద కర్పూరమంజరినిరమ్మని నర్మదచేత వర్తమానమంపెను. కర్పూరమంజరిమీఁద నరవిందకు గాఢానురాగము గలుగుట చిత్రభానున కొకవిధముచేత సంతోషకరముగాను, వేఱొకవిధముచేత సంతాపకరముగాను నుండెను. తనపుత్రికచేత మణివర్మప్రముఖులమీఁదఁ గొన్ని కానిమాటలు రాణికిఁ జెప్పింపవచ్చునని వారికలయిక నతఁడిచ్ఛగించెను. కాని చిరసహవాసదోషమునఁ దనపుత్రికకు నరవిందమీఁదను నామెబిడ్డలమీఁదను విప్రాని కూర్మిజనించి భవిష్యత్కాలమున బాధకరమగునేమోయని భయముగలుగఁ జొచ్చెను. అయినను నతఁడామె రాచనగరమునకుఁ బోవుట కాటంకముఁ గలిగింపలేదు. రెండవనాఁటిరేయి చిత్రభానుఁడు భోజనానంతరమందుఁ గూఁతురుం జేరఁబిలిచి "బిడ్డా! నీవు నీపెదతల్లితోఁ గలసిమెలసి కొన్నినాళ్లనుండి యుంటివిగదా! భర్తృమరణమునుగూర్చి యామె నీతో నేదేనిచెప్పినదా! యనియడిగెను. "నర్మద నడిగి నేను పెదనాయనగారి మరణవృత్తాంతముఁ దెలిసికొంటిని. అదియున్నదున్నట్లు జెప్పెనుగాని యెవరిమీఁదను నిందారోపణముఁ జేయలేదు. నర్మద చెప్పినంతసేఁపు నాపెదతల్లినోటమాట రాలేదు. కంటినుండి ముత్యాలచేరులు నేలకు వ్రేలఁగట్టినట్లు బాష్పధారలు దొరఁగెను. ఇదియే జరిగినవృత్తాంతము అని కూఁతురు తండ్రికుత్తరముచెప్పెను. "అంతేనా? ఎవ్వరిమీఁద ననుమానమున్నట్లు చెప్పలేదా?సరే! వాండ్రకునిజము తెలియకపోవచ్చును. నిజమునిలుకడమీఁదఁ దెలియకపోఁదు.

అనిపలికి కొంతసేపూరకుండి యేదోయాలోచించుచున్నట్లు పైకిఁజూచి వెండియుఁ జిత్రభానుఁ డిట్లనియె. "బిడ్డా! అరవిందాదేవికడ నీవు తఱచుగానుండువుగనుక నామె కొక్క రహస్యము జెప్పవలయునని కోరుచున్నాఁడను. అది యేమందువేని సావధానవై వినుము. మాయన్న నట్టి దారుణమరణముపాలుచేసినవాఁడు పయోముఖవిషకుంభమని చెప్పఁదగిన మణివర్మ. వాఁ డమాత్యరూపముననున్న ఘోరరాక్షసుఁడు; మిత్రరూపముననున్న కాలభుజంగము. అమృతాకృతితోనున్న కాలకూటవిషము. బిడ్డా! యీపలుకులువిని నీవు తెలతెల్లఁబోయెదవేమి? వాఁడంతపనిఁ జేయలేఁడనియా నీయభిప్రాయము. నీ వక్కజఁ పడనక్కఱలేదు. అమాత్యులహృదయములు విషపాత్రములు. అమాత్యులు చేయనిపాపములు లోకములో లేవు. నరులప్రాణములఁదీయుట నల్లులఁజంపుటగానైన నుండదు. పేనుకుక్కినమాత్రమైన వారికుండదు. స్వలాభపరాయణులై వారు కావించు దుండగములఁ దన దివ్యహస్తముతో- దివ్యలేఖినితో- దివ్యపత్రములమీఁద- నాచిత్రగుప్తుఁడే వ్రాయవలయుఁగాని మఱియెవ్వరు లిఖింపఁజాలరు. క్రూరచిత్తుఁడైన యీయమాత్యుఁడు తనకు నమ్మిన భృత్యుఁడుగా మిత్రుఁడుగా మనసారనమ్మి మాయన్న తనయంతముం దెచ్చుకొనెను. ఇట్టిదురాత్ముని నమ్ముట పక్కలోఁ బాము వెట్టుకొని పవ్వళించుటయని యతఁ డెఱుఁగఁడు. బిడ్డా! ఆతఁడు నన్ను దేశమునుండి వెడలనడఁచుట మహాపాతకుఁడైన యీసచివాధమునిమాటల నమ్మియే. లేకున్న మాయన్న నన్నట్లుసేయునే?", యని బాష్పరోధమునఁ దనకంఠము గద్గదస్వరయుక్తముగా మాటలాడలేక కన్నీరువిడిచెను. కర్పూరమంజరియు దుఃఖపూరితయై కన్నీరుదుడిచికొని "తండ్రీ! విచారింపకు, నీసౌభ్రాత్రము నిరుపమానమైనదె. కాలవశమున మనస్సులలో రవరవలు పొడముటయు దానికిందగినట్లు హేమచంద్రునిఁ

జంపుటకుఁ గొన్నికుట్రలు బైలువెడలుటయు నప్పుడు సంభవించెను. ఎందుచేతనో నీపై నప్పు డనుమానముగలుగ నతఁ డట్లుచేసెను. ఆయనమరణమునకు విచారించినఁ గార్యమేమి? నీయభిమతమేమో చెప్పుము. శక్యమైనపక్షమునఁ జేసెద 'నని హెచ్చరించుటయుఁ జిత్రభానుఁడు మరల నిట్లు చెప్పఁదొడఁగెను. "అమ్మా! మణివర్మ హేమ చంద్రినిఁ జంపించినట్లు నీవరవిందాదేవి మనసునకు నచ్చునట్లు గట్టిగఁ జెప్పవలయును. మణివర్మయన్న మాయన్నయట్ల నామెయుఁ బడి చచ్చును. అతఁడే తన తండ్రిగా గురువుగా క్షేమంకరుఁడుగా నమ్మి తనప్రాణము కొడుకుల ప్రాణములు వానిచేతం బెట్టినది. అందు చేత నామె కతనిపై ద్వేషముగలుగునట్లు నీవు నొక్కి పలుకవలెను. మాయన్న యున్నప్పుడే మణివర్మ కాశ్మీరరాజ్యచక్రమును నిచ్చ వచ్చినట్లు ద్రిప్పినాఁడు. ఇప్పుడతఁడే రాజు. వానిమాట నిరంకుశమై చెల్లుచున్నది. మాయన్న పేరుమీఁదుగా నాయిద్దరిబిడ్డలనైన వాఁడు బ్రతుకనిచ్చునని నాకు నమ్మకలేదు. అవసిరూనలఁగూడ వాఁడెప్పుడో తనపొట్టంబెట్టుకొనును. కాఁబట్టి మణివర్మపై వ్రాలియున్న యామె మనస్సును నీవు యథాస్థితికి మరలింపవలెను. నీవు విద్యావతివి. మాటలయందును జాణవు. వాక్పటుత్వము గలదు. హేతుకల్పన చక్కఁగాఁ జేయఁగలవు. పూర్వోత్తరవిరోధము గలుగకుండ సందర్భశుద్ధి చెడకుండ నెట్లుచెప్పవలెనో యట్లుచెప్పి కాశ్మీరరాజ్యమును రాజకుటుంబమును రక్షించునట్టి మార్గము చూడుము. అట్లయిన నీవు కష్టపరంపరలను వేఁడిగాడ్పులచే శోషిల్లుచున్న మన వంశవృక్షమునకు నీరుపోసి రక్షించినదానవగుదువు. నేనేమో చెప్పితినసక చక్కఁగా నాలోచించి కర్తవ్యముచేయుము. నాయన్నకుమారులు నాయన్నరాజ్యము చక్కఁగానుండుటయే నాకోరిక."

అప్పలుకులు విని కర్పూరమంజరి విస్మయమునొంది క్షణమాలోచించి తండ్రి కిట్లనియె. "నాయనా ! కాశ్మీరరాజ్యమునకు మన విక్రమసేనహర్షవర్ధనులకు క్షేమముగలుగుట నాకుఁ బరమసంతోషము. కాని యెవరుచెప్పినను మణివర్మ మిక్కిలి యోగ్యుఁడనియు, రాజకుటుంబమునకు హితకారియనియు నాత్మలాభపరాయణుఁడు గాఁడనియుఁ జెప్పుచున్నారు. నీమాటలుచూడ నతనివంటి మలిన వర్తనుఁడు లేఁడని స్పష్టమగుచున్నది. పెదనాయనకు మణివర్మ యపకారముసేయుచుండ నేఁ జూడలేదు. ఇంతవఱకు వినలేదు. అట్టి సజ్జనునిపై రాజద్రోహము, రాజహత్య మొదలగు మహాదోషముల నారోపించి నేనేవిధముగా నరవిందాదేవితోఁ జెప్పఁగలను? ఈపని చేయుటకు నాయంతరాత్మ యొప్పుకొనుటలేదు. ఒకసద్గుణవంతుని జెఱుచుట మహాపాతకహేతువు. కావున నన్ను నీ వీవిషయమున క్షమింపవలయు. మణివర్మయే హేమచంద్రహంతకుఁడని నీవుచెప్పితివి కాని ప్రపంచమున నెట్టి దుర్వాదుకయున్నదో యెఱుఁగుదువా! మాళవరాజాంతఃపురమున నే నున్నకాలమున నే నిద్దఱు ముగ్గురివలన నీవే నీయన్నను జంపితివని—చంపించితివనివింటిని. అప్పలుకులు నేను నమ్మెదునా? కర్పూరమంజరిని గన్నతండ్రిచేతులు భ్రాతృరక్తము తోడ నరుణంబులగునే! నీపై నపవాదము నెట్లు విశ్వసింపనో మణివర్మపై నారోపణలుగూడ నట్లె విశ్వసింపను. కావున నీపని నాతలపైఁ బెట్టకుము. అది నాచేతఁగానిపని." అని బాలకయూరకుండఁ జిత్రభానుఁడు "పోనీ! బిడ్డా! నీవాపని జేయలేకున్నను నాపైలోకులు మోఁపిన యపవాదము నీవు నమ్మలేదు. అదయే నాకుఁబరమసంతోషము. అదియే పదివేలు. ఇంకఁ బండుకొనుము" అని యామెంబంపి తానును శయనాగారమునకుఁ బోయెను.

## ఆఱవ ప్రకరణము.

---

మణివర్మ యరవిందాదేవి యాజ్ఞ శిరసావహించి యెప్పటి యట్ల రాజ్యవ్యాపారములఁ జూచుచుండెను గాని యాతనిమనస్సు యథాస్థితిని బ్రాపింపలేదు. చిత్రభానుఁడు శ్రీనగరమునకు వచ్చుటే యాతని కిష్టములేదు. వచ్చినను నతఁ డచ్చట నిలువఁ జేసియుండుట కిట్టదు. అతని కుటుంబము వచ్చుటంతకన్న నతనికి సరిపడలేదు. కుటుంబము వచ్చి రాజపత్నిని బరామర్శచేసినపిదప సకుటుంబముగాఁ దా నూరు విడిచిపోవునట్లు దేవియెదుట వాగ్దానముఁ జేసి చేసినట్లు వీడు విడిచిపోకపోవుటగాక, మీఁదుమిక్కిలి యచ్చట స్థిరవాసము చేయఁ దలంచి యొకవిశాలభవనము నాక్రమించుకొనుట వానికి మిక్కిలి కష్టముగా నుండెను. అన్నిటికంటె నెక్కువగఁ జిత్రభాను పుత్రికయైన కర్పూరమంజరి నిరంతరము దేవికి సన్నిధానవర్తినియైయుండుట లోకజ్ఞుఁడైన యతని కనుమానము హెచ్చించుచుండెను. అందుచేత నతఁ డేమిచేయుటకుఁ దోఁచక మూఢునియట్లు, కార్యపద్ధతి నిర్ణయింపలేక యుండెను. ఒకసారి కాశ్మీరరాజ్యముతో సంబంధమువదలుకొనుట యుక్తమని యాతఁడు తలంచును; వెంటనే మృతుఁడైన హేమచంద్రునిఁ దలఁచియు లేబ్రాయముననున్న రాజకుమారులం దలఁచియు బిడ్డవలెఁ దన్నునమ్మిన యరవిందం దలఁచియు నాయాలోచన మంతమునొందించును. ఒకతూరి చిత్రభానుని నూరవిడిచి తక్షణమె పొమ్మని స్వదేశ మంపవలయునని తలపోయును. రాణియానలేక యట్లుచేసిన నామె యెట్లుగాఁ దలంచునో యని శంకించును. తన వేగులవాండ్రెంత తెలివిగలవాండ్రైనను లోలోపల నేమి జరుగుచున్నదో వారు తెలియఁ జేయఁ జాలరుగదా! ఏమి జరుగుచున్నదో? ఏమిపన్నుగడలు చిత్రభానుఁడు పన్నుచున్నాఁడో యని భ

యపడుచుండును. ఈవిధముగాఁ గొన్నిదినము లతఁడు తలపోసి తల పోసి యరవిందాదేవికడకుఁ బోయి యామెతో నీవిషయమై ముచ్చ టింపఁదలఁచి విక్రమసేనునిం బిలిచి "కర్పూరమంజరి లేనిసమయమున మీయమ్మతోడను నీతోడను నే నించుకప్రసంగింపవలతు. ఇట్లు మీ యమ్మతోఁ జెప్పుము" అని పలుక నక్కుమారుఁడు వల్లెయని తల్లి కడకరిగి యమ్మాట చెప్పెను. ఆమెయు మఱునాఁ డేకాంతమునఁ బ్రసంగించుటకుఁ దగినసమయము స్థలము నిర్దేశించి యమాత్యుని రావించెను. మణివర్మ ముడుతలువడిన మొగము ముగ్గుబుట్టవలె నెఱ సినతల, మాంసహీనములై వ్రేలుచర్మములు, మనోభారమునకుఁ దోడు స్వయముగాఁ బైనవైచుకొనిన కార్యభారముచేతఁ గొంచెము వంగిన నడుము, దేవికిఁ గుమారునకు జాలిగొలుప వారిని సమీపించి సన్మానితుఁడై పీఠముపైఁ గూర్చుండి మెల్లగ నిట్లనెను. "అమ్మా! చిరకాలజీవనము కష్టపరంపరాదర్శనముకొఱకే. కానిచో నట్టినరపా లచంద్రుని హేమచంద్రునిచేతులమీఁదుగా నేనుబోక జీవచ్ఛవము నైయుందునా! చిత్రభానుని రాకనుగూర్చి నేఁడు మీతో నీవఱకే మనవిచేసికొనియుంటి. అతఁడు వచ్చుటే ముప్పు. రానిచ్చుట తప్పు. చేసినతప్పు దిద్దుకొనుట యొప్పు. తనకుటుంబము మిముస్మఁ బరామర్శ చేసినతరువాతఁ దానియూరు విడిచిపోవునట్లు మాటయిచ్చెను గదా! ఇప్పుడు చేసినపని చూడుఁడు. ఇచ్చట శాశ్వతనివాసము చేయఁదలం చికాఁబోలు విశాలభవనము నాక్రమించుకొనియె. పశువలెవచ్చి మేకు వలె బిగుసుకొనెనన్న సామెత నిజమైనది. మీమనసులో మీకెట్లు న్నదోగాని యతఁ డిక్కడనుండుటచే నేను ముండ్లమీఁద నున్నట్లు న్నాను. నామనస్సు నిప్పుల బొరలుచున్నది. జ్వరములేకయే నేను తాపపడుచున్నాను. రోగములేకయే నాకాహారద్వేషము గలిగినది. తెగులులేకయే నిద్రాశూన్యములైన రాత్రులు గడపుచున్నాను.

చిత్రభానుఁ డున్నచోట మనముండుట తాఁచుబామున్న యింట మెలఁగుట. వాని నుండనిచ్చుట కొంగున నిప్పు మూఁటగట్టుకొనుట. ఈవిషయములన్నియు నేను మున్నె సూచించియుంటి. విశేషించి కర్పూరమంజరి మిమ్మజస్రము పాయక తోడునీడవలె నున్నది. ఆమె పై మీకెంత మక్కువయున్నను నామె శత్రుని బిడ్డగదా. ఆమెకు మీపై నెంత యనురాగమున్నను మీకుతల్లిదండ్రులతరువాతివారు గదా! మీగుట్టుమట్టు లామెతండ్రి కెఱిఁగింపకుండునా! ఎంతమంచి దైనను బాలిక మీకును వారికి వైరమువచ్చినప్పుడు తండ్రిపక్షము ముండక మీపక్షముండునా? అతఁడేమి దుస్తంత్రములఁ బన్నుచున్న వాఁడో మనమెఱుఁగము. నావేగులవాండ్రు విహంగకుఁడు కైరవుఁడు మున్నగువారు పలుతెఱంగుల వారిజాడలఁ దీయ యత్నించుచున్నారు. కాని పైపైవార్తలేగాని లోపలిగుట్టు తెలియుట లేదు. కావున నోతల్లీ! వాని నిచ్చటనుండి వెడలనడఁచుట మంచిది. ఆదికాలమున మన మహారాజుగారే వానిని దేశభ్రష్టుని జేసిరి. కావున నింద మనమీఁదనుండదు. వెనుకటి మహారాజు చేసిన పనియే మన మిప్పుడుచేయుచున్నాము. బలవత్తరములైనపూర్వకారణములే యిప్పుడున్నవి. అంతకన్న నెక్కుడు కారణములుంగలవు. కావున వానిని వెడలనడఁచుటకు నాకు సెలవిమ్ము. నీ ముదలయయ్యెనేని వానింబంపి వేయుటకు యత్నించెద. నగరమువిడిచిపోవునో లేదో నాకును సందియమే. అందుచేత నే యత్నించెదనంటిని. మీఁదమీచిత్తము" అని పురోహితాభిలాషియగు వృద్ధామాత్యుఁడు వచియింప నద్దేవి విక్రమసేనునివంకఁ జూచెను. విక్రమసేనుఁడు తల్లివైపు జూచెను.

అమ్మా! తల్లికొడుకు లొండొరులమొగములు చూచుకొని తెల్లఁబోవనేల? ఏదోకార్యపద్ధతి సత్వరమునిశ్చయింపుఁడు" అని యమాత్యుఁడు హెచ్చరింప రాజమాత యిట్లనియె. "తండ్రీ! నీపలు

కులు వేదవాక్యంబులుం బోలె సత్యంబులు. మా కెల్ల చుట్టములునీవ! నీవంటి క్షేమంకరుఁడు మాకు వేయిజన్మములు దపస్సుచేసినను లభింపఁడు. నీయిష్టమెట్లో యట్లె నేను చేసెద. కాని యొక్కవిషయమాలోచింపుఁడు. మామఱఁది నిప్పు దూరుపిడిచిపోవున్నాఁట నిద్రించుచున్న బెబ్బులిని మేల్కొలుపుట యగునేమో! పండుకొన్న త్రాఁచుబామును పడగవిప్పి యాడించుటయగునేమో! రాజుచున్న నిప్పు మండించుట యగునేమో? ఆఁడుదానను రాజనీతి నెఱుఁగనిదానను. అందుచేత నామాఁటలే పాటిగాఁ గొనక నీవును మాధవసేనుఁడును రాజభక్తియుక్తులగు దక్కినవినియోగులతోడను గార్యాలోచనముసలిపి యథోచితముగావర్తింపుము. ఈ [illegible]పుంజరి చిత్రభానుని పుత్రికయైనను సుగుణరాశి. ఇక్కడిమాటలక్కడ నక్కడిమాట లిక్కడఁ జెప్పునదిగాదు. ఎక్కడిమాటలక్కడనే జీర్ణము చేసికొను స్వభావము దానిది. అయినను రాజ్యపరిరక్షణార్థము దానింగూడ నేఁ బరిత్యజించెద, అనవుడు మణివర్మ పరిక్రమసేనునివంక దిరిగి "కుమారా! సాలగ్రామము చిన్నదైనను పెద్దదైనను బూజ్యమె. రాజు బాలుఁడైనను వృద్ధుడైనను మాననీయుఁడే. కావున నీయభిమతముఁ జెప్పుమని యడిగెను. అడుగుటయు నతఁడు "అయ్యా! కరిటభారమే నేను తలఁదాల్చితినిగాని రాజ్యభారము మోయువాఁడవు నీవు. దండపాణిప్రముఖులతోఁగూడ నీవాలోచింపుము. మనకు వారిపై ననుమానమున్నట్లు మనవర్తనముచే వారికిఁ దెలియనీయఁగూడదు. అందఱితోడిపాటు వారింగూడ గౌరవపురస్సరముగాఁ బిలిచి కార్యనిశ్చయముచేయుట కర్తవ్యము. మీశాస్త్రజ్ఞానము మీలోకానుభవము, మీబుద్ధివిశేషము నాశ్రయించి మీ యిచ్చవచ్చిన తెఱంగున వర్తింపుఁడు. మీకుపదేశము జేయుటకు నేనెవ్వఁడనని వినయమున బదులుచెప్పెను. అప్పలుకులు విని యాసచివాగ్రణి "సరే

మీరాయిరువురు నాకుం దోఁచినపోల్కి సేయుమని సెప్పిరిగదా. మాధ
వసేనుఁడు సర్వకార్యములందును నన్ననుసరించును. దండపాణిని
వజ్రపాణినిగూడఁ బిలువనంపి వారిమతము దెలిసికొనియెద. వారు
నాతో నేకీభవింపకపోయినను నేను చిత్రభానుని బురమువిడిచిపోవలసి
నదని చెప్పెద. ఏలయనఁ వారి రాజభక్తినిగూర్చి నాకనుమానము
గలదు. వారయినను జాటుచాటున వానికిసాయముచేయవలసినదేగాని
సాహసించి బహిరంగముగా మనకు వ్యతిరేకముగా నుండఁజాలరు.
అట్లు సేయుటకుఁగూడ వారికిఁ దగినహేతువులులేవు. ఇప్పటికి నేను
సెలవుగైకొని పోయివచ్చెద" నని స్వగృహమునకుఁబోయెను.

ఆరేయి మణివర్మ దండపాణిని వజ్రపాణినిఁ దన గృహంబు
నకుఁ బిలువనంపి మొదటినుండియుఁ జిత్రభానునకు హేమచంద్రునకు
గలసంబంధము నుపన్యసించి యతఁడు భ్రాతృహంతయని లోకమునం
గలవాడుకల చెత్తి నగరమున నతనినుంచుట కర్తవ్యమగునా కాదా
యనుమాట గట్టిగా విచారింపవలసినదని వారితోఁ జెప్పెను. అప్ప
లుకలు వారికి శ్రోత్రపేయములుగా లేవు. మనసులోఁ జిత్రభానుని
యెడఁ బ్రేమగలిగియుండుటఁ జేసి వారియువురును నెటుచెప్పుటకు వీలు
లేక కొంతసేపు మనసులలో వితర్కించుకొనిన పిదప దండపాణి
యిట్లనియె. "ఆర్యా! చిత్రభానునిమీఁద నలుకవోడమి హేమచంద్ర
మహారాజు వానిని దేశమునుండి వెడలనడఁచిన మాట నిజమె. అది
యేపొరపాటని మేము తలంచుచుంటిమి. చిత్రభానుఁడు భ్రాతృహం
తయనుమాట మేము నమ్మఁజాలము. మేమే కాదు బుద్ధిమంతులెవ్వరు
నమ్మరు. అన్ననిమిత్త మతఁ డెంతో యడలుచున్నాఁడని వినుచు
న్నాము. అది కపటనాటకముగాక నిక్కమైనదుఃఖమే యని మా
తలంపు. అతఁడిక్కడనున్నందువలన మనకేమియుపకారము గలుగును?
అతనిఁగదుపుటకందరిఁగలతుట్టం జెదరఁగొట్టుట. తేఁగాములుచక్కఁగ

విచారించి మీ యిచ్చవచ్చిన తెఱంగునఁ జేయుఁడు. ఈకార్యము నాకు మాత్ర మిష్టములేదు." అనివిని మణివర్మ "వజ్రపాణీ! నీయభిప్రాయ మేమి?" యని యడుగ వజ్రపాణి "అయ్యా! అన్నదమ్ములకు నేమి కారణముచేతనో మనస్పర్థలు కలిగినవి. వెనుకటి మహారాజు, విషయము సరిగ విమర్శించియో విమర్శింపకయో తమ్ముని వెడలఁ గొట్టెను. హేమచంద్రునితో వైరము లంతమొందినవి. చిత్రభానుఁడు వెనుకటివైరము మఱచి మరల స్వదేశమునకు వచ్చినాఁడు. అతని జోలికిఁబోవుట యుక్తముగాదు. అదిగాక యతఁ డేమి చేయఁగలఁడు? ధనమా, రాజ్యమా, యధికారమా, సైన్యమా, యతనిచేత నేమి గలదు? కావున మనమతని నుపేక్షించియుండుట సముచితమని నా మతము.

అప్పలుకులు విని వారిమనస్సులోనున్న భావము సంపూర్ణముగ గ్రహించి యంతకన్న వారితో నెక్కువ ముచ్చటించుట యప్రస్తుతమని యప్పటికి వారికిసెలవిచ్చిపంపి మణివర్మ తనమనస్సులో నిట్లు వితర్కించెను. "అన్నన్నా! రాజ్యతంత్రనిర్వాహణము కఠినం గడుఁ గష్టముగదా! ఇదియనేకాపదలకాస్పదము. ప్రమాదము మానవమాత్రునకు సహజము. అది మంత్రిపట్లవచ్చినా దానిని లోకము సహింపదు; రాజుసహింపఁడు. తలపెట్టినకార్యము శుభముగాఁ బరిణమించెనా యామంత్రి యభినవబృహస్పతియనియుఁ గలియుగ శుక్రుఁడనియు, యుగంధరుఁడనియుఁ బ్రకృతిజనులు వేయితెఱంగుల నుతింతురు. దైవవశమున నక్కార్యము మంత్రిలోపములేకయే చెడెనా వాఁడు పనికిమాలినవాఁడు, ఖండనార్హుఁడు ననియానోళ్ళతోనె నిందింతురు. ప్రజాభిప్రాయము బహుముఖములు గలరాక్షసి. కార్యధురంధరులపట్ల లోపమువచ్చినా యది వారిం దప్పక మ్రింగివేయును. రాజులచిత్తవృత్తులు నట్టివే. అందు రాజు పిన్నవాఁడైనప్పుడు

మంత్రిపాట్లు చెప్పవలసినదే లేదు. ఇక్కడ రాజు చిన్నవాఁడు. సం రక్షకురాలు తల్లి; యాఁడుది. చేయవలసినకార్య మతికష్టమైనది. చిత్రభానుఁడు పరమదుర్మార్గుఁడు. మిత్రు లెవరో శత్రు లెవరో తెలి యకుండ నున్నది. దైవమా! ఏమి తెలుపు? ఇట్టి సందిగ్ధసమయ మె న్నఁడు రాలేదు. ఏమైన నగుఁగాక! దైవముమీఁద భారమువైచి రాజకుటుంబక్షేమము విచారించి నాబుద్ధికివచ్చినట్లు జేసెద. ప్రయత్న మే మనుష్యునివంతు; కార్యసిద్ధి దైవాయత్తము" అని నిశ్చయించి ద్వితీయమంత్రి యగుమాధవసేనుని మఱునాఁడు బిలువనంపి యాతని తో ననేకరాజకార్యములను ముచ్చటించి చిత్రభానునిప్రసంగముదెచ్చి నగరమునుండి బహిష్కరించుట కర్తవ్యమా యకర్తవ్యమా యని యడిగెను. మాధవసేనుఁడును మణివర్మ యట్ల యఖండరాజభక్తి యుక్తుఁడు. అతనియట్లె చిత్రభానునియెడ విశ్వాసము లేనివాఁడు. అయినను మణివర్మ యట్లు కార్యనిశ్చయము సత్వరముగా నతఁడు చేయఁజాలఁడు. నోటనుండిమాట వెడలకమునుపు దాని నతఁ డెన్ని సారులో తూఁచును. భావమున నెన్నిసారులో దానిని మర్దనచేయు ను. అందుచేత నతఁడు చాలసేపాలోచనముచేసి కొట్టకొన కిట్లనియె. "అన్నివిధములఁ జిత్రభానుఁడు శ్రీనగరమునకు దూరమున నుండవల సినవాఁడె. కాని, మనమింత తొందరపడవలసిన యవసరమేమి? సా హసించినపక్షమున నేమిప్రమాదము సంభవించునో? వానిచర్యలు మఱికొంతకాలము కనిపెట్టి యవి విపరీతములయినపక్షమున మన మ ప్పుడు వానిని బహిష్కరింపఁగూడదా?" అనుచుండ నతనిమాట కడ్డమువోయి మణివర్మ "ఎంతకాలము మనము నిదానించుట? తలు పులు గొళ్ళెముపెట్టి వాఁడు నాలుగుచూరు లంటించినపిదప మన మే మి చేయఁగలము? వాఁడిచ్చట దుస్తంత్రవృక్షమును బెంపఁదలంచి మొక్క నాటినాఁడు. దోహదము సేయుచున్నాఁడని నా నమ్మిక.

అది బ్రహ్మకైన గొడ్డళ్ళకైనఁ దెగనప్పుడు మన మేమి చేయఁగలము? మొలకయయిననాఁడె పెల్లగించుట కర్తవ్యము. కావున నామాట వినుము. నీవుపోయి చిత్రభానునిం గలసి సకుటుంబముగా నతఁడు శ్రీనగరము విడిచి వెళ్ళవలసినట్లు రాజశాసనమైనదని చెప్పుము. నేను చిన్నరాజుతోను రాణితోను మాటలాడితిని. ఎప్పుడో యొకప్పుడు మన మీకార్యము జేయవలసినవారమె. పెందలకడఁ జేయుట మంచిది" అని కఠినస్వరముతోఁ బలికెను. "మీచిత్తమువచ్చినట్లు జేసెద. ఈసాయంకాలమె పోయి చిత్రభానున కీవార్త నెఱింగించెద. అతని ప్రత్యుత్తరము మీకు నేఁ జెప్పెద" నని మాధవసేనుఁడు చెప్పి సెలవు గైకొని పోయెను.

---

## ఏడవ ప్రకరణము.

మణివర్మ సందేశము మాధవసేనుఁ డెఱిఁగింపకముందె దండపాణి వజ్రపాణులవలనముందుగఁ జిత్రభానుఁ డెఱింగిసందేశముకడకువచ్చినప్పుడేమిచెప్పనొప్పునాయని విచారించుచుండెను. వార్తాహరు లెవ్వరై యుందురో యతఁడు ముందుగ నూహింపలేకపోయెను గాని మఱునాఁడు మాధవసేనుఁడు వచ్చినతోడనే యతఁ డాసందేశ మెఱిఁగించుటకె వచ్చియుండునని నిశ్చయించియు యథోచితగౌరవమున నామంత్రి నెదుర్కొని యర్హాసనమునఁ గూర్చుండఁబెట్టి సేమ మరసి రాజకుటుంబముయొక్క క్షేమమడిగి పిమ్మట నిక్కడకు వానిం దోడితెచ్చిన పనియేమో తెలియఁజేయుఁడగునని పలికెను. మాధవసేనుఁడు చేతులు నులుపుకొనుచు మెల్లమెల్లగా నేదో చెప్పఁబూనెను.

"అయ్యా! మీరు నేఁడేదో యుత్కృష్టకార్యముమీఁద వచ్చినట్లు గనఁబడుచున్నారు. నసుకుచు మాటలాడవలసిన పనిలేదు. చెప్పఁదలఁచినమాట లేవో స్పష్టముగా గంభీరముగాఁ బలుకుఁడు. నావల్ల మీకెట్టిభయము లేదు. మనము పాత్రిఁతచుట్టాలము గాని మొగమోటిక లేనివారము గాము" అని చిత్రభానుఁడు కంఠమెత్తి పలికెను. "అయ్యా! నసుగుచు సగము చెప్పఁదలఁచుకొని రాలేదు. చెప్పవలసిన దేమో సంపూర్ణముగాఁ జెప్పిపోయెద" నని మాధవసేనుఁడు చెప్పెను. "అదే నాకు కావలసిన" దని చిత్రభానుఁడు మరల నొక్కి పలికెను. అప్పుడు మాధవసేనుఁ డిట్లనియె— "మనము చిరకాల మిత్రులము. అయినను స్వధర్మనిర్వహణము మానవునకు విధిగావున నేనప్రియము చెప్పుటకు వచ్చితిని. ఇందుకు మీరు నన్ను క్షమింతురుగాక! మీ యన్నగారు నిమ్మునఁ గొన్ని కారణములచేత వెడలనడఁచిరి గదా! ఆక్షణమే మీరు దేశమును విడిచిపోయిరి. ఇప్పుడు రాజకుటుంబమును బరామర్శచేయుటకై వచ్చిరిగదా! మీరు మీకుటుంబము బంధుమిత్రసహితులై వచ్చుట, విపత్సముద్రమున మునిఁగిన రాజపత్నిని రాజపుత్రులను సమాశ్వాసింపను యుక్తము. మొట్టమొదట మీరు మీకుటుంబమువచ్చి పరామర్శించినపిదప నగరము విడిచి పోవునట్లు మాటనిచ్చిరి. మీమాట మీరు నిలుపుకొనుఁడు. మీరు మహారాజపుత్రులు. మహారాజసోదరులు. చంద్రవంశసంజాతులు. మీపూర్వులందఱు నాడితప్పనివారు. కావున మాటతప్పక సకుటుంబముగా మీరు శ్రీనగరము విడిచి మూఁడుదినములలో వెడలవలయు. ఇది రాజశాసనము. రాజమాతృశాసనము. మీరొకరిని శాసించువారేగాని యొకరిచే శాసింపఁబడువారు కారు. మీభృత్యులమైన మేము మీకుఁజెప్పవలసినవారము గాము. మీయన్నగారున్నప్పుడు మీరు వచ్చువారియనుమతముననో వారిశాసనముఁబ్రతిఘటించియో యిక్కడ

నుండిన నదిశ్లాఘ్యమైయుండును. వారిమరణానంతరమున సమాశ్వాసము పేరఁబెట్టి వచ్చి భర్తృవియోగముచేత మూలఁబడియున్న రాణిని లోకానుభవము లేనిపిన్నరాజును లోకువచేసి యిచ్చటనుండుట భావ్యముగాదు. ఇదియేనామనవి. అని సంపూర్ణముగానతఁడు చెప్పఁదలఁచినదంతయుఁజెప్పి ముగింపకమునుపే చిత్రభానునిమొగము చిలకడదుంపవలెనెఱ్ఱవడెను. కనుబొమలు ముడివడెను. కన్గొనలు గురివిందగింజలట్లెఱ్ఱపడెను. పెదవులదరఁజొచ్చెను. మేనుగగుర్పొడిచెను. ఆగ్రహాగ్రహము వానిని సంపూర్ణముగనావేశించి వశపఱచుకొనెను. అపుడు వానినోటనుండి యుచ్చైస్స్వరముతో నీక్రిందిమాటలు వెడలెను.

"మాధవసేనుఁడా! నీవును నీకన్న నీచుఁడైన మణివర్మయు మాయన్నతో నామీఁద గాలి ప్రోఁగఁజేసి నేరములు కల్పించి చెప్పినకొండెములుచెప్పి మాయిరువురమైత్రిఁ జెఱచి పరస్పరద్వేషములు గలిగించిరి. మాయలమారులగు మీమాటలు వేదవాక్యములుగానమ్మి వెంగలియగుమాయన్న నన్ను దేశమునుండిపొమ్మనెను. ఆతఁడు పెద్దవాఁడగుటచేతను, నేనుమంచివాఁడనగుటచేతను, నానిర్ణయము ధర్మగర్భితమైనను వానియందలిగౌరవముచేత వానియాజ్ఞ శిరసావహించి యాలుబిడ్డలవెంటఁగొని నేను దేశాంతరమునకరిగితిని. తండ్రిలేని బిడ్డలను నవవైధవ్యదుఃఖితయైనవదినెను జూడవచ్చుటతప్పా? నన్ను మీరుపొమ్మని నిర్బంధింపకపోయినపక్షమున నాయంతటనేనేవెడలిపోయియుందునుగాని నాపురనిర్గమనమునుగుఱించి మీరింత పట్టుబట్టుచున్నారు. కావున ముక్కంటి వచ్చినను నే నిక్కడనుండి కదలువాఁడనుఁ గాను. ఎవ్వఁడు వచ్చి నన్నిక్కడనుండి కదపునో చూచెదఁగాక! వ్రేలితో నవ్వలఁద్రోసివైచుటకిది గుండుగాని బెండుగాదు. మీబెదరింపులకుఁ బాఱిపోవుటకిది పిల్లిపిల్లగాదు సింగపుఁగొదమగాని. ఇదినా

తండ్రి రాజ్యము, నా తాత దేశము, నా ముత్తాతల యార్జితము. ఇది నాజన్మభూమి. కావున నే నిక్కడనుండి కదలను. స్వామిద్రోహులైన నీవును మఱియెవ్వరును నాఁడుగాని యున్నవాండ్రను గన్న బ్రామి రాజ్యము పంచుకొనుటకై నవలెనని చూచుచున్నారు గాబోలు! నేనిటనుండిపోనని మీరున్న రాజుతోను రాజమాతతోను వృద్ధజంబుకమైన మణివర్మతోను గట్టిగఁ జెప్పుము. పొమ్ము. పూర్వమిత్రుఁడవు బ్రాహ్మణుఁడవున నగుటచేఁ గటాక్షించితినిగాని కానిచో నిట్టిసందేశముఁ దెచ్చినందుకుఁ గత్తితో నీకుత్తుక నుత్తరింపవలసినదే."

అట్లు చిత్రభానుఁడు కటువ్రముగాఁ బలుక మాధవసేనుఁడును రోషఘూర్ణితమనస్కుఁడై యిట్లనియె- "రాజకుమారా! కుత్తుకను త్తరింతునని నీవు పలికిన నే జడియువాఁడను గాను. నీ కట్టి సంకల్పము గలదేని నీ సంకల్పము దీర్చుకొనుము. బ్రాహ్మణుఁడ నని నీవు దయదలఁపనక్కఱలేదు. మా రాజశాసనము ననుసరించి మేము నీతోఁ జెప్పవలసినమాట జెప్పితిమి. నీకడ మేము సేవ జేసినను నీయాజ్ఞ నెఱవేర్పవలసినవార మెగదా! సేవకులమీఁద నాగ్రహించిన లాభమేమి? వార్తాహరులఁ దెగటార్చుట పౌరుషము గాదనియు నీతి గాదనియు రాజపుత్రుఁడవైన నీవే యెఱుఁగుదువు. ఎఱిఁగియుండియు నిట్టిసంభాషణలు చేయుదువని యెన్నఁడుఁ దలంచియుండలేదు. హేమచంద్రునియనుజుని నోట నిట్టిమాట వెడలుట మిక్కిలి యాశ్చర్యము. సరే! మీ ప్రత్యుత్తరము మా రాజునకు, రాజమాతకు నెఱిఁగించెద. ఇంక మాకు సెలవిమ్ము." అని చివాలున లేచిపోయెను. అతఁడు వెళ్లినపిమ్మటఁ జిత్రభానుఁడును మాధవసేనునివిషయమునఁ దాను గావించిన సంభాషణ కితనమై రాజకుమారోచితముగా లేదనియుఁ దాను తొందరపడెననియు నతఁ డించుక పశ్చాత్తప్తుఁడై విచారించి మరల నెప్పటియట్ల బింకము గలిగి యుండెను.

రుద్రభట్టు చిత్రభానునితోఁగూడ శ్రీనగరమునకు వచ్చినది మొదలు వానికి నఖిలవిషయములయందు నుపదేశము చేయుచునే యుండెను. చిత్రభానుఁడు వానియుపదేశము పరమప్రమాణముగా, వేదవాక్యముగా గ్రహించుచుండెను. కొన్ని కారణములచేత రుద్రభట్టు బహిరంగముగ నెల్లవారికిఁ గనఁబడుట కిష్టపడమి మేడమీఁద నొకమూలఁ గృష్ణాజినము బఱచుకొని శాలువకప్పుకొని సంస్కృత గ్రంథమేదో చూచుకొనుచుండును. చిత్రభానుఁడుసన్నిధానమున కరిగి విషమసమస్యలవంటి సందిగ్ధవిషయములలో నాలోచనకాఁదగినప్పుడు బూర్వోత్తరపరిస్థితులఁబరికించి యుపదేశము చేయుచుండును. దండపాణియు వజ్రపాణియుఁ దప్ప రాజసేవకులలో నెవ్వరికి నతఁడు కనఁబడలేదు. మాధవసేనుఁడు తన్నువిడిచివెళ్లినతరువాతఁ జిత్రభానుఁడు మేడమీఁదికిఁబోయి రుద్రభట్టునకు నమస్కరించి తనకు నయ్యమాత్యునకు జరిగినసంభాషణ మంతయుఁ జెప్పెను. అతఁడదివిని "రావలసినపరిస్థితులు వచ్చుచున్నవి. వీనికెంతమాత్రము నీవు జడియవలదు. నీవు మాధవసేనునకుఁ జెప్పిన ప్రత్యుత్తరము రాజకుమారోచితముగా నున్నది. అంత త్వరితముగఁ బలికినందుకుఁ బశ్చాత్తాపము నొందితి నంటివి. పశ్చాత్తాపమున కవసరము లేదు. సన్నిపాతజ్వరమునకు మేకు గాల్చి వాత బెట్టుటయే మందు. ఇప్పుడునీవు దండపాణిని వజ్రపాణిని బిలిపించి కార్యాలోచనముఁజేసి తెంపుసేయవలయు. గొప్పసందిగ్ధసమయమువచ్చినది. నీవిప్పుడు సంశయింపక సాహసింపఁదగును. ఆదండనాథులిద్దఱు నేమికోరుదురో యవియెల్ల వారికొడఁగూర్చునట్లు బాసచేసి వారిని నీయధీనము చేసికొనవలెను. సైన్యమంతయు వారిచేతిలోనున్నది. వారు నీకువశవర్తులగుదురా కాశ్మీరరాజ్యలక్ష్మి నీవశవర్తినియగును. ఈరేయి వారిం బిలిపించి మంతనముండవలయు. అంతయు వారితో

నున్నది, అర్ధరాజ్యమడిగినను నిచ్చునట్లు వాగ్దానముచేయుము." అని గట్టిగాఁజెప్పెను. అట్లకాక! యని చిత్రభానుఁడు కరటకునిఁబిలిచి దండపాణి వజ్రపాణులను రాత్రిబిలుచుకొని రమ్మని యానతిచ్చెను. చీఁకటిపడినతోడనే కరటకుఁడు వారియొద్దకుఁబోయి తన స్వామి సందేశమెఱిఁగించెను. జాము రాత్రియైనవెనుక వీథులు నిర్మనుష్యములైనవెనుక రాజవీథులు పరిత్యజించి వారు సందుగొందులంబడి చిత్రభానుగృహముఁ జేరిరి. వారు లోపలఁబ్రవేశించినతోడనే వీథికవాటము దృఢముగా బంధింపఁబడియెను. చిత్రభానుఁడు వారినెదుర్కొని మేడమీఁదికిఁ గొనిపోయి రుద్రభట్టుసన్నిధానమున నిలిపెను. మొగమున వెండిరేకులతికినట్లు బూదిపిండికట్లుమెఱయ మెడలో స్ఫటికాక్షసూత్రము గగ్గగలాడుచుండ బ్రహ్మతేజ ముట్టిపడునట్లు జింకతోలుమీఁదఁ బద్మాసనమువైచికొని యపరశివునివలెఁ గూర్చున్న యాబ్రాహ్మణునిఁ జూచియన్నదమ్ములు తత్పాదములకునమస్కరించిరి. అతఁడు "మనోరథసిద్ధిరస్తు" అని దీవించి రత్నకంబళములపైఁగూర్చుండ సంజ్ఞమించిన వారందరు సుఖాసీనులై యుండిరి. చిత్రభానుఁడును వారిప్రక్కనే కూర్చుండెను. రుద్రభట్టునకుఁ గుడిప్రక్క నొకమూఁకుడులో నగ్ని వెలుఁగుచుండెను. అది యారిపోకుండ నడుమనడుమ నతఁడే రెండుమూఁడు సమిధలువేయుచుండెను. అప్పుడు రుద్రభట్టు ముందుగానిట్లు సంభాషణ మారంభించెను.— "అయ్యా! నేను చిన్ననాఁటనుండి యాసేతుహిమాచలమగు భరతఖండమంతయుఁ దిరిగినాఁడను. ఎన్నో దేశములుజూచినాఁడను. ఎందఱో రాజులతో సంభాషించినాఁడను. బహుజనులస్వభావములను గ్రహించినాఁడను. కాని, మీవంటిసజ్జనులనెందుఁ జూడలేదు. మైత్రియనఁగా మీదే మైత్రి. మిత్రుని నిమిత్తము ప్రాణములనయిన ధారవోయునట్టి సజ్జనులను మిమ్మే చూచితిని. అట్లేకానిమొదల నీయర్ధరాత్రమున

నీ గాఢాంధకారమున కెర్వరెఱుఁగకుండ నతిరహస్యముగ ముసుఁగు లువైచుకొని యెంతోకష్టపడి మీ రీమిత్రుని గృహంబునకు వత్తురె? ఇంతశ్రమ మీ రేలపడవలె ? మీ యంతటివారు మీరు. విశేషించి కాశ్మీరసైన్యముల కధిపతులు. పిల్చినవాఁడో— రాజ్యములేనివాఁడు. పూజ్యతలేనివాఁడు. ధనములేనివాఁడు పరిజనములేనివాఁడు బలఁగ ములేనివాఁడు. అట్టివానిమాట తలఁదాల్చి మీరిట్లువచ్చుట మీచరి త్రమునకు వన్నె పెట్టుచున్నది. ఐశ్వర్యమున్నప్పు డందఱుమిత్రులె; ధనవిహీనునకు నాపత్కాలమున మిత్రులైనవారే మిత్రులు. అన్న యుఁ జుట్టములు, దేశీయులుఁ బరిత్యజింప నేకాకినై తిరుగు వీనిని మీరు చేపట్టినందుకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. వేల్పులు సంతసింతురు. వెయ్యేల ! పరమేశ్వరుఁడు సంతసించును ? ఎడారిలో నోరెండి తిరుగు బాటసారికి మంచినీటిచూయి దొరకినట్లు, పేరాఁక లికి నకనకంబడువానికి నట్టడవిలోఁ బండ్లచెట్లు దొరకినట్లు నిర్భా గ్యుఁడైన వీనికి వీనియదృష్టమున మీరు లభించిరి. ఇతనికి ముంగిట రెండుపెన్నిధానములు దొరికెను. రెండుకల్పవృక్షములు పెరటిలో లభించెను. ఆవృక్షచ్ఛాయ నింకజల్లఁగ మనఁగలఁడు. ఆశాఖలు బట్టుకొని పై కెగఁబాకగలఁడు. అతనిముంచినఁ దేల్చిన మీదేభార ము." అనవుడు దండపాణి వినయముతో "స్వామీ ! మేమేమిచేయఁ గలము? పూర్వమైత్రిచేత మే మీయనను వదలలేక పట్టిపాకులాడు చున్నాము. మాచేతనైన సాయము చేయఁగలము. ఇప్పుడు మమ్ముఁ బిలువనంపిన కార్యమేదో సెలవియ్యవలయు" నని పలికెను. పలుకు టయుఁ జిత్రభానుఁడు వారి చెఱియొకచేయి తన చెఱియొకచేతితోఁ బట్టుకొని మెల్లగా నిట్లనియె.— మిత్రులారా ! నేను భయపడు చునే యిటకువచ్చితిని. వచ్చినందుకు నే ననుకొన్నంతపని జరిగినది. మాధవసేనుఁడు నిన్నవచ్చి సకుటుంబముగా నన్నీయూరినుండి పో

మ్మని తమ రాజుయొక్కయు రాజమాతయొక్కయు శాసనమైనదని చెప్పెను. అది విని కోపపరవశుఁడనై నే నిక్కడనుండి కదలనని దృఢముగాఁ బలికితిని. ఆపలుకుల కేమి! నన్నిక్కడ మీరుండుమన్న నుండెద. పొమ్మన్నఁ బోయెద. నాకు నిలువనీడ లేదు. చెట్లమీఁది పక్షికైనను నెలవున్నదిగాని నాకు నెలవులేదు. సువిశాలమైన యీ విశ్వమే నామందిరమైనది. నక్షత్రయుతమైన యాకాశమె మణిరంజిత వితానమైనది. మెత్తని పచ్చిక బయళ్ళు రత్నకంబళములైనవి. వృక్షచ్ఛాయలు పందిళ్లయినవి. అడవులు పూవుఁదోఁట లయినవి. రాజకుమారుఁడనై నందుకు నే నీవిధముగా భోగములననుభవించుచున్నాను. విదర్భలో నుండుచున్న నత్తవారి యింటబ్రతుకుకన్న హీనమైనది మఱియొకటి లేదు. అదిగాక చంద్రవంశజుఁడనై విక్రమసేనుని గారాబుకొడుకునై యమిత సౌఖ్యంబు లవ్వారిగా ననుభవించిన నేను పరులపంచల నొకరిచేతిక్రింద నొదిగియుండఁగలనె? వెనుక మాయన్నయంకలి గౌరవముచేతఁ నే నెట్టెటో పీడువిడిచి పోయితిని. ఇప్పుడు నాకిక్కడ నుండవలెనని యున్నది. మీయుత్తాలభుజలీల యూఁతకోలగా నే నిందు నిలువఁబడఁ దలఁచుచున్నాఁడ. మీరు ససైన్యముగా నాకు బాసటయై నిలిచిరేని యీకార్యముతుద నెగ్గును. ఇందుకు మీకు నేను బ్రత్యుపకారము మీయిచ్ఛాప్రకారముఁ జేసెద. నన్నిక్కడ సుప్రతిష్ఠితునిఁ జేసితిరేని మీకష్టైశ్వర్యములొసఁగుదును. చదరంగపుటాటలో నొకగుఱ్ఱమును మఱియొకగుఱ్ఱము గాచినట్లు నన్ను మీరు గాతురేని మిమ్ము నేను మహోన్నత దశలో నిలుపుదును. ఇన్నిమాట లెందుకు! కాశ్మీరరాజ్యమే మీది. మీ మనస్సులో నున్న కోరికయేమో దాఁచక చెప్పుఁడు. సముఖమున రాచుబారము లెందుకు? చల్లకువచ్చి ముంతదాఁచనేల? అని యుపన్యసింప దండపాణి వెంటనే యుత్తరమీయలేక సందేహించెను. అతని

మొగమునఁ జెమటలు తోఁచెను. అతఁడు భయపడినట్లు కనఁబడెను. వజ్రపాణి వెలవెలఁ బోయెను. చిత్రభానుఁడు దండపాణిమీఁదఁ జేయి వైచి "మిత్రుఁడా! ఏమి భయపడుచున్నట్లున్నావు? ఇది సేనాపతికిఁ దగినలక్షణము గాదు. క్షత్రియుఁడవు. మహావీరుఁడవు. జంకన్నది నీవున్నయూరనుండఁ గూడదు అట్టిదానికి నీమనస్సునెలవుగాఁ గూడదు." అని హెచ్చరించుచుండ దండపాణి "రాజద్రోహము. రాజద్రోహము." అని మెల్లఁగాబలికెను. అదివిని చిత్రభానుఁడు "రాజద్రోహమా? నేనుమాత్రము రాజునుగానా? ఈవఱకు నాయెడలఁజేసిన ద్రోహమునూ ఏమిచెప్పెదవు. మిత్రులయినందుకు నాకుజరిగిన యన్యాయమునకు మీరు ప్రతిక్రియ సేయవలయు. అవి పిచ్చిమాటలు, రాజెవఁడు? మీరాజు చనిపోయినాఁడు. ఈపసికూన నీకురాజా? మూలగూర్చున్న యీవింతంతువు నీకు శాసకురాలా? ఇంతబ్రదుకు బ్రతికి చివర కాఁడుదాని శాసనములా నీవుశిరసా వహింపవలసినది? దుస్తంత్రపేటికయైన యీముసలిరాబందు మణివర్మయా నిన్నుశాసించువాఁడు? ఛీ! ఈ పిఱికితనము విడువుము. వజ్రపాణీ! నీహృదయము వజ్రమువలెనుండవలె. మున్ను నేపాళసైన్యముల నఱుకాడిన యాధైర్యమొకసారి నీమనమున నెలకొల్పుము. పిఱికికండలను దూరముగఁ దొలఁగింపుము. ధైర్యము చిక్కఁబట్టుము." అని మందలించెను. వజ్రపాణియేదో యుత్తరము చెప్పఁబోవుచుండ రుద్రభట్టందుకొని "రాజద్రోహము భీరువులమాట. మీరెవరిని రాజునుజేసిన వాఁడేరాజు. చిత్రభానుని రాజుం జేయుఁడు. అప్పుడుమీరు రాజభక్తులగుదురు. ఇతఁడు విక్రమసేనునికొడుకు గాఁడా! శూరుఁడుగాఁడా? రాజ్యము సమర్థతతోఁ బాలింపలేఁడా? సైన్యముల నడుపలేఁడా! సమరముల విక్రమవిహారము సలుపలేఁడా? వీనికేమి కొఱఁత? మీ మనంబుల శంకలుబాఱఁద్రోలి యీ

తని రాజుం జేసి ధనము, పలుకుబడి, యధికారము, నన్నియుఁగలిగి మీరు మెలంగుఁడు. అదిగో ! లక్ష్మివచ్చుచున్నది. మోఁకాలడ్డు పెట్టకుండ దక్కఁజూలిన యీచిత్రభానుని బాగుచేసినప్రతిష్ఠ మీకు దక్కఁగాక ! మీయభిప్రాయముఁ జెప్పుఁడు? అని ప్రబోధింప దండపాణి మహాత్మా ! సందియము లేదు. చిన్నరాజును దండపాణి మోసముచేసి శత్రుపక్షముచుఁ జొచ్చినాఁడని లోకాపవాదము గలుగునని సందియపడుచున్నాను. అని మెల్లగాఁ జెప్పెను. వెంటనేరుద్రభట్టు "లోకాపవాదమా ? లోకులసందఱ మెప్పింపఁదరమా ! మన కిష్టమైనపని మనముచేయవలయునే గాని లోకులిట్లనుకొందు రట్లను కొందురని శంకించిన నొక్కకార్యముఁ జేయఁగలమా ? స్వబుద్ధిననుసరించిపోవుట శ్రేయము. లోకులు కాకులు ఇష్టమువచ్చినట్లు కూయుదురు. ఆకూఁతలన్నిఁటిని మనము లెక్కసేయరాదు. ప్రతిమనుష్యునిఁ గొందఱునిందింతురు. కొందఱుమెత్తురు. ప్రతికార్యమును గొందఱు శ్లాఘింతురు. కొందఱు దూషింతురు. ఎల్లరు దేనిని మెచ్చరు. ఎల్లరు దేనిని దూషింపరు. "ఆత్మబుద్ధి స్సుఖఁచైవ" యను నార్యోక్తి వినవే? ఎల్లవారికినంతఃకరణ ప్రవృత్తియే ప్రమాణము. కావున నీవిందు సందియంపడక చిత్రభానుని కండయై నిలువుము. ఇదేసమయము. జంకినలాభము లేదు. వెనుదీసినఁ బ్రయోజనము లేదు. అదనుపదనుదప్పిన మరలఁ గూడిరాదు." అని గంభీరభావముతోఁ బలికెను. దండపాణి మాఱాడలేక వారియుపన్యాసములకు దాసుఁడై "మీయిచ్ఛవచ్చినట్లు జేసెద. ఈశరీరము మీది దీనిని మీయిష్టము వచ్చినట్లుపయోగించుకొనుఁడు. నాతమ్ముఁడు నాతోడిపాటివాఁడే. మేము చిత్రభానునికొఱకుఁ జిచ్చుఱుకుమన్న నుఱుకుదుము. జలధిఁ బడుమన్నఁ బడుదుము. పంచప్రాణముల విడువుమన్న విడుతుము. కాని మేముగాక యితరసైన్యాధిపతులు కొందఱు గలరు. అందు

ముఖ్యముగ గదాధరుఁడు, శూలపాణిమున్నగు దండనాథులు రాజ
భక్తికిఁ బేరుపడినవారు. సేనలోఁ బలుకుబడి వారికిఁగూడ మెండు
గాఁ గలదు. వారు మనపక్షము రారు. ఆవిషయమై మనము గట్టిగ
విచారింపవలెను. అదియటుండఁగా నాకోరికలుగూడ మీరు విన
వలయుఁ జెప్పుమన్న జెప్పెద" నని చిత్రభానుని మొగమువంకఁ జూడ
"నిస్సంశయముగాఁ జెప్పవచ్చు" నని యతఁడు పలికెను. "వ్యవహార
ముపట్ల మొగమోటముగూడ" దని రుద్రభట్టు చెప్పెను. అప్పుడు
దండపాణి యిట్లనియె. "నాకూఁతురు మణిమాలికను విజయసేనున
కిచ్చి వివాహము సేయవలెనని చిరకాలమునుండి నేనభిలషించుచుంటిని.
ఆవిషయమై మీయభిమతమేమో తెలుపవలయు. ఇది నావిషయము.
మాతమ్ముని మనోరథముగూడ జెప్పెద నాకర్ణింపుఁడు. సిగ్గుపెంపున
వాఁడు చెప్పఁజాలకున్నాఁడు. మీకర్పూరమంజరి చెట్టబట్టవలె నని
మావజ్రపాణి తడవులంబట్టి తలపెట్టియున్నాఁడు. మాతమ్ముని మనో
రథము మీ రీడేర్పవలయునని కోరుచున్నాను. మాకింతకన్నఁ గోరి
కలు లేవు. మనమన్యోన్యమనోరథసిద్ధులుచేసి సుఖింపవలెనని నాప్రార్థన"
అని విరమింపఁ జిత్రభానుఁడు "మన మిరువురము వియ్యమందుట
నాకుఁ బరమానందకరము. విజయసేనుఁడు నీయల్లుఁడు నేఁడే యయ్యె
నని నీవు నిశ్చయించుకొనుము. ఇఁకఁ గర్పూరమంజరిని వజ్రపాణి
కిచ్చుట విషయమున దానిమనోరథమెట్లుండునో చెప్పఁజాలను. అయి
నను దానిమనసు విఱిచి తప్పక నీకు వివాహముచేసెద" నని దృఢ
ముగాఁ బలికెను. అతనిపలుకు నే దృఢీకరింపఁదలఁచి రుద్రభట్టుగూడ
నిట్లనియె——"ఇదియా మీకోర్కెలు! ఇందసాధ్యమైనదియు, నసం
భవమైనదియు నేదియు లేదు. విజయసేనున కెవ్వతెనో యొకబాలికను
దెచ్చి వివాహము సేయవలయునుగదా. ఆకన్యక మణిమాలికయే
యగుఁగాక! మణిమాలిక గుణమణిమాలికయని విందుము. అబ్బా

లిక విజయసేనుని సహధర్మచారిణియై యర్ధాంగలక్ష్మియై మహాపతి వ్రతయై సంతానవతియై భావికాలమున శ్రీకాశ్మీరరాజపట్టమహిషియై వర్ధిల్లుఁగాక యని మేమాశీర్వదించుచున్నాము. కర్పూరమంజరి యీ నాఁటిబాలికలవంటిది గాదు. జననీజనకులకు విధేయురాలు. చదువుల సరస్వతి. గానములప్రోవు. చక్కఁదనంపు దీవి. ఆమె తండ్రిమాట విని తప్పక వజ్రపాణి చేయిపట్టును. వజ్రపాణికి శచీదేవియుంబోలె నీవజ్రపాణి కీమె యిల్లాలై పేరుప్రఖ్యాతులఁగాంచి జయంతునిఁబోలు నందనుంగని చిరంజీవినియై వర్ధిల్లుఁగాకయని దీవించుచున్నాఁడ. నా యాశీర్వచన మమోఘమగుఁగాక! దివ్యులు ప్రసన్నులగుదురుగాక! చిత్రభానుఁడా! ఏమి యిది నీకిష్టమేగదా?" అన నతఁడు "సందేహ ములేదు. అట్లె జరుగుఁగాక" యనెను. "అట్లయిన మీరీయగ్నిసాక్షి గా నాయెదుటఁ బ్రమాణములు సేయుఁడు" అని రుద్రభట్టానతిచ్చి ఋగ్వేదములోని యగ్నిసూక్తమంత్రముఁ బఠించి యగ్నికభిముఖుఁడై యుండెను. చిత్రభానుఁడు లేచి యగ్నికిఁ బ్రదక్షిణముఁజేసి "ఓ యగ్నిదేవా! నీవు సాక్షిగ మణిమాలికను విజయసేనునకు భార్యగాఁ జేసెద. కర్పూరమంజరిని వజ్రపాణికి వివాహముచేసెద. అని నమస్కరించెను. అనంతరము దండపాణిలేచి వహ్నికిఁ బ్రదక్షిణము సేసి "నేను సుఖదుఃఖములయందు నాప్రాణములకయిన నాస పడక చిత్రభానునిపక్షమున నుండెద. ఓయగ్నిదేవా! నీవిందుకుసాక్షివి" అని ప్రమాణముచేసెను. వజ్రపాణియు నన్నే చేసినయట్లే ప్రదక్షిణముఁ ప్రమాణముఁ గావించెను. అనంతరము వారిరువురు రుద్రభట్టునకు నమస్కరించి గృహములకరిగిరి. "వలలోఁ బెద్దచేఁపలు పడినవి. ఇఁక విజయమున కాటంకము లేదు. ఇఁక నిర్భయముగ నిద్రబొమ్ము" అని రుద్రభట్టు చిత్రభానుని బహూకరించి పంపెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.

అట్లు మాధవసేనుఁడు చిత్రభానునకుఁ దనసందేశ మెఱిఁగించి యాతని వీడ్కొని మణివర్మకడకుఁబోయి తాను రాజసందేశ మెఱిఁగించుటయు నతఁడు తన్నుఁ దూలనాడుటయు రాజశాసనముఁ దిరస్కరించుటయు లోనగువృత్తాంతమంతయు నొకయక్షరమైన విడువకుండఁ జెప్పెను. సందేశఫల మట్లేయుండునని యిదివఱకే మనంబున నూహించుటంజేసి మణివర్మ వానిపలుకులు విని విస్మయము నొందలేదు. కాని యటమీఁది కర్తవ్యమేమియని యతఁడు విచారింపఁ దొడఁగెను. "మాధవసేనుఁడా! దండపాణియొక్కయు వజ్రపాణియొక్కయు బలముజూచుకొని మనయెడ నిట్టి తిరస్కారభావముఁ జూపియుండునా, లేక మామయైన విజయభైరవరాజువలన సహాయ్యము నపేక్షించి యిట్లు తూలనాడియుండునా? ఏమని నీవూహించెదవు?" అని యడిగెను. "ఉభయుల ప్రాపుఁగూడఁ జూచుకొని యతఁ డట్లు పరుష ప్రలాపములు నోటవెడలనిచ్చెను. అందుముఖ్యముగ నిక్కడివారి బలముఁ జూచుకొనియె యతఁడు నిర్భయముగ నున్నాఁడు. అట్టిప్రాపు లేనియెడల రాజశాసనము ధిక్కరించుటకు వాఁ డెంతవాఁడు? పట్టుమని పూఁచిలిమా పదిమంది సైనికులు లేరు. కావలసినవిత్తము లేదు. పలుకుబడి యంతకుముందే సున్న. ఇట్టివానికి ధైర్య మెక్కడినుండి వచ్చును. ఏదో దృఢమైన మూలకారణ ముండియుండవలయు" నని పెద్దమంత్రికిఁ జిన్నమంత్రి యుత్తరమిచ్చెను. "సరే! ఈవార్త రాజమాతకు మన చిన్నరాజునకు నెఱిఁగించి వారియభిప్రాయ మేమో తెలిసికొని మనము చేయవలసిన యుపదేశముచేసి కర్తవ్య మిదమిత్థమని నిర్ణయింతము. శంఖమునఁ బోసినంగాని తీర్థము గాదుకదా? ఏకార్యమునకైన రాజశాసనము ప్రధానముగదా! పద పద. అక్క

డికి పోవుదము" అని యిరువురు రాచనగరునకుం జని యరవిందా దేవినిఁ గనుంగొనిరి. అప్పుడు మాధవసేనుఁడు తనకుం జిత్రభానునకు జరిగిన సంభాషణమంతయు వరుసగాఁ దెలిపెను. విక్రమసేనుఁడు తెల్లఁ బోయి మంత్రులవైపుఁ జూచెను. అరవిందాదేవి హృదయము చెదరి నట్లు ముఖవైఖరి తెలియఁజేసెను. "అట్లయిన మనకు మరల దుర్దినములు సంభవించినవా" యని యామె హీనస్వరముతోఁ బలికెను. "సైన్యమునుబంపి యాతని నేల వెడలఁగొట్టఁగూడదు?" అని విక్రమసేనుఁడు బలికెను. "అదియే మేమును జేయఁదలఁచుచున్నాము. కాని సేనాపతుల రాజభక్తి స్థిరముగానున్నదో యూఁగులాడుచున్నదో తెలిసికొనుట కష్టముగా నున్నది" యని మణివర్మ పలికెను. "వారింతలో నంతఃకృతఘ్నులగుదురా?" యని యరవింద వచియించెను. "నాకనుమానముగా నున్నది. అది యిప్పుడే నిశ్చయింపవలయును. కావున మనము ముందుగా గథాధరుని, శూలపాణిని బిలిపించి వారిమనస్సెట్లున్నదో కనుఁగొందము" అని మణివర్మ వాక్రుచ్చెను. "అట్లకాక!" యని నమ్మికగల బంటునొక్కనిఁ బిలిచి విక్రమసేనుఁడాదండనాథుల నిరువురఁ బిలుచుకొనిరమ్మని పంచెను. వాఁడు నతిత్వరితముగ నరిగి యా చమూపతులం దోడ్కొనివచ్చె. వారిని సముచితసత్కారములంగారవించి మణివర్మ సుఖాసీనులంజేసి హేమచంద్రుఁడు చిత్రభానునిగుణముల రోసి దేశమునుండి వెడలనడఁచుట మొదలు నాఁటివఱకు జరిగిన యావద్వృత్తాంతము మరలవారికి జ్ఞాపకము చేసి యిట్లనియె__

"మిత్రులారా! రాజ్యమున కావశ్యములైన సప్తాంగములలో సైన్యకోశములు ప్రధానములు. సైన్యమున్నఁగాని రాజ్యలక్ష్మినిలువఁ జాలదు. కోశము సమృద్ధిగానుండినంగాని సైన్యము తనధర్మము తాను చేయదు. కాశ్మీరరాజ్యమునకు వలసినంత కోశసమృద్ధియున్నది. సైన్య

ముకు మీవంటిసేనాపతులుండుటచే సర్వలక్షణసంపన్నమై సమర్థమై యున్నది. కాని రాజ్యమునకు వెండియుఁ జిత్రభానునివలనఁ గొన్ని కలఁతలు సంభవించునని తోఁచుచున్నది. ఒక్కకడుపునఁబుట్టి యొక్కచో బెరిఁగి యొక్కమంచమునం బవ్వళించి యొకకంచమునం గుడిచిన హేమచంద్రుఁడే యతనిని నమ్మఁజాలక గాఢమైన యనుమానము మీఁద దేశమునందుండఁదగనివాఁడని వెడలనడచెనుగదా ! హేమచంద్రుని మరణమునుగూర్చి యెట్టి వాదుకలున్నవో మీరే యెఱుఁగుదురు. చిత్రభానునిచరిత్ర మొకనాటకముగా నున్నది. ఎవఁడో హరిశర్మయనువాఁడు వచ్చి ప్రయాగలో చిత్రభానుఁడు మిక్కిలి దీనముగా మరణమొందె నని మాయమాటలుచెప్పి మహారాజుగారి మనస్సు కలఁచెను. ఆమనఃక్షోభముచేతనే యాయన వికలచిత్తుఁడై హరిశర్మచేతిబొమ్మయై యాడి మరణముఁ దెచ్చికొనెను. చిత్రభానుఁడు సజీవుఁడై తాయివలె నున్నాఁడు. చుట్టఱికమువంక బెట్టి తన యన్నబిడ్డలయందలి ప్రేమరసమెల్ల నిక్కడవర్షించుటకు మరలవచ్చెను. పీరింబరామర్శించి వెడలిపోవుదునని చెప్పెఁగదా ! పిమ్మట నాలుబిడ్డలందెచ్చె. పురమువిడిచి పోవలసినదని సందేశమంప రాజమాతయొక్కయు, రాజుయొక్కయు శాసనము నిరాకరించి సందేశముం గొనిపోయిన మాధవసేనుని తృణీకరించి తూలనాడెను. ఆతఁడు నగరముననుండుట రాజకుటుంబమునకు రాజ్యమునకు ననర్థకము. అతని నెట్లయిన వెడలనడువవలయు. కావున మీరందఱు నవసరమైనపక్షమున సైన్యములతో నాతనియిల్లు ముట్టడించి వానిని దేశమునుండి యావలకిఁ బంపవలయు. కలుకుదనమెక్కుడైన మనము చుఱుకుదనమునెఱపి వానిని బంధింపవలయు. బంధింపవలె నననేల? అవసరమగుచేని శిరచ్ఛేదముఁ జేయవలయు. ఇంతకఠినముగాఁ బలికితి నని మీరు నొచ్చుకొనవలదు. మంత్రులు వైద్యులవంటివారు. వైద్యుఁ

డు దయాళుఁడయ్యు నిష్కారణముగా వ్రణమును ఛేదించునట్లు మంత్రులు రాజద్రోహులను నిర్దయాత్ములై దండింపవలయు. ఇవియెల్ల నేను మీకు జెప్పవలసినవికావు. ఇదిగో మీరాజు! అదిగో ఆతని తమ్ముఁడు అదే హేమచంద్రమహారాజపట్టమహిషి. వారినిముగ్వురను మాకు మీకు మీసైన్యమునకు నప్పగించి హేమచంద్రమహారాజుస్వర్గస్థుఁడయ్యెను. మీరు రాజభక్తిఁ జూపవలసిన సమయమిది. మీచిత్తనైర్మల్యముఁ బ్రకటింపవలసిన తరుణమిది. మీయున్నతభావముల వెల్లడింపవలసిన యవసరమిది. రాజ్యలక్ష్మిని గాపాడవలసినయదనిది. కావున మీరుమృతుఁడైన హేమచంద్రునిఁదలంచి రక్షణీయమైన రాజ్యలక్ష్మినిదలంచి, బాలుఁడై యేమియునెఱుంగకయున్న రాజు మొగముజూచి నవవైధవ్యదుఃఖభారవినమ్రయైన దేవి మొగముఁజూచి, భగవంతుని మొగముఁ జూచి, మోమోటవిడిచి చిత్రభానునిమాయలలోఁబడక యాతని వెడలనడఁచుటకు సర్వప్రయత్నములఁ జేయవలయు. దండపాణి వజ్రపాణులపై ఖరి వేఱు తెఱంగుగా నున్నదని యనుమానము గలుగుచున్నది. అయిన నిట్లు నిశ్చయముగాఁ జెప్పఁజాల. ఇదిమీకు సమ్మతమగునో కాదో చెప్పుఁడు. మనసులో నొకటి పెట్టుకొని పై నొకటి చెప్పవలదు.

అప్పలుకులు గదాధరశూలపాణుల హృదయంబులం గదలించుటంజేసి వారు త్సాహాపూరితులై రాజభక్తి ప్రేరితులైరి. గదాధరుఁ డిట్లనియె. "మహాత్మా! సైన్యము రాజ్యలక్ష్మికి సంగరక్షకబలము. అది సమర్థమై యుండదేని రాజ్యలక్ష్మి యచిరకాలంబునఁ బరహస్తగతయై నశియించు. ఇంతవఱకుఁ గాశ్మీరసైన్యంబులు సమర్థంబులై శత్రుమర్దనక్షమములై పరచక్రభయంకరములై యున్నయవి. దండపాణియు హేమచంద్రునియెడ భక్తితత్పరుఁడై యుండెను. అతని మనస్సు వాని తమ్ముని మనస్సు మాఱుటకుఁ దగినకారణ

ములు నాకగపడవు. అయినను దగినకారణము లుండినంగాని మీరు వారిచరిత్ర మనుమానాస్పదమని పల్కరు. వారెట్లయిన నగుదురు గాక ! నామాట చిత్తగింపుఁడు. ఈలోకమున నెవఁడైన హేమచంద్ర మహారాజునెడఁ గాశ్మీరరాజవంశమునెడ నాజన్మాంతముఁ గృతజ్ఞుఁడై యుండవలయునేని నిశ్చయముగ నట్టివాఁడు గదాధరుఁడే. గదాధరుని జీవనమంతయుఁ గాశ్మీరరాజుల ద్రవ్యమే. రక్తమంతయుఁ గాశ్మీరరాజుల ప్రేమరసమే. అట్టిగదాధరుఁడు కృతఘ్నుఁడగునేని నింకబ్రపంచమునఁ గృతజ్ఞత యనుమాట లేదనవచ్చును. నాపూర్వపు వృత్తాంతము నిమ్మహాదేవియు నీచిన్నిరాజు నెఱుంగకపోవచ్చును గాని సంపూర్ణముగ మీరెఱుంగుదురు. నేనొకరాచబిడ్డఁడను. హిమాలయపర్వతప్రాంతమున నొకకొండపల్లియ మాయునికిపట్టు. మాతండ్రికృషీవలుఁడు. నాజననీజనకులకు నేనొక్కఁడనే పుత్రుఁడను. మందభాగ్యుఁడనైన నేనుదయించిననాఁడే నాతల్లి భూలోకమును బాసి పరమపదమునొందెను. నిఱుపేదయైన నాతండ్రినాకుం దల్లియై పురిటి మంచమెక్కి యుగ్గుపాలుబోసి పెంచి మిక్కిలికష్టపడి నన్నుం బదియేండ్లవానింజేసెను. ఆపదలకదృష్టహీనులు పరమబంధువులు. నాతండ్రి నాపదియవయేట నన్నును దనకు నితరులకుఁగూడ భారముగనున్న తన శరీరమునువిడచి పరలోకమునైన సుఖముకలుఁగక పోవునా యని యచ్చటికిఁ జనెను. అప్పుడు చేయునది లేక నేనుకొన్నిదినంబులు చుట్టములయింట నిరుగుపొరుగు వాండ్రయింటఁ గాలక్షేపముఁజేసి వారిచేఁ దిరస్కృతుఁడనై కట్టగుడ్డలేక నిలువనీడలేక తినుటకన్నము లేక యాదరించుటకాప్తులులేక నాదియనిచెప్పఁదగిన పదార్థములేక పొట్టజరుగుటకుపాయముగానక మాధుకరవృత్తిచేత భిక్షాటనముచేత నొకపూఁటతిన్నట్లు నొకపూఁటతిననట్లు గొన్నిప్రొద్దులుపుచ్చి విసిగి దుండఁగులగు బాలకులఁ గొందఱంగలిసి చిన్నచిన్నదొంగతనము

లారంభించితిని. క్రమక్రమముగా నందారి తేఱి పదియేనేండ్ల ప్రాయమున బందిపోటుల జట్టులోఁ గలసితిని. హేమచంద్రమహారాజుతండ్రి విక్రమసేననృపాలుఁడు కాశ్మీరమును బాలించుచు దేశక్షేమమరయుటకై మంచుకొండదాఁపున నున్న ప్రాంతములకొకసారి వచ్చెను. ఆ ప్రాంతమున వసియించుజనులు "దురాచారులగు చోరులబాఱినుండి తెమ్ము రక్షింపు" మని యానరేంద్రుని వేఁడ నతఁడక్కడఁ గొన్ని దినములుండి సైనికులచేత బందిపోటుల వెతకించిపట్టించి వారిలోఁ బెక్కండ్రకుఁ దగినదండనల విధించి నన్నుఁ జూచి యిట్లనియెను. "ఓరీ! నీది లేఁబ్రాయము. ఆకారమునుజూడ సద్వంశజాతుఁడవని తోఁచుచున్నది. మొగము విలాసమును గ్రక్కుచున్నది. నీ తెలివితేటలు నీసాహసము నీబాహుబలము మంచిదారిని బ్రయోగించిన లోకమునకెంతో మేలగు. నీవు నీవృత్తిమాని వెనుకటి కార్యములకై పశ్చాత్తాపమునొంది సన్మార్గమున సంచరింతువేని నీభవిష్యచ్చరిత్రము శ్లాఘాపాత్రమగును. ఈతలంపుల విడువుము. నావెంట రమ్ము" అని దయార్ద్ర హృదయుఁడై పలికిన యానరపాలుని వాక్యములు నాచెవులలో నిప్పుడును ధరించుచున్నట్లున్నవి. కరుణారసపరిపూర్ణములైన యాయనచల్లని చూడ్కులు నామీఁదనిప్పుడు ప్రసరించుచున్నట్లున్నవి. శాంతరసమొలుకు నామహాత్మునిమూర్తియిప్పుడు నాకన్నులఁ గట్టినట్లునవి. ఆయనవాక్యామృతము నాశ్రవణములఁ బడినతోడనే నామనోమాలిన్యము నీటం గడిగిన తెఱంగునఁ దొలఁగిపోయెను. మనస్సు నిష్కలుషమయ్యెను. పశ్చాత్తాపమహాగ్నిచేఁ బాపపటలము భస్మమయ్యెను. ప్రాఁత యాకులూడిపోయిన చెట్టువలెఁ గుబుసమూడ్చిన త్రాఁచువలె నామనసిప్పుడు స్వచ్ఛమై యుండెను. వెంటనే నేనామహాత్ముని పాదములపైఁ బడి 'దేవా! నాతప్పులు క్షమింపుఁడు. నేను మహాపరాధిని. దండ్యుఁడను. మీదండనలకన్న మీహితోపదేశమే నాకు

గొప్పశిక్షయై నన్ను శుద్ధునిఁ జేసెను. పశ్చాత్తాపమహాగ్ని నాహృదయముఁ గాల్చుచున్నది. ఇఁక నేసన్మార్గమున సంచరించెద. ఇఁక నన్ననుగ్రహింపుఁడు, అని వలవల నేడ్చి యారాజశేఖరుని పాదరాజీవముల నాబాష్పధారలచే నభిషేకించితిని. భూమండలాఖండలుఁడగు నప్పుడమిఱేఁడు నన్ను స్వయముగా దనచేతులతో నెత్తి వగవకు బాగుపడియెదవని ధైర్యముచెప్పి చేతితోఁ వీపుపైఁ దట్టి నన్ను స్నానము చేయింపుమనియు నూతనవస్త్రముల నాచేఁ గట్టింపుమనియు సేవకుల కానతిచ్చెను. వారట్లు గావించిరి. అప్పుడు నేను క్రొత్తమనుష్యుఁడనైతిని. నామనోవృక్షమునఁ గ్రొత్త తలఁపులను జివుళ్లు మొలకలెత్తసాఁగెను. మహారాజుగారితో నేను రాజధానికివచ్చి విద్యాభ్యాసము జేయ నారంభించితిని. నేను మిక్కిలి శ్రద్ధగా జదివి గురువుల యనుగ్రహమునకుఁ బాత్రమునైతిని. ఎప్పటికప్పుడు మహారాజుగారు నావర్తనముఁగూర్చియు నా విద్యాభివృద్ధిని గూర్చియు గురువులనడిగి తెలిసికొనుచు వచ్చిరి. సామాన్యవిద్యతోఁ బాటు ధనుర్విద్యయు నేర్చితిని. అందనేక బహుమానములు వడసితిని. గురువులయు సహకారులయు మెప్పుఁగాంచితిని. అంతలో నమ్మహారాజు పరమపదము నందెను. హేమచంద్రమహారాజు రాజ్యాభిషిక్తుఁ డయ్యెను. పితృభక్తిని హేమచంద్రుఁడు రామచంద్రుఁడు సత్యభాషణమున హేమచంద్రుఁడు హరిశ్చంద్రుఁడు ప్రసన్నభావమున హేమచంద్రుఁడు శరశ్చంద్రుఁడు. ఆతండ్రికిం దగినకొడుకు గావునఁ దండ్రిచే గారామునఁ బెంపఁబడిననన్ను మిక్కిలికనికరంబునం గని యమ్మహారాజు మరణంబువలన దుఃఖితుఁడనైన నన్ను నోదార్చి కొంతసేన కధిపతిం జేసి వివాహము జేసి నన్నొకయింటివానిం జేసెను. ఆమహాత్మునిదయవలన గౌరవమార్జించితిని. ధనమార్జించితిని సంతానవంతుఁడనయితిని గృహారామక్షేత్రములసంపాదించితిని. మిత్ర

లపాగ త్తలకుఁజుట్టములు యాదరణకులోకులమన్న వకునాస్వామి యనుగ్రహామునకుఁ బెద్దల దీవనలకు భాజనమైతిని. ఉదయమున లేచి హేమచంద్రుని పేరుఁ దలఁచి విక్రమసేనుని నామముఁ దలఁచి, మొక్కులిడుదును. నే వసియించు గృహము వారిది. తినెడియన్నము వారిది. కట్టుబట్ట వారిది. నాచర్మముఁగోసి పాదరక్షలుగఁ గుట్టి యీమహాత్మునకిచ్చినను నాఋణముతీరదు. వారు మసిబొగ్గును దెచ్చి మానికముఁ జేసిరి. సత్తిగుల్లను ముత్తెపుఁజిప్పఁజేసిరి. ఇత్తడిపుత్తడిఁజేసిరి పశువును మానిసిం జేసిరి. ఇంతకన్న మహోపకార మెవ్వరు చేయఁగలరు? ఇట్టినేను గాశ్మీర రాజులయెడఁ గృతఘ్నుఁడ నగుదునేని—— ఛీ! నాజన్మమేల? జంతువులకయినఁ గృతజ్ఞత కలదు. పరమనీచమైన కుక్క పిడికెడన్నము వైచిన నది యెన్నఁడు మఱువదు. వృక్షముల సైతము తమకుఁ జిన్ననాఁడు నీరువోసి పెంచిన మనుష్యులకు బ్రతికియున్నంత కాలము నీడనిచ్చును. కాయలిచ్చును. ఆకులిచ్చును. పండ్లనిచ్చును. చచ్చియు వారికనేకవిధములనుపకరించును. క్షుద్రజంతువులు, ప్రాణులునయితిమట్లే కృతజ్ఞత గలిగియుండ నీశ్వరాంశసంభూతుఁడై జ్ఞానేంద్రియవ్యాపారముఁ గర్మేంద్రియవ్యాపారముఁ గలిగి విద్యాసంపన్నుఁడైన మనుష్యుఁడు కృతజ్ఞుఁడగుట యాశ్చర్యమా? అది లేనివాఁడు వానరుఁడుగాని నరుఁడుగాఁడు. కావున నోమహాదేవీ! యోరాజా! యోయమాత్యులారా! ఈగదాధరుఁడు రాజకుటుంబమునకు రాజ్యమునకు క్షేమకరమగునట్లు వర్తించును. రాజా! బాలుఁడవయినను రాజవగుటచే మాకుఁ బూజ్యుఁడవు. అందుచే మీపాదములపై నేను ప్రమాణము చేసెద* అని మహోత్సాహముతోఁ బలికి రాజకుమారుని పాదములు స్పృశియించి ప్రమాణముచేసి రాజభక్తి బ్రకటించెను. అంతకుముందు నిరుత్సాహముచేఁ గ్రుంగియున్న రాజమాతృ విక్రమసేనుల మనస్సులు నూతనోత్సాహ భరితములగుటయు వారిమొగములు వికాసవంతము లయ్యెను.

అంతట మణివర్మ "గదాధరా! నీవృత్తాంతముఁ గొంత నేనెఱుఁగుదును. నీ నడత నీమాటలకు విస్పష్టవ్యాఖ్యానముగా నున్నది. ఉప్పునీరు మంచినీరుగామాఱినట్లు ఎండ కాలవిశేషముచే వెన్నెలయైనట్లు దురాచారుఁడవు పరమసాధువైతివి. నాఁటనుండియు నీచరిత్రము శ్లాఘాపాత్రమై యున్నది. మేము నిన్ను నమ్మియుండెదము. శూలపాణీ! నీయభిమతమేమో చెప్పుము!" అని యడిగెను.

అనవుఁడు శూలపాణియిట్లనియె. "మహాత్మా! చెప్పుట కేమున్నది. కుత్తుకలో విసముఁబెట్టుకొన్నవాఁడు నైనను రాజునెదుట విపరీతముగాఁ బలుకునా? తేనె తేటలూడిపడునట్లు పలుకును. నానడతయే నాభావమును వెల్లడింపవలెను. పలు పలుకులేల? నేనుఁ గదాధరుని తోడివాఁడనే. అతనిమనస్సు నామనస్సునొక్కటియె. అవసరమగునేని మేమిరువురము మాప్రాణములను మాచిన్నిరాజునిమిత్తము సమర్పించెదము. మాశిరస్సులు రాజ్యలక్ష్మికిఁ గానుకగా నిచ్చెదము. ఇంతకన్న వేఱు చెప్పవలసినదిలేదు. దండపాణిని వజ్రపాణిని గూడఁ బిలిపించి వీరిద్దఱియెదుట వారిమనోగతము నరయుఁడు. మాటలంబట్టియు ముఖలక్షణములంబట్టియు వారిభావమెఱుఁగవచ్చును. ఈవజ్రకుమారు వారితో మాటలాడియుండుట వేఱు; రాజునెదుటఁ బలికించుట వేఱు."

"అదితెన్నయైనపని" యని మాధవసేనుఁడు హెచ్చరించెను. "వారు రాకుండనే మాకుముందుగా సెలవియ్యదగును." అని గదాధరుఁడు వెండియు నిట్లనియె. "ఈస్థితిగతులలో నామనవియొకటివినుండు! వెంటనే చిత్రభానుని వెడలఁగొట్టుటకు మనము ససైన్యముగా వానియిల్లు ముట్టడించుట కర్జముగాదు. వారిచేష్టలు మనము కనిపెట్టుచుందుము. మీదుమిక్కిలివచ్చినవెంటనే మేమువానిం దాకుదుము. రేపుమాపు వచ్చినతొందరలేదు. నాకిపుడు సెలవొసంగుఁ

డు. పోయి వచ్చెదన. అని యండఱవీడ్కొని శూలపాణిసహితుఁడై వెడలెను. మఱియొక పరిచారకుం బిలిచి దేవి దండపాణిని వజ్రపాణిని దోడితెమ్మని పనిచెను. వాడతివేగమున వారిసదనముల కరిగి రాజశాసనమెఱింగించెను. "నీవుముందునడువుము మేము వెనుకవచ్చెదము" అనివారిరువురునొకముహూర్తము తమలోఁ దారురహస్యముగ మాటలాడుకొని సేవకుఁడరిగియొకగడియలో నేరాచనగరుఁ జొచ్చిరి. మనోమాలిన్యము పైకిఁదోచనోయన్నట్లు మొగములుతొంటియట్లుండక వికాసశూన్యములై యుండెను. మణిదర్పవారినిగూడ సబహుమానముగా గారవించి యుచితాసనంబులం గూర్చుండఁబనిచి మెల్లగ నిట్లనియె.— "ఇదివఱకు నేను మీతోఁ జిత్రభానునివిషయమై ప్రసంగించినను మనరాజుగారుగూడ దద్విషయమున మీయభిప్రాయమునువ్యయముగాఁ దెలిసికొనఁగోరి మాతృశాసనమున మిమ్ము రావించిరి. మీహృదయమకలంకమని నేనెఱుఁగుదును. అదియే రాజుగారు మీనోటవినఁగోరుచున్నారు. చిత్రభానుఁడు పురమునుండి వెడలవలయునా లేదా! తనయంతటఁదాను వెడలకున్న మీరాతని సైన్యసహాయమున దేశమునుండి తోలవలయునని మనరాజుగారియాశయము. దండాధినాథులగుటచే నీకార్యభారము మీపైఁబడియున్నది. ఆవచనంబులు విని దండపాణి మొగము చిట్లించుకొని యిత్తెఱంగునఁ బలుకఁజొచ్చె. "అయ్యా! మున్నొకసారి మీరీవిషయమునన్నడిగిరి. అప్పుడునాకుంబోలినతెఱంగున మీకుత్తరమిచ్చితిని. చిత్రభానుఁడు పురమువెడలిపోవలయునో లేదో నిర్ణయింపవలసినవారు రాజుగారును మంత్రులైనమీరునుగాని మేముగాము. కార్యనిశ్చయము మీరు చేసినవెనుక మీయాజ్ఞాప్రకారము దళములఁగొని శత్రుమర్దనము చేయుటమాపని. అదియునుఁగాక మాటిమాటికి మమ్ముంబిలిచి మాయభిప్రాయ మడుగుటకు మేము రాజద్రోహులమా! కుట్రలుపన్నుచున్నామా? మాకు

మాత్రము గౌరవము లేదా? ఇట్లవమానించుట మీకుఁదగునా?" యని కఠినస్వరముతోఁ బలుకుచున్న యాదండపాణి మాటకడ్డము వోయి విక్రమసేనుఁడు "అయ్యో! దండపాణీ! మీరు రాజద్రోహులని యెవరన్నారు? మీరు కుట్రలు పన్నుచున్నారని యెవరు పలికిరి! రాజకార్య విషయములను సమాలోచించుటకు మిమ్ముఁ బిలువనంపుట మిమ్మవమానించుటా? మణివర్మ యాడిన మాటలలో దోషమేమున్నది? మీ కింతరోసమునకుఁ గారణమేమి? రాజ్యక్షేమమును జూడవలసినవారు మంత్రులు దండనాథులు గదా! రెండుచెట్లకొమ్మలొండొంటితో రాపాడి నిప్పుబుట్టించి వనమెల్లఁ గాల్చినట్లు ప్రధానపురుషులగు మీరు పరస్పరవివాదములుగలిగి రాజకులమును కాపకవాటింపఁ జేయుదురా? ఇదిధర్మమా శూరకర్మమా?" అని గంభీరముగా నడిగెను. అడుగుటయు దండపాణి మొదటికన్నఁ గోపము శాంతించి తనచిన్నప్రభువున కిట్లనియె. "రాజా! మణివర్మవైఖరిఁ జూడ మామీఁద నవమానము బూనినట్లు దోఁచుచున్నది. మేమవమానింపవలసిన వారము గాము. ఈవఱకు రెండుసారులు మమ్మతఁ డీవిషయమునఁ బ్రశ్నించుటం జేసి యాత్మగౌరవముఁ గలవారమగుటచే సహింపక కష్టముగానున్నది. అందుచేనట్లనవలసివచ్చె. అంతేగాని దేవరవారియెడ మా కెట్టి దురభిప్రాయమును లేదు. మే మెట్టి ద్రోహముఁ దలఁచుకొనలేదు. మీయాజ్ఞకు బద్ధులము. మీకనుసన్నలమెలఁగెదము. మీముదలయగునేని యెట్టిపనియైనఁ జేయఁగలవారము. కావున మాయందు సంపూర్ణవిశ్వాసము నిలుపవలయునని ప్రార్థించుచున్నాము. అనవుడు మణివర్మ "నావైఖరింబట్టి మీ కాగ్రహము గలిగినదా! మీ కవమానము గలిగింపవలెనని నేఁ గలనైనఁ దలఁపలేదు. నామాటలలోఁగాని భావములోఁగాని నాముఖలక్షణములోఁగాని మీ కవమానకరములైన చిన్నెలేవియు లేవు. ఒకవేళ మీకట్లు

దోఁచినపక్షమున నేను వయోవృద్ధుఁడను చంచలస్వభావుఁడను గావున నన్ను క్షమియించి రాజకార్యమును జక్కఁజేయుఁడు. మనకు వివాదములున్నపక్షమునఁ బిమ్మటఁ దీర్చికొనవచ్చు నని యనునయపూర్వకముగాఁ బలికెను. అంతట వారు రాజును మంత్రులను వీడ్కొని స్వగృహముల కరిగిరి.

వారు వెడలినపిదప మాధవసేనుఁడు మణివర్మతోఁ "జిత్తగించితిరా? వాని మాటలవలన. వారినీడలుచూచి వారే భయపడుచుచున్నారు. అంతఃకరణము మలినమైనప్పుడు మానవుని కెదుటివారి మనస్సులుగూడ మలినములైనట్లు గనఁబడును. కామిలరోగికి జగమంతయుఁ బచ్చఁగాఁ గనఁబడునుగదా? చూచితిరా! గదాధరునిమాటలకు వీనిమాటలకు నెంత వ్యత్యాసమున్నదో. అతని రాజభక్తి హృదయమునుండి వెల్లివిరిసినది. వీని భక్తి జిహ్వాగ్రమునుండి వచ్చినది. కావున వీరిని విశ్వసించియుండుట శ్రేయస్కరముగాదు." అని వచియించెను. "నీవుయదార్థము వచించితివి. దోషాత్మునకు లేనిచోట ననుమానముగలుగును." అని మణివర్మ వాని కుత్తరమిచ్చెను. విక్రమసేనుఁడు చిఱునవ్వునవ్వి ఉన్నమాటన్న నులుకెక్కువన్నట్లు దండపాణికి నిర్హేతుకమైన యాగ్రహమువచ్చినది. మనము వీరివిషయమున జాగ్రతగానుండవలె నని పలికెను. "మీరిద్దఱు గదాధరశూలపాణులు నను నాలుగుస్తంభములమీఁద నిప్పుడు కాశ్మీరరాజ్యసౌధము నిలిచియున్నది. దండపాణి రాజభక్తి మలినమైనదో శుద్ధమైనదో సమయమును గీటురాతిమీఁదఁగాని తెలియదు. ఇంకమీరు మీపనులమీఁద నుండుఁడు." యని యరవిందాదేవి పలికి వారికి సెలవిచ్చెను.

---

## తొమ్మిదవప్రకరణము.

రాచనగరమునుండి వెడలి దండపాణియుఁ సోదరుఁడును స్వగృహంబులకుఁజనక యారేయి వెండియుఁ జిత్రభానుని గృహంబున కరిగి రాజగృహంబున నాఁడు జరిగినవృత్తాంతమంతయు దెలిపిరి. చిత్రభానుఁడు తనయెడ వారికిఁ గల యమితానురాగమునకు సంతసించి కొండొకవడి పొగడి యిట్లనియె "మిత్రులారా! అయస్కాంతమునకు సూదికింబలె నాకును మీకును గాఢసంబంధము కుదిరినందుకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. మీచెవినిఁ బడిన చిన్న మాటయు దాచక నాకు వెంటనే తెలియఁజేయవలె నని మీరుసంకల్పించుట మనకార్యసిద్ధికి సూచకము. ముందుగా వారే కలహమునకు డీకొనునట్లు మనము చేయవలయునుగాని మనము దిగఁగూడదు. అందుచే నీలోపున సైనికులవిషయమున మీరు వలసినప్రయత్నము చేయుచుండుఁడు" అనుచుండ రుద్రభట్టు "కీలకమంతయు సైన్యములోనే యున్నది. దానింగలఁచుట కనేకప్రయత్నములు గావలయు. కొంతయత్నము మేముగూడఁ జేయుచున్నాము అది యిఁక మీఁద గాలక్రమమున మీకుఁ దెలియఁగలదు" అని పలికెను. అనంతరము గొంతసంభాషణము జరిగినవెనుక దండపాణి యిట్లనియె. "మాకొక్క కోరిక యున్నది. అది మీయిరువుర సన్నిధానమున విన్నవింపఁదలఁచుచున్నాము. కర్పూరమంజరిని మావజ్రపాణికిచ్చి వివాహముచేయుటకు మీరంగీకరించిరి గనుకను మామణిమాలికను విజయసేనునకు బెండ్లిచేసికొనుటకు మీరిష్టపడిరిగావునను నీరెండుకార్యములకుఁ బ్రధానముచేసికొనవలెనని మేముబలాటపడుచున్నాము. మాముద్దు చెల్లించి యీకార్యము చేయవలయు."

అప్పలుకులలో మొదటిభాగము చిత్రభానునకు రుచింపలేదు ఏలయనగుణముల పేటికయైన కర్పూరమంజరి వజ్రపాణినివరించునో

వరింపదో చిత్రభానుఁ డెఱుఁగఁడు. ఇంతకు మున్నామెతో నా ప్రసంగము చేయనే లేదు. రెండవభాగమైన మణిమాలికావివాహము చిత్రభానునకిష్టమే. ఆవిషయమై ప్రధానము చేసికొమ్మన్నను నతఁడు చేసికొనుటకు సిద్ధముగ నుండెను. ఒకటి చేసి రెండవది మానినపక్షమున వారి కనుమానము కలుఁగవచ్చును. చేసిన రెండును జేయవలయు; మానిన రెండును మానవలయు. చిత్రభానున కప్పుడు విషమపరిస్థితులు తటస్థించెను. తాము తలపెట్టిన కార్యములన్నియు ముగిసినపిదపఁ బ్రధానములు చేయవచ్చునని చెప్పినచో వారికి విశ్వాసముండదని భయము. అందుచే నెద్దియుందోఁచక యతఁడు వెంటనే యుత్తర మీయక మనోవేదనము బడుచుండ వాని చేష్టలంబట్టి మనోగతభావ మెఱిఁగి రుద్రభట్టు "దండపాణి కిట్లనియె. దండపాణీ! నీసంకల్పము మంచిది. 'శుభస్య శీఘ్ర' మ్మను నార్యోక్తినిబట్టియు 'నాలస్య మమృతం విష,' మను న్యాయమును బట్టియు నిట్టివి వెంటనే జరుగుట మంచిది. కాని యవి క్రొత్తవారివిషయమునఁ గాని, మీవంటి పూర్వపరిచితుల విషయమునఁ గావు. మాటయే ప్రధానముగాని మానవంతులకుఁ బ్రధానము ప్రధానముగాదు. పసుపుం గుంకుమ పండ్లు దెచ్చి యొండొరులకిచ్చి పుచ్చుకొనుటచేత ననుకొన్నమాటలు స్థిరమగునా? కానిచోఁ గార్యములు భగ్నమగునా ? అగ్నిసాక్షిగఁ జేసిన ప్రమాణములకన్నఁ బ్రధానములు బలవత్తరములా? ఇది యొకముచ్చట. అదియు నాఁడువారిముచ్చట. మగవాండ్రు దానింగూర్చి యంత పట్టింపులు బట్టఁగూడదు. కాఁబట్టి కాలాంతరమున నన్నిముచ్చటలు దీర్చుకొనవచ్చును. ఇది విషమసమయము. తాంబూలములు పుచ్చుకొనుటకైనఁ బదుగురు పెద్దమనుష్యులు వచ్చుటకు వీలులేనితరుణముగదా యిది! పదిమంది జేరి వెల్లడిగా జరుగవలసిన శుభకార్యము చాటున మాటున జేసికొనుట యేటితగవు! కావున సర్వవిధముల నిది కాలాంతరమునగావచ్చును. మీఁద మీయిష్టము."

అదివఱకేమియుఁ దోఁచక యేమియు త్తరముజెప్పదునాయని సందిగ్ధమనస్కుఁడై యున్నచిత్రభానునకు రుద్రభట్టు పలుకులు ధైర్యము గొలిపెను. అప్పలుకు లూఁతగాఁగొని చిత్రభానుఁడు వారినుద్దేశించి "విజయనేనుఁ డెక్కడికేగును? కర్పూరమంజరియెక్కడికరుగును? ప్రధానములు కాకపోవు. వివాహములు, గాకపోవు. వివాహము ప్రధానముగాని, ప్రధానము ప్రధానము గాదు. చంచలచిత్తులకు మాటనిలకడలేనివారికి బ్రధానములుగాని మనకేల? ఈమహాత్ముఁడు సెలవిచ్చినట్లు గాలాంతరముఁ గావచ్చు" నని పలుక వజ్రపాణి "యిప్పుడు చేసికొనినందువలనఁ దప్పేమి" యని మెల్లగాఁ బలికెను. "నామాటయెటులున్నను జిన్నవాఁడైన మాతమ్మునికోర్కె దీర్చుట సర్వోత్తమము" అని దండపాణి వాకుచ్చెను. వారుపట్టినపట్టు వదలకపోవుటచే సమయము దాటించుటకు రుద్రభట్టు "సరే! అట్లె యగుగాఁక! ప్రధానమునకైన మంచిముహూర్తముండవలయు. నేనా సుముహూర్తము బెట్టి మీకుం దెలియబరచెద. ఇది మీకిష్టమేకద?" యని పలికెను. "అహా! మాకిష్టమే" యని వారిరువురు సంతుష్టులై సెలవుఁగైకొనిపోయిరి. వారు వెడలినపిదప రుద్రభట్టునకును జిత్రభానునకును నీక్రిందవిధమున సంభాషణము జరిగెను.

చిత్రభాను.—స్వామీ! నేనిప్పుడు పిశాచమునకు సముద్రమునకు నడుమనున్నాడను. ముందరకువచ్చిన దయ్యము మ్రింగును. వెనుకకుఁబోయిన సముద్రతరంగములు ముంచి చంపును.

రుద్రభట్టు.—ఏ మట్లనుచున్నాఁడవు?

చిత్ర.—వజ్రపాణికోరిక దుర్ఘటముగా నున్నది. కర్పూరమంజరి మనస్సుచందము నేనరయలేను. అది వీనిపై వలపు నిలుపునో లేదో తెలియదు. అది వీనిఁగూర్చి మేలుపడదేని పండఁబాఱిన పాల

మొండబారినట్లు గార్యమంతయు భగ్నమగును. వీరు ప్రిధానమిప్పు డే చేయవలెననుచున్నారు.

రుద్రి—ఇందుకా యింతబెంగ? మానవుఁడు కష్టసమయముల యందే ధీరోదాత్తుఁడై, తన మనశ్శక్తినిఁ జూపవలయును. తొందర పడక బెంగగొనక కలఁతనొందక నరుఁడు నిర్మలమగు తటాకజలము వలెఁ బ్రిదిమలమనస్కుఁడై యుండెనా యెంతెంత కష్టసమయము లందును మబ్బులేని యాకసమున సూర్యోదయమైనట్లు చక్క ని యుపాయములు తోఁచును.

చిత్ర.—అది జితేంద్రియులగు మీకు సాధ్యముగాని మావం టివారలకు సాధ్యముకాదు. కష్టసమయము రాఁగానే మనస్సు నిప్పుఁదాక్కినకోఁతివలెఁజంచలమై యాలోచనకనర్హమైయుండును. కావున నిప్పుడు నాకేమియుఁ దోఁచకున్నది.

రుద్రి—నీ కూఁతురు మనోరథ మేమో తెలిసికొనకయే నీ వింత కలఁతజెందనేల? ఆమె నీకోరిక నిరాకరింపకపోవచ్చును. ఆమె నడిగిరమ్ము. కార్యము సఫలమయ్యెనా సరె! కాదేని నాఁటి కొకయు పాయ మూహింపఁజాలమా ?

చిత్రి—అట్లయిన నే నామెనడిగి వత్తునా ?

రుద్రి—ముందుగా నీవడుగుట యుక్తముగాదు. ఆఁడుబిడ్డల కుఁ జిన్ననాఁటనుండి తల్లిదగ్గరఁ జనవులు మెండు. కావున నామె మనోరథమేమొ తల్లిచే నడిగింపుము.

చిత్రి—సిగ్గుపెంపునఁ దల్లికిఁ జెప్పనిపక్షమున ?

రుద్రి—అంతకన్న నెక్కుడు నుచ్చికయుఁ జనవులుగలవారు చెలికత్తియలు. చంద్రికను మల్లికను వేఱువేఱుగఁ బిలిచి రహస్య ముగ నడుగుము. రాజపుత్రికల తలంపులకుఁ జెలికత్తెలు దాపుడు బరిణలు.

చిత్రి—అట్లయిన నేను తద్విషయప్రయత్నమున నుండెద. ఇవియన్నియుఁ దేలినతరువాతనే మనము సుముహూర్తముమాట నాలోచింపవచ్చును.

రుద్రి—నీకుఁ గూఁతురు రాచనగరములో నున్నదికదా! మీ వైయ్యము లంతకంత కెడమగుచున్నప్పుడు మీ ప్రతిక శత్రుగృహమున నుండుట నీకును వారికిని శ్రేయముగాదు. వెంటనే బిలువనంపుము. పాముపగయుఁ బడగ చుట్టము నగునా ?

చిత్రి—ఔను! ఆమెనిటకుఁ దోడితెచ్చుట యుభయులకు శ్రేయస్కరము. అట్లుచేసెద.

అనియాతని వీడ్కొని చిత్రిభానుఁడు దీర్ఘాలోచనావశంబున మెల్లమెల్ల నడుగు లిడుకొనుచు నభ్యంతరమందిరమునకుం జని యిందుమణిం గాంచి కర్పూరమంజరిని వెంటనే పిలిపింపుమని యానతిచ్చెను. అట్లకాకయని యామె చంద్రికామల్లికలఁ బిలిచి “రాచనగరమున కరిగి బాలికం దోడితె” మ్మని సెలవిచ్చెను. సెలవిచ్చుటయు తడవుగా వారిరువురు నచ్చోటికిం జనిరి. ఆలోపున నిందుమణితోఁ జిత్రిభానుఁడు గృహకృత్యంబులంగూర్చి కొంతముచ్చటించి కర్పూరమంజరి మాటయెత్తి ప్రసంగవశమున నిట్లనియె. “బాలిక వివాహయోగ్యమగు వయస్సును బ్రాపించినది. ఇంక మనమాలసింపక వరాన్వేషణమునకుఁ గడంగవలయు.

ఇందుమణి—నానోటితో నేననఁగూడదుగాని దానిం జూచినవారందఱు నిది సర్వలక్షణసంపన్న యగుకన్య. దీని కనుకూలుఁడగు వరుఁడు లభించుట కష్టమని పలుమాఱు నాతో ననిరి.

చిత్రభాను—అన్నిలక్షణములు నొక్కచో గుమిగూడియుండునా ? చెఱుకునకుఁ గావలసినంత తీపియున్నదిగాని పండ్లు లేవు. పనసపండు గర్భమున రసవంతమ్ములైన తొనలుండును.

మీఁదిభాగము మిక్కిలి మోటగానుండును. విశేషించి పనసకుఁ బూవులు లేవు. మామిడికి జీడియుండును. సీతాఫలమునకు లెక్కలేనన్ని గింజలు. భానునియందు దుస్సహమైన వేఁడియుండును. చంద్రునియం దతిశైత్యముండును. అట్లే పురుషులయందు నొకఁడు సత్కులప్రసూనత గలిగియుండును. ఒకఁడు చక్కదనంబున కిక్కయగును. ఒకఁడు గానమునకు స్థానమగును. ఒకఁడు మాటలలోఁ దేనె తేటలు గురిపించును. ఒకఁడు విద్యానిధియై పుంభావసరస్వతియగును ఒకఁడు వాక్పటిమలో నపరశేషుఁ డనిపించుకొనును. ఒకఁడు మేటిను గంటిమికిఁ బేరువడును. ఒక్కఁడు సౌజన్యమునకు భాజనమగును. ఇన్ని శుభలక్షణములు నొక్కచో నుండునా? అది యసంభవముగాదా? అందుచే నెవ్వోకొన్ని శుభలక్షణములు జూచి వరనిర్ణయము జేసి కొనవలయును.

ఇందు—ఆక్షేణములు మీకును నాకును నచ్చవచ్చును. బాలిక మెచ్చవలదా?

చిత్ర—మెచ్చ కేమిచేయును? దివ్యౌషధుల నెన్నిటినో గలిపి వైద్యుఁడు మాత్రజేసినట్లు బ్రహ్మదేవుఁడు సమస్తశుభలక్షణములు గల పురుషునిఁ గ్రొత్తగా మనకన్యకకొఱకు సృష్టింపవలెను!

ఇందు—ఇదివఱకే సృష్టింపఁబడియున్నాఁడు. క్రొత్తసృష్టితోఁ బనిలేదు.

చిత్ర—అట్లయిన బాలిక యెవనిమీఁద మనసునిలిపినదో చెప్పఁగలవా?

ఇందు—ఇంతవఱకు నే నెఱుఁగను. ఇదివఱకేసృష్టింపఁబడి నాఁడని మాటవరుసకంటిని.

చిత్ర—వజ్రపాణియని యొకసేనాపతి యున్నాఁడు. వాని నెఱుఁదువా?

ఇందు — నేనెన్నఁడుఁ జూడలేదుఁ వినియుంటిని.

చిత్ర — అతఁడు సేనాపతియగు దండపాణితమ్ముఁడు. అతని వంశము మంచిది. స్థితిమంచిది. ప్రాయమునను న్నవాఁడు. అతనికిచ్చి వివాహముచేయవలెనని నాకోరిక. అతనిం జేపట్టుమని బాలికతో నీవు నొక్కి చెప్పుము.

ఇందు — చెప్పెదనుగాని నామాటయందు దానికి విశ్వాసము లేదు. మల్లికకు దానికి నత్యంతమైత్రి. దానిచేతఁ జెప్పింపుఁడు. బిడ్డ మాత్రము యుక్తాయుక్త మెఱుఁగదా! మంచిసంబంధమైనచో నది యేల నిరాకరించును ?

చిత్ర — మంచిదనుట నిస్సంశయము. నీవు చెప్పినట్లు మల్లికతోఁగూడ మాటలాడెదను.

అని సంభాషణ ముగించి యావలకు జనెను. సంధ్యాకాల మగునప్పటికి మల్లికాచంద్రికలు కర్పూరమంజరిం దోడుకొని గృహమునం జేరిరి. రేయి భోజనమైనతరువాతఁ గర్పూరమంజరి పెందలకడ బండుకొనెను. ఆమె నిద్రఁవోవగాఁ జూచి చిత్రభానుఁడు మల్లికను దన పడకగదిలోనికిఁ బిలిచి పీటపైఁ గూర్చుండఁబెట్టి కొంతసేపు దాని సేమమరసి రాజాంతఃపురమందలి వార్త లేమని యడిగి కొంచెకవడికిట్లనియె — "మల్లికా! నీయెదుట నిన్ను బొగడఁగూడదు గాని నీవు నిజముగా గుణపుష్పములతో నిండిన వల్లికవు. ముద్దుల మూటగట్టు నీమొగముఁ జూచినను గ్రమ్మతేనియలొలుకు నీపలుకులు విన్నను హృదయంగమములయిన నీగుణములు జూచినను నాకు బ్రహ్మదేవునిఁ దిట్టబుద్ధి. ఎందుకందువా? మతిలేని యామునలిదయ్యము బహులక్షణసంపదగల నిన్ను నేదో యొకమహారాజ గర్భమునఁ బుట్టింపక సేవకురాలిఁగా జేసినాఁడని. ఆవెఱ్ఱిముండకొడుకు చేసెడి సృష్టిలో నిట్టివి వందలకొలఁది గలవు. నిన్ను స్తోత్రము చేయుటకుఁ

గాదు నే నిట్లనుచుంట. యథార్థము నాకడుపులో దాఁగదు. చెడ్డదైన మంచిదైన కుండ పగులగొట్టినట్లు వెంటనే యనుట నాకలవాటు. కర్పూరమంజరి యొకర్తయే నాకుఁగూఁతురైనదని మఱియొకకూఁతురు లేకపోయెనని చాలాకాలము విచారించితిని. కాని నిన్నుఁ జూచుకొని యావిచారము పోఁగొట్టుకొంటిని. నీవే నారెండవ కూఁతురవు. అట్లగుటచేత మీ యక్కవిషయమున నీతో నొక్కమాట ముచ్చటింపవలెనని పిలిచితిని. బిడ్డ సంప్రాప్తయౌవనయైనది, వివాహయోగ్యకాలము ప్రాపించినది. వరాన్వేషణము చేయవలయును. నీ జిహ్వ దాని యభిప్రాయము' ప్రతిఫలించు నద్దము. అందుచే నిన్నడుగుచుంటి. అది యీవఱకెవ్వనిమీఁద నైన మనసు నిలిపినదా? నిజము దాఁచక చెప్పు!" అనవుడు మల్లిక చిఱునవ్వునవ్వి "ఏమోనండి ! నాకుఁదెలియదు. ఆమె మనస్సులో నేమున్నదో నాకెట్లు తెలియునండి" యని బదులుచెప్పెను.

అనుటయు నతఁడు వెండియు నిట్లనియె. "ఓసీ ! నీవెఱుఁగని రహస్యములు దానికుండవు. దానిమనసులోమాట నీచెవిలో నుండును. చెప్పకపోతివా నన్నుఁ జంపుకొన్నట్లే." యని నిర్బంధించి యడిగెను. "అయ్యో ! ఇదేమిపాపమండీ. చిన్నపిల్లలము. మాలో మేమేదో పరిహాసమునకో మఱెందుకో యెన్నోమాట లనుకొందుము. వాటివిషయమై నిర్బంధించి యెట్లుదిట్లుప్రయోగించిన మేమెట్లు బ్రతుకఁగలము ? నన్నుమీరు నిర్బంధింపవద్దు" అని నిష్ఠురముగా నామె బలికెను. "పోనీ ! నన్నుఁ జంపుకొన్నట్టే గాఁబోలును. నీవు నాకూఁతురవని చెప్పితినిగదా ! నీవును గర్పూరమంజరియుఁ దండ్రి లేని కూఁతులగుదురు గాక!" యని కఠినముగఁ బలికెను.

అప్పుడు చేయునదిలేక మల్లిక మెల్లమెల్లగా నిట్లనియె—"నాతో నామె చెప్పలేదుగాని మున్నామెకు జబ్బుచేసినప్పుడు మాళవరా

జకుమారుఁడగు మకరందుఁడువచ్చి వైద్యముచేసెను. అప్పటినుండి యాతనిమీఁద మనసునిలిపిన దేమోయని నాయూహ. అయ్యగారూ! నే నీమాట చెప్పితినని యామెతోఁ జెప్పవద్దు. ఁసీనోట నువ్వు గింజదాగదు పనికిమాలినదానా' యని నామీఁద మీబిడ్డయుఁ జంద్రికయుఁ గోపించి దెప్పుదురు."

అనవుడు చిత్రభానుఁడు "బిడ్డా! నీవుచెప్పినట్లు నేనుచెప్పను. కాని, నే నొక్కరహస్యము జెప్పెద. అది నీమనసులో నుంచుకొని పనిచేయుము. అట్లు చేసెదవా?" యని యడిగెను. "నాచేతనైనపక్షమున నదితప్పకచేసెద" నని యామె యుత్తరమిచ్చెను. అంతటఁ జిత్రభానుఁడిట్లనియె. "బిడ్డా! మకరందునిమీఁద నిలిచినయామె మనస్సునునీవు త్రిప్పుటకుఁ బ్రయత్నము సేయవలయు. మకరందుఁడు బౌద్ధుఁడు. నాస్తికుఁడు. వేదశాస్త్రములు విశ్వసింపనివాఁడు. అట్టివానిఁ జేపట్టఁ గూడదని నీబుద్ధికుశలతకొలఁది హేతువులఁగల్పించి దృఢముగా చెప్పుము. నీవు బుద్ధిమంతురాలవు. ఇటు జెప్పుమటుజెప్పుమని నీకునేఁ జెప్పవలెనా? ఓసీ! తెలియకడుగుచున్నాను. మకరందుఁ డేలాగుండును?"

"ఏలాగుండునని చెప్పనుస్వామీ! భూలోకమున విహరింపవచ్చిన మన్మథుఁడు. గుణములుచెప్పఁదలఁచితిమా వర్ణింపశక్యమే గాదు. దానికిందగిన పరాక్రమము. అందుకుఁదగిన విద్య. ఇదియదియననేల? అన్ని మంచిగుణములున్నవండి!" యని మల్లికయుత్తరము చెప్పెను. చిత్రభానుఁడదివిని వెండియు నిట్లనియె. "ఎఱ్ఱఁగా బొఱ్ఱఁగా నుండఁగానే సరియా? మేడిపండు మిక్కిలి మెఱయుచుండును. పొట్టవిచ్చితిమా పురుగులగుంపు. ఆకారముఁజూచి యెవ్వరిని వరింపరాదు. గుణములకేమి యెవరిగుణములు వారికుండును. ఎన్నిగుణములున్ననేమి! వాఁడు మనవాఁడు కాఁడు. బౌద్ధుఁడు. పాషండుఁడు.

అట్టివానిం జేపట్టుట పాపముగాదా" అనవుడు మల్లిక "స్వామీ! మకరందునివిడిచి యేరాజకుమారుని వరింపవలసినదని మీయభిప్రాయము." అని యడిగెను. అడుగుటయు నతఁడు మఱియు నిట్లనియె. "ఆఁ ఇపుడు మంచిదారికివచ్చితివి. చెప్పుచున్నాను విను. ఈపట్టణమున దండపాణియను సేనాపతిగలఁడు. అతని తమ్ముఁడు వజ్రపాణి కలఁడు. అతనిని వరింపవలసినదని నాయభిప్రాయము. అతఁడు సద్గుణవంతుఁడు. బాహుశాలి. సత్కులజాతుఁడు. ఎప్పుడైన నంజూచితివా!"

అనవుడు మల్లికనవ్వుచు నిట్లనియె. "చూచితినండి! నన్నికల్లుమీఁది గంట్లవలె మొగముమీఁద మశూచకము మచ్చలుగలిగి నల్లగానున్నయతఁడే కాదా! చూచిచూచి యమ్మాయికొఱకుమంచి పెండ్లికొడుకు నేరినారండి! అతనియొడలతఁడే కదుపుకొనలేనంత లావు. అతనిశరీరమునుండి చెమటలుగారినప్పుడు కొండమీఁదినుండి సెలయేళ్ళు ప్రవహించిన ట్లుండును. అతనిమీసములు మొగము నొకటే రంగునసుండును. వయస్సుచూచినను నలువదేండ్లకుఁ దక్కువ యుండదు. ప్రథమభార్య యున్నది. ఆమెవలన నలుగురో ముగ్గురో బిడ్డలుకలరు. ఈ వన్నెపెండ్లికొడుకును జేపట్టుమని చెప్పుటకు మాకు నోరెట్లాడును? మేమొకవేళ జెప్పినను నామె యెట్లు సమ్మతించును! అట్టివివాహము లోకులెట్లు మెత్తురు! చెప్పుటకు మాకే సిగ్గగుచున్నది. ఆపెండ్లికొడుకు సరసను మీబిడ్డయెట్లు కూర్చుండునండీ! వారిద్దఱు కాటుకముద్ద పసుపుముద్దవలె నుందురు." అని పరిహాసోక్తులు వలుకుచున్న మల్లికకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పఁదలఁచి చిత్రభానుఁడిట్లనియె; "ఓసీ! శరీరమునల్లగా నున్ననేమి యెఱ్ఱఁగానున్ననేమి? కొఱుకుకొని తిందురాయేమి! వంశము గుణము భాగ్యము చూచుకొనవలెనుగాని రూపమెందుకే! అట్లయినఁ జైతన్యములేని బంగారపు బొమ్మను బెండ్లాడవచ్చునా? నీయుల్లసోక్తులు గట్టిపెట్టి నామాటవిని

నీచెలికత్తెదగ్గఱ వజ్రపాణిని జక్కఁగాఁ బొగడి వర్ణింపుము. అతఁడు
సత్కులజాతుఁడనుము. గుణనిధానమనుము. పరాక్రమంబున రెండవ
కుమారస్వామి యనుము. అతనిం జేపట్టిన వీరపత్నియగుననుము. అ
నంతరము వీరమాతయగుననుము. కావలసినంత భాగ్యమున్నదనుము.
ఒకభార్యయున్నను దానే యగ్రమహిషి కావచ్చుననుము. స్త్రీకింత
కన్నఁగావలసిన దేమున్నదనుము. ఓసీ ! ఇన్నిమాటలెందుకు? ఎట్లు
చెప్పవలెనో యట్లుచెప్పి కార్యము సఫలముచేసితివా నీకొకరత్నాల
హారము వెలలేనియొకముత్యాలహారము బహుమానమిచ్చెదను. నీ
మేలు మఱచిపోను."

అతఁడు చెప్పినదంతయు విని మల్లిక "అయ్యా ! మీయాజ్ఞ
శిరసావహించి నేనామెతోఁ జెప్పుదునుగాని యామెనామాట విశ్వ
సించునని నాకునమ్మకములేదు." అని యాతనయొద్ద సెలవుగై
కొని మల్లిక శయనాగారమున కరిగెను. "ఈపలుకుముండయే శకున
పక్షిలాగున విరుద్ధముగాఁ జెప్పెను. ఇఁకనామె నాకనుకూలముగఁ
జేయునా" యని తనలోఁ వితర్కించుకొనుచుఁ జిత్రభానుఁడు పండు
కొనెను.

---

## పదియవ ప్రకరణము.

---

కాశ్మీరరాజుసైనికులు వసించుటకు శ్రీనగరమునకుం బడమటఁ
బ్రత్యేకముగా నొకపేటకలదు. అందుసైనికులు సేనానాయకులు
మాత్రమే వసియింతురు. సైనికుల దేహపరిశ్రమలకు, వ్యాయామ
ములకు, వారిబిడ్డల యాటలకు ధనుర్విద్యయందు నభ్యాసముచేసికొ
నుటకు మల్లయుద్ధములు నేర్చుకొనుటకు యుద్ధవిశారదులగుటకు శు
ష్కరణములు గావించుకొనుటకుఁ దగు విశాలభూములక్కడ నేర్పడి

యున్నవి. ఉదయాస్తమయముల యందు సైనికులు నానావిధముల యిన సాధనములతో బహుపరిశ్రములఁ జేసి నేర్చినవిద్య మఱపురా కుండునట్లు చేసికొనుచుందురు. యోధులు సాధారణముగా విద్యావి హీనులై యుండుటచే గ్రంథపఠనము చేతగాదుకావున బహుపురాణ వేత్తలుధర్మశాస్త్రవిశారదులుచిత్రకథాకథనకుశలురు జ్యోతిశ్శాస్త్ర వేత్తలునగుబ్రాహ్మణులు స్కంధావారముఁజొచ్చి పూర్వరాజులచరి త్రములు మొదలగునవిచదివి వినిపించియు మనోహరములగుకథలుచె ప్పియు వారిమనోరంజనముచేయుటయేగాక వారికిఁబుణ్యముపురుషార్థ ము నెఱిఁగించి యుక్తాయుక్తవివేచన జ్ఞానముఁ గలిఁగించు చుందురు. అందుచే బ్రాహ్మణులన్న వారికిఁ బరమభక్తి. వారునిజముగా స్వర్గ మునుండి భూమి కవతరించిన దేవతలనినమ్మి జోదులు వారియిల్లాం డ్రు మిక్కిలివినయంబుగదుర వారికినమస్కారములుచేసి సన్మానించి యుచితాసనంబులనునిచి శక్తికొలంది ధనధాన్యాదుల నూత్నవస్త్ర ములనొసంగి సత్కరించుచుందురు. ఆఁడువాండ్రు. పగలు గృహకృత్య ములందగిలియు మగవాండ్రు నానావిధ పరిశ్రమలఁజిక్కియుఁ దీరికలే కయుండుటంజేసి సాధారణముగాఁ బురాణశ్రవణాదు లప్పేటలో రా త్రులే జరుగుచుండును. పౌరాణికుని వసంతఋతు రాత్రులయందు వారు చల్లని లేఁతగాడ్పులువీచు బయళ్లయందుఁ గూర్చుండఁబెట్టి వందలకొలఁది స్త్రీపురుషులు చేరి పురాణ మాలకించి యానందించు చుందురు. వర్షకాలమునను, శీతకాలమునను భజన మందిరములయందే యీసభలు జరుగుచుండును.

అత్తఱి నొక్కనాఁటిరేయి నొకబ్రాహ్మణుఁడు మార్గాయా సమున రొఁజుచు నొకజోదుగృహమునకుఁ బోయి "అయ్యా! వం డుకొనుటకు నాకించుకతావు నొసంగు ధర్మాత్ము లెవ్వరైన నున్నా రా? నేను బాటసారిని. బ్రాహ్మణుఁడను. పగలెల్ల నెండలో మలమల

మూఁడి నడచియున్న కతమున మిక్కిలిడస్సియున్నాఁడను. అడుగులు పుడపుడబొక్కినవి" యని యడిగెను. ఆగృహ యజమానుఁడగుజోదు "స్వామీ! మాయరుఁగుమీఁద మీరు పండుకొనవచ్చును. దయచే యుఁడు" అని యుత్తరమిచ్చెను. "నాయనా! నీకెంతైనఁ బుణ్యముగ లదు. రక్షించితివి" అని యాబ్రాహ్మణుఁడు తనకృష్ణాజినము నా యింటియరుఁగుమీఁదఁ బెట్టి యంగవస్త్రముతో నడ్డకట్టిన యిత్త డిచెంబుఁ దీసి "నాయనా! పాదప్రక్షాళనమున కుదకము కావలెను. చేరువ నెక్కడైన నూయికలదా?" యని ప్రశ్నించెను. "స్వామీ! అల్లదె నూయి" యని చూప విప్రుఁడు ముఖహస్తప్రక్షాళనముఁ జేసి కొని కడుపునిండ నీరుద్రావి మరల నప్పాతియింటికేఁజని దర్భాస నముఁ బఱచుకొని యుచ్చైశ్స్వరముతో మహిమ్నస్తోత్రముఁ జదువ నారంభించెను. అదివిని జోదులనేకు లచ్చటఁ జేరిరి. కొందరాశ్లోకము ల యర్థమడిగి తెలిసికొనిరి. అది ముగిసినవెనుక వారిలో గొందఱు బ్రాహ్మణుని నామధేయము దేశము నామముఁ దెలిసికొనఁగోరి ప్ర శ్నలడిగిరి. వారిప్రశ్నలకు బ్రాహ్మణుఁ డిట్లుత్తరముఁ జెప్పెను. "అయ్యా! నాపేరు వేదశర్మ. నాది గాంధారదేశము. అందుఁ దక్ష శిలయను గ్రామముగలదు. అది నానివాసస్థలము. ఏమహానుభావుఁ డు సంస్కృతభాషయందలి శబ్దజాలమున కెల్లనియమముల నేర్పఱ పఁదలఁచి సర్వబుధజనశ్లాఘ్యమైన వ్యాకరణ శాస్త్రమువ్రాసిభాషా ప్రపంచము నుద్ధరించెనో సుశబ్ద ప్రయోగముజేసినప్పు డెవ్వని పవిత్ర నామము ప్రతిపండితునకు మొట్టమొదట జ్ఞాపకమువచ్చునో యట్టిమ హానుభావుఁడు పాణినిజన్మించినట్టి గ్రామమది. ఆమహాత్ముఁడేగాక బహువ్యాకరణవేత్తులు, బహువేదపారంగతులు బహుపురాణసంవి దులు, సకలధర్మశాస్త్రవిశారదులు బ్రహ్మవాదులు, నచ్చటఁ బలు వురుగలరు. ఆసేతు హిమాచలమగు భరతఖండమందలి నానాభాగ

ములనుండి విద్యార్థులై బ్రహ్మచారు లప్పురికివచ్చి భిక్షాటనముం జేసి జీవించుచు గురుశుశ్రూషాపరాయణులై తమకభిమానశాస్త్రంబుల నేర్చుకొని పోవుచుందురు. అది గొప్పవిద్యాసత్రము. సరస్వతికొలువుకూటము. చదువులకోటారు. కాశ్మీరదేశమున హిరణ్యపురమున నాకుం జుట్టములున్నారు. వారింజూడందలంచి నేను పయనమై పోవుచున్నాండ. మార్గపరిశ్రమ మెక్కుడగుటచే నగరమునకుంబోలేక నిప్పటిలో విడిసినాండ. కాని కాశ్మీరదేశమింత యల్పకాలములోనే యింతదుస్థితికి వచ్చునని నేను స్వప్నమందైనం దలంపలేదు. తక్షశిలలోని పండితులందరిందుకై నగుచున్నారు." ఈ చివరవాక్యములు రెండు మెల్లగా ననెను. "ఏమి! అట్లనుచున్నారేల!" యని పలువురు తొందరతో నడిగిరి.

"అయ్యో పొరబాటున నోరుజారి యనంగూడనిమాటంటినే అయ్యా! బాటసారిని పేదబాపండను. ఈగొడవలు నాకెందుకు నన్ను విడిచిపెట్టుండు. ప్రశ్నలవర్షముతో నన్నుం దడుపకుండు" అని యతండు బదులుచెప్పెను.

"స్వామీ! అట్లుగాదు. అదియేమోవిన్నదాంక మామనస్సులు తత్తఱపడుచున్నవి. మీరది చెప్పితీరవలయు. మీరు బ్రాహ్మణోత్తములు. లోకులందఱకి మేలుగోరువారు. అట్టివారు మాదురవస్థయేమో తెలుపవలదా? దానికిం దగినప్రతిక్రియం జేసికొనమా? అట్టివారు మీరు నోట పొరబాటుమాటరానియ్యనే గూడదు. మాట వచ్చినదా మూలముట్టం జెప్పవలయు" నని వారనిరి.

అప్పుడు బ్రాహ్మణుండు బలవంతముమీంద నిట్లు చెప్పందొడంగెను. "అయ్యా! ఇదిరహస్యము. అయిన మాదేశములో నందఱెఱిఁగిన రహస్యమే. గాంధారదేశపురాజగు భాగ్యవర్ధనుండు కొన్నిదినములలో మీదేశముపై దండువిడిసి జయించి తనరాజ్యమునం గాశ్మీరమును గలుపుకొనవలయునని ప్రయత్నము జేయుచున్నాండు.

చుట్టుప్రక్కల దేశములనుండి సమరమున మొక్కలు దీరినజోదులను రావించి తనసేనలోఁ జేర్చుకొనుచున్నాఁడు. మహాటవులనుండి మదపుటేనుఁగులంబట్టి తెప్పించి కదనమున కాయత్తము సేయుచున్నాఁడు. వేనవేలు పారసీకహయంబుల బహుధనములిచ్చి కొనుచున్నాఁడు. పదివేలయేనుఁగులు, ముప్పదివేలగుఱ్ఱపుఁదళము ఏఁబదివేల కాల్బలము, పదివేల రథములు, రణమునకు సిద్ధమైయున్నవి. పదాతులందఱు నీటజరించుచేఁపల మింటఁబాఱుపులుఁగుల సైతము గుఱిదప్పక నొక్కయమ్మునఁ గూల్పఁగల మేటివిలుకాండ్రు. అట్టిసేనతో జయముఁ గాంచవలయునను పేరాసతో మనంబున వెల్లివిరిసిన యుత్సాహముతో నమ్మహాసేనకుఁ గావలసిన సకలసంభారములతో నతఁడు రాఁగల శరత్కాలమున దండెత్తఁదలఁచుచున్నాఁడు. కటకటా! చిరకాలమునుండి స్వాతంత్ర్య మనుభవించుచున్న కాశ్మీరదేశము భూలోకస్వర్గఖండమని పేరువడసిన కాశ్మీరదేశము—హేమచంద్రమహారాజు పరిపాలించిన కాశ్మీరదేశము—వెల్లసిరులకు నిల్లగు కాశ్మీరదేశము—దిక్కుమాలినపడంతివలె నన్యవశవర్తిని యగుచున్నది. రత్నగర్భవంటి యీదేశము మాసామ్రాజ్యములోఁ జేరునని నాకెంతో సంతోషముగానున్నను మీకురాఁగలదుర్దశఁ దలంచిన నాకడుపుచుమ్మలు చుట్టుచున్నది. మారాజునుగుఱించి వేఱుతెఱంగునఁజెప్పుట నాకు ధర్మముగాదుకాని భాగ్యవర్ధనుఁడనఁగా నెవఁడో యెఱుఁగుదురా? పాండవ ధార్తరాష్ట్రులకు మొదటఁ గలిగినమనస్పర్ధయను చిన్నిమొక్కను తన దురాలోచనలనెడుదోహదములచేత మహావృక్షముఁజేసి కురుపాండవ వైరమునకుఁ బ్రధానకారణుఁడై కౌరవకులమును గూఁకటివ్రేళ్లతో నాశనముజేసిన శకునివంశస్థుఁడు 'స్యాలకోగృహనాశాయ' యను సామెత నిజముజేసిన దుష్టచిత్తుఁడతఁడు. అతని వంశస్థుడైన యీభాగ్యవర్ధనుఁడు వానికన్నఁ బదియా

కుతెక్కువచదువుకొన్నవాఁడు. ప్రజలను మంగలములోఁ బెట్టి వేఁచి నట్లు హింసించును. భరింపరాని పన్నులుగట్టును. భాగ్యవంతుల గృహములపైఁబడి దోఁచుకొనును. ఎదురాడినవారి పుత్త్రులుదీయించి కోటకొమ్మలకుఁ గట్టించును. చక్కనియాఁడువాండ్రిందఱుఁదన ప్రక్కకుఁ జేరవలసినదె. వానికి నీతిలేదు. ధర్మభీతిలేదు. పాపభయములేదు. శాపభయములేదు. అట్టిరాజుపాలనముక్రింద మేమెట్లు వేగుచున్నామందురో? విషక్రిమిన్యాయమున బ్రదుకుచున్నాము. వానిమంత్రులుకుటిలమార్గపరతంత్రులు. దేశము పరాక్రాంతమగుట కన్న జనులకుగొప్పకష్టము లేదుగదా! కాటకముల సహింపవచ్చును. ఈతిబాధల నోర్వవచ్చును. అంతఃకలహముల నడఁచుకొనవచ్చును. మహామారిమొదలగు ప్రళయరోగముల భరింపవచ్చును. కాని, పరరాజులపాలన మొక్కదినమైన సైరించుట కష్టము. దేశమందలి ధనధాన్యములనెల్ల నతఁడే తరలించుకొనిపోవును. రత్నగర్భలవంటి భూములు చవుటిపఱ్ఱలు జేయును. గనులన్నిటిని ద్రవ్వుకొనిపోవును. తనదేశస్థుల కన్ని గొప్పయుద్యోగముల నిచ్చును. వెయ్యేల? జయింపఁబడిన దేశస్థులను బానిసలం జేయును. నోరున్నను వారు మాటాడరాదు. చెవులున్నను వినరాదు. చేరెడు కన్నులున్నను జూడరాదు. వారిసాహసము నమసిపోవును. ధైర్యము తఱిగిపోవును. మగంటిమి మంటిపాలగును. ధైర్యమును వెడలఁగొట్టి భీతి వారి మనస్సుల నాశ్రయించును. అడుగడుగునకు వారు పరరాజులకుఁ జేతులు జోడించి జోహారులు సేయుదురు. పరులను బట్టులవలెఁ బొగడి స్తోత్రపాఠకులగుదురు. వెయ్యేల! పరరాజు పాలనములోనున్న జనులు మృగములకన్నఁ బులుఁగులకన్నఁ బురుగులకన్న నికృష్టమైన జీవనము సేయుదురు. నాశత్రువునకైన నే నెన్నఁడట్టికష్టములఁ గోరను. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యనునార్యో

క్తి మీరు వినలేదా ? తల్లియు జన్మభూమియు స్వర్గముకన్న నెక్కుడని దీనిభావము. తల్లినిఁగోల్పోయి బ్రదుకవచ్చును. బిడ్డలు మృతులైన బ్రదుకవచ్చును. కులకాంతఁగూలిన మనవచ్చును. ధనముపోయిన బ్రతుకవచ్చును. కాని మాతృదేశము పరాక్రాంతమయినచో బ్రతుకఁజాలము. ఆదినమే దేశస్థులకు మరణదినము. ఆదినమే యాత్మగౌరవంబునకుఁ గడపటిదినము. సర్వసుఖముల కంత్యదినము. ఆదుర్దినము మీకు రాకపోవుఁగాక ! ఆయాపద మీకుఁ దప్పుఁగాక !"

ఈసంభాషణము మొదట సామాన్యస్వరముతోనే యతఁడారంభించెనుగాని వెళ్ళినకొలఁది క్రమక్రమముగా నుత్సాహపూరితుఁడై యెలుఁగెత్తి చెప్పెను. అదివినుచున్నప్పుడచ్చటఁజేరిన సైనికులలోఁ గొందఱు "హాహా" యనియు, "శివశివా" యనియు, "హరిహరీ" యనియు "నెంతకర్మ మెంతకర్మ" మనియు సంతాపార్థకములైన పదముల నుచ్చరించిరి. అతఁడు సంభాషణ ముగించినపిదప నందులో నొకఁడు "గాంధారరాజునకు మనదేశముమీఁద నింతకోపమేల? మన మతని కే మపకారముఁ జేసితిమి?" యని తక్కినవారి నడిగెను. అందుకు వేదశర్మ యిట్లుత్తరముఁ జెప్పెను.

"ఒకరాజు మఱియొక దేశముపై దండెత్తుటకుఁ గారణమవసరములేదు. అపకారము చేయనక్కఱలేదు. మీ దేశము దుర్బలమగుట యొక కారణము. అతఁడు బలవంతుఁడగుట యొక కారణము. అతనికి గొప్పయాశలుండుట యొక కారణము. కారణము లరయనేల? పెనుచేఁప చిఱుచేఁపం దినును. ముంగిస పామును జంపును. సర్పము కప్పను గబళించును. కప్ప పురుగులను మ్రింగును. పులి మేఁకం జంపును. ఇందొకదానికొకటి యేమి యపకృతిఁ గావించెను ? బలవంతులు బలహీనులం జెఱుపుట నైజము. అదియునుఁగాక కొన్ని జంతువులకు వలెనే కొందఱుమానవులకుఁగూడ దుష్కార్యాచరణము సహజము

నూఱువరాలువెలగల చీర చిమ్మెట బొత్తుఁగ పొడిచి పాడుసేయును. ప్రశస్తమయిన పుస్తకముల జదపురుగులు నాశనముఁ జేయును. కావున దురాత్ముల కపకారముతోఁ బనిలేదు. అంతియేఁగాక భూపతులాశాపిశాచగ్రస్థులు. నేలనాలుఁగుచెఱంగులేలినను వారియాశదీఱదు. మూఁడులోకములు హస్తగతములైనను వారి నావహించిన యాశాపిశాచమున కాఁకలిదీఱదు. భూమండలమంతయు జయించినవాఁడు సైతము భగవంతుఁడు తనవిజయము నిమిత్తము నూతనఖండముల సృజియించిన బాగుండునని తలంచుచుండును. ఇవియన్నియు నటుండనిండు! విభీషణుఁడు త్రేతాయుగమందు రావణసైన్యమునందె గాక ప్రతియుగమునందుఁ బ్రతిదేశమునందుఁ బ్రతిసైన్యమునందు నున్నాఁడు. తననెత్తురు తనజాడఁ జూపినప్పుడు తననీడతన్నుఁ బగతురకుఁబట్టియిచ్చినప్పుడు తనయడుగులజాడయె తననెలవుఁ దెలిపినప్పుడు మానవుఁడు పరులచే హింసింపఁబడకఁబోఁడుగదా !"

ఈకడపటిమాటలు కర్ణములం జొఱఁబడి మనస్సునకు సూదులవలె నాటెను. "ఎవఁ డావిభీషణుఁడు ? ఎవఁడా దేశద్రోహి ? ఈ రాజ్యమం దట్టివాఁ డుండఁగలఁడా?" యని కొందఱఱచిరి. "శాంతింపుఁడు. శాంతింపుఁడు" అని మఱికొందఱు వారిని వారించిరి. వేదశర్మ "క్రమక్రమముగా మీకే తెలియును. నిప్పు లోపలియుటక మీఁదఁబెట్టి యిల్లంటించినను మంటలు పైకి రాకపోవు. ఓపికపట్టియుండుఁడు" అని బదులుచెప్పెను. అందులోఁ గొందఱు "స్వామీ! మర్మముబెట్టి మాటలాడి మమ్ముం జంపనేల ? ఇంతవఱకుఁ జెప్పితిరిగదా. తక్కినదిగూడ స్పష్టముగాఁ జెప్పుఁడు. మేము పరరాజులకు దాసులము కాలేము. బెబ్బులులవలెఁ బరసైనికులువచ్చి దేశమాక్రమించి యూళ్ళు కొల్లఁగొనుచుండఁగా మేము చూడలేము. కాశ్మీరదేశముకొఱకు, రాజకుటుంబముకొఱకు, మేము మానెత్తురు ధారవో

యుదుము. ప్రాణములు బలియిత్తుము. ద్రోహులను శిక్షింతుము. విషయము సమూలకముగాఁ దెలిపి మమ్మనుగ్రహింపుఁడు." అనిపలికిరి.

"అయ్యా! మీరు బలవంతపెట్టుచున్నారు గనుక చెప్పక తప్పదు. మీరాజు చిన్నవాఁడగుటచే మంత్రులు లంచగొండులై దేశము పరుల కప్పగింపఁదలఁచుచున్నారు. మీరాజకుటుంబమునకు వెనుకటి రాజు సహోదరుఁడైన చిత్రభానునకు సరిపడదుగాని, యతఁ డధికారము వహించునేని, నేఁటిమంత్రులు తొలఁగింపఁబడుదురేని రాజభక్తిగల దండనాథులు మీవంటి శౌర్యధైర్యముఁగలబంట్లను రణరంగమునకు నడుపుదురేని యిటువంటిగాంధార రాజులనునూఱుమందిని మీరు జయింపవచ్చును. అన్నిబలములుకన్న నైకమత్యబల మెక్కువది. అదియే జయమును సమకూర్చును." అని సన్నసన్నముగాఁ దన యుపన్యాసము ముగించెను.

ఆమాటలు వానినోట వెడలినతోడనే "మంత్రులే! మంత్రులే! ఓరి రాజద్రోహులారా! ఓరి దేశద్రోహులారా! ఓరి! మీమొగములుమండ. ఓరీ! లంచగొండిముండకొడుకులారా" యని కొందఱు దూషింపనారంభించిరి.

"లంచగొండులు ధనమునకై దేశమునైన నమ్మివేయుదురు. వారిని నిలువనీయఁగూడ" దని కొందఱు పలికిరి. "చిత్రభానుఁ డధికారము వహించుట దేశక్షేమకర" మని కొందఱు వచించిరి. "చిత్రభానుఁడు భ్రాతృద్రోహి. వానికధికారమిచ్చుట త" ప్పని కొందఱు భాషించిరి.

ఇట్లు పలువురు పలువితంబుల సంభాషించుచు నర్ధరాత్రమగుటచే నిద్రాపీడితులై స్వగృహముల కరిగిరి. వేదశర్మ తెల్లవాఱుజామున సైనికుల మనస్సులలోఁ జిచ్చుపెట్టి తనదారింబోయెను.

మఱునాఁ డుదయమున సైనికులు లేచి గుంపులుగూడి వేద

శర్మచెప్పిన వృత్తాంతమంతయు బహువిధములఁ జర్చింపఁదొడఁగిరి. అది నిజమని కొందఱు నీలి వార్తయని కొందఱుఁ దమకుందోఁచిన పోల్కిఁ బలికిరి. "మంత్రుల నమ్మరా" దని కొందఱు "వారివంటి సజ్జనులు లే" రని కొందఱు వాదించిరి. చిత్రభానుఁడు దుర్జనుఁ డని కొందఱు సజ్జనుఁడని కొందఱు వక్కాణించిరి.

పిమ్మట దండపాణి వజ్రపాణియు, గదాధరుఁడు శూలపాణి యు నెప్పటియట్ల రాఁగా వారి కావృత్తాంత మెఱిఁగించిరి. గదాధరుఁడు శూలపాణియు "నిదియెల్ల ´ల్ల. ఇవి శత్రువులకల్పనలు నమ్మరా" దని గట్టిగా జెప్పిరి. దండపాణియు వజ్రపాణియు "నిజమని నమ్మరాదు. కల్లయని త్రోసివేయరాదు. ఏపుట్టలో నేపామున్నదో మన మెఱుంగుదుము?" అని చెప్పి చాటుచాటునఁ దమకాప్తుల యిన క్రింది యుద్యోగస్థులతో బాలరాజు పరిపాలనము చేయుటకు మూలమనియు, సమర్థుఁడెవరైన రాజ్యాధికారమువహించిన మేలగుననియుఁ జెప్పుచు వచ్చిరి.

మఱునాఁడు మధ్యాహ్నమున కీవార్త కాఱుచిచ్చువలె శ్రీనగరమందంతట రేగెను. అత్యుత్సాహముతోఁ బ్రజలందఱు దీనిని గుఱించిమాటలాడు కొనుచుండిరి. ఏమూలఁజూచిన మనుష్యుఁ గుంపులే ఎక్కడనాలకించిన దండయాత్రా విషయమే. ఎక్కడ జర్చించిన మంత్రుల ప్రవర్తనమే. కొందఱు హేమచంద్రునిఁగూర్చి విచారించిరి. కొందఱు విక్రమసేనుని దురవస్థకుఁ జింతించిరి. కొందఱు మంత్రులను దూషించిరి. ఇన్నిమాటలేల? ఆఁడువాండ్రుమగవాండ్రు బాలురు వృద్ధులు భిక్షుకులు పరిచారకులు సర్వజనులు తద్విషయములనే జర్చించుచుఁ బనిపాటలుమాని యుండిరి. ఊరంతయు నట్టుడికి నట్లుండెను. కొందఱు పిచ్చివాండ్రువలె సంచరించిరి. కొందఱు మంత్రుల యింటిమీఁదఁబడి వారిని గఠిన ప్రశ్నములనెడు రాళ్ళతో

ఉన్నారు. దండయాత్రాభయమునఁ గొందఱు నగరము విడిచి పల్లెలకుఁబోవఁ దలపెట్టిరి. క్రమక్రమముగా నీవార్త రాచనగరుఁ జేరెను. విక్రమసేనుఁడు ఆశ్చర్యపడియెను హర్షవర్ధనుఁడు తల్లికడకరిగి యవ్వార్త చెప్పి యామె నాశ్చర్యసముద్రములో ముంచెను. కొంతసేఁ పామె విచారించి యదికల్పితకథయని కొడుకులతోఁ జెప్పెను. నర్మదయేదో పనిమీఁద నగరములోనికిఁబోయి ప్రజలలో వ్యక్తమగుచున్నయమ్మహోత్సాహము భయము స్వయముగాఁజూచి వచ్చినదగుటచే నదిచేతులు ద్రిప్పుకొని యభినయముఁ జేయుచు నేత్రవిభ్రమము చేతను ముఖవైలక్షణ్యముచేతను నెంతో చిత్రముగా వర్ణింపఁ దొడఁగెను నగర మెట్లుండెనో నగరునట్టే యుండెను. సేవకులు మిక్కిలి కలవళముపడిరి. గాంధారరాజ దండయాత్ర ప్రతివారి పెదవులమీఁద నుండెను.

మణివర్మయు మాధవసేనుఁడును బ్రజల కోలాహలమును దమ యభయప్రదానముచేఁ గొంతవఱకు నివారించి యరవిందా దేవికిని విక్రమసేనునకును దప్పక చిత్తక్షోభము గలిగియుండునని తన్నివారణార్థము రాచనగరునకు దేవి పిలువనంపకయే పోయిరి. అరవిందా దేవి వారి నెప్పటియట్ల గారవించి గాంధారరాజదండయాత్రా విషయమున నేదయిన సత్యమున్నదాయని యడిగెను. ఆప్రశ్నకు మణివర్మ యిట్లుత్తర మిచ్చెను.

“అమ్మా! ఇందు లేశమయిన సత్యములేదు. మన వేగులవాండ్రు గాంధారదేశపు సరిహద్దులనుండి యీనడుమనే వచ్చినారు. ఆదేశము యుద్ధసన్నాహములేక నిస్తరంగమగు సముద్రమువలెనున్నదని చెప్పిరి. అదిగాక మనదేశమునుండి వణిజులు కొందరక్కడికి బోయివచ్చిరి. అక్కడనుండి బేహారము సేయుటకిక్కడికిఁగొందఱు వచ్చియుండిరి. వారెవ్వరీమాట చెప్పలేదు. ఇదియెవ్వరో రాజ-

కుటుంబమునకు నగరజనంబునకుఁ జిత్తసంక్షోభము గలిగింపవలెనని పుట్టించినకల్లవార్త. ఇదినమ్మి మీరు, మోసపోకుఁడు మీమనస్సులు ప్రసన్నములుగా నుంచుకొనుఁడు. భయము సర్వావయవములపటుత్వ మునడంచును. ధైర్యముం జెఱుచును. కార్యములనెల్ల విఘాత మొన ర్చును. కావున భయమున కెడమీయవలదు. మేముగూడ మిమ్ము ద్రోహము సేయుచున్నామని లోకములో నపవాదములు బైలుదేఱి నవి. మా విషయమై మేము చెప్పుకొనరాదు. మా పూర్వచరితము మాస్వభావము మా ఋజుత్వములను గుఱించి సాక్ష్యమీయవలయును గాని మామాటలుగావు. దీనికి మీయంతఃకరణమే ప్రమాణము"

అనవుడు రాజమాత "ఇవి కట్టుకథ లని విక్రమసేనునితో మొట్టమొదటనే చెప్పితిని. మీపై మా కనుమానము లేదు" అని చెప్పెను. అమాత్యులు సెలవుగైకొని యంతఃపురము విడిచిపోయిరి.

---

## పదునొకండవ ప్రకరణము.

---

వేదశర్మపలుకులవలనఁ గలిగిన యలజడి సంపూర్ణముగా నడఁ గకమునుపే మఱియొక విషయము రాజకులమునకు మహాందోళన ము గలిగించెను. వెనుకటిగొడవ జరిగిన నాలవనాఁటి రేయి రెండు గడియలుగడిచిన వెనుక రాచనగరు కడకుఁ నొక క్రొత్త పురుషుఁడు పోయి ద్వారరక్షకులంజూచి "అయ్యా! అరవిందాదేవి పుట్టినింటనుండి నేనువచ్చితిని. ఆమెజనకుఁడగు మహేంద్రదేవుఁడు నన్నతిరహస్య ముగా దేవిగారికొక రహస్యసందేశమెఱిఁగించిరమ్మని పనిచె తత్కారణమున నే నిటవచ్చితిని. నీనువచ్చినపని రాజకులమునకు మహోపకారకముగాఁ బరిణమించునుగావున మీరతిశీఘ్రముననా రాక

లుగావు లేఖ్యగాని. అదిగాక కాల్బలము గజబలము రథబలము గావలసినంతయుండును" అంతవఱకుఁ జెప్పునప్పటికి విక్రమసేనుఁ డందుకొని "దండెత్తువాఁడు సింధురాజనుచున్నారు. గాంధారరాజని చెప్పుఁ"డని పలికెను. అనవుడు సోమభట్టు "కాదు. కాదు. సింధు నాయకుఁడే. దానికిం దగిన తార్కాణములున్నవి. లిఖితరూపకము లైన తార్కాణములు దొరకినవి. కానివో శాస్త్రజ్ఞానము లోకానుభవము సంపూర్ణముగాఁగల సుహేంద్రదేవునివంటి రాజనీతి కోవిదుఁడు తన పురోహితుని శ్రేయోసాధ్యంబగు నీపయనమునకుఁ బురికొల్పి పంపునా?" యని యుత్తరమిచ్చెను. అప్పుడు నరవిందాదేవి మిక్కిలి విస్మయముఁ బొంది "ఏమీ! లిఖితరూపకమగు తార్కాణముదొరకినదా? ఎవరు వ్రాసినది? ఎవరికి వ్రాసినది! ఎప్పుడువ్రాసినది? ఏదేది! చూడనిమ్ము" అని మాటవెంబడి మాట వచ్చునట్లు మిక్కిలి త్వరతో నడిగెను.

అడుగుటయు సోమభట్టు "అమ్మా! ఎవరనేల! మనచేతులు, మనకాళ్ళు, మనకన్నులు, మనచెవులు మొదలు మనతోడు నీడలవలె మనతో నుందురు. ఆనీడలే మనకు శత్రువులు మన గోడలే మనకు శత్రువులుగదా" యని బదులుచెప్పెను.

అయ్యా! వారి నామధేయములు వినువఱకు లిఖితరూపక దృష్టాంతములు చూచువఱకు నాయుల్లము తత్తఱపాటు చెప్ప నలవి గాకున్నది. కావున నీక్షణమే వాటిం బ్రదర్శించి సానము సప్పి భ్రమించుచున్న నామనస్సునకుం గుదురుపాటు గలిగింపుము" అని యరవిందాదేవి వానిం ద్వరపెట్టెను. అప్పుడు సోమభట్టు తనకృష్ణాజినముచుట్ట విప్పి యందుండి యొక చిన్నసంచిఁ దీసి యాసంచిలోఁ గట్టకడపటి సారంగములో నట్టనడుమ సన్నగుడ్డ చుట్టఁబడి రెండు మడతలుగానున్న యొక భూర్జపత్రముఁ దీసి విక్రమసేనుని చేతికిచ్చి చదువుమనెను. అతఁడు దీపముదగ్గఱకుఁబోయి యిట్లు చదివెను.

శ్రీమన్మహారాజాధిరాజ త్రిభువనమల్ల కిన్నరేంద్ర ఘటాపంచానన పరరాజవేశ్యాభుజంగ సకలసమరాంగణ సార్వభౌమ ప్రముఖ బిరుదాంకితులును సింధుదేశాధీశ్వరులును నగు స్వస్తిశ్రీ పరంతప మహారాజుగారి దివ్యచ్ఛరణారవింద సన్నిధికి- కాశ్మీరరాజమంత్రియు మీసేవకుఁడునగు సుశీవర్మ వందన శతసహస్రపురస్సరముగా వ్రాసికొన్న విజ్ఞాపనము-

బౌద్ధభిక్షుకవేషధారియైన, గూఢవేగులవానిచేత దేవరవారు పరమానుగ్రహమున నాకు వ్రాయించి పంపిన లేఖనందుకొంటిని. కన్నులనద్దుకొంటిని. పూవుదండవలె శిరమున ధరించితిని. ఈసేవకుని మీఁద నిర్హేతుకముగా మీ కింత యనుగ్రహము గలిగినందుకు మిక్కిలి సంతసించితిని. నాహృదయానందము దెలియఁజేయుటకుఁ దగిన మాటలు నే నెరుఁగకున్నవాఁడ. మీరు కాశ్మీరదేశము దండెత్తఁ గుతూహలపడుచున్నట్లు వ్రాసినారు. ఆదేశమేపాటిబలము గలదని యడిగినారు. మీసంకల్పము శ్లాఘాపాత్రము ఈరాజ్యము పూర్వము బలమైనదేగాని నేఁటికాలమున రాజు చిన్నవాఁడగుటచే రాజ్యము దుర్బలముగానున్నది. మానవశరీరమునం దరిషడ్వర్గమువోలె నీదేశమున నంతశ్శత్రువులు బలాఢ్యులు గలరు. వారిరాయిడిచేత నెలుకలు దొలిచినయిల్లువలె నీదేశము శిథిలమైయున్నది. దేశము సారవంతమై రత్నగర్భలగు భూములుగలదై స్వర్గఖండమువలె నుండుటంజేసి బాహ్యశత్రులనేకులు దీనిపైఁ గన్నువైచియున్నారు. మాకు ముప్పది వేల సేనకంటె నెక్కువలేదు. దేశస్థితియిది. సాయము జేయుమని నన్ను మీరు కోరినారు చూచి క్షత్రియకార్యము నేను మీకుఁ దోడుపడియెద. నేను కోరుకొన్నచోట నాకు సారవంతములైన పదియగ్రహారములు, పదిలక్షలరూకలు మీరిచ్చెదనని వ్రాయించిరి. ఇరువదియగ్రహారములు నాకు దయచేయవలెనని కోరుచున్నాను. మీఁద

మీచిత్తము మాచిన్నరాజునుబట్టి మీకప్పగించెను. కోట మీస్వాధీనము జేసెద ధనాగారమంతయుఁ దరతరములనుండి ప్రోగుచేసిన ధనరాసులతో నిండియున్నది. అచ్చట లక్ష్మి తాండవమాడుచు మిమ్ముం బిలుచుచున్నది. మీరువచ్చి యాక్రమించుటయే కొఱఁత. ఈదేశము మీస్వాధీనమగునేని స్వర్గము మీచేతికిందికి వచ్చినట్లు. మేరుపర్వతము మీయధీనమైనట్లు కైలాసము మీగడపలోనున్నట్లు. ఆలస్యముచేయక వెంటనే బలములఁ గూర్చుకొని పంపు దండపాణియు వజ్రపాణియు నేఁ జెప్పినట్లు వినరుగాని గదాధరుఁడు శూలపాణియు నాయింటి కుక్కలు. వారునాపనుపు దప్పక సేయుదురు వారుతమతమ సైన్యభాగములతో వచ్చి మిమ్ముం జేరుదురు. మాసవసేనఁ గూడ మనలోనివాఁడె. ఆపుష్పరధునిఁ గూడ మీరు మనపక్షము జేసినవెనుక దగిన పారితోషికములిచ్చి సంతోషపెట్టవలయు. మీరు నాకీ దీనికుత్తరము వ్రాయునప్పుడు దానిలో నాపేరువ్రాయక యశోకవర్ధనుఁడని వ్రాయవలయును. పాములవానివేసము వేయించి నావేగులవానిని మీకడకీ యుత్తరమిచ్చి పంపుచున్నాను. ఇదే వందన శతము.

ఇట్లు విన్నవించు మీ విధేయుఁడు,

మణివర్మ.

కుమారుఁడు జాబు చదువుట ముగించినతోడనే యరవిందాదేవి "నాయనా! నీవు మణివర్మ వ్రాఁత నెఱుఁగుదువుకదా! ఇది యతని వ్రాతయగునా?" యని యడిగెను. "తల్లీ! మణివర్మలేఖనము నేనెఱుఁగుదును. అక్షరములు గుండ్రములై యాణిముత్తెములట్లుండును పంక్తులువంకరలేక ముత్యాలకోవలు పఱచినట్లుండును. అక్షరములు మిక్కిలి దగ్గఱఁగా వ్రాయుట యతనికలవాటు పెద్దగ్రంథము చిన్నచోటున నతఁడిమిడింపఁ గలఁడు. ఆనైపుణ్యమిందు స్పష్టముగఁ గనఁ

బడుచున్నది. తలకట్లు పొల్లులు తీర్చుటలో నతని హస్తమున కొకా నొకవింత కౌశలముగలదు. అదియు నిందుఁ గనఁబడుచున్నది. కావున నీవ్రాఁత యాతనిదే యని నాకుఁ దోఁచుచున్నది. అని యుత్తరము చెప్పెను. అపుడా యాదేవి నిట్టూర్పు విడిచి యీ వ్రాఁత తప్పక మణివర్మదేవ్యైన పక్షమునఁ గాశ్మీరరాజ్యలక్ష్మి ముఖమున బ్రహ్మమిక్కలిఖిద్ద వ్రాఁత వ్రాసెనని నేను దలంచెద అట్లైకానిచో మేరువువంటి ధైర్యమును సముద్రునివంటి గాంభీర్యమును రాజసామాన్య దుర్లభమయిన సౌజన్యమునుఁ గల మీతండ్రిగారేల దారుణముగా నస్తమింతురు! హా రాజ్యలక్ష్మి నీకును మాకును ఋణము దీఱెనదా? మాపైని నీకు విసుగుదోఁచినదా మమ్ము విడచి పరరాజుల పాలుగాఁదలఁచితివా పరమేశ్వరుని యాజ్ఞ యెట్లున్నదో యట్లు కాఁగలదు అని పలికి కుమారులధైర్యపడుదురేమో యని వెంటనే శంక దోఁప నాధోరణి దప్పించి యా దేవి వెండియు సోమభట్టు నుద్దేశించి "అయ్యా! ఇది యెట్లు మాతండ్రిగారికి దొరికినది?" యని యడిగెను. అందుకు సోమభట్టిట్లనియె. "అమ్మా! ఇది చిత్రముగా లభించినది. ఒకపాములవాఁడు కన్యాకుబ్జపట్టణమునఁ దనపాముల నాడించి ధనమార్జించుకొని యిందదుఁ దిరుగుచుండెను. ఒకనాఁడు వాఁడు తానార్జించిన విత్తముం దీసికొని యూరుచివరనున్న కల్లంగడికి బోయి రెండులొట్టెల కల్లుఁద్రావి యొడలుమఱచి కొంతసేపుఁ దొరలి కొంతసేపు నేలఁబొరలి తెలివివచ్చినతోడనే మరలఁ గొంత ద్రావి ప్రక్కనున్నవారితో నిర్హేతుకముగాఁ గయ్యమునకుఁ గాలుదువ్వి వారి పైఁబడెను. అప్పుడు జుట్టుజుట్టు పట్టుకొని వాండ్రు పోరాడిరి. ఈ భూర్జపత్రము వాఁడు తన తలపాగలో జాగ్రత్తగా దాఁచెను. ఈకలహములో తలగుడ్డ వీడిపోవుటం జేసి యిది నేలం బడెను. మహేంద్రదేవ మహారాజుగారి వేఁగులవాండ్రు దేశమందంతట వ్యాపించియుందురుగావు

న నాఁడు కల్లంగడిలోనున్న యొకచారుఁడు మెల్లగా దీనిందీసికొని మహారాజుగారికిచ్చెను. ఈభూర్జపత్రముయొక్క చరిత్రమిది. ఇందు నమ్మకపోవుట కేమియు లేదు. అంతయు సహజముగానున్నది. అసంభవమేమియుఁగానఁబడదు. కావున మీతండ్రిగారిట్లు మీతోఁజెప్పుమనిరి. మణివర్మను మాధవసేనుని నమ్మి మీయర్ధప్రాణము లాతని చేతంబెట్టవలదు. అవి పూలదండలుగావు. కుబుసమూడ్చిన కోడెత్రాచులు. అవి పగడములుగావు, చండ్రనిప్పులు. అవి క్షీరములుగావు, సున్నపునీళ్లు. అవి హంసలుగావు, కొంగలు. అవి గోవులుగావు గోచర్మముఁదాల్చిన బెబ్బులులు. కావున నమ్మిమోసపోకుఁడు. నీప్రాణములు బాలురప్రాణములు విషాగ్నులవలన శస్త్రసాధనములవలనఁ గాఁపాడుకొనవది. ఇది మీనాయనగారి సందేశము. దీని రత్నాభరణమువలె మీశిరంబునఁ దాల్చవలెను. మహామంత్రమువలె భక్తితో స్మరియింపవలెను. అమ్మా! నావచ్చినపనియైనది. చీఁకటిపడిన తరువాత నగరుసొచ్చి రేయి రెండుజాములు గాకమునుపే యూరువిడిచి పోవలసినదని మీతండ్రిగారు సెలవిచ్చిరి. నేనిచ్చటఁ దెల్లవారువరకునుండరాదు. మీ యమాత్యులు మీసేనాపతులు నన్నుఁబలుసిలుఁగులఁ బెట్టుదురు. మీతండ్రికి బురోహితుఁడనైమీకు హితమాచరింపవచ్చితిని. మేము ఛాందసులము. అలౌకికులము. ముక్కుకు సూటిగఁ బోవువారము. దారినవెళ్లి దారినవచ్చువారము మీసేమమతనికి వెంటనే యెఱిఁగింపుమనికూడ మీతండ్రిగారు సెలవిచ్చిరి. అందుచే నాకు సెలవొసంగుము." అని లేచెను.

అరపండయు విక్రమసేనుఁడు హర్షవర్ధనుఁడును లేచి వానికి నమస్కరించిరి. "అయ్యా! మేమీగడియవఱకు సేమముగా నున్నామని మానాయనగారితోఁ జెప్పుఁడు. ఇక్కడిస్థితిగతులనరసి నేనాయనకుఁ గర్తవ్యమునుగుఱించి జాబువ్రాసి విశ్వాసముగలబంటునంపెదను

అంతఱ నడిగితినని జెప్పుఁడు. దైవానుగ్రహమున బ్రతికితిమేని మరల దర్శనము జేయుదుమని జెప్పుము." అని యరవిందాదేవి వాక్రుచ్చి వానినంపెను.

ఆభూర్జపత్రము విక్రమసేనుని చేతినుండి హర్షవర్ధనుఁడు దీసికొని చదువుకొని "అన్నా! మనము దొంగలగుంపు నడుమనున్నాముసుమీ" యనిపలికెను. "కుమారా! అదియిటు తెమ్ము. నేనుజాగ్రత్తగా దాఁచెద" నని తల్లిపుచ్చుకొని మరలమగల దానింజదువుకొని "వత్సలారా! పొద్దుపోయినది పండుకొనుఁడు భయములేదు" అని వారిం బానుపులఁజేర్చి నిద్రపుచ్చెను.

అరవిందాదేవికిఁ జాలసేపు నిద్రపట్టనేలేదు. తెల్లవారుజామున నొకచిన్నకునుకు పట్టెను. అంతలోనే పగతురుకోటనాక్రమించి విక్రమసేనునింబట్టుకొని బంధించినట్లు దుస్స్వప్నము రాఁగా నామె నిద్రలో నయ్యోయయ్యో యని యఱచివగచి త్రుళ్ళిపడి మేల్కొని లేచి విక్రమసేనుని పాన్పుకడకుఁబోయి కొడుకుఁజూచుకొని యదికలగదాయని ధైర్యముఁదెచ్చుకొని నర్మదను లేపి తనదుస్స్వప్న మంతయు నెఱిఁగించి మరలఁ గన్నుమూసిన నెక్కడపాడుకలవచ్చునోయని శంకించి తెల్లవాఱునఱకు దానితో మాటలాడుచుండెను. తెల్లవాఱిన పిదప సమయోచిత కృత్యములుదీర్చి యాదేవి మణివర్మం బిలుచుకొనిరమ్మని యొక సేవకునిం బనిచెను.

అతఁడును స్నానసంధ్యావద్యనుష్ఠానములు దీర్చికొని సముచితవేషంబుఁదాల్చి రాచనగరుఁజొచ్చి దేవిని సందర్శించెను. విక్రమసేను డామెపక్కనుండెను. వారిమొగము లెప్పటియట్ల ప్రసన్నములుగాక వేఱుభంగి నుండుటచే నేదో క్లిష్టవిషయము వారిమనస్సులం బీడించుచున్నదని వృద్ధమంత్రియూహించి కారణమడుగఁబోవుచుండ నంతలో నరవిందాదేవి యుచితాసనంబున నతనిం గూర్చుండఁబనిచి కడ

చినరేయి సోమభట్టు తెచ్చిన భూర్జపత్రి మతనిచేతికిచ్చి చదువుకొమ్మనియెను. ఆసచివోత్తముఁడు లేఖ నామూలాగ్రముగఁ జదువుకొని విస్మితుఁడై యేమనుటకు నోటమాటరాక చదివినదే చదువుచు లేఖ దిరుగవేయుచు వెఱ్ఱివానివలె నుండెను. అప్పుడరవిందాదేవి వానినుద్దేశించి "అయ్యా! లేఖలోనివ్రాత నీయది యగునా?" యని యడిగెను. "అమ్మా! వ్రాతనాయది కాదు. ఈజాబు నెన్నఁడు నేను వ్రాయలేదు. సింధునాయకుఁడగు పరంతపుని నేను వినుటయేకాని వాని నెన్నఁడుఁ జూడలేదు. వానికి నాకు సంబంధము లేదు. కాని యీవ్రాత యచ్చముగ నావ్రాతవలెనే యున్నది. అక్షరములు పొందిక తలకట్లయొక్కయు పొల్లులయొక్కయు తీరు నేవ్రాసినట్లు దోఁచునట్లే యున్నది. ఇది మోడనాకు మాయగా నున్నది." అని యతఁడు బదులుచెప్పెను.

"అయ్యా! వ్రాత నీవ్రాతవలె నున్నదా! అక్షరములు పొందిక తలకట్లతీరు పొల్లులతీరు నీవ్రాతలో నున్నట్లే యున్నవా! కాని జాబు నీవు వ్రాసినది కాదా? ఇదియెవ్వరైన విశ్వసింతురని నీవు చెప్పఁజూచుంటివా? నీపలుకులు శిశువులు నమ్మవలయు. పశువులవంటి బాలిశులు నమ్మవలయు. మతిలేనివారు నమ్మవలయు. ఇట్టిపలుకులు నమ్ముటకు మేము వెఱ్ఱివాండ్రము కాము. నీవే తంత్రివి; నీవే మోసగాఁడవు, నీవే మాకేడుగడయు, మాపూర్వులనాఁటనుండి మమ్ముం గొలిచియున్నవాఁడవు నని నేనెంతో విశ్వాసముంచి మాయర్థప్రాణములు నీకప్పగించినందుకుఁ బదిలక్షలరూకలకు నిరువది యగ్రహారములకు నాసపడి మాగొంతుకోయం దలఁచితివా? పిన్నరాజును బట్టి పగతుర కప్పగింపఁ దలంచితివిగా! ఇంతకన్న ద్రోహమున్నదా? భర్తృవియోగదుఃఖమున మఱుఁగుచున్న నన్నుఁ జూడవైతివి. తండ్రిలేని పసిపాపని జాలిపడవైతివి. నీవు బెబ్బులులకన్నఁ దోఁడేళ్ళకన్న విషసర్పములకన్న ఘాతుక కృత్యముల సేయఁదలఁచితివే! నీవు చేయఁదలఁచుచున్న ద్రో

హామునకు యమధర్మరాజు నీ నిమిత్తమై క్రొత్తనరకముల సృష్టింప వలయుగాని పాతనరకములు పనికిరావు. నీ కగ్రహారములే కావలసినపక్షమున నన్నడిగిన నే నియ్యనా? భూకల నేనియ్యనా? బిరుదుల నేనియ్యనా? దీనికై గడ్డితినవలెనే? చిరకాలము జీవించితివే. ఎందుకు నీజీవనము? జగజ్జనులం బీడించుచు సర్పము వేయిసంవత్సరములు జీవించును. గదాధరుఁడు శూలపాణి మాధవసేనుఁడు మొదలగు నందఱనుగూడఁ జెఱచితివే. ఆహా? తేనెబూసిన కత్తి యని గడ్డిగప్పిన గొయ్యి యని యెఱుఁగక మేము మోసపోయితిమి. చాలు చాలు! చిత్రభానుఁడు పరమదుర్మార్గుఁ డంటివి. అతఁడును హా రాజుగారిని వధించెనంటివి. అతనికన్న నీ యాధిక్యమేమి? నీదుశ్చరిత్రమువలన నిఁక నెవ్వరిని నమ్మఁగూడదను నీతి మేమునేర్చుకొంటిమి. బ్రాహ్మణుఁడవు వయోవృద్ధుఁడవు చిరకాలపరిచితుఁడవు కావున మేమూరకుండవలసి వచ్చెఁగాని నీవెట్టిశిక్షకైనఁ బాత్రుఁడవు. నీకంతఃకరణము లేదు. నీకుగుండెలు లేవు. కటికవాఁడైన నీకన్న యోగ్యుఁడు. రాక్షసులైన నీకన్న యోగ్యులు చాలుఁజాలు నిఁక బొమ్ము" అని యాగ్రహావిష్టయై యరవిందాదేవి యాతని గడుంగడుఁ దూలనాడెను. విక్రమసేనుఁడు "తాతగారూ! మాయమ్మ కోపోద్రేకమున మిమ్ముం దూలనాడిన దన్నమాటే కాని యీజాబుమీరు వ్రాయని యెడల నిట్లుండుటకుఁ గారణమేమో చెప్పఁగలరా ! ఇది యసంభవముగాదా" యని యడిగెను. మణివర్మ మొగము కళాహీనమయ్యెను. చిరకాలమునుండి కడువిశ్వాసముతోఁ దానొనర్చిన సేవయంతయు బూడిదఁబోసిన పన్నీరయ్యెనని యతఁడు మనంబున విచారించెను. అయినను ధైర్యముఁదెచ్చుకొని యిట్లనియె. "కుమారా ! రాజపత్నియైనందున నీకుంబలెనె నాకుందల్లి. తల్లి బిడ్డలను లోపమున్నప్పుడు, లోపమున్నదని భావించినప్పుడు, చీవాట్లుపెట్టుటయు క్ష

ము. నేను మహాపరాధముఁ జేసితినని నమ్మియామె బాణములవంటి మాటలతో నన్ను నొప్పించె. అందుకునే విచారింపను. రాజ్యమీాస్థితిలో నున్నప్పుడు మిక్కిలి యనుమానాస్పదమైన యిట్టిలేఖ చేయిఁ జిక్కినప్పుడు మీాయమ్మయే గాదు— ఎవ్వరైన నిట్లేయందురు. ఈయపరాధమును నేను జేసినపక్షమున నామె యన్నమాటలన్నిఁటికి నే నర్హుఁడనే. నేనీతప్పు చేయలేదని నాయంతరాత్మ యెఱుఁగును; భగవంతుఁడెఱుఁగును మాధవసేనుఁడెఱుఁగును. ఇది శత్రువులకల్పనము. బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసిన విశ్వామిత్రుఁడువలె నావారిఁత కెవరో మిక్కిలి బుద్ధిమంతుఁడు ప్రతిసృష్టి గావించినాఁడు. లోకములో నెంతెంత నెఱజాణలైనఁ గలరు. పరమేశ్వరుఁడు సృష్టించిన యాకులంబోలిన యాకులు, పండ్లంబోలినపండ్లు మవ్వపుంజిగురులుం బోలిన మవ్వపుంజిగురులుఁ జిత్రింపఁగల చిత్రకారులున్నట్లే రూపంబులం బోలినరూపంబులనిర్మించు శిల్పులున్నట్లే వ్రాతలంబోలిన వ్రాతలసృష్టింపఁగల భూలోకవిశ్వకర్మలు, కలియుగవిశ్వామిత్రులు లోకంబునం గలరు. మీాకు నామీాఁద నాగ్రహముబుట్టించుటే వారి సంకల్పము. అందువారు సంపూర్ణముగాఁ గృతకృత్యులైరి. నన్ను మీారుతూలనాడినట్లు, నాయెడనమ్మిక గోలుపోవునట్లు నన్నుఁ గొలువునుండి తప్పించినట్లు వారువిందు రేని వారికార్యము నెఱవేఱినట్లు వారానందింతురు. ఎట్లయిన శత్రువులు సంకల్పసిద్ధులు. తల్లీ! నీవురోషావేశమున నన్నుం దూలనాడినను నేనాగ్రహింపను. నేను మనోవాక్కాయకర్మముల మీాయెడ దోసమాచరింపఁదలఁతునేని కాశీమహాక్షేత్రమున గోసహస్రమును వధించినట్లే. కురుక్షేత్రాదిపుణ్యస్థలములలో బ్రాహ్మణహత్యలు చేసినట్లే. నాతల్లింజంపినట్లే. నాతండ్రింజంపినట్లే. ఇంతకన్న నేనేశపథంబులు చేయుదు? నన్నుగుఱించి నేఁ జెప్పుకొనుట న్యాయముకాదు. సూర్యచంద్రులు సాక్షులుగా భూ

వ్యాది పంచభూతములు సాక్షులుగా నేను మీయెడఁ గృతజ్ఞుఁడనై యున్నాఁడను. ఏపాపమెఱుఁగను నాచేసిన మేటిసేవ బూడిదఁబోసిన పన్నీరైనదని నాబ్రతుకు హాస్యాస్పదమైనదని నేను విచారించుచున్నాఁడను. ఏలనన మీకు రాజభక్తి గల్గియుండుటచేత నేనావలఁ జిత్రభానునకుఁ బగతుఁడనైతిని. అతని మాయలను నురులలో మీరు చిక్కుటంజేసి మీకును బగతుఁడనైతిని. ఏమైననేమి! మీరున న్నఁగోలువు నుండి తప్పించినను సరే దూషించినను సరే. రాజకులమునకు నామేనఁ బ్రాణములున్నంత సేపు నేనుపకారమే కాని యపకారము సేయను. నాతలఁదెగనని మీరు కోటకొమ్మలకుఁ గట్టించినను నేను విచారింపను. నామరణమువలనఁ గాశ్మీరరాజకుటుంబమునకు మేలగునేని నాజన్మము సార్థకమైనదని నేను సంతోషింతును. నాబుద్ధి నాశరీరము, నాకాలము, నాపయస్సు మీసేవకై గడపితిని. కాన యూపిరి యున్నంత సేపు నీకిముందున్నట్టే చేయుదును. ఇట్లు సేయనైతినేని పంచమహాపాతకులు పోవుదుర్గతులకుం బోవుదును.

ఇట్లు సంపూర్ణమనోవేదనతో సంభాషించి యావృద్ధసచివుఁడు వారికడ సెలవుదీసికొని పోయెను. పోవుటకు సెలవిమ్మని యడిగినప్పుడుఁ గూడ నరవిందాదేవి వానితో మాటలాడలేదు. విక్రమసేనుఁడు మాత్రము "మంచిది, పోయిరం" డని పలికెను. మణివర్మ రాజాంతఃపురమున జరిగిన చిత్రకథ యంతయు మాధవసేనునకు గదాధరాదులకుఁ దెలిపి రాజకుటుంబము చిత్రభానుఁడు త్రవ్విన గోతిలోఁ బడి లేవలేక యున్నదని మిక్కిలి విచారించెను. వారును దైవప్రమాదమునఁ దప్పుదారిం ద్రొక్కెనని నొచ్చుకొనిరి.

మంత్రి వెళ్ళిన వెనుక విక్రమసేనుఁడు తల్లితో మణివర్మ చెప్పిన సమాధానము పరిశాంతమైన సమయమున వెండియు నాలోచింపఁ దగియున్నదని చెప్పెను. "నాయనా! మిత్రులెవ్వరో శత్రులెవ్వరో

దెలిసికొనుటకు వీలులేనియవస్థలో మనమున్నాము. నామనస్సు చెడిపోయియున్నది. అది చక్కఁబడినవెనుక నట్లజేయుదము" అని యుత్తరము చెప్పెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

---

చిత్రభానుఁడు గర్పూరమంజరికి వజ్రపాణిపై ననురాగము గలుగునట్లు జేయవలసినదని తనభార్యతోడను మల్లికతోడను దనవాక్పటిమమంతయు వినియోగించి చెప్పెనుగదా ! తనయాశలన్నియు దానిమీఁదనె నిలిచియుండుటచే నప్పనియెట్లు పరిణమించునో యని మనసులో నింతింతయనరాని బెంగబెట్టుకొని యుండెను. "బాలికతో మాటలాడితివా ? మాటలాడితివా ?" యని యిందుముఖిఁ బ్రత్యహముం దొందరపెట్టుచుండెను. మల్లిక గంటఁబడినప్పుడెల్ల "బిడ్డయేమన్నది ? చెప్పితివా?" యని యడుగుచుండును. మూఁడునాలుగుదినములు గడచినతరువాత నొకనాఁ డిందుముఖి బిడ్డం బిలచి భర్తతనతోఁ జెప్పిన విషయమంతయు నామె కెఱిఁగించెను. అదివిని కర్పూరమంజరి యనిష్టమును సూచించు చిఱునవ్వు నవ్వి యూరకుండెను. భావజ్ఞురాలయిన తల్లి యక్కన్యామతల్లి యుల్లము దానివలనఁ దెల్లముగనెఱిఁగి వల్లభునితో నావృత్తాంతముఁ జెప్పెను. అంతనతఁడుమల్లికను ద్వరపెట్టి వేధించుటచే నామె కర్పూరమంజరితో మాటలాడి యామెభావమును జిత్రభానునకిట్లెఱిఁగించెను. "అయ్యా ! మీబాలిక మీసందేశము నాముఖమునవిని నన్ను మొగముకాచునట్లు జీవాట్లు పెట్టినది. బుద్ధిలేదాయని యడిగినది. ఇట్టిసందేశములు తేవలదని నొక్కిచెప్పినది. కావున దేవరవారె స్వయముగా నామెనడుగుట సమంజసము. మీయెడఁగలభక్తినైన భయమునైన నామె

మీయుపదేశమును మన్నించి మీకోర్కెఁ దీర్పవచ్చును. ఇది మా కసాధ్యముగాదు. ఆమెకెవ్వరియెడ గౌరవమున్నదో వారిపరిసంగము చేయవలయుగాని మిక్కిలిచనవుగల మాబోంట్లు చేయఁగూడదు. అనవుడు చిత్రభానుఁడు తలయూఁచి "సరే ! ఆమె యభిమతము నేనే కనుఁగొనియెద" నని యారేయి భోజనానంతరమున బాలికయున్న గదిలోనికిఁబోయి సముచితాసనమునఁ గూర్చుండి "అమ్మాయి! నీతో నేనొక్కమాట చెప్పఁదలఁచి వచ్చితి. స్థిమితమనస్కవై వినుము" అని చెప్పెను

ఎన్నఁడుఁ దన గదిలోనికిరాని తండ్రి యారేయి తనకడకు వచ్చుటచేత నతఁడు తన వివాహవిషయమునుగూర్చి పరిసంగింపఁదలఁచి యరుదెంచి యుండుననని యామె గ్రహించి యతనికిం జెప్పఁదగిన సమాధానము ముందుగానూహించుకొని ధైర్యముతో నెదుటమంచముఁమీఁద గూర్చుండెను. అప్పుడు తండ్రికి బిడ్డకు నీక్రిందివిధమున సంభాషణము జరిగెను.

చిత్రభాను—కుమారీ! నేనును నీతల్లియు మున్ను జేసిన పూజలఫలముగా నోచిననోములపంటగా దేవతా వరప్రసాదమువలె మా యదృష్టవశమున లేక లేక యొక్కకుమారితవు జన్మించితివి. నాకు నీవొకకన్ను. నీతమ్ముఁడు విజయసేనుఁ డొకకన్ను. అందు నీవే నామనోరథంబవు. నాకనుల చందమామవు. నాబహిఃప్రాణంబవు. అట్లగుటచే నేను నిన్నొక్కకోరిక గోరఁదలంచి వచ్చితిని. అది నీవు సఫలముచేసెదవో బహుదుఃఖపరంపరచేత నవసియున్న నామనస్సు చెడిపోవునట్లు నిరాకరించెదవో యెఱుఁగ. ఏమనియెదవు?

కర్పూర—తండ్రీ! అది వినకుండ నేనేమియుత్తరముచెప్పగలను.

చిత్రభా—బిడ్డా! నీవదివిన్నదే. నీతల్లివలన వింటివి. మల్లికవలన వింటివి. అయినను నానోటఁగూడవిని సమాధానముఁజెప్పు. నీకు

వివాహయోగ్యకాలము ప్రాపించినది. తగినవరుని నన్వేషింపవలసిన భారము నాపైనున్నది. బిడ్డలకు మాతాపితలకన్న హితార్థులు క్షేమంకరులు నాప్తులు ప్రపంచమున మఱియొకరు లేరుగదా? అందుచేత మేమెల్లవిధముల నీమేలు నీసుఖముఁగోరి వరనిర్ణయము సేయుదుము. స్వయంవరమను పద్ధతి రాచకాలముననున్నది గాని దానివలనఁ గొన్ని యరిష్టములుండుటచే నది నాకిష్టములేదు. బాలికలు నవయౌవనప్రేరితలై పౌర్వాపర్యములు విచారింపక భావికాలకష్టములనెన్న లేక "కన్యావరయతేరూప" మ్మనునట్లు గేవలము చక్కఁదనమునే చూచుకొని యే దరిద్రునో గుణహీనునో నాస్తికునో కులభ్రష్టునో విద్యాగంధశూన్యునో వరింతురు. స్వయంవరమునఁ బ్రమాదమున కెన్నో యవకాశము లున్నవి. కావున దానిని నే నంగీకరింప. అందుచే మేముచేసిన, నిర్ణయమునే నీవు తలయొగ్గి యనుసరింపవలయునని కోరుచున్నాను. "మాతృదేవోభవ పితృదేవోభవ" యని వేదముచెప్పుచున్నది. మాతాపితలు బిడ్డల పాలిదైవతములు. వారిమాట యవశ్యము గ్రాహ్యము. అట్లగుటంజేసి నీవునామాట ననుసరింతువని నమ్మియుంటి. విశేషించి నీవు తక్కిన రాజకన్యకలవంటిదానవు కావు. కావ్యనాటకాదులేగాక శాస్త్రములఁ గూడ నభ్యసించిన దానవు. గుణగ్రహణపరాయణవు. సంగీతసాహిత్య ధౌరంధర్యమున నీకు సాటియగుకన్య నేఁటికాలమున లేదు. నాబిడ్డ వగుటచే నేను నిన్నుఁ బొగడఁగూడదు గాని నీవిద్యకు వినయము వన్నెవెట్టుచున్నది. ఈనాఁటికన్యలవలె గర్వము పెంకెతనము నీకడ నున్న పక్షమున నేనట్లు చెప్పుటకు రాకనేపోదును.

కర్పూర—తండ్రీ! స్వయంవరమునఁ బ్రమాదములున్నవనుట నిజమేకాని దమయంతి పొరబడినదా? రుక్మిణి పొరబడినదా? తల్లిదండ్రులకిష్టములేని పెండ్లికొడుకును జేపట్టినను సుభద్ర పొరబడినదా?

విద్యావతులైన కన్యకలు మనసులో నెంతవలపున్నను నెంత మోహపరవశులైనను స్వయంవర సమయమునఁ దమకులగౌరవంబును వరుని యాభిజాత్యమును గుణసంపదను జూచుకొనకపోరు.

చిత్రభా—బిడ్డా! అందఱు కన్యకలు దమయంతియట్టివా రగుదురా? అందఱు రుక్మిణివంటివా రగుదురా? ఎల్లరు సుభద్రలగుదురా? అవి పురాణములలోని గాధలు. అదియునుఁగాక కవిచాతుర్యమందు మెండుగా నుండును. కవులు గోరంతలు కొండంతలు జేసి వర్ణింతురు. ఆమాట నీవే యెఱుఁగుదువు. దానికేమిగాని నీ వెవ్వరి కొఱకైన మేలుపడితివేమో చెప్పుము. నీవలపున కే రాజకుమారుఁడైన గుఱియైనదో నది నాకెఱిఁగింపుము. అతఁడు స్వీకరింపఁ దగినవాఁడగునో కాదో చెప్పెద.

కర్పూ—ఆవిషయమున నేనిప్పుడేమియుం జెప్పఁజాల. (అని సిగ్గునఁ దలవంచినది.)

చిత్ర—అమ్మా; మాళవరాజనందనుఁడగు మకరందుఁడు నీకునచ్చినాఁడని కర్ణాకర్ణిగ వింటిని. అయ్యది నిజమగునో కాదో నీవు నాకెఱిఁగింపుము! నాకడసిగ్గుపడకుము. నీమనోభావము స్పష్టముగా దెల్పుము పెఱవాఁడనుగాను. కన్నతండ్రిని. నీభావము దెలుపుదువేని నేనందున్న గుణదోషము లుగ్గడించెద.

కర్పూ—భావమున కేమిగాని యకుమారునియందుఁగల గుణదోషముల నుగ్గడింపుము.

చిత్ర—బిడ్డా! గుణదోషము లుగ్గడింపవలసినదని నన్నడుగుచుంటివా? నీవు విద్యావతివి. గుణ గ్రహణ శక్తి కలదు. అనఁగూడదుగాని నాకన్న నెక్కువచదువుకొంటివి. నీవు గ్రహింపలేని గుణదోషముల నే నెన్నఁగలనా? అయినం దండ్రినిగుటచేతను బెద్దఱికము నామీఁదఁ బెట్టుటచేతను జెప్పెదవినుము—మాళవేంద్రుఁడగు

సుదర్శనుఁడు బౌద్ధుఁడు. మనము క్షత్రియులము. మనము వర్ణాశ్రమధర్మములఁ బాటింతుము. వారికవి లేవు. మనకు యజ్ఞములు మొదలగు క్రతువులు కలవు. శ్రాద్ధములు మొదలగు పితృకర్మలు కలవు. సంధ్యావందనాది నిత్యకర్మలు కలవు. ఇవి వారికి లేవు. వారు వేదమును బ్రమాణముగా గ్రహింపరు. శాస్త్రములు విశ్వసింపరు. పురాణములు కల్పిత కథలందురు. ఆత్మ లేదందురు. ఉత్తరలోకఫలమును నమ్మరు జగన్నిర్మాణ ధురీణుఁడగు చతుర్ముఖుని కన్నను, విశ్వరక్షణకళాప్రవీణుఁడగు నారాయణునికన్నను జగత్ప్రళయకారణుఁడయిన శివునికన్నను, శాక్యకులుఁడైన గౌతమ బుద్ధుఁడే సర్వవిధముల నధికుఁడని వారు విశ్వసింతురు. ఇన్నిటికన్న గష్టమైన దింకొకటి కలదు. వారు పరమేశ్వరుఁడు లేఁడందురు. అందుచే నాస్తికులు. ఇట్టి యపవిత్రమగు ధర్మ ముపదేశించి లోకులను ధర్మభ్రష్టులను బరమపతితులను జేసిన యాగౌతమబుద్ధునకుఁ నధమగతులేగాని యుత్తమగతు లుండవుగదా!

కర్పూర—తంత్రీ! బౌద్ధమతసిద్ధాన్తములు నీకు సరిపడకపోయినఁ బోవుగాక! నీచెప్పిన దోసములు బౌద్ధమతస్థులకడ నుండిన నుండుఁగాక! కాని, లోకోత్తర చరిత్రుఁడును, బరమపవిత్రుఁడును, సర్వదీనజనమిత్రుఁడును నయిన సిద్ధార్థుని నీవట్లు దూషించుట ధర్మము గాదు. ఆమహాత్మునికన్న నుత్తముఁడు నమ్మహనీయునికన్న మాననీయుఁడు—నా దేవునికన్న మహానుభావుఁడు జగంబున మఱియొకఁడు గలఁడా ? ఆసిద్ధాంతములు నీవు చదువలేదు. వైదికధర్మనిరతు లగు పండితులవలన నిజములు కొన్ని యబద్ధములు కొన్ని విని సౌగత ధర్మములు నింద్యములని దురభిప్రాయముఁ గలిగియుంటివి. అదివట్టి పొరపాటు. చిత్తగింపుము. అమ్మహాత్ముఁడు పవిత్రరాజవంశమున జన్మించి మహీమండలమేలుట కర్హుఁడై యుండియుఁ దండ్రికొక్కఁ

డై కొడుకయ్యు- నమితలావణ్యతారుణ్య సమేతయగు భార్యంగూడి యుండియు- సకలైశ్వర్యసమృద్ధిఁ గల్గియుండియు లోకము పాపభూయిష్ఠమై యున్నదని విచారించి దుర్గతిపాలగుచున్న మానవలోకము నుద్ధరింపనమకట్టి యాలుబిడ్డలను, దల్లిదండ్రులను, బంధుమిత్రులను భాగ్యభోగ్యములను విసర్జించి చీనిచీనాంబరములకు మాఱుగాఁ గాషాయవస్త్రములఁ దాల్చి, ముత్యాలహారములకు మాఱుగా రుద్రాక్షమాలలు ధరించి శిరమున రత్నమకుటమునకు మాఱుగా జటాజూటమువహించి, గమగమతావుల నీను కలపంబులకు మాఱు బూదిఁ బూసికొని, యుద్యానవనములఁ రోసి వనముల డాసి, మేడలు విడిచి చెట్లనీడల విడిసి, హిరణ్మయపాత్రముల త్యజించి మృణ్మయపాత్రముల భుజించి, పరమనిష్ఠాగరిష్ఠుఁడై తపంబుసేసి, మేను శుష్కింపఁజేసి యింద్రియంబుల గెల్చి, జీవితముయొక్క పరమార్థముం గనిపెట్టెను. ఆమహనీయుఁడు మధ్యమలోకమున కలంకారము. క్షత్రియుఁడగుటచే రాచకొలమాయనవలన వన్నెకెక్కెను. మానవలోకమాయనవలనఁ బవిత్రమైనది. దయాదాక్షిణ్యములే యామహాత్మునిమతమునకు మూలరాళ్ళు. ఆశాక్యసింహుఁడు మూర్తీభవించిన భూతదయయని చెప్పుట యతిశయోక్తిగాదు. భూతదయ యాతనికళేబరముతో నాఁడు దగ్ధమైపోయినదనుట పొగడ్తగాదు. శాంతమామహానీయునితో నాఁడుచితిమీఁద బూడిదయయ్యెనని పలుకుట కవిచాతుర్యముగాదు. ,ఆయన బోధామృత మాస్వాదించినవారు ధన్యులు. ఆయనం జూచినవారు కృతకృత్యులు. ఆయనమతము స్వీకరించినవారు పవిత్రులు. ఆయనవలన మానవులు పతితులు గాలేదు. పతితులు పావనులయిరి. దుర్జనులు సజ్జనులైరి. అపవిత్రులు పవిత్రులైరి. ఆభగవానుఁడు దేవుఁడున్నాఁడనిగాని లేఁడనిగాని చెప్పలేదు. అంతమాత్రముచేత నతఁడు నాస్తికుఁడుగాఁడు, అతనిమతము నాస్తిక

మతముగాదు. అతఁడాస్తికులలో నగ్రగణ్యుఁ డని చెప్పవచ్చును. ఆస్తికులమని విఱ్ఱవీగు మానవులలో ననేకులు సత్యనాస్తికులు, ధర్మనాస్తికులు, దయానాస్తికులు, భక్తినాస్తికులు కలరు. ఆనాస్తికులలో నెందఱో యాస్తికులుగలరు. భూతదయాజితేంద్రియత్వమునను రెండును దన్మతమునఁ బరమసిద్ధాంతములు. ఆమత మవలంబించినవారు జీవహింసచేయరు. "ఆత్మవత్సర్వభూతాని" యనుధర్మము వారియందు స్థిరమైయున్నది. జీవహింసాభయముననే వారు యజ్ఞములు మానిరి.

చిత్ర—అమ్మాయి!, బౌద్ధమతసిద్ధాంతములు నీతలకెక్కినవే. అవి యెక్కడ నేర్చితివి? ఆమతమన్న నీకింతగౌరవము కలుగుటకుఁగారణమేమి? గురివెందగింజలు నిప్పులని, గాజుపూసలు జాతిరత్నములని, యెఱ్ఱని పెంకులు కెంపులని నీవు భ్రమించుచుంటివి.

కల్యా—తండ్రీ! నేను భ్రమించుటలేదు. నేను విదర్భలోనున్నప్పుడు మైత్రేయియను బౌద్ధయోగిని తఱుచు రాజాంతఃపురమునకువచ్చుచు బోవుచు శుద్ధాంతకాంతలకు నప్పుడప్పుడు సుగతస్వాములధర్మముల నుపదేశించుచుండెను. అవి నేను మిక్కిలి శ్రద్ధగవింటిని. పిమ్మట నామె పాలీయనుభాష నాకుపదేశింప నందులోనున్న దమ్మపదము మొదలగు నుత్కృష్టగ్రంథములఁ జదివితిని. అది కారణముగా నాకు మహనీయుఁడైన బుద్ధదేవునిమీఁదను వాని మతముమీఁదను నమితగౌరవము గలిగినది.

చిత్ర—సహవాసదోషమున సుశీలురు దుశ్శీలురగుట యాశ్చర్యముగాదు. నీళ్ళకు వస్త్రములకు వాయువునకు వస్తుసహవాసములనుబట్టి సుగంధదుర్గంధములు గలుగునట్లే మనుష్యులకుఁ గూడ దుర్జనసజ్జన సహవాసమువల్ల దురభిప్రాయ సదభిప్రాయములు పట్టుపడును. ఒకవేళ బౌద్ధమతములో నుత్కృష్టధర్మములున్నను బౌద్ధులందఱు సుగుణసంపన్నులగుదురా?

కర్పూ—తండ్రీ! అందఱు సుగుణవంతు లుండరు. కాని మాలవేంద్రుఁ డగు సుదర్శనుఁడు లాతివారితోఁ బోల్పఁదగినవాఁడు గాఁడు. ఆయన గుణరత్నాకరుఁడు. అతఁడు తనదేశమున జీవహింస మాన్పించెను. ఆయన నిష్కళంకచరిత్రుఁడు పరమ కృపాళుఁడు ప్రజలం—దన బిడ్డలుగాఁ జూచును. ఆత్మసుఖముకంటెఁ బ్రజాసుఖ మెక్కువగఁ జూచును. ఎక్కువ పన్నులుగట్టి ప్రజలబాధింపఁడు. బౌద్ధమతస్థులమీఁదఁ బక్షపాతము, వైదికమతస్థులమీఁద ద్వేషము లేదు. అందఱు సమానముగఁ జూచును. ఆయన కొడుకు మకరందుఁడు పితృమార్గానువర్తి. తలిదండ్రులకు విధేయుఁడు. ప్రజాబాంధవుఁడు. తండ్రివలెనే యతఁడుగూడ రాజ్యమందలి ప్రజలలోఁ దండ్రిలేనివారికిఁ దండ్రి. సోదరులులేనివారికి సోదరుఁడు. మిత్రులులేని వారికి మిత్రుఁడు. బిడ్డలులేనివారికి బిడ్డ. ఈవిధముగా వారు సర్వజన శ్లాఘనీయులై, కృపాసముద్రులై, ధర్మతత్పరులై, రాజ్యపాలనము సేయుచున్నారు.

చిత్రి—ధర్మతత్పరులై పరిపాలించుట నీవెట్లెఱిఁగితివి?

కర్పూ—మాళవదేశమున నేనున్న కాలములో వారి యౌదార్యాదిగుణములు దెలిసికొనుట కనేకావకాశములు గలిగినవి.

చిత్రి—అంతఃపురమునందున్న విదేశాంగనకు నీకు లోకము నందలి వ్యవహారము, రాజుల పరిపాలనాపద్ధతులు దెలిసికొనుట కవకాశము గలిగినదా? ఎంతోకాలము దేశమందుండి నల్గడలు దిరిగి జనులతోఁగలసిమెలసియున్న వారికే తెలియుట కష్టముగదా నీకవలీలగా దెలిసెనని నీవనినంతమాత్రమున నమ్మవచ్చునా! ఏదో యభిమానమున నిట్లనుచుంటివి.

కర్పూ—తండ్రీ! నాపలికినది సత్యముగాని యభిమానప్రేరితమైనమాటగాదు! శత్రువులయందైనను గుణమున్నచో గ్రహించుట సత్పురుషలక్షణము.

చిత్రి—గుణమున్న గ్రహింపవచ్చును. లేనిచో గ్రహించుటెట్లు? ప్రస్తుతాంశము విను! మకరందునిమీఁద నీవు వలపునిలిపితివో లేదో నీమాటలచే స్పష్టముగాఁ దేటపడలేదు. కాని, వానియెడనీకుఁ గల యభిమానముంబట్టి నీకాతనిపైఁ గూరిమిగలదని నేను నిశ్చయింపవలసినచ్చినది. మనము వైదికాచార సంపన్నులము. వారు వేదబాహ్యులు కర్మరహితులు, మనకువారికిం గలయిక యపేక్షణీయముగాదు. నీవు దేవాలయముస కరుగుదువు; వారు దేవాలయములను రోయుదురు. మనము శివకేశవులను బరమాత్ములుగా నెంతుము; వారు మనుష్యమాత్రుఁడైన బుద్ధునే యారాధింతురు. నడవడులలో నాచారములలో నభిప్రాయములలో మనకువారికి నమితభేదము గలదు. అట్టివారి మనసులెట్లు కలియును? పొత్తులెట్లు కలుగును? సామరస్యమెట్లు కుదురును?

కర్పూర—తండ్రీ! అన్నింటికి మనస్సుప్రధానము. మనస్సులో నిష్టమున్నయెడల నన్నిఁట సామరస్యము గుదురును. దంపతులుభిన్నమతస్థులయినను దాంపత్యమున భంగముండదు. భర్తశైవుఁడు, భార్యవైష్ణవియైన దాంపత్యములున్నవి. మతములో నెవరిష్టము వారిది. ఎవరియిచ్ఛవచ్చినట్లు వారు దేవతల నారాధించుకొనవచ్చును. అంతమాత్రముచేతఁ బరస్పరమైత్రికి భంగముండదు. అరమరలేని కూరుములునిలుపుటకు మతమడ్డము రాదు.

చిత్రి—బిడ్డా! నీవు వెఱ్ఱిపడుచున్నావు. అట్టిదంపతుల కెన్నఁడుఁగాపురము సరిగాఁబొసగదు. అయ్యదానునకుఁబెట్టు నమ్మజంగమునకుఁబెట్టు నన్నసామెత నిజమగును. నీవుజక్కఁదనమొక్కటే మెచ్చి యాతని వరింపఁదలఁచు చుంటివి. వరునియందుఁ జూడఁదగినలక్షణ మదియొక్కటియే గాదు. త్రాఁచుబాము తలలో వెలలేని మణియుండును. అదిచూపులకెంతో చక్కఁగానుండును. ఈగుణములంబట్టి

దానినెట్టివెంగలియైన మెడలో హారముగా వైచుకొనునే? దానింబ్రి క్కలోఁ బెట్టుకొని పండుకొనునే? మెఱయుచున్నదంతయు బంగార మనుకొనవద్దు. కస్తూరీపంకముఁబూసికొన వచ్చునుగాని బురదఁబూ సికొనఁ గూడదు.

కర్పూ—అయ్యో! చక్కఁదనము మొక్కటేమెచ్చి కార్యనిశ్చ యము చేసికొనుటలేదు. మెడఁదాల్చునది కుసుమమాలగాని కోడె త్రాఁచుగాదు. మేనఁ బూసికొనునది మృగనాభిగాని, మెత్తనిబురద గాదు.

చిత్రి—బిడ్డా! చదువుకొన్నదానవు గావున వీరుఁడు బాణ మునకుబాణమువైచినట్లు మాటకు మాట సమయోచితముగఁ జెప్పఁ గలవు. యుక్తులనటుంచి నామాటవినుము. మకరందునిపై మక్కువ మానుము.

కర్పూ—అట్లయిన నెవ్వని పాణిగ్రహణము సేయుమందువు?

చిత్రి—భళి! ఇప్పుడు దారికివచ్చితివి. చెప్పుచున్నాను వి నుము—ఈపట్టణమున దండపాణి వజ్రపాణియని యిరువురన్నదమ్ము లున్నారు. వారుత్తమక్షత్రియులు; చంద్రవంశజులు. మనము పాం డవసంతతి; వారు యాదవసంతతి. మనకువారికిఁ బూర్వకాలమునుం డియు నిచ్చికోలు పుచ్చుకోలుగలవు. వారిద్దరు సేనాధిపతులు, అస హాయశూరులు, నిర్వక్రపరాక్రములు. అందువజ్రపాణి భుజాబలమున భీమసేనుఁడు, ధనుర్విద్యయందు సవ్యసాచి. సౌజన్యమునందు సహదే వుఁడు, శాంతమునందు ధర్మరాజే.

కర్పూ—చక్కఁదనమందో?

చిత్రి—పాడుచక్కఁదనము. వరునకుఁ జక్కఁదనమే ప్రధాన మా? అది యుపప్రధానమని నాయభిప్రాయము. అదిగాక యెవరి చక్కఁదనము వారికుండును. కన్ను ముక్కు చెవి నోరు కాలుసేతు

లు వంకరలేక సరిగానుండెనా యెట్టివరుఁడైనఁ జక్కఁగానుండును. గుణము ప్రధానముగాని చక్కఁదన మెందుకు ? తురాయిపువ్వు కట్టెట్టగానుండును. అందములేదు. చందములేదు. వాసనలేదు. అతఁడు నల్లగానుండును. నల్లగా నున్నంతమాత్రమున యువతీదూష్యుఁడగునా ? అట్లయిన నల్లనివారికిఁ బెండ్లికాఁ గూడదా? కస్తూరి నల్లనై సువాసనలచేత మాననీయముగాదా ? కోయిలనల్లనై మనోజ్ఞ ధ్వనులచే జగద్వంద్యముగాదా ? ఇంద్రనీలము నిగనిగకాంతులు నీనుచు నవరత్నములలో నొకటికాలేదా ? భగవంతుండగు పరమేశ్వరుఁడు స్ఫటికమువలెఁ దెల్లనిమేను గలవాఁడయ్యు నల్లనిదానిని పార్వతిని పెండ్లియాడలేదా ? శ్రీమహాలక్ష్మి బంగరుబొమ్మవలె నుండియు నీలమేఘశ్యాముఁడైన నారాయణుని వరింపలేదా ? నీలవర్ణము హరిహరులకు భార్యలతోడి కూటములు చెఱిపెనా ? పాంచాలి నల్లనిది; పాండవులు చక్కనివారు. ఇట్లెన్నో యుదాహరణము లున్నవి. కావున నల్లనివాఁడనిరోయక వజ్రపాణిం జేపట్టుము. అతఁడు వేయికన్నులులేని వజ్రపాణి. రక్కసులచేఁ బెక్కుసారులు కయ్యములనోడిపోని వజ్రపాణి. మునిశాపంబును జెందనివజ్రపాణి. సౌఖ్యములో కమందున్న వజ్రపాణి.

కర్పూ—రాజ్యములేని వజ్రపాణి. పూజ్యతలేనివజ్రపాణి యని చెప్పుము.

చిత్ర—అమ్మా ! ఆలాగు నిరసింపఁగూడదు. అందఱకు రాజ్యములుండునా ? శ్రీకృష్ణున కేమిరాజ్యము గలదు ? రుక్మిణీసత్యభామ మొదలగు కాంతలెంతమంది గుణములకు వలచి యాతనిఁ జెట్టఁ బట్టలేదు.

కర్పూ—ఆయనకిదివఱ కొకభార్యయున్నది గదా !

చిత్ర—ఉండిననేమి ? చిన్నదానవయ్యు నీవు పెద్దభార్య వగు

దువు. నిన్నుఁ జేపట్టినపిదప నామెకు గౌరవము కడముట్టును. ఆమె నీకు దాసియై యుండును.

కర్పూ—హరిహరీ ! తండ్రీ! ఆయన చెట్టబట్టి యెంతో సుఖపడవలెననివచ్చి సంతానవతియై మహాపతివ్రతయై యాతని సేవించిన యిల్లాలిని నేను దాసిగా నేలుదునా ? అట్టిపాడుపని యెన్నఁడు నేఁ జేయను. నాదురదృష్టముచేత నొకవేళ నాతనిచెట్టఁ బట్టుటయే సంభవించు నేని నేనాయనకు రెండవపత్నినై యామెకే నేను దాసినై యూడిగములు సేయుదునుగాని యమసాధ్వి మనస్సునకు రవంతయేని నొప్పిగలిగింపను సుమీ ! నీవు లక్ష్మీదేవిని శంకరునిఁ బ్రసంగవశమునఁ బేర్కొంటివి. నారాయణుని యందున్న గుణములు నీవజ్రపాణియం దున్నవా ? దేవతలసామ్యము పనికిరాదు. దేనికయిన మనస్సుప్రధానము. మహారాజునకు మందిరములుకావలెను. విరాగికి విపినములు గావలెను. మనసునకు నచ్చినవాఁడె మన్మథుఁడు; నచ్చని వాఁడు నాగుఁబాము.

చిత్ర—ఇంతకు వజ్రపాణినీకు నచ్చె నా, లేదా ?

కర్పూ—తండ్రీ ! అడుగుచుంటివి గాన జెప్పెద వినుము. అతనిచేయి బట్టుటకంటె శాశ్వతబ్రహ్మచర్యమున నుంట మేలు.

చిత్ర—బిడ్డా ! నీవాతని చేపట్టుటవలన మనకు గొప్పపయుపకారమగును. అదియేదందు వేని—వజ్రపాణియు వానియన్నయగు దండపాణియు మనపక్షమున నున్నారు. నీవు వజ్రపాణిని జేపట్టుదు వేని వారు హేమచంద్రుని వంశమును సింహాసనమునుండి కూలఁద్రోసి కాశ్మీరరాజ్యమునకు నన్నభిషిక్తుఁ జేయుదురు. నేను పెద్దవాఁడను. నాలుగై దేండ్లురాజ్యము చేసి చనిపోదును. నాయనంతరమున నీతముఁడు విజయసేనుఁడు రాజగును.

కర్పూ—(చెవులుమూసికొని) హరిహరీ ! ఎంతమాట ! విశ్రు

మసేనుని రాజ్యభ్రష్టుం జేయుదురా? అందుకని నేను వజ్రపాణి పాణిగ్రహణము జేయవలెనా? నావివాహానికీ దుష్కార్యమునకై నుపయోగింపఁబడునా? కటకటా! అట్టిపాడుపనిలో నేనెన్నఁడు బా ల్గొనను. విక్రమసేనుఁడు తండ్రిలేనిబిడ్డ. మనమందఱమునువానికి సాయ ము జేసి రాజ్యమునందతని సుప్రతిష్ఠితుని జేయుట కనుకూలముగా నిట్టి దుష్కార్యము సేయందగునే? ఈకార్యము నింద్యము. దూష్య ము, నరకహేతువు. తండ్రీ! అట్టిపని యెన్నఁడు సేయకుము. విక్రమసేనుఁడు విజయసేనుఁడుం గూడ నా తమ్ములే. ఎవరు గద్దె నెక్కినను నాకు నిద్దఱయు సంతసమే. కాని, పైతృకం బగురాజ్యమునకు విక్రమసేనుఁడే యర్హుఁడు. అతఁడు రాజగుటే ధర్మము. ధర్మేతరములగు మాటలు నాకడఁ జెప్పవలదు.

చిత్ర—(రోసముతో) నయమున భయమున నే నెన్నివిధ ములఁ జెప్పిన నామాటలు నీమనసున కెక్కకున్నవి. తలక్రిందుగాఁ దపస్సుచేసినను నీకు మకరందుఁడు భర్త గాఁడు. నిన్ను వజ్రపాణికే పెండ్లిచేసెదను జూడు.

కర్పూ—(రోసముతో) తండ్రీ! అంతవఱకు వచ్చునేని నాశరీర మగ్ని కాహుతిఁ జేసెద. అంత నవకాశములేదేని—ఇదిగో! నాచేతి వజ్రపుటుంగరము. కర్పూరమంజరీశవమునే నీవు వజ్రపాణికి వివా హము సేయవలయునుగాని, యీమేనఁ బ్రాణములుండఁగాఁ జేయఁ జాలవు. ఒకవేళ నీవతనిచేత నామెడలోఁ ద్రాడుగట్టించి సంకల్పసిద్ధుఁ డగుదువేని యది నామెడ కురిత్రాడగునుగాని మంగళసూత్రము గాదు. నీవు శూరుఁడవు. చలముగలవాఁడవు. నేను నీకడుపునఁ బుట్టిన కూఁతును. నీరక్తమే నానాళములలోఁ బ్రవహించుచున్నది. నీచలమే నాలోఁ బ్రతిఫలించుచున్నది. నేను మనస్సుచేత మకరం దుని వివాహమాడితిని. దేహముచేత వివాహముగా జేసి, యీదేహ

మితరులకొఱ కుపయోగపడకపోవుఁగాక! బలవంతముగఁ జచ్చి మఱియొకజన్మమెత్తియైన నతనిం జేపట్టెద.

చిత్రి—బలవన్మరణమునఁ బిశాచమగుదువు.

కర్పూ—వజ్రపాణిని వివాహమాడి వానిభార్య యనిపించుకొనుటకన్నఁ బిశాచమైనను మంచిదే. రక్కసియైనను మంచిదే. ఆ పెనుభూతముతోఁ గాఁపురముసేయుటకన్న భూతమునైనను మంచిదే. వివాహము సామాన్య మనుకొంటివా? నీయిచ్చవచ్చినట్లు సేయుటకిది బొమ్మలపెండ్లి గాదు. రెండుహృదయము లొకహృదయము కావలె. రెండుమనస్సు లొకమనస్సు కావలె. భర్త చంద్రుఁడు, భార్య వెన్నెల. మగఁడు సూర్యుఁడు; మగనాలు కాంతి. గృహస్థుఁడు పూవు. ఇల్లాలు తావి. ఏకమనస్సుతో వా రవినాభావముగ నుండవలయు. బలాత్కారవివాహములు పనికిరావు.

చిత్రి—నీవు చచ్చిననుసరే! వివాహమాడి చావుము.

కర్పూ—ఆహాహా! నీవంటి తండ్రి ప్రపంచమున లేఁడు. నే మృతినొందిననుసరే నీకార్యమైనం జాలుఁగాఁబోలు!

చిత్రి—సరే! జాగ్రత్తగానుండుము. నీవు నాకు ధర్మప్రశ్నములు చెప్పఁదొడఁగితివి. దీనిఫల మనుభవింతువుగాక!

అని గాటమగు రోసమునఁ జివాలున లేచి గదివిడిచి యవ్వలకుం బోయెను.

---

## పదమూఁడవ ప్రకరణము.

---

ఆశాదేవత జగన్మోహనాకారముఁ దాల్చి హస్తమునఁ బహురసభరితమైన రాజ్యఫలంబును బట్టుకొని మొగమునఁ జిఱునవ్వు వెన్నెలలు గాయ "నన్ను మెప్పించితివేని యీఫలంబు నీయదియ

నీయుదియ! త్వరపడుము. ప్రయత్నింపుము" అని యూరించుచుఁ బలు తెఱంగులఁ బురికొల్పుటం జేసి చిత్రభానుఁడు స్వలాభపరాయణుఁడై కన్నబిడ్డసౌఖ్యము వీటఁబుచ్చి నిష్కరుణుఁడై కర్పూరమంజరి నట్లు తూలనాడి తన శయ్యాగారమునకుం జని నేత్రములనియెడు గోలు ములనుండి రూక్షవీక్షణములను విస్ఫులింగములు చెదరిపడ మొగము జేవురుబూసిన తెఱఁగున శోణమయి భయంకరముగఁ దోఁపఁ బండ్లు పటపటఁ గొఱుకుచు నిందుమణిం బిలిచి తనకుం గూఁతునకుం జరిగిన సంభాషణమంతయుఁ జెప్పి యామె పెంకెతనమునకుఁ దగిన దండన చేయునట్లు ప్రతినబట్టెను.

ఇందుమణి మిక్కిలి భయపడి కూఁతుకడకుఁ బోయి శాంత వచనములతో నిట్లనియె. "బిడ్డా! మీతండ్రిగారి స్వభావ మెఱిఁగి యుండియు నీవాయన కంత కోపముఁ దెప్పింపఁదగునా? తండ్రిమాట వినవలదా? పితృవాక్యపాలనము నీవంటి విద్యావతియే చేయనిపక్షమున సామాన్యబాలికలు చేయుదురా? నీవు తండ్రిని దిరస్కరించితివని లోకమున వెల్లడియైన నది మన కప్రతిష్ఠగాదా? నీవు మిక్కిలి కఠినముగా మాటాడితివఁట! అట్టి కఠినోక్తులు తగునా?" అని మందలించుటయుఁ గర్పూరమంజరి "అమ్మా! తండ్రిమాట వినఁదగినదే. పితృవాక్యపాలన ముత్తమధర్మము. కాని, వివాహము పేరుపెట్టి నాకు దున్నపోతునో పెద్దపులినో లేక మఱియొక మోటపశువునో గట్టిపెట్టవలెనని తండ్రిగారు స్వలాభపరాయణులై సమకట్టినప్పుడు నే నాయనమాట నెట్లు శిరమునఁ దాల్తును? ధర్మము చెప్పినప్పుడు తండ్రిమాట గ్రాహ్యము. అధర్మము పలికినప్పుడు గ్రాహ్యముగాదు. తండ్రి యసత్యమాడుమన్న నాడవలెనా? జనకుఁడు నరహత్య సలుపుమన్న సలుపవలెనా? తండ్రి నీతిమాలి వర్తింపుమన్న వర్తింపవలెనా? ఆయన యధర్మము పలికెనుగావున నే నాయన యాన దాఁటితిని." అని బదులు చెప్పెను.

"బిడ్డా! చదువుకొన్నదానవు. నీకు నేను జెప్పఁజాలనుగాని యొక్కమాట వినుము! మహాత్ముఁడైన భీష్ముఁడు తండ్రిసుఖము కొఱకు స్వసుఖనిరభిలాషియై వివాహము మానుకొని బ్రహ్మచర్య దీక్షాపరతంత్రుఁడై లోకవంద్యుఁ డయ్యెను. వివాహమేగాదు రాజ్యముగూడ జనకుని సుఖమునిమిత్తము తృణప్రాయముగాఁ బరిత్యజించెను. రఘురాముఁడు జనకుని శాసనంబున రాజ్యపరిత్యాగంబుఁ గావించి సుకుమారియైన జనకకుమారితోఁగూడ వనముల కేఁగి పితృవాక్యపాలకులలో నగ్రగణ్యుఁ డయ్యెను. చెప్పఁబూనిన నిట్టి వనేకములు గలవు. వారి తెఱంగున నీవును నీజనకునినిమిత్తము స్వసౌఖ్యముల నాసింపక యాయన ప్రీతికొఱకు నీదేహము నర్పింపరాదె!" యని యిందుమణి యుత్తరము చెప్పెను.

"తల్లీ! రాజ్యములు వదలవచ్చును. వివాహములు మానవచ్చును. నేనును వలయునేని వివాహము మాని బ్రహ్మచారిణినై తపోవనమున కరిగి జపమాత్ర జరిపెద. అది తండ్రిగారి కిష్టమగునేమో కనుఁగొనుము. కాని, యీనరపిశాచమునుమాత్రము చేఁబట్టను. వివాహమాడదలఁచితినా నామనసువచ్చిన రాజకుమారుని నాకు నచ్చిన గుణములుగలవానిని— నాకందోయి నలరించెడు లావణ్యవంతుని— నాహృదయము రంజింపఁగల రసికశిఖామణిని— నాప్రాణమునకుఁ బ్రాణమైనవానిని— నామనోరథము సఫలము సేయువాని— నామేనికి గంధకుంభంబాతవలె నుండువాని— నోకలోకవంద్యుని— గుణరత్నాకరుని— సత్కులీనుని, విద్యావంతునిఁ జేపట్టెద. లేదా గార్గివలె శాశ్వత బ్రహ్మచర్యవ్రతమవలంబించి నారలుగట్టి కందమూలములు నాకలములు దిని జడలుదాల్చి మేను శుష్కింపఁజేసి కోరికలు మొలకలెత్తకుండఁజేసి పరమపదము నందెద. ఈ రెండు దారులేగాని మధ్యమార్గము నేనొల్ల. దాంపత్యమన నెట్టిదో యెఱుఁ

గుదువా? అదియు సుఖదుఃఖములయందద్వైతము. సర్వావస్థలలో నసంగతము. ఉదయమునకు విశ్రామము. ఆజన్మాంతము బరస్పరానంద సంధాయకము. అట్టిదికానిపెండ్లి పెండ్లిగాదు. తల్లీ! ఇన్నిమాటలెందుకు? విదర్భరాజపుత్రికయగు దమయంతి జగత్త్రియ నాయకులు వర ప్రదాతలు మహామహిమాఢ్యులునగు దేవతలువచ్చి తమ్ము వరింపుమని ప్రార్థించినను వారిం గ్రేగంటిచూపులనైనఁ దనుపక మానవుఁడు- తనవలపుకాఁడు నైన నిషధరాజును వరించెను. మఱియొక విదర్భరాజపుత్రిక రుక్మిణి తలిదండ్రులు నన్నదమ్ములు, బంధుమిత్రులు తన్ను శిశుపాలునకిచ్చి పెండ్లిచేయ నిశ్చయించినను వారి కన్నుఁ బ్రామి యతిరహస్యముగ శ్రీకృష్ణుని యొద్దకుఁ దనకునమ్మికగల యొక బ్రాహ్మణుని రాయబారమంపి తన మనోరథమూయనకెఱిఁగించి యాయనచేబలాత్కారముగాఁగొనిపోఁబడి రాక్షసవిధినే నాయనను వివాహమాడెను. అదిగాక సాక్షాన్నారాయణావతారుఁడైన శ్రీకృష్ణుని యొక్కయు శేషావతారుఁడైన బలభద్రునియొక్కయుఁ జెల్లెలు, వసుదేవుని కూఁతురు, సుగుణభద్ర సుభద్ర తన్ను బలదేవుఁడు దుర్యోధనునకీయఁ దలఁచినను మేనత్తకొడుకగు నర్జునుని వలచి వలపించి పితృభ్రాతృవచన తిరస్కారముఁ గావించి యాతని వెంటఁ బోయెను. తల్లీ! వారి సాదృశ్యమేల తేఁగూడదు? నాచెప్పిన పలుకులన్నియుఁ జక్కఁగఁ బరిశీలించి తండ్రిగారి కోపమును శమింపఁ జేయుము. ఇంతకన్న నాచెప్పునదిలేదు." అని కర్పూరమంజరి బ్రతిమలాడవచ్చిన తల్లి కుత్తరమిచ్చెను.

పుత్రిక గట్టిపట్టుపట్టియున్నదనియుఁ దనమాటలామె తలకెక్కవనియు గ్రహించి యిందుమణి మాఱుమాటాడక పడకగదికిఁబోయి తనయునునయంబులుగూడఁ దనయ యెడనిష్ప్రయోజనంబులైనవని యాగ్రహావిష్టుఁడైనభర్త కెఱింగించి యతని యాగ్రహము ద్విగుణముఁజేసెను.

చిత్రభానుఁడా రేయి కన్నుమూయలేదు. చాలసేపు తోఁచక నటునిటుఁ బచారుచేసి తానుతలపెట్టిన కార్యము ఫలోన్ముఖమునకు వచ్చినప్పుడు తా నెన్నఁడుఁ దలఁపని విధమునఁ గూఁతురు వలన భగ్నమైనదని చింతించి కార్యసాధనము జేయుట యెటులనా యని విచారింపఁదొడఁగెను. గాఢముగ నిద్రించుచున్న రుద్రభట్టును మేల్కొల్పి కార్యాలోచనమడుగ వలయునని యొకటి రెండుసారులు వాని శయనించిన తావునకుఁ బోవ సమకట్టి యాతనికి నిద్రాభంగము సేయుట యనుచితమని మరలఁ దనలోఁదానే సమర్థించుకొని యూర కుండెను. అంతవేకువజామయ్యెను. తెల్లవాఱఁబోవుచున్నది. మేలు కొనుఁడో హోయని కాలపురుషుండు వైచిన కేకవోలెఁ గొక్కొరోకో యని కోడికూసెను. ఆకూఁతవినఁగానే రుద్రభట్టు మేల్కొని యఱ చేతులు రాపాడఁజేసి కన్నులు నలుముకొని పుష్పదంత విరచిత మైన మహిమ్నస్తవము పారాయణముఁ జేసికొనుచుండెను. అప్పుడు చిత్రభానుఁడు సమీపించి యాస్తవము ముగిసినపిదపఁ గడచినరేయి దనకుం గూఁతునకు జరగిన సంవాదప్రకారము సమగ్రముగా విన్న వించి యిట్లనియె.

"స్వామీ! మీయాశీర్వచన ప్రభావమునఁ గార్యము దాదాపుగఁ బంటను సిద్ధమైనది. పరమమూర్ఖురాలైన నాకూఁతువలనఁ బోటుపొడచిన సముద్రముపాటువడినప్పుడు వెనుకకుఁ దగ్గినట్లు కార్యము యథాస్థానమునకుఁ బోవుచున్నది. ప్రధానముచేసినంగాని మనకు సేనాపతులు తోడుపడరు, వారితోడులేనియెడల మన మిచ్చటఁ జిల్లిగవ్వకైన మాఱము. బాలికమూఢయై నామాటలఁద్రోసిపుచ్చుచున్నది. వజ్రపాణి చక్కనివాఁడుగాఁడట. సవతియున్నదఁట. మాళవరాజనందనుఁడగు మకరందుఁడు మహీతలమున వెలసిన మన్మథుఁడఁట! అతనినేగాని వివాహమాడదఁట. బుద్ధివిశేషమున శుక్రబృహ

స్వతులను జీరికింగొనని మీరే యుపాయాంతర మన్వేషించి తప్పు దారింబడిన యీకార్యమును సరియైన త్రోవకుఁ ద్రిప్పవలయును."

అనవుడు రుద్రభట్టు మెల్లగా "ఆలాగా! బాలిక కడు మూర్ఖురాలుగానున్నదే. చదువుకొనిన యాఁడుది, చదువునేర్చిన మగవాఁడు పనికి రారని మొదటి నుండియు నేను వాదించుచుంటిని. నీకూఁతురు ముద్దుముద్దియగాక ముద్దులుమూటగట్టునట్లు విద్దియాలు నేర్చి పెద్ద పండితురాలయినదని తద్దయు సంతసించితిమిగాని తుదకు నీకెదురు త్రొమ్ముమీఁది కుంపటివలెనుండి సంతాపకారిణియగునని యూహింపవైతివి. 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' యని మనువు వెట్టివాఁడై చెప్పెనా! మనువుమాటలు మనముఁ పెడచెవిని బెట్టుటచే మన కూఁతులు మనము తెచ్చిన మనువుల నొల్లక మన మాటల సరకు గొనక యిచ్చవచ్చిన తెఱంగున మెలఁగుచున్నారు. తేలునకుఁ గొండ్లు పామునకు విసపుతిత్తి, బెబ్బులికి వాఁడికోఱ యెట్టిదో పడఁతికిఁ జదువట్టిది. స్త్రీని నేలఁబెట్టి అణఁచివేయవలెనుగాని స్వాతంత్ర్య మీయఁగూడదు. వారియెడ జాలిపడఁగూడదు" అని చేతులతో నభినయించుచు మొగముఁ ద్రిప్పుచు వెండియు నిట్లనియె "వివాహమున నాఁడుదానికి స్వతంత్ర్యభావమా? తావలచినవానిని బెండ్లి చేసికొనుటా? రుక్మిణితోను సుభద్రతోను తనకు సామ్యమా? నరక మెక్కడ, దేవలోక మెక్కడ? తల్లిదండ్రులు తెచ్చిన సంబంధ మంగీకరించి చచ్చినట్లు పడియుండవలసినదే గాని యాఁడుబిడ్డవలపులు గిలపులు నిలిపి మనసు వచ్చిన వానిని బెండ్లియాడుటా? పూర్వకాలపుమాట నేను చెప్పను గాని యీ కాలమున స్వయంవరమనఁగా నాఁడుపిల్ల తన చూపులకు నచ్చినవానిని దగులొని పోవుటయే. ఈవెఱ్ఱి యాగడములు సాగనీయఁ గూడదు. రాజా! నేనింత కఠినముగాఁ బల్కితినని మనసులో వేఱువిధముగాఁ దలఁపకుము నాబిడ్డయొకటి నీబిడ్డయొకటిగాదు

అదియే నాబిడ్డయగునేని, నీ తెఱంగున నాతో వితండ వాదము సేయు నేని దాని శరీరము ఖండఖండములుచేయనా? ఇట్లనుట చేత నీబిడ్డం జంపుమనుటగాదు సుమీ! నామనస్సు మండిపోవుటచేత నిట్లంటిని. ఇందు కొక్కటే యుపాయమున్నది. కాలహరణమైనఁ గార్యము చెడును. దండపాణిని వజ్రపాణినిబిలిచి ప్రధానముచేయుదము. కర్పూరమంజరివివాహమున కంగీకరించినదని మనమువారితోఁ జెప్పుదము. అబద్ధమెట్లుచెప్పుదునాయని నీమనస్సుశంకింపవచ్చును. ఇట్టివిషయమున శంకలుపనికిరావు. మనము తెల్లవాఱలేచి యెన్నియబద్ధములునుడువుట లేదు? రాజనీతికసత్యము కన్నతల్లి. సత్యమునవతితల్లి. రాజనీతి యసత్యమునఁబుట్టి యసత్యమునఁ బెరుగుచున్నది. అది యసత్యాత్మకము రాజయినవాఁడు రాజనీతి నవలంబింపకతప్పదు. ప్రాణవిత్త మాన భంగములందు సూనృతంబువిడిచి యనృతంబు నాశ్రయింపవచ్చునని భగవానుండైన శుక్రుఁడుపదేశింపలేదా? అందుచేత నిశ్శంకముగా మన మసత్యమును సత్యముగా మార్చి మాటాడవచ్చును. ప్రధానముచేయుదుమని వారికిఁ జెప్పిపంపుము. ఎల్లుండి మిక్కిలి మంచిది. తిథివారనక్షత్రములుసరిగాఁ గుదిరినవి. తారాబలచంద్రబలములు సమకూడినవి. ఆదినమునఁ దప్పక ప్రధానముజరుగునని వారికిం దెలుపుము. అతిరహస్యముగా జరుగవలెననిమాత్రము చెప్పుము. వానిసన్నిధిని నీవూరకుండుము. కర్పూరమంజరి సమ్మతించినదని నేనే చెప్పెద. వానితో నిన్నేవలచినదనిచెప్పెద. నీదర్శనమునకై నిరీక్షించుచున్నదనియెద. నీచేయిబట్టెడుభాగ్య మెప్పుడు లభించునాయని యువ్విళ్ళూరుచున్నదనియెద. నీపేరే యామెకు హరినామస్మరణమనియెద. నీవిజయములే పాడుచున్నదనియెద. అదియిదియననేల! ఏమనవలెనో యన్నియు ననియెద. భగవంతుఁడు కపటోపాయములకు గట్టితలయిచ్చినాఁడు. వాటిని వాగ్రూపమున వెల్లడించుటకు నాలుకనిచ్చినాఁ

డు. ఆశక్తి నీకింక వినియోగించెద." అని నిశ్శంకముగఁ బలుకుచున్న రుద్రభట్టును జూచి చిత్రభానుఁడు "స్వామీ! ఎటువంటి క్లిష్టమార్గములనైన మీబుద్ధిరథము నిరాఘాటసంచారముఁ గలిగియుండును. చికిలిచేసిన కత్తివంటి మీబుద్ధి యెట్టిసంకటకార్యములనైన ఛేదించును. మీమాటలు విషాదముచే జడములైన నామనస్సునకు నవయువములకు నెంతో చైతన్యముఁ గలిగించినవి. మీరు చెప్పినట్లు జేసెదఁగాని కొట్టకొనకు మనము వివాహము చేయకపోవుదుమేని దండపాణియు వజ్రపాణియు మనము వంచించితిమని యాగ్రహించి యెదురుతిరిగి యపకారము సేయరా? ఈలోపున బాలికయభిమతముఁ దెలిసి కోపించి కార్యభంగము సేయరా? బాలిక యీవార్త విని యాత్మహత్య చేసికొనదుగదా? ఈమూఁడుశంకలు నామనంబును బీడించుచున్నవి. దీనికేమియుపాయము?" అనిపలికెను.

నిశ్శంకహృదయుఁడైన రుద్రభట్టు ప్రత్యుత్తరమునకై వెదకుకొనక తక్షణమే యిట్లనియెను. "కర్పూరమంజరికి వానిపై వలపు లేదనుమాట లోకమునఁ బొక్కకుండ మనము గోప్యముగ నుంచవలెను. ఈవార్త మనలో జీర్ణముకావలెను. ఎవ్వరియొద్ద నిది యెత్తవద్దని నీభార్యతో నొక్కిచక్కాణింపుము. చెలికత్తె లీమాట జాఱవిడిచిరేని బ్రతికియుండఁగానే నేలం బాతిపెట్టింతుమని చెప్పుము. సలసలకాఁగుచున్న నూనెలోఁ బాఱవేయించి వడియములట్లు వేయింతుమని చెప్పుము. ఇట్లు చేసితిమేని యీమాట పైకిఁ బొక్కదు. మన కార్యమయినతరువాత వివాహము మనము సేయలేకపోయినను మనను వాఁడేమిసేయఁగలఁడు? బాలిక మొదట పెండ్లి కంగీకరించి పిదప దుర్బోధలవలన మానుకొన్నదని చెప్పవచ్చును. అదివినక వాఁడు తెగనీల్గి పెంకితనముచేసెనా వానిజుట్టు మనచేతిలో నుండును గనుక నోరు మూయించి శిరచ్ఛేదము జేయించెదము. బాలికయాత్మహత్య

చేసికొనునేమో యని నీకు శంకగదా! చేసికొన్నపక్షమున నీపీడయే పోయినదని నమ్ముము. ఏదోరోగమువచ్చి చచ్చినదని మనము చెప్పవచ్చును. దైవికమున కేమిచేయఁగలమని వాఁడు తన యదృష్టమును నిందించుకొనుచు నూరకుండి యెప్పటియట్ల మనకు సాయము జేయును. ఆమె బలవన్మరణమునొందిన సర్వార్థ లోకమునకుఁ దెలియకుండఁ జేసి నీబిడ్డ చెలికత్తెయైన మల్లికనో చంద్రికనో దెచ్చి యదే కర్పూరమంజరియని వానికి వివాహము చేయుదము. వీఁడు చిన్నప్పుడెప్పుడో బాలికం జూచియుండును గాని యీనడుమ నెప్పుడుఁ జూడలేదు గదా! "శతకోటి దరిద్రాణా మనంత కోట్యుపాయాః" అని ప్రాచీనులు చెప్పియేయున్నారు. 'నందో రాజా భవిష్యతి,' యని వినలేదే! నాఁటికొక్క దైవముండదా? భక్తవత్సలుఁడైన మహేశ్వరుఁడు నాశిష్యునికార్యము భంగముసేయునా? వెనుకటియట్లు నేనెప్పుడో యొక నాఁటిరాత్రి రెండుజాములవేళ మహేశ్వరసాక్షాత్కారము జేసికొని నాకభీష్టసిద్ధిచేయుమని కోరెదను. భయపడకు."

చిత్రభానున కతఁడు చేసినయుపదేశము సమంజసముగా నుండెను. మూఁడవనాఁడు ప్రధానమునకు సుముహూర్తము నిశ్చయింపఁబడినదని యతఁడు వారి కెఱిఁగించెను. వారాదినమున రాత్రి జాముప్రొద్దుపోయినతరువాతఁ దమకాప్తులైన యిరువురు బ్రాహ్మణులం దోడ్కొని పసపు, కుంకుమ, పండ్లు, యగరు, చందనము, సుగంధపుష్పములు, వెలలేని యాభరణములు, మేలైన పట్టుచీరెలుఁ దెచ్చి తమతోడవచ్చిన సేవకులను వీధిలో నిలిపి వారైన నెఱుఁగకుండ నింటిలోని వారెఱుఁగకుండ రుద్రభట్టు నెదుటఁబెట్టిరి. యథాక్రమముగాఁ బ్రధానముజరిగెను. ఈకార్య మతిరహస్యముగా నుంచవలసినదని వచ్చినబ్రాహ్మణులతో రుద్రభట్టు చిత్రభానుఁడుఁ జెప్పిరి. రుద్రభట్టు కర్పూరమంజరి వానిసమాగమమునకైతహతహం

బడుచున్నదని మిక్కిలి దృఢముగాఁ జెప్పెను. వజ్రపాణి మేరమీరిన యానందమునొంది కర్పూరమంజరీ పాణిగ్రహణమహోత్సవమునకై యూటలూరఁ దొడఁగెను. భవిష్యత్కాలమునఁ దనకూఁతురు కాశ్మీరదేశపు రాణియగునని దండపాణి పరమానందమునొందెను. ప్రధానము ముగిసినపిదప వారు నిజనివాసముల కరిగిరి. చిత్రభానుఁడు రుద్రభట్టు తాము త్రవ్విన మా సూసూపమున నాయపడిరని చెప్పుకొని నవ్వుకొని పిమ్మట నిద్రపోయిరి.

---

## పదునాలుగవ ప్రకరణము.

తెల్లవాఱఁజొచ్చెను. "కాశ్మీరరాజ్యలక్ష్మిని దనవశము జేసికొనుటకై గొప్పకుట్ర జరుగుచున్నది. రాజభక్తులందఱు వెంటనే మేలుకొనుఁడోహో" యని కాలపురుషుఁడు పెట్టుబొమ్మవలె జాముకోడికూసెను. విషాదమాలిన్యముపోవఁ జిత్రభానుని మొగము తెలివొందినట్లు తూర్పుదెస తెల్లవాఱెను. విక్రమసేనుని పక్షముననున్న మిత్రులు క్రమక్రమముగా సిస్తై యంతరించుచున్న వారని తెలియఁజేయుటకో యన జుక్కలదృశ్యములు కాఁజొచ్చెను. రాజ్యలక్ష్మి పరహస్తగతమగుచున్నది. పరమేశ్వరా! కావుకావుమని పక్షులుసైతమఱచుచున్నవో యన్నట్లు కాకులు కావుకావుమని కూయఁజొచ్చెను. అరవిందాదేవి మనంబున నెలకొన్న కొంచెపుటాసలుగూడ నడఁగుచుండినట్లు తెల్లవారుజామున నున్న చిలుపవెన్నెలలు క్రమక్రమముగా క్షీణించెను. దినమనియెడు కాంత నల్లచీర విడిచి తెల్లచీర కట్టినట్లు చీఁకటిపోయి వెలుఁగు పొడమెను. క్రొత్తవేసముతో శ్రీనగ

రంబునఁ జిత్రభానుఁడు పొడసూపినట్లు పొడుపు గొండమీఁదఁ జిత్ర వర్ణములతో భానుఁ డుదయించెను. ఎవ్వరికిం గానఁబడకుండఁ బై పైనిజరుగు చిత్రభానుని ప్రయత్నంబులట్లు యుదయకాల ప్రభాకరుని లేయెండలు మునుముందు నేలపైఁ బ్రసరింపక యిండ్లమీఁదను జెట్ల మీఁదను వ్యాపింపఁజొచ్చెను. ఆతనిజతనంబులు క్రమక్రమంబుగ నిట్టే పురంబున వ్యాపించునని తెలుపుటకో యన లేయెండ లించుకించుక తీవ్రములై నేలం బఱువఁజొచ్చెను.

వైదికకర్మనిరతులగు బ్రాహ్మణోత్తములు స్నానముచేసి ప్రాతస్సంధ్యావిధులఁ దీర్చి భగవానుఁడగు భాస్కరున కర్ఘ్యప్రదానమొసఁగి నిత్యనైమిత్తికములకుం జొచ్చిరి. మూర్ఛనుండి లేచిన జంతువువోలెఁ బ్రపంచమంతయు వెండియుఁ జైతన్యముగలిగి వికాసవంతమయ్యెను. మానవులు తమతమవ్యాపారములయందుఁ బ్రవేశించిరి. రుద్రభట్టు తనమొగ మప్పటికిఁ బ్రజలకుఁ జూపఁదలఁచుకొనలేదుగావున దొడ్డిలోనున్న బావికడనే స్నానముచేసి ప్రాతరనుష్ఠానములఁ దీర్చికొని, వ్యాఘ్రాసనమునఁ గూర్చుండియుండఁ జిత్రభానుఁ డాయనకడకుఁ బోయి నమస్కరించి యెట్టయెదుట నాసీనుఁడయ్యెను. "రాజా! సుఖముగ నిద్రపట్టినదా?" యని రుద్రభట్టడిగెను. "దేవా! మీయనుగ్రహమున మనోవిచారములెల్ల దూరములగుటచే నిద్రపట్టినది. కాని, "రాజా!" యని పిలుచుచున్నారేమి? అది లభింపలేదే?" యని చిత్రభానుఁడు బదులుచెప్పెను. అప్పుడు రుద్రభట్టు చిఱునవ్వు మొగమున నంకురింప నిట్లనియె— "లభింపలేదా! నీమట్టుకు లభింపలేదని తోఁచుచున్నదిగాని, నాబుద్ధికి లభించినట్లు తోఁచుచున్నది. నీవు కాశ్మీరసింహాసన మెక్కినట్లు, నీశిరంబున నానారత్నవిరాజితమగు కనకకిరీటము భాసిల్లుచున్నట్లు బహుపుణ్యనదీజలంబులందెచ్చి భూసురులు వేదోక్తముగ నీ కభిషేకము చేయుచున్నట్లు,

సామంతమహీపాలురు తమ మకుటకాంతుల నీపాదములకు నీరాంజనంబిచ్చునట్లు వంగి నీకు నమస్కరించినట్లు, హస్తకంకణంబులు ఘలుఘల్లుమని మొఱయ రాజులు కానుకలుగాఁ బంపినయంగనలు నీకు వింజామరలు విసరుచున్నట్లు, హెగ్గడలు కైవారము సేయుచున్నట్లు ప్రెగ్గడలు రాజకార్యముల నివేదించుచున్నట్లు, రాయబారులు వినయంబునఁ దమతమ రాజుల సందేశంబున నెఱిఁగించుచున్నట్లు నీవు వారి మనవిపనవులవిని మెచ్చి తలయూఁచి కృపారసపూరితములగు క్రీగంటిచూపులఁ జూచుచున్నట్లు నామనోనేత్రమున కిప్పుడే పొడగట్టుచున్నది. సర్వాలంకారశోభితమగు మదపుటేనుఁగు నెక్కి నీవు శ్రీనగరంబున నూరేగుచున్నట్లు నేలవేల్పులు గంభీరస్వరమున నిన్నాసీర్వదించుచున్నట్లు పౌరాంగనలు నీపై నక్షతలు లాజలు పూవులు జల్లి మందహాస విలసితములగు సుందరవదనారవిందములతో నిన్నుంజూచి యానందించి పసిఁడిపళ్లెరంబులఁ గప్పురంపుటారతులిచ్చినట్లు నామనోలోచనమునకుఁ గానవచ్చుచున్నది. కాకపోయెడు కార్యంబు నామనంబున నింతదృఢముగా ముద్రిబడినట్లు నిలువను. పరమేశ్వరానుగ్రహము నీపై సంపూర్ణముగాఁగలదు. తెల్లవాఱుజామున భగవంతుండగు చంద్రశేఖరుఁడు నాకు స్వప్నమున సాక్షాత్కరించి మీఁదఁ జేయివైచి తట్టి "వత్సా! నీ సంకల్పమీడేఱును. నీవింకఁ విచారంబుదక్కియుండుము. చాణక్యుఁడు చంద్రగుప్తుని మగధరాజ్యంబునఁ బ్రతిష్ఠించినచందంబున నీవు చిత్రభానునిఁ గాశ్మీరసింహాసనంబున నిలుపఁగలవుసుమీ" యని యానతిచ్చెను. అంతలో నాకు మెలకువవచ్చెను. శాంతరసమొల్కు నామూర్తిని, సువర్ణములవంటి సువర్ణములతోఁ గూడిన యా చల్లనిమాటలను మఱియొకసారి కని వినవలెనని కుతూహలము పొడముచున్నది. మరలనెప్పుడో గాని లభింపదు. ఇఁక మనకార్యసిద్ధియైనట్లె. మనదే యాలస్యము. రాజ్యలక్ష్మి రాక్షసి

వంటిది. అది కామరూపిణి. చిఱునవ్వునవ్వి యొకనితో మేలమాడును. భయంకరాకారిణియై యొకనిని బెదరించును. ఎండమావులవలె దనచుట్టునున్నవారికి నిజరూపము భ్రమింపఁజేసి వేఱొకనిబేలుపుచ్చును. ఒకని నిజముగా ననుగ్రహించి బాగుచేయును. కాని నెప్పుడు నమ్మరాదు మాంత్రికుఁడు పిశాచము దొరకినప్పుడు మంత్రప్రభావమునఁ బట్టుకొని దిగ్బంధనముజేసి కదలనీక మెదలనీక దనవశము జేసికొనినట్లు రాజనీతికోవిదు లదను జిక్కినప్పుడు రాజ్యలక్ష్మిం బట్టుకొని బంధింపవలయు. ఇప్పు డయ్యదను వచ్చినది. మనదే యాలస్యము. కార్యమునకు దిగవలయు."

అనవుడు చిత్రభానుఁ డుత్సాహపూరితుఁడై "ఏమిచేయవలయునో యిప్పుడె యానతిండు. చేసెద." నని బదులుచెప్ప రుద్రభట్టు వాని కిట్లనియె. "నీమనారిమంత్రియగు జయంతుని, మున్నునీతో వచ్చిన విదర్భరాజసేనాపతి సుగ్రీవుని విదర్భకుఁబంపి యిచ్చటిపరిస్థితులు విదర్భరాజునకువిన్నవించి గొప్పసేనందీసికొని సాధ్యమైనంత వేగముగా రమ్మనుము. ఇక్కడ దండపాణియు వజ్రపాణియు దోడ్తోనివచ్చు సేనలకుఁదోడుగ విదర్భసేనయుండవలయు. అదియే మనకు ముఖ్యాధారము. అది ప్రథమకర్తవ్యము. తరువాత మనకరటకుని వాక్యవాయువులు ప్రశాంతమైన సేనాసముద్రమున సంక్షోభతరంగములను సృజియించినవి. పింగళుఁడు రాజకుటుంబము మనస్సునఁ బెట్టి నచిచ్చు నేఁటికిని మండుచునేయుండి మంత్రులయెడ విశ్వాసమును దగ్ధముచేసియుండును. రాజ్యలక్ష్మిని సమీపించుటకు మార్గమేర్పడినది"

అనవుడు చిత్రభానుఁడు "ప్రథమమున నేమి సేయవలయునో యది యానతిండు. అట్టిపనికిఁగూడ మీరుసుముహూర్తము నిర్ణయింపుఁడు. అమరేంద్రునకుఁ బృహస్పతియట్లు, దానవేశ్వరునకుఁ శుక్రుఁడట్లు మీరు మాకుధర్మోపదేష్టలు విజయము మీ మాటననుసరించి పోవు

ను." అనివినయమున మనవిచేయ రుద్రభట్టు వెండియునిట్లనియె. "రాజా! సేనానివేశమునకుఁబోయి పాములవాఁడు నాగస్వరముతో వల్మీకములలో నిద్రించుపాములను లేవఁగొట్టి యాడించునట్లు చిత్రవిచిత్రములు మహోత్సాహభరితములునగు నీవచోగుంఫనలచేత సైనికులంబ్రబోధించి పురికొల్పుము. సింధుగాంధరనాయకులఁ గండయాత్రలు నీ నాటకమున కితివృత్తములగుఁగాక! నీ యున్న గారి నురణము నాందియగుఁగాక! మణివర్మప్రముఖులు ప్రతినాయకులగుదురుగాక! నీవు కథానాయకుఁడవు. రాజ్యలక్ష్మి కథానాయిక. ఈనాటకమునకు నేనే సూత్రధారుఁడను. నీవువినిపించుకలాప మెంతరసవంతముగా నుండిన నంతత్వరలో నీకు జయముచేకూరును. నీమాటలకుంజొక్కి సైనికులు తియ్యనీటికిఁ జేప లెక్కినట్లు నిన్ననుసరింపవలెను. ప్రస్తుతము నేనువచ్చుటకు వీలులేదు. అయినను నాయాశీర్వచనమె నిన్ననుసరించి నీకు జయమునాపాదించును. రేపురేయి మంచిముహూర్తమున్నది. మనశిష్యులు సైనికులమనస్సులు కలఁచెదరుగాక!

అనవుడు జిత్రభానుఁడు "మహాప్రసాదము స్వామీ! యట్లచేసెద" నని వానికడ సెలవుపుచ్చుకొని యానలకుంబోయి తద్విషయప్రయత్నములనుండెను.

మఱునాఁడు తెల్లవాఱుజామున సేనానివేశమున నొక కలకలముగలిగెను. తలపై నాకుపచ్చని పద్దపాగ నమర్చి మోఁకాళ్ళంటుచున్న ప్రాఁతనిలువుటంగి దొడిగి, మెడలో నొకగవ్వలదండవైచుకొని జనులు ధర్మార్థమిచ్చిన ప్రాతగుడ్డలు రెండుభుజములపై వైచుకొని మెడలోఁగట్టుకొన్న కంచుగంట మాటిమాటికి గంగుకంగుమని మోఱయ నెడమభుజమునుండి వీఁపుమీఁది కొక కట్టుకుఁ దగిలించిన సంచి వ్రేలుచుండఁ గుడిచేతిలో నున్న ఢక్కడుణఢుణమువాయించుచు భయంకరముగా క్షుద్రదేవతల నాహ్వానించుచు నొకసాయిలఁవాఁడు

సైన్యనివేశమందలి వీథులలోఁ దిరుగఁజొచ్చెను. గంట మ్రోఁతయు డక్కచప్పుడును వానిపద్ద కేకలును నింద్రించుచున్న సైనికులకు వారి యాఁడువాండ్రకు మేలుకొలుపులయ్యెను. అందఱు లేచి వానిం జూచుటకు గుమ్మములలో నిలిచిరి. సాయిలవాఁ డిట్లు సంభాషించెను.

"ఆ! కాళీ! పల్కవే, భద్రకాళీ! పల్కవే, జగజ్జనీ! పల్కవే, భైరవీ పల్కవే, శాంకరీ, పల్కవే, తల్లీ నిజముపల్కవే, యక్షిణీ! పల్కవే, దుర్గా! పల్కవే, చెప్పవే నిజముచెప్పవే, సాయిలరామ జోగినోట పల్కవే, సత్యముచెప్పవే, ఈదేశమునకు గొప్పకీడు రాఁ దలఁచియున్నది. పడమటినుండి పగ రాఁదలఁచియున్నది. దక్షిణము నుండి దండు రాఁదలఁచి యున్నది. రాత్రి రెండుజాములప్పుడు నల్ల చీరకట్టుకొన్న యాఁడది మొగమున పెద్దకుంకుమబొట్టు పెట్టుకొన్న యాఁడది, కాళ్లకు గజ్జలుకట్టుకొన్న యాఁడది, చీపురుపట్టుకొని యూడ్చుచున్నది. ఈరాజ్యములో సిరులన్నిఁటిని తానాలాగే యూడ్చెద నన్నమాట. మనుష్యుల జీవాలన్నియు నూడ్చెదనన్నమాట. తనువులుదక్కవన్నమాట. ఆతల్లి దుర్గకు నీదేశముమీఁద దయదప్పినది. ఇది పరరాజులపాలై పోనున్నది. గట్టివానిని బట్టుకొన్న పక్షమున రానున్నయాపద తప్పిపోవును. చిన్నవారివల్లఁగాదు. చిఱుతవారివల్లఁ గాదు. ఆఁడవాళ్ళవల్లఁగాదు. జాగ్రత్త జాగత్త! భద్రము! భద్రము! మేలుకొనుఁడు! మేలుకొనుఁడు! మూసినకన్నులు తెఱువుఁడీ, మోస పోకుఁడి. ప్రాణాలు దక్కించుకొనండి! బాగుపడుండి."

ఆమాటలువిని మనస్సులలో భయము శంకయు నెలకొన వానిం బిలిచి కొందఱు "ఏమియాపదవచ్చు! నీకెట్లు తెలిసినది?" యని ప్రశ్నించిరి. ఆప్రశ్నలకు వాఁడిట్లనియె. "ఏమియాపదని చెప్పుదును! మానములు దక్కవు. మాటలుదక్కవు. తనువులుదక్కవు ధనములు దక్కవు. నీకెట్లు తెలిసినదని మీరడుగవద్దు. మేము భద్రకాళికి పెం

పుడు కొడుకులము. ఎల్లమూరికన్న మాయిలు వేల్పు. శంకరుని రాణి సాయిలరామజోగిని సాఁకును. అతఁడు రమ్మంటే యాతల్లి వచ్చును. పొమ్మంటే యాతల్లి పోవును. పలుకుమన్న పలుకును. నిలువుమన్న నిలుచును. అమ్మగో! ఆతల్లి, నానోట పలికించుచున్నది. ఇట్టిప్రశ్నల మీరు వేసితిరా తల్లికోపించి యిపుడే నిప్పులవాన గురిపించును. అట్టిప్రశ్నలడుగఁబోకుఁడు. అది మీకు మేలుగాదు. అదిమీకు మంచి గాదు. కొఱవిబెట్టి తలగోఁకికొనవద్దు."

అతనిమాటలు విన్నతోడనే యెల్లవారును భయమున గడ గడ వడఁకిరి. బుద్ధిమంతులగు పెద్దవాండ్రు ప్రశ్న లడుగువారిని జీవాట్లుపెట్టి యౌచిత్యమును చూపిరి. కొందఱు "స్వామీ! సాయిలరామజోగీ! మాతప్పు మన్నింపు" మని దండములుపెట్టిరి. కొందఱు పోకలు బియ్యము వస్త్రములు మొదలగు కానుకలు భక్తి యుక్తులై యాతనికి సమర్పించిరి. కాని, యాతఁడు వానిం గైకొనక యిట్లనియె. "నాకు బట్టలువద్దు పోఁకలువద్దు. బియ్యమునకు రాలేదు. బిచ్చమునకు రాలేదు. పోకలువద్దు. కోఁకలువద్దు. మీ మీఁద దయచేత జగజ్జనని దుర్గ పంపఁగావచ్చితిని. హెచ్చరించితిని. మేలుదారి తెల్పితిని. పోవుచున్నాను. పోవుచున్నాను. జాగ్రత్త! జాగ్రత్త!" అని పలుకవలసిన పలుకులు పలికి కలిగింపఁదలఁచిన యుల జడి గలిగించి వెలుఁగు రాకమునుపె తనదారిం బోయెను.

అంతట సైనికులు పరిపరివిధముల నవ్విషయమై చర్చింపఁ దొడఁగిరి. "ఎవఁడో బిచ్చగాఁడు పిలువనిపేరంటముగవచ్చి వానికిఁ దోఁచిన కూఁతలుగూసి పోయినాఁ" డని కొందఱనిరి. "బిచ్చగాఁడైన పక్షమున మనముసమర్పించిన తండులములు వస్త్రములు ధనము నేల గ్రహింపకపోవు నందుచేత నతఁడు తక్కిన సాయిలవాండ్రవలె జనులనుబీడించి తిరిపమెత్తువాఁడుగాఁడు. మంత్రప్రభావమున క్షుద్రదేవ

తల వశపఱచుకొన్నవాఁడుగాని సామాన్యుఁడు గాఁ*డని కొందఱు పలికిరి. నట్టికూఁతలుగా వానిమాటలు త్రోసిపుచ్చరా'దని కొందఱు వచించిరి. "నల్లచీరగట్టుకొన్న యాఁడుది చీపురుపుచ్చుకొని యూడ్చుట శ్రేయస్కరముగా*దని కొందఱు వక్కాణించిరి.

అట్లు వారు గుంపులుగుంపులుగఁ జేరి ప్రాతఃకాలమునఁ బలు తెఱంగులఁ బ్రసంగించుచుండ నంతలో దండపాణి యశ్వారూఢుఁడై యచ్చోటికిఁ బోయెను. సైనికులు లేచి జోహారులుచేసిరి. "అట్లు గుంపులు గుంపులుగా జేరుటకు హేతు వే*మని యాసేనాపతియడుగ వారు వేకువను జరిగిన వృత్తాంతమంతయుఁ బూసగ్రుచ్చినట్లు జెప్పిరి. అదివిని దండపాణి యచ్చెరువుపడి "ఏమీ! నల్లచీరగట్టుకొన్న యాఁడుదియా? చీపురుపుచ్చుకొని యూడ్చుచున్నదా? చిన్నవాండ్రవల్లగాదు. బలుతవాండ్రవల్ల కాదని చెప్పినాఁడా? గొప్పవారియండఁ జేరుమన్నాఁడా? జగజ్జననియైన మహాకాళి తనకీదేవరహస్యములు చెప్పినదన్నాఁడా! సరె! మనకేదో మూడఁదలఁచుకొన్నది. సాయిలవాండ్రమాటలు కల్లలని మనము త్రోసివేయరాదు. వారికి క్షుద్రదేవతలు ప్రత్యక్షమగుచుందురు. కల్లు మాంసము మొదలగు పదార్థములు నివేదించి వారా దేవతలను వశముజేసికొందురు. అందుచే నాగతానాగతములు వారికిఁ దెలియుచుండును. నల్లచీరగట్టుకొన్న యాఁడుది మనపాలిఁటి నాశనదేవత. ఇదిచాల దుశ్శకునము. దీనికిం దగినప్రతిక్రియ మనము చేసికొనవలెను. పడమటనుండి పగవచ్చునని వాఁడు చెప్పెనుగదా! పడమటిపగ యనఁగా గాంధారదేశపు దండయాత్ర. దక్షిణమునుండి దండువచ్చుననఁగా సింధురాజు దండెత్తుట. ఇది మీరెఱుఁగుగా బోలు! పండ్లచెట్టుపై ఱాళ్లు విసరినట్లు ఫలవంతమగు దేశమును గొట్టి యాక్రమించుట కనేకులు సిద్ధముగుదురు. మనోజ్ఞవస్తు వెల్లవారి కాసగొల్పును. అట్లే కాశ్మీరరాజ్యము రాజసింహముల కామిషము

గానున్నది. ఆరాజులిద్దఱు వచ్చి చెఱియొకప్రక్క ముట్టడించిరా తలుపుసందునఁబడిన వెలగకాయవలె మనము నలిగిపోదుము. కావున మనము దీనికిఁ దగినప్రతీకారము సేయవలయు" నని వారి కుపదేశించెను. ఎట్టిప్రతిక్రియ! ఏమిప్రతిక్రియ? యని వారు తొందరతో నడిగిరి.

అడుగుటయు నతఁడు స్వరము కొంచెము తగ్గించి "యెట్టిప్రతిక్రియ యని చెప్పుదును? దానికొక్కటే యున్నది" అని స్వరము హెచ్చించి "మనరాజు బాలుఁడు. ఆలముల ముక్కాకలు దేఱిన మీవంటి పోటుబంట్లను మొనగాఁడై నిలిచి మిమ్ము రణరంగములకుఁ దోడుకొనిపోయి మీమనస్సులు, నుత్సాహరసముతో నిండింప బురికొల్పి మీచేత సాహసక్రియలు చేయించి మన దేశమును రక్షింపఁగల మేటిశూరుఁ డొక్కఁడున్నాఁ" డని యూరకుండెను. అతఁడెవ్వఁ డెవ్వఁడని యందఱడిగిరి. "అతఁడా—అతఁడా—చెప్పనా? మీరు నాచెప్పినచొప్పున చేయుదురా!" యని యతఁడు సందిగ్ధమనస్కుఁడై పల్కెను. "మీరుచెప్పినచొప్పునఁ దప్పక చేయుదుము. తప్పక చేయుదుము" అని వారైకకంఠ్యముగఁ బల్కిరి. "అతఁడీరాత్రివచ్చి స్వయముగానే మీతో మాటాడునులెండి. నేనిప్పుడాయనపేరు మీతోఁ జెప్పను. భానుదర్శనమునఁ దామరలువిచ్చినట్లు వానింజూచి మీమొగములు వికసింపఁగలవు. చంద్రదర్శనమున స్రవించు చంద్రకాంతశిలలవలె మీమనస్సులు వానిఁజూచినంతనె యుత్సాహరసపూరితములై యుండగలవు. పేరుచెప్పుమని నన్నడుగవద్దు. నేఁటిరాత్రి జామయినతరువాత మీకడకాయనవచ్చును. మీరు భోజనములుచేసి సిద్ధముగనుండుఁడు" అని దండపాణి వారికిఁ జెప్పి యథేచ్ఛంబోయెను. ఆవచ్చునట్టి మహావీరుఁ డెవఁడై యుండునా యని సైనికు లూహించుచు వారిరాక నిరీక్షించుచుండిరి.

## పదియైదవ ప్రకరణము.

క్రమక్రమముగ సాయంకాలమయ్యెను. దీర్ఘప్రయాణముచేసిన తెఱువరి గమ్యస్థానముఁ జేరి విశ్రమించు తెఱఁగున భానుఁడు పశ్చిమాచలశృంగము నలంకరించెను. చరమగిరిమీఁద వ్రేలాడు జపాకుసుమగుచ్ఛమువలె నా వృద్ధభానుని బింబము కట్టెఱ్ఱనై చూపఱకనులకు విందుసేయుచుండెను. చిన్ననాఁటిగుణములు చరమకాలమున నయిన విడువ వనుటకు దృష్టాంతరముగ నుదయవేళనున్న యారుణ్యమే ప్రభాకరునియందు సాయంకాలమునఁగూడ గనఁబడెను. ఆశ్రమచతుష్టయములలోఁ గట్టకడపటిదగు సన్యాసముఁ గర్మసాక్షియయిన ప్రభాకరుఁడు స్వీకరించి ధరియించిన కాషాయాంబరమో యనునట్లు సంధ్యారాగము నభోమండలమున వ్యాపించి దర్శనీయమయ్యెను. మహాసౌధముమీఁదనుండి క్రమక్రమముగాఁ గ్రిందికిదిగునట్టిపురుషునట్లు క్రమక్రమంబుగా దివాకరుఁడు క్రిందికిదిగిదిగి యస్తమించి యగోచరుఁడయ్యెను. చండశాసనుఁడగు పరమేశ్వరుని నియమప్రకార మెవ్వరి ధర్మము వారు నిర్వర్తింతురని తెలియఁజేయుట కోయన సూర్యాస్తమయానంతరమునకలవరమునఁ జంద్రోదయమయ్యెను. జనులకానందోదయమయ్యెను. కాలపురుషుండు గప్పుకొన్న తెల్లపట్టుపుట్టంబువలె విశ్వమంతట వెన్నెల వ్యాపించెను. మహాపురుషుని తేజము ముందఱ నెందుకుం బనికిరాని యల్పపురుషుల ప్రభావముంబలె లెక్కకుమిక్కిలి యగు చుక్కల వెలుంగు శీతమయూఖుని తేటవెన్నెలలముందఱ వెలవెల బోయెను. చల్లదనములకు పేరైన చందమామను జూచినతోడనే యెల్లజీవుల కనులు చల్లఁబడెను. ఉల్లములు చల్లఁబడెను. సేనాని వేషములో సైనికులం బెట్టుఁ దనకొఱకై రాదలఁచిన యాపద్బాంధవునిఁ జూడ నుబలాటపడుచుఁ బెందలకడ భోజనములుచేసి తెల్లబట్టపర

చినట్లు చంద్రికాపసరణముచేత వెలయుచున్న బయలునేల కరిగి గుంపులుగూడి తద్విషయికములైన ప్రసంగములు జేయుచుండిరి. ఎవరువచ్చినను నాతఁడేమోయని యత్తులెత్తి చూచుచుండిరి.

అంతలో దండపాణి యొకపురుషుని వెంటఁబెట్టుకొని యచ్చోటికివచ్చెను. అప్పురుషుఁడు కనఁబడినతోడనే "చిత్రభానుఁడు చిత్రభానుఁ" డని సైనికులు మెల్లమెల్లఁగా ననఁజొచ్చిరి. అందఱినోటఁ చిత్రభానుని పేరేయుండెను. అందఱకన్నులకు జిత్రభానుఁడే కనఁబడెను. చంద్రప్రభయు భానుప్రభయు నేక కాలమున సంభవించినపక్షమున నెట్టియాశ్చర్యముజనించునో నాఁటిరేయి జనులకట్టి యాశ్చర్యము జనించెను. 'ఇతఁడు హరిద్వారమునఁ జచ్చినాఁడని వింటిమిగాదా' యని యొకరు "కాదుకాదీఁడును నిక్కడనేయున్నాఁ" డని యొకరు 'భాతృమరణహేతు వితఁడే గాదా' యనియొకఁడు నదిపట్టిమాటయని యొకఁడు పురమునుండి వీనిని వెడలనడువ మణివర్మ సమకట్టెఁగాదాయని యొకరు దేవిగారుండుమనినారని యొకరు సైనికులు తమలోఁ దారు నానావిధముల భాషింపఁజొచ్చిరి. అప్పుడు దండపాణి యచ్చటఁజేసిన జనులనుగూర్చుండఁబనిచి యుపోద్ఘాతముగా నిట్లు చెప్పెను.

"వీరులారా! అనేకయుద్ధములఁ బేరుగాంచిన శూరులారా! మీకు మొనగాఁడై మీదేశము పరాక్రాంతము గాకుండఁ జేయఁగల మహావీరుఁడు మీయెట్టయెదుటకువచ్చి యున్నాఁడు. మీ కీయన చిరపరిచితుఁడుగాని క్రొత్తవాఁడు గాఁడు. ఈమహాశూరుని ప్రజ్ఞావిశేషములు మీరునావంటివానివలన వినఁగోరుట చిన్నదివ్వెసాయమున సూర్యబింబమునుజూడఁ గోరుటవంటిదని తలంచి యీమహాభాగుని విక్రమవిహారములు వర్ణింప నిచ్చగింపను. కుమారస్వామి దేవతలకు దళవాయియై మొక్కలులగు రక్కసుల నుక్కడంచి దేవ

లోకము నుద్ధరించిన తెఱంగున నీరాజకుమారుఁడు శత్రుసైన్యముల నుఱుమాడి యీదేశమునకు సౌఖ్య మాపాదింపఁగలఁడు. ఈయన హేమచంద్రమహారాజు తమ్ముఁడు, చిత్రభానుఁడు. అన్నగారి కుటుంబమును బరామర్శ చేయుటకును దనకు శక్యమైన సాయము జేయుటకును వచ్చియున్నాఁడు. విల్లుపట్టి నా రఘురాముని భృగురామునిఁ దలపించును. ఇతఁడు బాణంబువిడిచెనా శత్రువుఁడు ప్రాణంబు విడుచును. ఇతఁడు కలియుగార్జునుఁడు. మనల నాపత్సముద్రమునుండి యుద్ధరింపఁగలయోడయిదే. మన విచారాంధకారమును మాపఁగల భానుమండలమిదే! మనసంతాపమడఁచి చల్లనినీడనిచ్చు వృక్షమిదే. కావున వీనినాశ్రయింపుఁడు. ఆయన చెప్పెడుమాటల సావధానులై యాకర్ణింపుఁడు" అనియతఁడు విరమించెను.

"జయము! చిత్రభానుఁడా జయము!" అనిసభాసదులలో ననేకులరచిరి. "స్వాగతము! మీకు స్వాగతము!" అని కొందఱు కేకలువైచిరి. "మీవచనామృతమునువర్షించి మాసంతాపముఁ దీర్పుఁ" డని కొందఱు బిగ్గఱగఁ జెప్పిరి. అదివిని సభాసదులలోఁ దనకనుకూలమైనభావము పొడమినదని తెలిసికొని ధైర్యము దెచ్చికొని చిత్రభానుఁడు ముందరకువచ్చి సభాసదులముందఱనిలిచి యీవిధముగాఁ బ్రసంగించెను.

మహాయోధులారా! దండపాణిచెప్పినట్లు మీకు నేను క్రొత్తవాఁడనుగాను. పూర్వపరిచితుఁడనె. హేమచంద్రమహారాజు తమ్ముఁడనని విక్రమసేనునిఁ రెండవ కొడుకునని నాపేరు చిత్రభానుఁడని మీరందఱెఱుఁగుదురు. మీలోననేకుల నేను మున్ను మాయన్నగారియనుగ్రహమునకుఁ బాత్రమయిన కాలమునఁ జూచియుంటిని. కొన్నియుద్ధముల మిమ్ముఁగొనిపోయి గెల్చియుంటిని. మీవలన నేనుపేరు గాంచియుంటిని. నావలనమీరు కీర్తిగాంచియుండితిరి. కాలవశమున

మంత్రులమాయలచేత నాకును మాయన్నకును మనంబుల స్పర్ధలు జనించినవి. చాటుననుండి సమిధలువైచి సచివులు వైరాగ్నిని బ్రజ్వలింపఁజేసిరి. ఆయగ్ని మాసోదరుల సహజమైత్రిని దగ్ధము జేసినది. ప్రేమను భస్మపటలముగావించినది. అప్పుడు మాయన్న మంత్రులమాటలువిని నిరపరాధిని-నిష్కపటిని-నిర్మలచిత్తుని-నిజసోదరుని నిరాధారునిఁజేసి స్వదేశమునుండి వెడలనడఁచెను. అపుడు నేను సపుత్రముగా సకళత్రముగా నూరువిడిచి-దేశమువిడిచి-బంధుమిత్రులవిడిచిపోయి దారపుత్రుల విదర్భలోనిలిపి యత్తవారింట నుంచుటయనుచితమని భావించి రాచబిడ్డనగుటచే నాత్మగౌరవమును బాటించి దేశలముపాలై తిరిగితిని. నాపడినకష్టములన్నియు వరుసగా మీకుఁజెప్పఁబూనితినేని మీమనస్సులు విచారసముద్రమున మునుంగును కన్నీరువరదలై పాఱును ఒక్కొక్కసారి యాత్మహత్య చేసికొనుట యుక్తమని ప్రయత్నించితిని. అదినామిత్రులు వారించిరి పక్షులకయిన గూండ్లుండును. పులులకయిన దలఁదాచుకొనుటకు పొదలుండును. సింగములకైన గుహలుండును. నాకంతమాత్రమైన నెలవులేకపోయినది. రాచవాఁడనగుటచే నొకరినడుగఁజాల ఆగర్భసుకుమారుఁడనగుటచే మేను వంచి పనిచేయఁజాల. అభిమానధనుఁడనగుటచే నీచవృత్తులం దిగఁజాల అన్నములేక-బట్టలేక-నిలువనీడలేక--చుట్టములులేక--పక్కములులేక యేకాకినై చిరకాలము తిరిగితిరిగి యీశ్వరానుగ్రహమున నెట్టెటో బ్రతికి యుంటిని. దైవమునేనమ్మియుంటిని. శివునినమ్మినవాఁడు చెడిపోవఁడని నానమ్మిక. ఎందుకుబ్రతికించెనో దైవమునన్ను బ్రతికించెను. స్వప్నావస్థయందైన నేనుమాయన్నగారిని దూషింపలేదు. నా దురదృష్టమును నిందించుకొంటిని గాని మాసోదరుని నిందింపలేదు. ఆయననిష్కళంకచరిత్రుఁడు. నిరుపమానత్యాగశీలి. లోకోత్తరచరిత్రుఁడు. అగ్నికి ధూమము పేరిటమాలిన్యముగలదు. చంద్రునకు మ

చ్చగలదు. కాని యన్మహాత్ముని చరిత్రమునకు మచ్చ లేదు. అతఁడు నేలపై నవతరించిన నారాయణుఁడే. అట్టివాని నీచల్లని సమయమున జ్ఞప్తికిఁ దెచ్చుకొని మనమందఱముధన్యులమగుదముగాక! అట్టిమహారాజును-అట్టిదయాశాలిని-అట్టిశాంతచిత్తుని-అట్టిపరమపవిత్రుని నట్టి లోకమిత్రుని నట్టి సుగుణరత్నాకరుని. హా! దురాత్ములెవ్వరో దారుణవధముహాలు చేసిరిగదా! హా! హేమహాచంద్రా!! హా! భాతృవత్సలా" అని కన్నులనీరు జొటజొటఁగార మాటాడలేక దుఃఖపరవశుడై నిలువఁబడలేక నేలపైఁ జదికిలంబడెను. అతని దుఃఖముఁ జూడఁగానే సభాసదులకుఁగూడ మిక్కిలి విషాదము జనించెను. వారును బాష్పధారలచేతఁ దమ దుఃఖము బ్రకటించిరి. అనంతరమునఁ జిత్రభానుఁడు వెండియు నిట్లు బ్రసంగించెను.

"ఆమహాత్ముని జంపించినవారెవ్వరో నేనెఱుఁగుదును. కానివారి పేర్లిప్పుడిక్కడఁ జెప్పను. పాపమెన్నటికయిన బయలుపడకమానదు. మగనిజంపి మొగసాలలో మొత్తుకొన్నది యను సామెత నిజముగా నాపైఁ ద్రోహుని జంపించిన దురాత్ములే తమమీఁద నెవ్వరికనుమానము లేకుండఁ జేసికొనుటకై నేనే యాఘాతకృత్యముఁ జేసితినని లోకమున బ్రవాదముబుట్టించిరి. ఎక్కడో నరులుచేరని నట్టడవులలోఁ గానలయిన లేక కాఱడవులలో మృగములయట్లనేనును నాకు ఫలములు దినఁ పొట్టబోసుకొని గాలక్షేపముచేయుచుండ దుస్సహమయినయపవాదము వారు నాపైఁ బడవైచిరి. మహేశ్వరపూజా నిరతరములైన యీహస్తములా యిట్టిఘాతకకృత్యము జేయుట! మహానీయులగుమునిజనులకు నమస్కరించునట్టి యీచేతులా- యన్ననెత్తురుతోఁటి యపవిత్రములగుట? ఛీ! అట్టిపని నేనా చేయుట? విక్రమసేనునికొడుకా యీనింద్యకర్మకుఁ బాల్పడుట? ఈయపవాదము వచ్చిననాఁటంగోలె నాహృదయము విషాదాగ్నిచే మండిపోవుచున్నది. ఈసంతాపముచే

పచ్చలారనిముద్దుబాలుఁడు దేశమును రక్షింపఁగలఁడా! తన్నుఁగాఁచు కొనఁగలఁడా? సైన్యమును నడుపఁగలఁడా? సన్నాహము సేయఁగలఁడా? చేయ గలఁడనుకొనుము. మంత్రులతనికిఁ గాళ్ళసంకెలలు. నాయ హారముల కాసపడియు నగరిహారముల కాసపడియు, ధనములఁ గోరియు సౌఖ్య సాధనములఁ గోరియు పగఱతోఁ జేరి దేశమును వారికప్పగింపఁ దలఁ చుచున్నారు. ఇంతకన్న రాజద్రోహముగలదా! ఇంతకన్న దేశ ద్రోహముగలదా? ఇంతకన్నఁ బాపముగలదా? ఇట్టి యమాత్యుల- స్వామిద్రోహుల-ల వశౌంతు- దేశద్రోహుల- పయోముఖవిష కుంభముల గోముఖవ్యాఘ్రములఁ గాంతనేసిన బాలుఁడున్నాఁడా? మే నిచర్మమొలిపించిన దోషమున్నదా? ప్రజయుండఁగ నిప్పులంబొర లించినఁ దప్పున్నదా? పాపము లేదు. లేదు దోషములేదు. కాని రా జు బాలుఁడు, సాధుశీలుఁడు క్షమయాఁడు. అమాత్యైశ్వర్య పరపు రుషవిముఖు. మంత్రుల మానాచ్ఛులు. మంత్రులె నామె కన్నులు. మంత్రులె నామె చేతులు ఇట్టిస్థితిలో నామె యేమిచేయఁగలదు! బాలుఁడేమిచేయఁగలఁడు? కావున మీదేశ సంరక్షణము యోధులయిన మీరు మహాయుధపాణులైన మీరు-శూరాగ్రేసరులయిన మీరు స్వేహాభిమానులైన మీరు-రాజ భక్తులైన మీరు నేఁడు చేపట్టవలయు. దానిం జేసి దేశసంరక్షణమేగాక మీయాత్మసంరక్షణము రాజకుటుంబరక్షణము మొదలగునవన్నియు జరుగును. మిమ్ములనడుపుటకుఁ దగిన దళపతిని నేర్పరచుకొని నగ రము చక్కఁ జేసికొని దురాచారుల మేరమీఱకుండ బంధించి వల యు సాధనసామగ్రుల సమకూర్చుకొని పిమ్మట బగిఱపైఁ నడువవల యు. యోగ్యులైనను ముందు నాయకుండు లేనిచో శత్రువుల గెలుతురుగదా! తగిన మొనగాఁడుండిన గాంధారరాజుగర్వము క్షణములో నణఁప వచ్చును. సింధురాజుసేన త్రుటిలో నణఁపవచ్చును. మీకందర కిష్ట

యెఱుఁగును. ఆమెచూపుతూపు లెవ్వరిపైఁబడునో వారి హృదయముల గాయములుపడునని యామె యెఱుఁగును. అప్పుడామె వెండియు నిట్లు తలపోసెను. "చిత్రభాను పుత్త్రికయైన కర్పూరమంజరిపై నీయనకు వలపునిలిచినదని నిద్రావశమున నప్రయత్నముగ నీయన నోట వెడలినమాటలవలనఁ దెలిసినది. ఈయనంగూర్చి యామెయే మేలుపడెనా లేక యాలోకైక సుందరి నిమిత్త మీయనే పరితపించుచుండెనా? ఎట్లయిననేమి? బంగారమువంటి నాకాఁపురము చెడిపోయినది. నిక్షేపమువంటి నాసంసారము నిస్సారమగుచున్నది. ఒకయొఱలో రెండుకత్తు లిముడునా? ఒకయర్ధశరీరములో నిరువురు పడఁతులు నిలుచుట కవకాశమున్నదా? ఒకతెను ద్రోసిరా జనవలె, రెండవదాని నచ్చోట నెలకొల్పవలె. ఇంతకన్న గత్యంతర మేమున్నది? పెద్దదానను. జవ్వనము కొంతవఱకుఁ జెల్లిపోయినదానను. మగని మనసు రంజింపఁజాలనిదానను. నేనే యొత్తిగివలయుఁగాని నిండు జవ్వనంబును నెఱజాణతనంబును జక్కఁదనంబును సౌకుమార్యంబును గల లేమ తొలఁగిపోవునా? అఱువదియవయేఁట యగ్నిగుండమన్నట్లు పదునైదేండ్లు కాపురము జేసి సంతానవతినైన నాకు నీనాఁటికి సవతిపోరా! నేను వయసుమరలినదాన నగుటచే మిసమిసలాడు లేజవ్వనంబుగల క్రొత్తపెండ్లికూఁతురు మీఁదనే యీయనకు గౌరవముండును గాని నామీఁద లేశమైననుండదు. ఆమె యడుగులకు మడుగులొగ్గుచు నామె చిఱునవ్వుల కలరుచు, నామెబొమముడుల కడలుచుఁ బ్రొద్దులుపుచ్చవలయుఁ గాఁబోలు! హా! పరమేశ్వరా!" యని విచారించుచు నొకమాఱు పాన్పుమీఁదినుండిలేచి యిట్టటు దిరుగుచు నొకమాఱు పండుకొనుచు నొకమాఱు భర్తను లేపఁదలఁచి నిద్రాభంగము సేయఁగూడదని మరల వెనుకకుఁబోయి తెగులు లేని వేదనం బడుచుండెను.

అంతలో నాలవజాము కోడికూసెను. కోడికూసినకొలఁది నేపటికిఁ గాకులు కావుకావుమని యఱచెను. అప్పుడు వజ్రపాణికి మెలఁకువవచ్చెను. వచ్చినతోడనే యతఁడు మంచముమీఁద లేచికూర్చుండి కన్నులు తుడుచుకొని మహేశ్వరధ్యానము చేసికొని మంచము దిగెను. సునంద చేతులుజోడించి మగనియడుగులమీఁదబడి కన్నీటితో వాటిం దడుపఁజొచ్చెను. అతఁడు మిక్కిలి విస్మితుఁడై విస్మయమునకు భయముతోడుగ మిక్కిలితొట్రుపాటుతో "సునందా! ఏమిది? యేమిది? ఎన్నఁడు లేనిపని చేయుచుంటివి. నీకేమికష్టము వచ్చినది? బిడ్డలు సుఖముగ నున్నారా? నీపుట్టినింటివారికి యేదేని చెడువార్త వచ్చినదా? నీశరీరమున నేదేని రోగము గలిగినదా? చెప్పు చెప్పుము. అని పాదములపైనున్న పత్నిశిరమును చేతులతో లేవనెత్తెను. ఆమె కన్నీరు విడుచుటయేగాని యాతనిమాటలకు బదులు చెప్పదయ్యె.

అతఁడు భయము నెట్టించఁ గామె వీఁపుపైఁ జేయివైచి తట్టి కల్యాణీ! భయములేదు. చెప్పు చెప్పు. పాడుకల యేదేని గంటివా? భయపడకు చెప్పు చెప్పు"మని వేండియు ప్రోత్సహించెను. కొంతవడి కామె యూరడిల్లి గద్గదస్వరముతో నిట్లనియె. "బిడ్డలింతవఱకు సుఖముగా నున్నారు. ఇంకమీఁద నాకేమియు నుండదని విచారించుచున్నాను. నాపుట్టినింటివారికి నేటివఱకుఁ గుశలమే. ఇంకముందది యుండదని వెఱచుచున్నాను. నాకిప్పుడు శరీరమునకు రుగ్మత లేదు. ఇంకముందు జీవితశంక గలుగవచ్చునని భయపడుచున్నాను. పాడుకల నేనేమియుఁ గాంచలేదు. దేవరవారికే యట్టిది వచ్చినదని మనవి చేయుచున్నాను.

అప్పలుకులువిని వజ్రపాణి తెల్లబోయి "సుందరీ! నీపలుకులు నాకర్థము కాలేదు. చాల నాకు వ్యాకులత యగుచున్నది. విస్పష్టముగాఁ జెప్పి నామనస్సును జక్కఁజేయు"మని పలికెను. అనవుఁడు సునందకంత

గాన్ధర్వ్యము కొంతవఱకు దిగుపడ స్పష్టమైనభాషతో నిట్లుత్తరము జెప్పెను. "అయ్యా! నేను మీకంటికిఁ బిడ్డపిశాచమువలె గనఁబడు చుండుటచేత నాసంభాషణము పిశాచభాషవలె మీకుఁదోచుచున్నది. మీమనస్సు చక్కఁజేయుట నావంటిదానికి శక్యమా? కొంతకాలము నుండి దుర్గంధమునకుఁ దొలఁగినట్లు నాకు మీరు దవ్వుదవ్వుగఁ దొలఁగుచున్నారు. కర్పూరమంజరి కొంపయొక్క దుర్గంధము తొలఁగి పోవునుగదా! నాకంపు దొలఁగించుకొని వెంటనే మీకింపుగలుగు నట్లు కర్పూరమంజరిని హృదయమునం దెంత ధరింపుఁడు. భర్త భరింప లేని మగనాండ్రను గోవులు భరించును. వాగులు భరించును. భగ వానుఁడైన పావకుఁడు భరించును. మనసులోఁ గర్పూరమంజరిపై మీకు మక్కువగలదని యెఱుఁగనుగాను వీరా వైఖరియంతయు మాఱిపోవుట నేగనిపెట్టుచుంటిని. కంటిచూపు కనవయ్యె. నోటిమాట యనదయ్యె. కలలోనైన నేఁబసికిరాక కర్పూరమంజరి కొపాసివచ్చె. ఎనలేని యామమత లేయేటఁ గలసె! ఆప్రేమ యెందరిగె! ఆవిశ్వా సమే దేశాంతర మరిగె? ఇంతలోనే నాకంతయవస్థ కలుగునని నేనె న్నఁడు దలంపనైతి. ఒకరాటను జంతుపశువులం గట్టిన నవి యొం డొంటిం బొడుచుకొని చచ్చును. నేను కొంతకాలమైన సుఖమనుభ వించినదానను. పదికాలములపాటు కాపురముచేసినదానను. సంతాన వంతురాలను. కొంతవయసు మీఱినదానను జవ్వనము సడలిన దానను కావున నాకు సెలవొసంగుఁడు. భర్తకుఁ బ్రియముసేయు టయే భార్యకు ధర్మముగనుక యాచకస్త్రీనగు నేను మీకును భూమి కిని భారముగానున్న నామేనువిడిచి మీకన్నుల చల్లవాముమైన వన్నెలాడికై తావొసంగెదను. అదే! సదిరించుచున్న మాచిన్నబిడ్డ లం గాచికొనుఁడు. సవతితల్లి కప్పగింపక మీరే పెంచిపెట్టుఁడు. మీరు విక్రమశాలురై యనేకరణరంగముల విజయములు గాంచి విఖ్యా

తులుబడసిన మహాత్ములరు. ఇట్టిమహనీయునకు భార్యనైనందుకు నేను సంతసించుచున్నాను. ఐదువు తనువుగఁ బసుపుకుంకుముతోఁ గాటికిఁబోయిన కాంత కడుధన్యురాలు. అందుచే నాకు సెలవా సంగుఁడు. రేపు తెల్లవారకమునుపే మీకన్నులు చల్లనగునట్లు మీ మనస్సు చక్కఁబడునట్లు—మీమనోరథము సిద్ధించునట్లు—మీ సంకల్పమున కాటంకముదీరునట్లు—మీయుద్యమము సఫలమగునట్లు—తగినమగఁడు గావలెనని తహతహపడుచున్న యాతలిరుఁబోడి తపము ఫలించునట్లు—నేను చేయఁదలఁచిన కార్యముఁ జేసెద" అని రోషావేశంబున నాయెలనాఁగ యింక నేమియో పలుకఁబోవుచుండ వజ్రపాణి యెత్తఁబడిన యామెకన్నులను దృఢనిశ్చయము దెలుపుచున్న యామె మొగమును-గంపించుచున్న గాత్రమును-తొట్రుపడుచున్న యామెమాటలను జూచి విని యేమియుందోఁచక భయవిహ్వలుఁడై యామె రెండుచేతులు బట్టుకొని యిట్లనియె.

"కల్యాణీ! నీమాటలనుబట్టి కలలో నేను కర్పూరమంజరియను మాట దలపెట్టితినని తేటపడుచున్నది. నీవు విస్పష్టముగఁ జెప్పక పోయినను నీసంభాషణమువలన నది గ్రహింపవచ్చును. స్వప్నములు నీవెఱుగనివిగావు. అదృష్టపూర్వములు నశ్రుతపూర్వములు స్వప్నమున మనము గనుచుందుము. స్వర్గమునకుఁ బోయినట్లు కలగందుము. అప్పుడేమేమో పలవరింతుము. అవియన్నియు నిజములగునా? చిత్రభానుని కూఁతురు కర్పూరమంజరియని యొకర్తె కలదు. ఆపేరు నాకుమిక్కిలి చిత్రముగా నున్నది. అది క్రొత్తపేరు. రమణీయమైన పేరు. మనోహరమైన పేరు. అందుచేత నాకినారి యాఁడుబిడ్డ పుట్టునేని దానికాపేరుపెట్టవలెనని సంకల్పించుకొని తఱచుగా మనసులో దాని స్మరియించుచుందును. అందుచేఁ గలలోనప్పేరు పలవరించితి గాఁబోలు! ఇంతమాత్రమునకై యింతగొడవ కావలెనా? కి

ర్పూరమంజరి త్రిలోకసుందరి. లేజవ్వని. అట్టిదానిని వయస్సుచెల్లిన నాకిచ్చి తండ్రి పెండ్లిసేయునా ? నాయందమును నాచందమునుజూచి యాబాల నన్ను వరించునా ! ఇటువంటి పిచ్చితలంపులు తలలోఁ బెట్టుకొని సాహసంబులు చేయఁదలంతువా ? నేను కొంతకాలము నుండి యెప్పటియట్లనీతోఁ జనవుగా మాటలాడకపోవుటకు గొప్పకారణముగలదు. రాజ్యవ్యవహారములు యథాపూర్వముగ లేవు. పరిస్థితులు మాఱినవి. సేనలలో గొప్పకలఁతబయలు దేఱినది. వైదేశికులు మనదేశముపై దాడివెట్ట గమకించుచున్నారు. నిరంతరము పాటికిం బ్రతిక్రియలు వెదకుచు నామనస్సు స్తిమితముగా లేదు. అందుచే నట్లుంటిని. అంతేగాని నామనస్సులో నీపై నలుకలేదు. నీవె నాయర్ధాంగము. నీవె నాబహిఃప్రాణము. నీకన్న నాకు వేఱులేదు. కఠినోక్తులు గట్టిపెట్టుము. సాహసము నుపసంహరింపుము. నన్ను మన్నింపుము. బిడ్డల నడలఁ జేయకుము. నా కప్రతిష్ఠ ఘటింపకుము. నేను మనోవాక్కాయ కర్మములనీయెడ నెట్టివిరుద్ధభావములేని వాఁడను. నమ్ముము. మనకుటుంబము పరువుగలది. అవసరముమాలిన యల్లరిచేసి యప్రతిష్ట సంఘటింపకుము" అని బతిమాలుటయు సునంద "సరే ! మీచిత్తము వచ్చినట్లు చేయుఁడు. బహుభార్యాపరిగ్రహణమునకు మీ కధికారము గలదు. పరకాంతాసక్తులయిన పురుషులు తఱచుగా ననృతంబునకు వెఱువరు. వారు చేయుబాసలు, ప్రమాణములు, విశ్వసింపఁదగినవి కావు. వారిసంభాషణలకు సత్యమునకు, జీఁకటికిఁ వెలుతురునకుఁగల దూరముండును. పాలముంచుటకు నీటముంచుటకు మీరె సమర్థులు. ప్రాణేశ్వరుఁడె దైవంబని నమ్మి యిల్లాలి నుసురుపెట్టఁ గూడదు." అని కఠినముగాఁజెప్పి గదివిడచిలోనికిఁ బోయెను.

వజ్రపాణి కలలోఁ దానుపేలిన ప్రేలాపనలవలన కార్యమిం

శ...వచ్చినదని విచారించి యామె సాహసకృత్యములఁ జేసినపక్షమున ...పోనియు లోకనిందయుఁ దనకు సంప్రాప్తించుటయే గాక కల్యాణమంజరీ పాణిగ్రహణ మహోత్సవముగూడ తప్పిపోవచ్చునని భయపడి యిల్లాలినదినముకే తిరస్కారభావమునఁ జూచుటతప్పని గ్రహించి యింక మీఁద నామెనులాలించి గౌరవించుటయే కార్యసాధకమని నిశ్చయించెను. కాని యతఁడు మిక్కిలి యాలస్యముగా మేల్కొనెను. తనయనునయములామెయెడఁ బనిసేయలేదు. తనమాటయెడ నామెకు విశ్వాసము గలుగలేదు. ఆమె హృదయమెంతమాత్రియు మారలేదు. ఆమె యింటనుండుచున్నను మనస్సు మహోవాయువేగమున సంచరించుచు నెన్నెన్నో పాట్లు పడుచుండెను. స్త్రీల పసాహసము చెందని యతఁడు పెద్దలవలనఁ బలుమాఱు వినియుండుటచే నామె యాత్మహత్యచేసికొననేమో యనుభయమున నతఁడా పగ యిల్లు గదలక నారాత్రియు నిద్రపోవక జాగ్రత్తగనుండెను. ఆరేయినామెయుఁ నిదురింపనేలేదు. మంచముమీఁద గూర్చున్నది కూర్చున్నట్లే యుండెను. పండుకొమ్మని భర్తయెన్నివిధముల బతిమాలినను శయనింపదు. ఆరేయి సతీపతుల జాగరణముతోనే గడచెను.

మఱునాటినుండి సునంద కుమతి చలించెను. ఊరకయె నవ్వును. కారణములేకయె పెద్దపెట్టున నేడ్చును. ఆహారము ముట్టదు. "కల్యాణమంజరీ, కల్యాణమంజరీ" యని పిలుచును. ఒకచోటస్థిరముగానిలువక గృహమునందు, గృహముచుట్టునున్న దొడ్డియందుఁ దిరుగుచుండును. నిష్కారణముగా బిడ్డలం గసిరికొట్టును. పరిచారికులం దిట్టును. అయ్యయ్యో! నన్ను సేవకులు కొట్టుచున్నారని కేకలు వేయును. తినుటకే దేని బెట్టిన విసముపెట్టుచున్నారో యని యఱచును. మాటిమాటికి మొత్తుకొనును. రొమ్ము మోదుకొనును. విలువ

గలమువ్వలువలుదెచ్చి చింపును. ఏలచింపెదవన బొమ్మలకు బట్టలు కావలెననను. అద్దములు పగులఁగొట్టును. అట్టిపనిచేయవలదని భర్త నివారింప తలగోడకుఁ గొట్టుకొనును. చీనిచీనాంబరములు మైలపడినవని తడుపును. తన యమూల్యాభరణములఁ దీసి పరిచారికలంబిలిచి యొక్కొక్కరికొక్కొక్కకనగ పంచిపెట్టును. ఇల్లుకాలిపోవునని వంకబెట్టి పొయిలో నిప్పులార్పును. కర్పూరమంజరి యామెకంటికి కనుకూణముఁగనఁబడఁ జొచ్చెను. తనవెనుక నామెనడచుచున్నట్లు చెప్పును. కర్పూరమంజరియటక మీఁదనున్నదని నిశ్చయించుకొని యాటక మీఁదనెక్కును. పెరటిలోనున్న పొదరిండ్లలోను గృహమందలి చీఁకటిభాగములలోను మంచముక్రిందను, బియ్యపుగుట్టలలోను భోషాణముపందును నిలువెత్తునున్న గుండిగలలోను, కర్పూరమంజరి యున్నదని శోధించిచూచును. కర్పూరమంజరి యింటఁ బ్రవేశింపనని చెప్పి కవాటములు బంధించును. నిశ్శబ్దముగానున్న సమయమునను భర్తం బిలిచి "యదిగో కర్పూరమంజరి. వీథిలోనుండి నన్నుఁ బిలుచుచున్నది. వినఁబడినదా" యని యడుగును. "పిలుచుటలేదు. నీది వట్టి భ్రమ" యని భర్త బదులు చెప్ప "అయ్యో! అంతబిగ్గరగాఁ బిలుచుచున్నప్పుడు మీకు వినఁబడకపోవుచున్నదా? ఇది వట్టిమాట. నాకంటిలో దుమ్ముగొట్టవలెనని మీరీలాగనిపించుచున్నారు." అని కొఱకొఱమనుచు భర్తఁదూలనాడును. ఛీ! నాయింటికి రాకు నాభర్తంబిలుచుటకు నీవెవ్వతెవే! వచ్చితివా నీనెత్తురు కంటఁజూచెద. రాచకూఁతురవైనయెడల రా, నేను రాచబిడ్డనే" యని కత్తిచేతఁబూని కర్పూరమంజరి వీథిలోనున్నదాని తలుపులుదెఱచి పరుగెత్తఁబోవును.

వజ్రపాణి తన నూతనవధూ సమాగమము ప్రయత్నవిరోధముగాఁ బరిణమించినందుకుఁ దద్దయువిచారించి యది స్వయంకృ

తాపరాధమేయని నిశ్చయించి పశ్చాత్తాపమునొందిన గార్యములేకని గ్రహించి యామెను నలుగురుపరిచారికల కప్పగించి తలకు నిమ్మకాయలురుద్ది స్నానముచేయించుచు గదిలోనుండి యావలకురాకుండ నలుపలు మూయించుచు నొకవైద్యునింబిలిచి చికిత్సచేయింపఁ జొచ్చెను.

వైద్యుఁడు చేయిచూచుటకురాఁగా ఛీదుర్మార్గుఁడా! నీవు కర్పూరమంజరికిఁ దండ్రివటరా నీవు కన్యాదానముచేయుటకు వచ్చితివా? యని మీఁద నుమ్మివైచెను. పరిచారికల కప్పుడప్పుడు చెంపకాయలు వగులుచువచ్చెను. బిడ్డలు తల్లియవస్థఁజూచి తండ్రిం గౌఁగిలించుకొని యేడ్చిరి. బిడ్డలదైన్యముఁజూచి తండ్రియు బాష్పాకులితలోచనుఁడయ్యెను. లోకైకసుందరిని బెండ్లియాడి భూలోకస్వర్గమను భవింపఁదలఁచుచుండఁగా భూలోకనరకమనుభవింపవలసి వచ్చినదే యని యతఁ డింతింతయనరాని చింతచే సుకృక్కుచుండెను.

వలవంతలు వంతలుగా మాఱుట యత్యద్భుతముగదా! మనుజుఁడు తలఁచినదొక్కటి. దైవముగావించినదొక్కటి యనుసామెత వజ్రపాణియెడల నిజమయ్యెను. మానవుఁడాకాశమున మేడలు గట్టయత్నించును. స్వర్గమర్త్యపాతాళముల కేక సూత్రము పన్నును. కాని యఘటనఘటనాసమర్థుఁడును, సర్వశక్తుఁడును సర్వనియామకుండును నైనపరమేశ్వరుఁడు తఱచుగా వారితలంపుల భగ్నము చేయుచుండును.

---

# పదునేడవ ప్రకరణము.

"మల్లికా! ఏమియుపాయమే నీవెంతో చతురమతివని సఖీజనము చెప్పుకొనును. జనకుఁడు నన్ను నజ్రిపాలికిచ్చుటకుఁ గృతనిశ్చయుఁడైనాఁడు. పట్టినమకరందుని చెట్టఁ బట్టవలె; లేదా నావంటి దైవోపహతలకుఁ బ్రాణసఖియైన మృత్యుదేవతను గాఢాలింగనముఁ జేసికొనవలెను. ఇంతియేగాని మఱియొక పురుషుని కేలువట్టనోపను. అతఁడు నవమన్మథుఁడేగాని, మర్త్యలోకమునకు దిగివచ్చిన జయంతుఁడుగాని, పురుషాకృతి దాల్చిన వసంతుఁడుగాని, యా మదనునిం గన్నతండ్రిగాని యెవఁడైన నాకక్కఱలేదు. ఆతనింగలియు టెట్లు? ఎక్కడయుజ్జయినీ పట్టణము! ఎక్కడ శ్రీనగరము! ఎన్నివందల యామడలదూరమున్నదే! మనశ్శబ్దము నపుంసకలింగ మని పాణిని, శాకల్యుఁడు మొదలగు వైయ్యాకరణులు వచించిరి. కాని యది నపుంసకలింగము గాదు. నపుంసకములకు సంచలన మెక్కడిదే! నపుంసకమైనయెడల నిమేషమాత్రమున నన్నినందల యామడ ప్రయాణము జేసి మహానుభావుఁడైన మకరందుని కడకేట్లు పోఁగలదే! 'ప్రమాదో ధీమతామపి' యన్నట్లు మహామేధావంతులగు వైయాకరణులుగూడ శాస్త్రరచనలలోఁ బొరపడియుందురు. నామనస్సు నిజముగా నపుంసకమైన నేనెంతసంతోషింతునే! నపుంసకములైన కొయ్యవలెఁ దీఁగలవలె నిదియొకచోటఁ బడియుండిన నెంతబాగుండునే? దీని కీసంచలన మెక్కడినుండి కలిగిన దే? ఇంతవేగ మెక్కడినుండి వచ్చిన దే? ఒక్కనిముసమైన నాదగ్గఱనుండ దేమే? నేనన్న దీనికింత గిట్టకున్న దేమే! ఇది కోఁతివంటిదిగదా! దీనిని బంధించుట కేశ్శృంఖలములు లేవుగదా చతురమతివి నీవట్టి సంకెళ్ల నిర్మింపలేవుగదా? నీ తెలివి తెల్లవాఱినట్లే యున్నది. నాకుఁబనికివచ్చు నుపాయమేదియు నీకడలేదు ఓసీ! ఆ

మహానుభావుని పాణిగ్రహణభాగ్యము చేకూఱినను జేకూఱక పోయినను చిఱునవ్వు వెన్నెలలుగ్రక్కు నాతని ముఖచంద్రమండలము నొక్కసారి చూపవే. ఈ మహోపకారమునకు నీఋణమెన్నఁడైనఁ దీర్చుకొందునే. ఆహాహా! ఏమే యీముఖలావణ్యము. ఏమే యీకర్ణాంతములైన యీసోగకన్నులతీరు ఏమే యీమీసకల సిరికి నివాసమైన తెలిదామరపువ్వులనెవ్వఁడుచేసెనో యీకన్నుల నాతఁడే చేసెను. శరత్కాలచంద్రమండల మెవ్వఁడు నిర్మించెనో యీతని మొగము నాతఁడే నిర్మించెను. బంగార మెవ్వఁడు సృజియించెనో వానినెమ్మేను నాతఁడే సృజియించెను. వెన్నెల నెవ్వఁడు గావించెనో యీమందహాసముల నాతఁడే గావించెను. చందమామలోని లావణ్యము వసంతుని మార్దవము పచ్చవిల్తుని చక్కఁదనము మూఁడును మూఁడుపాళ్ళు వైచి చతురాస్యుఁడు తన పురుషసృష్టి సార్థకమగునట్లు వీనిం జేసి యుండును. చెలీ! అట్టిపురుషుని సందర్శించుటెట్లు? ఒక్కసారియతని జూచి యీమేను విడువవలెనని యున్నది. ఏల యిట్టిపని యందువా విను. అతఁడతి దూరమునందుండుటచేతను నావంటి కన్నియలు పెక్కండ్రువాని కిచ్ఛామాత్రమున సులభముగా లభింపఁ గలుగుట చేతను నతనికాలి గోటికయినఁ బరిచర్య సేయుటకు నేను తగియుండక పోవుటచేతను నతని దాసీజనంబులోనైనఁ జేరి యీతని యూడిగము సేయ నేఁదలపెట్టినను నాజనకుఁడు నన్ను విడిచిపెట్టక పోవుటచేతను నాకాతని చరణంబు దుర్లభమనియు మరణంబ శరణంబనియు నిశ్చయించుకొంటిని. కాని యీతనిఁ జూచి ప్రాణంబు విడువవలతు. ఆహాహా! పులుఁగు లెంతయదృష్టవంతులే. ఱెక్కలకలిమిచే నవి యెక్కడికరుగదలంచిన నవి యక్కడికరిగిపోవును గదా. విమానసంచారముచేయు దేవతాంగన లెంతయదృష్టవంతులే. ఎవడైన నొక్కజోగి మనకడకువచ్చి ప్రవరాఖ్యునకుంబలె మనకు నొక్కపాదలేపనమిచ్చిన దాని

ప్రభావమున మన మొకసారి యుజ్జయినికి ఱెప్పపాటు కాలమునఁబోయి యతని దర్శించి నమస్కరించి రాఁగలుగుదుముగదా! మందభాగ్యులకు మనకట్టి యదృష్టము పట్టునా? పోనీ! నిరాశ జెందుదమన్న మేన నుసురులున్నంతవఱ కాశాబంధము తెగదు. అసువులతోడనే యాశలు నశించును. స్వతంత్రించిపోవుదమన్న పనికిమాలిన యీరాచ కులమునఁబుట్టితిమిగదా! అడవులలో యథేచ్ఛముగా సంచరించు చెంచు కన్నియలు తొలి మేనులు నేమిమేలునోములు నోచిరే! ఈ పాడురాచ కులమునఁ బుట్టిన కతమున మావంటి కన్నియలు సూర్యంపశ్యలై చీఁకటులువోలె మేడలలో మిద్దెలలో నడఁగియుండవలయును. జంతువులకు స్వేచ్ఛయున్నది. పక్షులకు స్వేచ్ఛయున్నది. కీటకములకు స్వేచ్ఛయున్నది. సరీసృపములకు స్వేచ్ఛయున్నది. కాని చైతన్యముగలిగి జ్ఞానసంపత్తిగలిగి మెలంగు మెలంతులకు స్వాతంత్ర్యమన్నది లేదు. 'న స్త్రీస్వాతంత్ర్యమర్హతి' యని మనువుచేసిన శాసనమెట్లు లోకమునఁ బ్రవర్తిల్లుచున్నదే! ఈశాసన మెన్నటికయిన మాసిపోవునే! సఖీ! నాకోరికలిసుక పాతరవలెఁ దఱుగకున్నవి. ఎన్నో చెప్పితినని నీకు వినుగుగలుగుచున్నదిగాఁబోలు చెప్పినవి చెప్పఁగా నిఁక చెప్పినన్ని యున్నవి. ఎన్ని దినములు చెప్పినను దఱుగవు. చెప్పుటకు మాటలుచాలవు. వాల్మీకిగాని వేదవ్యాసుఁడుగాని వేదవ్యాసుని యబ్బగాని మనసులోనున్న యూహాల సరియైన మాటలలోఁ దెలిపి సంపూర్ణ భావప్రకటనము చేయఁగలఁడే. అది కవికే గాదు రవికైన సాధ్యముగాదు. అట్టిచో నేనెట్లు నీకు నచ్చఁ జెప్పఁ గలను? అదియునుఁగాక వలవంతయొక్క తీవ్రపువేఁడిమి వలవంతయను చిచ్చునఁబడి మాఁడెడువారికేగాని పెఱవారికిం దెలియదు కన్నియవైనను నీపుణ్యమున నీకట్టియలమట కలుగదయ్యె మల్లికా! తల్లి కడనైనఁ జెప్పనోళ్లని గుట్టుమట్టులు నీకడఁ జెప్పుకొంటి తల్లి కని పెమ్మట మీ కప్పగించినది. కావున నీవు తల్లికన్న నెక్కుడు

దానవు. అందుచే నాయత్తవలికము తెలియునట్లు తగిన తెలుంగు నీవచేయవలయు. అట్టియదృష్టము నాకబ్బునా?" అనికన్నుదోయి నీటికతమున మంచుగ్రమ్మిన కెందామరతేకువ చందంబున సలర నామె విచారాక్రాంతయై యటమీఁదఁ బలుకలేక యూరకుండెను. మల్లిక తన చెఱంగుతో నామె కన్నీరు తుడిచి "సఖీ! నేఁడు నీ కడుపులోనున్నదెల్ల వెళ్ళఁబుచ్చితివి. మనస్సును గలఁచునట్టి విషయములు వమనములవలె బైకివచ్చినని మానిసికి సుఖముండును. దుఃఖములు మిత్రులతోఁ జెప్పుకొన్నఁ గొంతవఱకుపశమించును. చెలికాండ్రతోఁ జెప్పుకొన్నపక్షమున నానందమతిశయించును. కావున నీకుఁ గొంత హృదయభారము తగ్గిపోవును. ధైర్యము దెచ్చుకొనుము. విచారములవల్లఁ గార్యములుగావు. ధైర్యకవచముఁబూనిన వారిని గష్టములు బాధింపఁజాలవు. నాచేతనైన సాయము నేఁ జేసెద. ఏమిచేయుదునాయని విచారించుచున్నాను. ఉపాయము తోఁచకున్నది." యని బహులు చెప్పెను.

"ఓసీ! నా విచారము కొంత తేలుపఱచుచున్నావు. నాహృదయమిందుకేని జాలకపడలేదు. నామనోవ్యథ తగ్గలేదు. అతని కటాక్షవీక్షణములు ప్రసరింపవలె. నామనస్సు చల్లఁబడవలె. నీవంటి బుద్ధిమంతురాలి కొకరుఁ యుపాయమైనఁ బొడఁగట్టకపోవుట నాదురదృష్టము. అయిన వ్యథము గానాలో నింపుము నేనును నాతమ్ముఁడు విజయసేనుఁ డట్లు మగపుట్టువు పుట్టక కట్టిడి యాఁడుపుట్టువు పుట్టిన కతమున నట్టి బెట్టిదంబులు వాటిల్లె. సీ! స్త్రీజన్మము త్రాఁడదే. అందులో రాచకన్నియయై పుట్టఁ గిట్టదు. పేదవారింటనై పుట్టి యిచ్చవచ్చిన మగని చేపట్టి సుఖింపనైతినిగదా" యని కర్పూరమంజరి పలుకుచుండ మల్లికయందుకొని "నెచ్చెలీ! నీ కష్టములు నిక్కమ్ముగా పేదలకష్టములు పేదలకుండును. సకలసౌఖ్యము

లుండి స్వాతంత్ర్యములేక నీవు విచారించుచున్నావు. స్వాతంత్ర్యముం డియే సౌఖ్యములేక కడలేనికడగండ్లం బడు కటికిదరిద్రులయవస్థ వర్ణింపఁదరమా? జలచరములస్థితి స్థలచరములకు రాదు. జలస్థలచరముల స్థితి ఖచరములగు పక్షులకు రాదు. సుఖమున్నచోట దుఃఖము తప్పక యుండును. క్రీనీడ దీపము వెనుకనే యుండును. ఛాయ సూర్యు ననుసరించియే యుండును. పేదదానవైనంతమాత్రమున దుఃఖపడవు. భాగ్యవంతురాలయినంతమాత్రమునఁ గష్టపడవు. ప్రస్తుతస్థితినిబట్టి యిట్లనుకొందువు. దానికేమి! అతనితోనిక సమాగమ మెట్లు గలుగునా యనువిషయమునుగూర్చి విచారించుచున్నాను. పోనీ! తెలిసినది. విదర్భరాజనందనయగు రుక్మిణి తనమనోరథసిద్ధికై వాసుదేవునికడకు బ్రాహ్మణుని దూతగాఁ బంపినట్లు మనముకూడ నెవ్వరినైన సుందరుని కడకంపుదమా?" యనిపలికెను.

"పంపవచ్చును గాని మనము సంపూర్ణముగా విశ్వసింపఁదగిన బ్రాహ్మణుఁడు మనకెవ్వఁడు దొరకును? రుక్మిణీదేవికున్న స్వాతంత్ర్యము మనకుఁ గలదా? పోతుటీఁగయైన మనయింటఁ జొరరాదు. ఎట్లో సూర్యచంద్రులుమాత్రము మన యోవరిలోఁ బ్రవేశించుచున్నారు. మనకట్టిపురుషుని దర్శనమెట్లగును? మాతండ్రి యింట లేనప్పుడు నీవెవ్వరినైనఁ దోడ్కొనివచ్చుటకయిన వీలులేకుండ మనకీభట్టు హిమాలయపర్వతమువలె మధ్యస్థముగనున్నాఁడు. ఇతనివైఖరిఁ జూచి మాతండ్రి కేవో దురాలోచనలు చెప్పుచున్నట్లు తోచును. ఇతనివలన మనకుఁ గొంతయపకారము జరుగుచున్నదని నాయభిప్రాయము. ఎట్లైనను బ్రాహ్మణసందేశము వలనుపడదు. మఱియొక యుపాయమ న్వేషింపుము." అని యామె బదులుచెప్పెను.

"పోనీ యెవరినిబంపుమని యెదవు?" అని మల్లిక యడుగఁగను.

చెలీ! యెవ్వరిబంపుమని నేనుచెప్పగలను. వెళ్లెడువారికి ధైర్యముం

"చెలీ? నన్ను బ్రతిమాలనక్కఱలేదమ్మా. ఈమేనుమీఁది నేను తినుచున్నము మీఁది, నాకట్టుబట్టమీఁది. ఈశరీరము మీయిచ్చవచ్చినట్లు చేసికొనవచ్చును. ఒకవేళ మధ్యమార్గమున నే నేబెబ్బులినోటనైనఁ బడి మృతినొందినను నేను విచారింపను. ఏలయన దానియాఁకలిదీర్చినదాననగుదును. ఏహానిలేకుండ సుజ్ఞునిఁ జేరితినా ప్రియసఖి కార్యము జేసినదాననగుదును. ఎట్లయిన నీపనుపు జేసి నాతనువు ధన్యము నేసికొనియెద. కాని, మీతండ్రితోఁ జెప్పి యిల్లు గదలవలయు. ఏ వంకబెట్టి యాయనకడ సెలవుపుచ్చుకొందును. నాతల్లిదండ్రులు మూఁడుగాళ్ళముదుసలులయిరి. వారు రమ్మనినాకు వర్తమానమంపిరి. తప్పక నే పోవలెనని చెప్పిపోయెదనని యుంగరము నాకిమ్ము. ఆయనకానవాలు జూపెదను. నీ వేదైన లేఖ యిచ్చెదవా? అట్లయిన వ్రాసి యిమ్ము. ఏమి చెప్పవలెనో చెప్పుము. ఈ రేయి మీ యయ్యకడ సెలవుగైకొని రేపు బైలుదేఱిపోయెద. మీనాయనగారు నన్నొంటిగఁ బోనియ్యరు. నశక్తుఁడగు నింటి వృద్ధకంచుకుని జంబుకుని నా వెంట నంపుదురు. సరే ఆనల్లమందుతాతకు నాలుగుగంజాయాకులిచ్చితినా కునికిపాట్లు బడుచు దారిలో నేచెట్టుక్రిందనో కూర్చుండును. అప్పుడు జేపరమేశా యని దాఁటుదును. ఇంక శాంతింపవమ్మా!" యని యామెచిత్తమూఱడిల్లునట్లు మల్లిక పలికెను.

కర్పూరమంజరి ముఖారవిందము వికసించెను. నేత్రములు విశాలములయ్యెను. చిఱునవ్వు మొగమునలంకరించెను. శరీరమందంతట నుత్సాహరసము వ్యాపించెను. ఆనందముపట్టజాలక యామె మల్లికను గౌఁగలించుకొని "సఖీజనమనఁగా సుఖదుఃఖసమానమైనజనము. నానిమిత్తమున నీప్రాణములనైన విడువఁదలఁచితివిగదా! నీఋణము వేయిజన్మములకయిన నేను దీర్పఁగలనా?" యని వెండియు నిట్లనియె.

"ఓసీ! ఏమిచెప్పుదుని నీతోఁ జెప్పుదును. అదిచెప్పు మిది

చెప్పుమని నేఁజెప్పఁజాలను. చెప్పవలసిన దంతయుఁ జెప్పుము. నా యలమట యంతయుఁజెప్పుము. నీవుచూచినదంతయుఁ జెప్పుము. చెప్పఁగూడనిదంతయు విడిచిపెట్టుము. సమయోచితముగాఁజెప్పుము. మిక్కిలి దీనముగాఁజెప్పిన లోకువవగును. ఎక్కువబెట్టుసరిగాఁజెప్పినఁ గార్యము చెడును. కార్యశకటమును నడిమితోవ నడిపింపవలయును. పరులతో సంభాషించునప్పుడు వానింజేరకుము. విసుగుగానున్నప్పుడు పలుకరింపకుము. విచారాక్రాంతుఁడైనప్పుడు నీసోదెచెప్పకుము. ఒంటిగానున్నప్పుడు చిత్తముప్రసన్నమైయున్నప్పుడు మొగముకల కలలాడుచున్నప్పుడు దీర్ఘాలోచనాపరతంత్రుఁడుకానప్పుడు మెల్లగఁ జేరవిన్నవింపుము. నాశరీరమాయనదె యనుము. నాప్రాణమాయనదే యనుము. నామనస్సాయనదె యనుము. నాహృదయమాయనదె యనుము. నాజీవితమతనియాధీనమనుము. పరమేశ్వరుని నమ్ముకొని ప్రయాణము సేయుము. అంతటఁగార్యసిద్ధికగతలామలకము. ఇదిగో! నాయుంగరముతీసికొమ్ము. ఇదియాతనికిచ్చిరమ్ము. ఆయనయేదేని మరలనిచ్చినఁ గనులనద్దుకొందుననుము. పొమ్ము శుభమగుగాక !"

ఆరేయిమల్లిక చిత్రభానునితో మాతాపితృసందర్శనార్థము పోవుదునని చెప్పి యాయన నొడఁబఱిచి మఱునాఁడు పఱువాత వృద్ధ కంచుకియైనజంబుకుని చిత్రభానునియాజ్ఞాప్రకారము వెంటఁబెట్టుకొని బైలుదేఱెను.

రెండుదినములుగడచెను. మూఁడవనాఁడు తెల్లవాఱుజామున వీథిగుమ్మముకడ నేడుపువినఁబడెను. అప్పుడే మేలుకొనవచ్చిన సేవకులు తలుపుదెఱచి యదియేమోయని చూచునప్పటికి వెక్కివెక్కి యేడ్చుచు జంబుకుఁడునిలిచెను. వారువానినట్లోలోపలికిఁదెచ్చిరి. నాఁకటిలో నరుగుమీఁదఁగూర్చుండి వాఁడువెక్కివెక్కి యేడువఁజొచ్చెను. సేవకులుకలవరముపడిరి. అదివినియింటివారందఱులేచిరి. వానిని లోపలికి

దోడ్కొనిరమ్మని చిత్రభానుఁడాజ్ఞాపింప సేవకులట్లుచేసిరి. ఆదుఃఖమునకుఁ గారణమేమని చిత్రభానుఁడు, రుద్రభట్టు, వానినెన్నివిధములనడిగినను వాఁడు వారిపలుకులువినిపించుకొనక "అయ్యో! అయ్యో! నాతల్లీ! నాతల్లీ!" యని బొమ్మమోఁదుకొని యేడువఁ జొచ్చెనేగాని యుత్తరమీయఁజాలకపోయెను. చిత్రభానుఁడుచీవాట్లు పెట్టెను. సేవకులేడువవద్దని బ్రతిమాలిరి. ఎట్టకేలకు వాఁడిట్లుబదులు చెప్పెను.

"ఏమిచెప్పుదునుతండ్రీ! కైలుదేఱిననాఁటిరాత్రియే నేనును మల్లికయు నొకసత్రపుటరుగుమీఁదఁ బండుకొనఁగా దగ్గఱయడవిలో నుండి పెద్దపులి వచ్చి దానిని లాగుకొనిపోయెను. నేను దుడ్డుకఱ్ఱ పుచ్చుకొనితఱిమికొట్టితినిగాని యదిమల్లికనువిడువక పాఱిపోయెను. ముసలిముండకొడుకును నన్నైనఁదీసికొనిపోయినదికాదు. దూంపలాటి బిడ్డనుదీసికొనిపోయినది" అనిపెద్దపెట్టుననేడ్చెను.

సేవకులాశ్చర్యపడిరి. కర్పూరమంజరి వగపుచే నేలఁజదికిలఁబడెను. చిత్రభానుఁడు కటకటాయనెను. చంద్రికయు నిందుమణియు గర్పూరమంజరిని లోనికిందీసికొనిపోయి పానుపుజేర్చిరి.

ఆమెకప్పుడు రెండువిచారములుపట్టెను. ప్రాణమిత్రమైన మల్లికమరణమొందుటయొకటి తనసందేశముమకరందునకందకపోవుట మఱియొకటి. ఇవియొకదానికంటె నొకటిబలవత్తరమయినవిషాదకారణములు. మధ్యాహ్నము జంబుకునిబిలిచి యామె జంబుకా నిజముచెప్పు చెప్పు మల్లికను బెబ్బులియీడ్చికొనిపోవుచుండ నీవు చూచితివా?" యనిగుచ్చిగుచ్చియడిగెను. "అమ్మా! మీపాదములసాక్షి. పెద్దపులిలాగుకొనిపోవుచుండఁగా నేనుకన్నులారఁజూచితిని" అనివాఁడుబదులుచెప్పెను. అన్నివిధముల దైవముతన్ను బాడుచేసె నని కర్పూరమంజరిదుఃఖపరవశయై రెండవసఖియైనచంద్రికతో నెట్టెటోకాలక్షేపముచేయుచుండెను.

---

## పదునెనిమిదవప్రకరణము.



మణివర్మనియుక్తుఁడై మాధవసేనుఁడు రాచనగరునకరిగి కంచుకిచేతఁ దనరాక నరవిందాదేవి కెఱిఁగించి యామెయాజ్ఞాప్రకారము లోని కరిగి యథోచితసత్కారముల నంది సుఖాసీనుఁడై మణివర్మ చెప్పినట్లు చిత్రభానుఁడు సేనానివేశమునఁ జేసినచర్యలెల్ల వినిపించెను. అది వినఁగానే యామెగుండె ఝల్లుమనెను. రాజకుటుంబమునకు మూఁడఁదలఁచినయాపద యామెయెట్టయెదుటఁ గనఁబడెను. పరిక్కనున్నవిక్రమసేనునిం జూచి యాదేవి విచారసూచకమగు హీనస్వరముతో నిట్లనియె. "నాయనా! కాశ్మీరరాజ్యవృక్షమునకుఁ బురుగులు పట్టినవి. ఈకీటకములు తరువును నిర్మూలముచేసినంగాని విడువవు. దొంగయు మనుష్యుఁడేయనుసామెతనుబట్టి మనకు హితులెవ్వరోయహితులెవ్వరో తెలిసికొనఁజాలకున్నాము. ఎవరినినమ్మవచ్చునో యెవరినినమ్మఁగూడదో మనమెఱుఁగము. ఇదిచూడ నాకొక్కశ్లోకము జ్ఞాపకమువచ్చుచున్నది. చిన్ననాట మాతండ్రి మహేంద్రదేవుఁడు నాకు విద్దెగఱపుటకై తర్కవాచస్పతియని బిరుదు బొందినజయదేవుఁడను పండితుని నియమించెను. ఆయనప్రస్తావవశమున నొకనాఁడీశ్లోకముఁజదివి నాకర్థము చెప్పెను. అదిమిక్కిలిరసవంతమగుటచే నేనుదానినివల్లించితిని. క్రొత్తకుండ మీఁదఁ జేసిన సంస్కారమట్లు లేతమనస్సు మీఁదఁబడినభావములు మఱపునకురాక యాజీవితాంతముండును గనుక నాకిప్పటికి నది జ్ఞాపకమే.

శ్లో. అగ్రే వ్యాధః కరధృతధనుః పార్శ్వయోర్జ్వాలమాలాః
పృష్ఠే వహ్ని ర్దహతి విపినం సన్నిధౌ సారమేయాః
ఏణీ గర్భా దలసగమనా బాలికాః పాదలగ్నాః
లక్ష్మీనాథ! త్వ మసి శరణం కిం కరోమి క్వ యామి.

"కుమారా! దీనిభావమిది. 'ఒకమగలేడి దురవస్థలోనుండి యిట్లు విచారించినదఁట. ఎట్టయెదుటఁ జేతవిల్లుబూని కిరాతుఁడు నిలిచి యున్నాఁడు. కావున ముందుకుఁ బాఱిపోవుటకు వీలులేదు. వెనుకకుఁ బాఱిపోవుద మన్న వెనుకప్రక్క భయంకరమై కాఱుచిచ్చు వనమును గాల్చుచున్నది. ప్రక్కలకుఁ బఱుగెత్తుద మన్నఁ గిరాతుఁడు వలలు పన్నియున్నాఁడు. సమీపమందు వేఁటకుక్కలు సిద్ధముగానున్నవి. ఆఁడులేడి చూలుదాల్చియున్నది. పరుగెత్తఁదలఁచుకొన్నను వీలు లేదు. పైఁగా బిడ్డలు కాళ్ళకడ్డముగాఁ దగులుచున్నవి. ఓ లక్ష్మీనాథా నీవే శరణము. నేనేమి చేయుదును. ఎక్కడికిఁ బోవుదును.'

మన యవస్థయు నట్లేయున్నది. మంత్రులు నమ్మకమున్న వారు సింధుగాంధార రాజులకు వశులై మూకలకై మన రాజ్యమును మనలను విక్రయింపఁదలఁచుకొన్నారు. సేనాపతులు సేనను క్షత్రభానునకు వశము చేయఁదలఁచుకొన్నారు. క్షత్రభానుఁడు సోదరుం గడతేర్చినట్లే నన్నును సోదరపుత్రులను రూపుమాపఁదలఁచుచున్నాఁడు. నాయనా! మీరు చిన్నవాండ్రు. లోకానుభవము లేనివాండ్రు. నేనో కోటదాఁటి వెళ్ళుటకు వీలులేని యాఁడుదానను. దీనజనమందారుఁడై దేవతా శిరోమణియై సకలలోకరక్షకుఁడై వెలయుచున్న శ్రీమన్నారాయణుఁడే మనల రక్షింపవలయు. అగతికులకుఁ గతియు ననాథులకు నాథుఁడునైన జగన్నాథుఁడు నాఁడు విరటుపుత్రిక కడుపులోనున్న పరీక్షితుని సురక్షితుఁ జేసినట్లు మిమ్ముఁ గాచుఁగాక! మనుష్యయత్నము నడ్డుగట్లు భగవదిచ్ఛ యనుప్రవాహమును వారింపఁ జాలవు." అని నిష్ఠురముగాను దయనీయముగాను సంభాషించుచున్న దేవినుద్దేశించి మాధవసేనుఁడు వినయముగ నిట్లనియె—

"తల్లీ! నేనును మణివర్మయు రాజకుటుంబమునెడ నమితవిశ్వాసముగలిగి చేతులుగట్టికొని మీపనులు చేయుటకు సిద్ధముగనున్నను.

ర్శనుని కడకును సాహాయ్యము నిమిత్తము సందేశములంపుట మంచి
ది. నాబుద్ధికింజూడ మాధవసేనుఁడే యిప్పనికిఁ దగినవాఁడు. మీఁద
నీయిష్టము" అనుటయు నరవిందాదేవి కొంతసేపు మనంబున నాలో
చించి "కుమారా! నీవు రాజవు. శాస్త్రజ్ఞానము గలవాఁడవు. చక్క
గానాలోచించి యేదికర్తవ్యమో చేయుము. నాబుద్ధికేదారియుఁ బొ
డకట్టుటలేదు. మనకందఱుఁ బగతురేయగుటచేత మనమానప్రాణ
ములు చిత్రభానునిచేతఁ గోల్పోవుటకంటెఁ జిరపరిచితులైన మణివర్మ
మాధవసేనులచేతనే గోల్పోవుట యుక్తము. కావున గోత్రకటికవాని
నేనమ్మినట్లు వీరినే నమ్ముకొనియుందము. మణివర్మతో మంతనముండి
మాధవసేనుఁడే సుదర్శనునికడకు మాతండ్రికడకు సందేశము గొం
పోవుఁగాక!" అని పలికెను.

అనవుడు మాధవసేనుఁడు చింతిల్లుచు "తల్లీ! మేమెన్నివిధ
ముల మొఱవెట్టుకొనుచున్నను మీరింకనుమమ్ము చిత్రభాను ప్రము
ఖులతో సమానులుగాఁ జేయుచున్నారు. కాని కాలక్రమమున మా
ప్రవర్తనమే మాపలుకులకు వ్యాఖ్యానమగుఁగాక! నేను మణివర్మ
తో నాలోచించి మహేంద్రదేవునికడకు సుదర్శనునికడకు సందే
శముగొనిపోయి సాధ్యమైనంత వేగముగా వారిని సేనలతోఁ గూడఁ
దోడ్కొనివచ్చెద. మహేంద్రదేవునకు సుదర్శనునకును మీరుజాబులు
వ్రాసి సిద్ధముగ నుంచుఁడు. నేనుమణివర్మతోఁ జెప్పి రేప పయనము
జేసెద. నాకు సెలవొసంగుఁడు." అని పలికి వారి యనుమతి వడసి
పోయెను. అతఁడు చన్నపిదప నరవిందాదేవి కుమారునిఁజూచి "నా
యనా! నాతండ్రికి వ్రాయవలసినజాబు నేనేవ్రాసెద. సుదర్శనుఁడు
పరపురుషుఁడగుటచే నేనాతనిపేర నేమియువ్రాయనొల్ల. ఆజాబునీవ
లిఖింపుము" అనిచెప్పి తనగదిలోనికరిగి జనకునిపేర జాబువ్రాయఁ
దొడగెను. విక్రమసేనుఁడు తనజాబువ్రాసి తల్లికిట్లు వినిపించెను.

"శ్రీమన్మాళవమహీపాలు రగు స్వస్తిశ్రీ సుదర్శన మహారాజుగారికి—కాశ్మీరపాలకుఁ డగు విక్రమసేనుఁడు వినయపూర్వకముగా నమస్కరించి చేసిన విజ్ఞాపనము.

నాకు మీపరిచయభాగ్యము లేకపోయినను మాజనకుఁడు హేమచంద్ర మహారాజుగారును మీరును వారణాసీ నగరమున సబ్రహ్మచారులై సహాధ్యాయులై ప్రాణమిత్రులై యుండినందున నేను మీకుఁ బుత్రప్రాయుఁడననియు మీరునాకు జనక ప్రాయులనియు భావించి చనవుగల్పించుకొని యీ లేఖవ్రాసి పంపుకొంటిని. ఈలేఖం దెచ్చినయతఁడు మాకమాత్యుఁడు. మాధవసేనుఁడు సింధుగాంధిర వల్లభులు మాదేశముపై దాడివెడలుదురని లోకమునఁ బ్రవాదము గలిగినది అదియటుండ మాపినతండ్రి చిత్రభానుఁడు మజ్జనకునిచే దేశభ్రష్టుఁడు గావింపఁ బడియు నతని మరణానంతరమున శ్రీనగరముఁజొచ్చి చన్న యన్న మీఁదను నిందున్న యన్నబిడ్డలమీఁదను నెంతో ప్రేమ నభినయించి సేనల సేనాపతులఁ దనవశము జేసికొని యేదో ద్రోహము సేయఁదలఁచుచున్నాఁడు. మాతండ్రిగారి దారుణమరణముఁ దలంచియు బాలుఁడను నిస్సహాయుఁడను నైన నాదీనస్థితిఁ దలఁచియుఁ బగతురబారినుండియు నాప్తుఁడట్లు మేఁకవన్నె పులియైయున్న మాపినతండ్రి బారినుండియు మమ్ముఁ దప్పించి కాశ్మీరరాజ్య పరిరక్షణము సేయఁ బ్రార్థించుచున్నాఁడను. హేమచంద్రమహారాజు బ్రతికియున్నవాఁడని మీరుభావింపుఁడు 'మిత్ర మాపది జానీయాత్' ను న్యాయము నులెన్నగా గమనింపుఁడు. ఆర్తరక్షణపరాయణులు, దయాసాగరులు, పరోపకార ధురంధరులు, నిష్కళంకచరిత్రులు, మత్పితృసఖులు నగు మీకు నేనింతకన్న విస్తరించి వ్రాయనక్కఱలేదు. ఈయమా

ముసుఁగులువైచికొని వలయుసాధనసామగ్రులగ్రహించి తమనీడలు చూచి తామెశంకించుచుఁ తమదుర్యశమువలె లోకమెల్ల నిండిన యాగాఢాంధకారమున సంచరించుచుండిరి. ఆకాశలక్ష్మి తనవేయి కన్నులుదెఱచి నేలపై జరుగుచున్న దంతయుఁ గనిపెట్టుచున్నదోయను నట్లు నభోమండలమున లెక్కలేని చుక్కలు మిణుకు మిణుకుమని మెఱయఁజొచ్చెను. నూతనపురుషులు మున్నెన్నఁడు జొఱని సందులలోఁజొచ్చిన ఆవుల మోరలెత్తి కుక్కలు మొఱుగఁజొచ్చెను. నగర రక్షణమునిమిత్తము నియోగింపఁబడిన రాజభటులు కొంతసేపు తిరిగి యేయరఁగుమీఁదనో యేకాంతముగాఁ బండుకొని నిద్రాదేవికి విధేయులై యామెపనుపు చేయుచుండిరి. తెల్లవారుదనుక నిద్రపట్టక బాధ పడురోగులమూల్గులు నిలువనీడలేక వీధులలో సంచరించునొసదరిద్రుల పాంథులగుఱ్ఱులు చెట్లమీఁదనిడుమనకుముఁ బాలగులమొఱుంగులు పైనఁజెప్పినకుక్కలమొఱుగులుదప్పఁ బట్టణమున నింకొకశబ్దమేదియు లేదు.

సేనానివేశము రాత్రి మూఁడేయు మిక్కిలిసందడి గలిగియుండెను. సైనికులు తమతమయాయుధంబులు ధరించి సమరసన్నద్ధులై మహోత్సాహభరితులై యుండిరి. దండపాణియు, వజ్రపాణియుఁ గవచంబులు దొడిగి శిరస్త్రాణంబులు ధరించి యాయుధహస్తులై డాలు కత్తులు, విండ్లు నమ్ములు మొదలగు నాయుధవిశేషంబులఁ బూని సైనికులలో ముఖ్యులగువారితో వారువారు చేయవలసినకృత్యంబులనుపదేశించుచుండిరి. సైనికులలోఁ గొందఱు దండపాణిం గలసి యీసన్నాహమెందుకని ప్రశ్నింపనాతఁడు “ఈసన్నాహము మన రాజకుటుంబరక్షణార్థమే. గాంధారరాజపరిజనులు మాఱువేసములు వైచుకొని మనపట్టణంబున సంచరించుచున్నారు. వారింబట్టవలయు. అందునిమిత్తమై యాయుధహస్తులగు వేయిమందిజోదుల మేము తోడ్కొనిపోవుచున్నాము” అనిబదులు చెప్పెను.

"అట్టివారింబట్టుటకు వేయిమందిచాలుదురుగదా! తక్కిన సైనికులనందఱ సిద్ధముగనుండవలయునని యేలచెప్పవలయు!" నని వారుమరలనడిగిరి. అందుకు దండపాణి యిట్లనియె. "మీరు సైనికులు మేము సేనాపతులము. మేమాయుధములు పూనమన్న మీరు పూనవలసినదె. ఎవరితలఁగొట్టుమన్న వారితలఁగొట్టవలసినదె. ఎక్కడికిఁ బొమ్మన్న నక్కడికిఁబోవలసినదె. ఏమిసేయుమన్న నది సేయవలసినదె ప్రశ్నలువేయుటకు మీకధికారములేదు ప్రియులసమరసన్నాహముచేసి దండనాయకులుద్ధమునడిపించుచున్నప్పుడు ప్రతిసైనికుఁడు నిలువంబడి యెక్కడికి? ఈదండయాత్రయెందుకు? ఇది న్యాయ మదియ న్యాయమని వితర్కమారంభించినపక్షమున రాజ్యతంత్రమెక్కని ముసముజరుగునా? సమరములుజరుగునా? జయములుచేకూరునా? ఎవరిధర్మమువారు చేయవలయును. రాజాజ్ఞ మేము మన్నింపవలె. మా యాజ్ఞ మీరు మన్నింపవలె. ఇట్టిప్రశ్నలెవరైనఁ జేసిరేని వట్టి వారిశిరస్సులు వెంటనేఖండింపఁబడును" అని దండపాణి కఠినముగా బలికెను. ఆయుత్తరమునకు వారు ప్రశ్నలుమానిరి. అప్పుడు దండపాణి సైనికులనందఱ బారులుగానిలువఁబెట్టి వారితో నిట్లనియె "ఈసమయమున రణదుందుభులు వాయింపఁగూడదు. నాయాజ్ఞలేక మీరు కేకలువేయఁగూడదు. ఒండొరులతో మాటలాడఁగూడదు. నడచునప్పుడు కాలిచప్పుడు గాఁగూడదు. నేనుముందునడచెదను నావెంటనే గోవువెంటఁదగిలిపోవు దూడవలె మీరురావలయును నేనెవ్వరియింటి దగ్గఱ నిలిచెదనో మీరచ్చటనిలువవలయును. నేనెవ్వరిబంధింపుమన్న వారిని బంధింపవలయును. నిష్ప్రయోజనప్రశ్నలడుగఁగూడదు. దీపములుచేఁబట్టఁగూడదు. అయిదుగురు రొక్కటిగా నిలువవలె. వారికి నైదుగురకు వారివెనుక నైదుగురకు నడిమిగా వేయిమందియు రెండువందలు చిన్నబారులుగాఁదీరి నడువవలయు. ఈనిబంధన

లన్నియు మనంబునఁ బెట్టుకొని నా వెంటరండు." అని సేనాపతియానతీయ సైనికులందఱు ముందు చేసి యొక్కొక్కరుగాఁ జేరి యొకరివెనుక నొకరు నిలువఁబడిరి. మొట్టమొదట దండపాణి యశ్వారూఢుఁడై నడువ జొచ్చెను. వజ్రపాణి సేనవెనుక గుఱ్ఱమెక్కి పోవఁజొచ్చెను. నిశ్శబ్దముగా మనుష్యవాహిని ప్రవహించుచున్నట్లు చిన్నసేన నడచి పట్టణముఁ జేరెను.

రెండుజాములు రాత్రి యయ్యెను. పట్టణద్వారముకడ నాజానేయతురంగ మెక్కి నవరత్నాభరణములు ధరించి ఆయుధపాణి యను యొక మహాయోధుఁడు నాలుగువేలసేనతో నుండెను. వాని కిరుప్రక్కల పచ్చకత్తులతో నలువురుజోదు లంగరక్షకులుగా నుండిరి. గాఢాంధకారము గుటచే సైనికులొకరి నొకరు గుర్తెఱుఁగలేకపోయిరి. కాని దండపాణి తెల్లగుఱ్ఱము నాతఁడు నెక్కియుండుటంజేసి దానిఁ గనిపోయియుల్లుగా "సంగానమయమునఁ గేవ్వరోవా" యని హెచ్చరించెను. అంతకుమున్నె పచ్చతినని యాతఁడు బదులు చెప్పెను. "మున్ను మనము మనకొన్నట్లు వానిం బట్టుకొనవలసిన దేగదా?" యని దండపాణి యడిగెను. "ఆహా! సందియమేమి! అదే ప్రథమ కర్తవ్యము. తరువాత, పిలుచుబట్టి 'రెండపపని'" యని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

ఈసంభాషణము గుఱ్ఱముననుండియె వారుచేసిరి. సైన్యము నిశ్శబ్దముగా వెనుకవచ్చుచుండెను. వారు క్రమముగా రాజవీథిం బ్రవేశించి యటనుండి కొన్ని ప్రక్కవీథులందువచ్చి విశాలమయిన యావరణము-నయ్యావరణములో రమణీయమైయుద్యానము నయ్యుద్యానమధ్యమున మనోహరమైన సౌధము-గల యొక స్థలముఁ జేరిరి. సింహద్వారము బంధింపఁబడియుండెను. గోడ యెత్తుగ నుండెను. దండపాణి నలుగురుజోదుల బిలిచి "యీగోడ దాఁటి లోపలికి దుమికి తలుపు దీయుఁ"డని యాజ్ఞయిచ్చెను. వెంటనే యొకయోధుఁడు కూర్చుండెను.

వానిభుజములపై నింకొకయోధుఁడెక్కెను. అంతట మొదటివాఁడు లేవఁగా వానిభుజములపై ప్రాణముచేసిన సైనికుఁడు గోడమీఁదికెక్కి యాగోడ నంటియున్న చెట్టెక్కి మెల్లగా నావరణములోనికి దిగెను. అట్లె యిద్దఱుమువ్వురు చేసి లోపలఁబ్రవేశించి మొదటివానికిఁదోడై కవాటముఁ దెఱచిరి.

దండపాణి నూఁడుమందిజోదుల నావరణమునం బ్రవేశింపుమని తక్కినవారలను కటకపుదెసలఁ గావలియుంచి యింటిలోనుండి యీఁగయైనను నావలకుదాటిపోకుండ చూడుమని యానతిచ్చెను. సైనికులు కట్టుదిట్టముగా నట్లుచేసిరి.

లోపలి ప్రాసాదపు తలుపులకు సూక్ష్మాగ్రములుగల యినుప బోగడలు వేయఁబడియుండెను. గ్రంథులనడుమ నినుపరేకులు తాపటముచేయబడెను. భుజములతో గెంటినఁ దలుపులూడిరావని దండపాణి యుపదేశముపొంది సరిపురుసైనికులు గొడ్డళ్ళుదీసికొని తలుపులు పగులగొట్టనారంభించిరి. చప్పుడువిని యింటిలోనందఱు మేల్కొనిరి. ఎవఁడువాఁడని యజమానుఁడయొక వృద్ధుఁడు గంభీరముగఁ గేకవైచెను. మేడక్రిందనున్న వారందఱు దొంగలుదొంగలని యాక్రందనముఁజేసిరి. ముందుగ్రక్కలనున్న వారు కొందఱాచప్పుడును గృహములోనున్నవారి యాక్రందనమును నాలకించి వీధిలోనికి రాఁబోయిరి. కాని సైనికులువారిని సందు దాటి రాకుండఁ జేసిరి. తలుపులంతలోఁబగిలిపోయెను.

దండపాణి, వజ్రపాణి, చిత్రభానుఁడు లోపలఁబ్రవేశించిరి. గృహదీపికలు వెలుఁగుచుండుటచేత వానిసాయమున వారు మేఁడమీఁదికిఁ గొందఱు సైనికులఁ దీసికొనిపోవనుంకించిరి. మేడతలుపులుగూడ బంధింపఁబడెను. గృహమునందున్న స్త్రీలు బాలురు సేవకులు దొంగ

లు దొంగలని గృహమునంతయుం బ్రతిధ్వనులిచ్చు నట్లాక్రందనము జేయుచుండిరి. మేడతలుపులుగూడ గొడ్డలి పెట్టులవలన భేదింపఁబడెను. మున్ను పేర్కొనఁబడిన ముప్పురునాయకులు కొంతమంది సైనికులం దీసికొని మేడమీఁదికరిగిరి. మేడమీఁద విశాలమయిన చావడిలో దొంగలనెదిరింపవలెనని చేతఖడ్గములుబూని నిలువంబడి యున్న వృద్ధుని మణివర్మనుజూచి చిత్రభానుఁడు "సైనికులారా! వీనిచేతిలోనిఖడ్గము లాగుకొని ఱెక్కలు విఱిచికట్టుఁడు" అని యాజ్ఞాపించెను.

అప్పలుకులతని నోటనుండి వెలువడినవో లేవో వెంటనే యొక సేవకుఁడు ఖడ్గమూడఁదీసికొనెను. మఱియిద్దఱు మాంసహీనములై శల్యచర్మావశిష్టములయిన యాతని ఱెక్కలంబట్టుకొని వెనుకకుఁదీసి మోటత్రాళ్ళతో విఱిచికట్టిరి. మణివర్మ వారింజూచినతోడనే విస్మితుఁడై మొదటమాటలాడలేకపోయెను. తరువాతనిందుకె తొట్రుపాటులోనుండి వెలువడి మాటలాడఁ గమకించుచుండఁగనే నోటమాట రాకమును పే యాదారుణకృత్యముజరిగెను. "మీరా వచ్చినవారు? అర్ధరాత్రమున నిల్లుజొచ్చుటచేతను గొడ్డళ్ళతో దలుపులు బగులఁగొట్టుటచేతను నేను దొంగలనుకొన్నాను. దొంగలు ధనము హరింతురు. మీరు ప్రాణధనముహరింప వచ్చినారు. చిత్రభానుఁడువచ్చి యిట్టిదుండగముసేయుటలో నాశ్చర్యములేదు. కాని దండపాణీ! అవిధమున దేవిగారియొద్దను నాయొద్దను నీవును నీతమ్ముఁడును రాజభక్తి నభినయించి మీకపకార మెన్నఁడుసేయనివాని నేదోషమెఱుంగనివాని-బిత్రువిహీనుని-విక్రమసేనుని ద్రోహభావమున విడిచి యీతనిఁ జేరుట మిమ్మొ మొదటినుండియు నెంతోగౌరవమునఁ జూచి మహోన్నత పదవిలోనికిఁ దెచ్చిన నన్ను-శతవృద్ధుని బద్ధునిఁ జేయుట మహాశ్చర్యముగొల్పుచున్నది. పూవుదండయనుకొన్నది పామయినది. ఇంద్ర

మ్మనుటకు నీవెవ్వఁడవు? ఈరాజ్యము నీయబ్బసొమ్మా? నీతాతసొమ్మా! నాయన్నరాజ్యము. నాతండ్రిరాజ్యము. మాయన్న చెవులలో విసము నోసి నాఁడు నన్ను వెడలఁగొట్టించి నేఁడును నట్టియాటలే యాడఁజూచితివి. నీయాట లంతమొందుసమయము వచ్చినది. నీమహైశ్వర్యము వెల్లడియగుకాలము వచ్చినది. నీమలినవర్తనపుగోడకు నేఁటిదనుక మాయన్న యనువెల్లవేచి జగద్వంచనముఁ జేసితివి. ఇప్పు డేమిచేసెదవు! కాశ్మీరరాజ్య ప్రధానమంత్రుల భుజములు విఱిచి కట్టఁబడిన దేమి? మీ స్వాతంత్ర్యము లిప్పుడు సాఁగవేమి! ఇప్పుడయిన బుద్ధిగలిగి బ్రతుకుము." అని పలుకఁ యూరకుండ దండపాణి "అయ్యా! మాదాస్య మీమహైశ్వర్యముగా నున్నదా? మేమువిక్రమసేనుని మోసపుచ్చితిమా? ఇంకను మహైశ్వర్యము జూచెదవుగాక నీకన్న మేమెక్కువ వంచకులముగాము. నీవు గావించినద్రోహములకన్న మేమెక్కువ ద్రోహములు చేయఁజాలము. నీవు ద్రోహముల పుట్టవు. నీపితరుల నీవిషయమున దూషింపనవసరములేదు. నీచేసిన యపచారములకిప్పటికి ఫలముగా భగవంతుఁ డీపాట్లుదెచ్చె" నని యతఁడు తన్ను మొదటనాడినమాటల కుత్తరమిచ్చెను.

అప్పుడు మాయన్న నగిము పండ్లూడిపోవుటంజేసి కొంతబోసిగానున్న నోటనుండి కొన్నిమాటలు తెలియుచుండునట్లు వారికిట్లనియె "చిత్రభానుఁడా! పిల్లి కన్నులుమూసికొని పాలుద్రావి తన్నెవ్వరుఁ జూడలేదని సంతసించును. అట్లే నీకావించిన మహాపాతకములు లోకు తెలియఁగరని నీవు భ్రమించి పరమపవిత్రుఁడట్లు నిష్కళంకవర్తనుడట్లు నిరపరాధులగు నితరులపై దోషారోపణముఁ జేయుచుంటివి. నీ వర్తనము చక్కఁగా నరసియే నీయన్న నీవు పాముకన్నఁ దోడేలుకన్నఁ బెబ్బులికన్నఁ గ్రూరుఁడవని నిన్ను దేశభ్రష్టునిఁ జేసెను. నీ సంచారములన్నియు వక్రములు. నీపలుకు లన్నియు ననృతములు. నీ

చైనము లన్నియు దురాచారములు. నీది హృదయము గాదు. రా
తిముక్క. నీ కంతఃకరణము లేదు. దయలేదు. దాక్షిణ్యము లేదు. ఎ
గ్గులేదు. సిగ్గులేదు. ఆశాదేవత నిన్నావహించినది. భ్రాతృహంతవు
ఏకగర్భజనితుఁడైన సోదరుని జంపించిన మహాపాతకునకు ఆనెత్తురు
కూడు భుజించి సుఖింపఁదలఁచిన పరమదుర్మార్గునకు-జగద్వంచనమే
ప్రధానవ్యాపారముగాఁగలఖలునకు నీకుఁ గ్రుడ్డివానికిఁ బట్టపగలుగూడ
నంధకారమయమై తోఁచునట్లు, మావంటి రాజభక్తులు, మావంటి
ధర్మమార్గానుచరులు, మావంటి నిరపరాధులు, దురాచారులుగాఁ
గనఁబడుటలో నాశ్చర్యమేమున్నది? నీవు మీయన్నగారి దారపు
త్రుల బరామర్శించుటకు రాలేదు. ఆపసికూనలం గూడఁ గడతేర్చి
యీగద్దియ నాక్రమింపఁ దలఁచివచ్చితివి. ఆయభిప్రాయముతోనె
యేదో మెఱబెట్టి యీదండనాథుల వశముఁజేసి కొంటివి. ఈసేన
స్వాయత్తము జేసికొంటివి. ఈమూర్ఖులు నీమాయలలోఁబడిరి. సిం
ధుగాంధారరాజుల దండయాత్రాకథలు నీకల్పించిన ప్రబంధములు.
అవియెల్ల నీదు స్తంత్రములు. ఈవంకబెట్టి వీరిం జంకఁ బెట్టుకొంటివి వి
హతవిధి హేమచంద్రునకు, వానికుటుంబమునకుఁ బ్రతికూలుఁడై
యుండుటం జేసి నీయాగడములు సాఁగుచున్నవి. పరమేశ్వరుఁడొక్క
డున్నపక్షమున- నతఁడు దయాళుఁడైన పక్షమున-శిష్టజనసంరక్షణం
బును, దుష్టజనశిక్షణంబును వానికి నైజములైనపక్షమున--ధర్మమనున
దీప్రపంచమున నున్నపక్షమున—"సత్యమేవ జయతే నానృత" మన్న
నువేదవాక్యములు సత్యములైనపక్షమున వేదశాస్త్రంబులుపరిభావం
తములైన పక్షమున నేఁడుగాకున్న మఱియొకనాఁడయిన నీవొనర్చిన
మహాపాతకములకుఁ బ్రతిఫలముగా నీవు భగ్నమనోరథుఁడవై సర్వవి
దములు జెడి నీచమరణంబు నొందకపోవు. నీచేసిన దుశ్చేష్టలు వ్రాయ
జాలక చిత్రగుప్తుఁడు సైతము నీయంతముఁ గోరుచుండును. నీనిమి త్త

పై యమధర్మరాజు క్రొత్తనరకము నిర్మింపవలెను. విక్రమసేనుని గర్భము చెడఁ బుట్టితివి. కాశ్మీర రాజ కుటుంబమునకుఁ గళంకముఁ దెచ్చితివి. హరిశ్చంద్రుఁడు, రామచంద్రుఁడు భీష్ముఁడు, యుధిష్ఠిరుఁడు రఘువు, రంతిదేవుఁడు మొదలగు మహాత్ములైన రాజశ్రేష్ఠులకు జన్మకారణమైన క్షత్రియ వంశము నీవలన నుర్వికి నపహాస్యాస్పద మైనది. చల్లని చంద్రుఁడు పొడమిన పాలసంద్రమునందు హాలాహలము పుట్టినట్లు ధర్మస్వరూపుఁడు హేమచంద్రుఁడు పొడమిన వంశమునఁ బరమనీచుఁడవు పరమపాతకుఁడవు నీవు పుట్టితివి. నీ వెన్ని ధర్మపన్నములు చెప్పిన నమ్మువాఁడఁ గాను. నీయన్న దానికై నాకుఁ గౌరవముగాని భయముగాని లేదు. నీబంట్లు నాకించుకేని కీడు సేయఁగాలు పలేదు." అని యంతతో నాఁగక మఱియు వెండియు నాక్షేపవచనంబులఁ బలుకఁ బోవుచుండ నొకసేవకుఁడు "స్వామీ! వీని కృత్యము సత్కరింతునా? సెలవయిన వీనితల తాటిపండువలె మీ పాదములకడఁ బడవేయుదు. దేవరవారికి వీనియందు నింతశాంతమెందు" కని ఖడ్గపాణియై ముందుకు వచ్చెను. చిత్రభానుఁడు వానిని వారించి "ఓయీ నీభక్తికి సంతసించితిని. బంటువైన నీకున్న భక్తిలో సహస్రాంశము పాపకర్మునకున్న పక్షమున మా రాజ్యమింతయు నేల కొల్లపెట్టును? కాని వీనిని నిప్పుడు చంపవద్దు. ఈచాటుచావు వీనికింతగదు. పట్టణబహిరంగ ప్రదేశమున జెట్టునకుఁగట్టి యురిదీసి మహాపాపమ్ము దినుచుఁ బెరిగిన వీనిమాంసము కాకులు గ్రద్దలు దినునట్లు పిదప కళేబరమును రుద్రభూమిలోఁ బడవేయవలెను. కావున వీనినిప్పటికి రక్షించితి" నని బంటు నావలకుఁ ద్రోసివైచెను.

"ఓహో! నన్నిప్పటికి నీవు రక్షించితివా! దయామయుఁడవు గావున మహోపకారముఁ జేసితివి. నేను మరణమునకు భీతిల్లువాఁడనుగాను. నీవంటిపందలు మరణమునకు వెఱతురు గాని, నేను వెఱువ.

నేనువృద్ధుఁడను. రేపో నేఁడో చావవలసిన వాఁడను. నీచేత జచ్చినను నేఁడో తెగులుచేతఁ జచ్చినను నాకొక్కటే. పరమేశ్వరుఁడు ప్రపంచమున మానవ వినాశముకొఱకుఁ గొన్నితావుల మహామారకములయిన తెవుళ్లను, మఱికొన్నితావుల నీవంటి దురాత్ములను సృజించుచుండును. రోగములును మీవంటివారును సన్నిహితజ్ఞాతులు. జగద్వినాశనమునకై జనియించుచుందురు. నేను మరణించినను జీవించినంతకాలము విశ్వాసముతో స్వామికార్య నిర్వహణ పరీక్షుఁడనగుట చేతను, మనోమాలిన్యము లేక నడచుట చేతను, పరవంచనా విముఖుఁడనగుటచేతను, నాకుత్తమగతులు ప్రాప్తించునని నమ్మికగలదు. జన్మాంతర మొందినను నేను మరల నరజన్మమే పొందుదును. ఇంక నీవు మృతినొందితివేని మహానరకములలో స్త్రీహంతలు శిశుహంతలు గురుహంతలు మాతాపితృభ్రాతృహంతలు మొదలగు మహాపాతకులు పోవుదుర్గతులకుఁ బోవుదువు. ఒకవేళ జన్మాంతర మొందినను, నుత్తమమగు మానవజన్మమెత్తక పాము పెద్దపులి మొదలగు ఘాతుకమృగ జన్మమో లేక, హేయమైన కీటకజన్మమో నీవెత్తుదువు. మరణాంతరమున నాకళేబరమును నీవెక్కడ బాఱవైచినను నాకువిచారము లేదు. నా మాంసము పక్షులు తిని యాఁకలిదీర్చుకొనుటచేఁ "పరోపకారార్థమిదం శరీర' మన్నను మాట యొక్కింత సార్థకమైన దని నేను సంతసింతును. శరీరము భగవానుఁడైన యగ్నిదేవునకాహుతి యైనను మంటిపాలైనను, విహంగములకాహారమైనను, నామనంబునకు విచారంబుగలుగదు. విగత ప్రాణమయిన వెనుక వట్టి కట్టెవంటి యీ దేహమేమైన నేమి! అది నీనైచ్యమునే తెలియఁజేయును. నీదౌర్జన్యమునే ప్రకటించును. నీఘాతుకవృత్తినే వెల్లడించు. నీక్రౌర్యమునె చాటును. అది నేమాడఁబోను.' అని మణివర్మ నిశ్చయముగా నిశ్చలమనస్సుతోఁ బ్రతిభానుని మాలనాడెను."

“ఓహో! నేను పందను. నీవు కంతిసగఁడవు. నీకు భయము లేదు. నిజమే! ఇదియొక్కటియే నీనోట వెడలినసత్యము. నీకు దేవుని భయము లేదు. పాపభయము లేదు. లోకాపవాదభయము లేదు. నీవంటివారికే యుత్తమగతులు వచ్చినపక్షము జారులకుత్తమగతులు చోరుల కుత్తమగతులు, రాజద్రోహుల కుత్తమగతులు, నీవు జేరుదువేని యవియుత్తమగతులన్న నేను గోల్పోవుదును. నీపోకిరితనము మేమెఱుఁగుదుముగాని నీవు ధనమెందు దాఁచితివో చెప్పుము. కాశ్మీరరాజ్యమంతయు దోఁచుకొని నీయిల్లు నిధినిక్షేపములతోఁ నింపితివని వినుచున్నాము. అవియెల్లనిక్కడ గ్రక్కుము.’ అనిచిత్రభానుఁడు వాక్రుచ్చెను.

“నేను ధనము సంపాదించినమాటకల్ల. మానధనము నాకడఁగలదు. యశోధనము కొంతకలదు. ధర్మసాధనమే సాధనము. ఇంతకన్న నాదగ్గఱ ధనము లేదు’ అని మణివర్మ చెప్పెను.

ఆహా! నీకుమానధనములు యశోధనములుగూడ గలవా? భూమిమీఁద నవతరించిన దంభుఁడవే నీవు. ఈయాత్మస్తుతి కేమిగాని ధనమెక్కడనున్నదో చూపుము. చూపవేని నీగ్రుడ్లు దీయించెద. నీనెత్తురు కుక్కలు నాకునట్లు గుఱ్ఱముల గొట్టు కశెలతోఁ జీమలచింతకు నిన్నుఁ గట్టించి కొట్టించెద ఓరీ! జోదులారా! గుడ్డ లాముదములో ముంచి వీనిచేతులకుం గాళ్ళకుం జుట్టి నిప్పంటించుఁడు. అవి కాగడాలవలె వెలుఁగవలయు. అప్పుడుగాని వీఁడుధనము దాఁచినచాటుచోటులు జూపఁడు. నేనన్నంతపని జేయించెద. జాగ్రత్త. నీవు వృద్ధుఁడవని బ్రాహ్మణుఁడవనిచూచువాఁడనుగాను. వజ్రపాణీ! మేడదిగి వెళ్ళి స్త్రీలశరీరములమీఁద నున్న నగలన్నియుఁ దీసికొనిరమ్ము. తమంతట తాము నగలనొసగరేని సాహసికులగు నీబంట్లను వారిమీఁది కం

దేశమును బరరాజులకు విక్రయింపఁదలఁచుచున్నారు. దానికిందగిన సాక్ష్యము నాకడ నున్నది. మాయన్న వారియందే విశ్వాసముంచి చెడియె. మీరును వారినే నమ్మి చెడుచున్నారు. మాయన్నం జంపించిన మహాపాతకుఁడు మణివర్మ. కొన్ని గ్రామముల కాసపడి కొంతధనమున కాసపడి గొప్పబిరుదుల కాసపడి మేటిపదవుల కాసపడి కాశ్మీరమను గోవును కటికవానికమ్మినట్లు సింధుగాంధార రాజుల కమ్మఁ మణివర్మ దలఁచుచున్నవాఁడు. మణివర్మయనగా దేనెబూసినకత్తి. మణివర్మయనఁగా మేఁకవన్నె పులి. మణివర్మయనఁగా బ్రాహ్మణవేషముతో నున్న చండాలుఁడు. మణివర్మ ప్రక్కలోఁ బాము. నీవు బాలుఁడవు. నీతల్లి శుద్ధాంతకాంతగావున మీరిద్దరు వ్యవహారమెట్టిదో యెఱుఁగరు నీవు నీతండ్రివలెనే మాయామనుష్యులను తెలియంగని వాఁడవు ఎవరేమి చెప్పిన నదినమ్ముదువు తెల్లనివన్నియు పాలనియు నల్లనివన్నియు నీళ్ళనియు విశ్వసింతువు. రాజనీతియందు నీవు సంపూర్ణకుశలుండవు గావు పాపము నీకు వయస్సేది! ఒక చెంపగొట్టినఁ బాలు నొకచెంపగొట్టిన నీరు గారు లేఁతప్రాయముగదా! అంతలోనే విద్యాభ్యాసము సమగ్రముగాకుండ జనకునిచావు రాజ్యభారవహనము మనోవ్యథాప్రారంభము మున్నగు నిక్కట్లు గలిగినవి. దేశమిట్టి దుర్దశలో నుండుటచే నిన్న రేయి దుస్తంత్రకారకుఁడును దేశద్రోహియు రాజద్రోహియు నైన మణివర్మను బట్టి బంధించితిని. మాయలాఁడు మాధవసేనుఁడు లేఁడట. వాఁడు వచ్చినతోడనే బంధించెదను. గదాధర శూలపాణులు మణివర్మ శిష్యులై దేశములను మనకు విరుద్ధముగా నడపింపఁ దలఁచుచున్నారని తెలిసి వారినిఁ గూడఁ గారాగృహబద్ధులఁ జేసితి. సింధుగాంధారప్రభువులు చతురంగబలములతో మహాసన్నాహముతోఁ దండువిడిసినను మనకింక భయములేదు. అంతశ్శత్రువులైన మణివర్మప్రముఖులు బంధింపఁబడిరి గావున బాహ్యశత్రువులు సులభముగా నిర్జింపఁబడు

దురు. ఇఁక మీరందఱు గుండెలపైఁ జేతులు వైచికొని హాయిగా నిద్రింపవచ్చును. మన సైన్యమునంతను నేనే నడపి కదనరంగమునకుం గొంపోయి బల్లిదులగు పగతుల జయించి చెల్లాచెదరుగఁ దోలి కాశ్మీర రాజ్యలక్ష్మిని సుస్థిరముగఁ జేసెద. మీరిందే యుండుఁడు. నీవు చేతవిల్లు దాల్పకుండ - జెక్కు చెదరకుండ - మెడలోని పువ్వులదండ యైన నలుగకుండ - మేనం జెమ్మట యైనఁ గ్రమ్మకుండ - నవలీలగ నరిబలంబుల జయింపఁ గలవు మే మందఱము మీ బంట్లము. ఈదండపాణియు వజ్రపాణియు నీకు ద్రోహులు గారు! రాజ్యపరిరక్షణము నిమిత్తము నీనిమిత్తము వారు నన్ననుసరించిరి. నాయన్న రాజ్యము - నాయన్న బిడ్డల రాజ్యము - పరాక్రాంతమగుచుండ నా కన్నులార నట్లు నేనూరక జూచుచుండుటకంత యభిమానహీనుఁడనా? పరాక్రమశూన్యుఁడనా? పుట్టినది రాచపుట్టుక గాదా? మూతిమీఁద నున్నది మీసము గాదా? చేతఁబట్టినది ఖడ్గము గాదా? నాయన్నకు నాకు మనస్పర్థలుండిన నుండుఁగాక! 'మరణాంతాని వైరాణి' యని మహానుభావుఁడైన వాల్మీకి చెప్పియున్నాఁడు. ఆమనస్పర్థలాయనతోనే పోయినవి. పసిబాలురయిన మీ కాపద వచ్చినఁ బ్రతిక్రియ గావింపక నేనూరకుండఁగలనా? మీయాపద నాయాపద గాదా? నీవింక భయపడకుము. శంకవిడువుము. మూర్ఖులు నీకనేకవిధముల దుర్బోధ చేయుదురు. వానిం జెవిపెట్టకుము. నాయుపదేశము మనంబున నిలుపుకొందువేని నీకు లగ్గగు. నాయంతరంగ శుద్ధియు నాధర్మప్రవర్తనము నాసత్కామవ్యాపారము కాలక్రమంబున నీవ యెఱుంగఁ గలవు. ధాత్రి నిష్కంటకము చేసి నీకప్పగించి తపోవనంబున కరుగవలెనని నాసంకల్పము నాకే విధమైన కోరికలు లేవు. సుఖదుఃఖముల ననుభవించితిని. కాశ్మీర రాజ్యము పరహస్తగతము గాకుండఁ జూచుటయే నామనోరథము. కుమారా దీనికి నీవేమందువు?' అని చిత్రభానుఁడు దీర్ఘోపన్యాసము జేయుటయు

విక్రమసేనుఁడు విని యేమనుటకుం దోఁచక పినతండ్రివైపు జూచుచుం డెను. "కుమారా! నీయభిప్రాయ మేమని యతఁడు మరలనడిగెను."

"అయ్యా! నేనేమి చెప్పఁగలను? మీరుపెద్దలు. సర్వధర్మములు తెలిసినవారు. సింధుగాంధారదేశములదండయాత్రలగుఱించియు మను ముందు వానినిమిత్తమై చేయవలసిన ప్రతిక్రియలగుఱించియు ముందు నాతోడ మీరాలోచింపలేదు. మణివర్మప్రముఖులును గారాబద్ధులై జేయునప్పుడు నాచెవిని వేయలేదు. అన్నియు జరిగిన పిదప నన్నడిగిన నేనేమి చెప్పఁగలను? మీరెట్లుండుమని సెలవిచ్చిన నట్లేయుం డెద. ఏమిచేయుమన్నను అది చేసెద. ఈనగరము విడిచిపొమ్మన్న నాత ల్లిని వెంటఁబెట్టుకొని పాంచాలమునకుఁగాని మఱియొకదేశ మునకుఁగాని పోయెద. మీతండ్రియెక్కినగద్దె మీరేయెక్కుఁడు. అంతకు రాజ్యములేయున్నదా! అందఱకైశ్వర్యములేయున్నవా! నాయభిమతమింకొకటిలేదు. మీయిచ్ఛవచ్చిన తెఱంగున మీరు సేయవచ్చును." అని విక్రమసేనుఁడు మొగముచిన్నపుచ్చుకొని యు త్తరము చెప్పెను.

"కుమారా! తొందరపడకుము. మీరు దేశమువిడిచివెళ్ళనేల? మణివర్మప్రముఖులపై నీకు సంపూర్ణ విశ్వాసముగలదు. గావున వారి సంబంధమైన విషయము నీ సమ్మతమని ముందుజెప్పనయితి. సేన లను సేనాపతులను వశము జేసికొంటినని యంటివి. నీపని నిమిత్తము నేను వారి తోడ తెచ్చితినిగాని నాపనికి గాదు. నేను వారిని వశముచే సికొనలేదు. వారికే నేను వశుఁడనైతిని. నీతో జెప్పి చేసినను జెప్పకచేసినను నీపనిచేయుటయే నాకుఁ బ్రధానము. కావున నిదియొకతప్పుగ నెంచకుము. నీవు మీయమ్మతోడ స్థిమితముగా నాలోచించుకొనుము." అని చిత్రభానుఁడు విక్రమసేనుని వీడు కొని కొలువుకూటమునకువచ్చి తన నిమిత్తమై కనిపెట్టుకొనియున్న

సైనికులను సేనాపతులను గలసికొని వారితోఁగూడ కోటవిడిచి స్వగృహంబునకుంబోయెను. దండనాథులు సైనికులు వానికడ సెలవు గైకొని స్వగృహములకుం జనిరి.

అటఁ జిత్రభానుఁడు చన్న పిదప నరవిందాదేవి విక్రమసేనుంబిలిచి యిట్లనియె. "కుమారా! చిత్రభానుఁడు మనయెడ నభిమానముగల వారినందఱ బంధించినాఁడు. సైన్యమును వశపఱచుకొన్నాఁడు. దండనాథులు వానికి వశంవదులైరి. మణివర్మ మొట్టమొదటనుండియుఁ జేసిన యుపదేశము మనముఁ జెవిబెట్టకపోవుటఁ జేసి యింతవఱకువచ్చినది. అతఁడే ఋజుమార్గవర్తనుఁడు. సింధుగాంధారవల్లభులంగూడి యతఁడు దుస్తంత్రములు పన్నెనని మనము నిశ్చయించుట పొరపాటేమో! కాని యాజాబు లతఁడు వ్రాసినట్లె యెవఁడో సృష్టించినాఁడని యాతఁడు మొఱపెట్టుకొన్నను మనము విననైతిమి. ఆతని విశ్వసించినచో నింతవఱకు రాకపోనమో! 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' యను నార్యోక్తి నావంటి బుద్ధిహీనురాలి చేష్టలంబట్టి పుట్టియుండవచ్చును ఈవైపరీత్యమునకు నేనే కారణమునైతిని. బిడ్డా! చేతులార నీభాగ్యమును నేను వెడలఁగొట్టితిని. ఇప్పుడేమి చేయుదుము? మనరాజ్యవ్యాపారము చుక్కానిలేని యోడపగిది నున్నది" అని విచారించుచున్న తల్లిం జూచి విక్రమసేనుఁడు "అమ్మా! నీవు విచారింపవలదు. కార్యములు కన్నీటి కాలువలన మునిఁగిపోవును. కన్నీరు కార్యములను సరిగాఁజూడనియ్యదు. దుఃఖము దుర్బలలక్షణము. ధైర్యమెన్నటికి మునుఁగనినావ. దానినెక్కిన వారుసురక్షితముగా దుఃఖసాగరమీఁది యవ్వలియొడ్డుఁ జేరుదురు. నీవు ధృతిఁదాల్చియుంటివా మేముత్సాహవంతులమగుదుము. నీవు ధృతిదప్పిన మామతిచలించు. కావున ధైర్యము నూఁతగోల విడువకుము." అనిచెప్పి యామెనూరడించెను.

చిత్రభానుఁడు మధ్యాహ్నమున దండపాణి వజ్రపాణులం

బిలిచి "విక్రమసేనుఁడు మాతృభ్రాతృసమేతుఁడై దేశమువిడిచి పాంచాలమునకుం బోయెద నని చెప్పె. అతఁడు గాని వానిపరిజనము గాని చుట్టములు గాని కోట దాఁటి పోకుండ నన్నిద్వారములయొద్ద నన్నిబురుజులయొద్ద ముక్కాకలందేరిన మేటిమగలఁ గావలి యుంచుఁడు. మాధవసేనుని జాడలరయుఁడు. అతఁ డేదో రాజకార్యము మీఁదనే పైకిపోయియుండునని నేఁ దలంచెద"నని చెప్పి వారింబనిచి మణివర్మమాధవసేనులకు బదులుగా నూతనమంత్రుల నియమింపఁ దలఁచి యెవ్వరిని నియమింతుమని గుదిభట్టుతో నాలోచించెను. అతఁడుకొంచెము సేపాలోచించి "నీకుమంత్రులెందుకు? నీవుమహేంద్రుఁడవు. నేనుబృహస్పతి యట్లునకలవిషయముల ధర్మోపదేశముఁ జేయుచుండెద. నామనస్సేనీమనస్సు. నేనునీకు హితమేయుపదేశింతును. నీచేత హితమే చేయింతును. ఒకవేళ మంత్రుల నియోగింపవలసివచ్చిన నిక్కడివారిని నియోగింపకుము. సమర్థులయినయమాత్యులను విదర్భాపురమునుండి రావింతము. ఇక్కడివారు నమ్మఁదగినవారుకారు. నీబుద్ధిబలము వినియోగించి నీవొక్కఁడవేపాలించుచుండుము." అనియుపదేశించెను.

అదిలెస్సగానున్నదని భావించి చిత్రభానుఁడు నాఁడు మొదలుకొని ప్రతిదినముఁ గోటకుంబోవుచుఁ గొలువుకూటమున విక్రమసేనుని గద్దెపైనునిచి ప్రక్కను దానొకచిఱుగద్దియ వేయించుకొని నూర్చుండి దండనాథులను సామంతులను నగరమందలి ప్రధానపురుషులనురావించి కొలువుదీర్చి రాజ్యవ్యాపారములను విక్రమసేనుని పేరం జక్కఁబెట్టఁదొడఁగెను.

ప్రజలలో ననేకులాతనివర్తనముఁజూచి సముచితముగానున్నదని మెచ్చిరి. నగరమందలిసంక్షోభము క్రమక్రమముగా డిందుపడెను. చిత్రభానునిపట్ల దుర్నయమెద్దియులేదని పౌరులుచెప్పుకొన

జొచ్చిరి. వ్యవహారము మిక్కిలికట్టుదిట్టముగా జరుగఁజొచ్చెను. జారులుచోరులుమున్నగు దుండగులు చండశాసనుఁడగు చిత్రభానునకు భయంపడఁజొచ్చిరి. దేశమందు బందిపోటులు మున్నగునల్లరులు క్రమక్రమముగనడఁగెను. అరవిందాదేవియు విక్రమసేనుఁడును చిత్రభానునిమనస్సనియెడు నోడ యేకడకుఁబోవునో యేరేవు జేరునో తెలియక యాతనివర్తనమంతయు నాటక మనియు నభినయ మనియు దలంచుచుండిరి.

మణివర్మకడ విశేషధనముం డని చిత్రభానుఁడు సంపూర్ణముగనమ్మి యతనినెట్లయిన హింసించి యానిక్షేపమును గనుగొనవలెనని ప్రయత్నములుచేయుచుండెను. దండపాణింబిలిచి యొకనాఁడతఁడు మణివర్మను మిక్కిలికఠినముగా హింసించి విత్తంబుదాఁచిన చోటు తెలిసికొమ్మని యానతిచ్చెను. దండపాణి "స్వామీ! ఇంటిలోనేమూలనో యతఁడు సొమ్ముపాతిపెట్టియుండును. కావున మన యిల్లంతయుఁ ద్రవ్వించిచూతము. అక్కడనది కానఁబడనినాఁడు వానిని హింసింపవచ్చు" నని యుత్తరమిచ్చెను. "అదిలెస్సగానున్నదని" యక్కార్యమునకుఁ జిత్రభానుఁ డంగీకరించెను.

మఱునాఁడు ఖనికులచేత నిల్లంతయు నొక్కనిలువులోతు ద్రవ్వించిరి. ఎముకలు మసిబొగ్గులు ప్రాతకుండపెంకులు కొన్ని రాగిశాసనములు మున్నగునవేకానఁబడియెనుగాని యొక్కరూకయైన నచ్చటఁ గనబడలేదు. అవ్వార్త దండపాణి చిత్రభానున కెఱిఁగింప నాతఁడు భగ్నమనోరథుఁడై మణివర్మ మఱెచ్చటనో ధనముదాఁచియుండుననినమ్మి వానిం గ్రూరదండనలపాలు చేసిన నత్తావుబయటబడునని నిశ్చయించెను. ఒకనాఁడుసాయంకాలము చిత్రభానుఁడు దండపాణియు వజ్రపాణియు మఱిపదుగురు భీకరాకారులగు బంటులు మణివర్మయున్న కారాగృహముఁ జొచ్చిరి "నీవార్జించినధనరాసులు

మణులు మొదలగు నమూల్యపదార్థములు నీవెచ్చటదాచితివో చెప్పె దవా లేక దారుణవధపాలయ్యెదవా" యని చిత్రభానుఁడడిగెను.

"ధనిమునాకడ లేదని యిదివఱకే చెప్పితిని నన్ను మీరెంత హింసించినను ఫలితములేగాని నాణెములు నాకడ గ్రహింపలేరు. నెత్తురుచుక్కలేగాని మణులుమీకు దొరకవు. చివికిపోయిన యెముక లేగాని పసిఁడికణికలు మీకు లభింపవు. చర్మమేగాని భర్మము మీకు లభింపదు. ఏదో నంకబెట్టి నన్నుహింసించుటయే మీసంకల్పమైన మీరట్లు చేయవచ్చును. పాపము మూటఁగట్టుకొనుటయే మీకోరిక యైనయెడల నట్లుచేయవచ్చును. అకారణ పాతనము నీయభిమత మేని నన్ను నీయిచ్చవచ్చినట్లు హింసింపవచ్చును. పరమేశ్వరుఁడు సాక్షిగా భూమ్యాకాశములు సాక్షులుగా నే సత్యము బలుకుచుంటిని ధనము నాకడలేదు. నాశరీరము నేనిప్పుడు కింధనముగా మీరిడినను యావజ్జీవము బంధనమునఁ బెట్టినను ధనమూత్రము నేను మీకియ్య జాల" నని యమ్మునిమంత్రి యుత్తరమిచ్చెను.

"వీని ప్రమాణములు నమ్మఁజాలము. వీనికాలు చేతులకు గుడ్డలు చుట్టి కాల్పుఁడ"ని చిత్రభానుఁ డాజ్ఞాపించెను. "అట్లేకాక!" యని మొఱకులగు కుఱకుబంట్లామునుముందు గుడ్డలు తడిపి వానిచేతులకు మోచేతులవఱకుఁ గాళ్లకు మోకాళ్లవఱకుఁ జుట్టిరి. ఒకఁడు సమిధలు వైచి యగ్నిహోత్రము రవులుకొల్పుచుండెను. మణివర్మ లేశమును భయపడక విషాదముంజూపక కూరుచుండి కన్నులు మూసి నమక చమకములతో మహేశ్వరుని లోలోన ధ్యానించుకొనుచు మరణము నకుసిద్ధముగానుండెను. "ఇదే గుడ్డలకు నిప్పంటించుచున్నాము. క్షణములో భస్మమయ్యెదవు. జాగ్రత్త! ధనమెక్కడనున్నదో చెప్పు" మని దుష్కర్ములగు బంట్లు మఱియొకసారియడిగిరి. మణివర్మ ధ్యానపరుఁడై నిరుత్తరుఁడయ్యెను.

"స్వామీ! ముమ్మాటికి నే నేరా? నిప్పుడెటింతునా?" యని చిత్రభానునివంక దిరిగి యొకఁ డడిగెను. చిత్రభానుఁడు దండపాణివంకఁ జూచెను. దండపాణి కప్పని యిష్టము లేకపోయినను దనయేలిక కాగ్రహమువచ్చునేమో యని యతఁడు వలదనఁజాలక వజ్రపాణివైపు జూచెను. ఆయాజానుబాహువులు ముసలితనమందైన వన్నెదఱుగని యాపచ్చని మేను విశాలమై యుప్పొంగు ముడుతలతో నిండియున్న ఫాలభాగమును మాంసహీనములై వ్రేలుచున్న చర్మమును జూడ సేనాపతుల కిరువురకు మనస్సు కరిగెను. వారు చిత్రభానున కుత్తరమీయ కూరకుండిరి.

"చంచలులారా! మీమనస్సులు చలించినవి. మీరు సేనాపతులై పరసేనల రూపుమాపుటకే గాని పరిచితులకడ మీరు పనికిరారు. మోమోటము జాలి మిమ్మేలుచున్నవి. ఓరీ! నీవు బాగుగా మంటజేయుము రా" యని మాటసరిగా ముగించెనో లేదో యంతలో వృద్ధకంచుకియగు జంబుకుఁడువచ్చి "స్వామీ! కర్పూరమంజరి కర్పూరమంజరియని" యేడ్చుచుఁ బలికెను. "ఏమిరా! కర్పూరమంజరి కేమి?" యని చిత్రభానుఁడు తొట్రుపడి యడిగెను. "ఉరిబెట్టుకొనె. ఉరిబెట్టుకొనె" నని వగర్చుచువాఁడు చెప్పెను. చిత్రభానుఁడు భయసంభ్రమములతో విసవిసనడచుచుఁబోయెను. దండపాణియు వజ్రపాణియు వానివెనువెంటఁజనిరి. సేవకులు నాఁడప్పనిచాలించి మణివర్మకట్లు విప్పి తలుపులుబిగించి యావలకుంబోయిరి. వజ్రపాణి జంబుకుని బిలిచి మెల్లగాఁ గర్పూరమంజరి యురివెట్టుకొనుటకుఁ గారణమడిగెను. "చెలికత్తెయైన మల్లిక పెద్దపులిచేఁ బట్టువడి చచ్చిపోవుటచే బెంగపెట్టుకొని యామె మాధవీలతతో మెడకురిపెట్టుకొన్నది" యని యతఁడుబదులుచెప్పెను. "బ్రతికియున్నదా మృతినొందినదా?" యని మరలవానినడిగెను. "ఏమో తెలియదు. మాటలేదు. చూపులేదు. నాడిలేదు. బ్రతికియున్నదో చచ్చిపోయినదో నే నెఱుఁగను" అనివాఁడుత్తరముచెప్పెను.

---

# ఇరువదియొకటవప్రకరణము.

సునంద మతి యించుకేనియుఁ జక్కబడలేదు. ఆమెయున్మాదము నానాటికి హెచ్చుచుండెను. ఇంటనున్న చెంబులు తాను మోయగల చిన్నబిందెలు తననగలు దీసికొనిపోయి యామెదొడ్డిలో నున్ననూతిలోఁ బడవైచుచుండును. అట్లు పాఱవైచెదవేమమ్మా యని సేవకు లడిగినప్పుడు "అయ్యో! కర్పూరమంజరి యెత్తుకొని పోవును. అందుకని దాఁచుచున్నాన" అని బదులుచెప్పును. రమారమి సంవత్సరమువయస్సుగల యామెచిన్నబిడ్డ నొకనాఁడు చంకఁ బెట్టుకొని బావికడకుఁ గొనిపోయెను. వెంటనే పరిచారిక యొకర్తు పరుగెత్తుకొనిపోయి "ఏమమ్మా! బిడ్డ నేమిచేసెదవు?" అనియడుగ "ఓసీ! కర్పూరమంజరి పీసంగిసికొనిపోవును. కాఁబట్టి యీనూతిలో బండుకొనఁబెట్టెద" నని బదులుచెప్పెను. వెంటనే యప్పనికత్తె బిడ్డకుఁ బ్రాణభంగ మగునని యామెచేతిలోనుండి బిడ్డను బలవంతముగా లాగుకొనెను. ఆపెనఁగులాటలో సునంద సేవకురాలిని గట్టిగా గఱచి నాలుగుమూఁడుచోట్ల గాయములు చేసెను. గదిలోఁ బెట్టి తాళమువైచినప్పుడు కడుపునొప్పి వచ్చినదని కాలునొప్పి వచ్చినదని లేనిపోనివంకలు బెట్టి తలుపు దీయుమని పెద్దపెద్దకేకలు వేయును. పరిచారకు లాయఱపుల సరకుసేయకపోయిరేని గదిలోఁ దనతల గోడకుఁబెట్టి గట్టిగఁగొట్టుకొనును. తలుపుదీసినపక్షమున నేదో చెఱుపుజేయుచుండును. రెండుమూఁడుపిల్లికూనలను సేవకులు చూడకుండ నూతిలోఁ బడవైచి చంపెను. ఆమెయవస్థఁజూచి వజ్రపాణి మిక్కిలి ఖేదమునొందుచుండెను. ఎట్టిగట్టివైద్యులచేతఁ జికిత్సచేయించినను నామె యున్మాదము హెచ్చెనేగాని తగ్గలేదు. మనోవ్యాధికి మందు లేదుగదా! రాత్రులు సునంద తాను నిద్రపోవుట లేదు సరేకదా

భర్తృకుం జుట్టుప్రక్కలవారికిఁ గంటిమీఁద గునుకు లేకుండ నడచుచుండును. ఎవరో యెదుట నున్నట్లు భావించి వారితో వాదము సేయుచుండును.

కర్పూరమంజరిని వజ్రపాణి కిచ్చి వివాహముచేయుట నిశ్చయమయినదని యీమెయున్మాదమువల్లనో ప్రధానమయిననాఁడు వచ్చినబ్రాహ్మణులవెంగలితనమువల్లనో యెట్లో పట్టణమునం బొక్కెను. పెండ్లి లేదు. పేరంటము లేదు. ముందుమునుపటిభార్యకు మాత్రము వజ్రపాణి పిచ్చియెత్తించినాఁడు గదా" యని లోకులు చెప్పుకొని చాటుచాటున వాని నెగతాళిసేయఁ జొచ్చిరి. ఎందఱు హసించినను నెంద ఱధిక్షేపించినను మఱెందఱు నిందించినను భార్య యున్మాదిని యైనను గర్పూరమంజరిముఖముఁ దనమనోనేత్రముతోఁ జూచుచు సకలసంతాపహారక మయినయామె దృఢాలింగనము దనకుఁ జేకురినట్లు భావించుచు నప్పుడప్పుడు స్వప్నములలో నామెసమాగమసుఖము క్షణకాల మనుభవించుచు వజ్రపాణి యిల్లాలిదురవస్థ కెడనెడ వగచుచున్నను మొత్తముమీఁద సంతోషముతోడనే దినములు పుచ్చుచుండెను. విశేషించి రాజ్యము చిత్రభానునివశమగుటచేఁ దనకింకను గొప్పపదవులు చేకూరునని యాసపడి యుండెను. కర్పూరమంజరి యురిపెట్టుకొన్ననాఁడు చిత్రభానునివెంట నరిగి యామె బ్రతికియున్నదో లేదో తెలిసికొనుటకును రతీదేవికిఁ బ్రతిరూప మని పేరువడసిన యాకన్నియమేనివన్నియయు ముఖవిలాసమును నొకసారి జూడవలయుననియు నాఁడు భయసంభ్రమములతోఁ బోవుచుండ నంతలో నతనిసేవకుఁడు పరుగుపరుగున వచ్చి వగర్చుచు "మహాప్రభూ! మహాప్రభూ! ఇల్లు— ఇల్లు—" అని యఱచెను. "ఏమియిల్లు! ఏమియిల్లు? వేగము చెప్పుదురా" యని యతఁ డచ్చట నాఁగి యడుగ "మనయిల్లు కాలిపోవుచున్నది స్వామీ! రండి

రండి" యని యేడ్చుచుఁ బలికెను. "అయ్యో! అయ్యో! ఏమిరా యిది" యని వజ్రపాణి యడుగుచు వానిని బ్రశ్నింప నాసేవకుఁడు నడచుచునే వాని కిట్లుత్తరముఁ జెప్పెను.

"స్వామీ! ఏమి చెప్పుదును? సేవకుల కందఱకు నిద్రపట్టినది. అమ్మగారు దీపము చేతఁబుచ్చుకొని మీరు పఱుపులు కట్టించుటకై యీనడుమ దెప్పించిన దూదిబుంగల నంటించినారు. ఇంటిలో నా భాగమంతయుఁ బూర్తిగా నంటుకొన్న తరువాతఁ గాని మా కెవ్వరికి మెలఁకువ రాలేదు. అంతలోఁ జుట్టుపక్కలవారు వచ్చి యిల్లంటుకొన్నదని కేకలువైచిరి. పొగ నలుదెసలం గ్రమ్మెను. మంట లెగసి మిన్నుముట్టెను. మీబిడ్డలం దీసికొని మేము బయటఁబడుటయే మిక్కిలి కష్టమయ్యెను. ఇంటిలోనిసామాను దీయుటకయిన నవకాశము లేకపోయెను. దైవానుగ్రహమువలన బిడ్డలను దేవిగారిని మాత్రము బ్రతికించితిమి. ఆమె నీవలకు రమ్మన్న రాదు. చలిమంట కాగెద నిక్కడ నుండనీయండి యని బలుకఁ జొచ్చెను. చేతులు పట్టుకొని యామెను బలాత్కారముగా నీవలకు లాగితిమి."

ఈసంభాషణము జరుగుచుండఁగనె వారిరువురు వారియిల్లున్నవీధికి వచ్చిరి. ఆకోలాహల మేమని వర్ణింపవచ్చును? ఆకలకల మెంత యని చెప్పఁగలము! అత్తఱి గాలి విసరుగా వీచుచుండుటచే వజ్రపాణిగృహమె గాక నిరుగుపొరుగుననున్న రెండిండ్లు గూడఁ బరశురామప్రీతి యయ్యెను. వజ్రపాణి సర్వస్వము వీతిహోత్రున కేకాహుతియయ్యెను. నగలు నాణెములు చీనిచీనాంబరములు విండ్లు నమ్ములు నమ్ములపొదులు చిత్తరువులు రొక్కము సమస్తము దగ్ధమయ్యెను. ఇదియంతయు దగ్ధమైనను నతఁడు విచారింపకపోవును గాని తనమనోరథము తనపాలిటిచింతామణి తననిధి తననిక్షేపమునైన కర్పూరమంజరియు నురివెట్టుకొని విగతజీవమైనదని యతని కింతింత

యనరాని విషాదము గలిగెను. కర్పూరమంజరి లేకపోవుటచేఁ దన యిల్లుగాలినలోపము భార్య యున్మత్తయయినలోపము ఘోరముగా గనఁబడఁజొచ్చెను. పాప మతనికా రాత్రి పండుకొనుటకుఁ దావు లేదు. మఱునాఁడు పండుకొనుటకు నెలవులేదు. కట్టుకొనుటకు బట్టలులేవు. ఇంటిముందర నిలువఁగానే పిల్లలు తండ్రిం గౌఁగలించుకొని యేడ్చిరి. సునంద భర్తయెదుటకుఁబోయినిలిచి "ఏమండి! బాగున్నదా? మనము క్రొత్తయిల్లు కట్టుకొందము కర్పూరమంజరి రాకుండఁజేసితిని. చూచితిరా" యని నవ్వుచుఁ బలికెను. అతఁ డేమియు ననక స్తంభమువలె నిలబడి తనదురవస్థను దలంచుకొని తన గృహమువలెనే మండిపోవుచున్నతనమనస్సును జల్లార్చుకొనలేక తన యింటియెదుట నున్నయొకయరుగుపైఁ జదికిలఁబడెను. బిడ్డలును వానితోఁ జని యతని కిరుప్రక్కలఁ గూర్చుండి కొంతసే పక్కడనే వట్టినేలఁ బండుకొని నిదురించిరి. తనువొత్తని మెత్తనిపాన్పులనత్తమిల్లు తనబిడ్డలు బెడ్డలుగుచ్చుకొనునట్లు గటికినేలఁబవ్వళించి యొడలెఱుంగక నిదురింపఁజూచి యతఁడుకన్నుల నీరు వెట్టుకొని యిరుగు పొరుగువారి సమాశ్వాసములవలన నూఱడిల్లి పొరుగువారు పాన్పు దెచ్చి పండుకొమ్మన్నను బండుకొనక రేయియెల్ల మేల్కొని తద్గృహమందే దృష్టినిలిపియుండెను. కాలుచున్న యాగృహముఁ జూచుచున్నప్పుడతఁడు తనమనోరథమెల్లనట్లె దగ్ధమయినదని తనయాశలెల్ల బూడిదయైనవని, తనసౌఖ్యములెల్ల నేలపాలయిననని విచారించి తనభవిష్యదవస్థ యెట్లుండునో యనితలపోయఁజొచ్చెను.

అంతలోఁ దెల్లవాఱెను. తొల్లియతిరమణీయముగానున్న తన భవనమొక్క రాత్రిలో భస్మమగుట కతఁడు మిక్కిలి యాశ్చర్యమొందెను. ఆమాఁడినబోడిగోడల నాకాలుచున్న దూలముల నా

వ్రేలుచున్న పెంకుల-నాకూలుచున్న వాసములఁజూచి యతఁడు కాలగతి మిక్కిలిచిత్రమయినదనియు దానికన్న విచిత్రమయినది మఱియొకటిలేదనియు నీశ్వరేచ్ఛ యగమ్యగోచరమనియుఁ బ్రపంచమంతయు వినశ్వరమనియుఁ బెద్దలుచెప్పుమాటల స్మరించుకొనెను.

---

## ఇరువదిరెండవప్రకరణము.

---

సిప్రానది భాగీరథీమొదలగు మహానదులవలె మహావాహిని గాకపోయినను ముక్తిప్రదములయిన నగరములలో నొకటియని పురాణప్రసిద్ధిగాంచి మహాకాళేశ్వరస్వామికి నిలయమై వెలయు నుజ్జయినీనగరమునఁ బ్రవహించుటచే నదియు నొకపుణ్యనదిగాఁ బరిగణింపఁబడుచుండును. ఆకాలమునఁ బ్రతిదినముఁ దీర్థవాసులు వందలకొలందివచ్చి యయ్యేటస్నానముజేసి మహాకాళేశ్వరునిదర్శించి స్థలపురాణమునువిని గతకల్మషులైనట్లు సంతసించి పోవుచుందురు. అయ్యేటియొడ్డున రామణీయకపురాశియనందగుపూఁదోఁటయొకటికలదు. అయ్యలరుదోఁటనడుమఁ గమలాకరంబగు కమలాకరంబొండు నయనోత్సవము చేయుచుండు. దానియొడ్డునఁ జూచువారికన్నులకు విందులుసేయు సౌధమొండునిర్మింపఁబడియె. సిప్రానదీతరంగములఁ గౌఁగలించుకొని యాసంపర్కమునఁ గడుంగడుజల్లనై యటనుండి యెలతోఁటఁజొచ్చి కుసుమపరిమళంబులఁ జూఱఁగొని మెల్లమెల్లగ మలయానిలుఁడుకొలంకుఁజొచ్చి యన్నీటితుంపురుల మేనదాల్చి గవాక్షద్వారమున సౌధంబుజొచ్చి యందున్నవారి నానందపరవశులఁ జేయుచుండును. మాళవరాజనందనుఁడగు మకరందుఁడు తఱచుగా నయ్యుద్యానమున విహరించుచుండును. ప్రాయికముగా నక్కాలంబున

జలకమాడుచుండును. వేమాఱు వేడుకచెలికాఁడు చంద్రచూడునిం గూడి మేడమీఁదఁ గూర్చుండి మలయమారుత సుఖమనుభవించి యుద్యానవనరామణీయకము సందర్శించి కనులం దనుపుకొనుచుండును. వసంతసమయములందును శరత్కాలములందును రాకాచంద్రమండలము నిండువెన్నెలలు గాయుచుప్పుడు నమ్మేడ నంటియున్న పాలరాతి మిద్దెపైఁ గూరుచుండి చల్లనిపండువెన్నెలల సుఖమనుభవించుచుండును.

ఒకనాఁడు కర్పూరమంజరీవిరహమున నతఁడింటికిఁ బోవక నా యెలదోఁటలోనేయుండి సాయంకాలమయినపిదప జగన్మోహనం బగు ధవళప్రభతో నుదయించిన శరత్కాలసంపూర్ణచంద్రమండలమును జూచి దానివలనఁ దనప్రియురాలి మొగంబును బండువెన్నెలలవలన నామెలావణ్యమును స్మరణకురాఁగ మిద్దెపైఁగూర్చుండి "యో చందమామా! మేడమీఁదనుండువారికిఁ గ్రిందివారు సేయు పనులెల్ల నగపడునట్లు గగనప్రాసాదమధిష్టించిన నీకు సకలభూతచేష్టలుఁ గరతలామలకముగదా? నీవుచల్లనివాఁడవు కావున నాగ్రహము లేనివాఁడవు. కాఁబట్టి నినొక్కప్రశ్నయడిగెదను దయచేసిచెప్పుము. నీవు కాశ్మీరమునకరిగితివా? శ్రీనగరముంజూచితివా? అందుమాకర్పూరమంజరి కనఁబడినదా? ఆమెసుఖముగానున్నదా? ఏమి! యుత్తరము చెప్పవు? ఔను నీవేల చెప్పెదువు? ఆమె మొగమునకు నివాళినిచ్చుటకయినను నీనెమ్మొగము పనికిరాదుగదా! కళంకితమైనది నీమొగము. అకళంకమైన దామెవదనము. ఎంతవారికయిననీర్ష్యయుండకపోవునా? అందుచేసిగ్గు పడి నీవామెంజూచియుండవు. నిన్నడిగిన ప్రయోజనమేమి?" అని కాముార్తుఁడు చేతనంబులంబలె నచేతనంబులంగూడ సంబోధింతురను నార్యోక్తి నిజముగఁ జిత్తవికారమున జాబిల్లింజూచి యసంబద్ధప్రలాపములుచేయు మిత్రునిడగ్గరి చంద్రచూడుఁడుమీఁదఁ

చేయివయిచి తట్టి తన మొగము నతని మొగముకడఁ జేర్చి "వయస్యా! ఇదియేమి నీకువెఱ్ఱియెత్తినదా? లేక నీ లేఁదోటలో నేదయ్యమయిన సోఁకినదా? లేక మద్యపానముఁ జేసితివా? చందమామకు నోరున్నదా నాలుకయున్నదా నీవడిగినప్రశ్నల కుత్తరము జెప్పుటకు? చంద్రుఁడనఁగా మన వంటిపురుషుఁడనుకొంటివా? నీవుజ్యోతిశ్శాస్త్రవేత్తవు. చంద్రుఁడనగా సూర్యానువర్తియగుగ్రహమని నీవెఱుంగవా? చాలు చాలు! నేనుహిమవంతునివంటిధైర్యసారముగలవాఁడనుగనుక భయపడ లేదుగాని, మఱి యొకరు నీయసంబద్ధసంభాషణములు విన్న బెదరి మేడదూకి పాఱిపోదురు. 'నీకలాపమింకఁ గట్టిపెట్టు" మని మందలించెను.

అప్పుడు మకరందుఁడు చంద్రచూడుని చేయిబట్టుకొని మెల్లగ సట్లనియె —"మిత్రమా! నీవు నన్నెఱుఁగనివానివలె భాషించెదవేల? స్వప్నముననైన నేను మద్యపానము సేయుదునా? భూతములు పిశాచములు పిఱికివాండ్రపైఁ బడునుగాని నాపైఁ బడవు. కర్పూరమంజరీ వియోగదుఃఖము దుస్సహమగుటచే నేనేమేమో కొన్నియసందర్భములుపలికియుంటిని. దానంజేసి నామతి చలించెనని నీవు శంకింపకుము. ఎంతవారించినను నామనస్సు కర్పూరమంజరీ సమక్షమున కరుగక మానినదిగాదు. దానిమాటలలో నేమితీఁపియున్నదో-దాని మొగమున నెంతయాకర్షణశక్తియున్నదో- దానిసాన్నిధ్యమం దేమివిశేషమున్నదో-దానికన్నులలో నేమివశీకరణప్రభావమున్నదో-నేనెఱుంగనుగాని నామనస్సు వేయిసార్లుపిలిచినను గొలుసులువైచిలాగినను నాకడకు రాకున్నది. అదిదానిమాయలలోఁ బడినది. దాని చెలికత్తెలుపన్నినవలలలో నదితగులుకొనియెంగావలయును! మాటలాడించు శక్తిమనస్సుదిగదా? అదిదగ్గఱలేనప్పుడు-దగ్గఱనున్నను సరిగాలేనప్పుడు నోరుతనయిచ్చవచ్చినట్లు పేలును. చంద్రచూడుఁడా! నీవుచూచి

తివో లేదో, చూచినను మెచ్చితివో లేదో, కాని, కర్పూరమంజరి సౌందర్యము వర్ణనాతీతమని చెప్పుట వ్యర్థము గాదు. దానిసోయగంబుఁ గనువిచ్చి యొక్కసారి జూచునేని గాలకంఠుని కఠోరహుంకారంబున మూర్ఛిల్లి యాతని కంటిమంటల మ్రగ్గిన మదనుఁడు తన నియతిని రతిని విడిచి మరల దాని కొఱకై భూమండలంబున కవతరించి సాంగుఁడై యనంగశబ్దముఁ బోఁగొట్టుకొనఁడే? వసంతుఁడు తాను జూచుభాగ్యముగలవాఁడగునేని చిగురుటాకులు మేనుగాఁ జేసికొని మాధవీలతాదులు కరచరణంబులుగా నిర్మించుకొని పూరసంబులు రక్తంబుగా నమర్చుకొని కలువరేకులు కన్నులుగాఁ గావించుకొని దొండపండులు మోవిగాఁ బెట్టుకొని శుకపికంబులనుండి పలుకులు పుడికిపుచ్చుకొని మాటలుగాఁ జేసికొని మూర్తిమంతుఁడై దన్నువరించుమని దాని యడుగుఁదోయిఁ బడి వేఁడుకొనఁడే? అది నలుకూబరుని కంటఁబడిన గడుముసలిదై శృంగారరస మొల్లఁ గోల్పోయిన రంభను నవ్వులకుం ద్రోసివయిచి జవ్వనియగు నివ్వనజాక్షికై తహతహంబడఁడే? నారిమాటయేల! సంసారములరోసి సౌఖ్యముల బాసి కాంతారాంతరవాసులై గాలియు దుంపలు నాకులు నలములు దిని చెట్లనీడల వసియించుచుఁ జర్మంబులం దాల్చు బ్రహ్మజ్ఞాన సంపన్నులైన మహాత్ములు సైతము పల్లమునకుం బోవునీరుపగిది జపములు తపములు చాలించి నిష్ఠలు నీటఁ గలిపి దాని వెంటంబడరే! ఆ చక్కఁదనముఁ గవులు వర్ణింపఁజాలరు. చిత్రకారులు చిత్రింపఁజాలరు."

అనుచుండఁ జంద్రచూడుఁడు "మిత్రమా! ఆమెకై నీవింత తహతహఁ బడుచుంటివి. నిన్నామె వలచునా? లేక యిది చదువుదండుగ భాగవతమా?" యనియడిగెను. "మిత్రుఁడా! ఆప్రశ్నకు నే నుత్తరము జెప్పఁగలనా? నా చక్కఁదనము, నా తెలివితేటలు, నా జవ్వని యడుగుఁదామరలకు దాస్యము చేయుటకయినఁ దగవని నేఁ దలంచెద.

ఎందఱు రాజకుమారు లామె కేలువట్ట యత్నించుచున్నారో యెందఱు నృపకుమారుల దూతలామెకడ దర్శనముగాక వేచియున్నారో యెందఱు లేఖలను వ్రాసి విజ్ఞాపనము లంపుకొనుచున్నారో, యెందఱు దానితండ్రిం బతిమాలుచున్నారో యెందఱుదాని బొందుగూర్పుమని దానిచెలికత్తెలకు లంచములిచ్చుచున్నారో యెందఱామె మనఃప్రీతికై కట్నములు కానుకలు నంపుచున్నారో, యెందఱామెచేఁ దిరస్కృతులై లజ్జావశంబునఁ దలయెత్తుకొనలేక యున్నారో, యెందఱామె సమాగమముఁ దమకు లభించునని యువ్విళులూరుచున్నారో! నన్నా యామె వలచుట? నాకా యాసమాగమ సౌఖ్యము గలుగుట! నేనా యంతపుణ్యముచేసినవాఁడను? మిత్రుడా! మనస్సుకున్న వేగము మనుష్యునికేలయుండగూడదు! తిరస్కరిణీవిద్యాప్రభావము నేఁడు కలియుగమందున్నపక్షమున దేవదూతవై నలుఁడు పరులకంటఁ బడకుండ విదర్భాపురముఁ జొచ్చి దమయంతీసమాగమముఁ బడసి యామె కర్ణంబున నేత్రంబులను సంభాషణంబున శ్రవణంబులను ధన్యంబులఁ జేసికొనినట్లు నేనును బ్రియురాలిదర్శించి నాన యనశ్రవణంబులఁ జరితార్థములఁ జేసి, ననే? చిలుకవారువము నెక్కు చిగురువిలుతుఁడును, గరుడగమనుఁడగు కమలలోచనుఁడును నెంత ధన్యులోగదా? క్షణములోఁ గామితప్రదేశంబులకరిగి కృతార్థులవుచుందురు గదా! మానవునకేశక్తియు లేదుగదా! మనుష్యుని దౌర్బల్యమిట్టివిషయముల స్పష్టముగఁ గనఁబడుచుండును. ఆమెచిత్తవృత్తి యెట్లున్నదో తెలియదు. మిత్రుఁడా! నీవు మాఱువేసమున శ్రీనగరమునకుఁబోయి తెలిసికొనలేవుగదా!" అని మకరందుఁడు పరిపరివిధములఁ బ్రియురాలిచక్కదనముఁ దలంచి గుణములఁ దలంచి తనకామెనుసంప్రాప్తించువిధ మెఱుఁగక వ్యథలుపడుచుండ మిత్రుఁడగుచంద్రచూడుఁడు వానివిరహసంతాపముం జూచిపరిహసించుచు నిట్లనియె.

"వయస్యా! నీవు లేదన్నను నేను నమ్మఁజాల. నీతల చెడిపోయినది. ఏదో పిశాచము నిన్నావహించినది. తోఁటలలో దొడ్లలోనపరాహ్ణ మనక యర్ధరాత్రి మనక తిరుగఁగూడదు. నీకు భూతవైద్యము చేయింపవలెను. లేనిచో నిటువంటిపిచ్చియేమిటి? ప్రపంచములో నామెకన్న నందగత్తియ లేదందువు. ఆమెతల దన్నినవా రెందఱో యుండవచ్చును. కాదాయనంటె కొంచెమెత్తుతోలు. ఆలుచిప్పలవంటికన్నులు. ఈమాత్రిపువారు లోకముననుండకపోరు. తావలచినది రంభ తామునిఁగినది గంగ యన్నట్లు నీకంటికామె రంభలాగు మేనకలాగు కనఁబడుచున్నది. ఆమె నిన్ను మెచ్చకపోయినయెడల మఱియొక దానిని పెండ్లిచేసికొనవచ్చునులే. పెండ్లాలు దొరకకపోరు. నావంటి దరిద్రునకు వివాహముగాదుగాని నీకేమితక్కువయ్యా! ఈమెదాఁటి పోయినయెడల నేనేవెళ్ళి మఱొకదానిని గుదిర్చెదనులే." అనవుడు మకరందుఁడు "మిత్రుఁడా! వలపెట్టిదో యెఱుఁగని ఘోటకబ్రహ్మచారికి నీకు సుందరాంగులను మెచ్చుకొనుటగూడ దెలియునా! వలపులోని తీపి నీకపరిచితంబు గొడ్రాలు ప్రసవవేదన నెఱుఁగనట్లు బ్రహ్మచారి విరహతాపము నెఱుఁగఁజాలఁడు. ఆయెలనాగ నాకుఁజేకుఱదేని నేను జన్మాంతముదాఁక బ్రహ్మచారినై యుండెద. కాని మఱియొకదాని కేలువట్టుఁ*" అని మఱియేమో చెప్పఁబోవుచుండ నంతలో సేవకుఁడరుదెంచి "మహాప్రభో! ఎవ్వఁడో నూతనపురుషుఁడు మీకొఱకై వచ్చియున్నాఁడు" మీదర్శనము గోరుచున్నాఁడు. అని విన్నవించెను.

"పూవుదోఁటలోనున్న నన్ను నడిరేయి వెదకికొనుచువచ్చిన వారెవ్వరు చెపుమా? సరే! తోడ్కొనిరమ్ము" అని మకరందుఁ డానతిచ్చెను. సేవకుఁడా పురుషుని వెంటఁబెట్టుకొని మకరందునిజూపి క్రిందికి దిగిపోయెను. నూతనపురుషుఁడు మకరందునకు వంగి జోహారు చేసి నిలువంబడియెను.

తెల్లని మొగము, తలమీఁద తెల్లనిపాగా, మోకాళ్ళనుదాకు తెల్లని నిలువుటంగీ, పాదములను స్పృశించు తెల్లనిలాగు గల యప్పురుషుని జూచిమకరందుఁడు "మీ రేయూరు? మీ రేమిపనిమీఁద వచ్చిరి" అనియడిగెను. "అయ్యా! నాది కాశ్మీరదేశము. శ్రీనగరము కాఁపురము. నేను చిత్రభానుని సేవకుఁడను. నన్ను జయంధరుఁడంపు రు. ఆయనసందేశము మీకుఁదెచ్చితిని" అని యప్పురుషుఁడు త్తరము జెప్పెను.

"సందేశము నాకా, మాతండ్రిగారికా?" యని యతఁడు మరల నడిగెను. "స్వామీ! మీకే" యని యతఁడు బదులుచెప్ప "సరే! కూర్చుండి వినిపింపు" మని మకరందుఁడు పలికెను. అనవుడు జయంధరుఁడిట్లు విన్నవించెను. "దేవా! చిత్రభానుఁడు కాశ్మీరరాజ్యమును స్వాధీనము జేసికొని పాలింపఁబ్రయత్నించుచున్నాఁడు. అందు మీ సాహాయ్యమును గోరుచున్నాఁడు. అట్లు తోడుపడుదురేని తన కూఁతురు కర్పూరమంజరిని మీకిచ్చి వివాహముసేయఁ దలఁచుచున్నాఁడు." అనుచుండఁ జంద్రచూడుఁ డడ్డమువచ్చి "ఆమె కీతనిపై వలపున్నదా? బలవంతవివాహమా?" యని యడిగెను. నావుడు జయంధరుఁడు వెండియు నిట్లనియె. "స్వామీ! చిత్తగింపుఁడు. ఆమోహనాంగి మిమ్మెగాని మఱెవ్వరిని వివాహమాడదఁట. మకరందుఁడే నాబహిఃప్రాణము. ఆయన నన్ను వివాహమాడఁడేని నేను బ్రహ్మచారిణినై జీవితముగడపెదను గాని మఱియొక రాజకుమారుని కేలువట్టనని శపథంబు జేసెను. మీనిమిత్తమే తపముసేయుచున్నది. ఆమె శ్రీనగరమునను న్నను మనస్సు నిరంతర ముజ్జయినిలో నుండును. విరహతాపమున నామె చిక్కి సగమైనది. రాజకుమారా! మీరు చేపట్టరేని యామె జీవింపదు. ఆశాబంధమే యామెనింతవఱకు నిలిపినది. ఆమె యవస్థఁజూచి తండ్రి మీకడకుఁ నన్నుంబంపెను. మీరామెను

రెండుసారులు చూచియుండిరఁట. వెనుకనొకసారి విదర్భలో జ్వరపీడి తయైనప్పుడు మంచిమందు లిచ్చి బ్రదికించిరఁట. రెండవసారి భిల్లుల బారినుండితప్పించి కాపాడిరఁట. ఆరక్షణమురక్షణముగాదు. నేఁడు గాచుటయే కాచుట. మీహస్తస్పర్శన మామె తాపము జల్లార్చును. మీముఖదర్శన మామె యలమటఁదీర్చును. ప్రస్తుత మామె స్వప్న ములలో మిమ్ము దఱచుగాఁ జూచుటం జేసియు, మీ నామస్మరణం బు గావించుటం జేసియు నామె జపించుచున్నదిగాని లేనిచో నీపాటి కామె మఱియొకలాగైయుండును. మఱియు చెప్పవలసిన విషయము లున్నవిగాని మగవాఁడనగు నేను శుద్ధాంతవాసినియైన యాఁడుదాని గుట్టు నింతకన్న విప్పిచెప్పనొప్పదు. అంతయు నీవే భావించుకొను ము" అని యూరకుండుటయుఁ జంద్రచూడుఁడు "సాహాయ్యము జేయని పక్షమున మీరాజు కూఁతును మకరందున కీయఁడాయేమి?" యని యడుగ జయంధరుఁడు "స్వామీ! అట్టిపరిస్థితి తటస్థించునేని గర్పూరమంజరి చిత్తమెట్లుండునో చెప్పఁజాలను. ఐన నింతవలవంత గల కాంత తండ్రి కిష్టములేకున్నను దానెవ్వరిగూర్చి మేలుపడెనో యాతనినే వరించునుగాని వేఱు తెఱంగునఁ జేయునా?" యని బదులు చెప్పెను.

అదివిని మకరందుఁడు తనలో "హృదయమా! నీకింకను శాంతిఁగలుగదు. ఆయిందువదన హృదయము నిన్నుఁ గలియఁగోరు చున్నది గాని దానిలో నింకను మిషగలదు. తండ్రికి నేను సాయప డినఁగాని యది చేకుఱదు. నేనన్యథా వర్తించితినేని గర్పూరమంజరి చిత్తవృత్తి యెట్లుండునో గదా! దేవుఁడు వరమిచ్చినను నర్చకుఁడు వరమీయఁడన్నట్లు కూఁతు మేలుపడుచున్నను దండ్రి యంతరాయ ముఁగలిఁగింపవచ్చునుగదా! అయినను నామీఁద నామెవలపు నిలిపిన దను చల్లనివార్త శ్రవణానందకరముగా వింటిని. ఇదియేచాలు. ఈ

పునాదిపై నాయాశాసౌధముం గట్టవచ్చును" అని తలంచి బహిరంగముగా నిట్లనియె. "జయంధరా! సాయముచేయుటకుఁగాని చేయక పోవుటకుగాని నేస్వతంత్రుఁడను గాదుగదా! ఇందుకు నాతండ్రిగారు సుదర్శనమహారాజుగారె ప్రమాణము. ఈవిషయమై వారితో నే బ్రసంగించి కర్తవ్యముగావించెద. నీవు మాయతిథివై యుండుము. మాపట్టణమునఁ జూడవలసినవిశేషములఁ జూడుము. కర్పూరమంజరి నన్ను వలచి యనుగ్రహించిన దని శుభవర్తమానము చెప్పుటచే నిదిగో నీహారము నీకుఁ బారితోషికముగా నిచ్చుచున్నాను. గ్రహింపుము."

అనవుడు మహాప్రసాదమని జయంధరుఁడు దానిం గ్రహించి "దేవా! మీకు నాపైఁగలదయకు సంతసించితిని. నేను మీయతిథినై యుండఁజాల. నాకీనగరమునఁ జుట్టములుగలరు. వారికడ నుండెద. సెలవొసంగుఁడు." అని వంగి నమస్కరించి వాని యనుజ్ఞవడసి యచ్చోటు వాసిపోయెను.

అవ్వెనుక మకరందుఁడు చంద్రచూడుంజూచి "మిత్రమా! ఈతనివాలకము చిత్రముగానున్నది. నడక యేఁడుదానినడక. మాట లాఁడుదాని మాటలు పలుకు నప్పుడచ్చముగ నాఁడుదివలె గన్నులు త్రిప్పును. చేతులతో నభినయించును. ముదుకఁడగు బ్రహ్మదేవుఁడు మతిలేక యాఁడుదానింజేయఁబోయి పొరపాటున మగవానిం జేసెఁగాఁబోలు!" నని యామెమాటలచమత్కృతిని సందేశార్థములను దలంచుకొనుచు నారేయిగడపెను.

తెల్లవారెను. మకరందుఁడు రేయియంతయు జాగరము సేయుటచే మిక్కిలి బడలి ప్రజాగరణభారము సడలుటకయి వనలక్ష్మిమించు టద్దమువలె నున్నయక్కొలంకునీట స్నానమాడెను. చంద్రచూడుఁడు మిద్దెమీఁద గొడ్డువలెఁ బండుకొని గాఢముగ గుఱ్ఱుపట్టి నిద్రపోవుచుండెను. ప్రభాకరుని లేతకిరణములునయితమాతనిని మేలు

కొలుపలేకపోయెను. మకరందుఁడు కూర్చుండినను నిలిచియుండినను స్నానమాడుచుండినను, నిటునటు దిరుగుచుండినను నతని మనస్సు సర్వావస్థలయందుఁ గర్పూరమంజరిమీఁదనే యుండెను. ఆమె తన్ను బ్రేమించునో లేదో యని మున్ను సంశయించుచుండెను. ఆమె తన్ను గాటముగా వలచియున్నదని యిప్పుడు తెలిసినను జనకుని నియమమునుబట్టి యామె తనకు దుర్లభురాలని బెంగపెట్టుకొనెను. "ఏమిచేయుదు నిందెవరు నాకుఁ దోడుపడుదు" రని బూవుఁదోఁటలో నడయాడుచుండ సేవకుఁడొక్కఁడు వచ్చి "మహాప్రభూ! నాయన గారి సెలవైనది. దయచేయుఁడు" అని మనవిచేసెను. "ఇదే వచ్చుచున్నా" నని యాతఁడు వానివెంటం జనియె.

సుదర్శనమహారాజు స్నానముజేసి సాగతమతప్రకారము నిర్వర్తింపవలసిన ప్రాతఃకాలకృత్యముల నియమపరతంత్రుఁడై నెఱపి పరిశుద్ధవస్త్రముల ధరియించి యంతఃపురమున రాయబారులకు దర్శనమిచ్చు గదిలో నున్నతాసనంబునం గూర్చుండెను. ఆతని యెట్టయెదుట వృద్ధుఁడైన యొకబ్రాహ్మణుఁడు సముచితంబగు పీఠముపైఁ గూర్చుండి సుదర్శనుఁ డడుగుప్రశ్నలకు త్తరము చెప్పుచుండెను. అంతలో మకరందుఁ డచ్చటికిఁబోయి తండ్రికి నమస్కరించి వానియనుమతిని బ్రక్కం గూర్చుండెను. సుదర్శనుఁడు "కుమారా! మన యెదుట నున్న యాబ్రాహ్మణుఁడు కాశ్మీరరాజమంత్రులలో నొకండగు మాధవసేనుఁడు. హేమచంద్రుని జ్యేష్ఠకుమారుఁడగు విక్రమసేనుని పంపున వచ్చెం జూడవచ్చె. సందేశార్థములన్నియు విక్రమసేనుఁడు వ్రాసి యిచ్చిన లేఖలోఁ గలవు. అది నీవొకసారి చూడు" మని యాజాబతనికిచ్చెను. మకరందుఁడు లేఖ నామూలాగ్రముగాఁ జదువుకొని విషయములన్నియు గ్రహించి మరల దానిని దండ్రిచేతికిచ్చెను. అంతట సుదర్శనుఁడు కుమారు నుద్దేశించి యిట్లనియె. వత్సా! బాలుఁడైన

విక్రమసేనుని జాబు జూచినదిమొదలుకొని నాకడుపు జాలిపెంపున జుమ్మలుచుట్టుచున్నది. హేమచంద్రునిం దలఁచిన నాకిప్పుడు సైతము గంట నీరువచ్చును. అతఁడు నేను సహాధ్యాయులము. అతనివంటి పరిశుద్ధుఁడు లోకమున లేఁడు. మంచితనము మూర్తీభవించినదని చెప్పవచ్చును. అట్టిమహారాజు దుర్మరణము పాలగుటయు, మాయలమారియగు చిత్రభానుఁడు రాజ్యమాక్రమింప దలఁచుటయు, విక్రమసేనుఁడు బాలుఁడగుటయు, దండనాథాది నియోగులు స్వామిద్రోహులగుటయుఁ దలంచిచూడ మనమవశ్యమాతనికిఁ దోడుపడవలయునని దోఁచుచున్నది. ఇంతకన్న హేమచంద్రునకు నేనేమి సాయముచేయగలను? అతఁడు సంతసింపకపోయినను వానియాత్మయైన నాయభిమానమునకు సంతసించును. నీవిందు కేమందువు? ఇదెనీకుసమ్మతమగునేని నేఁడు మొదలు సమరసన్నాహంబుగావించి కతిపయదివసములలోఁ జతురంగబలంబులం దోడ్కొని మనదండనాథుఁడైన కంఠీరవదేవుఁడును, నీవును శ్రీనగరమునకుం బోవలయును. నేనిచ్చటనుండి రాజకార్యముల నడిపెద. అట్లు పోవుటకు నీకిష్టములేదేని సేనాసమేతుఁడనై నేన కాశ్మీరమునకుంబోవుదు. నీవు నగరమునుండి నాస్థానమున రాజ్యపాలనము నెఱపుచుండుము."

అనవుడు తనప్రయత్నమక్కఱలేకయే పితృప్రేరణంబునఁ దాను గాశ్మీరమునకుఁ బోవుటకవకాశము గలిగినదని కర్పూరమంజరీ దర్శనాభిలాష ముందరికిఁ ద్రోయ నతఁడు "దేవా! మీచిత్తమెట్లోయట్లుచేసెద. నన్నుఁబొమ్మన్న నేనపోదు. ఇచట నుండుమన్న నుందు. దేవరవారేప్రమాణము. కాని పెద్దలగుటచే మీరుకదలుటకు వీలులేదు. కంఠీరవదేవునిసాయమున నేనపోయి కార్యంబు నిర్వర్తించెదనని విన్నవించెను. "వత్సా! నాకదిపరమసంతోషము. నీవెంటరత్నసేనుని వానికుమారుఁడగు భద్రసేనుని తీసికొనిపొమ్ము. చంద్ర

చూడుఁడు పిఱికివాఁడు. యుద్ధమన్న వెఱచును. అతఁడు నీతో రాఁడు కావున భద్రసేనుఁడే నీకుచెలికాఁడై హితోపదేష్టయై చేదోడై వాదోడై మెలంగును." అని సుదర్శనుఁ డానతిచ్చెను.

అప్పుడు మాధవసేనుఁడు లేచి చేతులుజోడించి తనకుఁ గావించిన యుపకారమునకుఁ దనకృతజ్ఞతం దెల్పు మనిట్లనియె. "మహాప్రభూ! నేనువచ్చునప్పుడు మీ రేమందురో యని మిక్కిలి సంశయించుచు వచ్చితిని. మీరుబాలుఁడగు విక్రమసేనుని యెడఁ జూపిన దయ నిరుపమానము. మిత్రులన్న నాపద్బాంధవులన్న మీరే. చనిపోయిన మిత్రుని దలంచి చిన్నవాఁడగు, వానికుమారున కెవ్వ రుపకారము సేయుదురు? పరోపకారార్థ మిదంశరీర మను వాక్యము, మీయందు సార్థ మైనది. మారాజుపక్షమున మారాజమాతపక్షమున, సమాత్యుల పక్షమున మీకు నేననేక కృతజ్ఞతాపూర్వకవందనము లాచరించు చున్నవాఁడ. పాంచాలనరపాలుఁడగు మహేంద్రదేవుని దర్శనము చేసివచ్చితిని ఆతఁడు గూడఁ దనకుమారునకు సాయముచేయఁ దలఁచినాఁడు. మీరుభయులు గూడినచో చిత్రభానుని బరాజితుని జేయుట మిక్కిలి సులభము. నాకనుజ్ఞ నొసంగుదురేని మరల బాంచాలమునకరిగి పాంచాలసైన్యములఁ దోడుకొని నేను కాశ్మీరమునకుఁ బోయి మీరాక కెదురుచూచుచుందు" నని వారియనుజ్ఞ గైకొని మాధవసేనుఁడు వెడలిపోయెను.

అతఁడు నిర్గమించుటయు సుకరందుఁడు పరిస్థితు లట్లు మాఱినందుకుఁ దనలో నిట్లువిచారించెను. "ఇప్పుడు నేనేమిచేయుదును! విక్రమసేనునికి సాయముసేయుమని మాధవసేనుఁడువచ్చె. తనకుఁ దోడుపడుమని చిత్రభానుఁడు దూతనంపె. చిత్రభాను పుత్రికయందు నామనసు లగ్నమైయున్నది. ఆమెకై నే నాతనిఁ జేరుట యుక్తముగాదా! కాని ధర్మమాలోచించినపక్షమున బినతండ్రిచే వంచితు

డైన విక్రమసేనునికే నేను దోహపడవలయు. నామనస్సుయ్యేల లూఁగుచున్నది. ప్రాణసఖీసహాగమముఁ గోలుపోవుదునా, ధర్మపరిత్యాగము చేయుదునా? వివాహము లేకపోయినను సరే ధర్మమే నే ననుసరించెద. "యతో ధర్మ స్తతో జయః" యను నార్యోక్తి సార్థకము గాకపోవునా!

---

## ఇరువది మూఁడవ ప్రకరణము.

---

ధర్మదేవత మూర్తీభవించినట్లు చిత్రభానుఁడు కాశ్మీరమునఁ బ్రజాపాలనము సేయుచుండెను. సుప్రభట్టు ప్రజలకు బహిరంగముగ దర్శనమీయక చిత్రభానునకు నన్నివిషయముల దనుజనాయకునకు శుక్రాచార్యులట్లు హితోపదేశము చేయుచుండెను. విక్రమసేన హర్షవర్ధనులకుఁ దనమీఁద నెంతమాత్రము ననుమానము లేకుండునట్లు చిత్రభానుఁడు ప్రవర్తించుచుండెను. రాజకుమారులచేతఁ బగలు విద్యాభ్యాసము చేయించుచుండును. తగినశిక్షకుల నేర్పఱచి సాయంకాలములవారికి విలువిద్దియ నేర్పించుచుండెను. ప్రతికార్యమునందును విక్రమసేనునియాలోచనమడుగుచుండును. సింధుగాంధారవసుంధరాధిపులదండయాత్ర లెందుచేతనో, యాగిపోయెను. రాజ్యనౌకయొక్క చుక్కాని దాను ద్రిప్పుచుండుటచేఁ బరరాజులు భయంపడిరి. దండయాత్రలు మానిరని యతఁడు సైనికులతోడను దండనాథులతోడను, నృపకుమారులతోడను నగరవాసులతోడను పలుమాఱు చెప్పుచువచ్చెను. మణివర్మను మొదటఁ దెలిసికొన్నట్లు చిత్రభానుఁడు ఘన మునిమిత్రము హింసింపలేదు గాని కారాగృహమందు బంధించియుంచెను. అతనికట్టి సౌకర్యములు నొడఁగూర్పఁబడలేదు. స్నానమునకు

జలమైన నతనికి దుర్లభమయ్యెను. దినమున కొక్కసారి జొన్నరొట్టె లభింపఁజొచ్చెను. కటికనేలం బండుకొనుచుండెను. మాసినగుడ్డలైన నుదికించుకొనుట కుత్తరవులేదు. త్రాగుట కొకలయిన మెల్లపదులకు నొక్క మంటిముంతమాత్రము వానికీయఁబడెను. జీవనముకొనయిన నుంచనిచ్చుటకు దండపాణి మాటసాయ్యమె ముఖ్యకారణమై యుండవచ్చును. పురరాలో చనమీఁద దండపాణి కిష్టములేనిపని గావించుట తనకు శ్రేయస్కరము గాదని తలంచి చిత్రభానుఁడు హింసా ప్రకరణముమందే మరలియుండవచ్చును.

చిత్రభానుఁడు వేఁటయందుమిక్కిలి తమకముగలవాఁడు. మృగయాక్రీడయందుఁ దనకుమూఁడవైన విజయసేనునకును విక్రమసేన హర్షవర్ధనులకును నభిరుచి గలిగించెను. వేఁటపేరు చెప్పినవారు మిక్కిలి యుత్సాహముతో వెడలుచుండెడివారు. విక్రమసేనుఁడు చిన్ననాఁట నుండియు మృగయాక్రీడ కలవడినవాఁడగుటంజేసి వేఁటకితఁడు ముందడుగు వేయుచుండెను. రెండుమూఁడుసారులు పినతండ్రి వెంట వారడవులకు మృగయాక్రీడలకరిగి సాయంకాలమున కింటికివచ్చిరి. ఎన్నడో యేదో యపకారము చేయునని మహాభయము బిడ్డలకుఁ దల్లికి నుండినను చిత్రభానుని వర్తనముకొంతవఱకు వారికి నమ్మికఁ గలిగించుచుండెను. అయినను వారు జాగరూకులై యుండిరి.

అట్లుండ నొకనాఁడు చిత్రభానుఁడు విక్రమసేన హర్షవర్ధనులు విజయసేనుఁడు దండపాణి వజ్రపాణులు మఱికొందఱాప్తులుఁ బరివేష్టింపఁ గొలువుండి నగరవాసుల వ్యవహారములఁ దీర్పులు చెప్పుచుండ సూర్యాస్తమయసమయమున జిలుచీఁకటులు పడుచుండ నొకయాఁటవికుఁడు గోచిపెట్టుకొని కంబళి మీఁదఁ గప్పుకొని చేత నొకదుడ్డుకఱ్ఱఁ బట్టుకొని పరుగుపరుగునఁ గొలువుకూటమునొచ్చి "దండాలుసామీ! దణ్ణాలు" అని నేలసాగిలంబడి మొక్కినిలిచెను. "ఎవఁడవు నీవు?

ఏమిపనిమీఁద వచ్చితి" వని చిత్రభానుఁడడిగెను. అందుకువాఁడు ప్రభువుతో నిట్లు మనవిచేసెను.

"నేను గొల్లలచిన్నవాఁడను దేవరా! మంచుకొండదగ్గఱ చాలలమేకలు చిఱుతపులులు సివంగులు పెచ్చుపెఱిఁగి మాపసరములను గసగసనమలివేయుచున్నవిదొరా! పసులమందలుతగ్గిపోయినవి. ఏలినవారు వేఁటలాడి యానుకాలను చంపి మాకింతకూడుపెట్టవలె దేవరా! లేకున్న మేము బ్రతుకజాలము పసరాలే మాసొమ్ములు పసరాలేమా బ్రతుకులు రక్షించు దేవరా! రక్షించు"అని మొఱవెట్టెను.

వాని కుయ్యాలించి చిత్రభానుఁడు కన్నకొడుకును నన్నకొడుకులను జూచి "వేఁటకై యరుగుదమా? గోరక్షణముకన్నఁ బుణ్యకార్యము లేదు. అది యుభయలోకసుఖమైన సత్కర్మ. పాపమీ పేదగొల్లలు మనకవశ్యము రక్షణీయులు." అని యడుగ వారు ముగ్గురు వల్లెయని యుత్సాహముతోఁ బలికిరి. మఱునాఁడుదయమున మృగయాత్రకుఁ గావలసిన సన్నాహమంతయుఁ జేయఁబడెను. ఉరులు, నుత్సులు, వేఁటకుక్కలు, జగుడుగండెలు, దీపములు, బోనులు, విండ్లు, సమ్ములు, బల్లెములు పట్టుకొని వాటినుపయోగించుటయందు నేర్పరులగు వేఁటకాండ్రు మహోత్సాహముతో గొలువఁజిత్రభానుఁడు వేఁటకై బైలుదేఱెను.

"మంచుకొండ చాలదూరము. కొన్ని దినములకుఁగాని వచ్చుటకు వీలులేదు. ఎప్పటివార్త లప్పటికిఁ దెలియవు. మనస్థితి బాగులేదు. ఏపని యెట్టిదో తెలియదు. కావున మీరు పోవలదు. నాయనలారా" యని యరవిందాదేవి బిడ్డలం బతిమాలెనుగాని వేఁట తమకము వారిని ముందుకు గెంటెను. మహోత్సాహముతో ముగ్గురుకుమారు లొకరథ మెక్కిరి. చిత్రభానుఁ డొకరథమెక్కెను. పరివారము వెనుదనడచెను. దండపాణియు స్వల్పసైన్యముతో వారి వెను

వెంట జనెను. ఆబలఁగమెల్ల హిమవత్పర్వతప్రాంతమున కరికి గుడారములలో బసచేసి యైదుదినములు వేటాడి ముక్కడిమెకములఁ జెక్కంటి నుక్కడఁచి గొల్లపల్లియులఁ యిక్కటులఁ దొలగించిరి.

విక్రమసేనుఁడు మూఁడుపులులం గొట్టెను. హర్షవర్ధనుఁడొక్క చిఱుతం జంపెను. విజయసేనుఁడు రెండు భల్లూకములఁ గడతేర్చెను. చిత్రభానుఁడు రెండు సింగంబులం గూల్చెను. దండపాణి రాత్రివేళ మంచెమీఁద బొంచుండి చెఱువులో నీరుద్రావుచుండ గొప్పపులియనుకొని యొకగాడిదను జంపెను. ఐదుదినములు వేటాడి విశ్రాంతినిమిత్తమై వారు గుడారములు విడచి సమీపమున నొక కొండమీఁదనున్న చిన్నకోటలో విడిసిరి. అక్కడ రెండుదినములు గడపిరి. అక్కడి ప్రకృతిసౌందర్య మతిమనోహరముగా నుండెను ఆయున్నతప్రదేశమునుండి చూడఁ బ్రథమచరమసంధ్యారాగముల విశేషశోభాసౌభాగ్యము పద్మరాగమణీయకాంతులను మించి వారి కన్నుదోయి కమితానందముఁ గూర్చెను. ఆకాశము నందుకొనుటకు హిమవంతుఁడు చాఁచినదీర్ఘభాహువులో యన్నట్లు వెలయుమహోన్నత శృంగములతోడను, కొండరాజు తొడిగిన తెల్లని నిలువుటంగీయో యనునట్లు విలసిల్లు మంచుతోడను చేవయు నున్నతియు దట్టమయిన యాకులగలిమియుఁ గలిగి సూర్యరశ్మినడ్డగించు మహావృక్షములతోడను నింద్రధనుస్సువలె నానావర్ణములుగలిగి నలుగెలంకులఁ బరుగులెత్తు విహంగములతోడను, ప్రాయములు నైశ్వర్యములు నిల్లే యతివేగంబునఁ గడచిపోవునని నీతి లోకంబునకుం దెలుపుటకో యనన నతివేగంబున మీఁదినుండి క్రిందికిఁ బ్రవహించు సెలయేళ్లతోడను, కొండగుహలు ప్రతిధ్వనులిచ్చునట్లు బొబ్బలిడు బొబ్బ మెకంబులు బెబ్బులులు మొదలగు ఘాతుకమృగంబులతోడను విండ్లఁ జేబూని మెకంబుల వేటాడుటకయి విసవిస నడచిపోవు వేటకాం

డ్రతోడను, వేటకాండ్ర వెనువెంట వారి కమ్ములనందించుచు నుత్సాహముఁ గలిగించుచు నడచు కిరాతాంగనలతోడను విరాజిల్లు నమ్మంచుగొండం జూచి విక్రమసేనుఁడు మును పెన్నఁడుఁ బట్టణంబులఁ జూచినప్పుడు పొందని మహానందము నొంది తమ్మునకు విజయసేనునకు, వనంబులకు నుపవనంబులకుఁ గలభేదంబు దెలుపుచుఁ దొల్లి యిందే మహేశ్వరుం గూర్చి గౌరి యఖండతపంబు గావించె. ఇందే జగంబులకు మాతాపితలు పురాణదంపతులు నైనపార్వతీపరమేశ్వరులకుఁ గల్యాణమహోత్సవము జరిగె. ఇందే సప్తమహర్షులు ననేక యాగములు జేసి హవిర్భాగములచే వేల్పులం దనిపిరి. ఇందే నరనారాయణ నివాసమైన బదరికాశ్రమ మున్నది. ఇందే గంగానది మొట్టమొదట నెలవు జేసికొన్నది" యని తత్సంబంధములగు పురాణగాథల వర్ణించుచు నా రెండుదినములు గడపెను. రెండవనాఁటి రేయి వారందఱు సుఖముగా భుజియించి ప్రియభాషణంబులు నలిపి పండుకొనిరి. విక్రమసేనుఁడు హర్షవర్ధనుఁడు నొకగదిలో శయనించిరి. చిత్రభానుఁడు విజయసేనుడు మఱియొకగదిలోఁ బవళించిరి. కొలఁది పరివారము నచ్చటనుంచి కార్యాంతరములమీఁద దండపాణి యా సాయంకాలమే పట్టణాభిముఖుఁడై పోయెను.

విక్రమసేన హర్షవర్ధనులు గాఢనిద్రావశులై యెప్పటియట్ల ప్రభాతకాలమున మేల్కొని లేచిరి లేచిచూచునప్పటికి విజయసేనుఁడు చిత్రభానుఁడు వారి కగపడలేదు. ఏఁబదిమంది యాయుధహస్తులయిన సైనికులును తమకు పనులు నుపచారములు మొదలగునవి చేయుటకు నిద్దఱు ముగ్గురు సేవకులు మాత్రము గనఁబడిరి. "పినతండ్రి యెందరిగెనని విక్రమసేనుఁడు సైనికులలోఁ బ్రధానపురుషుఁడగు శక్తివర్మయను వాని నడిగెను. "మహాప్రభూ! ఏదో తొందరపని మీఁద నారు మిమ్ము లేపుటకైన నవకాశము లేక గుమారుని మిగిలిన

పరివారమును వెంటఁగొని నిన్న నడిరేయి పురమునకుం జనిరి. ఇట్లు మీతో మనవిసేయుమని నాకానతిచ్చె" నని యాతఁడు బదులు చెప్పెను.

"ఏమీ! తొందరపనిగలిగినదా? మమ్ము లేపుటకైన నవకాశము లేకపోయినదా? కుమారుని బరివారమును వెంటఁగొని చనెనా! ఆహా! మాయమ్మ పోవలదని చేసిన హితోపదేశమును నేను నిరాకరించి మోసపోతినిగదా!" యని విక్రమసేనుఁడు తమ్మునిఁ జూచి "హర్షవర్ధనా! ఎంతయు మోసము వాటిల్లినది. మనల నిందువిడిచి బుద్ధిపూర్వకముగా విజయసేనునిం దోడ్కొని చిత్రభానుఁడు పురమున కరిగినాఁడు. దురాత్ముఁడను వేఁటకు నే నొక్కఁడను రాక నిన్నుఁ గూడ దీసికొనివచ్చితినిగదా మనరాకకై యెంతో యాతురముతో నిరీక్షించుచుండు మనతల్లి మనము గానఁబడకపోవుటచే నెంతగుందునో, యెంత బెంగపెట్టుకొనునో, యామె చిత్తమెంత క్షోభించునో, ఆమెహృదయము భిన్నముగాకయుండునా! ఇంకనామె యన్నము దినునా? నిదురించునా! మనయది కారాగృహముగాని గృహముగాదు: మనమిఁక మీఁద బందితులముగాని రాజపుత్రులముగాము. ఈఘాతుకకృత్యము చేయుటకే యతఁడీవేఁటపన్నుగడ పన్నినాఁడు. అతని సంకల్పము ముప్పాతిక నెఱవేరినది. మనమిందు దిక్కులేక మనమొఱలువినువారు లేక మనసంతాప మార్పువారులేక మనకోరికల దీర్చువారులేక యీవనవృక్షములట్లు యెన్నఁడో నాశనమొందవలసియుండును. అహా! ఏమిగతి! తమ్ముఁడా నేఁబోయిన విచారములేదు. నీవయిన నమ్మతో నుండిన బాగుండును గదా!" యని విచారగ్రస్తుఁడై పలికెను.

అదివిని హర్షవర్ధనుఁడు "అన్నయ్యా! నీవేలపోవలె నేనెందు కుండవలె నేను నీతోడివాఁడనే. ఉండిన నిరువురముండదము. పోయిన నిరువురము పోదము. నీవుచెప్పినట్లుతల్లి పొందుతల్లడమింతింతగాదు.

ఆమె జీవింపనేజీవింపదు. అమ్మ దూరదృష్టిగలదై యిట్టియాపదల శంకించి మనలం బోవద్దన్నది. మనమామె మాటవిన్నాముకాము. మాతృశాసనతిరస్కారమునకుఁ దగినఫల మనుభవింపవలయును గదా" యని దీనాననుఁడై ప్రత్యుత్తరమిచ్చెను.

ఆదినమునవారు వంటలుచేసి సేవకులుపిలిచినను బతిమాలినను భుజింపలేదు. శక్తివర్మ వారికడఁ జేరి "ప్రభువులారా! భోజనము సేయుఁడు. ఎన్నిదినములు మానెదరు? ఇది యొక్కనాఁటిదిగాదు. మీకిదిశాశ్వతమైనచెఱ. మీరీయిల్లుగదలి యావలికిఁబోకుండ మమ్ము మీపినతండ్రి కాఁపుఁబెట్టెను. నాచిన్నియన్నలారా! అంతటిమహారాజు గర్భమునఁబుట్టి యంతటి మహైశ్వర్యము ననుభవించి తుదకిట్టి దురవస్థపాలయినమిమ్ముఁజూడ మిక్కిలి కఠినుండనయిన నాహృదయముగూడ చలించుచున్నది. మేమేమి చేయఁగలము? సేవకులము. దుర్భరమయిన కుటుంబరక్షణమునకుఁగా శరీరము నన్యుల కమ్ముకొన్నాము. ప్రభువులయాజ్ఞ శిరసావహింపవలయు. లేనిచో మాబుఱ్ఱ లెగిరిపోవును. మాకూఁడు పడిపోవును. కడుపుకక్కుర్తికై ప్రభువుల కడఁగొలువుచేసి యిట్టిదుష్కార్యములు చేయవలసి వచ్చినందుకు మేము మిక్కిలి దుఃఖపడుచున్నాము మాకు స్వాధీనమయిన పనిలేదు. సేవకులంతఃకరణము చంపుకొని గుండెరాయిచేసికొని యుండవలయు మేము మనుష్యులలో లెక్కగాదు. కాబట్టి మమ్ముల క్షమింపుఁడు నాయనలారా" యని కంటనీరు పెట్టుకొనెను.

"శక్తివర్మా! నీవేమిచేయఁగలవు? మేమదృష్టవంతుల మయిన పక్షమున మాతండ్రికట్టి దుస్మరణమేల కలుగును? చిత్రభానున కిట్టి దుర్బుద్ధి యేలపుట్టును? ఒకరిని నిందింపనేల? మాభాగ్యమునే నిందించుకొందుము నీవువిచారింపకుము" అని విక్రమసేనుఁడు వాని నూఱడించెను.

# ఇరువది నాల్గవ ప్రకరణము.

---

చిత్రభానుఁడు వేఁటనుండి కుమారునితోడను బలగముతోడను మరలివచ్చెనని విని యరవిందాదేవి తనకొడుకులుగూడ వచ్చుచున్నారని వారిం జూచి యానందింప నభిలాషపడుచుండ వారెంతసేపటికి రారయిరి. ఆమె సాయంకాలమువఱకు వారినిమిత్తము నిరీక్షించి యాత్రి మంతకంత కెక్కువకాఁగఁ దన నందనులు రాకపోవుటకుఁ గారణమేమో తెలిసికొనిరమ్మని దండపాణియొద్దకు సేవకులఁ బంపెను. తనకావిషయ మెంతమాత్రము తెలియదని యాతఁడు ప్రత్యుత్తరము జెప్పెను. బెంగ యినుమడింపఁ బుత్రవత్సలయయిన యా దేవి నలుగురు బంట్ల నాలుగుప్రక్కలకుం బంపి వేటకాండ్రను దద్విషయమై కనుఁగొని రమ్మని పంపెను. తమకావిషయము తెలియదని వారందఱు చెప్పిరి.

అరవిందాదేవి తొట్రుపాటు వర్ణనాతీతమయ్యెను. అప్పుడామె వృద్ధకంచుకియయిన ముంజునిం బిలిచి చిత్రభానునియొద్దకరిగి తద్విషయ మరసిరమ్మని పంపెను. వాఁడును సత్వరంబ యరిగి యతనికిఁ జోహారొనర్చి వినయపూర్వకముగా రాజకుమారులేల రాలేదని యడిగెను అతనికిఁ జిత్రభానుఁ డిట్లనియె. "కుమారులు సేమముగానున్నారు. మంచుకొండ చరియలలో నొకదానిమీఁద మనోహరమైన కోటఁ గలదు. వారక్కడ గొంతకాలముండి యచ్చటి సౌందర్యము శైల సౌందర్యముఁ జూడవలయునని కోరుటచే వారినక్కడ నుంచివచ్చితిని. భయములేదని మీరాణిగారితోఁ జెప్పుము. పో."

ఆమాటవిని ముంజుఁడు వెంటనే రాజనగరున కరిగి యేమి యుత్తరము వచ్చునోయని తత్తరపడుచున్న రాణికెఱింగించెను. అమ్మాటలు శూలపుంబోటువలె నామెకర్ణములనాఁటఁ జిలువఁజేసె నేల గూలుచుండి "అయ్యో! నర్మదా! నర్మదా! దురాత్ముఁడయిన చిత్ర

భానుఁడు నాకొడుకులఁ గడతేర్చినాఁడేతల్లీ! కటకటా? నాపసిపాపల నితఁడు తకకడుపునఁబెట్టుకొననే. అయ్యో! ఏమిసేయుమనే? నర్మదా! ఏదోఘాతుక కృత్యము జరిగినదే. ఓసీ! నేనునిలువలేను. నా గుండెలు కొట్టుకొనుచున్నవి. మనస్సు మండుచున్నది. ఒడలు వడఁకుచున్నది. తల తిరుగుచున్నది. కన్నులుచీకట్లు గ్రమ్ముచున్నవి. నీవు వచ్చి పట్టుకొనవేనన్ను.ఎవరితోఁ జెప్పుకొందునే? మణివర్మలేఁడు మాధవసేనుఁడులేడు. గధాధర శూలపాణులులేరు. ఎంతదిక్కుమాలినదాన నైతినే! ఇప్పుడేమియుపాయమే ? ఆలోచన చెప్పువారయినలేరే! నీవేమనియెదవే!" యని పరిపరివిధముల నాక్రోశింపఁ దొడఁగెను.

ఆమెదుఃఖముజూచి నర్మదవెఱపుంజాలియు మల్లడిగొన నేమి చెప్పుటకుందోఁచక నెట్లుసమాశ్వాసించుటకు నుపాయము గానక "అమ్మా! నేను పోయి నీమఱఁదిగారిని గనుఁగొని వత్తునా" యని యనెను. "ఓసీ! నీవుకాదు వెళ్ళవలసినది. నన్నేయచ్చటికిఁ దీసికొని పొమ్ము. నేనాయిందుమణి యడుగులమీఁదను గర్పూరమంజరిపాదములయొద్దను బడి నాచిన్నియన్నల నాకర్పింపుమని ప్రార్థించెద. తీసికొనిరా. రథము తీసికొనిరా. జాఁగుసేయకు. నిమేషమాత్రమాలసించితివా యేమిజరుగునో నీవేయెఱుఁగఁగలవు" అని కఠినముగాఁ బలుకుటయు నర్మద యప్పని తప్పదని సారథినొక్కనిం బిలిచి యరదంబు పన్నించి దేవినందుఁ గూర్చుండఁబెట్టి దాను నామెప్రక్కను గూర్చుండెను.

కోటకావలి నిమిత్తము చిత్రభానునిచే నియమింపబడిన యొఱుకజోదులు స్యందనము నిలిపి కోటలోపలికి యావలికెవరింబోని య్యవలదని చిత్రభానునియాజ్ఞ యయినదని దెలిపిరి. అప్పలుకులు విని మహాగ్రహపూరితచిత్తయై కోపావేశంబునఁ బలుకులు తడబ

డు నరవింద రథములోనుండి బిగ్గరగా "ఓరీ! ఎవఁడురా నాస్యందన మాఁపఁగలవాఁడు ? ఈరథ మెవ్వరిదిగా దలంచితివి. హేమచంద్రమహారాజ పట్టమహిషియుఁ గుమార విక్ర సేనుని మాతయునగు నరవిం దదిగా గ్రహింపుఁడు. ఆనయిచ్చుటకుఁ జిత్రభానుఁ డెవ్వఁడు? నిలుపుటకు మీ రెవ్వరు? సూతుఁడా! రథము సాఁగనిమ్ము. ఎవ్వరేనినడ్డమువచ్చిన నేనే రథము దిగి గుఱ్ఱముముందర నడచెద. వారిప్రభువు నాజ్ఞాపరికారము నన్నుం జంపుమనియీబంట్ల తోఁ జెప్పుము" అని పలికెను. భీషణములైన యాభాషణములు ధైర్యశోషణముగావింప నాజోదులు భయకంపితులై యేమియుఁ ననఁజాలక నోర్తిగిలిరి. రథము నిరంతరాయముగ సాఁగి చిత్రభానుని గృహముముందరి కరిగి నిలిచెను. కుమారవియోగ సంజనితమయిన మనస్తాపమున నొడలెఱుఁగక దేవియెదుటనున్న వారెవ్వరో తెలిసి కొనకయే వర్మద దారిజూప సింహద్వారముదాఁటి లోపలికవాటము లుదాఁటి యభ్యంతరమందిరమున కరిగెను. అరిగి "యిందుమణి యెక్కడ? ఇందుమణి యెక్కడ?" నని విచారించి సేవకులవలన నామెయున్న చోటెఱింగి యాతావునకుం జనెను.

అప్పుడు కర్పూరమంజరియు నిందుమణియు నొకమంచముపై గూరుచుండి యేదో మాటలాడుచుండిరి. విజయసేనుఁ డామెరాక జూచి విసవిస మేడమీఁదికరిగి తండ్రి కెఱింగించెను. అరవిందాదేవి తనయింటికి వచ్చునని చిత్రభానుఁడెన్నఁడు దలఁపలేదు. అతఁ డదరి పడెను. రుద్రభట్టు మహాశ్చర్యము నొందెను. వెంటనే చిత్రభానుఁడు మేడదిగి క్రిందికివచ్చెను. అరవిందాదేవి గదిప్రవేశించినతోడనే మహాశ్చర్యముచేఁ గన్నులు పెద్దవిచేసి చూచి యిందుమణియుఁ గర్పూరమంజరియు మంచముమీఁదినుండి దిగ్గునలేచి నిలిచిరి. అర వింద వారియిరువురపాదములపైఁ బడి "అమ్మా! పుత్రభిక్షము పెట్టుఁడు పుత్రభిక్షము పెట్టుఁడు" అని వేఁడుకొనెను.

ఆగోడవ వారేమియు నెఱుంగకపోవుటచే వారిరువురుఁ దెల్ల బోయి చేతులతోఁ నామెనెత్తి "అయ్యో! ఇదియేమివెఱ్ఱి? మాయదు గులమీఁద బడఁజెల్లునా? తల్లీ! మీముందర మేమెంతవారము? బిడ్డలకేమియాపద వాటిల్లెను?" అని తొట్రుపాటుతోఁ బలికిరి. అందు కరవింద వారంజూచి తనకొడుకులు చిత్రభానునితో వేఁటకరుగుట, బలగమంతయువచ్చినను వారు రాకపోవుట, కొండకోటలో నున్నారని చిత్రభానుఁడు చెప్పుట మొదలగు వృత్తాంతమంతయుగద్గదస్వరముతో దుఃఖపూరితయై తెలిపి "తల్లీ! కర్పూరమంజరీ! నీవు నాకన్నకూఁతువుగాకున్నను నిన్నే నాబిడ్డగాఁ జూచుకొంటి. ఇద్దఱు మగబిడ్డలు నాకొక యాఁడు బిడ్డ యని సంతసించుచుంటిని. అమ్మా! నీతమ్ముల రక్షింపుము. తమ్ములం జూపుమని నీ తండ్రి నడుగుము. చూడఁడేని ఇదిగో! నేను రాచకూఁతురను సాహసంబులందు ముందంజవేయువారను. ఇదిగో! నాచిన్నకత్తి మొలలోనున్నది. ఇప్పుడె నీతండ్రి చూచుచుండ నీవు నీతల్లియుఁ జూచుచుండఁ బొడుచుకొని బిడ్డలకు దూరమై, భర్తకు దూరమై, వసుంధరాదేవికిని మీకును భారమైన యీశరీరము మీతండ్రిపాదములయొద్ద విడిచెదను. ఆయన కనులు చల్లఁబడుఁగాక! ఇదివఱకే భ్రాతృహంతయని పేరువచ్చినది. ఇప్పుడు శిశుహంతయౌనాఁడని నాయనుమానము. ఇప్పుడు నాచావుచే నాయన పాపశరీరమునకు మకుటమేర్పడును. బిడ్డా! కర్పూరమంజరీ! పద. నీతండ్రియొద్దకుఁ బద. తల్లీ! యిందుమతీ! పద నీపతికడకు పద" అని మిక్కిలి యార్తయై తీవ్రముగ భాషించెను.

చిత్రభానుఁడు ప్రక్కగదిలోనుండి యప్పలుకులు వినుచుండెను. రుద్రభట్టు వాని ప్రక్కనేయుండి యతని చెవిలో నేదో గుసగుసలాడుచుండెను. కర్పూరమంజరి యామె దీనదశఁ జూచి మెత్తనిచిత్తము మిక్కిలి యుత్తలపాటునొందఁ దత్తఱంబునఁ దండ్రికడ

కరిగి "నాయనా! ఏమిది? తమ్ములేమయిరి? ఎందుండిరి. కుశలముగనున్నారా? ఆమెబిడ్డల నామెకప్పగింపుము. నీకే యపవాద మేల? ఇదివఱకే నీతలపైఁ బడిన లోకాపవాదములు చాలవా? ఆదుర్యశోభారమున నీవేగాక మేముగూడ క్రుంగిపోవుచుంటిమి. ఆయపకీర్తియను నంధకారమువలన మనకులప్రతిష్ఠ నల్లఁబడినది. సత్వర మామెబిడ్డల నప్పగింపుము" అని మందలించెను.

చిత్రభానుఁడు బిడ్డనుడువుల నాలించి "అమ్మాయి! నీతమ్ములు కుశలముగనున్నారు. ఏల యీశకొ తొందర? వారు హేమవత్పర్వతసౌందర్యముఁ జూడ నుబలాటపడుటచే నచ్చట నునిచితిని. పది దినములలో వత్తురు. మహారాజ్ఞి అంతఃపురవాసిని ఈమయేమి, యీరాత్రి తొందరతో వచ్చుటేమి! ఇంత మనక్షోభమెందుకు? ఏమిమునిఁగిపోయినది. ఇప్పుడు కోటకు జనుమనుము" అని నిర్విచారముగ నుత్తరమిచ్చెను.

అదివిని యరవిందాదేవి మహారోషమున నిట్లనియె.- "ఏమి మునిఁగిపోయినదా? నామనస్సు దుఃఖమున మునిఁగిపోయినది. మీ పలుకులు నే నమ్మఁజాలను. ఒకవేళ వారు బ్రతికియేయుండిన వారని నీవు చెఱలో బంధించితివి. అందుకే యమాయకులైన పసిబిడ్డలను మాయమాటలు చెప్పి వేఁటవంకబెట్టి దూరము తీసికొనిపోతివి. నేను రాణినా? నేను రాణినిగాను. నేను నీదాసిని. నా రాణితనము నాఁడేపోయినది. నేను కోటకుంజనను. నాబిడ్డలులేని కోట శ్మశానముగాని కోటగాదు. నాచిన్నియన్నలులేని నగరుఁ నట్టడవిగాని నగరు కాదు. నాబహిఃప్రాణములు లేనియాభవనము సముద్రముగాని భవనము గాదు. ఆకోట నేఁ బ్రవేశింపను. నాబిడ్డలఁ జూచినదాఁక యానగరులో నే నడుగుపెట్టను. నన్నుఁజంపి శవమును శ్మశానమునకయినఁ బంపుము. లేదా నాకొడుకులయొద్దకయినఁ బంపుము. వారింజూడమి

నాకన్నులు వాచిపోయినవి. ఏరీ! నారత్నాలరాసులు? ఏరీ! నాబంగారుబొమ్మలు? ఏరీ! నావరాలకుప్పలు. ఏరీ! నాసింగపుఁగోదమలు. ఏరీ! నాముద్దులమూటలు. ఏరీ! నా గారాల కాణాచులు. చూపవా? ఇదిగో చూరకత్తి పొడిచిచంపు. నీచేతులతోనే నన్ను నాభర్తయొద్దకుఁ బంపు." అని యతని కాళ్లసమీపమున నేలపై సాగిలఁబడెను.

ఆ పలుకులు విన్నవారందఱు భయమున గడగడవడఁకిరి. రాతిగుండెగల చిత్రభానుని మేనుసయితము కంపించెను. "ఇది మనకుఁ దగదు. ఆమెను బిడ్డలయొద్దకైనఁ బంపుఁడు. లేదా, బిడ్డల నామెయొద్దకైనఁ దీసికొనిరండు" అని యిందుమణి చెప్పెను. "తండ్రీ! నాగుండెలు ప్రేలుచున్నవి. నాతమ్ములం దీసికొనివచ్చి యామెకుం జూపుము. నేను వారిం జూడనలఁతు" నని కర్పూరమంజరి జనకునితోఁబలికెను. ఆ పలుకులు విని చిత్రభానుఁడు "ఆమెయు మీరు నింతనిష్ఠురోక్తులు బలుకనేల! ఆమె నిప్పుడె బిడ్డలయొద్దకు బనిచెద. ఉండుఁడు" యని యువ్వాలకుం జని కరటకపింగళులం బిలిచి వారితో నేదో రహస్యములు చెప్పి మరల వచ్చి, యీ సేవకు లిరువురు నీరథముపైనచ్చి నిన్ను నీబిడ్డలున్నచోటికిఁ దీసికొనిపోఁగలరు. వదినె! రథమెక్కుము. నర్మదంగూడ దీసికొనిపొమ్ము నీవు నీబిడ్డలంగలిసి మరల నిక్కడికి సుఖముగా వత్తువుగాక!" అని చెప్పెను.

"నాకిదే మహోపకారము. ఇదేపోయివచ్చెద" నని వారినందఱి నామంత్రణముచేసి యరవిందాదేవి నర్మదంగూడి యరదమెక్కెను. కరటకపింగళులు సారథికిరువంకల నయ్యరదముమీఁదనే కూర్చుండిరి. పయనముసాగెను. కరటకపింగళులు చూపినదారినె సూతుఁడు స్యందనముఁ దోలెను.

అట్లు రెండుదినములు వారు ప్రయాణముచేసి రెండవనాఁటి సాయంకాలమునకు నట్టడవుల నడుమనున్న యొకచిన్న కొండకోటం

చేరిరి. ఆకోటచుట్టుఁ గొండలుగలవు. ఒకటిరెండు చెంచుల పల్లియలు గలవు. "ప్రయాణశ్రమచే మేము మిక్కిలి యలసితిమి రెండుదినము లిక్కడ విశ్రమించి పిమ్మట మీకొండకోటలున్న చోటికిఁ బోవుద"మని కరటకపింగళులా దేవితోఁ జెప్పి మిక్కిలి కష్టముమీఁద నామె నొడంబఱిచిరి. వారక్కడనుండగానే ముప్పదుగురు జోదులు సాయుధులై వచ్చి వారిం జేరిరి. ఈబలగమెందుకని యావింధ్యాదేవి కరటకపింగళుల నడుగ మనము కొండలోనుండి పయనము సేయునప్పుడు మన కంగరక్షగా మీమఱఁది పంపె" నని వారుత్తరము చెప్పిరి.

ఆబలగముచేరిన మఱునాఁటి రేయి నెల్లరు గాఢనిద్రం దగిలి యుండఁ గరటకపింగళులు నిదురించుచున్న సూతుని మెడ కురిబోసి వానిం గడతేర్చి యొకకొండవాఁగునం బాఱవయిచి యారదముమీఁద నెక్కి దాని దోలుకొని శ్రీనగరమునకుం జనిరి, మఱునాఁడు దయమునఁ గరటకపింగళులను సూతునిఁ గానక యావింధ్యాదేవి వారేమయిరని యంగరక్షకుల నాయకుని నడుగ నతండిట్లనియె.

"అమ్మా! ఈకొండకోట మీకుఁ జెఱసాల. మీరిందుండవలయు. మిమ్మిటనుండి కదలనీయఁగూడదని విక్రమభానుఁ డానతిచ్చెను. సూతుఁడేమయ్యెనో మేమెఱుఁగము. కరటకపింగళులు నిన్న రేయి శ్రీనగరమునకుం బోయియుందురు. మీకు గావలసిన సకల పదార్థములు దెచ్చి యీయవలయునని మీమఱఁది యానతిచ్చె. మీకేవికావలయునో యవి నర్మదచేత మాకెఱింగింతు రేని మేమవి తెచ్చి మీకు సమర్పించువారము." అని యున్నదున్నట్లుగ రక్షకనాయకుఁడు పలుక దనకొడుకుల నచిరకాలముననె కలసికొనఁగలుగుదునని పుట్టెడాస పెట్టుకొనియున్న యాదేవి పిడుగడఁచినట్లు నిశ్చేష్టయై నేలంగూలెను. నర్మదయు దుఃఖాక్రాంతమనస్కయై యామెమొగంబునఁ జల్లనినీరు జల్లి సాధ్యములైన శైత్యోపచారములం జేసెను.

అంతం గొంతోకవడి కాదేవి మూర్ఛనుండి మేల్కని "హా! కుమారులారా! మిమ్మింక జూచెడుభాగ్యము నాకులేదు. మీరు జీవించియున్నారను నమ్మికయే నాకుఁబోయినది. ఆదురాత్ముఁడు మి మ్మెమహోపాయములనో కడతేర్చి యుండును. నన్ను మాత్రము చేతులారఁ జంపక మీనిమిత్త మాజన్మాంతము విలపింపుమని నాగరకులు రాని నట్టడవిలోఁ బడవైచె. ఇఁకనేమిసేయుదు? నర్మదా! ఇఁక నీబ్రతుకెందుకే! తీసికొనిరావే విసము! జానెడుత్రాఁడు తేవే! చిన్నకత్తి నా చేతికియ్యవే! నాచిన్నయన్నలారా! అటువంటి ప్రాణేశ్వరుఁడు గతించినను మీరిద్దరు నారెండుకన్నులనుకొని నాబహిఃప్రాణములనుకొని నాకన్నుల చలవమానుమనుకొని నాతపఃఫలములనకొని నేను బోయినమొదల మీరు సుఖములు జరుగవని, నేను ప్రాణేశ్వరునితో సహగమనముచేయక, తరువాతనయిన నసువులు విడువక జీవించియుంటి. ఇఁక నాజీవనమువలనఁ బ్రయోజనమేమి? హా! యెంత దురవస్థ ప్రాప్తించినది. ఓ విధిప్రధానహతక! నాకారాగృహనివాసమునకు నేను విచారింపను. నామరణమునకు నేను చింతిల్లను. రాజ్యము లేదని విచారింపను. సామ్రాజ్యమంతయు నీ వేలుకొన్ననునరే. కోటిసామ్రాజ్యములకన్న నెక్కుడుప్రియములయిన నాగారాబుబిడ్డల నాచిన్నకూనల నాకియ్యరాదా? వారిమొగములే నాకు సామ్రాజ్యసుఖము నిచ్చును. వారిమాటలే నాకు ధనములమూటలు నా తండ్రులారా! జీవించియున్నపక్షమున మీరెంత మరపిల్లుచున్నారో? మీరెంత కష్టపడుచున్నారో! ఆదురాత్ముఁడు మిమ్మెహింసలుపాలు చేయుచున్నాఁడో? జీవచ్ఛవము నయిన నన్నును బరలోకగతుఁడైనమీతండ్రిని దలఁచిమీరెంతగుందుచున్నారో? మిమ్మతఁడు వధించియుండిన బలవన్మరణ సమయమున మీరెంత సంక్షోభించిరో అయ్యో! తనయులారా, పలుకరేమి? నన్ను కౌగలింపరేమి! నాకభ

యమునఁగ రేమి! హర్షవర్ధనా! హర్షము వర్ధిల్లఁజేయవేమి? అయ్యో! హర్షముగాదు — బాష్పవర్షము వర్ధిల్లఁ జేయుచున్నావు. విక్రమసేనా! రావేమి? నాయుంగరదీర్పవేమి? హా, హేమచంద్రమహీపాల! నీబిడ్డలగతి యెట్లయినదో చూడుము" అని విలపించుచు మాటిమాటికి నిట్టూర్పులు పుచ్చుచుఁ జిత్రభానుని దెగడుచు విధిని దూరుచుఁ దనదురదృష్టమును నిందించుకొనుచు బంధువుల సుగుణంబుల నుగ్గడించుచు సౌఖ్యంబుల వర్ణించుచు మూర్తీభవించిన శోకదేవతవలె నా దేవి యాదినము మొదలుకొని యామె యన్నము ముట్టకుండెను. నిద్రపోవకుండెను. నర్మద యాత్మహత్యఁ జేసికొనకుండ నామెను బలుతెఱంగులఁ గాపాడుచుండెను.

అట్లయిదారు దినములు గడచినపిదప నొకనాఁటి నడిరేయి రక్షకభటులు నర్మదయుఁ గడ్డము గాఢనిద్రం గలిగియుండ సమయింగా దేవి చప్పుడుగాకుండ గడియ దీసి తలుపుఁ దెఱచి మెల్లమెల్లగ నావలకుఁజనియెను. తెల్లవాఱుచున్నను నర్మదకు మెలఁకువ రాలేదు. మెలఁకువ వచ్చినయనంతర మామె దేవిం గానక మనంబున కలఁతజెంది నాగృహము నాలుగుప్రక్కల వెదకి కావలివాండ్ర కావార్త నెఱింగించెను. వారుం జుట్టుప్రక్కల కొండలు గుహలు వనములు వెదకి యెచ్చటను నామె యెందుంగానఁబడలేదని చెప్పిరి. నర్మద రాణియవస్థకుఁ దనయేకాకిత్వమునకు బిట్టువగచుచుఁ దన్నువలనఁ బోనిమ్మని కావలివాండ్రను వేఁడుకొనెను. రాజు సెలవులేక యట్లుచేయుటకు వీలులేదని వారు చెప్పిరి. దేవి మతిచెడి తమ్ము బేలుపుచ్చి యర్ధరాత్రమున నెందో యరిగినదని యంగరక్షకులనాయకుఁడు చిత్రభానునకుఁ దెలుపుమని సేవకుల నంపెను.

"నర్మదను విడువవలదనియు నామె యక్కడనే యుండవలసినదనియుఁ జిత్రభానుఁడు మరల వారికుత్తరువులంపెను. పదిదినములు

గడచినపిదప నొకనాఁ డాకెచెంచు దేవి తప్పిపోయిన దని చెప్పుకొను చున్న యంగరక్షకులతో నిట్లనియె. "అయ్యో! ఇక్కడికినాలుగుక్రోసుల దూరమున నొకగొప్పవాఁగున్నది. నేను వేఁటకుఁ బోయినప్పు డందులో నొక యాఁడుదాని శవము గనఁబడినది. మొగము చేఁపలు తినివేయుటచే నానవాలు తెలియలేదు. వ్రేళ్ళుగూడ చేఁపలు కొఱికి వైచినవి. విగ్రహము చక్కనిది. అది రాణిగారి శవము కావచ్చును. మీఁద మీచిత్తము." అని చాఁడెత్తెఁగినఁ నాఁబంటులు బధ్గించి 'ఇప్పుడు శవమును జూడనేల? పోయినదెట్లో పోయినది" యని యూరకుండిరి.

అవస్థలు తప్పినప్పు డెంతవారయినను దమబంటులకుఁగూడఁ జులకనయగుదురుకదా!

---

## ఇరువదియైదవ ప్రకరణము

హేమచంద్రుని కుటుంబమును రాజధానికిఁ బాపి కొండలవాలు గుట్టలపాలుచేసి చిత్రభానుఁడు తాను మునుపు నివాసముచేయుచుండిన గృహమువిడిచి కోటలోఁ బ్రవేశించెను. వేగునకు విక్రమసింహుఁడే రాజని చెప్పుచున్నను నిజముగాఁ జిత్రభానుఁడే కాశ్మీరదేశ మహారాజై రాజ్యవ్యాపారములు యథేచ్ఛముగా, నిరంకుశముగా నిర్భయముగాఁ జక్కఁబెట్టుచుండెను. అంతవఱకు జిత్రభానుని యింటఁ దాఁగియుండి ప్రజలనుఁ జెనవాఁగుము జూపసంతోషించుచుండిన రుద్రభట్టు చిత్రభానుని మంత్రియై సకలకార్యములయందుఁ గర్త కుమద్రష్టయై కొలువుఁదీరి యున్న యెడల నొకప్రక్కను గూర్చుండి సభాసదులయు, రాజుబాంధవులయు మన్ననలువడయుచుండెను. ఆతని మొగము

కంఠధ్వని బాహువులతీరు, కన్నులసోంకము మున్నగువాలో హేమచంద్రుని బేలుపుచ్చిన హరిశర్మ మొగమువలె నున్నదని పోలికలవలనఁ గొందఱుగ్రహించి యట్లుండుటకుఁ గారణమేమని యనుగఁ దలపెట్టిరిగాని చిత్రభానున కందువలనఁ గోపమువచ్చునేమో యని శంకించి యూరకుండిరి. విక్రమసేనహర్షవర్ధను లెందున్నవారని యెట్లున్నవారని యెవ్వరో యెప్పుడేనడుగ వారు మాతృసమేతముగా హిమవత్పర్వతప్రాంతములందలి కొండకోటలో సుఖముగానున్నారనియుఁ బ్రకృతిసౌందర్యము వారిని సమాకర్షించుటచే నచ్చోటువిడిచి రాఁజాలకున్నారనియు నెప్పటివార్తలప్పుడు తెలియుచున్నవనియు నతఁడు చెప్పుచుండెను. అమ్మాటలువిని బంధుగులును ముఖ్యముగఁ గర్పూరమంజరియునమ్మి వారి కేయపాయములేదని భావించుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు వేగులవాండ్రు చిత్రభానునికడకు వచ్చి వానితో నిట్లువిన్నవించిరి. "దేవా! మాధవసేనుఁడు పురికొల్ప మాళవరాజసైన్యములు మనపై దండు విడియుచున్నవి. ఆసేనను వారి సేనానాయకుఁడగు కంఠీరవదేవుఁడు మొనగాఁడై నడుపుచున్నాఁడు. మాళవరాజనందనుఁడగు మకరందుఁడు మీఁదఁ బోవుటకు స్వయముగా నరుదెంచుచున్నాఁడు. ఇరువదివేలు కాల్బలము, ఐదువేలాశ్వికులునేనూరుమహాగజములు వారివెంటవచ్చుచున్నవి. అవిగాక వేనవేలు శిబిరానుచరులు, బహుసహస్రములు పశువులు, పశువులకుగడ్డి సైనికుల భోజనపదార్థములు మితిమీరియున్నవి. వారుజ్జయినిపురము బయలుదేరఁగానే దేవరవారి కావృత్తాంతము దెలియఁజేయ మిక్కిలివేగముగా వచ్చితిమి. మీఁద దేవరచిత్తము."

అనవుడు చిత్రభానుఁడు తుల్లిపడి "ఆలాగా! మనమింక జాగరూకతమై నుండవలయు." నని వారిం బనిచి దండపాణిని వజ్రపాణిని

తక్కిన చమూపతులను బిలువనంపి చారులు తనకు విన్నవించిన వృత్తాంతమంతయు వారికెఱిగించి సమరసన్నాహము చేయింపుమని యానతిచ్చెను.

వెంటనే సేనాపతులు క్రొత్తసైనికులం జేర్చుకొని వారికి పలుదిక్కుల నడ్డి సాంగ్రామికశాస్త్రముసం బరిచితులం జేసిరి. కోట బురుజులు దృఢతరంబుగం జేసిరి. అగడ్తనిండ నీరు నెక్కించిరి. కోటలలో రెండేండ్లు పగతులు ముట్టడించినను సైనికులు చిక్కుపడకుండునట్లు సంభారముల నిలువ జేయజొచ్చిరి. ప్రతికోటయందు ముఖ్యముగ శ్రీనగరకోటయందు శస్త్రచికిత్సకులను నియమించి వారికిం గావలసిన పరికరముల సమకూర్చిరి. ముప్పదివేల కాల్బలము, పదివేలయాశ్విక బలము సహస్రగజబలము నచిరకాలములో సిద్ధమయ్యెను.

చిత్రభానుడు తనయాప్తసేవకుండైన కంటకానిం బిలిచి యిట్లుచెప్పెను. “ఓరీ! విదర్భరాజసైన్యములు మనకుం దోడుపడుటకు బైలుదేరునని చారులు నన్ను చెప్పిరి. నీవు మధ్యమార్గమున వారింగలిసికొని వారు కాశ్మీరమునకు వచ్చుటకుమారుగా మనపక్షమున మాళవదేశముమీంద పంపవలసి యాదేశమును స్వాధీనముచేసికొని సుదర్శనుని సింహాసనభ్రష్టునిం జేయవలయునని చెప్పవలయు. ఇవిగో నా ముద్రవైచినజాబులు. జయంతునకును గ్రిసేనునకు నేనిచ్చుచున్నాండ. వినింగాపోయి వారికిం జూపుము. ఇప్పుడు మాళవదేశమును జయించుట మిక్కిలి సులభము. ఏలయన వారిసేనయంతయు మనమీందికివచ్చుచున్నది. ఉజ్జయినిలో నిప్పుడు బలము స్వల్పముగానుండును. అందుచే నారాజ్య మవలీలగా మనవారిచేతం బడును. నేం జెప్పిన మాటలేగాక నీవును నీబుద్ధికిం దోంచినట్లు సమయోచితములగుమాటలు చెప్పి మనపక్షముగ త్రిప్పినందుకు మాళవరాజునకు బుద్ధివచ్చునట్లు చేయుము. సుదర్శనుడు స్వయంకృతాపరాధఫల మనుభవించుంగాక!

మిక్కిలి వేగముగా నడచు నొంటెపై నెక్కి పదుగురాశ్వికులం దోడు కొని బేహారి వేషమున నీవు పొమ్ము. నీవిపుడు నాకొఱకుఁ బడిన కష్టము లకు నీకు మేము కాశ్మీరమునందో, మాళవదేశమునందో, నీవు కోరు కొన్నచోట నాలుగుమూఁ డగ్రహారము లియ్యఁ దలంచుకొన్నాము. నీవును, బింగళుఁడును నాకు రెండుకన్నులై, రెండుభుజములై, రెండు చేతులై, రెండుకాళ్లై, యుపకరించుటం జేసి నాప్రయత్నములు ఫలోన్ముఖము లయినవి." అని పలుకఁ గరటకుఁడు "స్వామీ! మావ లన నేమున్నది? దేవరవారి యాజ్ఞాబలమే మాచేత నన్నిపనులు చేయించినది. అట్లె పోయివచ్చెద" నని పలికి మఱునాఁడు పయనమై పోయెను.

మకరందుఁడు మహాసేనాసమేతుఁడై యమరానందనుఁడగు భద్రసేనుఁడు తనకు సహకారియై మనోరంజనము సేయుచుండ, చండ శాసనుఁడగు కంఠీరవదేవుఁడు సేనలునడుపు మహాసన్నాహముతో నుజ్జయిని వెడలి కర్పూరమంజరీ సమాగమనాభిలాష తన్నుఁ ద్వర పెట్ట నిరంతర ప్రయాణంబులు సేయుచుండెను.

చిత్రభానుఁడును సంగ్రామసన్నాహములు సేయుచు నొక నాఁటిరేయి రుద్రభట్టుంగూడి కార్యాలోచనము సేయుచు దండ పాణిం బిలువనంపెను. అప్పుడు రెండుజాములరాత్రి యయ్యె. దండ పాణి కోటఁజొచ్చి రుద్రభట్టసమేతుఁడై యున్న చిత్రభానుం జూచి పిలువనంపిన కారణమేమని యడిగెను. చిత్రభానుఁడు కొంచెము సేపు సందేహించి "శంకింపక చెప్పవయ్యా! దండపాణి మనవాఁడే" యని రుద్రభట్టు పురికొల్ప మెల్లమెల్లఁగ నిట్లనియె.

"మిత్రుఁడా! నీసాయమున స్వర్గతుల్యమగు కాశ్మీరదేశము నేఁడు నాపాదాక్రాంతమై యున్నది. నీ తోడ్పాటువలన నే నిప్పుడు రాజమహేంద్రుఁడ నగుటకు సిద్ధముగ నున్నాఁడను. ఇప్పుడు నే నిం

ప్పుడు కత్తియెట్టనిమిత్తమాత్రమో చంపువాఁడు నట్టినిమిత్తమాత్రుఁడే. భగవానుఁడైన శ్రీకృష్ణుఁడు భగవద్గీతలో నీవలెనే కలుకుదనము విడిచి పిఱికితనముఁ బూనిన యర్జునున కేమియుపదేశించెను? నీవు శరీరమునేగాని యాత్మను హింసింపఁజాలవు. ఆత్మకుఁ జావులేదు. దానికి నాశములేదు. శరీర మాత్మతొడిగెడు యింగీ. నరుఁడు ప్రాఁతబట్టల విడిచి క్రొత్తబట్టలఁగట్టుకొన్నట్లు, ప్రాఁతయిల్లు విడిచి క్రొత్త యింటఁ బ్రవేశించినట్లు, మునుపటిదేహమువిడిచి యాత్మ క్రొత్తదేహము స్వీకరించును. బ్రహ్మయీవిధముగా నాశిశువులకిద్దఱకు మరణము విధించెను. విధినిర్ణయ మనతిక్రమణీయము. నీవుగాకున్న మఱియొకఁడైన వారిం జంపును. అకాలమరణము వారి మొగముల మూఁడుబంతుల వ్రాసియున్నాఁడు. అది నీవు తుడిచివేయఁజాలవు. ఈపనిచేసిన నీకు దోసములేదు. ఒకనిశిరస్సు ఖండింపుమని రా జానతిచ్చును. అట్లు ఖండించిన సేవకుని కేమైనపాపముగలదా? పాపముగాని, పుణ్యముగాని యది రాజుదే. అదియునుఁగాక నే నేజంతువును జంపనని నీవు ముక్కుమూసికొని కూర్చుండఁగలవా? వేఁటాడియెన్ని జంతువులం జంపుచున్నావు. నీపొట్టనింపుకొనుటకై యెన్ని మెకముల నెన్ని పులుఁగుల హింసించుచున్నావు! ఎన్ని నల్లులఁ జంపుచున్నావు! జలముద్రాగునప్పు డెన్ని కీటకముల నీవెఱుఁగక మ్రింగుచున్నావు. ఉచ్ఛ్వాసనిశ్వాసములలో వాయువుతోఁగలిసి నీకంటికగపడని పరమాణుతుల్యములగు కీటకము లెన్నివేలు నీకడుపులోనికిఁ బోవుచున్నవో యెఱుఁగుదువా? అదియెల్ల హింసగాదా? హింసలేకుండ నీవుక్షణమయిన జీవింపఁగలవా? ఈవెఱ్ఱిమాటలు విద్వాంసులకడఁ గట్టిపెట్టుము. లోకములోఁ జంపువాఁడు లేఁడు. చంపఁబడువాఁడు లేఁడు. స్వలాభము నిమిత్తమై మనము పేలనుజంపినట్లు నల్లుల నలిపినట్లు—క్రూరమృగములఁ గూల్చినట్లు—మనకడ్డమువచ్చినమానవుల సయితము దయాదాక్షిణ్యములేక జంకుగొంకులేక సంహరింపవలయు."

అనుచుండఁ జిత్రభానుఁ డడ్డమువచ్చి "మిత్రుఁడా! అన్నిటి కేమి! ఈవిషయమాలోచింపుము. విక్రమసేనహర్షవర్ధనులు బ్రతికి యుండిన నేఁడు మాళవరాజు వచ్చుచున్నట్లె మనపైఁ గోపమువచ్చిన ప్పుడు పరరాజులు వారిని గద్దెనెక్కించుటకై వచ్చుచునేయుందురు. వారున్నంతకాలము మనకీ యలజడియున్నదే. వారస్తమించినఁగాని మనకీశ్రమ యస్తమింపదు. అదిగాక యీరాజ్యము నాదియని నీవు తలంపకుము. నేనిప్పుడుగద్దెయెక్కినను వయస్సుమళ్ళినవాఁడనగుటచే నచిరకాలమున మృతినొందుదును. ఆటమీఁద రాజుగావలసినవాఁడు నీయల్లుఁడు విజయసేనుఁడు. ఆబాలకుల సంహరించుట నానిమిత్త ముగాదు. నీయల్లునినిమిత్తము. నీకూఁతురునిమిత్తము. జాగ్రత్తగా నాలోచించుకో! మాళవసైన్యము రాకమునుపే మనమీపనిచేయవల యును. వారి నీలోఁగడ తేర్చితిమా మాళవసైన్యములు తమప్రయ త్నములు వ్యర్థమని మరలిపోవును. ముందువెనుక లాలోచించుకొ నుము" అని కొంతయుత్సాహముతోఁ నచ్చఁజెప్పెను.

రుద్రభట్టు చేసిన తత్త్వోపదేశము కొంతవఱకు దండపాణి మతము మార్చెను. పిమ్మట విజయసేనునిదే కాశ్మీరరాజ్యమని చి త్రభానుఁడు వక్కాణించినతోడనే దండపాణిమనస్సు సంపూర్ణముగ మాఱెను. విక్రమసేన హర్షవర్ధనులు తనయల్లుని సింహాసనారోహణ మున కంతరాయము గలిగించునట్టి కంటకములని వానికిందోఁచెను. ఆత్మలాభపరాయణత వానిమనస్సులోనున్న కృతజ్ఞతను రాజభక్తిని జాలిఁ దోసివైచి యాస్థానము నాక్రమించెను. అతని హృదయ మప్పుడు ఱాయియైపోయెను. అప్పుడతఁడు "సరే! మీచిత్తమువచ్చి నట్లుచేసెద. ఏనాఁడు నేను మీవశము జేసితినో యానాఁడే నాశరీరము గూడ మీపాళము జేసితిని. ఈచేతులు మీవి. వీనిచేత మీయిచ్చ వచ్చినపని జేయించుకొనుఁడు." అని యుత్తరమిచ్చెను.

అప్పుడు చిత్రభానుఁడు, సంతసించి వానిం గౌఁగలించుకొని మిత్రుఁడన్న నీవే మిత్రుఁడవని ప్రశంసించెను. దండపాణి వంటి మనుష్యుఁడు ప్రపంచమున మఱియొకఁడు లేఁడని, రుద్రభట్టు కొనియాడెను. అప్పుడు చిత్రభానుఁడు వెండియు వానికిట్లనియె—"నీవు రేపుదయముననేపొమ్ము. అక్కడ శక్తివర్మ యున్నాఁడు. అతఁడు నీకీవిషయమునఁ దప్పక తోఁడుపడును. వాఁడు మనకు విధేయుఁడు. కార్యసాధకుఁడవయిన నీకు నేను వేఱజెప్పనక్కఱలేదు. నీకు శుభముగఁ గాక! పొమ్ము." అంతట రుద్రభట్టునకు నమస్కరించి చిత్రభానుని కడ సెలవుగైకొని పోయెను.

## ఇరువదియాఱవ ప్రకరణము.

దండపాణి వడిగాఁ బయనముచేసి రాజకుమారులు వసియించుకొండకోటకు మిక్కిలి సమీపముననున్న యొకపల్లియఁ జేరి యందలిగ్రామాధికారియింట విడిసి తనరాక రాజపుత్రులకుఁ దెలియకుండ శక్తివర్మను బిలుచుకొనిరమ్మని యొకసేవకునంపెను. వాఁడును సత్వరమరిగి సేనాధిపతి సెలవయినదని రహస్యముగఁ దెలిపి శక్తివర్మం దోడ్కొనిపోయెను. దండపాణి వానింజూచి సముచితసత్కారములు జేసి పరిజనంబునంతను నావలకంపి వానినొకగదిలోనికిఁ బిలుచుకొని పోయి చిత్రభానుని శాసనంబునఁ దాను గావింపఁదలఁచిన దారుణ కర్మ మతనికెఱిఁగించి తనకుసాయము జేయుమనికోరెను.

ఆపలుకులు చెవినిబడినతోడనే శక్తివర్మ భయంబును విస్మయంబును మనంబునఁ బెనఁగొన దండపాణికిట్లనియె. "అయ్యా! నీవు పిల్లలుగలవాఁడవు. నేనును బిడ్డలంగన్నవాఁడను. కటికవాఁడైనఁ జేయ

వెఱచు నీఘోరకృత్యమును నీవు స్వయముగాఁ జేయ నెట్లువచ్చితివో నేనూహింపఁజాలకున్నాను. మిక్కిలి యల్పపదవిలోనుండి మిక్కిలి యున్నతపదవికి నిన్నుఁదీసికొనివచ్చి నీవృద్ధికెల్లఁగారణమయిన హేమచంద్రునిఁ గలఁచియైన నీపనిమానవచ్చునే బెబ్బులిబారినుండి నిన్నును జలగండమునుండి నీకొడుకును బ్రతికించిన విక్రమసేనుని దలంచియైన నీకౄరకర్మము మానవచ్చునే! అనాథయై దిక్కుమాలి విలపించుచున్న యరవిందాదేవిని స్మరించియైన నీపాపకర్మమునకుం దొలఁగగవచ్చునే. ముద్దులుమూటగట్టు నాబిడ్డలచక్కదనమును సౌకుమార్యమునుఁ జూచియయిన నీదుష్కార్యము విడువవచ్చునే! ఆకుటుంబముతోఁ జిరకాలసంబంధముగలిగి వారివలన బాగుపడిననీకు నిప్పనిసేయుటకు మనసెట్లొప్పెనయ్యా? నీమనస్సొప్పిన నొప్పెఁగాక! ఇట్టి దుష్కార్యమునకునేఁదోడుపడఁజాల. నాయుద్యోగమునుండి నన్ను రాజుతొలఁగించినను సరే — నాకుమరణదండన విధించినను సరే — నే నిప్పనియొల్ల. రాజకుమారవధము జేసి యానెత్తుటికూఁడు దిని మనుటకంటె నాఁకలిచేఁ జచ్చుట మంచిది. చావలేకున్న బిచ్చమెత్తి బ్రతుకుటమంచిది. గోచిపెట్టుకొని యడవిలో ముక్కుమూసికొని తపము సేయుట మంచిది. అంతెగాని యీపనినేఁ జేయఁజాల" నని కూర్చున్నచోటునుండి చివాలున లేచినిలిచెను.

దండపాణియుఁ దనపీఠమునుండిలేచి శక్తివర్మచేయిపట్టుకొని "ఓయీ! నీమాటలఫలమేమో నీ వూహింపలేకున్నావు. రాజాజ్ఞాతిరస్కారము కోడెత్రాఁచుతోఁ జెరలాటమువంటిది. అదికత్తిమీఁదిసాము. నిప్పులు కొంగునఁ గట్టుకొనుట. జాగ్రత! అతఁడలిగెనా నీ శిరచ్ఛేదముఁ జేయింపకమానఁడుసుమీ!" యనిబెదరించెను.

"ఇటువంటి సత్కార్యమున శిరస్సు పోయిననుమంచిదే. నీబిభీషికలకు నేను భయపడువాఁడనుగాను. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో

యట్లు జరుగుఁగాక!" యని శక్తివర్మ యవ్వలకుఁబోయెను. పోయి యతఁడు తనకుఁ బ్రాణమిత్రుఁడు రక్షకభటులలో ముఖ్యుఁడునయిన చండుని బిలిచి తనకును దండపాణికిం జరిగిన సంభాషణమంతయు రహస్యముగ నెఱింగించి కర్తవ్యమేమని యతని యాలోచన మడిగెను. చండుఁడు శక్తివర్మవలెనే దుష్కార్యవిముఖమయిన చిత్తవృత్తిగలవాఁడగుటం జేసి యతఁడు చేసినపని ప్రశస్తముగానున్నదని ప్రశంసించెను. "మిత్రుఁడా నీవు మెచ్చుటం జేసి నాకెంతో ధైర్యము వచ్చినది. అట్లయిన మనకు రాఁదలఁచిన యపాయముఁ దప్పించుటకయి నాకొకయుపాయము దోఁచుచున్నది. అది వినుము" అని శక్తివర్మ చండుని చెవిలో రహస్యముగాఁ గొంతసేపు గుసగుసలాడెను.

అంతలో సాయంకాలమయ్యెను. కాలపురుషుని శరీరమందలి వ్రణమువలె సూర్యబింబమెఱ్ఱనై పశ్చిమాద్రిసంగమమునఁ గానఁబడియెను. ఆవ్రణమునుండి దొరంగు ర్రొన్నెత్తురోయన సంధ్యారాగము కెంపెక్కనై దెసల వ్యాపించెను. వ్రణబాధచేఁ గాలపురుషుండు మూల్గుచున్నప్పుడు గల్గుధ్వనియోయన గూఁడులఁ జేరఁబాఱు పులుఁగులయెలుఁగు లెసంగెను. నెత్తురు గడ్డకట్టి చెదరి కాలపురుషుని పానుపుపైఁబఱచిన నల్లదుప్పటియోయనునట్లు కాఱుచీఁకటులు విశ్వమంతయు వ్యాపించెను. వ్రణసంబంధమయిన దుర్గంధము పొడమకుండ నాపాన్పున వయిచిన హారతికర్పూరపుఁ బలుకులో యనునట్లు నభోభాగమున నక్షత్రములు విరాజిల్లెను.

విక్రమసేన హర్షవర్ధనులు సూర్యాస్తమయమైనతోడనే పరమేశ్వరునిహృదయపీఠమున నునిచి ధ్యానముచేసి మాతృవియోగదుఃఖమున నన్నముసరిగా రుచింపకున్నను నేదోవిధముగా సేవకుల వేఁడికోలుచేఁ గొంచెముభుజించి పడకగదిఁ జేరి యేదోయాలోచించుకొనుచు నొండొరులతోఁ బలుకకయూరకుండిరి. కొంతసేపటికి "తమ్ముఁ

చే మనకష్టములు చాలకాలముండవు. బంధమునుండి గాకపోయినను దేహబంధమునుండి మన కచిరకాలములో విముక్తి కలుగును. అదియును మేలే. ఈజీవన్మరణముకన్న నిజముగా మరణమే మనకు మహోపకారముగావచ్చును." అని విచారించుచు [illegible] చుండ నంతలో దండపాణివీధిగుమ్మముకడకుం బోయెను. సింహద్వారముకడం జండుండు శక్తివర్మయు నేదో మాటలాడుకొనుచుండిరి. దండపాణిం జూచి వారిద్దరు లేచినిలిచిరి. "శక్తివర్మ! నీనిశ్చయము మారలేదు గదా?" యని యతం డడిగెను. "అయ్యా! మిమ్ముల [illegible] ముందువెనుక లాలోచించుకొని నీకుందోడ్పడుటకే నిశ్చయించుకొంటిని. ఇంతకు నాచేసినతప్పు క్షమింపుడు! [illegible] సాయపడుదును." అని శక్తివర్మ బదులుచెప్పెను.

"శహబాస్! మంచిపనిచేసితివి. [illegible] నావెంటరా. తలుపుదీయుము." అని దండపాణి చెప్పగా, అతఁడు శక్తివర్మ తాళముందీసి తలుపు తెఱచెను. రక్షకభటులు [illegible] గాఢనిద్రం దగిలియుండిరి. ఎంతకును శక్తివర్మ [illegible] దండపాణి లోఁ బ్రవేశించి తలుపులుబిగించి "చండుఁడ! [illegible] గోయి ద్రవ్వ సిద్ధముగానుంచుము. [illegible] పెట్టవలయును." అని యాజ్ఞాపించెను. వాఁడట్లు [illegible] దొడ్డిలో నికరిగెను. తలుపుచప్పుడువిని "యిప్పుడిచ్చటికెవ్వరు వచ్చుచున్నారు" అని వారు సంశయపడుచుండ మిణుకుమిణుకుమనుదీపము వెలుఁగున నెవరో మనుష్యులు వచ్చుచున్నట్లు గానఁబడెను. "నేను దండపాణిని; ఇతఁడు శక్తివర్మ" అని కఠినస్వరముతో మాటవినబడెను. "[illegible] ఏమిది మామీఁద నింతదయవచ్చినది? [illegible] సేమమరసి రమ్మని మిమ్ముఁ బంపిరా? లేక [illegible] మీఁద నీప్రాంతములకువచ్చి పూర్వవైరముచే మాకుశల మరయుటకు మీరే స్వయ

ముగా వచ్చిరా? ఎట్లయిననేమి మీరాకవలన మాకిప్పుడు పంచప్రాణములు లేచివచ్చినవి. ఎల్లచుట్టములంజూచినంతయానందము మాకిప్పుడుగలుగుచున్నది. ఓహో! ఇది యెంతసుదినము! నేఁటిప్రాతఃకాలమున మేమెవ్వరిమొగము జూచితిమో కాని మీదర్శన లాభము గలిగినది. రమ్ము! రమ్ము! ఈపానుపుమీఁదఁ గూర్చుండుము. మా యమ్మ సుఖముగానున్నదా? మావియోగదుఃఖమున మేనువిడిచినదా" యని విక్రమసేనుఁడు వానిని సబహుమానముగా గారవించిపలికెను. తల్లి సేమముగురించి యేమిచెప్పనో యని వినుటకై హర్షవర్ధనుఁడు మిక్కిలి తత్తఱపడుచుండెను. అప్పుడు దండపాణి పరుషస్వరముతో "మీయమ్మయెట్లున్నదో నేనెఱుఁగను. ఎక్కడనున్నదో నేనెఱుఁగను. చిత్రభానుఁడుపంపుటచేత నేనిక్కడకు వచ్చితిని." అని బదులు చెప్పెను.

"అహా! మాచిననాయన దయార్ద్రహృదయుఁడై మమ్ముబంధవిముక్తులఁ జేయుమని నిన్నంపెనా? మాకు మేలుదినములు వచ్చినవా? కాని మాయమ్మ యెక్కడనున్నదో నీవెఱుఁగవా? మాతాతమహేంద్రదేవుఁడామెను దీసికొనిపోయెనా?" యని విక్రమసేనుఁడు కొంతసంతోషముతోను గొంతవిచారముతోను బలికెను "ఆహా! దేహబంధ విముక్తులఁ జేయుమని మీచిననాయన నన్నుఁ బంపినాఁడు" అని తనలోననుకొని దండపాణి బహిరంగముగా నిట్లనియె.

"కుమారులారా! నేను మీకిప్పుడు గొప్ప యప్రియము దెలుపవచ్చితిని. నేను మిక్కిలి మందభాగ్యుఁడను. ఘోరవార్త తెలుపుట ఘోరకృత్యముసేయుట నాపాలఁబడినది. ఇది రాజశాసనముగుటచేఁ జేయకతప్పదు. నేను చెప్పుటకెంతో శంకించుచున్నాను——" అనవుడు విక్రమసేనుఁడు చిన్నవోయి మెల్లగా "నయ్యా! మీరుచెప్పఁదలఁచినది చెప్పవచ్చును. చేయఁదలంచినది చేయవచ్చును. మీకార్య

ము వలదనువారు లేరు. అడ్డగించువారు లేరు." అనిపలికెను. హర్షవర్ధనుఁడు నిశ్చేష్టుఁడై కూర్చుండెను. అంతట దండపాణికి విక్రమసేన హర్షవర్ధనులకును నీక్రింది విధముగా సంభాషణజరిగెను.

దండ—కుమారులారా! యీరాత్రి మిమ్ముద్దఱ సంహరింప వలసినదని చిత్రభానుఁడు నన్నుఁబంపె.

విక్ర—ఆఁ! ఆఁ! సంహరింపుమనియె పంపెనా?

హర్ష—అయ్యో! తల్లీ! (అని పాన్పుపై మూర్ఛవోయెను.)

విక్ర—అప్పని చేయనిశ్చయించి నీవువచ్చితివా?

దండ—ఆహా! నిశ్చయించుకొనియే వచ్చితిని. (అని మొలనుండి కత్తిదీసెను.)

విక్ర—ఈఘాతుకకృత్యమును జేయ నీమనసొప్పినదా?

దండ—మనసొప్పిన నేమి, యొప్పకున్న నేమి? రాజాజ్ఞ చేయక తప్పదుగదా?

విక్ర—ఎవఁడు నీరాజు? నేను కానా?

దండ—చిత్రభానుఁడు మారాజు. నీవుకావు. నీవు కారాగృహవాసివి.

విక్ర—ఎవఁడు నన్ను కారాగృహవాసిని జేసినది? ఎవఁడు నన్ను రాజ్యభ్రష్టుఁ జేసినవాఁడు?

దండ—నీపినతండ్రి చిత్రభానుఁడు.

విక్ర—అయ్యో! దండపాణీ! నీనోట నెటువంటి నిష్ఠురోక్తులు వినవలసివచ్చెను. నాతండ్రిమరణమునకుఁ గారణభూతుఁ డయిన మా పినతండ్రిమాయలలోఁ బడి నీవు నీరాజుం జంపవచ్చితివా? చిన్నికుమారులమనియైన సందియము లేదా నీకు? అగతికులమన్న మాటయైన నీకు దోఁచలేదా? నీది హృదయముకాదా? నీవు మానవుఁడవు కావా? ఘాతుకమృగంబవా? దానవుఁడవా? ఘాతుకమృగములు సయితము

తమజాతిమృగముల జోలికిఁ బోవు. దానవులు వైరము లేకుండఁ దమ తోడిదానవులఁ దుదముట్టింపరు. నీకును నాకు నెందైన వైరమున్నదా? నిన్నెన్నఁడైన నే తూలనాడితినా? నీమనసు నొచ్చునట్టి పరుషోక్తులాడితినా? నీకార్యములకు నే నాటంకము గల్పించితినా? ఏల మాపై నీకింత నిష్కారణక్రోధము? ఏల యింతనిర్దయ? నీహృదయము పుష్పసుకుమారమయినదే! ఇంతకఠినమెట్లయ్యెను. ఈ కాఠిన్యముమున్నెన్నఁడు నేఁ జూడలేదే! నామీఁద నీవు చూపెడు నాదయారస మెందుఁబోయె? ఆప్రేమపూర్వకభాషణంబు లెందరిగె? అయ్యో! దండపాణీ! నీ వెంతలో నిట్లుమారితివి? నీహృదయము మారినను నా హృదయము నీదెస మారలేదు. నీవు నాకు వెనుకటి దండపాణివై యున్నావు. నాఁడు వేఁటలో బెబ్బులి గొబ్బున నీపైఁబడుచుండ విసవిస వెంట నమ్ముఁ దొడిగి నేను దానిం గూలనేసి నీప్రాణము రక్షించినప్పుడు నీపై నాకెట్టి ప్రేమగలదో నేఁడును నా కట్టిప్రేమయే కలదు. నేను మహారాజనందనుఁడనయ్యు- కడుసుకుమారుఁడనయ్యు నత్తఱి విలువగల దువ్వలువలు దాల్చియున్నవాఁడనయ్యుఁ- జెఱువులోఁబడి మున్కలువేయుచుఁ బ్రాణములు గోల్పోవసిద్ధముగానున్న నీకొడుకును గాపాడుటకై చెఱువులో నుఱికిననాఁడు నీపై నాకెట్టి కూర్మిగలదో నేఁడు నట్టికూర్మియే గలదు. ఈహృదయము నీహృదయమువంటిది కాదు. కాకపోయినందుకు దీనిని దప్పకదండింపవలయు కావున నీచేతిలో దీపపువెలుఁగునఁ దళతళమెఱయుచున్న నీఖడ్గపుం గొనతో ముందుగా నాహృదయముం బొడిచి దాని నీవలకుఁ దీయుము. ఇదిగో! నాహస్తము. నాఁడు బెబ్బులిని నీనిమిత్తమై కోలం గూలనేసిన హస్తమిది. నీకఱకుగత్తితో నీచేతిని ముందుగా నఱకుము. నీకుమారుని నిమిత్తమై ముందువెనుక లాలోచింపకుండఁ జెఱువులోఁబడిన యీశరీరమును నీవాఁడికత్తితోఁ దుత్తునియలు చేయుము. ఇదిగో! నాశరీరమును నీ కప్పగించుచున్నాను.

అంతలో నతనిచేతి కత్తి పిడికగ్గఱఁ జమటపట్టుటం జేసి యా ఖడ్గము జాఱి క్రిందఁబడెను. అప్పుడు విక్రమసేనుఁడు మఱల సంభాషణ మందుకొని యిట్లనియె.

"దండపాణీ! సంపూర్ణజ్ఞానముగలిగి, చైతన్యముగలిగి, యుక్తాయుక్తవివేకముగలిగి, ఘాతుకకృత్యము చేయఁదలఁచి వచ్చిన నీకన్న చైతన్యశూన్యమైన యీ కత్తియే మంచిదని తోఁచుచున్నది. ఈ దుష్కార్యము చేయఁజాలక కాఁబోలది క్రిందఁబడెను. అయినను నీవు చిత్రభానున కెట్లు వశవర్తివో యీకత్తియు నీకట్లు వశవర్తిని యగుటచే మాపినతండ్రి చెప్పినచొప్పున నీవు చేయఁదలఁచుకొని నట్లే, నీవు సేయుచున్న ట్లీకృపాణియుఁ జేయఁదలఁచుచున్నది. నా ప్రాణములమీఁద నా కంత యాసలేదు. ఈ కారాగృహవాసముకన్న స్వర్గలోకవాసమే నాకు సౌఖ్యప్రదము. అచ్చట మాతండ్రితోడనే నేఁ గూర్చుండెదను. మాపినతండ్రివలన భయములేనిచోట దండపాణిఖడ్గమునకుఁ బ్రచారములేనిచోట రాజద్రోహులు లేనిచోట ధనమునకై యెట్టి ఘాతుకకృత్యమైనఁ జేయనోడంబడెడు నీచులు లేనిచోట నేను సుఖముగా నుండెద. కాని! యదిగో! నీయెట్టయెదుట నామంచముపై మూర్ఛిల్లియున్న యాసిపాయిని నాగారాబుతమ్ముని హేమచంద్రుని రెండవపుత్రుని నరవిందాదేవి ముద్దులపట్టిని సకలజననయనానందకరుని నిండుచంద్రునకు వన్నెలుదిద్దఁగల మొగము గలవాని చక్కరవిల్తునిఁ దలపించు చక్కఁదనమువాని నీవెన్నిసారులోఁ జిన్ననాఁట నెత్తికొని ముద్దులాడినవాని, మాహర్షవర్ధనుని బ్రతికింపుము. మాతండ్రి నిమిత్తమై యాతనిని జీవింపనిమ్ము. మహాశోక సముద్రముననున్న మాతల్లినిమిత్తమై యాతని బ్రతికియుండనిమ్ము. నానిమిత్తమై యతనిని జీవింపనిమ్ము. హేమచంద్రునివంశము నిర్మూలముగాకుండ నీమొలకకు నీదయారసముపోసి పెంచుము. ఈతఁడు

మీచిత్రభానుని రాజ్యమున కర్హుఁడు. వానికి సన్యాసమిప్పించి వనాంతరములకంపుము. ఇదిగో వానిని బ్రతికింపుమని చేతులు జోడించి నీపాదములకు మ్రొక్కుచున్నాను. నీవు బాసచేసితివేని నేను సుఖముగా శరీరము వాయుదును. నాకు నీకడఁగల చనవుచెంపున నీవరమిమ్మని నిన్ను వేఁడుకొనియెద."

దయనీయములయిన యాతని పలుకులు శక్తివర్మహృదయమును గరఁగించి కన్నీరు స్రవింపఁజేసెను. కాని స్వలాభపరాయణతచే శిలీభూతమైన దండపాణి హృదయముమాత్ర మవికరఁగింపలేకపోయెను. "విక్రమసేనా! నీవేఁడికోలు నిష్ప్రయోజనము. చిత్రభానునియాన నేను సంపూర్ణముగాఁ జెల్లింపవచ్చితిని. మీయిరువు రంజంపి గాని నే నిచ్చోటు విడువ. నీతమ్మునిచావు నీవు చూడలేవు గావున ముందు నిన్నే వధించెద. నేను సగముసగముపనులు చేయువాఁడనుగాను" అని దండపాణి ప్రత్యుత్తరమిచ్చుచుండ నంతలో హర్షవర్ధనుఁడు మూర్ఛదెలసి "అన్నయ్యా! అన్నయ్యా! బ్రతికియున్నావా! అన్నయ్యా! అన్నయ్యా! నన్నొకసారి కౌఁగలించుకొనుము." అని కోరెను.

విక్రమసేనుఁ డట్లు చేయుట కటుపోవుచుండ దండపాణి వాని నాఁపి "కౌఁగలింతలు గిరిగిలింత లిప్పుడెందు" కని బిగ్గరగాఁ బలికెను. అప్పుడు హర్షవర్ధనుఁడు మెల్లగాలేచి "దండపాణీ! మాయన్నను జూడకుండ నే జీవింపఁజాలను. నాకుబ్రతుకుమీఁద నేవ పుట్టినది. కావున నన్నుజంపి మాయన్నను బ్రతికింపుము.మాయన్న చాలమంచివాఁడు. చదువుకొన్నవాఁడు. నాకడపటిప్రార్థనమంగీకరించివానిని జీవింపనిమ్ము. వానికి మీరాజ్యమక్కరలేదు. ఏగాంధారదేశమునకయినఁ బోయి బ్రతుకు" నని కేలుమొగిచి మ్రొక్కెను. "ఓహో అన్నను బ్రతికింపుమని తమ్ముఁడు, తమ్ముని బ్రతికింపుమని యన్న

ప్రార్థనలుచేయనారంభించిరా! మీయాటక్కరితనములు నాకడసాగిరావు మీ పంచాంగముఁ గట్టిపెట్టుఁడు" అని దండపాణి నిష్ఠురముగాఁ బలికి హర్షవర్ధనుని దనచేతితో నొకప్రక్కకు గెంటి "శక్తివర్మా! వీని నావలి కీడ్చుకొనిపో." అని యానతిచ్చెను. శక్తివర్మ యాబాలునింబట్టుకొని ప్రక్కనున్న మఱియొక గదిలోనికిఁ దీసికొనిపోయి లోపలఁబెట్టి తలుపువైచెను.

"అయ్యో! అయ్యో దండపాణీ! అయ్యో! శక్తివర్మా! కడపటి సారి మాయన్నను గౌఁగలించుకొననిండు కడపటిసారి మాయన్న ముఖారవిందముఁ జూడనిండు! చివరవఱకు కళేబరసన్నిధినే నన్నుండ నిండు!" అని హర్షవర్ధనుఁడు మొఱపెట్టజొచ్చెను.

"దండపాణీ! దండపాణీ! ఒక్క నిముషమాఁగుము. ఒక్కసారి నన్నావలిగదిలోనికిఁబోనిమ్ము. ఒక్కసారి నాతమ్మునినాలింగనముఁ జేసికొననిమ్ము! ఒక్కసారి వానిని ముద్దాడనిమ్ము. అధమపతు మీ వరమయిన నాకు దయసేయుమయ్యా! నీకెంతో పుణ్యముండును." అని విక్రమసేనుఁడు ప్రార్థించెను.

"చాలుచాలు! నీకలాపము గట్టిపెట్టుము. పండుకొనుము. ఇప్పుడే ముందుగా నీశిరఃకర్తన మాచరించెద" నని దండపాణి పలుకుచుండ నంతలో గోయిత్రవ్వి చండుఁడు దచ్చోటికి వచ్చెను. "చండా! శక్తివర్మా! వీనిని నేలఁబడవయిచి కాలుసేతులు పట్టుకొనుఁడు" అని యాతఁ డానతిచ్చెను. "అయ్యో! నన్ను బలాత్కారముగాఁ బండుకొనఁబెట్టనక్కఱలేదు. నా కాలుసేతులు పట్టుకొననక్కఱలేదు. నేనీసమయమునఁ గూడ మీ కేవిధమయిన కష్టమును గలిగింపను. ఇదిగో! పండుకొనుచున్నాను." అని విక్రమసేనుఁడు నేలఁబండుకొని చేతులు జోడించి "నారాయణా! నారాయణా! నారాయణా!" యని హరినామస్మరణ చేయుచుండెను. దండపాణి ఖడ్గ

ము నెత్తి యేతా(?)క్కుచుండిగొట్టిన నొక్కయేటున శ్రమలేకుండఁ దల తెగిపడెనో? క్రూరుఁడు నిలిచి ఖడ్గ మెత్తెను. అంతలో శక్తివర్మ కనుసన్నసేయ వెంటనే చండుఁడు దండపాణిమెడలో నొకత్రాడు తగిలించి త్రాడుకొనయున్న యుంగరములోనుండి రెండవకొనపోనిచ్చి శక్తికొలఁది లాగెను.

ఇది రెప్పపాటుకాలమున జరిగెను. లాగినతోడనే చేతిలో నున్న కత్తి చేతిలోనుండఁగానే దండపాణి 'ఆ! ఆ!' యని మూల్గుచు నురికి విలవిల వెనుకకుఁ బడెను. నిముసములో నతనిప్రాణము పోయెను. కన్నులు మూసికొని హరిధ్యానము సేయుచున్న విక్రమ సేనుఁడు కన్నులు తెఱచి చూచునప్పటికి శక్తివర్మయుఁ జండుఁడును నొక్కడిచో దండపాణిని దలయొకరు, బాదములొకరుఁబట్టుకొని యావలకుఁ గొనిపోవుచుండిరి.

అన్నయ్యా! అన్నయ్యా! యని యావలిగదిలోనుండి హర్ష వర్ధనుని మొఱ యొకటి చెవిలోఁ బడుచుండెను. విక్రమసేనుఁడు లేచి కూర్చుండి యావిస్మయసంభ్రమంబులు మితి మీఱి పరవశుని జేయ నేమిదియని యెఱుఁగఁజాలక గ్రుడ్లప్పగించి చూచుచుండెను. చండుఁడును శక్తివర్మయును దండపాణికళేబరమును బాలురనిమిత్తము త్రవ్వియుంచినగోతిలోఁ బడవయిచి పూడ్చిరి.

పరమేశ్వరునిలీల లెవ్వఁడు గ్రహింపఁ గలఁడు! ఆత్మలాభ పరాయణుఁడై ధర్మాధర్మములనక యకార్యమనక ఘాతుకమృగములీల రాజనందనుల వధింపఁదలఁచివచ్చిన దండపాణి కృపాణినైన నెత్త కముందె యసువులుబాసి క్షణములో దండధరునివీటికివిందయ్యెను ఉత్తరక్షణము నెవఁడెఱుఁగునని పెద్దలు చెప్పుమాట నిశ్చయముగదా! మానవుఁడు తనమనంబున నాకసంబున మేడలుగట్టి పదునాల్గులోకములఁ బాలింపఁ దలఁచుచుండును. దైవము వానిసంకల్పముల వికల్పములఁ జేయుచుండును.

అట్లు వారిరువురు దండపాణిని మహీగర్భమునం బూడ్చి రాజనందనులకడకువచ్చి గదితలుపులుతీసి హర్షపరవశులై వారలకుం [illegible]సికొని వచ్చి "కుమారులారా! దండపాణి తానుత్రవ్వుకొన్న గోతిలోం దానే పడెను. అదురాత్మునిపాపమే యాతని జంపినది. మీ[illegible]. మిమ్మీచెఱనుండి విడిపించి యావలకుం దోడ్కొనిపోవుచున్నాము. మీరు మావలన నెట్టియపాయమును శంకింపకుఁడు. మేము రాజభక్తులము. మీపాదసేవకులము. చిత్రభానుసిద్ధుండనువాని మేము సహింపంజాలక వానిచేం బ్రేరితుండై మిమ్ము వధింపవచ్చిన దండపాణిని మరముట్టించితిమి. మిమ్ము సురక్షితముగా గాంధారదేశమునకుం గొనిపోయెదము. మీకుం దైవమున్నాఁడు. మనభాగ్యము సరిగా నుండునేని నేల భాగ్యవర్ధనుఁడు మీకుం దోడుపడవచ్చును. ఇంక నాలస్యము చేయుటకు వీలులేదు. రండు! సేవకులు మేలుకొనకముందే పోవుదము."

అనవుడు నక్కుమారులు "శక్తివర్మా! మీయిష్టము వచ్చినట్లు చేయుఁడు" అని బదులుచెప్పిరి. అంతట శక్తివర్మయుం జ[illegible]డును వారిచేతులుబట్టుకొని నిశ్శబ్దముగా నావలకుం దోడ్కొనిపోయిరి. అప్పటికి రెండుజాములరాత్రి [illegible]. సేవకులలో నొక్కఁడును మేలుకొనలేదు! చప్పుడుగాకుండం దలుపు వయిచి వారు నడుచుచు నాగాఢాంధకారమున బైలుదేఱి మెల్లమెల్లగా నడచి తెల్లవారునప్పటికొక యామడపోయి యొకపల్లియం జేరి ప్రాతఃకాలకృత్యములు లచ్చటం దీర్చుకొన్న పిదప శక్తివర్మ చండసిబిలునకుం జూపి సహాస్యముగ నిట్లనియె—"రాకొమరులు దండపాణియు, నపుడు నేను హఠాత్తుగా నదృశ్యులమయితిమని కావలివాండ్రు మఱునాటియుదయమునం దెలిసికొని భయంపడి వడివడిగాంబోయి చిత్రభానున కెఱింగింతురు. దండపాణి బిడ్డలం జంపక తన్ను వంచించెనేమో యని శంకించి యా రాజు బిడ్డలను మనలను వెదకుటకై నలుదెసలకు సేనలనంపును.

అతఁ డావులించినవారి క్షేమ్రపు లెంచును. మనము పట్టుబడితిమా భంగ మువాటిల్లు. కావున నీవు చిత్రభానునికడకుఁ బోయి యాతనిం దప్పు దారిం బెట్టుము. ఈవిధముగా నతనితోఁ జెప్పుము." అనియాతని చెవి లో నొకరహస్యము జెప్పి పొమ్మనియెను. చండుఁడును నతనియుపదే శము మంచిదేయని రాజసుతులంజూచి "తక్షశిలలో నేను వెండియు గలిసికొనియెద. మీరక్కడ నుండుఁడు" అని చెప్పి వారిని వీడ్కొని పోయెను.

విక్రమసేనుఁడు చండశక్తివర్మలకుఁ దన కృతజ్ఞతం దెలిపి ముందు జేయువలసినపని యేమని శక్తివర్మనడిగెను. "గాంధారదేశము నకరిగి భాగ్యవర్ధనుని సాహాయ్యముఁగుట సమంజస" మని యతఁ డుత్తరము జెప్పి వారినందు కొసంబఱచి దారిబత్తెము నిమిత్తము విక్రమసేనుని మేనిమీఁదనున్న యాభరణంబులలో నొకదానిని విక్రి యించి రొక్కముచేఁబూని వారి యన్నపానాదులకుఁ గఱవు లేకుం డఁజేసి మార్గాయాసము లేకుండ బండ్లమీఁద నెక్కించి వారిమనఃఖే దములు బాపుటకు వినోదములైన కథలుజెప్పుచు గ్రామీణుల చిత్ర చిత్రములయిన యాచారవ్యవహారములం జూపుచుఁ బయనము చేయిం చుచుండెను.

కొండకోటకడఁ గావలి యున్న సైనికులు వంటవాండ్రు మొ దలగు పరిచారకులు బాలకులను చండశక్తివర్మలంగానక యేదో మోసముజరిగినదని చండశాసనుఁడగు చిత్రభానుని యలుకకు భయ పడి తమలో నొకపెద్దంబిలిచి యవ్వార్త రాజునకు విన్నవింపఁబనిచిరి.

---

# ఇరువదియేడవప్రకరణము.

"ఈపాటికి దండపాణి గ్రామదేవతకు మేఁకపోతును బలి యిచ్చిన చందమున నాదారిలో ముండ్లవలె నున్న యాడింభకుల నిరువుర నఱికియుండును. బ్రతికియున్నప్పుడువలెనే యాకుఱ్ఱలిరువురు నొండొరుల కేలుపట్టి యముని యింటికిఁ జని యీపాటికిఁ బ్రేత కాఁపులయి యుందురు. ఉయ్యాలలో నిద్రపోయినట్లు వారీపాటికి గోతిలోఁ బెద్దనిద్దురపోవుచుందురు. ఇప్పుడో రేపో మాపో యాశుభ వార్త నాకు రాకమానదు. ఇంక వారితల్లింగూడ బెగటార్చినంగాని నావ్రతము సమాప్తముగాదు." అని చిత్రభానుఁ డొకనాఁడు తన లోఁదాను వితర్కించుకొనుచుండ నంతలో ద్వారపాలకుఁడు "దేవా! దండపాణికడనుండి మనచంద్రుఁడు వచ్చియున్నాఁ" డని విన్నవించెను. సత్వరము ప్రవేశపెట్టుమని యతఁడాజ్ఞ నొసఁగఁ జంద్రుఁడు ద్వారపాలక ప్రేరితుఁడై రాజదర్శనము జేసెను. చిత్రభానుఁడు వానిసేమ మడిగి దండపాణి పంపిన సందేశమేమని యడుగ నతఁడు వినయంబున నిట్లనియె.

"దేవా! దండపాణి విజ్ఞాపన మిది—స్వామీ! దేవరవారి యాజ్ఞానుసారముగ నేను సురక్షితముగా మంచుకొండకుఁ బడమటి ప్రక్క నున్న మనకొండకోటఁ జేరి, చండశక్తివర్మలసాయమున నిరువుర బాలకుల నాకత్తికెఱజేసి, లోభిధనమునునిక్షేపించినట్లు వారిం గోతిలోఁ బెట్టి పూడ్చి కృతకృత్యుఁడనై దేవరవారి యనుగ్రహమునకుం బాత్రమునయితిని. స్వామికార్య నిర్వాహణప్రవీణుఁడ నగుటచే నేనుజరితార్థుఁడనయితిని. కానిపితృవిహీనులయి యగతికులలయినబాలకుల నిష్కారణముగా వధించుటంజేసి నామనస్సుమిక్కిలి

వ్రిబాణంబులు సంధించి మూఁడుసింగంబులపై మూఁడుబాణంబుల నేసిరి. ఎఱమీఁదనున్నవేమో యాసింగములు ప్రళయకాలరుద్రుఁడట్లు మహాక్రోధపరవశమ్ములై తమపైఁబడినబాణము లెంతవేగమున బోయెనో యంతవేగమున వచ్చి ముప్వురిపైఁబడి తత్క్షణమే యాము వ్వురం గడతేర్చెను. శక్తివర్మ కేమికాని మహాప్రభో! రాజకుమారులు పోయినందుకు నేను మిక్కిలి విచారించుచున్నాను. ఇంతకు దైవనిర్ణయమిట్లున్నది” యనిమరల నేడ్వఁ జొచ్చెను.

అవ్వచనంబులు కర్ణంబులసోఁకుటయు “హా! కుమారులారా” యని యతఁడు మూర్ఛిల్లెను. సేవకులందఱు మిక్కిలి కలఁతనొంది హాహాకారములు చేసిరి. ఇందుమణియుఁ గర్పూరమంజరియు లోపలి నుండివచ్చి శైత్యోపచారములు చేయించి కారణ మేమని యడిగిరి. వార్తాహరుఁడయిన యాకింకరుఁడే యావృత్తాంతము మరలఁజెప్పి పెద్దపెట్టున నేడ్చెను. కర్పూరమంజరి యవ్వార్త విని యతిశోకమగ్నయయ్యెను. ఇందుమణికన్నులనుండి బొటబొట బాష్పములు దొరఁగెను. సేవకు లందఱు “కటకటా! ఎంతకష్టము” మని విలపించిరి. చిత్రభానుఁడు శైత్యోపచారములవలన సేదదేఱి “హా! కుమారులారా! మిమ్ముఁబాసి నేనెట్లుజీవింతునురా! మీతల్లి యీవార్త విని యెంత శోకించుచున్నదోకదా? అయ్యో! మాయన్నగారివంశమైన లేకపోయినదే. ఓమూలదైవమా! నాఁడు హేమచంద్రునకట్లు దారుణమరణము విధించితివి. గుణరత్నాకరులు—లోకైకసుందరులు—నగునాతని బిడ్డలనైనంజూచి సంతసింపకుండ వారింగూడ నీపొట్టంబెట్టుకొంటివా? పాపాత్మురాలా! మృత్యుదేవీ! నీకంటికిఁ బేలగింజయుఁబెద్దయయ్యెనే? నీయాఁకలి దీర్చుకొనుటకింతకన్న నీకు మఱియొకజంతువు దొరకలేదా?. ఆచక్కఁదనమేమి? ఆలావణ్యమేమి? ఆవినయసంపదయేమి? ఆ

డునని కొందఱనిరి. వేఁటలో సింగము వేటుతప్పించుకొని మీఁదబడి నప్పుడు చిత్రభానుఁడేమిచేయఁగలఁడని కొందఱు వచించిరి. తండ్రికిం గొడుకులకుఁగూడ దారుణమరణమే విధి నిర్ణయించుటయాశ్చర్యమని కొందఱు భాషించిరి. ఆనాఁడు చంటిబిడ్డలు, రోగులు, వృద్ధులు దక్కఁ దక్కిన పురజనులు భోజనములే చేయలేదనుట యతిశయోక్తి గాదు.

సుకుమారుఁడు మృతుఁడయినను చిత్రభానుఁడు కొలువుకూటమున కనఁబడలేదు. మంత్రిసామంత ప్రముఖ సేనాపతులు చిత్రభానునిసందర్శించి పరామర్శచేసిరి. పౌరజనులలోని ప్రముఖులుగూడనట్లుచేసిరి. చూడవచ్చినవారిలో నొకఁడు యెదుటఁ జిత్రభానుఁడు గొడ్డఱచిన ట్లఱచి యేడ్చెను. బహువిధములఁ రాజకుమారుల గుణములఁ బ్రశంసించుచుఁ దనదుఃఖమును బ్రకటింపఁ జొచ్చెను. ఆనాటకమంతయు నెఱిఁగియు యుగంధరుఁడు తక్కినవారివలె దుఃఖోపశమన వాక్యములం జెప్పుచు ఇతిహాసంబులలోని గాథలం దెలుపుచుఁ బ్రక్కనఁగూరుచుండెను. అది మొదలుకొని దుఃఖాతిశయమునఁ జిత్రభానుఁడు పదిదినములు కొలువుకూటమునకుఁ బోవనేలేదు. రాజ్యవ్యాపారములఁ జూడనేలేదు. రాయబారులకు దర్శనమియ్యనేలేదు. ఆలుబిడ్డలతోనయిన మనసిచ్చిమాటాడలేదు. ఇది నటన మని కొందఱు నిజమనికొందఱు, పురజనులు చెప్పుకొనసాఁగిరి.

---

## ఇరువదియొనిమిదవప్రకరణము.

పాంచాలదేశాధీశ్వరుఁడగు మహేంద్రదేవుఁడు తనకూఁతురు మనుమలు మహోపద్రవసముద్రమున మునిఁగిపోవుదురని మాధవ

సేనుఁడు తెలిపినతోడనే వృద్ధుఁడయ్యుఁ గాశ్మీరముపై దండువిడియు టకుఁ జిత్రభానుని దండించుటకు సమరసన్నాహము జేసెను. "అలస్య మమృతం విషమ్" అన్నట్లు వారిసన్నాహము సిద్ధమగునప్పటికి హేమ చంద్రునికుటుంబమునకు రావలసినకష్టములన్నియు వచ్చెను. అయి నను వా రది గుర్తెఱుంగక కాశ్మీరముపై దండయాత్ర జరిపిరి. మహేంద్రదేవుఁడు వృద్ధుఁడు. ఆతనికిం గొడుకులు లేరు. అధికారము వహించెనని యోగు లండఱు పరస్పరమత్సరగ్రస్తులయి రాజకార్య నిర్వహణముకన్న నొండొరులతోడఁ గలతమద్వేషములకుఁ బ్రతి క్రియలు చేసికొనుటలో నెక్కువ శ్రద్ధ గలిగి తిరుగుబాటు మంత్రములఁ బన్నుచుండిరి. ఆకారణమునఁ బాంచాలసైన్యము దుర్బలమై యుండెను. మహేంద్రదేవుఁడు కాశ్మీరమునకుఁ బోయి తన మనుమలఁ దన కప్పగింపు మనియు దేశము విడిచిపొమ్మనియుఁ జిత్ర భానునకు సందేశమంపెను. చిత్రభానుఁడా రాయబారిని బరాభవించి తగినయుత్తరము జెప్పకయే పంపెను. పాంచాలసేనానాయకులలోఁ గొందఱు లంచగొండులై చిత్రభానునకు వశులైరి. రెండు రాజ్యముల సైన్యములకు యుద్ధము జరిగెను. మహేంద్రదేవుఁడు యుద్ధమునఁ బరాజితుఁడై రాజధానికిఁ బాఱిపోయెను. రాజభక్తి గలసైనికు లెల్లఁ దమ కోపినకొలఁది పోరాటమునల్పి మ్రందిరి. ప్రాణభీతిగల యోధులు చిత్రభానుని కోడి నలుదెసలకుం బరుగులెత్తి ప్రాణములఁ గాచుకొనిరి. మాధవసేనుఁడును భగ్నమనోరథుఁడై పలాయనమె శరణంబుగాఁ జేసికొనెను. పాంచాలదేశమును గొల్లకొట్టింపవలె నని రుద్రభట్టునుపదేశమునఁ జిత్రభానుఁడు సంకల్పించెనుగాని సాహసారంభముతో మాళవరాజసైన్యములు దమపై వచ్చుచుండుటం జేసి యతఁ డాసంకల్పమును వదలుకొని మకరందుని దాఁకుటకు సర్వ సన్నాహములు సేయుచుండెను.

నేను మకరందునిరాయబారిని గాను. మీయంతఃపురపరిచారిక యయినచంద్రిక నాప్రాణమిత్రము. ఈసందడిసమయమున నన్ను లోపలికి మీబంట్లు రానీయరనిశంకించి మకరందునిదూత నని చెప్పితిని. చంద్రికతో నొక్కసారి మాటలాడవలయు దేవరవా రనుజ్ఞ నొసఁగుదురేని యట్లుచేసి, పోయెద." అనవుడు విస్మితుఁడై చిత్రభానుఁడు "ఏమీ! చంద్రికమిత్రమవా నీవు? సరె! అట్లయిన దానిం బిలిపించెనుందు" మని చంద్రికను రావించెను. అది వచ్చి యాతనిమొగముఁ జూచి "ఇతఁ డెవరో నే నెఱుఁగ" నని చెప్పెను. "అయ్యో! నన్నెఱుఁగవటే! ఇంతలోనే మఱచితివఁటే! మహాప్రభూ! దేవరవారె నన్ను గుర్తింపలేదా? నేను మీయింటనే పెరిఁగితిని. మీయడుగుల నీడనే బ్రతికితిని. మీయనుగ్రహముచేతనే వర్ధిల్లితిని. అమ్మగారు నన్నెఱుఁగుదురు. మీయమ్మాయి నన్నెఱుఁగును. దేవరవారు రాజకార్యములగొడవలోనుండి మఱచిరి." అని జయంధరుఁడు నవ్వుచుఁ బలికెను.

ఆకథ కడుఁ జిత్రముగా నుండుటచేఁ జిత్రభానుఁడు కర్పూరమంజరిని నిందుమణిని నచ్చటికి రావించి యప్పురుషుని గుర్తింపుమని చెప్పెను. అమ్మా! నన్ను మీ రెఱుఁగరా యని జయంధరుఁడు బలుకఁ గర్పూరమంజరి రెప్పపాటువేయక చూచి ముఖవైఖరియుఁ గంఠధ్వనియుఁ దనకుఁ బూర్వపరిచితములైనట్లు తోఁపఁ జప్పటులు చఱచి "నాయనా! ఈవిగ్రహము పురుషవిగ్రహము గాదు. మల్లికయే మాఱువేసము వైచికొని యిట్లువచ్చెనని నాకుఁదోచుచున్నది" యని నవ్వుచుఁ జెప్పెను. అప్పలుకులు విని చంద్రిక "ఔనండి! ఇది నిజముగా మనమల్లికయే. ఏమే! నీసరసము చట్టుబండలుగాను" అని దగ్గఱకుఁబోయి తలపాగ నూడఁదీసెను. అప్పుడు దీపములవెలుఁగున దాని మొగము విస్పష్టమై కనఁబడెను. "అయ్యో! నిన్ను పెద్దపులి

యీడ్చుకొనిపోయి చంపెనని జంబుకుఁడు చెప్పె. ఎట్లు బ్రతికి వచ్చితివే" యని చిత్రభానుఁ డడిగెను. "స్వామీ! మనజంబుకుఁడు గంజాయిత్రాగి యామైకముతోఁ బాడుకొని నన్ను బెబ్బులి యీడ్చికొనిపోయినట్లు కలగని యుండవచ్చును. దానిమత్తుచేతఁ బయనములో నాకు సాయముచేయుటకు మాఱుగా నా కంతరాయములు గలిగించుటం జేసి వానిని వదలించుకొని నే నావలికిఁ బోతిని. ఆలాహిరి వాఁడు కలయే నిజమనుకొని నన్ను వంచించిపోయిననన్నుఁ గానక మీతో నట్లు మనవిచేసియుండవచ్చును" అని మల్లిక మందహాససుందరమైనవదనముతో నుత్తరమిచ్చెను. అదివిని నవ్వి చిత్రభానుఁడు "ఓసీ! నీయాఁడువేసముకన్న మగవేసమే బాగున్నదే. చాలు. నీవుచేసినప్రతిజ్ఞ చాలును. నీప్రజ్ఞకు సంతసించితిమి. ఈపాటికి నీవభ్యంతరమందిరమునకుఁ బో!" అనిమందలింపఁ జంద్రిక దానిచేయి బట్టుకొని లోపలికిఁదీసికొనిపోయెను. ఇందుమణియుఁ గర్పూరమంజరియు లోపలికరిగిరి. పిమ్మటఁ గొంతకాలము పరస్పరవియోగదుఃఖమున సంతప్తులయిననెచ్చెలులకు విస్రంభసంభాషణ మారంభమయ్యెను. అప్పుడు చంద్రిక ముందుగా నిట్లనియె. "ఓసీ! మల్లికా! నీవు మృతినొందితివని మే మతిదుఃఖముపాలయితిమి. నీనిమిత్తము బెంగపెట్టుకొని కర్పూరమంజరి యురిపెట్టుకొన్నది. ఆయుశ్శేషముండుటచే నేఁడనే యది కనిపెట్టి ప్రక్కపెట్టున మొఱ్ఱలుపెట్టితిని. నాకు గ్రాహించి వెంటనే కంచుకులు పరువెత్తుకొనివచ్చి యీమెను రక్షించిరి. మొదట నీమె తగిలించుకొన్నతీఁగ త్రాడు దీయుటకయిన నాకుఁ జేతులు వచ్చినవికావు. నామొడలు నేనెఱుఁగను. దైవానుగ్రహమున నెట్లో బ్రతికెను."

"అయ్యో! ఉరిపెట్టుకొన్నదా? అయ్యో! ప్రాణసఖీ! ఎంత పనిచేసితివమ్మా! నీవు లేనిమొదల సంసారము నిస్సారము. మధ్యమలోక

ము దీపరహితము. జగము జీర్ణారణ్యము. మానవులసేవ్రిగి రాళ్ళము నిష్ఫలము. మాకుమరణమే శరణము లోకమును శోకమగ్నము జేసెదవా! మన్మథుని గర్వహీనుం జేసెదవా! నీ కింతసాహసముగూడనా! నావంటి నెచ్చెలులు నీ కెంకటో లభింతురు. నాకొఱకై ప్రాణము నీ పందగునా!" యని యామెసాహసమును గర్హించి మల్లిక నసప్రమాణ విశేషంబులం జెప్పి వారిస బ్రొద్దుపోవునంతకు నలరించెను. ఆమాటలు వినుచుం జంద్రిక మెల్లగ నిద్రపోయెను.

అనంతరము కర్పూరమంజరి మల్లికను దనకు మిక్కిలిదగ్గఱగ రమ్మని పిలిచి యిట్లనియె.—"మల్లికా! నిన్నుంజూచి కొన్నిమాసములే యయినను జిరకాలమునుండి చూడనట్లు కన్నులు వాంఛిపోయినవే. నిన్నుంజూడఁగా నా ప్రాణము లేచి వచ్చినది. హృదయము ముప్పొంగినది. మనస్సు సంతోషముం బట్టంజాలకున్నది. కన్నుల ఆవు తీరినది నీవాక్కులతనవైనవు వేయిమందిచుట్టములు వచ్చినట్లున్నది. ఇంతకుం గార్యసిద్ధియైనం గా లేక నీప్రయాణమునకు దేహాశ్రమము మాత్రమే ఫలమా!" అనిపలుక స్నేహస్నిగ్ధభాషణముల మల్లిక మరల నెచ్చెలి కిట్లనియె. "సఖీ! నీకు నాయెడం జిన్నటనుండియు నిట్టిప్రేమయే గలదు. అట్లు నీవనుకొనుటకు నీసౌజన్యమే కారణము గాని నాయందలి గుణవిశేషము గాదు. బెంగపెట్టుకొనకు. కార్యసిద్ధి కొంతవఱకయినది. నా ప్రయాణము వ్యర్థము కాలేదు. బహుశ్రమలుపడి నే నుజ్జయినిం జేరి వేడుకచెలికానితోం గూడి వెన్నెలలో ముచ్చటలాడుచున్న మకరందుని జూచి మగవేసముతో వెళ్ళితిని. మగవేసమేల ధరింపవలెనందువా? మహాత్ముండయిన మకరందుండు పరస్త్రీలతో మాటలాడండు. జవ్వనుల మొగ మయినం జూడండు. కావున నాగుణరత్నాకరుని మగవేసమునం జూచుట మంచిదని యట్లుచేసితి.

నీహృదయ మాతనియందు లగ్నమైనమాట విన్నవించితిని. అతఁడు ను నీనిమిత్తమై పరితపించు చుండెనని వేడుక చెలికాఁడగు చంద్రిచూ డునివలనఁ దరువాత వింటిని. కాని, యతఁడు మీతండ్రిపై దాడి వెడలియున్నాఁడు. మునుపే నీతండ్రి వీనియల్లుడన మొల్లకయున్నాఁ డు. ఇప్పు డీతనిమీఁద మీయయ్యయలుక నూఱురెట్లు హెచ్చె ను. కావున సుఖసుఖాన మీతండ్రి నిన్నీతనికియ్యఁడు. ఇందుకు దై వమే స్వాయముగా దౌత్యము వహింపవలెను గాని మనుష్యులవలనఁ గాదు. పరమేశ్వరుఁ డఘటనఘటనా సమర్థుఁడు"

అదివిని కర్పూరమంజరి "ప్రియసఖీ! నీపలుకులలోఁ గొంత యాస యున్నది. కొంతయాస లేదు. అతఁడు నాయం దనురక్తుఁడై యుండుటఁ జేసి యాశాబంధము తెగకయున్నది. మాయయ్యకు వి రోధియగుటంజేసి వెంటనే నిరాశ యంకురించుచున్నది. ఆశానిరా శలనడుమ నామనం బూఁగాడుచున్నది. ఈకలహ మెట్లు పరిణమిం చునో తెలియదు. ఇందు మకరందునకు మరణమే సంభవించునేని నా మనోరథము లాతనితో మంటఁగలియునుగదా. లేక పోరితంబున మాయయ్య కడతేరునేని దండ్రిం జంపినవాని నెట్లు చేపట్టఁగలను? దై వ మొక్కఁడే యిందు సాయము జేయఁ దగినవాఁడు. నేను గౌరీసేవా నిరతురాల నగుదునేని భగవతి కాత్యాయని నామనోరథ మీడేర్పఁ గాక!" యని తన మనోవేదన చెలిమికత్తె కెఱిఁగించి రేయి చాల గడచుటచే నిట్టూర్పు విడుచుచుఁ బండుకొని కన్నుమూసెను. మల్లిక మార్గాయాసముచే మిక్కిలియలసియుండుకతనఁ బడినదే పాటుగా గాఢనిద్రసుఖ మనుభవించెను.






## ఇరువది తొమ్మిదవ ప్రకరణము.



ప్రభాతమయ్యెను. తీర్థయాత్రలు సేవింపనరిగిన దండపాణి రాకపోవుటంజేసి చిత్రభానుఁడు విషణ్ణహృదయుఁడై యుండెను. వజ్రపాణి యంతకుమున్ను రెండుమూఁడుసారులు తనయన్న యెందుండెనని చిత్రభాను నడుగ నతఁడు కార్యాంతరంబుల దేశాంతరంబుల కరిగెనని యుత్తరము చెప్పెనేకాని యథార్థము వచింపనేలేదు. అన్న రాక దవ్వయినకొలఁది వజ్రపాణి కనుమానము హెచ్చెను. అతని మనంబు పరిపరివిధంబులం బోయెను. "ఏమహారాజునొద్దకయినఁ జిత్రభానుఁడు వానిని రాయబారిగాఁ బంప, నారాజు వానియసువు లపహరించియుండునా? మార్గమధ్యంబునఁ జోరకిరాతాది భయంబున గ్రమ్మందియుండునా? రోగపీడితుఁడై దేహత్యాగముచేసి యుండునా? వైరాగ్యంబున సన్యసించియుండునా!" యని వజ్రపాణి పలుతెఱంగుల నూహించును నిదమిద్ధమని నిశ్చయముచేయలేక యానాఁడుదయమునఁ జిత్రభానుని సందర్శించి తనసోదరుని విషయమునఁ దన కుఁగల సందియముల నెఱిఁగించి నిశ్చయవార్తఁ దెలుపుమని వేఁడెను చిత్రభానుఁడు వానిసంశయములఁ బాప నత్తెఱంగుయదార్థమంతయుఁ జెప్పి యిట్లనియె. "నీయన్ననుగూర్చి నీ వెంతబెంగగొంటివో నేనును నంతబెంగఁ గొనియున్నవాఁడ. అతఁడు లేకపోవుటచే నాసేనాముఖము తిలకహీనమై యున్నది. నాకుడిచేయి పడిపోయినట్లున్నది. మా శివరాజసైన్యములు పెచ్చుపెరిఁగి యున్నవి. అతఁడు లేఁడన్నమాట వారికిఁ దెలిసినకొలఁదిఁ గర్వోన్మత్తులై వారు సంచరించుచున్నారు. నీవు మేటిమొనగాఁడవు, మహాశూరుఁడవు నని నే నెఱుఁగుదును. అయినను నతనికి నీవు నీ వతనికిఁ దోడై నాయెడల మాశివసైన్యంబు

తేగావు—మహేంద్రసైన్యంబులయినను దైన్యంబునొందకమానవు. నీ వొంటిగాఁడ వయితివని నేను విచారించుచున్నాను. నే నొంటిఱెక్కతోనున్న పక్షివలె నున్నాను. నీవు మీయన్నకొఱకై బెంగబెట్టుకొనకుము. ఈయుద్ధమయిన వెంటనే కరటకపింగళులను గాశీ హరిద్వారబదరీనారాయణాది క్షేత్రములకంపి మీయన్ననిమిత్తమై వెదకింతము. చిత్రభానుఁడే మీయన్నయనుకొనుము.”

వజ్రపాణి కాపలుకులంత దుఃఖోపశమనముఁ జేయకపోయినను సంశయనివృత్తిఁ జేసినందున నాతనిమనస్సు కొంత పరిశాంతి జెందెను. ఆమఱునాఁడు యుద్ధము సేయుట కిరువురు నిశ్చయించుకొనిరి. ఉభయసైన్యంబుల భేరీభాంకరణంబులు దెసల మాఱుమోఁగెను. ఉభయసేనలలోని బంట్లకు నుత్సాహము మిక్కుటమై యుండెను. గజబృంహితంబులు, హయహేషితంబులు, రథనేమిధ్వనులు, పదాతుల యుత్సాహరసభరిత వచనములు మిన్నుముట్టెను. ఆనాఁటిరేయి నాప్రక్కఁ జిత్రభానుఁడు వజ్రపాణి మొదలగువారును, నీప్రక్క మకరందుఁడు, కంఠీరవదేవుఁడు మున్నగువారును దమతమనెలవుల నుచితస్థానముల నిలిచి పిఱికితనము పటాపంచలై పోవునట్లు—వీరరసము మనంబుల నిండియుండునట్లు గయ్యంబులకు సైనికులం బురికొల్పుచుండిరి.

అంతలోఁ దెల్లవాఱెను. ఉభయులమనంబుల నెలకొన్నక్రోధాగ్నివలె భానుమండలము కానఁబడియెను. ఆక్రోధాగ్నిమంటలోయనఁ దొలిసంజకెంజాయ దెసల నలముకొనెను. మంట లెగసిన తోడనే నంతరించు పొగచందంబున మంచు క్రమక్రమంబుగ నదృశ్యమయ్యెను. సైన్యములు మేనం బూసికొన్న వీరగంధముల చందంబున లేయెండలు వ్యాపింపఁదొడఁగెను. రణదుందుభులు మొఱసి సన్నసేయ నుభయసేనలు తలపడెను. ప

నుంగుల నేనుఁగులు దాఁకెను. అశ్వికు లాశ్వికులం దలపడిరి. పదాతులు పదాతులం గలిసి పోరాడిరి. సాయంకాలమువఱకుఁ గయ్యము ఘోరముగా జరిగెను. ఒకమాఱు జయము వారికిఁ జేకూరినట్లు మఱియొకసారి వీరికిఁ జేకూఱినట్లు దోఁచెను.

కంఠీరవదేవుఁడు కంఠీరవంబట్లు పోరాడి మధ్యాహ్నంబున వజ్రపాణిప్రయుక్తమయినవాలుటమ్మునఁ దెగటార్చి నేలంగూలె. ఆతఁడీల్గినకొంతసేపటికిఁ జిత్రభానుండు ప్రయోగించినకఱకుటమ్మున మకరందునకు గాయము తగుల నతఁడు మూర్ఛిల్లె. చికిత్సకొఱకు పరిజనులు స్కంధావారమునకు వానిం గొనిపోయిరి. మదపుటేనుఁగుమీఁద మకరందుఁడు కనఁబడక పోయినతోడనే పరసైన్యంబులు మకరందుఁడు మ్రందెనని కోలాహలముచేసి సంతోషసూచకముగా రణదుందుభులు మ్రోయించిరి. భైరిసేనుఁడు తనమిత్రునకుఁ బ్రమాదకరమైనగాయంబు తగిలెనేమో యని శంకించి చికిత్సకులచేత వ్రణపట్టికలు వేయించి సమయోచితమైనయుపచారంబులు చేయించుటకు వెంటనే శిబిరంబున కరిగెను.

పరసైన్యంబులకోలాహలంబులు విని మాళవసైన్యంబులు భీతిల్లి పలాయనము సేయఁ జొచ్చెను. తెలివివచ్చినతోడనే తనగాయమునయిన లెక్కసేయక జొటజొటఁగాఱుచున్నెత్తురుసోనలతో మకరందుఁడు మరల నశ్వము నెక్కి మెలఁగెత్తి కయ్యమునకుఁ దనసైన్యంబులఁ బురికొల్పెఁ గాని వంచినతల యెత్తక భటులు పోయిన పోకం బోయిరి. విజయలక్ష్మి చిత్రభానునిం జేపట్టెను. పరసైన్యంబులు మాళవులం దఱిమి తఱిమి కత్తుల నఱికియు బల్లెములం బొడిచియు, నమ్ముల నేసియు, గదలం జదిమియు నాశనము చేయఁజొచ్చెను.

మకరందుఁడు ధైర్యము విడువక రణముఖంబున నిలువ భైరిసేనుఁడు మఱికొందఱుభటులు వాని కపాయంబు శంకించి బలిమిని

గుఱ్ఱ మెక్కించి యావలకుఁ దీసికొనిపోయిరి. గాయములకుఁ జికిత్స చేయఁబడలేదు. నెత్తురోడికకగట్టి పాఱుచుండెను. దాహముచేనాల్క యిగుర్చుకొనిపోవుచున్నను వెనుక పగవారు తఱుముచున్నకతమున మంచితీర్థము ద్రాగుటకయిన నవకాశము లేకపోయెను. నెత్తురు మిక్కిలి మేననుండి పోవుటచేనతఁడు దుర్బలుఁడై సోలిపోవఁ జొచ్చె. భద్రసేనుఁ డాతనిగుఱ్ఱముమీఁదనే యెక్కి వానిం దనయొమ్మునకుం జేరవైచుకొని పట్టుకొనియుండెను. అశ్వము సుశిక్షితమైన దగుటచే యజమానునవస్థ నెఱిఁగి మిక్కిలివేగమునఁ బరుగెత్తఁజొచ్చెను. శిబిరము విడిచి కొంతదూరము వారు పరుగెత్తి యొకచిన్నపల్లియం జేరిరి. అప్పటికి సాయంకాల మగుటచే శత్రువులకు వీరిజాడ తెలియలేదు. కావున వారు మిక్కిలి వేగమున ముందుకుసాగి పోయిరి. భద్రసేనుఁడు మకరందుని మెల్లగాఁదోడ్కొనిపోయి వ్రణచికిత్సకుఁ డాగ్రామమున నున్నాఁడాయని యడిగి తెలిసికొని గ్రామీణు లొక మంగలివానిం జూప వానిచే నారేయి యారాకొమునకుఁ దగు చికిత్సలు చేయించెను.

మకరందునకుఁ దీవ్రమైనజ్వరము వచ్చెను. కలఁతనిద్దురయే గాని గాఢమగునిద్దుర పట్టలేదు. నాలుగైదుసారులు దాహము త్రాగెను. పెక్కుసారులు పలువరించెను. అందొకసారి "కర్పూరమంజరీ! ఎంతకాలమునకుఁ గంటఁబడితివి!" అని నిదురలోనే మందహాసపురస్సరముగాఁ బలికెను. వెంటవచ్చిననలుగురు సేవకులు మార్గమధ్యమున శత్రుబాణప్రహారముల నీల్గుటచే వాని కంగరక్ష సేయవలసినవాఁడు భద్రసేనుఁ డొక్కఁడే యయ్యెను.

ఎంతదూరము పోయినను మకరందునిజాడలు. పొడకట్టమి మకరందుం బట్టుకొనుటకై వెడలినచిన్నబలఁగము వెనుకకుఁదిరిగి వచ్చి పరిసరంబున నున్నపల్లియల శోధింపఁదొడఁగెను. గాయము

తగిలినమూఁడవనాఁడు మంగలి కట్టువిప్పి పుండు మూఁనుదలఁపట్టినదని యుఁ బ్రాణాపాయములేదనియుఁ జెప్పెను. అదివిని మకరందుఁ డిట్లనియె "భద్రసేనుఁడా సంగరంబున గాయముఁదగిలి నేను మూర్ఛిల్లి నప్పుడు నన్నక్కడ నుండనీయక నీవు నన్ను శిబిరమునకుఁ గొనిపోయి మిక్కిలి తప్పుచేసితివి. మనసేనలు పరాజయము లభించుచున్నప్పుడు గాయము లెక్కసేయక యశ్వారూఢుఁడనై నేను మరల సమర రంగమునకు వచ్చునప్పుడును నీవు నన్నుఁ బోనీయక నిలువసియక పగ్గములు పట్టుకొందురని భయపడి యిటు తీసికొనివచ్చితివి. నీ విట్టు చేయని పక్షమున నే నీపాటికి మృతినొంది వీరస్వర్గమునఁ బ్రాతకాపునై యుండుదునుగదా! నా కట్టిగౌరవమునుఁ గలుగనీయకపోతివి. నా ప్రాణ రక్షణమే చూచుకొంటివి గాని దీనికన్న వేయిమడుంగు లధికమైన నాప్రతిష్ఠారక్షణము జూడవయితివి. నీ వుద్దేశము మంచిదైనను నీకార్యము శ్లాఘాపాత్రము గాదు. రణముఖంబున క్షత్రియుఁడు మడమ త్రిప్పక వెనుకంజ యిడక పగఱతోఁ బోరవలయును, లేదా తనకై ప్రాణంబుల సర్పించు వీరయోధ సహస్రమధ్యమునఁ దానుం బడి ప్రాణములు విడిచి కదనరంగ మలంకరింపవలయును. అట్టి పుత్త్రుని వలననే తల్లి వీరమాత యగును. అట్టిమగనివలననే భార్య వీరపత్ని యగును. నామరణమునకన్న మకరందుఁడు పందయై పాఱిపోయి బ్రతికి పాఱెనని లోకులు చెప్పుకొందురేమో యనుసందేహమునకే నేనెంతయు భయపడుచున్నాఁడ. ప్రాణాపాయము లేదని వైద్యుఁడు చెప్పినం దుకు నాకు సంతసము లేదు."

అనవుడు భద్రసేనుఁడు "మిత్త్రుఁడా! 'జీవన్భద్రాణి పశ్యతి' యనునార్యోక్తి వినవే? బ్రతికియుండిన నెన్నో శుభములు గాంచ వచ్చు. ఎందఱో పగతుర గెలువవచ్చు. ఎన్నో విజయములఁ బడయ వచ్చు; ఎంతో యశోధనము నార్జింపవచ్చు. ఊరక మృత్యువొందినను

ప్రయోజనము? "శరీర మాద్యం ఖలు ధర్మసాధన" మ్మనుమాట వినవె? నిన్నెత్తికొనినవా రెవ్వరుగ నిన్నుఁ జికిత్సింపంగలరని యధిక్షేపింపరు. సమరములో నీవు మహాద్భుతముగఁ బనిసేసితివే! అదిగాక సమరమునఁ నీయంతట నీవు విడిచి రాలేదు. నీవు సొమ్మసిల్లినప్పుడు దుర్బలుఁడవైనప్పుడు నిన్ను బలిమిం దోడ్కొనివచ్చితిమి. గాయము మానిన వెనుక కాయము దృఢమయిన వెనుక నీవు మరలఁ బగతుఱపైఁ జని గెలువవచ్చు." అనియుక్కుమారుని సమాశ్వాసించెను.

మకరందునినిమిత్త మన్వేషించుచున్న సైనికులనాయకుఁడు ప్రసేనుఁడు నాఁటియుదయమున నే యాపల్లియఁ జొచ్చి గ్రామాధికారులం బిలిపించి మకరందునిజాడలు తెలియునా యని యడిగెను. నిజముగా వారతనిని జూడకపోవుటచేఁ దామేమియు నెఱుఁగనట్లు జెప్పిరి. అతఁ డది నమ్మక ప్రతియిల్లు శోధింపుమని సైనికులకానతిచ్చెను. ఇచ్చినదే చాలునని దుండగులయిన యాసైనికులు వంటయిండ్లనక పడకగదులనక యటకలనక దొడ్లనక తోఁటలనక యెల్లతావుల వెదకి యుంగనల నవమానించి తమకుఁ గావలసినపదార్థములఁ నెల్లఁ జెప్పియుఁ జెప్పకయుఁ దీసికొని పోయిరి.

అట్లు వెదకుచు నిల్లిల్లుఁ దిరుగుచుండ నొకమంగలియింటిలోఁ గంబళిపఱచిన నులకమంచముపైఁ బండుకొన్న యొకపురుషుఁడు, వాని ప్రక్కం దాటియాకులచాపపైఁ గూర్చున్న యొక్కపురుషుఁడు సైనికులకగపడిరి. ఆమంగలిగుడిసెలో వారు దీపములయట్లు వెలుఁగుచుండిరి. ఇద్దఱు సుందరపురుషులే. ఇద్దఱు విశాలనేత్రులే. ఇద్దఱు మనోహరవక్షస్కులే. ఇరువురు నాజానుబాహులే. ఇరువురు స్ఫురద్రూపులే. అగుటచే నా సైనికనాయకుండు వారిలో నొకఁడై యుండునని ప్రసేనుఁ డూహించి మంచముపైఁ బండుకొన్న పురుషునిం జూచి నీపేరేమని యడిగెను. "నాపేరు మకరందుఁ"డని యతఁ డుత్తరము చెప్పెను.

వెంటనే భద్రసేనుఁడు లేచి "అయ్యా! మకరందుఁ డతఁడు గాఁడు. నాపేరు మకరందుఁడు" అని పలికెను. "నిజము చెప్పుఁడు ఇం దెవ్వరు మకరందుఁడు?" అని మరల నతఁ డడిగెను. "నేనే మకరందుఁడ. నేనే సుదర్శననందనుఁడ." నని మకరందుఁడు వెండియు నుత్తరమిచ్చెను. "అతఁడు కాఁడు. నేనే మాళవరాజనందనుఁడ' నని భద్రసేనుఁడు బదులు చెప్పెను. "మిత్రుఁడా! అబద్ధమాడకుము" అని మకరందుఁడు "మిత్రుఁడా! అసత్యము పలుకకుము" అని భద్రసేనుఁడును నొండొరులం గర్హించుకొనుచు మాటలాడిరి. "అతఁడు మామంత్రికుమారుఁ డైనభద్రసేనుఁడు. నేను మకరందుఁడ"నని మరల నాతఁడు బలికెను. "అయ్యా! యాతఁడు నామిత్రుఁడు భద్రసేనుఁడు. నేనే మకరందుఁడ"నని వెండియు భద్రసేనుఁడు వక్కాణించెను.

పౌరసంభాషణము ప్రసేనునకును, సైనికులకును, జకిత్సకుఁ డగుమంగలికిని, నచ్చట గుమిగూడిన గ్రామీణులకును మహాశ్చర్యముఁ గలిగించెను. అత్తఱిఁ బ్రసేనుఁ డిట్లనియె "అహా! మీచరిత్రము మిక్కిలి చిత్రముగానున్నది. ఎవ్వఁడు రాజనందనుఁడో యెవఁడు వానిమిత్రుఁడో తెలియుట లేదు. మీరు మాకు శత్రువు లయినను మీయుదారభావమును మేము బ్రశంసింపక తప్పదు. ఇందు మంత్రినందనుఁడు తనస్వామికి మారుగనిప్రాణమును గాచి తనప్రాణము పగఱ కప్పగింపఁ దలఁచుచున్నాఁడు. ఓహో! అతనిచరిత్రము మిక్కిలి శ్లాఘ్యము. రాజనందనుఁడు తనమేలు దాఁచుకొనక తనకొఱకై నిష్కారణముగాఁ దనమిత్రుఁ డేల పోవలెనని యథార్థము చెప్పుచున్నాఁడు. మంత్రినందనుఁడు బొంకుట పరోపకారార్థము. రాజనందనుఁడు సత్యముపలుకుట పరోపకారార్థము. వీరిం గన్నతల్లిదండ్రులు ధన్యులు వీరిజన్మలు చరితార్థములు. అయినను మాకుఁ

బగతుఁబగుటచే వీరినిరువురఁ నేనిప్పుడు బంధించి మారాజుకడకుఁగొని పోక తప్పదు. ఓహో! క్షాత్రధర్మము నిష్ఠురముగదా! నే నన్యథా వర్తింతునేని నాచేతులతో నాకంఠముఁ గోసికొన్నవాఁడనగుదును. అయ్యా! మీరిరువురు లెండు. నావెంట రండు"

అప్పుడు భద్రసేనుఁడు ప్రసేనునిం జూచి "అయ్యా! మీరు మాయుఁ గనున్నారు. మేమిద్దఱమున్నాము. నీవామూఁకకు మొనగాఁడవు. నీవొక్కఁడవాయుధముఁబూని మాతోఁ బోరి మమ్ముగెలిచి యటమీఁద మమ్ము బంధించి తీసికొనిపొమ్ము. లేదా మమ్ముఁ జంపుము అంతియ కాని క్షత్రియవంశమునం బుట్టి మీవెంట బందెలదొడ్డికిఁ బోవుపశువులవలె మిన్నక వత్తుమా?" యని వీరరస ముట్టిపడునట్లు ప్రత్యుత్తర మిచ్చెను. నాఁడు ప్రసేనుఁడు "నీమిత్రుని రమ్మను నీవు కావు. అని పలియింప మకరందుఁడు చివాలున మంచమునుండి లేచి వద్దు! వద్దు! నీగాయము ప్రమాదకర మగునని వెనుక భద్రసేనుఁడు వాదించి వారించుచున్నను వినక ప్రక్కనున్న ఖడ్గము దీసికొని "వీరుఁడా! నీమాటయే చెల్లుఁగాక!" యని ప్రసేనునియెట్టయెదుట నిలిచెను.

భద్రసేనుఁడు వానిని వారింప బహువిధప్రయత్నములఁ జేసెఁగాని గాయపడినవానిని సులభముగా గెలువవచ్చునని నీచమతితోఁ బ్రసేనుఁడు వానినే గోరుకొనుటచేతను మకరందుఁడు లేనియుత్సాహముఁ దెచ్చుకొని సమరసన్నద్ధుఁ డగుటచేతను, భద్రసేనుఁడు చేయునది లేక వారి కొప్పగించి చూడవలసి వచ్చెను. అప్పుడు ప్రసేనునకు మకరందునకు భయంకర మగు ఖడ్గయుద్ధము జరిగెను.

ఖడ్గములపరస్పరసంఘట్టనమువలన జనించినవిస్ఫులింగములు ప్రసేనమకరందులనేత్రగోళములనుండి వెలువడుక్రోధాగ్నివిస్ఫులింగములతో వియ్యమొందెను. ప్రసేనుఁడు భీషణభాషణంబులతో

వాళవరాజనందనుని బలుసారు లధిక్షేపించెనుగాని యతఁడు వాటికి దన కఱకకత్తిపోటులచేతనేగాని మాటలచేతఁ బ్రత్యుత్తరమియ్యలేదు. ప్రేక్షకులు మహాశ్చర్యముతో నాద్వంద్వయుద్ధముఁదిలకింపఁ జొచ్చిరి. వెనుకటిగాయముచేత రక్తక్షయముజెందిన తనచెలికాని కేసమయమున నెట్టియుపాయము సంభవించునోయని భద్రిసేనుడిగుండె కడు భయంబునం గొట్టుకొనుచుండెను. ఎట్టకేలకు నూతనముగాఁ గయ్యమునకుఁ దలపడినభద్రిసేనునికన్న మహాయుద్ధపరిశ్రాంతుఁడై గాయమునఁ జిక్కి నుఱ్ఱికియున్న మకరందుఁడే మిన్నయని యెల్లవారికిం దోఁచెను.

భద్రిసేనుఁడు పరిశ్రాంతుఁ డయ్యెను. మకరందునిఖడ్గప్రహారమున నాతఁడు చేయి తెగి నేలం బడెను. మకరందుఁడును మేన ముచ్చెమటలుగ్రమ్మ నతిశ్రాంతుఁడై నేలఁ జదికిలంబడెను. అప్పుడు ప్రసేనునిబంటులు తమనాయకుఁడు నేలంగూలుట జూచి నైపక హలుమ్మని యుంకించి మకరందునిమీఁదికి దుమికిరి. తోడనే భద్రిసేనుఁడు యొబలోనుండి తనకరవాలు మూడుఁజెతికి యనుమ్మాక పైఁబడి ముందుకువచ్చిన గొప్పరుబంట్లను నఱికితక్కినవారిపయిఁబడెను. వెంటనే వారు వానియెదుట నిలువలేక గాలికెగిరిపోవు దూదిపింజల చందంబున నలుదెసలకుం బరువెత్తిరి.

మాపరు మకరందునియొక్కయు, భద్రిసేనునియొక్కయు సౌజన్యంబును, సౌహార్దంబును, విక్రమంబును వేయినోళ్ళం గొనియాడిరి. అప్పుడు భద్రిసేనుఁడు తా మచ్చోటనుండుట క్షేమంబుగాదని మిత్రునకుం దెలిపి ముందుగా నయ్యూరు విడిచి పరిసరంబున నున్నయడవికింజని యటమీఁదఁ దమకర్తవ్యమును విచారింపఁ జొచ్చిరి.

దఁగలవు. నీ వైఖరిఁ జూడ మహారాజాంతఃపురవాసినివలెఁ గానఁ బడుచున్నావు. నీకిష్టమగునేని నీచరిత్రము మాకుఁ జెప్పుము." అని పలికిరి. అప్పు డామె తనవృత్తాంత మంతయు వారి కెఱిఁగింప వారు కాశ్మీరమహారాజపత్నియుఁ బాంచాలరాజనందనయు నైనయామాదేవి కిఁ బ్రాపించిన దురవస్థకు నెంతేని దురపిల్లి యతిగౌరవంబునఁ గడునాద రంబున నింతింతయనరాని వినయంబున, నామె కుపచారంబులు సల్పి నెమ్మనంబున ధైర్యము పురికొల్పి యాత్మహత్య మహాపాతక మని దానిపై రోఁత బుట్టించి తక్షశిలం జేర్చిరి. అక్కడ నుపనిషద్రహస్య పరిజ్ఞాతలై వైదిక మతావలంబకులైన సన్యాసులును, శాస్త్రాధ్యయన ములనిమిత్తమై వచ్చి విద్యలం గఱచుచున్న బ్రహ్మచారులును, ధర్మ పథము, త్రిపిటకము, హీనాయనము, మహాయనము మొదలగు బౌ ద్ధగ్రంథపఠనంబులచే ధన్యులై, విశాలములగు విహారములందు విడిసి యున్న బౌద్ధ భిక్షువులును, బరమనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మచర్యవ్రత దీక్షా పరతంత్రులై యగ్నిశిఖల వలెఁ బవిత్రలైన భిక్షుకీజనములును, జూచి సంతసించి యాభిక్షుణీసమూహముతోఁ గలసి కాలక్షేపముఁ జేయుఁ జొచ్చెను.

అట్లు శక్తివర్మ సింగపుంగొదమలవంటి కొమరులఁ దీసికొ ని కాశ్మీరగాంధారదేశముల సరిహద్దులం జేరునప్పటికిఁ జండుఁడు నిరంతరము లయినప్రయాణంబులం జేసి వారిం గలిసికొనెను. గాం ధారదేశపు సరిహద్దులం బాలించు వీరసేనుఁడు లోకోత్తరలావణ్య విశేషంబులు గలరాకొమరుల నెమ్మొగములు జూచి వారు సామా న్యులు గారని గ్రహించి వారిని రావించి వారిచరిత్రములడిగి శక్తి వర్మ ముఖమున నంతయుఁ దెలిసి జాలినొంది యతిస్నేహంబున వా రిం గౌరవించి రాజకుమారులకుం దగినయాందోళికంబులఁ జేయించి యంద లము లెక్కించి చండునకు శక్తివర్మకు నశ్వముల నిచ్చి యిట్లనియె-

"మా మహారాజుగారు భాగ్యవర్ధనుఁడు సత్పురుషుఁడు. మీచరిత్రము విన్న జాలిఁబొంది మీకు సాయముఁ జేయును. ఆయనకుం గొడుకులు లేరు. సౌదామిని యనుకూఁతురు గలదు. పదునాలుగేండ్ల ప్రాయము గలది. మిక్కిలి చక్కనిది. తగినవరుని సంపాదింపలేక యాయన మేఱమీఱినవిచారము నొందుచున్నాఁడు. అందుచే నాయనకు మీరాక పరమసంతోషజనకమై యున్నది. కావున మీరాగివాహనంబులెక్కి యచ్చోటికిం జనుఁడు. నేను మీరాకవార్తఁ బంపెదఁ దెలియఁ బఱచెద."

అనవుడు శక్తివర్మ మహాప్రసాదమని వానిమన్నన నంగీకరించి కృతజ్ఞతఁ దెలిపి బాలకులం దోడ్కొని గాంధారమునకుం జనియెను. గాంధారనాథుఁడగు భాగ్యవర్ధనుఁడు వీరిని బాలురం జూచుకొని సంతసించి రాజకుమారునకు నమస్కరించి తోడ్కొని రమ్మని తనయమాత్యు నంపి వారిఁ దన యంతికమునకుఁ దెచ్చి నపిదప వారిని కౌఁగిలించుకొని మెండుగ సన్మానించి సంపఁగినూనెతో రాకొమరులకుఁ దలయంటించి యమూల్యవస్త్రములం గానుకల నాభరణంబుల నిచ్చి యభ్యంతరమందిరంబున నివసింపఁజేసెను. చంద్రశక్తివర్మలకును దగిన గౌరవంబు సలిపెను. ఆరేయి భోజనాదులనం న శక్తివర్మ వారు మంచములకడ నున్నప్పుడు బాలురకు జరిగిన దారుణవృత్తాంతమంతయు విని భాగ్యవర్ధనుఁడు వారిమంత్రులు మహాదుఃఖపరవశులై దాని నోర్చుకొనలేక బాలకులచేత చిత్రభానుని దౌర్జన్యమును వేయితెఱంగుల గర్హించి యక్కిరాతునకు భగవంతుఁడు తగినదండనము చేయఁడే యని మొఱ్ఱపెట్టుచుఁ బలికిరి. బాలకులం జూచినదిమొదలుకొని భాగ్యవర్ధనుఁడు వారియెడ నత్యంతస్నేహంబు గలిగి విక్రమసేనునకుఁ దనగారాబుకూఁతురగు సౌదామిని నిచ్చి పెండ్లిచేయవలె ననియుఁ దనతమ్మునికూఁతు రయిన చిత్రరేఖ

ను హర్షవర్ధనున కిచ్చి వివాహము సేయవలె ననియు నిశ్చయించి జ్యేష్ఠునిఁ గాశ్మీరసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టవలయు నని సంకల్పించెను. తనమనోనిశ్చయమును మంత్రులకు సేనాపతులకు రహస్యముగఁ జెప్పి దండయాత్రాసన్నాహమును జేయింపుమని యానతిచ్చెను. ఆనతిచ్చుటయే తడవుగా రాజకార్యపరతంత్రులగుమంత్రులు గజరథతురగపదాతిసైన్యంబుల నాయత్తము సేయఁ జొచ్చిరి.

గాంధారరాజాంతఃపురమున రాజకుమారులుసకలసౌఖ్యముల ననుభవించుచున్నను దల్లిజాడ తమకుఁ దమజాడ తల్లికిఁ దెలియకపోవుటచే నెల్లప్పుడు మాతృవియోగదుఃఖమున గ్రుక్కుచుండిరి. ఆమెజాడలు నరయుటకై నిపుణులగు వేగులవాండ్రం బంపుమని భాగ్యవర్ధనునిం బ్రార్థించిరి. ఆతఁడు వారియభీష్టప్రకారము జేసెను.

మాధవసేనుఁడు, మహేంద్రదేవునిచే బహుముఖ పరాజయము నొందినతోడనే తాను పరాజితుఁడై మహేంద్రదేవునితోడఁ బొంచాలపునముకరిగి యపజయమువలన నిర్విణ్ణుఁడై యున్న యాముదుసలితేనికి ధైర్యముఁ గొలిపి యుత్సాహము పుట్టునట్లు పూర్వరాజులచరిత్రంబులు పురాణగాథలు జెప్పి జయము తప్పక సేకూరు నని నమ్మికపుట్టఁబలికెను. అతఁడును మాధవసేనుని దనకు హితోపదేశకునిగా నేర్పఱచుకొని రాజభక్తిహీనులయిన నియోగులఁదొలఁగించి స్వామిభక్తియుక్తుల నధికారములందు నియోగించి మరల సమరసన్నాహము జేయింపఁజొచ్చెను. ఈసారి యుద్ధములో జయము యిన సేకురవలయు లేదా, తనప్రాణములయినసమరరంగమున కర్పింపవలె ననియు మాధవసేనుఁడునిశ్చయించుకొని యతఁడు దృఢప్రయత్నము జేయఁజొచ్చెను.

అట గర్గసేనుఁడు మాళవరాజసైన్యము లోఁజిపోయి నానాముఖంబులకుం బరుగులెత్తుటఁ జూచి మరల, సేనం గూడఁగట్టుటకు బహు

ప్రయత్నములఁ గావించెను. ఆతని ప్రయత్నము లరణ్యరోదనము లయ్యెను. ఆతని మనస్సు పరాజయమువలన జనించిన పరాభవమునను దనకొడుకు రాజుకొడుకుం గానఁ బడమిఁ బొడమిన విషాదమువల్లను మిక్కిలి దుఃఖనిలయమై యుండెను. "నన్నునమ్మి నాసామర్థ్యమందు విశ్వాసము గలిగి తనకొడుకున కేయపాయము రాకుండ నేను జేయఁగల నని మనోనిశ్చయముగలిగి సేనల నావశముజేసి పంపినందుకు నేనింతచేసితిని. పోనీ! జయాపజయములు దైవికములు. వాటికేమి మఱియొకసారి గెలువవచ్చు ననుకొందము. అతఁడు తనకుమారుని నాకప్పగించె. చంద్రప్రభాదేవి పంచప్రాణము లాతని మీఁదనె పెట్టుకొనియుండు. ఆతలిదండ్రులు వాకొడు కేఁడనియడిగిన నేమిచెప్పుదును? ఇంక మాభద్రసేనునిమాట నే నేమనుకొందును? పరమమిత్రు లయినయక్కుమారు లిరువురు సమరమున మడిసియుందురా? పగతుఱచేఁ జిక్కియుందురా? ఏమిగతి! ఏమయిననేమి. నేను మాళవంబునకరిగి సుదర్శనుని గాంచి దండయాత్రా విషయము లాతనికిఁ జెప్పి సమాశ్వాసించి మరల యుద్ధసన్నాహము జేయించెదను. ఈపరాభవవ్రణము విజయంబను నౌషధంబునం గాని మానదు." అని రత్నసేనుఁడు తనలో వితర్కించి యోడ నడిసముద్రమున బగిలినప్పుడు దానిచెక్క నొకదానిం బట్టుకొని నా... ప్రాణములు దక్కించుకొను బాటసారివోలె నాతఁడు హతశేషులగు సైనికులం గూర్చుకొని యుజ్జయినీనగరసమీపమునకుం బోయెను. ఇప్పటికి మాళవదేశస్థితి యెట్లుండవలెనో యట్లుండెను.

మగటిమి నెఱపఁగల సైనికు లందఱుఁ గాశ్మీరదేశముపై దండు విడియుటకుఁ బోయినందున విదర్భరాజుసైన్యంబులు గట్టిగొళ్ళెములు లేని తలుపులు గలయింట దొంగలు సులభముగఁ జొచ్చినట్టులాహారశూన్యమై కృశించియున్న వానిమేన రోగములు దూఱినట్లు

చిత్రభానున కావృత్తాంత మెఱిఁగించుచుండఁ జాటుననుండి విని మల్లిక పరుగుపరుగునఁ గర్పూరమంజరికడకుఁ బోయి "సఖీ! నీకుఁ బ్రియ మెఱిఁగించెద. ప్రియ మెఱిఁగించెద" ననియెను. "ఓసీ! మరణమునకు సిద్ధముగా నున్న దానికిఁ బ్రియమే మున్నదే!" యని యామె విసుగుతోఁ బలికెను. "సఖీ! అమంగళము నోట రానీకుము. మకరందుఁడు సుఖముగా నున్నాఁడు. గాయము కుదిరినది. అది కుదురుటయే గాదు. మనసేనాధిపతులలో నొకఁడైన ప్రసేనుని ద్వంద్వయుద్ధమునఁ దాఁకి బాహుసంతోషిబలము చూపి నతనిఁ గెల్చినాఁడు. శౌర్యరాశియైన ప్రసేనుఁడే చచ్చినందుకు మీతండ్రిగారు చింతిల్లుచున్నారు." అని మల్లిక విన్నవించెను.

అప్పలుకులు కర్ణరంధ్రములఁ జొచ్చినంతనే పండుకొనియున్న కర్పూరమంజరి దిగ్గునలేచి పాన్పుపైఁ గూర్చుండి "మల్లికా! ఏమేమి? ఆయన సుఖముగా నున్నాఁడా? నిజముగా నాకుఁ బ్రియ మెఱిఁగించితివే. ఇదిగో! ఈ యుంగరము నీవు పారితోషికముగా గ్రహింపుము. నా కాయనపాణిగ్రహణభాగ్యము లభించినను లభింపకపోయినను జీవించి యున్నవాఁ డనియు, సుఖముగా నున్నవాఁ డనియు వింటి నదియె చాలు!" నని పలికి కొంత యూరటఁ గలిగి వెండియు నెన్నఁడైన నాతనిసంపర్కసముఁ జేయు పుణ్యకాలము లభింపఁజేయు మని కాత్యాయనీ దేవిని బ్రార్థించెను. మల్లిక యామె కోరిక నెఱవేర్పు మని భగవతి గౌరిని దానును వేఁడుకొని "సఖీ! తప్పక నీ కాతనిసమాగమము గలుగునని యెంచుచేతనో నాకు గొప్పయాస గలదమ్మా! అందుచేత నీ వూరటగలిగి యుండుము." అని ధైర్యము జెప్పెను. "ఓసీ! నీ వంతకన్న నేమని యెదవు? నీప్రియసఖి బెంగటిల్లి చిక్కి శల్యమై మృతినొందు సమయమున నీ వాశాగుటికలు నాచేత మ్రింగింపఁజూచుచున్నావు. ఏమైన నగుఁ

గాక! మన మేమి సేయఁగలము!" అని నిట్టూర్పు విడిచి వెండియుఁ బానుపుపైఁ బడుకొనెను.

అప్పుడు త్ర్యంబకుండును మకరందభద్రసేనులు కొండొక వృక్షచ్ఛాయఁజేరి యేమిచేయవలయునని సమాలోచనము సేయఁజొచ్చిరి. అప్పుడు [illegible] మిత్రున కిట్లనియె. "భద్రసేన! నే నుజ్జయినికిఁ బోఁగా [illegible] నే నెంతో మొనగాఁడ నని మహాసైన్యముం [illegible] పై దండువెడలి యుద్ధమునం దోడిపోయి [illegible] గము విడిచి పాఱిపోయి యిప్పుడేమొగము పెట్టుకొని పట్టణమునం బ్రవేశింతును? నాయం దెంతో గౌరవముగల యుజ్జయినీపురవాసుల మొగము లెట్లు చూతును? సిగ్గులేక నా తలిదండ్రుల మొగము లెట్లు చూతును? నే నాయన కడుపుచెడఁ బుట్టితిని. నాజననము పవిత్రమైన మాళవరాజవంశమునకుఁ గళంకము గలిగించెను. చంద్రలేఖాదేవి వీరమాత యగుటకు మాఱుగా భీరుమాత యయ్యెను. కర్పూరమంజరీ పాణిగ్రహణము నాకు సంప్రాప్తింపక పోవుటయే మేలయ్యె. నావంటి పందను బెండ్లిచేసికొన్నపక్షమున నామె వీరపత్ని కాక భీరుపత్ని యై నాటి రాజకన్యకలలోఁ దలవంచుకొనవలసి యుండును. హేమచంద్రునితనయులకు సాయము జేసి వారి కుపకారము చేయవలెనని వచ్చి నే నంత జేసితినిగదా! ఆబిడ్డ లేమయిరో తెలియదు. ఛీ! నాబ్రతు కేల? మిత్రుఁడా నేనింక నింటికి రాను. భగవానుఁడగు బుద్ధదేవుని కపిలవస్తునగరమున కరిగి భిక్షువునై యుండెద. లేదా, భిక్షుకసాహస్రము గలతక్షశిలకుఁ జని వారి శిష్యుఁడనై జ్ఞానసంపాదనముఁ జేసెద. పరాభవాగ్నిదగ్ధమగుచున్న నామనస్సును శాంతిపఱుచువారి పొడకట్టుటలేదు."

అర్ధనిర్వేదద్యోతకము లయిన యాతనివచనముల నాలకించి భద్రసేనుఁడు నవ్వి "మిత్రమా! వజ్రము మెత్తపడినది. అగ్ని వేఁడిం

లో నెట్లులభించు?" నని నిట్టూర్పు విడిచి చెట్టునీడం బండుకొని యెను "మిత్రుఁడా! భయపడకు. అడవులలో నేరులు, వాఁగులు, చెఱువులు నుండకపోవు. నే నీసమీపమున నెందయిన జలాశయ మున్నదేమో యరసి యుండివచ్చెద. ఈనీడను విశ్రమింపుము" అనిపలికి తోడనే యాతఁడు జలము నన్వేషింప బైలుదేరెను.

అమితమైన యాయాసమున నలసియున్నకతమున మకరందు నకు మహీరుహచ్ఛాయను బండుకొనినతోడనే నిద్రపట్టెను. నిద్ర సుఖమెఱుఁగదన్న సామెత నిజము గదా! చంద్రశాలలలో దాసదాసీ విలాసినీజనములు వట్టివేళ్ళవీవనల విసర మెత్తని హంసతూలికాతల్పం బులపైఁ బవ్వళించు మహారాజకుమారునకు నట్టడవిలోఁ జెట్టునీడ వట్టి నేలఁ బండుకొన్నను సుఖనిద్రపట్టెను. భద్రసేనుఁడు వనంబునఁ గొం తదూరము సాఁగి మనోహరములయిన తామరపూవుల తోడను, జల్లని తియ్యనినీటితోడను నిల్లుకొన్న చెఱువుఁగనుఁగొని రాశీభూతమ యిన శరన్మేఘమా యనఁగా దానిని భావించి విశాలములయిన తామరాకులు దొన్నెలుగాఁ గట్టి నాలుగుదొన్నెలనిండ నీరునించి మిత్రుని కేదేని రోగప్రాప్తినేమో యను భయమున నతివేగంబున వచ్చి చెట్టుక్రిందఁజూచునప్పటికి మకరందుఁ డక్కడ లేకపోయెను. భయము విస్మయము, సంభ్రమము మనంబున ముప్పిరిగొన నతఁడు దాహమున కాఁగలేక నీరుకొఱ కెందైనఁ జనియెనేమో యని శంకించి "మకరం దుఁడా! మకరందుఁడా!" యని యెలుఁగెత్తి పిలిచెను. అప్పలుకుల కుత్తరము లేదు. వెంటనే సందియములు హెచ్చెను. మనస్సు విషా దాక్రాంత మయ్యెను. శరీరమందుఁ జేవ డిందుపడియెను. నిలువలేక చెట్టునకుఁ జేరఁబడి డస్సియుండి యతఁ డిట్లు విచారించెను. "ఇతఁ డేమైయుండును? అతిపిపాసావశమున మృతినొందినచోఁ గళేబర మిం దుండవలయునుగదా! అట్లు కాదు. దుష్టమృగము లేవైన దస్సి బల

వైతివిగదా! మహేంద్రదేవుఁడోడె. మాళవసైన్యమోడె. మకరందుఁడు కథావశేషుఁ డయ్యె. సుదర్శనుఁడు రాజ్యశూన్యుఁ డయ్యె. నీప్రతాపాగ్నికిఁ బగతుఱడళములు మిడుతలై పోయినవి. భరతఖండమునందు నేఁటికాలమున నిన్నుమించినరాజులు లేరు. రామరంతిదేవమహాభిష మాంధాతృప్రముఖు లగురాజన్యులతోడ సమానుఁడ వైతివి. నీయశోలతలు హిమాలయము మొదలుకొని రామసేతువునఱకుఁ గలభారతవర్ష మంతట నల్లుకొన్నవి. అనేకమహీపాలురు నీసఖ్యము నపేక్షించుచున్నారు. రత్నగర్భలవంటిగ్రామములు గలమాళవపాంచాలదేశంబులు నీపాదాక్రాంతములై యున్నవి. రాజులు నీయానఁ బూలదండవలె శిరంబున ధరించుచున్నారు. రాజన్యమకుటమాణిక్యకాంతులు నీపాదపద్మములకు నీరాజనము వెట్టుకాలము సంప్రాప్తించినది. కష్టములు గట్టెక్కినవి. ఇంక నీవు పట్టాభిషేకముఁ జేసికొనుము. తద్విషయికప్రయత్నముఁ జేయించెద. నీవనుజ్ఞ నిత్తువేని దానికిం దగుసుముహూర్తము నిర్ణయించి వలయుపనులం బ్రారంభించెద." అని పలుక చిత్రభానుఁడు "పట్టాభిషేకమున కంత తొందర యేమి? ఎప్పుడో చేసికొనవచ్చును. మాళవపాంచాలురు మరల వత్తురేమో చూడవలయుఁగదా!" యనిబదులుచెప్పెను.

"మాళవపాంచాలురు మరల వచ్చుటా! చచ్చినవాఁడు మరల బ్రతుకఁడు. పగిలినకుండ మరల నదుకకొనదు. నేల నొలికిననీరు మరల నెత్తుట సాధ్యమా? మహేంద్రదేవుఁడు శతవృద్ధుఁడు. రాజ్యవృక్షమునకుఁ జీడపురుగులు పట్టినవి. మాళవుఁడు బౌద్ధుఁడు. నాస్తికుఁడు. పరమేశ్వరుఁడు నాస్తికులఁ దల యెత్తనిచ్చునా? ఆస్తికులలో నగ్రగణ్యుఁడ వయిననీచేత భక్తవత్సలుఁ డగుపరమేశ్వరుఁడు లోకద్రోహు లగుబౌద్ధులను నాశనము జేయింపఁ దలఁచినాఁడు కాని యీసందర్భమున నిన్నొక్కపర మడిగెద. అది యేదన క్రొత్తగా

జయింపఁ బడి మనయధీన మయినమాళవదేశమునకు నీకుమారుని విజయసేనుని రాజుగాను నన్నాతనిమంత్రిగాను నీవు నియోగింప వలయు నని నాకోరిక. ఈముద్దుచెల్లింపుము. ఈవేఁడుకోలు ననుగ్రహింపుము. ఈవర మొసఁగుదువేని మున్ను నష్టమైననాప్రతిష్ఠ మరల బ్రతిష్ఠింపఁబడును సుదర్శనుఁడు చేసినపరాభవమువలన నేను తొల్లి పూవులమ్మినయూరిలోఁ గట్టె లమ్మితిని. నీయనుగ్రహ మున్నపక్షమున వెండియుఁ గట్టె లమ్మినయూరులోఁ బూవు లమ్మెద. పూవు లమ్ముటే కాదు. ఉజ్జయినీపట్టణమును మంగలమునం బెట్టి వేచెద బౌద్ధవిహారముల నెల్ల నేలమట్టము జేయించెద. వాటితావున శివాలయముల నిర్మించెద. నాస్తికాధముఁడయినసుదర్శనునినివాసమువలన నపవిత్రము లయినయాయంతఃపురముల, మేడల, మిద్దెలఁ బరశురామప్రీతి గావించి నిర్మూలించి యచ్చట ముండ్లకంపలు వేయించి జిల్లేడుమొలకల నాటించెద. అంతేగాదు సుదర్శనుఁడు నన్ను నిండు కొలువుకూటములోఁ బరాభవించి దేశభ్రష్టుఁ జేసిననాఁడు సభాభవనమం దుండియు నన్నుఁబురస్కరించుకొని యొక్కమాటయినననాడక యూరకుండిన యధముల సందఱ బుద్ధివచ్చునట్లు తగురీతి దండించెద. అదియునుఁగాక పలుమాఱు నాతోఁ దైవాస్తిక్యమునుగూర్చియు వేదప్రామాణ్యముల గూర్చియు, వాదులుసల్పి రాజు వారిపక్షమున నున్నకతమున వానిబలమున నన్నోడించి యుపహసించిన చపసింహుఁడు, హిరణ్యమిత్రుఁడు, సత్యమిహిరుఁడు మొదలగు మానవాధముల నాస్తికబ్రువుల బౌద్ధపాంసనులఁ బంధు కొలిపించునట్లు మెడత్రాళ్ళ నొలిపించియు బ్రతికియుండఁగానె గడ్డివాములలోఁ బెట్టి కాల్పించియుఁ జెఱుకుగట్టులట్లు గానుగలలో వైచి పిండింపియు, నానాహింసలపాలు జేసి చిరకాలంబునసుండి నామనంబునమండుచున్న క్రోధాగ్నిని వారినెత్తురులవలనఁ జల్లార్చుకొనియెద. కేసరి యాసునమాత్యు

"రాజా! బూడిద బూసికొని, నీర్కావిగుడ్డం గట్టుకొని పండ్లు, పాలు, దిని తపంబు జేసికొను పరమవైదికునకు రాజ్యసుఖము లేల యాందోళికలేల హారములేల, యగ్రహారములేల. తపోయోగనిష్ఠశ్రేష్ఠులము లై భగవంతునివలనఁ బ్రజాపాలనాధికారము బడసినారమని చెప్పుకొనెడి వహిం చిన మీవంటి ప్రభువులకు విధినిర్దేశములు. ప్రస్థానములు, దర్భాసనములు రుద్రాక్షములు జటాజూటములు మున్నగునవి మాకునిత్తము నిర్మింపఁబడినవి. ఆశలు జయించినవారె బ్రాహ్మణులగుదురు. అసంతుష్టిగల బ్రాహ్మణుఁడు సంతుష్టిగల రాజును చెడుదురని విన లేదా? రాజా! ఇంక నీపట్టాభిషేక ప్రయత్నము నుడుగుము. నామంత రాజులకును సాటిమేటి నృపులకును పట్టాభిషేక మహోత్సవమునకు రమ్మని సగౌరవంబుగా నాహ్వానము పంపెదను. సరయువు, సరస్వతి, భాగీరథి యమున మొదలగు పవిత్రనదులజలములు స్వాధ్యాయవేత్తలయిన బ్రాహ్మణోత్తములచేఁ దెప్పించెద. ప్రతిదేవాలయమున నీయభ్యుదయమునిమిత్తమై యభిషేకము చేయించెద. నగరమంతటను సూర్యరశ్మి గనఁబడకుండ బందిళ్లు వేయించి యనఁటి కంబముల నాటించి తోరణములఁ గట్టించి విభవమునందు శృంగారలక్ష్మి ఘలుఘల్లుమని తాండవనృత్యము సలుపునట్లు—దేవేంద్రుఁడు తనవీటికన్న నిది యందముగా నున్నదని వెఱఁగున్నదని దెఱపి చూచి వెఱఁగుపడునట్లు—పుర మలంకరించెద. దశదిశలనున్న భూసురోత్తముల నందఱ రావించెద. సంతర్పణముల సమారాధనములఁ జేయించెద. భూరిదక్షిణలచే వారిని దనిపి సన్మానించెద. బ్రాహ్మణాశీర్వాదములతోడను, బ్రజలయానందధ్వనులతోడను, మంగళతూర్యరావంబులతోడను, వారవిలాసినీ గానధ్వానములతోడను, భూనభోంతరములు నిండునట్లు—దశదిశలు మారుమ్రోయునట్లు—గగనము బీటలువాఱునట్లు—మహేంద్రుఁడు సహితము మింటనుండి చూచుచుండఁ

ఖు [illegible] వీఁ డెవఁడురా నూతనముగా వచ్చెనని గుండెలు పీచుపీ చు [illegible] బెరిబెకరి చూచుచున్నట్లు- చూపఱునీపురము కలియుగ వైకుంఠ వ [illegible] చున్నట్లు— నీకీర్తి యాచంద్రతారార్కము భూమిపై ని [illegible] ట్లు— మహోత్సవముఁ జేయించెదఁ జూడు. అని యుత్సా హ [illegible] వెళ్లిపిటియుఁ బలికెను. చిత్రభానుఁడు రుద్రభట్టుం జూచి హ [illegible] వ్వులు నవ్వ తలయూఁచెను.

అనంతరము వజ్రపాణి వచ్చి యటయు నతనిని జయములవిష [illegible] రిశేఖరంబని పట్టాభిషేకానంతరము నావచ్చని పందిళ్లలోనే [illegible] రంజరి [illegible] వివాహము జేయించునట్లు జెప్పి పంచెను. వ [illegible] యానన్న వివాహమహోత్సవమున కువ్విళ్ళూరుచుఁ బిచ్చిద [illegible] యిల్లాలిని బిడ్డలను వివాహమున కడ్డురాకుండ నామొప్పుట్టి నిలిపెఁ భంచెను.

## ముప్పదిరెండవ ప్రకరణము.

పూర్వప్రకరణమున వర్ణింపఁబడిన ప్రసంగము జరిగిన రెండవ నాఁడు [illegible] భానుఁడు రుద్రభట్టు కోటలో నొకగదిలోఁ గూర్చుండి [illegible] ములఁగూర్చి ప్రసంగించుచుండఁ బదుగురు రాజభటుల [illegible] సుషేణుం డను చిన్న సేనాపతి దర్శనాపేక్షియై ద్వారపా లు [illegible] తెలిసి కెఱిఁగించెను. రావచ్చునని ప్రభు వాన తీ [illegible] డు లోనికరిగి జోహారు చేసి యిట్లువిన్నవించెను. "మహా ప్రభూ! దేవరవారిపంపున నల్పసేనం దీసికొనిపోయి యొకయడవిలో మా [illegible] మాడు [illegible] మకరంమని బట్టుకొంటిని. ఆతఁడు ప్రియా

పక విడుచుట ధర్మముగాదు. రాజా! మీఁద నీచిత్తము" అని రుద్రభట్టు చెప్పెను.

"ఓహో! నీవు రుద్రభట్టువుకావా? మాతండ్రిని వంచించి తత్స్థలముగా దేశభ్రష్టుడవైయుండఁజేరి యీరాజునకు దుర్బుద్ధులుగఱపుచుంటివా? కారణమున్న నాకేమియు భయము లేదు. పాపకర్ముఁడవైన నీకే మరణభయముగలదు. పుట్టినవాఁడు గిట్టక మానఁడు; గిట్టినవాఁడు పుట్టక మానఁడు." అని మకరందుఁడు రుద్రభట్టున కుత్తరము చెప్పెను. అంతలో సేవకులు వానిని మెల్లగా నావలకుఁ దీసికొనిపోయి యా కారాగృహమున బంధించిరి.

"మల్లికా! నీ చేసౌ చంద్రికతో రహస్యముగాఁ జెప్పుచుంటివని యేమే! మీఱాత్రిసమయములో మకరందుఁ డనుమాట నాచెవిని బడెను. యథార్థము చెప్పవే! అతఁ డేమైనాఁడే? ప్రాణముతో నున్నాఁడా? నామీఁద దయయుంచి చెప్పవే!" యని కర్పూరమంజరి యడుగ మల్లిక మొదటినుండి యదియామెకుఁ దెలియకమాన దని మకరందుఁడు కారాబద్ధుడైన వార్త యామె కెఱింగించెను.

అది విని కర్పూరమంజరి యింతింత యనరానివంతం దగిలి మల్లికఁజూచి యిట్లనియె, "ఓసి! మెత్తనిచిగురుటాకుల మెచ్చనియాయనుగులు సంకెళ్ళ నెట్లోర్చునే? ఆ బాహులతికలు శృంఖలాబద్ధములై యెంతనలిగెనో! నాకొఱకై యంతఃపురవాసముఁ జేయు నాసుకుమారి కారాగృహమున నెట్లుండఁగలఁడే? కటికినేలం బవ్వళింపఁగలఁడే? తినుటకు వీలులేని యాహారముకూడు నాసుకుమారి తినఁగలఁడటే? అయ్యయ్యో! ఎంతకష్ట మెంతనష్టము. అదియటుండ నాతండ్రి వానిం బ్రతుకనిచ్చునఁటే? ఆతఁడు దయతో నెట్లో బ్రతుకనిచ్చినను క్షుద్రమనస్కుఁడైన రుద్రభట్టు వానిని వధింపుమని నాతండ్రిం బురికొల్పి కృతకృత్యుఁడు గాకపోవునే? అయ్యయ్యో! నేనున్న తావుననే వాని కవసాన

సంహారిస్తించుచున్నదా!" యని పరిపరిభంగుల విలపింపఁ జొచ్చె నాఁటంగోలె నామె పట్టినేలం బవ్వళింప నారంభించెను. ఆహా రము వర్జింప సంకల్పించెను. చెలికత్తెలు బతిములాడ నించుకింక దిని యూరకుండును. చెఱసాలలో నతఁడెట్లు కష్టపడుచుండెనో యంతఃపురమం దుండియుఁ దాను నట్టికష్ట మనుభవింపవలెనని సంకల్పించెను. వివాహమైన తరువాత భార్య పతివ్రతయై భర్తృమార్గ మనుసరించుట లోకమం దున్నదిగాని పాణిగ్రహణము గాకమునుపే కామించినపతి గోడిదేలోకమని యంతనికొఱకై కష్టములు పడుట యెందుఁ జూడలేదని చెలికత్తె లామెతో నని యప్పటినుండి మరల్పఁ బ్రయత్నించినను నామె మానదయ్యె.

అట మకరందుఁడు కారాగృహవాసి యయ్యుఁ దనహృదయమునఁ గర్పూరమంజరిని నిలుపుకొని యన్నపానాదులఁ దెచ్చినపరిచారకులను గావలివాండ్రను, గర్పూరమంజరీకుశలవార్తల నడుగుచు నామెం గూర్చియే స్వప్నములఁ గాంచుచు నామెతో మనస్సమాగమసుఖము బడయుచు నామెం గలసికొనుటకు నుపాయమేదైన లభించునాయని నిరంతరముఁ జింతించుచుఁ గాలము పుచ్చుచుండెను.

మకరందునిఁ జూచినది మొదలుకొని సుదర్శనునిమీఁదఁ గల దీర్ఘక్రోధముచేత రుద్రభట్టు మకరందుని జంపింపవలయునను దృఢ సంకల్పము గలిగియుండెను. వాని చక్కఁదనముఁ జూచియు, వాని పైఁ దనకూఁతున కనురాగ ముండుటచే వానిని వధించిన దనకూఁతు రేమగునోయని సందేహము గల్గియు రుద్రభట్టు ప్రేరణచేసినను జిత్రభానుఁడు మాళవరాజనందనుని జంపింపక యూరకుండెను. అందుచే రుద్రభట్టుకు మనస్స్థిమితము లేకపోయెను. త్వరితముగా వానినెట్లు తుదముట్టింపవచ్చునని యుపాయములు వెదకుచు నొకనాఁడు వజ్రపాణిం బిలిచి యిట్లనియె—"వజ్రపాణి! నీకొక్కహితోపదేశముఁ

జేసెద. అది నీమనస్సులోనే యుంచుకొమ్ము! చిత్రభానున కైన తెలియనియ్యవద్దు. ఈయుపదేశము నాకడుపులో జన్మించి నీకడుపు నన్నమింపవలయు. కర్పూరమంజరిని చిత్రభానునకు నిచ్చి వివాహము సేయందలంచినమాట నిజము. కాని, కర్పూరమంజరి యామకరంద ని వలచినది. నీయం దామెకు లేశమైనను ననురాగము లేదు. అను రాగము లేకపోవుట యేగాదు. నీపేరు విన్న నామెకుం దలయేలు. దానికిం దోడుగా వీఁడిక్కడికి వచ్చుట యనర్థకము. దానిని వెంటనే సంహ రింపవలసినదని చిత్రభానునకు నేను రెండుమూఁడుసారులు చెప్పి తిని. ఎందుచేతనో యతఁడు సంహరింపక యూరకున్నాఁడు. కావు న నక్కుమారుని దెగటార్చుమని నీవునుబట్టుపట్టి చిత్రభానునొడం బఱుపుము. వానిరక్తము కన్నులం జూచినంగాని నీవు నిద్రపోకుము. వానిమీఁద నాకేమియుఁ గోపము లేదు. కాని, నీవివాహము నిమి త్తమై నేనీయులమటం బొందుచుంటిని. నీవు కర్పూరమంజరి కేలు పట్టిననాఁడు నాకన్నులు చల్లఁబడును. చిత్రభానుని పట్టాభిషేకముఁ జూచి, నీపాణిగ్రహణమహోత్సవముఁ జూచి, యనంతరము నేఁ దపం బుచేసికొన హిమాలయమునకరిగెద. ఈ రెండే నాసంకల్పములు. అందు మొదటిది జరిగినట్లే. రెండవదియు జరిగినట్లేగాని వీనిం దెగ టార్చిన నిస్సందేహముగా నది జరుగును. కావున నప్పని యతివేగం బున జరుగునట్లు బ్రయత్నింపుము."

ఆపలుకులు చెవిని బడినతోడనే వజ్రపాణివజ్రహృదయము నీరయిపోయెను. పోవుటయు నతఁడు కఠిన స్వరముతో రుద్రభట్టున కిట్లనియె. "అయ్యా! కర్పూరమంజరి నన్నే వలచినదని నానిమిత్తమే పరితపించుచున్నదని నానామమే స్మరియింపుచున్నదని ప్రధానమైన నాఁడు నీవే నాకు చెప్పితివి. ఆనోటితోనే యామెకు నాయందనను రక్తిలేదని నాపేరువిన్నఁ దలయేలని యెట్లు చెప్పుచుంటివి? ఈరెం

డుమాటలలో నేది నిజము?" అని యడిగెను. అదుగుటయు రుద్రభట్టు తనమాటలకుఁ గలపరస్పర వైరుధ్యము మనంబునకుఁ దట్టిన య్యిక్కట్టునుండి తప్పించుకొనుటకు వెంటనే యుపాయ మన్వేషించి యుట్లనియె "ప్రథానమయినదినములలో నాబాలిక యట్లె నిన్నువలచి యుండెను. ఈనడుమ మకరందునిఁ జూచెనఁట! చూచినదాదిగా వానికై పరితపించు చున్నదఁట! పసుముకన్నెలకు బాగోగులు గలవా? ఎదుటనున్నవాఁడె పెండ్లికొడుకు. అంతేగాని నామాటలలో వైరుధ్యము లేదు. లేదు కావుననే నిమేలుకోరి వెంటనె చెప్పితిని. నాఁడట్లు నీకోఁ జెప్పియున్నమాట నాకు జ్ఞాపకములేదా? కావున నీవు నామీఁద ననుమానపడక నికార్యసిద్ధికై పాటుపడుము."

ఆమాటలు వజ్రపాణికి నచ్చెను. మఱునాఁ డావిషయమై చిత్రభానునితో నొక్కి చెప్పవలెనని యతఁడు సంకల్పించుకొని యింటికిఁ జనెను. అతఁడు పోవునప్పటికి వాని యుత్తరవాదియూరినుండి వచ్చిన యొక సేవకుఁడు నమస్కరించి యొక జాబు చేతికిచ్చెను. ఆజాబు తీసికొని యామూలాగ్రముగఁ జదువుకొని "ఓ. దైవమా" యని నేలఁ గూలఁబడెను. సేవకులు "స్వామీ! ఏమి యాపదవాటిల్లె" ననియడుగ నతఁ డుత్తరము చెప్పక జాబు చేతికిచ్చెను. వారు జాబు చదువుకొని "అయ్యో! సునందాదేవి యున్మాదపరమయిన స్థితిలోఁ బడి మరణించెనఁట! తల్లిలేని యాపిల్లలదుఃఖము వర్ణనాతీతమైయున్నదఁట. హా యెంతకష్టము. ఇలు కాలిపోయినది. ఇల్లాలు కూలిపోయినది. గోరుచుట్టుపై రోఁకటిపోటన్నమాట నిజమైనది యని విచారింపఁదొడఁగిరి. అప్పుడు వజ్రపాణికి దుఃఖముతోఁ గూడఁ బశ్చాత్తాపము గలిగెను. తనయనాదరణమువల్లనే, తనయప్రియసంభాషణములవల్లనే, తనయజాగ్రత్తవల్లనే, ఆమెకు మనశ్చాంచల్యము గలిగినదనియు నెల్లయిన

నామెమరణమునకుఁ దానే కారణమనియు భావించి వాపోవఁజొచ్చె ను. ఆవార్త తెలిసినతోడనే మిత్రులు బంధువులు వచ్చి సమయోచితసంభాషణంబుల నూఱడించిరి. వజ్రపాణి మఱునాఁడుదయమున సర్వాగ్రుఁ జిత్రభానునకుఁ దెలిపి పయనమై యత్తవారియూరు జేరి మాతృహీనులయినబిడ్డల నోదార్చి యుత్తరక్రియలు సమాప్తమగువఱకు నక్కడనే యుండెను.

ఇల్లాలిమరణవార్త వినినతోడనే యతఁడు విషాదపరీతమనస్కుఁడైనను దినములు గడచినకొలఁది దృఢచిత్తుఁడై కర్పూరమంజరీపాణిగ్రహణమునకు మొదటియాటంకము భార్యమరణముతోఁ దీరి [illegible]యు, మకరందునివధతో రెండవది గతించిపోవు ననియు, దైవము తన కనుకూలుఁడై యపకారరూపకమైనయుపకారముచేసె ననియు భావించి యొకవిధముగా సంతసింపఁజొచ్చెను.

---

## ముప్పదిమూఁడవ ప్రకరణము.

జనకునిక్రూరస్వభావమును, రుద్రభట్టుయొక్కదుష్టప్రవృత్తియు తెన్నగా నెఱిఁగినదగుటచేఁ గర్పూరమంజరి మకరందునకు వారిరువురివలన నేదేనపాయము వాటిల్లవచ్చునని శంకింపఁజొచ్చెను. ఆతనికి బంధమోక్షణముచేయవలెనని మల్లికతోఁ బలుమాఱు జెప్పుచుండును. ఎన్నివిధంబులఁ జూచినను శక్యము గాకపోయెను. అందువలనఁ గర్పూరమంజరిమనస్సు తామరాకులోనినీటివలె స్థిమితము లేక యుండెను. మల్లిక కర్పూరమంజరికి మనస్సంతోషమునుగూర్చ మకరందునిఁ జెఱనుండి విడిపించుటకై యెన్నోపన్నుగడలు పన్నుచుండెను. అట్టిసమయమునఁ జిత్రభానుఁడు మృగయాక్రీడనిమిత్తము

రాజధానివిడిచి సపరివారముగా నరణ్యముల కరిగెను. విజయసేనుఁడు రుద్రభట్టు రాజ్యవ్యాపారములఁ జూచుటకై నగరమం దుండిరి. అత్తఱిఁ గన్యనుఁ జేరి సుల్లికం బిలిచి "ఓసీ! మాయయ్య వేఁట కరిగెను. నిన్న సాయంకాల మాయన యభ్యంజనస్నానముచేసి వ్రేలి యుంగరముఁ దీసి యొకపీటపైఁ బెట్టెను. నేఁటిప్రాతఃకాలమున వేఁట కరుగునప్పుడు దానిని దీసికొనుట మఱచిపోయెను. అది నాకు దొరకినది. ఆయంగులీయకము నీకిచ్చెద. మాళవరాజనందనునిబంధమోక్షణమున కది యుపయోగపడునేమో విచారింపుము. ఇట్టివిషయములలో నీవు మిక్కిలి నిపుణురాలవు కావున లెస్సగా నాలోచించి మాళవరాజకుటుంబము నుద్ధరింపుము. మాతండ్రి రాకముందే యీ పని జరుగవలయును. అతఁడు వచ్చినా యిఁక నాసయుండదని నాయభిప్రాయము. మకరందుఁడు తనమీఁదఁ గత్తిఁ గట్టి కయ్యమునకు వచ్చెనని యాయనమీఁద మాయయ్యకుఁ గ్రోధము. శత్రువైనసుదర్శనునిసూనుఁ డగుటచే రుద్రభట్టునకు ద్వేషము. వజ్రపాణికి నాకతమున వానిపైమత్సరము. కావున నీనగర మతని కగ్నిహోత్రపుం బుంత. ఎంతవేగముగా విమోచనమైన నంతక్షేమము. పాణిగ్రహణమైననుసరే, కాకపోయిననుసరే! ఆమన్మథమన్మథుఁడు బ్రతికినం జాలును. ఇందు నీవు కృతకృత్యవగుదువేని నాకు మహోపకారము జేసినదాన వగుదువు." అని బహువిధముల బ్రతిమాలి చెప్పెను.

"అమ్మా! ఉంగర మిటు తెమ్ము. దీనివలనఁ గార్యసాధన మయ్యెనా మంచిదే. కానియెడల నీయుంగరము నీకుఁ దెచ్చియిచ్చెద. ఎట్లయిన నాతని బంధవిముక్తుని జేయవలయు ననియే నాసంకల్పము. ఆసుకుమారుని గారాగృహమున నుంచుట దిరిశెనపువ్వు నెండలో వైచుటయని నేనెంతో విచారించుచున్నదానను. నాకే యింతమనోవ్యథయుండఁగా నీమన స్సెంత మఱుఁగుచున్నదో చెప్పవలయునా"

యని యంగుళీయకముఁ దీసికొని యామె రేయి చాలసేపు నిద్రపోవక దానినుపయోగించువిధము నాలోచింపఁదొడఁగెను. ఎట్టకేల కామె కొకయుపాయము పొడకట్టెను. మఱునాఁడుదయమునఁ గర్పూరమంజరినిజూచి మీతండ్రి వ్రాసినలేఖ యేదయిన నీయొద్దఁ గలదా? యని యడిగెను.

"మును విదర్భలో నున్నప్పుడు మాయయ్య వ్రాసినజాబొకటి నాకడఁ గలదు. అది యెందుకు? కావలసిన నిచ్చెద" నని యామె బదులు చెప్పెను. "ఎందుకని నీవడుగకు. పనియైనపిదప దానిప్రయోజనముఁ జెప్పెద. ముందాలేఖ నిటు దెమ్ము" అని యామెకడనుండి జాబుం గైకొని రహస్యముగా నొకగదిలోఁ గూర్చుండి యేదో వ్రాసి యేదో పన్నుగడ బన్ని కర్పూరమంజరికడ సెలవు గైకొని యెందే నరిగెను.

సాయంకాల మయ్యెను. ప్రభాకరుండస్తమించెను. జగమునం దెల్లెడ నిండియున్నయజ్ఞానమువలెనే కారుచీఁకటులు నలుదెసల వ్యాపించెను. చరమాద్రిఁ గ్రుంగినభానుఁడు ధరించినయనంతకోట్యవతారములో యనునట్లు దీపములు ప్రతిగృహంబున నలంకరించెను. సుషేణుఁడు తనగృహంబున బిడ్డలముద్దులాడుచు నుండెను. అప్పు డొకసేవకుఁడు వానిదర్శనము జేసి నమస్కరించి యెట్టయెదుట నిలిచెను. "నీవెవ్వఁడవు? ఏమిపనిమీఁద వచ్చితివి?" అని యాతఁ డడుగ నాసేవకుఁ డిట్లనియె. "మహాప్రభూ! చిత్రభానుమహారాజుగారిసన్నిధినుండి వచ్చితిని. ఆయన యీజాబు మీకిమ్మని నాచేతికిచ్చె." నని యొకలేఖ చేతికిచ్చెను. సుషేణుఁడు దీపపువెలుఁగునఁ దానినిట్లుజదువుకొనెను.—

"చిరంజీవి యైనసేనాపతిసుషేణునకు, కాశ్మీరమహీపాలుఁడు చిత్రభానుఁడు వ్రాసినశాసనము. మకరందునితండ్రియగుసుదర్శనున

వల మీనిమిత్తమై నేను కల్యాణలక్షణసంపన్నమై యతివేగవంతమైన యాజానేయతురంగమును సిద్ధముచేసి యుంచితిని. అచ్చోటనే మీ కాహారముగూడ నేర్పఱచితిని. నావెంటవచ్చి యాయాహారము భుజించి యా యశ్వమెక్కి పయనము జేసి తెల్లవాఱకమున్నె జాలదవ్వేఁగవలయు. ఎందుకని ప్రశ్నింపక నాచెప్పినచొప్పున మీరు చేయుఁడు. కర్పూరమంజరీపాణిగ్రహణ మయినతరువాత నేనిట్లుచేయుటకుఁ గారణము లామెవలననే తెలియఁగలరు." అని విన్నవించెను. అప్పలుకులు విని వెండియు నెట్టిప్రశ్నయు నడుగక మకరందుఁడు వినయంధరునివెంట నరిగి యాహారముభుజించి యాహయము నెక్కి యథేచ్ఛంజనియెను. వినయంధరుఁడు వానిని సాగనంపి నగరంబుఁ బ్రవేశించెను.

మఱునాఁ డుదయమున మల్లిక కర్పూరమంజరిం గలసికొని మకరందుఁడు బాధముక్తుఁడై కడచిన రేయి సురక్షితముగా నావలకుఁ బోయె నని విన్నవించెను. కర్ణామృతము లయినయప్పలుకులు విని కర్పూరమంజరి సంతోషమున వికసితముఖియై "సఖీ! నన్నుఁ గాఁగిలించుకొనుము. నీవు మాళవేంద్రునకుఁ బుత్రభిక్షము బెట్టితివే. సఖియన్న నీవే సఖివి. ఆఁడుదానవన్న నీవే యాఁడుదానవు. వేయిజన్మములకైన నీ ఋణముఁ దీర్చికొనఁగలనఁటే?" యని కృతజ్ఞతం దెలిపి బహూకరించెను. అప్పుడు వారీక్రిందివిధముగా మాటలాడిరి.

మల్లిక—అమ్మా! నేను చేసినదేమున్నది? దైవ మనుకూలమైనపక్షమున నెట్టికార్యమైనఁ జులకనగా సాధింపవచ్చును. అప్పుడు గుండులు నీటిలోఁ దేలును ప్రతికూలమైన బెండులు మునుంగును. మనయత్నము నిమిత్తమాత్రము; కార్యసిద్ధి యీశ్వరాయత్తము. ఇంతకు నీవు సంకల్పసిద్ధురాలవు.

కర్పూ—ఓసీ! అతఁ డెట్లు విముక్తుఁడయ్యెనో చెప్పవే?

మల్లిక—చెప్పదనులే తొందరేమి! ఆత్రము కొంత సేపు నడంచుకొనుము.

కర్పూర—పోనీ, యుంగర మెక్కడనున్నదో చెప్పుము?

మల్లిక—ఉంగరము సుషేణునియొద్దనున్నది.

కర్పూర—అతనియొద్ద కెట్లుపోయినది?

మల్లిక—వినయంధరుఁ డాతని కిచ్చెను.

కర్పూర—వినయంధరుఁ డెవ్వఁడు?

మల్లిక—నీకు నమ్మినబంటు.

కర్పూ—ఏమిది! నానమ్మినబంటా? నాకడ నెవ్వఁడైన నిగ్గవాఁడు పనిచేయుచున్నాఁడఁటె? మనకంచుకిజనములోనైన నట్టివాఁడున్నాఁడా?

మల్లిక—ఉండనీ, లేకపోనీ. అతఁడు నీలెంక.

కర్పూర—(కోపముతో) ఛీ! మల్లిక, మద్యపానము జేసితివా? లేక నిన్నే దేనిఁ బిశాచ మావహించినదా?

మల్లిక—మహారాజులకు, మహారాజపుత్రికలకు, మద్యము సులభముగా లభించునుగాని పేదదానికి నాకెట్లు దొరకును? నేనే పిశాచమునై యెల్లవారి నన్నమునకు, వస్త్రమునకుఁ బీకికొని తినుచుండ నన్ను వేఱొకపిశాచ మావహించునా!

కర్పూ—ఈయసందర్భప్రలాపములఁ జూడ మకరందుఁడు సురక్షితముగా నటనుండి దాఁటెనో లేదో యనిసందియము గలుగుచున్నది.

మల్లిక—నేను మల్లిక నగుదునో కానో యనువిషయమును గూర్చి సందేహపడుచున్నావా?

కర్పూ—నీవు మల్లికవే! సందియము లేదు.

మల్లిక—అట్లయిన మకరందుఁడు దాఁటిపోవుటలో సందియము లేదు.

కర్పూ—ఓసీ! నీవక్రోక్తులు క్షణముగట్టిపెట్టి వినయంధరుఁ డెవ్వఁడో సరిగఁజెప్పవే?

మల్లిక—అమ్మా! నాఁటిజయంధరుఁడే, నేఁటివినయంధరుఁడు.

కర్పూ—జయంధరుఁ డెవ్వఁడే నాకు జ్ఞాపకము లేదు?

మల్లిక—కర్పూరమంజరిపక్షమున నుజ్జయిని కరిగి యామె వలపు మకరందుని కెఱిఁగించినవాఁడే జయంధరుఁడు.

కర్పూ—(సంతోషముతో) ఓసీ! నీయిల్లు బంగారుగాను. నీవు మగవేషము దాల్చి వినయంధరుఁ డని పేరుపెట్టుకొని నన్నే యిటుని వంచించితివా యేమి?

మల్లిక—అమ్మా! నాచేతఁ బగటివేషములు రాత్రివేషములు వేయించి మీ రంతఃపురమునఁ గూర్చుండి మీతలపెట్టిన కార్యమునందు సిద్ధిఁ గాంచుచుందురు.

కర్పూ—ఓసీ! నీప్రజ్ఞ శ్లాఘాపాత్రమే! నీ వేమహారాజునొద్దనైన మంత్రిత్వముఁ జేయఁ దగుదువె.

మల్లిక—నీవు మకరందుని జేపట్టి మాళవంబునకు మహారాజ్ఞివైనప్పుడు నీకడ మంత్రిత్వము జేసెదనులే. అప్పుడుమాత్రము నన్ను మఱచిపోకుము.

కర్పూ—సఖీ! నాశరీరమును నేను మఱతునేని నాప్రాణమును నేను మఱతునేని నిన్ను మఱతును. కాని వక్రసంభాషణము లేకుండ జరిగినవృత్తాంత మంతయుఁ జెప్పుము?

మల్లిక—అమ్మా! చెప్పుట కేమున్నది! పరిచారికనైనను జనువుచు, వ్రాయుట లెస్సగా నేర్చినదాన నగుటచే మకరందుని వెంటనే పిడిపింపుమని మీయయ్య వ్రాసిన ట్లొకజాబు వ్రాసితిని.

అక్షరములు మీయయ్యవ్రాసినయక్షరములవలె నున్నవి.

కర్పూ—గదిలోఁ గూర్చుండి చేసినపని యిదియా!

మల్లిక—మఱేమి చేసితి ననుకొంటివి? తలుపులు మూసికొని తపము జేసికొంటి ననుకొంటివా? ఆజాబునకుఁ దోడుగా నుంగర మానవాలు జూపితిని. దానితో నంతపని జరిగినది.

అని తనకావించినకృషి యంతయు మల్లిక సవిస్తరముగాఁ జెప్పి యామె నానందసముద్రమున ముంచెను.

---

## ముప్పదినాలుగవ ప్రకరణము

---

అట్లరణ్యమునఁ బ్రియమిత్రునిం గానక భద్రసేనుఁడు పొదలు గుహలు చెఱువులు వాఁగులు మొదలగు సమస్త ప్రదేశములు వెదకి వెదకి వేసారి మకరందునిదశనుగూర్చి యిదమిత్థమని నిర్ణయింపఁ జాలక, స్వదేశమునకరుగుట కంతకుముందే యిష్టములేక పాంచాల దేశమునకుం బోయి యటనుండి మిత్రునిజాడ లరయవచ్చునని రాజధానియైన కన్యాకుబ్జమునకుం జనెను. చని తనరాక మంత్రుల కెఱిఁగించుటయు, వారు మాళవరాజప్రభుఁడైన రత్నసేనునికొడుకగుటచే వానిని గడుంగడు గౌరవించిరి. పూర్వపరిచితుఁడగు మాధవసేనుఁడు వానిరాకకు మిక్కిలి సంతసించి మకరందునిజాడ లడిగి తెలియఁజాలక యెంతేని వగచెను.

మకరందుఁడు నాఁటిరేయియెల్ల నయ్యుత్తమ తురంగంబు నెక్కి యెల్లవాఱునప్పటికిఁ జాలదవ్వరిగి యచ్చటఁ బ్రాతఃకాలకృత్యములు నిర్వర్తించుకొని గుఱ్ఱమునకు మేఁతవైచి దానికి విశ్రాంతి నొసంగి దానునొక్కచోట విశ్రమించి మధ్యాహ్నము మఱలఁ బయన

మై సాయంకాలమగునప్పటికిఁ గాశ్మీరదేశపుంబొలిమేరదాఁటి పాంచాలదేశముం జొచ్చెను. ఒక గ్రామమునం దారాత్రి విశ్రమించి యపాయము గతించినందున స్తిమితమనస్కుఁడై యతఁడు మెల్ల మెల్లగాఁ బయనముజేసి తాను మిక్కిలిడస్సిపోకుండఁ బ్రాణాపాయము దాఁటించిన గుఱ్ఱము చెడిపోకుండఁ బయనంబులు సేసి కతిపయదినంబులకు రాజధానియగు కన్యాకుబ్జముఁ జేరెను. చేరి రాచనగరుముందట గుఱ్ఱము నిలిపి తననామధేయాదులు ప్రతీహారివలన మహేంద్రదేవునకు విన్నవింప నారాజన్యుఁడు మకరందునిఁ దనమందిరమునకు రావించి సన్మానించి యాతనివలన రణమందలి పరాజయమును, దానివెనుక జరిగిన కాంగ్రహనివాసాదులును విని విస్మయమును జాలియు నొంది యచ్చటఁ గొన్నిదినంబులుండుమని వేఁడెను. అట్లుకాకయని బహువిధముల వారిచే సత్కృతుఁడై యచ్చటనుండితనమిత్రుఁడగు భద్రసేను నచ్చటం గలసికొని కౌఁగలించుకొని యాకస్మికముగాఁ దానగపడకపోవుటకుఁ జిత్రభానుప్రేరితులైన సైనికులు తన్నుఁబట్టుకొనుటయే కారణమని చెప్పి తనచరిత్రకథనముచేత వానిం దుఃఖపరవశుం జేసెను.

అంతరంగము గలసినమిత్రులు కలసినప్పుడు గల్గునానందమనుభవైకవేద్యమేగాని వర్ణింప నలవిగాదు. అయ్యిరువురుఁ దమక్షేమవార్తలు దమజాడలు దెలియక దుఃఖిల్లుచుండు తల్లిదండ్రులకుఁ దెలియఁజేయుటయుచితమగునని మహేంద్రదేవునితోఁ జెప్ప నాతఁడు విశ్వాసముగలబంట్ల నప్పనికై మాళవంబునకుఁబంపెను. పిమ్మటఁ గొన్నిదినములచ్చటనుండి కాశ్మీరరాజ్యముపై మరల దండువెడలవలయునని మహేంద్రదేవునితోఁ జెప్పి మాధవసేనునితోడను, దక్షిణపాంచాలమంత్రులతోడను, నంతనంబుండి యాసారివేఱువేఱుగాఁగాకమాళవపాంచాలసైన్యము లేకమై పోరాటము సలిపినఁ దప్పక జయంబు

సేకూరునని యట్లు చేయునట్లు వారి నొడంబఱచిరి. అవ్వల మకరం దభద్రసేనులు ప్రసన్నులై తమ దేశంబునకుం జనిరి. వారరుగునప్పటికి సుదర్శనుఁడు రత్నసేనుఁడు ఘూర్జరంబుననుండిరి. అందుచేవారు రాజధానికిం జనక ఘూర్జరవిషయంబునకుం జని మహారాజాధిరాజై శ్రీమంతుఁడై పండితులకుఁ గవులకుఁ బేదలకు సాధులకు నాశ్రితులకు నాశ్రయుఁడై సుగుణరాశియై, భూలోకమందారమై యున్నసుదర్శనమహీపాలుఁడు కాలవక్రగతిచేత రాజ్యభ్రష్టుఁడై కంజరంబు దోమకుత్సుకం జొచ్చిన తెఱంగునఁ దనకన్న నన్నివిధంబులఁ దక్కువవాఁడగు ఘూర్జరేంద్రుని యింట నతిథియై వానిపంచ నుండవలసి వచ్చినందుకుఁ దద్దయు విచారించి ముందుగా నమ్మహీపాలునిం గనుంగొనిరి. సుదర్శనుఁడు తన బిడ్డను, మంత్రిబిడ్డనుం గూడఁ గౌఁగిలించికొని "నాకు నేఁడు వేయిరాజ్యములు చేకూరినట్లు సంతసించుచున్నాఁడను. ఇఁక రాజ్యసంపాదనము సులభము. మీరాక మనమే శుభాగమనము. ఈదినము సుదినము. దుర్దినములు నేటితో గతించినవి. నాకుఁ జిరమిత్రుఁడును, సాధుశీలుఁడు నైన ఘూర్జరనాయకుఁడు సేన నాయత్తము చేసియున్నాఁడు. ఇంక మనము మీసేనం గైకొని మనరాజ్యంబు మనముసంపాదింపవలయు" నని చెప్పి మితిమీఱిన యానందమొందెను. రత్నసేనుఁడు కుమారాగమనమునకు నానందపరవశుఁ డయ్యెను. చంద్రప్రభాదేవి మరల వచ్చి తనకంటఁబడి యడుగులకు మ్రొక్కిన కొడుకును లేవనెత్తి హర్షబాష్పములచే నాతని మూర్ధము నభిషేకించెను.

సైన్యము దండయాత్రకుఁ దగియుండుటచే మకరందుఁడు సేనాపతియై ఘూర్జరసైన్యమును మాళవదేశంబునకుఁ దీసికొనిపోయెను. రాజ్య మాక్రమించుకొనియుండిన వైదర్భులకును, మకరందునినాయకత్వమునన్న ఘూర్జరులకును, సందడకయ్యము జరిగెను. మాళ

వేంద్రకుమారుని ప్రతాపాగ్నికి వైదర్భులు శలభములైరి. రాజవాహనుని సేన సంపూర్ణముగాఁ బరాజయమొందెను. హతశేషులు నానాముఖములఁ బరుగులెత్తిరి. మకరందుఁడు సుదర్శనుని మరల మాళవరాజ్యసింహాసనమునందుఁ బ్రతిష్ఠించెను. రత్నసేనుఁడు యథాపూర్వకముగ ననూత్యుఁడయ్యెను. కేసరి రెండవసారియుఁ ద్రోహియై వైదర్భులతోఁగూడి వారివలన లంచములు గ్రహించి దేశాపకారి యగుటచే వానింబట్టి సుదర్శనుఁడు కారాగృహంబున నుంచెను. దేశమునం బ్రశాంతము నెలకొన్న పిదప మకరందుఁడు కాశ్మీరదేశ దండయాత్రకై సైన్యసన్నాహము జేయఁబూనెను.

అటఁ జిత్రభానుఁడు వేఁటనుండి రాజధానికి మరలివచ్చినపిదప సుషేణుఁడు వానిని దర్శించి "దేవరవారియాజ్ఞా ప్రకారము మకరందుని విడిచిపుచ్చితి"నని మనవిచేసెను. అదివిని చిత్రభానుఁ డదరిపడి "ఏమీ! నాయాజ్ఞాప్రకారము మకరందుని విడిచితివా? మూర్ఖుఁడా! అనృతము లాడి నన్ను వంచించెదవా?" యనిబిట్టలుకతోఁ బలికెను. "దేవా! శాంతింపుఁడు ఇదిగో! మోజాబు. ఇదే మీ రాజవాలుగాఁ బంపిన యుంగరము." అని సుషేణుఁడు రెంటెనింజూపెను. "ఎవఁ డీ యుంగరమును దెచ్చినవాఁడు?" అని మరలరాజడిగెను. "ఎవఁడో వినయంధరుఁడఁట! మాళవసచివుఁడఁట! మీరు పంప వచ్చినాఁడఁట" యనిసుషేణుఁడు బదులుచెప్పెను. అదివిని చిత్రభానుఁడు త్రొక్కుబాము వలెనెగిరిపడి "దురాత్ముఁ డెవఁడో మోసము జేసెను. నాయుంగరము! నావ్రేలినుండి జారిపోయియుండవచ్చును. అదితెలిసికొని నాసేవకులు నన్ను వంచించియుందురు. అంతఃపురమందు నగరమందుఁగూడ నెందరో ద్రోహులున్నారు. ఆద్రోహులలో నెవఁడొకఁడై యుండవచ్చును. అయ్యయో! పరమశత్రువు దాఁటిపోయెనే! వాఁడు మన కడనుండిన సుదర్శనుఁడు కాళ్లబేరమునకు వచ్చునే! ఛీ! దురాత్మా!

నీమొగము జూడఁగూడదు. ఇదియంతయు నీవలననే జరిగినది. అతని స్థానమున నిన్నే కారాగృహమునం దుంచెద." నని రాజభటులం బిలిచి చెఱలో సుషేణుని బంధింపుమని యానతిచ్చెను. నిర్దోషియైన సుషేణుఁడు నిష్కారణముగా బంధింపఁ బడినందుకుఁ గర్పూరమంజరి మనస్సున మిక్కిలి విచారించెను. చిత్రభానునకు నంతఃపుర సేవకులపై నెంతో యనుమానము గలిగెనుగాని కర్పూరమంజరిపైఁ గలుగలేదు. నిజస్థితి దెలియక పోవుటచే నతఁ డెవ్వరిని దండింపఁ జాలకపోయెను గంజాయిమత్తుచేత జంబుకుఁడు చిత్రభానుని ప్రశ్నలకు నసందర్భములైనయుత్తరములు చెప్పుటచే బెత్తముతో నాలుగుదెబ్బలు తినెను.

అట గంధారవల్లభుఁడైన భాగ్యవర్ధనుఁడు విక్రమసేనుని గద్దెనెక్కించుటకు నిశ్చయించి కాశ్మీరముపై దాడివెడలుటకు సన్నాహము సేయుచుండఁగా నచటనున్న శక్తివర్మం జూచి యిట్లనియె. "ఓయీ! నీవు యీక్షణమునఁ బాంచాలవల్లభుఁడైన మహేంద్రదేవునికడకు సందేశముఁ గొనిపోవలయును. మహేంద్రదేవుఁడును సమరసన్నాహము చేయుచున్నాఁడని చారులవలన వినియుంటిని. అతఁడొకసారి మే మొకసారి వేర్వేఱుగాఁ జిత్రభానునిం దాఁకిన జయము చేకురకపోవచ్చును. ఉభయసైన్యంబులు గలసి యేకముఖముగాఁ బోరిన జయ మవలీలగాఁ జేకురును. కావున శరత్కాలమునఁ గార్తికమాసమున శుద్ధపూర్ణిమనాటికిఁ దనసైన్యమును దోడ్కొని కాశ్మీరముఁ బ్రవేశింపు"మని యామహారాజుతోఁ జెప్పుము. అనాఁటికి మేమును గజరథతురంగాది చతురంగబలంబులతో నాదేశముఁ బ్రవేశింతము. నాముద్రగల జాబుగూడ నిచ్చుచున్నాను. ఇది యాషాఢమాసముగదా! వర్షకాల మాసన్నమగుచున్నది. అదియుద్ధమునకు ప్రీతైన సమయముగాదు. నీవు స్వల్పపరివార సమేతుఁడవై వెంటనే పొమ్ము." అని యానతిచ్చుటయు శక్తివర్మ మహాప్రసాద

మని జాబులనందుకొని మితపరివారముతోఁ బాంచాలమునకరిగి రాజధానిం బ్రవేశించి మహేంద్రదేవుని సందర్శించి సందేశార్థ మెఱిఁగించెను. అతఁడు సందేశార్థమునకు సమ్మతము దెలిపి తనమనుమలు భాగ్యవర్ధనుని చెంత సుఖక్షేమవార్త విని మిక్కిలిసంతసించి దౌహిత్రీపౌత్రీణులు పంపినందుకు శక్తివర్మకు రత్నాభరణములు పారితోషికముగ నిచ్చి గౌరవించెను.

పిమ్మట శక్తివర్మ యాస్థానపాలునికడ సెలవుగైకొని గాంధారమున కరిగి మహేంద్రదేవుఁడు సందేశార్థము నంగీకరించెనని విన్నవించెను. మాళవ పాంచాల గాంధారదేశములం దొక్కసారిగా దండయాత్రాప్రయత్నములు మిక్కిలి త్వరితముగాఁ జరుగఁజొచ్చెను. కార్తికమాస శుక్లపక్షమునఁ గాశ్మీరమునకు ససైన్యముగా రావలయునని మహేంద్రదేవుఁడు సుదర్శనునకు వ్రాయబారమంపెను. అతఁడు దాని నంగీకరించెను. మాధవసేనుఁడు శక్తివర్మవలనఁ రాజకుమారుల క్షేమ మెఱిఁగి మున్ముందు రాజు లేకపోవుటచేఁ దప్పక జిత్రభానుఁడు కూలిపోవునని నిశ్చయించి "కార్తికమాస మెప్పుడువచ్చు నెప్పుడు సేనలు కాశ్మీరముఁ జొచ్చు, నెప్పుడు చిత్రభానుఁడుజచ్చు" నని యాశుభదినముల కెదురు చూచుచుండెను.

విద్యాపీఠ మైనతక్షశిలలో నేఁటేఁట శ్రావణమాసమున గొప్ప విద్యాపరీక్ష జరుగుచుండును. అత్తఱి విద్యార్థుల వారు వారు నేర్చిన శాస్త్రములలోఁ బండితులు పరీక్షించి యర్హులగువారికి విద్యానిధి సాహిత్యచక్రవర్తి వేదాంతకేసరి మొదలగుబిరుదములును మిక్కిలి విలువగలశాలువలును ధనమును బారితోషికములుగా నొసంగబడుచుండెను. ఆవిద్యాపీఠ మంతయు గాంధార రాజులపోషణముక్రింద నుండుటచే భాగ్యవర్ధనుఁ డేఁటేటఁ బరీక్షాసమయమున నక్కడికివచ్చుచుండును. ఆసంవత్సరమును భాగ్యవర్ధనుఁడు విక్రమసేనహర్షవర్ధనుల

వెంటఁబెట్టుకొని తక్షశిలకుఁ బోయెను. పండితులచే విద్యార్థులు పరీక్షింపఁబడిరి. శ్రోతలు మహానందభరితులగునట్లు సామవేదము గానముచేయఁబడెను. మందిరములు ప్రతిధ్వను లిచ్చునట్లు ఋక్కులు యజుస్సులు నధ్యయనము చేయఁబడెను. పూర్వమీమాంసకులు నుత్తరమీమాంసకులు, నుచ్చైస్స్వనములతో సలిపి తమ తమ శాస్త్రములే సరియని సిద్ధాంతీకరించుటకు మహావాదములు సలిపిరి. కపిలుని నిరీశ్వర సాంఖ్యముం పతంజలి సేశ్వర సాంఖ్యము, గౌతమకణాదులమతములు, పండితుల జిహ్వారంగములయందు నాట్యము చేసెను, బుద్ధదేవప్రోక్తము లయిన త్రిపిటకములయందును దమ్మపదాది గ్రంథములయందును దగుపరీక్షలు జరిగెను. భిక్షుకులకు, సన్న్యాసులకుఁ గాషాయాంబరములు, విద్వాంసులకు విలువగల సేలువలు విద్యార్థులకు వస్త్రములు వైదేశికులకులగు పండితులకు ధనములు మొదలగునవి భాగ్యవర్ధనుఁడు విరివిగానిచ్చి విద్వజ్జనవంద్యుఁడయ్యెను

విక్రమసేనహర్షవర్ధనులు తత్పురముఁ జూడఁబోయి యొకబౌద్ధవిహారమున భిక్షుణీవేషముతోనున్న యొకయంగనంజూచి మొదట నెవ్వరోయనుకొని సాఁగి కొన్నియడుగులు నడచి మరల ననుమానము దోఁప వెనుకకు నడచి యాపడఁతియెట్టయెదుట నిలిచిరి. ఆమె తల వంచి వారివంక జూడక యేదో యాలోచించుచున్నట్లుండెను. "అన్నయ్యా! అమ్మ-అమ్మ చూడు. చూడు" అని. హర్షవర్ధనుఁడు మెల్లగాననెను. "ఔను! ఆనవాలుపట్టుటకు వీలులేకుండ వెఱ్ఱిదానివలె నున్నది." అని విక్రమసేనుఁడు దగ్గఱకుఁబోయి "అమ్మా! అమ్మా!" యని పిలిచెను. ఆమెతలయెత్తిచూచెను. ఎట్టయెదుట నామె తపఃఫలములువలె బంగారుబొమ్మలవలె నిరువురుసూనులు కనఁబడిరి. కనఁబడినతోడనే యామె యానందపరవశయై లేచి నిలువఁబడి యిరువురు బిడ్డల నొక్కసారి కౌఁగలించుకొని 'నాయనా! బ్రతికియున్నారా!

నాయనా! నీవు విక్రమసేనుండవేనా? నాయనా! నీవు హర్షవర్ధనుఁడవేనా! మీరు నాచిన్నియన్నలేనా? దృష్టిదోషముచేత నేనెవరిబిడ్డలనో నాతనయులుగా భావించుచున్నానా?" యని మహాసంభ్రమముతోఁ బలికెను. "అమ్మా! నేను విక్రమసేనుఁడనే. నేను హర్షవర్ధనుండనే. తల్లీ! నీ వెంతమార్పు జెందితివి! మేమే సరిగా గుర్తింపలేకపోతిమి" అని వారు తల్లిని గౌఁగలించుకొనిరి. భిక్షుకభిక్షుణీజనములు మాతాపుత్రుల సమాగమ సౌఖ్యమును గన్నులారఁ జూచి సంతసించి యభినందించిరి. బిడ్డలు తల్లిని భాగ్యవర్ధనునివిడిదికిం దీసికొనిపోయి యాతని కెఱిఁగించిరి. అతఁ డామెను బహూకరించి మాతాపుత్రుల సమాగమము భావికాలశుభమునకు సూచకమని వక్కాణించెను. తల్లియు బిడ్డలుఁ దమతమకష్టముల నొండొరులకుం జెప్పుకొని తత్తత్సమయోచితముగా దుఃఖమును నానందమును నొందుచువచ్చిరి. అచ్చటఁ గొన్ని దినములుండి భాగ్యవర్ధనుఁడు విక్రమసేనహర్షవర్ధనులను నరవిందాదేవిని దోడుకొని స్వనగరంబున కరిగి యుద్ధసన్నాహముఁ జేయుచుండెను.

ఆవర్షర్తు వతిరమణీయముగా నుండెను. గ్రీష్మకాలమునఁ బ్రభాకరుని చండమయూఖముల తైక్ష్ణ్యమునకు గగనమంతయు బీటలువాఱఁ గాలపురుషుఁడు బీటలుగానఁబడకుండ మెత్తినబురదయో యనునట్లు నభోమండలమంతయు మేఘపటలసంఛన్నమై కనఁబడెను. భీష్మంబగు గ్రీష్మమునఁ దాపమునకోర్వలేక తహతహంబడినభూదేవి మేనఁ జల్లుకొన్న పన్నీరోయన వెల్లివిరిసి నేలఁబడుచున్న యాకాశగంగయో యన వర్షములు సాంద్రములై కురిసెను. ఉఱుములధణంధణాధణాధ్వానములంతోడను, నెడనెడ ఘుణిల్లు ఘిల్లు ఘిల్లుమనిపడి మొసుపిట్టపిడుగులచప్పుడులతోడను బెకబెకబెకలాడు గోదురుకప్పలయులివులతోడను, బ్రహ్మాండము ప్రతిధ్వనించుచుండెను. భగ్నమనోరథులై పరితపిం

చువారికి నెడనెడం బాడకట్టునల్పాశలంబోలెఁ దళతళతళ్ళుమని కన్నులకు మిఱుమిట్లుగొలుపునట్లు మెఱుపులు మెఱయఁజొచ్చెను. గ్రీష్మకాలమునఁ బ్రభాకరుని చండతైక్ష్ణ్యముచేత నెండి సుక్కినజలాశయశిశువులను వెండియుఁ బ్రకృతిలక్ష్మి దృఢగాత్రులం జేయుటకు నొసంగెనుస్తన్యమో యనఁ బయోధరములనుండి శుద్ధపయోధారల వెల్లివిరియున ట్లొసంగెను. నదీనదంబులు పొంగెను. వాఁగులునిండెను తటాకములు జలపూర్ణము లయ్యెను. ప్రపంచ మంతయు జలమయమయ్యెను. మార్గంబు లరికట్టఁబడెను. ప్రయాణములు దుస్సాధ్యములయ్యెను. ప్రపంచమంతయుఁ జల్లఁగా నున్నను నావర్షకాలమున మకరందుని మనస్సు వియోగవేదనాసంతప్తమగుటం జేసి యతఁడు సౌఖ్యముం గనక నిరాశామేఘచ్ఛన్నము లయినయాదినములను దుర్దినములనుగా భావించి కాల మెట్టెటో గడుపఁజొచ్చెను. కర్పూరమంజరియు మకరందుఁడట్లు ప్రియవిరహసంతాపమునఁ బొక్కుచు నాదుర్దినము లెన్నటికైన గతింపకపోవునా, యనిమంచికాలమున కెదురుచూచుచుండెను.

---

## ముప్పదియైదవ ప్రకరణము.

---

శరత్కాలము ప్రాపించెను. అయ్యది పరమేశ్వరసృష్టికిఁ బ్రతిసృష్టి చేయంజాలు మహాకవివాక్ప్రౌఢిమకును జిత్రకారుని తూలికానైపుణ్యమునకును నతీతమై సౌందర్యనిలయమై యతిశోభావంతమై యలరఁజొచ్చెను. భూమండలమున రాజేంద్రులు ధనుస్సులు పూని విజృంభింతురుగావునఁ దనధనుస్సుతో నింక బనిలే దనికాఁబోలు మహేంద్రుఁడు తనచాపంబును గగనమునఁ బ్రదర్శింపక

దాఁచెను. వానకాఁగున మేఘమండలముచే నాచ్ఛాదితుం డయిన సహస్రమయూఖుఁడు బంధవిముక్తుఁ డయినమహాతేజశ్శాలియుం బోలె మున్ను జడమైనబ్రహ్మాండమున కంతకు వెండియు నఖండ చైతన్యము గలుగునట్లు దేదీప్యమానప్రభలతో వెలుఁగఁజొచ్చెను. దిక్కులు ప్రసన్నములయ్యెను. బురద లెండ నేల గట్టిపడెను. జనుల గమనాగమనముల కనుకూలముగా బాటలేర్పడెను. మున్ను కూలంకషములై దేశంబులపై దండువెడలి గృహారామక్షేత్రాదుల నాశనంబుఁ జేసినమహావాహినులు తమగాంభీర్యముం గోల్పోయి విజృంభణము నెడలి సామాన్యజనులు తమ్ముదాఁటిపోవుపాటి రేవులు గలిగి కల్మషరహితములైన నిర్మలోదకములుగలిగి యక్కడక్కడఁ దమ తిప్పలు బైలుపడఁ దొంటిమైశ్వర్య మంతయుం గోలుపోయి గర్వహీనులై నెల్లవారికిఁ జులకనౌ పేదల ట్లుండెను. సరోవరములు పగలు వికసించి కనుపండువు సేయుతామరలతోడను, రాత్రులు వికాసము జెంది నయనాభిరామంబు లగుకలువలతోడను వెలయుచు నిరంతర మందహాసమునఁ గళకళలాడు నెమ్మొగంబులు గలవిలాసవతులట్లు శోభిల్లుచుండెను. ఏసరసుఁడు తనయింటికి వచ్చిన నాసరసునిఁ గౌఁగిఁటఁ జేర్చి యాదరించువెలవెలఁదుకలట్లు సరోవరంబులు పట్టపగంట దర్శనంబిచ్చుప్రభాకరుని, రేలఁగానఁబడు శీతమయూఖునిఁ బద్మదళహస్తములతోడను గలువరేకులచేతులతోడను గౌఁగిలించుకొనుచు వారికరస్పర్శల ధన్యతఁ నొందుచుండును. ఆకాశమున నగస్త్యనక్షత్రము [illegible] . రాకాచంద్రమండలము నిశ్శలనిష్కళంకమై నిరు[illegible]మై [illegible]ంతమనోహరమై నేత్రపర్వమైనపండువెన్నెలలు [illegible]యుఁజొచ్చెను. నిశాలక్ష్మి వెన్నెలయను తెల్లకువ్వాలువ గట్టి నక్షత్ర[illegible]ముయుత్త[illegible] సరముఁ దాల్చి వర్ణనాతీతమైనశోభ గలిగి [illegible]ల్లుచుండెను. ఏ[illegible]యు లన్నియుఁ బండఁబారెను. వసుంధర

సస్యభరితమై చూలుదాల్చి నెలలునిండినపడంతుకవలె దర్శనీయమై యొప్పెను. ఎప్పుడు శరత్కాలము వచ్చు, నెప్పుడు మహావాహినీ సమూహములం గొని కాశ్మీరముపై దండువిడియ నగు నని నిరీక్షించుచున్న గాంధారపాంచాలమాళవేంద్రులకుమూఁపుదాల్చినతమమనోరథముంబోలె నాశరదృతువు కనంబడెను.

గాంధారసైన్యంబులు భీష్మంబులై గ్రీష్మంబట్లు పరసైన్యంబుల శోషింపఁజేయఁగలిగి యుండె. బాణవర్షంబులఁ బగతుఱ ముంపఁజాలి పాంచాలసైన్యంబులు వర్షర్తువు ట్లుండెను. మాళవేంద్రసేనలు శీతకాలంబట్టు వెల్లవారి గడగడ వడఁకింపఁజాలియుండెను బాణంబులు, తూణంబులు, నరదంబులు, ద్విరదంబులు, ధనుస్సులు క్షుభితమనస్సులు, హయంబులు, భటచయంబులుఁ గలిగి మూఁడు సేనలు నేకకాలమున సన్నిధియయినముక్కారులట్లు, ముచ్చిచ్చులట్లు ముక్కాఁకలఁ దేరి మువ్వన్నెనలువలుఁ దాల్చినజోడులుగలిగి బైలుదేఱి కార్తికశుద్ధపూర్ణిమనాఁటికిఁ గాశ్మీరదేశముం బ్రవేశించెను. తనచేఁ బరాజితులైనమాళవపాంచాలభూపతులు మఱల మూఁకలం గూర్చుకొని తనపై నెత్తివత్తురని చిత్రభానుఁడు తలంచుచుండెనుగాని గాంధారనాయకుఁడు తనపై దాడివెడలునని యూహించెన్నఁడును దలంచియుండలేదు. మువ్వురురాజులును సకలసమరసన్నాహంబు జేసికొని దనపై దండువిడియుచున్నా రని చారులవలన విని చిత్రభానుఁడు తత్తఱపడి తనసేనలఁ జక్కజేయఁజొచ్చెను. విశ్వసింపఁదగినబంట్లను దండపాణిని వెదకుటకై కాశీమొదలగుమహాక్షేత్రములకుఁ బంపెను. క్రొత్తజోదుల సేనలోఁ జేర్చుకొనెను. మగఁటిమి గలజోదులను జిన్నదండనాథులుగఁ జేసెను. వలయు ప్రయత్నము లన్నియుఁ జేసెను. వైదర్భులను సాయమురమ్మని సందేశమంపెనుగాని వారు మకరందునిచేఁ బరాజితులై నిశ్శేషముగాఁ జెదిరిపోవుటచే నెట్టిసా

హాయ్యముం జేయఁజాలకయుండిరి. కావునఁ జిత్రభానుఁడసహాయుఁడై తనలావును నమ్ముకొనియుండవలసినవాఁ డయ్యెను.

యథానిర్దిష్టముగఁ గార్తికశుద్ధప్రతిపన్నాఁటికి మూఁడుసైన్యములు శ్రీనగరపరిసరంబుల విడిసెను. గాంధారవల్లభుఁడు, పాంచాలనాయకుఁడు, మాళవరాజనందనుఁ డగుమకరందుఁడు నొండొరులం గలిసికొని కుశలంబు లరసి సమరం బెట్లు జరుగవలయునో యావిధానమునుగూర్చి తర్కించిరి. భాగ్యవర్ధనమహేంద్రదేవులు తమదళంబులకుం గూడ మకరందుని దండనాథునిఁ జేసి యాతనియాజ్ఞాప్రకారము నడుపవలసినదని తమసేనానాయకుల కాజ్ఞ నొసఁగిరి. భాగ్యవర్ధనునివెంట వచ్చిన విక్రమసేనహర్షవర్ధనులు, పాంచాలసైన్యముతో వచ్చినమాధవసేనుని గలసికొని తమకై వేరుగ వెట్టుకొనినయావృద్ధమంత్రి గానంపముఁగలిపించిరి. విక్రమసేనుఁడు గాంధారసైన్యమున నొకభాగమునకు దండనాథుఁడై మకరందునియాజ్ఞ నిర్వర్తించుచుండెను. గాంధారవల్లభుఁడు మకరందమహేంద్రదేవులతో నాలోచించి తనయమాత్యుఁడగు సుజీవసిద్ధిని జిత్రభానునికడకు రాయబారిగాఁ బంపెను. ఆతఁడును గాశ్మీరనరపాలునికడఁ జెప్పవలసినసందేశార్థము లన్నియు జాగరూకతతో సంగ్రహించుకొని చిత్రభానునిసందర్శనము వేఁడి నానియమితమున సన్నిధి కరిగి సత్కృతుఁడై తన సందేశమును నెఱిఁగింప ననుజ్ఞ వేఁడెను. అప్పుడు వారీక్రిందివిధమున ముచ్చటించిరి.

జీవ—మహారాజా! మాప్రభువగు భాగ్యవర్ధనుఁడు సంగ్రహముగా సందేశ మెఱిఁగించి రమ్మని పంపెను. ఆసందేశమిది: గతించినదానిని మరల ద్రవ్వుకొనుట నిష్ప్రయోజనము. విక్రమసేనుని గాశ్మీరసింహాసన మెక్కించి హర్షవర్ధనుని యువరాజుఁజేసి నీవు సకుటుంబముగాఁ గాశ్మీరరాజ్యము విడిచి పోదువా లేక, కయ్యమున

కియ్యకొందువా? ఇందు నీ కేదిష్టమో దానిం జేయుము. ఇంతే సందేశము.

చిత్ర—ఇంకను విక్రమసేనహర్షవర్ధను లెక్కడ? వారు మృతి నొందిరి. చచ్చినవానిని రాజుం జేయు టెట్లు? యువరాజుం జేయు టెట్లు?

జీవ—రాజా! నీవు మేలుకొనియుం గలం గనుచున్నావు. విక్రమసేనహర్షవర్ధనులు జీవించియున్నారు. దండపాణి త్రవ్వించిన గోతిలో దండపాణియే పడియెను. రాజపుత్రులం జంపం దలంచి వచ్చి తాం జచ్చె. నీవారాయాసపడం బనిలేదు. ముందుగా నేకరాజపుత్రులు సురక్షితులయి గాంధారమునకు వచ్చి ... డీసే ... నిటకు వచ్చియున్నారు.

చిత్ర—(తెల్లబోయి) ఏమేమీ! బ్రతికియున్నారా? ఇది పరిహాసమా? నీవు మతి తప్పి మాటలాడుచున్నావా?

జీవ—పరిహాసముగాదు. మత్తసంభాషణముగాదు. నిజము.

చిత్ర—బ్రతికి యున్నను నా ... చెప్పినను నారే! రాజ్యము నే నియ్యను. వెంటనే యిచ్చోటు విడిచి పొమ్ము. లేకున్న నీ ప్రాణములు దక్కవు.

జీవ—చిత్తము. ఇదే సెలవుపుచ్చుకొనుచున్నాను. (అని వెడలిపోయెను)

అప్పలుకులు వినినదాదిగా జిత్రభానుసమనస్సు మిక్కిలి సంక్షుభిత మయ్యెను. "ఏమీ! దండపాణి మృతినొందెనా? రాజకుమారులు బ్రదికి యున్నారా? రాజకుమారులు చచ్చిరని దండపాణి తీర్థయాత్రలు సేవించుచున్నాడని దండపాణి చెప్పినమాట యబద్ధమా? చండశక్తి వార్తలను వంచించి యుండునా? అయ్యయ్యో! సర్వము జెడిపోయినది. నాకట్టిన మేడలు కూలిపోయినవి.' అని తనలోఁ

జింతించుకొనుచు రుద్రభట్టుకడకుఁ బోయి జీవసిద్ధిసందేశ మెఱిఁగించెను. అతఁడును మొదట నమ్మాట నమ్మక యెట్టకేలకు రాయబారమునం దబద్ధముండ దని నిశ్చయించి యెట్లయిన సమరసన్నాహామే కర్తవ్య మని యుపదేశించెను.

చిత్రభానునిధైర్యము సడలెను. సందేశార్థము విడుగడచినట్లు వానియుత్సాహము నడంచెను. దండపాణి వచ్చుననునాస యడుగంటెను. అట్టి క్లిష్టసమయమున భ్రాతృమరణవార్త వజ్రపాణి కెఱిఁగింపఁగూడ దని యవ్వార్తఁ దనమనంబుననే యడంచుకొనెను. దండపాణి లేకపోవుటయు వెనుకటియుద్ధములో మేటియులవంటిజోదులు, దండనాథులు హతు లగుటయు, బొక్కసములో నిధనము తన్నిమిత్తమై వ్యయమగుటయు రాజకుమారులు బ్రతికియుండుటయు మున్నగువిషయములు చిత్రభానున కమితవిషాదముఁ గలిగించెను. ధనము చాలమి నగరమందున్నసంపన్ను లగుబేహారులను నితరగృహస్థులను రావించి యుద్ధమునిమిత్తము తనకు సొమ్ముగావలె నని చెప్పి యిమ్మని యడిగెను. ఇచ్చినవారిని మఱియంత హెచ్చుగా నిమ్మనియు, లేదన్నవారిని దప్పక యియ్యవలసిన దనియు నిర్బంధించి హింసించెను. ప్రజలు భయభ్రాంతులై చిత్రభానుని దూషించి వానివినాశమును గోరిరి. కొందఱు పాఱిపోయిరి. పరుగెత్తినవారిని యతఁడు పట్టి తెప్పించి శిరచ్ఛేదముఁ జేయించి వారియిండ్లు దోఁపించెను. తనజయమునిమిత్తము దేవాలయంబులఁ బ్రార్థనలు చేయవలసిన దని బ్రాహ్మణోత్తముల నియోగించెను. రాజువలన భూరిసంభావనల నపేక్షించినబ్రాహ్మణోత్తములు వానికి జయముబ్రసాదింపు మని పరమేశ్వరుం బ్రార్థించిరి. దేశాభిమాను లగుబ్రాహ్మణులు మరల వానికపజయమును మరల విక్రమసేనునిబ్రతిష్ఠయుఁ గావలె నని సర్వేశ్వరుని వేఁడుకొనిరి. రుద్రభట్టు చిత్రభానునివిజయమునిమి

త్తమై గ్రహశాంతులు చేయనారంభించెను. గ్రహదోషనివారణార్థము బ్రాహ్మణులకు భూరిదానము లిప్పించెను.

జీవసిద్ధి తనసందేశపర్యవసానమును భాగ్యవర్ధనాదిప్రభువుల కెఱింగింప వారు యుద్ధసన్నద్ధులయిరి. రణభేరులు మ్రోఁగి కోటలో నున్నయంగనలగుండియలు జలుజల్లు మనఁజేసెను. ఆభయంకరధ్వానములకు నభమునఁ బాతెఱుపిట్టలు చుట్టుచుట్టుకొని బిట్టఱచుచు నేలం బడియెను. గాంధారసైన్యములు పట్టణమున కుత్తరమునను బాంచాలవాహినులు పడమటను, మ్రాళవసైన్యములు దక్షిణమునను విడిసి స్కంధావారమును నిర్మించుకొనెను. ఊరికిఁ దూర్పున సింధువున కుపనదియైన జీలమునునది ప్రవహించుచుండుటచే నచ్చట నెవ్వరును విడియుటకు వీలులేకపోయెను. కార్తికశుద్ధ పంచమినాఁటియుదయమున యుద్ధమారంభమయ్యెను. చిత్రభానుఁ డిష్టదేవతలకుఁ గృహదేవతలకు వేదవేదాంగపారంగతులగువిప్రులకు రుద్రభట్టునకు నమస్కరించి కడపటివారియాశీర్వచనములఁబడసి కవచంబును శిరస్త్రాణంబును దొడిగి విల్లుబూని వజ్రపాణియుఁ గుమారుఁడు విజయసేనుఁడు దక్కినసేనాపతులు వెంటరా రణరంగముఁ జొచ్చెను. అతఁడు తనసైన్యమును మూఁడుభాగములుచేసి యొకభాగంబునకుఁ దాను మొనగాఁడై భాగ్యవర్ధనునిమీఁదికి నడిపెను. రెండవభాగమునకుఁ దనకుమారుఁడైనవిజయసేనుని దండనాథునిగఁ జేసి కొందఱుచిన్న సేనాపతులను వానికి సాయమిచ్చి మహేంద్రదేవునిమీఁది కంపెను. మూఁడవభాగము వజ్రపాణికిచ్చి మకరందునిమీఁది కంపెను. నాలుగుసైన్యంబులఘోషము నాలుగుసముద్రములమహాఘోషము ననుకరించెను. సమరము కురుపాండవయుద్ధమును జూపఱకు స్మరణకుఁ దెచ్చెను. ముందుగాఁ జిత్రభానుఁడు భాగ్యవర్ధనుం దలపడెను. విజయసేనుఁడు మహేంద్రదేవునిదాఁకెను. వజ్రపాణి మకరందునిమీఁదకుం

జనెను. గ్రద్దఱెక్కలు గట్టినవాలుటమ్ములు యోధులచేతులనున్న విండ్లనెడఁగొఱ్ఱిక్కా అమబ్బులనుండి వర్షధారలట్లు జివ్వుజివ్వునఁ బడఁ జొచ్చెను. ఖడ్గపాణులగు జోదులచేనఱుకఁబడినవీరులశిరంబులు మృత్యుదేవత తిని పాఱవైచిన తాటిపండ్లయట్లు ముంజలట్లు నానాపానపాత్రింబులట్లు తోఁచెను. పాదంబులు తెగిన యూర్ధ్వభాగంబులు శిరంబులు లేని మొండెంబులు, బాహువులు తెగి కొమ్మలు తెగినమ్రానులట్లు గచుపట్టు కళేబరములు మిక్కిలిభయంకరములై కానఁబడియెను చచ్చినవారు, మరణవేదనఁ బడుచున్నవారు, ప్రాణములు గుటగుటలాడుచున్నవారు, కట్టకడపటిశ్వాసలు విడుచుచున్నవారు, దాహపీడితులై మాటాడలేక సన్నలు చేయువారు, వెఱచూపుఁజూచువారు, ప్రాణావసాన సమయమున గూండ్రించువారు, బాధపడలేక యఱచువారు, హరిహరీ యనువారు, నయి పడినజోదులు పలుతెఱంగులగు నవస్థలకుఁ బాలయిరి.

కయ్యము మూఁడుదినములు జరిగెను. మొదటినాఁ డెవ్వరు గెలిచిరో యెవ్వరోడిరో చెప్పుటకు వీలులేకపోయెను. రెండవనాఁడు విజయసేనుఁడు మహేంద్రదేవునివాలుటమ్మున మూర్ఛిల్లి యొడలు తెలియక పడియెను. తోడనే యంగరక్షకులు వానిని శిబిరమునకుం గొంపోయిరి. వానిసైనికులు పగఱకు వెన్నిచ్చి పరుగిడిరి. చిత్రభానుఁడవ్వార్త విని తనగారాబుకొడుకున్న నెలవునకరిగి శస్త్రవేదనాపరవశుఁడైనయాతనిం జూచి జీవనాశ లేదని విచారాక్రాంతుఁడయ్యెను. మనుఘన్న యల్పోత్సాహముగూడ వానినివిడిచెను. "కుమారా! నీ నిమిత్తమే గదా యీ రాజ్యము సంపాదించుట? నీనిమిత్తమే గదా మాయలుపన్ని యెన్నెన్నో పాపములుచేయుట? తండ్రీ! నీవు లేనిచో నాకీసమున మేల? సామ్రాజ్యమేల?" యనిగుట్టు గలవాఁడగుటచే లోలోపల దుఃఖపడి పైకి గాంభీర్యము వెలిపుచ్చి సైనికుల

మనంబుల నుత్సాహముఁ బురికొల్పుచుఁ గుమారునకుఁ దగుచికిత్సలఁ జేయింపఁజొచ్చెను. చిత్రభానుని యుత్సాహమట్లే వాని సైన్యమును రెండవనాఁటికిఁ బలుచఁబడెను. మూఁడవనాఁటిమధ్యాహ్నమున మకరంద్యునిచే వజ్రపాణి తెగటారెను. పాప మాతనికిఁ గర్పూరమంజరీపాణిగ్రహణమహోత్సవము లభింపకున్నను వీరపురుషోత్తకమయిన శస్త్రమరణము గలుగుటచే సుందారమంజరీసమేతలయిన యచ్చరమచ్చెకంటులకేలుపట్టు భాగ్యము నందెను. దండపాణి లేకపోవుటచేతను విజయసేనుఁడు గాయపడుటచేతను, వజ్రపాణి నిహతుండగుటచేతను, చిత్రభానుని యుత్సాహాగ్ని చల్లవడెను. వాని సేనలు గాంధారుల పోటులకును పాంచాలురయేటులకును, మాళవుల ప్రహారములకును, నిలువలేక వెనుకదిరిగి చూడకపరుగెత్తిరి. కొందఱు ప్రాణరక్షణమునకై నదిలోఁబడి మునిఁగిచచ్చిరి. కొందఱు మొసళ్లపాలయిరి. కొందఱు దూరముకొట్టుకొనిపోయిరి. యుద్ధభూమి గుఱ్ఱములయుఁ బదాతులయు, నేనుఁగులయుఁ బీనుఁగులతోడ నతిభయంకరమై హేయమై మృత్యుదేవత రాజధానివలె నుండెను.

చిత్రభానుఁడు శత్రువులు తఱిమి తఱిమి మీఁదిమీఁదికి రాఁగ సేనలు లేక యుత్సాహములేక నూఱుమంది సైనికులతో యుద్ధభూమి విడిచిపోయెను. జీవసిద్ధి కొంత సేనతో వానవెనువెంట నంటిపోయి తఱిమి దాదాపుగ నందఱిం జంపె. చిత్రభానునకు రెండుకన్నులట్లు రెండుచేతులట్లు పనిచేసిన కరటకపింగళులు వెంటరా నతఁడు గత్యంతరములేక ప్రాణరక్షణముకొఱకు జలమునడలోఁ బడెను. ఈఁతయందు మిక్కిలి పరిశ్రమచేసినవాఁడగుటచేతను నప్పటికి సాయంకాలమగుటచేతను జీఁకటిచాటున నెట్టెటో దూర మీఁదికొనిపోయి రెండుజాముల రాత్రివేళ కవ్వలియొడ్డుం జేరి తడిబట్టలతో గడగడ వడఁకుచు నేకాకియై యవ్వలియొడ్డుఁ జేరి తనయవస్థం దలఁచి భవి

వృత్తాంతమునుగూర్చి తనలోఁదాను వితర్కించుకొనుచుండఁ గరటకపింగళులును దడిసిన బట్టలతో వచ్చి వానిం గలసికొనిరి. ఆసాయంకాలమున యుద్ధభూమియందు నెత్తురు లేరులై ప్రవహించెనను ట యతిశయోక్తిగాదు. ఏనుఁగుతొండము లనెడు తూములనుండి నెత్తుటివఱదలు వసుంధరపై విచ్చలవిడిగఁ బ్రవహించెను. ఆనెత్తురు వసుంధరాదేవిదాల్చినకుసుంభారుణవస్త్రమట్లు-మృత్యుదేవత యింట సంతోషమునఁ జల్లుకొన్న వసంతమట్లు-నాకసమునుండి నేలకు విజృంభించిన సంజకెంజాయయట్లు నెఱసెను.

చిత్రభానుఁడురణరంగమువిడిచిపాఱిపోయినపిదపమకరందుఁడు "భానుఁడ స్తమించె. చిత్రభానుఁడ స్తమించినట్లయింక సైన్యములు శిబిరమునకుం జనుఁ" డని యానతిచ్చి కోటచుట్టుఁ గొంతసేనఁ గావలిపెట్టెను. చిత్రభానుని పరాజయమును బలాయనమును విని రుద్రభట్టు తద్దయు వగచి కోటయొక్క దొడ్డిగుమ్మముఁ దెఱచి పాఱిపోవుచుండెను. మాళవసైనికులలోఁ గొంద ఱాప్రాంతమును గాచుచుండుటచే వారాతనిం బట్టి మకరందుని కప్పగించిరి. మకరందుఁడు వానిని మాధవసేనునికడకుఁ గొంపోయెను. అతఁడు పేదకుఁ బెన్నిధి దొరకినట్లు సంతసించి కాలుసేతులు గట్టిగా బంధింపఁ జేసి వాని నొకగుడారమునఁ బడవైచి చుట్టు నమ్మికగల బంట్లం గావలియుంచెను.

## ముప్పది యాఱవ ప్రకరణము.

మఱునాఁ డుదయమున భాగ్యవర్ధనుఁడు మకరందమహేంద్రదేవులను దన స్కంధావారమునకు రావించి కోటస్వాధీనముజేసికొనుటకై పోవలె నని చెప్పెను. అప్పుడు మకరందుఁ డిట్లనియె. "కోటలోఁ జిత్రభానునికుటుంబ మున్నది. వారు శుద్ధాంతకాంతలు. చిత్ర

భానుఁ డనేకదురితములు చేసియుంట నిజము. కాని యాతని యాలుబిడ్డ లాదోసములం బాలుకొనలేదు. కావున వారి కేవిధమైన యవమానముగాని, యగౌరవముగాని మనము తలపెట్టఁగూడదు. అదియునుఁగాక గాయపడిన విజయసేనుఁడుఁగూడఁ గోటలో నున్నాఁడు. ఆతనియెడ మన మనాదరణము జూపఁగూడదు. మఱియొక మాటగూడ జెప్పఁ దలఁచితిని. సమరవిజయగర్వముచే మన సైనికులు సేనాపతులు శ్రీనగరమును గొల్లగొట్ట నుబలాటపడుచుందురు పురజనుల కించుకేనియు నలజడి కలుగఁగూడ దని నామతము. వారు చేసిన యపరాధ మేమియు లేదు. నాపలికిన పలుకులు మీకు సమ్మతము లగునేని మనమందఱముఁ గోట నాక్రమించుకొందము" అనవుఁడు విక్రమసేనుఁ డిట్లనియె. "మకరందునిపలుకులు నాకు సమ్మతములు. మాపినతల్లి యిందుమణి సాధుశీల. కర్పూరమంజరి తన సోదరుఁ డగువిజయసేనునియెడ నెంతయభిమానము గలిగియున్నదో మాయెడ నంతయభిమానము నంతప్రేమ గలిగియున్నది. విజయసేనుఁడు దుర్జనుఁడు గాఁడు. తండ్రి దుశ్చరితుఁ డనుకారణమున పినదండ్రిదనయుని హింసించుటధర్మముగాఁదు. నాపినతండ్రి దండ్యుఁడుగాని తత్కుటుంబముగాదు. పురజనులునాయందనురక్తులు. కావున వారు మనయాదరంబునకుం బాత్రములు."

వారిరువురపలుకులు సహేతుకముగా నుండుటచే మహేంద్రభాగ్యవర్ధనులు వారు చెప్పినచొప్పున నడువఁ దలంచిరి. వారందఱు మాధవసేనునిగూడ వెంటఁబెట్టుకొని యాయుధపాణు లైనకొందఱు సైనికులఁ దోడ్కొని కోటం బ్రవేశించిరి వారివలనఁ దమకేమి యపపాయము వాటిల్లునో యని భయపడుచున్న యంతఃపురజనంబునకును బరిజనంబునకును నభయప్రదానంబు చేసిరి. విక్రమసేనహర్షవర్ధనులు జీవించియున్నారని తెలిసినప్పటినుండియుఁ గర్పూరమంజరి మిక్కిలి

సంతసించి వారిం జూడ నభిలషించుచుండెను. విక్రమసేనుఁడు భార్యా సమేతుండై యంతఃపురమున కరిగి యిందుమణికి నమస్కరించి యెట్టయెదుట నిలిచెను. ఆమె వానిని మెల్లగా దీవించి తనభర్తవిష యమై విచారించుచుం దలవంచుకొని యుండెను. కర్పూరమంజరి విక్రమసేనహర్షవర్ధనులను గౌఁగిలించుకొని హర్షవర్ధనుని ముద్దుపెట్టు కొని "తమ్ముఁడా! మీ యిరువుర నాకంటఁ బడినందుకు నామనస్సు పరమానందము నొందుచున్నది. వెనుకటిదంతయు మఱచిపోయెను. మీయమ్మ యెక్కడనున్నది?" అని వారిం బరామర్శ చేసెను. అప్పుడు విక్రమసేనుఁడు "అక్కా! దైవానుగ్రహమున వెండియు నిన్నుఁ జూచుభాగ్యము గలిగినది. ప్రాణసమగు వెండియు నుజ్జీవింపఁజేయఁ దలఁచుకొనలేదు. మీకు మావలన నెట్టిభయము లేదు. చేతులారఁ జేసికొన్న దుష్కృతఫలము మీతండ్రి యనుభవించును. విజయసేనునకుఁగూడ మాకెట్టి కీడుతలంపులు లేవు. మీరు నిర్భయ ముగా నుండుఁడు." అని చెప్పి యనంతరము విజయసేనునికడకుఁ బో యి వానికిఁగూడ నభయం బొసంగి ప్రాణవైద్యుల రావించి వానికిం జికిత్సలు చేయఁ బనిచెను. పిమ్మట వారందఱు వెండియు స్వ[illegible] వారంబునకుం జనిరి.

మాధవసేనుఁడు పట్టణంబునకుం జని మణివర్మయొక్కయు శూలపాణి గదాధరులయొక్కయు, దుస్థితిఁ దెలిసికొనివచ్చి వారిని బంధవిముక్తులఁ జేయుమని విక్రమసేనునితోఁ జెప్పెను. అట్లు కాక యని కొంతపరివారమునిచ్చి యతిఁడా కార్యముచేయుటకు మాధవ సేనుని నియోగించెను.

మాధవసేనుఁడు పరివారసమేతుఁడై కారాగారంబున కరిగి యుపవాసంబులచేతను, దేహపీడచేతను, మనోవిచారముచేతను మి క్కిలి కృశించి యానవాలుపట్టుట కయిన వీలులేనిస్థితిలోనున్న

తనమిత్రుని మలినవస్త్రధారుని గృశీభూతగాత్రునిఁ గనుఁగొని కన్నుల వేఁడికన్నీ రొలుక గాఢాలింగనముఁ జేసికొని సమస్తవృత్తాంతమంతయు నాతనికిఁ జెప్పి విక్రమసేనునివిజయ మెఱింగించి బంధవిముక్తునిజేసెను. అనంతరము గదాధరశూలపాణులఁ గూడ నాతఁడు విడిపించెను. వారు మువ్వురును తోడనే గృహంబునకుం జనక తమకృతజ్ఞతను రాజభక్తిని బాలుఁడైన విక్రమసేనునకుం దెలుప నాతని నిలయంబునకుం బోయి యెట్టయెదుట నిలిచిరి. సుధర్మునిఁ జూచిన తోడనే విక్రమసేనుఁడు లేచి నమస్కరించి కౌఁగిలించి "తాతగారు! మాకొఱకై మీరు చెప్పరాని యిడుములు బడితిరి. మిమ్ము వెండియు మేము చూతుమనుకొనలేదు. మొదటఁ బ్రతికూలముగానున్నను దైవము తుదకు మన కనుకూలుఁడయ్యె." నని పరామర్శపూర్వకమగు పలుకులు పలికెను. మణివర్మ నాతని తమ్మునిఁ గనుఁగొనగల్గినందుకు సంతసించి యట్లే మూర్ధాభిషేకము జరుగునని సూచించుటకో యన నానందాశ్రువులచే వానిశిరంబు నభిషేకించి "నాచిన్నియన్నలారా! మృత్యుదేవతకోరలనుండి యిక్కడను నదృష్టవశమున జీవింపఁగల్గితిని. దురాత్ముఁడైన చిత్రభానుఁడు రణమునఁ జచ్చినాఁడా, చేసినపాపము నడ్డిగొట్టక సుకుపక పోవునా? లేదా వ్రణశేషము, రణశేషము, ఋణశేషము నుంచఁగూడదని పెద్దలు చెప్పుదురు. వానిని విచ్చలవిడిగాఁ జరింపనిచ్చితిమా పిచ్చికుక్కను గ్రామమున విడిచినట్లే. కావున సైన్యమునంపి వానిం బట్టి తెప్పింపుము." అని బహూకరించి హితోపదేశముఁ జేసి సెలవు గైకొనియెను. గదాధరశూలపాణులును దమకృతజ్ఞతను దెలిపి చనిరి.

అనంతరము రుద్రభట్టు నేమిచెయఁ దగునని భాగ్యవర్ధనుఁడు మకరంద మహేంద్రదేవులను, మాధవసేన విక్రమసేనహర్షవర్ధనులను బిలిపించి యడిగెను. మకరందుఁడు వానిని దేశమునుండి వెడలఁగొట్టుట కర్తవ్యమని పలికెను. వానిని యావజ్జీవము కారాగృహమున

నుంచఁదగునని విక్రమసేనుఁ డనెను. "బ్రాహ్మణో న హంతవ్యః" యని ధర్మశాస్త్రము చెప్పుచున్న దికనుక నామనుమఁడు చెప్పినట్లు మకరందుఁడు చెప్పినట్లు జేయుట సముచితమని వృద్ధుఁడైనహేమేంద్ర దేవుఁడు వాక్రుచ్చెను. మాధవసేనుఁడు వారిమాటల కిష్టపడక రోషావేశముగలిగి యిట్లనియె. "అయ్యా! మీరందఱు మూర్ధాభిషిక్తులు ధర్మాధర్మ విచక్షణులు. మీ రెఱుఁగని ధర్మములు లేవు. నేను మీ కీవిషయమునం జెప్పఁదగినవాఁడను గాను. అయినను నాదొక్క చిన్న మనవిగలదు. ఇతఁడు బ్రాహ్మణుఁ డగుటచేనవధ్యుఁడని పాంచాలవల్లభుఁడు పలికె. ఆయభిప్రాయముచేతనే విక్రమసేనుఁడు యావజ్జీవకారాగృహవాసము విధించె. పరమదయాళువగుటచే మకరందుఁడు వానిని దేశభ్రష్టుఁ జేయుమనియె. మీమాటలు నాకు సరిపడవు. వాఁడు బ్రాహ్మణుఁడుగాఁడు చండాలుఁడు. చండాలుఁ డనుట చండాలుర నవమానించుట. చండాలురు గూడ వీనికర్మలంజూచి సిగ్గుపడవలయును. కటికవాండ్రైనను వీనిచర్యలం జూచి కంపింతురు. వీఁడే మాక్రిశర్మయనుపేరుపెట్టుకొని చిత్రభానుంగూడి హేమచంద్ర మహారాజుం జంపించెను. వీనియుపదేశంబుననే చిత్రభానుఁడు బాలకుల దారుణంబుగఁ జంపింపఁదలఁచె. అగ్నికి వాయువు తోడైనట్లు దురాచారుఁడైన చిత్రభానునకు వీఁడుమంత్రియై యుపదేష్టయై యుండెను. వీఁడు చేయని పాతకము లేదు. వీనియెడ దయబూనుట యనుచితము. వీనియెడ జాలిబూనుట పాతకమున కభ్యుదయము గలిగించుట. అధర్మమును బ్రోదిసేయుట. జాతముచేత విప్రుఁడైనంతమాత్రమున దురాచారుల క్షమించుట శ్లాఘాపాత్రముగాదు. కావున వీనిని దారుణవధముపాలుచేయుట మంచిది. ఏనుఁగుకాలిక్రింద వైచి త్రొక్కించియో కొఱతవేసియో వీనిని తుదముట్టింపవలయు." అప్పలుకులు విని భాగ్యవర్ధనుఁడు వాని నట్లుచేయుట యుక్తమనిపలికెను.

మీయిష్టమని మహేంద్రదేవుఁ డూరకుండెను. అంతనున్న పెద్ద లుచెప్పినట్లు వినకపోవుటచేఁ దమకెన్నో యిడుములు కలిగినవని యెఱిఁగి విక్రమసేనుఁడు వారిమాట కెదురాడఁడయ్యె. మకరందుఁడు వధింపవలదని పలుమాఱు చెప్పెను గాని వానిమాట సాగదయ్యె. రుద్రభట్టుం దోడ్కొనిరమ్మని భాగ్యవర్ధనుఁ డాజ్ఞయిచ్చెను. సంకెళ్ళబరువున మెల్లమెల్లగ నడుగులిడి నడచుచు గతగర్వుఁడై దీనాననుఁడై రుద్రభట్టు రాజసన్నిధిం బ్రవేశించెను. అతనిం జూచి భాగ్యవర్ధనుఁ డిట్లనియె. "బ్రాహ్మణుఁడా! చిత్రభానునితోఁ గలిసి కాశ్మీరరాజకుటుంబమునెడ నీవు పొనర్చినమహాఘాతుకకృత్యములకు నీకు మరణదండన విధించినారము. మకరందుఁడు కాలిక్రిందవైచి త్రొక్కించి నిన్నంతమొందించుట సముచితం బని సభాసదులు నిర్ణయించిరి. నీవర్చస్సుచూడ బ్రహ్మతేజ ముట్టిపడుచున్నది. అదిగాక నీవు వేదవేదాంగపారగుఁడ వని కూడ వింటిని. అట్టినీవ యక్కటికము లేక యక్కటికవానిచందమున దుష్కార్యంబులం బొనర్చితివి. కావునఁ దత్ఫల మనుభవింపుము" అనియానతీయ రుద్రభట్టు బాష్పాకులితలోచనుఁడై "మహాప్రభువులారా! నావయస్సును, నాకులమును, నావిద్యను, మీ రాలోచించి నన్ను క్షమింపవలయునని ప్రార్థించుచున్నాఁడ. నాయాలుబిడ్డలకు దిక్కెవ్వరు లేరు. నేను మిక్కిలిపేదవాఁడను. మీశరణముఁ జొచ్చినాఁడను. మీపాదము లాశ్రయించి బ్రతుకవలసినవాఁడను" అని బాలుఁడట్లు వెక్కి వెక్కి యేడ్చెను.

మకరందుఁడు చూడలేక చోటువాసి యవ్వలికిం బోయెను. మాధవసేనుఁడు "మహారాజులారా! ఇతఁడు నాటకమండలిపాత్రిమట్లు సకలరసము లభినయింపఁగలఁడు. ఇప్పు డేడ్చి మీహృదయంబులు కరఁగింపఁగలఁడు కావున మీరు మెత్తపడవద్దు. ఇతఁ డింతక

న్నను దారుణమైనశిక్షల కర్హుఁడు. బ్రతికియుండఁగా వీనిం గాల్చినను దోసము లేదు. ఇట్టికలుషాత్మునిసంపర్కమువలన నతిపవిత్రమగునగ్నిహోత్రుఁడు మలినుం డగును. కావున నిదే వీనికిఁ దగిన శిక్ష యని కఠినముగాఁ బలికెను.

"బ్రాహ్మణుఁడా! నీమీఁద నెవ్వరికిం జాలి లేదు. 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ' మ్మని మీవంటిపెద్దలే చెప్పినారు. కావున నీవు చేసినవ్యవసాయమునఁ బండినపంట నీవ కుడువవలయు. కార్యమొకఁడు చేయ ఫలము మఱియొకఁ డనుభవించునా? మాయారూపము దాల్చి హేమచంద్రునివంటి రాజచంద్రుని పొట్టం బెట్టుకొంటివి. అట్టినృపచంద్రుఁడు మరల మనకు లభించునా? ఛీ! నీమొగముఁ జూడఁగూడదు పొమ్ము." అని భాగ్యవర్ధనుఁడు కోపోద్రేకుఁడై పలికెను. అంతట సేవకు లాతని నవ్వలికిం దోడ్కొని పోయిరి.

గాంధార రాజులయొద్ద కాళరాత్రియనుమదపుటేనుఁగు కలదు. సేవకులు దానిం దోడితెచ్చి గాంధారస్కంధావారమునకు నెట్టయెదుట నిలువంబెట్టి వలదు వలదని పెద్దపెట్టున నేడ్చుచున్న రుద్రభట్టును లాగియు గెంటియుఁ ద్రోసియు నాదంతావళమునంతికమ్మునకుఁ దీసికొనిపోయి యొకయినుపగొలుసుఁ దెచ్చి రుద్రభట్టునడుమునకుఁ గట్టి దాని నేనుఁగుకాలికిబంధించిరి. అప్పుడు రుద్రభట్టు తన కట్టిదారుణమరణము విధి నిర్ణయించె నని మనస్సమాధానము జేసికొని కన్నులు మూసికొని పరమేశ్వరునిధ్యానము జేసి నేలం బండుకొనియెను. మావటీఁడు మత్తేభము నంకుశంబునం బొడిచి ముందుకు నడిపించెను. తోడనే యయ్యిభము ఘీంకరించి యతిభారములై రోళ్లవలె నున్నతనపాదములు రుద్రభట్టువక్షస్థలంబునఁ బెట్టి త్రొక్కి తొండమున వాని లేవనెత్తి గిఱ్ఱునఁద్రిప్పి నేలఁ బడవైచెను. రుద్ర

భట్టు గొన్నిన్నెత్తురులు గ్రక్కుకొని యమమందిరమునకుం జనియెను. సైనికులందఱు మహాభయముతో విస్మయముతో నాతనిదుర్మరణముం జూచి జాలినొందిరి. శ్రీనగరపౌరు లాబాలగోపాలముగ నవ్వార్త విని సంతసించిరి.

గాంధారనాయకుఁడు మణివర్మచేసినహితోపదేశము ననుసరించి చిత్రభానునిఁ బట్టి చంపుటో లేక బ్రతికియుండఁగా శ్రీనగరంబునకుం గొనితెచ్చుటో కర్తవ్య మని కొంతసేనతో జీవసిద్ధిని వానికొఱకై పంపెను. జీవసిద్ధియు నది దాఁటి వానిజాడ లరయుచుఁ బరిసరంబుల నున్నయరణ్యములు వెదకుచుఁ గొంతద వ్వరిగెను. ఒకయేటియొద్దున నొకకొండగుహలోఁ జిత్రభానుఁడు కరటకపింగళసమేతుఁడై తనయాప్తసేవకులు పిట్టలం గొట్టితెచ్చి యిచ్చినమాంసంబును గొన్నిపండ్లను మెసవి కాలక్షేపము సేయుచుండెను. ఒకనాఁటి సాయంకాలము చీఁకటిపడినవెనుక నాగుహలో ముగ్గురుఁగూర్చుండి తమదురవస్థకు వగచుచుండఁ బింగళుఁడు విచారాక్రాంతుఁడై యిట్లనియెను. "మహాప్రభూ! దేవరవారినిమిత్తమై మేము మేరు దాచుకొనక యేపని జేయుమన్న నాపని జేసితిమి. మీరు మీయన్నం జంపునపుడు మేమెంతో సాయము జేసితిమి. ఎన్నోమాయవేషములం దాల్చితిమి. నేను విశారదనామముతో మాళవదూత ననిబొంకి మీయన్నమనసు కలఁచితిని. గాంధారదేశబ్రాహ్మణవేషము, సాయిలవానివేషము, కరటకుఁడు వైచి యెంతో చిత్రముగాఁ గథాకలాపము వినిపించి సైనికుల కుద్రేకముఁ గలిగించెను. నేనును మహేంద్రదేవునిపురోహితవేషము వేసి సూయన యుంగరము దొంగలించుకొనివచ్చి రాజకుటుంబము మనసు కలచితిని. మీరు వేఁటకు వెళ్లఁదలఁచినప్పుడు నేనె గొల్లవాఁడ నైతిని. రాకొమరులు పులినోటఁ బడి చచ్చిరని శేనెబొంకితిని. మీయానదాఁటక యెన్నిదుస్తంత్రముల

నై నంబన్నితిని. కాని దైవము మన కనుకూలముగ లేకపోవుటంజేసి మనప్రయత్నములన్నియు భగ్నములయ్యెను. ఇంక నేమిచేయుదము? ఎందుంబోవుదము? మాబ్రతుకు, మాసుఖము, మీతో నున్నది. ఆలుబిడ్డలకు దూరమైతిమి. అన్నవస్త్రములకు వెలియైతిమి. పరమేశ్వరుండు మనమీంద నిర్దయుండగుటకుం గారణమేమో" యనియంగలార్చుచుండం జిత్రభానుండు దైన్యసూచకమగు హీనస్వరముతో "ఓరీ! మీవలన లోపములేదు. నే నేయాట లాడుమన్న నది యాడితిరి. అయినను మనము దైవోపహతుల మగుటచే నపజయమైనది. అయినను మేనం బ్రాణములుండ మనప్రయత్నము విడువందగదు. ఈయాటవికులం గూర్చుకొని క్రమక్రమముగా దేశపుంగొననున్న గ్రామముల నాక్రమించి మెల్లగ విజృంభింతము." అనిపలుకుచుండ మనుష్యులు నడచివచ్చుచున్నజాడ వారికి వినవయ్యెను. వెంటనే పింగళుండు గుహావెలుపలికి వచ్చి శబ్దమాలకించి 'మనుష్యుల యడుగుల చప్పుడువలెం గొంతదూరము వినంబడుచున్నది. మనలం బట్టం బగతులు వచ్చుచున్నారేమో? ఈవలకురండు. పాఱిపోదము." అని తొందరపాటుతోం బలికెను. అదివిని వెంటనే లోపలనున్న యిరువురు వెలుపలికి వచ్చి శబ్దమాలకించిరి. అంతలో జీవసిద్ధిసైన్యము మిక్కిలి దగ్గఱకు వచ్చుటయు సేవకసమేతుండై చిత్రభానుండు ప్రాణరక్షణమునకై పఱవెత్తసాగెను. అదికనిపెట్టి జీవసిద్ధియు సైనికులును వారిం దఱుమనారంభించిరి. కాలిలో ముండ్లు విఱుగుటంజేసి పింగళకుండు నడువలేక యొకచోటంబడెను. సైనికులు వానిం బట్టి తుత్తునియలుగాం జేసిరి. చిత్రభానుండు తనపాదములు పరుగెత్తనిచ్చి యంతవేగముగాం బరుగెత్తుచు నొకచెంచుపల్లియ డాసి యయ్యూరు వెలుపల నున్న పాడునూతిలోం బడెను. చీంకటిచాటున నది కానంబడకపోవుటచే నట్టిప్రమాదము సంభవించెను. అందు నీరులేదు గాని

పాములు, జెఱ్ఱులు, కండచీమలు మొదలగునవి విశేషముగ నుండెను. తేళ్ళుకుట్టెను. పాములు కఱచెను. కండచీమలు పీకెను. ఆతఁడాబాధలుపడలేక పెద్దపెట్టున నఱచి మరణవేదన బొందెను. చెంచుపల్లియలోనివారందఱు నడలి మేలొ్కనిరి. అంతలో నాతఁడెక్కడున్నాఁడో నెవ్వరుఁ జెప్పనక్కఱలేకయే వానియఱపులే యెఱింగించుటచే జీవసిద్ధి యానాతికడకుఁబోయి సైన్యసమేతుఁడై దానియొద్దున నిలిచెను. కొంతసేపటికిఁ గ్రమక్రమముగాఁ జిత్రభానుఁడు స్మారకము దప్పి హీనస్వరంబున నేమేమో గొణుగుకొనుచుఁ గాలధర్మము నొందెను.

మఱునాఁ డుదయమువఱకు జీవసిద్ధి యచ్చట నుండి శవముం దీయించి సైనికులతో నిట్లనియె. "ఆహా! చూచితిరా? యెంతయున్నతవంశముననో జన్మించెను. ఎన్నివిద్యలనో నేర్చెను. కాని దురాశాపీడితుఁడై దుస్సహసాహసములంజేసి దుర్నయంబున కొడిగట్టి దుస్తంత్రంబులఁబన్ని దుష్కార్యములాచరించితుదకీమరవస్థందెచ్చికొనియె. రాజద్రోహియయ్యెను. భ్రాతృద్రోహియయ్యెను. దేశద్రోహియయ్యెను. శిశుహంతకుఁడయ్యెను. తరువాత నరకమున్నదో లేదో గాని యీనాతిలోఁ బడినది మొదలుకొని ప్రాణముపోవువఱకు భూలోకమందె నరకక్లేశమనుభవించెను. శిష్టజనసంరక్షణంబును దుష్టజనసంశిక్షణంబును జేయ దీక్షవహించినదాక్షాయణీవల్లభుఁడు పరమేశ్వరుఁడు పాపఫలంబు దురాత్ములననుభవించునట్లు జేయకపోవునా? పాప మెన్నటికిని జయముగాంచదనియు, సత్యమే జయించుననియు ధర్మమే సర్వోత్కృష్టమైవర్ధిల్లుననియుఁ దుదకు వారికి మిగిలినది పాపమేయనియు వీనిచరిత్రమువల్ల నేర్చికొనవచ్చును."

అనిపలుపస్యసించి శవమును భాగ్యవర్ధనవిక్రమసేనులకుఁ జూపఁదలఁచి కట్టుకు గట్టించి దానిపైఁబెట్టించి సేవకులచేత మో

యించుకొని నదియొడ్డునఁబెట్టించి నది దాఁటి తాను స్కంధావార మునకుం జని విక్రమసేనునకు భాగ్యవర్ధనునకు మకరందునకు మాధవసేనునకు నవ్వార్త జెప్పి రహస్యముగ వారిని నదిదాటించి యావలియొడ్డునకుఁ దీసికొనిపోయి శవముం జూపెను. చిత్రభానుఁ డస్తమించె నని వారప్పుడు నిజముగా నెఱిఁగి సంతుష్టు లయిరి. విక్రమసేనుఁడు వానిదురవస్థకు విచారించి బాష్పాకులితలోచనుఁ డయ్యెను. మాధవసేనుఁడు చేతులారఁ జేసికొన్నది యనుభవింపకతప్పునా యనెను. మకరందుఁడు జాలిపడెను. మరల నడవికిం గొనిపోయి యచ్చటనే దహనసంస్కారము చేయుఁడని భాగ్యవర్ధనుఁ డాజ్ఞ యిచ్చెను. ఆవార్త చిత్రభానునికుటుంబమునకుఁ దెలియకుండ రహస్యముగ నుంచుమని కాలాంతరమునఁ దెలియఁజేయవచ్చునని విక్రమసేనుఁడు వారినిగోరెను. శాస్త్రచోదితములైనయుత్తరక్రియలు లేక తనవారలకు విచారించునాప్తజనము లేక, దిక్కులేక చిత్రభానుఁడు వనమధ్యంబున నెండుటాకులు గాలినట్లు దగ్ధుఁడయి యపకీర్తికాయమును లోకంబున విడిచి పోయెను. చిత్రభానుఁడు నూతఁ బడినరాత్రి కరటకుఁడు పేరఁకలిగొన్నపెద్దపులివాతం బడి యంతకపురంబుఁ జేరెను.

---

## ముప్పదియేడవ ప్రకరణము.

చిత్రభానుఁడు మృతినొందినవెనుక నొకమాసమువఱకు నూరకుండి భాగ్యవర్ధనుఁడు మకరందమహేంద్రదేవులతో నాలోచించి విక్రమసేనునకుఁబట్టాభిషేకము సేయ నిశ్చయించెను. మాతామహుఁడైనమహేంద్రదేవుఁడు నానాదేశాధీశ్వరులకు మనుమనియభిషేకమహోత్సవమునకు రావలయునని యాహ్వానముల నంపెను. మాళ

వేంద్రుఁడైనసుదర్శనుఁడు సింధునాయకుఁడైనపరాంతపుఁడు ఘూర్జర వల్లభుఁడైన కువలయేశ్వరుఁడు మున్నగుమహీనాయకులు తమతమ పరివారములతో మహావైభవమున వచ్చి శ్రీనగరమునఁ దమనిమిత్తఁ మేర్పఱుపఁబడినవిడిదలలో విడిసిరి.

నగరమంతయు సింగారింపఁబడెను. ఎచ్చోటఁజూచినఁ బచ్చని పందిళ్ళు. ఏద్వారమునఁజూచినఁ గనుపండువు సేయుతోరణములు. ఏగు మ్మముముందరఁ గనుఁగొన్న గెలలతోనిండిన యనఁటికంబములు. ఏగోడలు వీక్షించిన నతిమనోహరములైనచిత్తరువులు. ఏమేడలఁ జూచినఁ బట్టుపతాకములు. ఏనెలవుదర్శించిన సర్వాలంకారశోభిత లైన విలాసవతులు. యమున, సింధు, భాగీరథి, సరస్వతీ, ప్రముఖము లగుపుణ్యవాహినులతోయంబులు హేమకుంభములతోఁ దెప్పింపఁ బడెను. ప్రకృతిజనంబులలో ముఖ్యులు తన్మహోత్సవదర్శనార్థమై వచ్చిరి. భాగ్యవర్ధనుని యానతి బూని చండశక్తివర్మలు తగుపరి వారములతో గాంధారనగరమున కరిగి కుమారాభిషేకమహోత్సవము గనుఁగొనుటకై యరవిందాదేవిని దోడి తెచ్చిరి. తల్లియుం గొడుకు లుఁ గలసికొని పరస్పరాలింగనసుఖంబు ననుభవించిరి.

సిద్ధాంతులు నిర్ణయించినసుముహూర్తంబున మహారాజులయు, సామంతులయు, మంత్రులయుఁ, జుట్టములయుఁ బ్రకృతిజనంబులయు సన్నిధిని బురోహితుఁడగునిగమశర్మ విక్రమసేనుని గాశ్మీరసింహాస నంబునఁ గూర్చుండఁబెట్టి పుణ్యనదీతోయంబులతో నభిషేకించెను. అరవిందాదేవిసహజమగుమాతృవాత్సల్యముచేతఁ గన్నుదమ్ములనుండి దొరఁగునానందబాష్పములతోఁ బుణ్యనదీజలములఁ బవిత్రమైనకుమా రునిమూర్ధమున వెండియు నభిషేకించెను. ఉదయశైలము నలంకరిం చినభానుమండలమట్లు నవరత్నఖచితమైన సువర్ణపీఠము నధిష్ఠించిన దేదీప్యమానప్రభలతో విరాజిల్లుమణిమయమకుటంబు నొదలఁ

దాల్చి, కుమారభావంబుదాల్చి వచ్చినహేమచంద్రుఁడుంబోలె వొ
యు విక్రమసేనునిం జూచి మహేంద్రదేవప్రముఖబాంధవులు సుదర్శ
నాదిమిత్రులు, భాగ్యవర్ధనప్రముఖులగునాప్తులు నానందించిరి. వంది
మాగధులు కైవారము జేసిరి. వైతాళికులు జయగీతములఁ బాడిరి.
వృద్ధు లాశీర్వదించిరి. ప్రకృతిజనంబులు భళి భళీ యని ప్రశంసించి
సంతసించిరి. విరివిగా జరిగినయన్నదానమునఁ బేదలు సంతుష్టులైరి.
భూరిసంభావన లందుకొని కవులు, పండితులు, బహుశ్లోకగర్భితము
లైనదీవనలనిచ్చిరి. నగరమంతయు నుత్సవమయము య్యెను. ఒకచో వి
ప్రులవేదఘోషములు, వేఱొకచోఁ బణ్యాంగనలయాటలు, గొండొక
చోఁ బుణ్యాంగనలపాటలు, నొకమూల గానవినోదములు, నొకనెలవునఁ
బండితశిరోమణులవాదములు నొకతావున మిత్రులసరససల్లాపములు
నొకయెడ బాంధవులపరస్పరపరామర్శలు నిట్లునగరమంతయు మహా
నందమయమై నయనపర్వమై మనోహరమై యుండెను.

ఉత్సవానంతరమున విక్రమసేనుఁడు తనకుం దమ్మునకుఁ బ్రా
ణప్రదాతలైనచండుని శక్తివర్మను బిలిపించి వారిరాజభక్తిని గొని
యాడి చెరిమూఁడుగ్రామములు పన్నులులేకుండ నగ్రహారములుగా
నొసఁగెను. అదియునుఁగాక తమనిమిత్తమై కష్టపడినవారికిఁ, బ్రాణ
ములుగోల్పడినవారికి, నుచితరీతిని బారితోషికముల నొసంగి, వారి
కుటుంబములకు జీవనాధారముగల్పించెను. చిత్రభానునియొక్కయు
దండపాణి వజ్రపాణులయొక్కయు దుర్బోధనలవలన వికలచిత్తులై
తనపైఁదిరుగుబాటుచేసినసైనికుల నందఱను క్షమించి మరలసైన్య
మునఁ జేర్చుకొనెను. మణివర్మను, మాధవసేనుని, మంత్రులుగా
నియమించెను. గదాధర, శూలపాణులు సేనాపతులైరి.

భాగ్యవర్ధనుఁడు తన గారాబుకూఁతురైన సౌదామినిని విక్ర
మసేనునకును, దనతమ్మునికూఁతురగు చిత్రరేఖను హర్షవర్ధనునకును,
నిచ్చి వివాహము సేయసంకల్పించినట్లు మహేంద్రదేవునితోడను,

నరవిందాదేవితోడను, జెప్పి వారియనుమతివడసి మాఘమాసంబునఁ గళ్యాణంబులు జరుపఁదలఁచి సుముహూర్తము నిశ్చయించెను. మహేంద్రదేవుఁడు తానతివృద్ధుఁడై రాజ్యభారము నిర్వహింప లేకుండుటచేఁ దనరాజ్యమున హర్షవర్ధను నభిషేకించి వానికి యుక్తవయసువచ్చువఱకుఁ దా నాతనికిఁ దోడ్పై యుండి యనంతరము దపోవనమున కరుగ నిశ్చయించెను. భాగ్యవర్ధనుఁడును దనకుం దమ్మునకుఁ బురుషసంతతి లేనందునఁ దనపరోక్షమునవిక్రమసేనుఁడేగాంధార దేశమునకుఁ గూడ నేలికగాఁగలఁడని యెల్లరాజులయెదుట నొక్కి వక్కాణించెను.

సుదర్శనుఁడు మకరందుని మిత్రుఁడగు చంద్రచూడునివలనఁ దనకుమారుఁడు కర్పూరమంజరిపై వలపునిలుపుటవినియున్న కతమున విక్రమసేనుని పట్టాభిషేకమహోత్సవము నిమిత్తము నిర్మింపఁబడిన పచ్చని పందిళ్లలోనే కర్పూరమంజరిని మకరందునకు వివాహము సేయు టుచితమని యరవిందాదేవికిని నిందుమణికిని నిగమశర్మముఖమున సందేశమంపెను. అరవిందాదేవి యాసందేశము నాదరముతో విని యావివాహము నంగీకరించెను. భర్తృమరణవార్త తెలియక పోయినను నిందుమణి మహాపతివ్రత యగుటచే నాతనికొఱకై చింగగాని యన్యులతో మాటలాడక సరిగా నన్నము ముట్టక నిదుర పోవక దుఃఖపరవశయై యుండియు, సంప్రాప్తయౌవన యైనకూఁతు నవివాహితగాఁ జిరకాలముంచుట యనుచితంబని తలంచి యనుకూలుఁడైన వరుఁడు చేకూరినప్పుడు వాని కామెనీయకపోవుట యధర్మమని భావించి యరవిందాదేవిం బిలచి యిట్లనియె "అక్కా! మీమఱఁదితోఁబాటు నేనును మీకు లేనిదాననే యని భావింపుఁడు మీమఱఁదివలన మీకైన మహోపకారముల నెల్ల మరచిపొండు. చిన్ననాఁటనుండి కర్పూరమంజరిని నీవె పెంచితివి. అది నీబిడ్డ కాని

నాబిడ్డ కాదు. కడుపునఁగాంచుటచే నేను తల్లినైతిని, పెంచుటచే నీవు తల్లివైతివి. దానికి నామీఁదకన్న నీమీఁదనే మక్కువ మెండు. నేను బహుకారణములచేఁ బ్రజలముఖము జూడఁజాల కావునఁ గర్పూరమంజరిని మాళవరాజనందనుఁడగు మకరందునకిచ్చి పెండ్లిచేయింపుము. జనకునికి జడిసి యబ్బాలిక పైకిఁ జెప్పలేదుగాని యామె రహస్యముగ బౌద్ధమతమును స్వీకరించినది. వెనక దండ్రితోఁగూడ నొకసారి బుద్ధదేవునిసిద్ధాంతములఁ బ్రసంగించుచు గంభీరముగ మాటలాడెను. అందుచే బౌద్ధధర్మప్రకార మామెకు వివాహము సేయింపుము." అని పలికి యాగకుండ వచ్చుబాష్పధారలను చీరచెఱఁగుతో దుడుచుకొనియెను. "ఇందుమతీ! విచారింపకు. నీమనోభీష్టము నేను నెఱవేర్చెద. నీకు విక్రమసేనహర్షవర్ధనులతో ముగ్గురుకొడుకులనుకొనుము. నీవు చెప్పినట్లు కర్పూరమంజరి నాబిడ్డయే. కర్పూరమంజరికి శుభముహూర్తమున వివాహముచేయించెద." నని యరవిందాదేవి నుడివి యామె యలమట దీర్చి వివాహమునకు ముహూర్తమేర్పఱచి యావార్త సుదర్శనున కెఱింగించెను. సుదర్శనుఁడును వెంటనే వార్తాహరుల నుజ్జయినికంపి చంద్రప్రభాదేవిని రత్నసేనప్రముఖులగు మంత్రులను రావించెను. అరవిందాదేవి వేగ గమనముగల యొంటెలమీఁదఁ బ్రయాణనైపుణిగల పరిజనుల విదర్భకంపి వివాహమునిమిత్తము సకుటుంబసపరివారముగా రాజవాహనుని రమ్మని యాహ్వానమంపెను. అందఱును వివాహమహోత్సవదర్శనార్థము వచ్చిరి. తక్షశిలనుండియు మఱి యితరప్రదేశములనుండియు బౌద్ధభిక్షుకభిక్షుణీజనములు తండోపతండములుగ వచ్చి శ్రీనగరమున విడిసిరి. కామునికి మును బౌద్ధయోగినియు, జినదాసుఁడను బౌద్ధగురువును విజయముచేసి సౌగతధర్మప్రకారము సకలబంధుమిత్ర సమక్షమునఁ గర్పూరమంజరిని మకరందునకిచ్చి వివా

హాము చేసిరి. ఆదంపతులం జూచి జయజయ ధ్వనులు సేయనివారు భళీయని ప్రశంసింపనివారు "సహో! బ్రహ్మనిర్మాణకౌశల"మ్మనని వారు "దాంపత్యమన నిదే దాంపత్య"మని యననివారు సంతోష మొందనివారు, హర్షసూచకముగఁ జప్పటులు చరువనివారు నచ్చట గుమిగూడిన జనులలో లేరు.

ప్రపంచములో ననుకూలదాంపత్యము కుదురుటయరిదియగుటచే విధాత తుల్యగుణములు, తుల్యరూపములు తుల్యశీలములుఁ గల దంపతులను గూర్చి నేటికాలమునకు లోకనింద బాసెనని జనులు చెప్పుకొనిరి. వివాహము మహావైభవముతో జరిగెను. పేదలకు మృష్టాన్నము లభించెను. పండితులకుఁ బారితోషికములు దొరకెను. భిక్షుకభిక్షుణీజనంబులకుఁ దగు వసనంబు లీయఁబడెను. మకరందుని మనోరథము సిద్ధించెను. కస్తూరిమంజరి కామితము కడముట్టెను.

వివాహానంతరమున సుదర్శనుఁడు విజయసేనుని నిందుమణిని నరవిందాదేవిని విక్రమసేనుని నొడంబఱచి కోడలైన కస్తూరిమంజరిని నుజ్జయినీ పురంబునకుఁ దోడ్కొనిపోయెను. రతీమన్మథులవలె నున్న యాసతీపతులం జూచి యుజ్జయినీపురవాసులు మహానందభరితులై వారిరువుర సమాగమము బహువిధములఁ బ్రశంసించిరి. సుదర్శనుఁడును జంద్రప్రభాదేవియు గుమారుని మాళవరాజ్యమున నభిషిక్తుని జేసి, తాము మందిరము విడిచి యొకవిహారమునం బ్రవేశించి బుద్ధదేవోపదిష్టములయిన ధర్మములఁ బారాయణము సేయుచుఁ బారమార్థికచింతతో గాలము గడుపఁదొడఁగిరి. మకరందుఁడు సతీసమేతుఁడై ప్రత్యహముఁ దల్లిదండ్రుల సందర్శించి వారిదీవనలఁ బడసి వచ్చి ధర్మమార్గానుసారముగాఁ బ్రజాపాలనము సేయుచుండెను. ప్రతిగ్రామమున నతఁడు చెఱువులు, నూతులు, బావులు త్రవ్వించెను. పల్లె పల్లెయందు బాలురవిద్యాభివృద్ధికై పాఠశాలలు నెల

కొల్పెను. దుర్గమములగుమార్గముల౯ జక్కని రాచబాటలు నిర్మించె ను. విశాలములైన యీబాటల కిరుప్రక్కల సుందరపుష్పములను, మధురఫలంబులను, సీతలచ్ఛాయలను నొసంగు వృక్షములనాటించెను ఎల్లరు ఫలంబుల ననుభవింపవచ్చును. ఎల్లరు పుష్పముల స్వీకరింప వచ్చును. ఎల్లరు నీడల సుఖంపవచ్చును. క్రోసుదూరమున కొక్క చోట బాటసారులు విడియుటకై సత్రముల౯ గట్టించెను. రోగులచికి త్సలనిమిత్తము ధర్మవైద్యశాలలు స్థాపించెను. తెగులుగొంట్లగు పస రములకుసైతము నట్టి చికిత్సాశాలలే నిర్మింపఁబడెను. మాంసభక్షణ ము దేశమందంతట నిషేధింపఁబడెను. జీవహింస యరుదయ్యెను. జంతువులయెడ సహితము నిష్కారుణముగాఁ బ్రవర్తించినవారు రా జదండనలకుఁ బాత్రములైరి. తల్లిదండ్రులయెడ భక్తి గురుజనంబుల యెడ గౌరవము క్షుద్రజంతువులయెడ దయ, పరస్త్రీలయెడ సోదరీ భావము, వికలాంగులయెడ నిరుపేదలయెడ జాలి, మొదలగు సద్గు ణంబులు "యథా రాజా తథా ప్రజా" యనుసామెత నిజముగా రాజునడతనుండి ప్రజలు నేర్చుకొని ధర్మాచరణముచేత రాజుమనస్సు రంజింపఁజేసిరి. మకరందునకుఁ బరరాజులలో శత్రువులు లేకపోయిరి. అజాతశత్రుఁ డనుశబ్దము సరిగాపదునొకండక్షౌహిణుల శత్రువులుగల యుధిష్ఠిరునకుఁ జెల్లినదనియు నిజముగా నమ్మాట మకరందునకే జెల్లు ననియు నాకాలపువారందరుఁ జెప్పుకొనుచుండిరి మగధనాయకుని మందిరములందు మకరందునికీర్తియు, ఘూర్జరాధిపునికొలువుకూటం బున మకరందునిప్రశంసయు, శూరసేనన్నృపాలుని శుద్ధాంతముల యందు మకరందునిపేరె వెయ్యేల! దేశమందెల్లెడ నాతనియశోల తలు బ్రాఁకెననుట యతిశయోక్తిగాదు. మకరందుఁడు తనప్రజలలో దండ్రిలేనివారికిఁ దండ్రియై భ్రాతృహీనులకుభ్రాతృఁడై మిత్రులు లేనివారికి మిత్రుఁడై ధనములేనివారికి ధనమై బలములేనివారికి బల

మై "దుర్బలస్య బలం రాజా" యనులోకోక్తిని సార్థకము జేసెను. అతఁడు దురాచారులకు దుర్నిరీక్ష్యుఁడై యుత్తముల కుపగమ్యుఁడై, విద్వజ్జనులకు వేలుపుంజెట్టై పేదలపాలిటి పెన్నిధానమై సర్వజనరంజకుఁడై దుష్టజనభంజకుఁడై ప్రజ తనకు శరీరముగాఁ బ్రజా శరీరమునకుఁ దా నాత్మగా, నుండునట్లు మెలంగి ధర్మమార్గమునుండి యించుకేనియుం దొలఁగక, దనచేత లితరనేతలకు మార్గదర్శకములుగా మహీపాలనముచేయఁజొచ్చెను. కర్పూరమంజరి సహధర్మచారిణియనుపేరు సార్థకమగునట్లు కాంతలలో నీయింతి మేలుబంతి యని పేరువచ్చునట్లుమహాపతివ్రతలలో నగ్రగణ్యయై యత్తమామలకు విధేయయై బంధువులకుఁ బరమానురక్తయై మహారాజపత్నియయ్యు గరువంబించుకయులేక నెల్లయంగనలకు దర్శనంబిచ్చుచు సాదరంబుగ మాటలాడుచుఁ దల్లిలేనివారికిఁ దల్లియై యాడుబిడ్డలు లేనివారికి బిడ్డయై, గతిలేనివారికి గతియై, జనులప్రేమకు భక్తికిఁ బాత్రమై యుండెను. ఆమె పేదలగు బాలింతరాండ్రకుఁ బథ్యపానంబులంపును. సూలింతరాండ్రకు సూడిద లంపును. పేదలయాకుటిండ్లకు, గుడిసెలకు సయితము బోయి వారిసుఖదుఃఖముల నరయుచుండును. వారికిఁ గావలసినధనసాహాయ్యము జేయుచుండును. ఆదంపతులు ప్రజలనే బిడ్డలుగా భావించి, వారియానందము తమయానందముగ, వారియభ్యుదయము తమయభ్యుదయముగ వారికష్టములు తమకష్టములుగ వారికలిమి దమకలిమిగ వారిలేమి దమలేమిగ భావించి వారిసుఖమునకై యెల్లపుడుఁ బాటుపడు చుందురు.

కర్పూరమంజరికి లోకైకసుందరుఁడగు నొకకుమారుఁడును, జగన్మోహనాకార యగునొకకూఁతురుం గలిగిరి. పాడిదప్పక రాజు పాలించుటంజేసి జనులు పాడిపంటలు గలిగి సిరిసంపదలు గలిగి వర్థిల్లుచుండిరి.

భాగ్యవర్ధనునిమరణానంతరమున విక్రమసేనుఁడు గాంధారమునకుఁగూడ రాజయ్యెను. మహేంద్రదేవునిపరోక్షమున హర్షవర్ధనుఁడు పాంచాలమునకుఁ బ్రభువయ్యెను. మాళవపాంచాల గాంధార, కాశ్మీర దేశంబు లక్కసెల్లెండ్రిట్లు బరస్పరమైత్రి గలిగి సిరులతోఁ దుల దూఁగుచుండెను. ఇందుమణియు, విజయసేనుఁడును గర్పూరమంజరీ వివాహమైనవెనుక గొన్నిమాసములుదనుక శ్రీనగరమునందుండి పిమ్మట మకరందుఁ డాహ్వానము సేయ, నుజ్జయినికింబోయి యచ్చట నే నివసించి యుండిరి. విజయసేనుఁడు కాలక్రమంబున మాళవసైన్యంబుల కధిపతియై మేటిదండనాయకుఁడని పేరుపొంది మకరందుని యాదరమునకు భాజనమయ్యెను. అనుకూలవతి యగుకర్పూరమంజరి యిల్లాలుగ భద్రసేనుఁడు మంత్రిగ విజసేనుఁడు దండనాదుఁడుగ ధర్మము మిత్రంబుగ సత్యంబు చుట్టంబుగ మకరందుఁడు జూద మాడి సిరులు గోల్పోవనినరుఁడు చండాలసేవ జేయనిహరిశ్చంద్రుఁడు వేశ్యాలోలుఁడుగాని పురూరవసుఁడు నని ప్రజలు ప్రశంసింపఁ జిరకాలము రాజ్యపాలనము జేసెను.

సమాప్తము.



# విష్ణువర్ధనుఁడు

రాజమహేంద్రవరము రాజధానిగఁ జేసికొని క్రీస్తుశకము 7 వ శతాబ్దము మొదలు 12 వ శతాబ్దమువరకు మనయాంధ్రదేశమును బాలించిన చాళుక్యవంశపురాజులలో ననేకులకు విష్ణువర్ధనుఁడను బిరుదు గలదు. ఆకాలమునందు మన తెనుఁగుదేశము వేగీదేశమని గ్రంథములలోఁ బేర్కొనబడుచు వచ్చినది. ప్రస్తుతమేలూరికి వద్దనున్న వేగి యనుగ్రామము పూర్వ మీదేశమునకు రాజధానిగ నుండెననియు రాజమహేంద్రవర మిటీవ రాజధానియైన దనియు వేఁగి రాజధానిగ నుండుటచేతనే దీనికి వేగీదేశ మని పేరు వచ్చిన దనియుఁ గొందఱు చెప్పుచున్నారు. మొదట రాజధాని యేదైనను వేగీదేశమునకు రాజమహేంద్రవరము కొంతకాలము రాజధానియై యాంధ్రదేశముఖమునకు మనోహరకస్తూరితిలకమై యాంధ్రమహాభారతజన్మస్థానమై భరతఖండంబునఁ బేరువహించినది. ఈపట్టణ మేలిన రాజులును భాషాభిమానమునకు బలపరాక్రమమునకుఁ బేరుపడి యుండిరి. అందు భారతము నన్నయభట్టారకునిచేఁ గృతినందిన రాజరాజనరేంద్రుఁ డగ్రగణ్యుఁడని చెప్పవచ్చును. ఈతనికి విష్ణువర్ధనుఁ డను బిరుదు గలదు. ఈబిరుద మీతని పూర్వులలో ననేకులకుఁ గూడ గలదు. ఆంధ్రదేశపరిపాలకులైన చాళుక్యుల కీబిరుద మెట్లుగలిగినదో తెలిసికొనుట యవశ్యము. అట్లు తెలిసికొనుట కొక చిన్నకథ వినవలయు.

మొట్టమొదట నాంధ్రదేశమునకు వచ్చిన చాళుక్యరాజు మహాతేజశ్శాలియై దేశము నాక్రమించుకొని రాజ్యము సేయుచుండ శత్రురాజు లాతని దాడికోడి యాతని నెట్లైన దేశమునుండి పారదోలవలయునని యనేకోపాయంబుల నాలోచించిరి. చాళుక్యరాజు బాహుబలసంపన్నుఁ డగుటచే దుర్నిరీక్ష్య

ప్రభావంతుఁడై చాలకాలము నిరంకుశప్రభుత్వము నెఱపెను. తేజ
శ్శాలుల కెప్పుడును వైరు లధికమగుట సహజముకదా! చాళుక్యరా
జునకు శత్రుమండలము నానాటి కధికమయ్యెను. చుట్టుప్రక్కలనున్న
రాజులందఱు గట్టుగట్టి మహాసైన్యములఁ గూర్చుకొని చాళుక్యరా
జుమీఁదికి దండెత్తిరి. అసాధారణభుజబలశాలి యగుచాళుక్యభూ
పాలుఁడు పలుమాఱు లారాజుల వేరువేర రణరంగమునఁ బరాజితులఁ
జేసినవాఁడగుటచేతను, నెంతలెంతలు మేటిమగల నైనఁ గడ్డిపరకలుగఁ
జూచునట్టిస్వభావము గలవాఁడగుటచేతను, తనబాహుబలంబునందును
దన సేనాబలంబునందును మితిమీఱిన విశ్వాసముగలవాఁడగుటచేత
తను జంకు గొంకు లేక వివాహమునకుఁ దరలివెళ్ళిన విధంబున సం
గ్రామరంగమునకుఁ జతురంగబలసమేతుఁడై బ్రాహ్మణాశీర్వాదపు
రస్సరముగ మహావైభవముతో నరిగెను. యుద్ధమునందు జయమునే
ప్రతీక్షించుచుండుటచేత జాళుక్యమహీపాలుఁడు తన విజయంబును
శత్రువుల పరాజయంబును, తన సైన్యంబుల విజృంభణంబును, బగ
వారి పలాయనంబును, తన స్వేచ్ఛాకీర్తిని వైరుల యప్రతిష్ఠను, కన్ను
లారఁగాంచి యానందించుటకై చిరకాలమునుండి రణరంగంబులఁ జూడ
వేడుకపడుచున్న తన పట్టమహిషిని బంగారపు హౌదాతో నలంక
రింపబడిన మదపుటేనుగుపై నెక్కించి తోడ్కొని పోదలంచెను. ఆ
మెతో నంతఃపురము వదలి సఖీజనంబులు పరిచారికలు నందలకొల
ది యుద్ధదర్శనకుతూహలముతో రాఁదలంచిరి. అప్పుడు చాళుక్య
రాజుపట్టమహిషి గర్భవతియై యుండెను. ఆమాలాలి కాఱవమాస
ము గడుచుచుండెను. చెలికత్తెలు చుట్టములు నీకేమిసూడిదలు కా
వలయునని యడుగ నామె నాకు సూడిదలేమియు నక్కఱలేదని చె
ప్పుచు వచ్చెను. భర్త యామె సన్నిధానమునకరిగి "దేవీ! నీయభీష్ట
మేదో నెఱవేర్చెద. చిరకాలమునకు గర్భవతివైన నీకు నే నియ్యరా

నికోరిక లేదు. సందేహింపక యడుగు" మని వేడికొనియెను. అనవు
డాదేవి యిట్లనియె. "జగద్వినుత మైన దేవరవారి భుజవీర్యంబు రణ
రంగమునఁ గారుచిచ్చువలె విజృంభించునపుడు నేను స్వయముగ జూడవ
లయు నని చిరకాలమునుండి కుతూహలము గలదు. ఇప్పుడు మీరు
దండయాత్రకు వెడలుచున్నట్లు వింటిని. నన్ను గూడ వెంటబెట్టు
కొని పోవలయు నని ప్రార్థించుచున్నదానను" అనవుడు చాళుక్య
వల్లభుం డగు వల్లభు డిట్లనియె! "దేవి! నాయభీష్టంబును నీయభీష్టం
బును నొక్కటియే యైనది. చిరకాలమునుండి నా సంగ్రామకేళి నీకుం
జూపి నయనోత్సవము గావింప దలంచుచుంటిని. నేనే నిన్ను పిలుచు
కొని పోవలయునని తలఁచుచుండ నీవే నన్నడిగితివి. నాకు బరమసం
తోషమయ్యె. రమ్ము." అని యామెను సపరివారముగ బైన చెప్పిన
విధమున యుద్ధమునకు తోడుకొనిపోయెను. ఉభయసైన్యంబులు గ
జరథ తురగ సన్నాహముతో యుద్ధరంగము జేరినవి. రణభేరీ భాం
కారము లాకాశంబును బీటలువారునట్లు చేయుచుండెను. ఆశబ్దంబు
లకు వృక్షములపైనుండినపక్షులు భయంపడి ప్రాణములు విడిచి నేల
రాలెను. మనుష్యుల చెవులు చిల్లులుపడజొచ్చెను. అన్యోన్యవినాశన
మునకై సైనికు లుత్సాహభరితులై యెదురుచూడజొచ్చిరి. సేనాప
తులు వీరరసప్రధానము లైన పలుకులతో సైనికులం బురికొల్పిరి.
మద్యపానంబునం బరవశు లైనవిధంబున సైనికులువీరరసావిష్టులై మే
నులు మఱచి కోడిపుంజులువలె నెప్పుడు పగతురమీఁద బడుదు మని
యువ్విళులూరుచుండిరి. అప్పుడుసంగ్రామ మారంభమయ్యెను. చిత్త
జల్లువలె బాణవర్షంబు గురిసెను. ప్రాణంబులు విడుచువారు గాయం
బులు తగిలి నేలంగూలి యమ్మా నాయనా బాధకోర్వజాల దాహ
ము దాహము మంచినీళ్ళు మంచినీళ్ళని యఱచుచు దమ నెత్తురు
లో దామె పొరలాడువారు పీనుఁగులం దలగడలుగ జేసికొని కొం

చెముసేపు విశ్రమించువారు ప్రాణము పూర్తిగాబోవని యోధుల పైనుండి రోషావేశమున విస విస నడచువారు. గుఱిజూచి యమ్ముల నేయువారు. పగవారి యేటుల నోకుపునం దప్పించుకొనువారు. పలాయితులగువారు. పిరికితనంబున నేనుంగులయు గుల్మంబులయు చాటున దాగువారు నై యుభయబలంబుల సైనికులు బలువిధంబుల వర్తింపజొచ్చిరి.

చాళుక్యరాజు సైన్యము మొట్టమొదట జయమునొందునట్లు కనబడెను. కాని, దైవయోగమున నది తలక్రిందయ్యెను. శత్రుసైన్యముల ధాటి కోడి చాళుక్యబలములు వెన్నిచ్చి పారజొచ్చెను. యుద్ధభూమిపీనుగులపెంటయయ్యె. రణరంగమునశత్రువులకు వెన్నిచ్చి పఱచి ప్రాణముల రక్షించుటకంటె బ్రాణములున్నంతవరకు బోరాడి శౌర్యము నెఱపి శరీరము విడుచుట కర్తవ్యమని తలంచి చాళుక్యరాజు తన యేనుంగును గదలనీయక శత్రురాజులకభిముఖుఁడై పోర జొచ్చెను. అఖండరాజభక్తిగల సేనాపతులు కొందఱు చాళుక్యరాజును సమీపించి యుద్ధరంగమునుండి తొలగి ప్రాణరక్షణము చేసికోవలసిన దని హితోపదేశము చేసిరి. అతఁడు వారిమాటలను పెడచెవిని బెట్టెను. పారిపోవుచున్న సైనికులఁ బురికొల్పి కొందఱు సేనాధిపతులుమరలదోడ్కొనివచ్చిరి. అప్పుడుకడసారిసంకులసమరమయ్యెను చాళుక్యరాజుపై శత్రురాజు లయిదుగురు నిరంతరాయము లగువర్షధారల వలె బాణపరంపర లేయజొచ్చిరి. చాళుక్యుడు వాటినన్నిటిని నఱకివేయుచు జగదద్భుతముగా జాలవఱకుబోరాడెను. ఎట్టకేలకు పరిశ్రాంతుడైయున్న సమయమున శత్రురాజుల బాణమొకటి కంఠంబునం దగిలె. బొటబొట నెత్తురుకంఠమునుండి బ్రవహించె. కనుదమ్ములు మూతపడియె. చేతినుండి విల్లు జాఱి నేలబడియె. అంబారీలోనే రాజుమృతినొందెను. పలువురే

నుగు తన యజమానుని పీనుగుం దోడ్కొని యుద్ధరంగమునుండి పారిపోయె. సైనికులు పటాపంచలైరి. సేనాధిపతులు వెన్నిచ్చి పరుగెత్తిరి. శత్రువులు సింహనాదము చేసిరి. పలాయనము సేయు చాళుక్యబలములను పగవారు లేళ్ళను వేటాడినట్లు తరిమి చంపిరి. యుద్ధభూమి మృత్యుదేవతయొక్క భోజనశాల యయ్యెను. చాళుక్యరాజాంతఃపురస్త్రీల యాక్రందనధ్వనులు మిన్నుముట్టెను. సైనికులు తమ సంరక్షణముకేగాని దేవీసంరక్షణము మరచిరి. అప్పుడు ప్రధానమంత్రి రాజపత్ని యున్నకడ కరిగి మేటియోధులవంటి భటులను ముప్పదిమందిని జేర బిలిచి యిట్లనియె. "యోధులారా! మనపాలిటి కల్పవృక్షమని చెప్పదగిన మహారాజు మనభాగ్యలోపమున బ్రజల యదృష్టలోపమున దైవానుగ్రహలోపమున రణరంగమునందు మృతినొందె. మన మిప్పుడు తలిదండ్రులు లేని బిడ్డల మైతిమి. మనకును సమస్తప్రజలకును నిశ్చయముగ నీమహారాజె తల్లియై తండ్రియై సోదరుడై యెల్లచుట్టమునై యెల్లవిధముల గాపాడెగదా! తల్లిదండ్రులు మనలం గనుట మాత్రమేగాని తక్కినపని చేయజాలరైరి. సంరక్షణమంతయు నీమహారాజే గావించెను. ఆయన శౌర్యనిధానమై జగదేకవీరుడై తనయశశ్చంద్రికలు దిగంతముల వ్యాపించునట్లు తన నామధేయ మాచంద్రసంస్థాయి యైయుండునట్లు ముక్కున నూపిరియుండునంత కాలము పోరాడి చచ్చియుం బ్రతికినవాడై వీరస్వర్గముం జూరగొనియె. భారతయుద్ధమందు మృతినొందిన యభిమన్యాదిమహాశూరుల కేగతులు గలుగు నీతనికిగూడ నట్టిగతులు గలుగు. ఆమహాత్ముం డంత తేజోరాశియై గ్రీష్మకాల సూర్యమండలమువలె వెలిగి వెలిగి శాత్రవుల పరిపరివిధంబుల తపింపజేసి యెట్టకేలకు గాలవశంబున నస్తమించె. జంతువులకెల్ల మరణ మెన్నటికైన దప్పదుగదా! ఆమహారాజుకీర్తి ధ్వజమును నేలపై నిలిపిపరలోకంబునకుం జనియె.

మెను సంరక్షించితిమా మహాతేజశ్శాలి యగుకుమారు డామె గర్భమున జనింపగలడు. చాళుక్య వంశము నిలుచును. రాజ్యము మరల స్వాధీన మగును. ఆంధ్రదేశము మరల రాజన్వతియగును. పృథివి కలంకారము కలుగును. ఇప్పుడు మన మందరము దేవికడకుఁ బోయి యామె నోదార్చి యామె నెక్కుడైన సురక్షిత స్థానములకుం గొంపోవుదము. ఈసత్కారముచేత మనము చేసిన రాజద్రోహమహాపాపము కొంతవఱకు కడంగును." అని సుమిత్రి పల్కగ నాయోధు లందఱు బాష్పపూరితనేత్రులై "సరే యటు చేయుఁడు" మని యైకకంఠ్యముగ బలికిరి.

చాళుక్యభూపాలుఁడు శత్రురాజుల క్రోధాగ్ని కాహుతియై యేనుఁగమీఁద నుండి నేలఁబడి మరణించెను. విజయాదిత్యుఁ డనే యామహారాజు పట్టపుటేనుఁగు మహాపతి యను గజము తన యజమాని దుస్థితి నెఱింగి దేవి కడకుం దీసికొనిపోవుటకై కదలించెను. కాని యాసేనకుఁ జిరకాల శత్రువగు కటకరాజు నాయకత్వంబున సైనికులు వెంటనే రెం డమ్ములేసి మావటివానిని వధియించి గజంబును బోవనీక నిరోధించెను. ఆ మదగజంబు తనఱేని దుస్థితి నెఱింగియో లేక తనదారి నడ్డగించుట చేతనో మహాకోపావిష్టమై భయంకరంబుగ ఘీంకారంబులు సేయుచు తొండమెత్తి యుద్ధమువచ్చిన జనంబులనెల్ల గుభాలు గుభాలున నేలఁ బడునట్లు మోదుచుఁ గొందఱం గాళ్ళక్రిందవైచి చదురుతుండాగ్రంబునఁ గొందఱనెత్తి నేలవైచికొట్టి సర్వజనభయంకరమై విహరించెను. కటకరాజు దానియెట్టయెదుట నిలువనోపక వెనుకప్రక్కకుంజని యేనుంగుల నిరోధించుటలో మెలకువగల నేటకాండ్రఁ గొందరఁ బిలచి దాని వెనుకకాళ్ళకు సంకెళ్ళువేయుఁడని యాజ్ఞాపించెను. ప్రళయకాలరుద్రమూర్తి కాఁబోలు ననిపించు యామదపుటేనుఁగు దరికైన వారరుగంగనేరక నలుదెసల నిలిచి యెల్లదెసలనుండి దాని

పై బాణవర్షంబు గురిపించి యామహాసత్వంబును నేలంగూల్చిరి. క్షణకాలంబున నదియు వీరస్వర్గంబున కనుగుచున్న యజమానుని మార్గమధ్యంబున మోచుటకు వాహనంబులు లేవోయను భయంబున వెంటనరిగినదోయన్నట్లు మేనువిడిచె. అప్పుడు కటకేశ్వరుండు గజంబుపైనున్న బంగరుహౌదా విప్పించి యందున్న చాళుక్యరాజు కళేబరంబును నేలబడవేయించి నవరత్నంబులు చెక్కిన యాయంబారిని దన శిబిరంబునకుఁ బంపించెను. రక్తసిక్తమయిన శరీరముతో మహాసమరోత్సాహమును సూచించు మొగముతో, పిడికిటం బిగిసికొనిపోయిన విల్లుతో నస్తమించుచున్న చంద్రమండలమువలెనున్న కళలతో నేలంబడియున్న యాచాళుక్యకులసింహముం జూచి కటకరాజుదక్క తక్కిన శత్రురాజులు కన్నులనీరువెట్టుకొని లోలోపల విషాదమొందిరి. ఆవైరిరాజులలో నప్పుడొకఁడు కటకేశ్వరునితో నిట్లనియె. "రాజేంద్రా! చూడుము. ఈతండు నిద్రవోవుచున్నట్లున్నాఁడుగాని మృతినొందియున్నట్లు కనఁబడుచుండుటలేదు. మొగము కళాహీనముకాలేదు. నీబాణంబు నొవ్వఁదగిలి నప్పుడు హుమ్మని యాతఁడుంకించి యామగలచెను గాఁబోలు. ఇప్పటికిని క్రిందిపెదవికి దంతము లంటుకొని యున్నవి చూడు. కుడిచేతిపిడికిట నారియు నెడమచేతి పిడికిట విల్లును బిగిసికొనిపోయి యున్నవి చూడుము! క్షత్రియజన్మ మెత్తినందుకు మహాశూరుల కుచితమగుమరణము నొందెను. ఎత్తినవిల్లు చేతనెత్తినట్లుండఁగానె విడచెడు బాణంబులు విడుచునట్లుండఁగానె తగిలెడు బాణంబులు తగులుచుండగానె స్రవించెడు రక్తము స్రవించుచుండఁగానె మరణంబు నొందుటకంటె క్షత్రియకులప్రభూతుడగుమనుష్యున కపేక్షణీయ మిఁకనేమున్నది! "యశోవా మృత్యుర్వా" యశముగాని మృత్యువుగాని లభింపవలెనని పెద్దలు చెప్పెదరు. ఈతనికి రెండుం జేకూరినవి. ఈతని జన్మకారణమున

నీతనితల్లి వీరమాత యైనది. ఈతనిశౌర్యకారణమున భార్య వీర
పత్ని యైనది. వంశము వీరవంశ మైనది. ఈతఁడు చచ్చినను బ్రదికి
యున్నాఁడు. ఈతనితోఁ బోరుట మనకు గౌరవము సుమా!" యని
మఱియు నింకేదియో చెప్పఁబోవుచుండ కటకేశ్వరుఁడు వానిమాట
కడ్డువచ్చి యేమిది బట్టువానివలెఁ బొగడుచున్నావు. పగవానిం బొగ
డుటకు నీకు సిగ్గైనను లేదా! నాలుక యెట్లువచ్చుచున్నది. అందఱ
కంటె నలఁడేమిపౌరుషముఁజూపె. ఈతనికంటె నెక్కుడుపరాక్రమము
చూపి వేనవేలు విక్రమశాలురు రణరంగమునఁ బడియున్నారు. అట్లు
చచ్చినవారిలో వీఁడొకఁడు. అందఱయోధుల తల్లులు వీరమాతలె.
అందఱభార్యలు వీరపత్నులె. అందఱకన్న వీఁడెక్కువపొడిచి వేసిన
దేమి లేదు. ఇతనితోఁ బోరాడుట నీకు గౌరవమేమోకాని నాకు
గౌరవముకాదు. నాకును వీనికిని హస్తిమశకాంతరముకలదు, నాదర్ప
మునకు నాఠీవికి నాయౌన్నత్యమునకు వీనితోఁ బోరుట మిక్కిలి
యగౌరవము. నాతోఁబోరుట వానికిగౌరవము. ఈనీచుఁడు నేఁటికాల
మునకు నాకన్నులు చల్లగా సపరివారముగా నేలంగూలినాఁడు. ఇప్పు
డు గదా నాకు కంటినిండ నిదుర. ఇప్పుడుగదా నాకు మనసునిండ
తృప్తి. ఇప్పుడుగదా నాకు హృదయమునిండ సంతోషము. ఇప్పుడు
గదా నామార్గము నిష్కంటకమైనది. ఇప్పుడుగదా నేను సుఖముగ
భుజియింపఁగల్గుట. నేఁడుగదా నామనోరథము నెరవేరినది. ఇంక నే
ధన్యుఁడనైతినని మృతినొందిన యారాజుం బహువిధముల దూషిం
చెను. అప్పుడు మిత్రమండలిలోనున్న మఱియొకరాజు కటకేశ్వరుం
జూచి "దేవా! యాతని కగ్నిసంస్కారము సేయించు టుచితము.
సత్వరము సేవకుల కాజ్ఞాపింపు"డని పలికెను. అదివిని కటకేశ్వరుఁడు
కోపంబునఁ బండ్లు కొరుకుచు నాతని కిట్లనెను. ఏమీ! యీతని

నకా యగ్నిసంస్కారము? అగ్నిసంస్కారముచేయించెద. కానివీనికిఁ గాదు. వీనిరాజధానికగ్నిసంస్కారము చేయించెద. వీఁడుపాలించిన గ్రామమున కగ్నిసంస్కారముచేయించెద. వీనిబంధుకోటికి బ్రదికి యుండగనే యగ్నిసంస్కారము చేయించెద. ఈదురాత్మునకా యగ్ని సంస్కారము? చూడునాప్రతిజ్ఞ. ఈతండుపరిపాలించిన యాంధ్రదేశ మంతయు బస్మపటలము గావించెద. ఈతనిశవము నకు గ్రద్దలు రాబందులు కాకులు పొడుచుకొని తినవలయునేగాని శాస్త్రయుక్తమైన యగ్నిసంస్కారము దానికిం జరుగఁగూడదు. ఈఁతడుపాలించిన గ్రామంబులన్నియుఁగొల్లగొని పరశురామప్రీతిచేయవలయు. ఈఁతఁడు కాపురమున్న మేడలు మిద్దెలు నేలఁగూల్చి యానేలయెల్ల దున్నించి జిల్లేడు నేపాళము నాటింపవలెను. ఇంతియెకాదు. ఈతనిభార్య నిండు చూలాలై యున్నదని వినియున్నాఁడను. ఆమె యెక్కడనున్నదో వెదకి పట్టుకొని చెఱసాలం బెట్టి ప్రసవించినతరువాత కూఁతుపుట్టెనేని దానింబెంచి యొకనీచునకిచ్చి పెండ్లిచేసెద. కొడుకుపుట్టెనేని తక్షణమే నిర్భాగ్యుఁడగు నాయర్భకుని నేనుస్వయముగా నాఖడ్గంబున కెరజేసెద. రెండవకంసుఁడనుపేరు సంపాదించెద. అప్పుడుకాని నామనస్తాపముతీరదు. నాక్రోధాగ్ని యారాజురక్తధారలచే మూఁడువంతులు చల్లారినది. ఆశిశువుయొక్క నెత్తురుబొట్లచే సంపూర్ణముగఁ జల్లారును. చాళుక్యవంశము భూమండలంబున నుండఁగూడదు. చాళుక్యవంశమేకాదు. చాళుక్యవంశసంబంధమైన పురుషుఁడైన లోకంబుననుండ రాదు. అశ్వత్థామ జగము నిష్పాండవము చేయఁదలచి కృతార్థుఁడుగా లేకపోయెను. నేనులోకము నిశ్చాళుక్యముచేసి కృతకృత్యుఁడ నయ్యెద.

అని కటకేశ్వరుఁడు రాజుపోయినశవము లనువచనములు బలుక నాకసంతసమున్న చాళుక్యరాజశత్రువులు మహాశ్చర్యరసనిమగ్నులై

తెల్లఁబోయి చూచుచుండిరి. అందొకఁడు కటకేశ్వరునితో ధైర్యముతో నిట్లనియె. "మహారాజా! వైరములు మరణాంతములై యుండవలెను. రావణుఁడు రఘురామునిచేతి రణరంగమున నిహతుఁడైన వెనుక విభీషణుఁడు తన యన్న దురాత్ముఁ డగుటచేత వానికిఁ దా నగ్నిసంస్కారములు చేయఁగూడ దని వాదించెను. అప్పు డా రాముఁడు విభీషణుని మందలించి 'మరణాంతాని వైరాణి' యని ధర్మోపదేశము చేసి విభీషణునిచే దశకంఠునకు నుత్తరక్రియలు చేయించెను. రాముని యుపదేశము విభీషణున కొక్కనికే కాదు. ఆ యుపదేశము శత్రుమరణానంతరమున వైరమును వహించు మానవకోటి కెల్ల నుద్దేశింపఁ బడినది. చాళుక్యరాజు మనచే నిహతుఁడయ్యె. ఆతఁడు మన కింక క్రోధస్థానము కాడు. ఆతని శవము గ్రద్దలు పీకినను, కాకులు పొడిచినను, నక్కలు ముక్కలుగఁ జేసి మెక్కినను, క్రిమికీటకంబులు పొడిచి తినినను, దానియందలి బాధగాని యవమానముగాని యాతఁ డనుభవింపఁ జాలఁడు. శవము నవమానించుట రాతి నవమానించుట. కొయ్య నవమానించుట. ఆ యవమానము కర్తదికాని భోక్తది కాదు. ఇట్లు చేయుటచే మనలను మనమే యవమానించుకొనుచున్నాము. మనచేతి నెంతయధికార మున్నను మన బాహువులయం దెంతబల మున్నను మన మనంబున నెంత గర్వ మున్నను మనమాట కెంత చెల్లుబడి యున్నను మనము లోకసమ్మతము లగు కార్యములను జేసినంతవఱకే జనానురాగము మనపై నిలుచును గాని లోకవిరుద్ధములై యసహ్యములై యనార్యములైన దుండగములను మనము చేయుదుమేని జనులకు మనపై సేవ పుట్టక పోదు. మన కనకసింహాసనంబులు మన రత్నకిరీటంబులు వారి యంతరంగంబులందలి యభిప్రాయంబుల మార్పఁజాలవు. మన అస్త్రశస్త్రంబులను మన చతురంగబలంబులను జూచి భయపడు లోకులు

భళాభళీ యని మన పనులను పైకి మెచ్చినను లోలోపల నీచకా ర్యకర్తలను వారు నిందింపకపోరు. కావున, మహాపరితాపము జూపి క్షత్రియోచిత మైనమరణము నొంది రణరంగశాయియైనయాచాళు క్యవంశాలంకారునకు నిజపౌరుషానురూప మైన గౌరవంబు సేయకపో యిన మానె, అధమాధముల కైన నవలీలగా నలవడు నగ్నిసంస్కా రమైనఁజేయించుట యుత్తమము. అదియునుఁగాక యీమహారాజు భార్యను వెదకి పట్టితెచ్చి గర్భవతి యైనయీకాంత పురుషశిశువును బ్రసవించెడుపక్షమున నాతని మీచేతులతో మీరు స్వయముగా మృతినొందింపఁ బ్రతిజ్ఞ చేసితిరి. ఇది యేటినీతి? యెట్టిధర్మము? ఏమి రాచపాడి? అసూర్యంపశ్య యగుశుద్ధాంతకాంత యాతని యిల్లాలు. ఆదేవి మహాపతివ్రత యనియు లోకోత్తరగుణరత్నభూషిత యని యు సంగనలకు మేలుబంతి యనియు నేను వినియున్నాఁడను. ఆపర మసాధ్వి మన కేమియపకారము చేసినది? ఆమెకు మనము కలిగించి న భర్తృవియోగమే చాలును. పుత్రశోకము కూడ గల్గింపవలయు నా? అప్పుడు పుట్టిన పసివాఁడు మన కేమియపకారము చేయఁగలఁడు? లావు మగంటిమి గల శూరులు తమవలె నాయుధపాణు లైనశూ రులతో ధర్మయుద్ధము చేసి గెలిచి సామ్రాజ్యసంపాదనము చేయ నోపుదురు కాని, మాతృగర్భము నప్పుడే వెడలి గ్రుక్కెడుపా లైనసరి గఁ ద్రాగక కనులైనసరిగఁ దెరువక మంత్రసాని చేతులలో నేయుండి కావు కావు మని యఱచుచున్న నిర్భాగ్యుఁ డగునర్భకుని దుర్భరక్రో ధంబున నేలపాలు సేయుట యేమిపౌరుషము? రాచపుట్టువు పుట్టి మన మిదివరకు చేసిన ఘోరకృత్యములే చాలును. వేయిజన్మముల కై న నట్టి పాతకముల ఫలంబు మన మనుభవించుచుందుము. శిశుహ త్యలు స్త్రీహత్యలు కూడ చేయవలయునా? భాగవత మేలచదివితివి? రామాయణ మేలవింటివి? వేదవ్యాసుఁడు భారత మేలరచియించె?

వాల్మీకి రామాయణ మేల శ్రమపడి భూర్జపత్రములపై లిఖించె? నీకును నాకును మనవంటి పాపాత్ములకును ధర్మోపదేశములు చేయుట కేసుమా! శ్రీకృష్ణుని కీర్తివంటి కీర్తి సంపాదించుట దుర్లభముగాని కంసుని దుర్యశమువంటి దుర్యశము సంపాదించుట సులభము. రాము ననుసరించుట కష్టముకాని రావణు ననుసరించుట చేతిలోనిపని. సత్కీర్తి బహుప్రయత్నసాధ్యము. చెడ్డపేరు క్షణమాత్రసాధ్యము. అందుచేత నో కటకరాజా! నీవు తలపెట్టిన కార్యంబులు నీవిజయలక్ష్మీముఖంబునకు గళంకములై, నీ కీర్తికి మచ్చలై, నరకలోకమునకుం గొంపోవు సోపానములై యుండును. కావున వానినుండి తొలంగుము. అని తనతోడిరాజు పరమార్థగర్భితమైనయుపదేశము చేయు నాకటకేశ్వరుండు మహాకోపోద్దీపితుండై పండ్లు గొఱుకుచుఁ గన్బొమలు ముడివడ హుంకరించి "చాలు మీయుపదేశంబులు చాలు. సామంతరాజులకు మితిమీరిన చనువు లిచ్చినఫలంబు నాకిప్పుడు కానఁబడుచున్నది. ఈయుపదేశంబులు సేయుమని మిమ్మెవ్వరడిగిరి? సింగపుంజూలు నూడఁబెరుకుటకై యత్నింపకుండు. పెద్దపులినోట చేతులుం బెట్టకుండు. మీయుపదేశంబులు విన్నపక్షమున మగటిమిం బోఁగొట్టుకొని తేజోవిహీనులమై వ్యాస వాల్మీకులవలె ముక్కు మూసికొని యుండవలెను. మాకంత వైరాగ్యముదయింపలేదు. భోగులముగాని జోగులము కాము. ఉప్పు పులుసు కారము తినుచున్నంతవఱకుఁ బ్రతిమనుష్యుఁడు కామ క్రోధ లోభ మోహ మదమత్సరంబులకుఁ బాల్పడక మానఁడు. ఋణశేషము వ్రణశేషము శత్రుశేషము నుండనియ్యఁగూడ దని యార్యులు వక్కాణింతురు. అది రాజనీతి. పూర్వులు పోయిన పుంత. శుక్రుఁడు చెప్పినధర్మసూక్ష్మము. చేతఖడ్గము దాల్చుచున్నాముగాని దండము ధరించుట లేదు. భూపతులముగాని యతులము కాము.

ప్రమదావనముల నాసించుచున్నాము కాని వనముల నాసించుట లేదు. మనస్సు లహంకారపూరితము లైనవికాని ఝాంకారపూరితములు కాలేదు. సింహాసనముల మీఁదనే గాని బుద్ధి దర్భాసనముల మీఁద లేదు. మీరపకీర్తిగా నెంచునది మాకు గీర్తి. మీరు క్రౌర్యముగా నెంచునది మాకు శౌర్యము. మీయుపదేశంబులు మాచెవుల కెక్కవు. మాధారిని మమ్ముఁబో నిండు. మీకిష్ట మగునేని నాతో నుండుఁడు. లేదేని మీబలంబులం దీసికొని మీయిచ్చవచ్చినట్లు బొండు. చాళుక్యున కగ్నిసంస్కారంబు నేను జేయింపనొల్ల. ఆతని యిల్లాలిని విడువనొల్ల నాతని పుత్త్రుని రక్షింప నొల్ల. మీచేతనైనయెడల మీరామెతోఁ జేరి యామెను గాపాడుఁడు." అనిమిక్కిలి కఠినముగాఁ బలికెను. ఆమాటకు మనసు నొచ్చి యాతనితో మరల మాటలాడనొల్లక యుద్ధభూమి విడిచి యారాజు తన శిబిరమునకుం జనియెను. అప్పుడు కటకేశ్వరుఁడు తన వేగులవాండ్ర నిద్దఱను బిలచి చాళుక్యరాజు పట్టపుదేవి యెక్కడ నున్నదో కనుఁగొని రండు సత్వరము రాకపోయితి రేని నారింజపండులట్లు మీశరీరము లొలిపించెద. మీ శిరంబులు కోట కొమ్మలకుం గట్టించెద నని భీకరస్వరముతో నాజ్ఞాపించెను. అనవుడు వారు చేతులు జోడించి "దేవా! ఆమెవార్తం దెలిసికొని జాములో వచ్చెదము. మగని ప్రతాపము కన్నులారఁ గన నాయమ్మ యుద్ధభూమికె వచ్చియున్న దని వినియున్నా" మని మనవిచేసికొనిరి. "ఓహో! మగని ప్రతాపముజూడవచ్చినదా! సరిగాఁజూచినది కద? ఎటనున్నదో కనుఁగొని వేగరండు" అని వారిం బంపి యారాజు తన గుడారమునకుం జనియెను.

అంతకుమున్నె చాళుక్యభూపాలుని ప్రధాన మంత్రియు హతశేషు లగుకొందఱు సైనికులుమంత్రిపలుకులుచేఁ బ్రేరితులై తమ రాణిని దర్శింపఁబోయిరి. మంత్రి వచ్చియున్నాఁడని పరిచారికలు

రాణితో మనవి జేసిరి. రాణి బాష్పాకులితనేత్రయై గద్గదస్వరముతో నాతనిం జూచి "అయ్యా! మహారాజుగారితోఁ గలిసి రాక నీవొక్కఁడ వేలవచ్చితివి? ఏదీ మాపాలిటి పారిజాతవృక్షము? కూలిపోయినదా? ఏదీ నాచింతామణిరత్నము? శత్రురాజు లపహరించిరా? ఏఁడి చాళుక్యవంశాలంకారుఁడు? ఏఁడి లోకైకమహావీరుఁడు? ఏడీ నాకన్నులచందమామ? అయ్యో! యూరకుందువేమి? మా మహారాజు స్మృతినొందెనా? మాయేలిక వీరస్వర్గ మలంకరించెనా? హా ప్రాణేశ్వరా! రణరంగంబున మావిక్రమంబు వీక్షింప వచ్చిన నన్ను ఘోరశత్రుమధ్యంబున నేకాకిం జేసి విడిచిపోవఁదగునా? నాతోఁ జెప్పక నన్ను వెంటఁదీసికొనిపోక మీరేకతంబ చనినమాత్రమున నేను రాఁజాలననుకొంటిరా? ఒక్కజాములో మీవెంటవచ్చెద. అగ్నిజ్వాల లనెడు మహావేగవంతంబు లగు ఘోటకంబులం బూన్చిన చితి యను రథంబెక్కి నగముదారిలో మిమ్ము నేను గలుసుకొందు నను ధైర్యము నాకుఁగలదు. మంత్రీ, చిరకాలము నీవు మహారాజును సేవించితివి. ఎల్లకార్యములయందాయనకు తోడునీడవై కుడిభుజంబవై నాలుకవై నేత్రమవై యుంటివి. సకలోపచారంబులు చేసితివి. అగ్నిసాక్షికముగా మాయిరువురకును వివాహసంస్కారంబు చేయించితివి. ఇప్పుడు రాజకళేబరమునకగ్ని సంస్కారంబు జేయింపుము. నేను రాజకాంతల కుచిత మగుమార్గ మవలంబించెద. యుద్ధసమయమున సముచితము తన్ను నేనెడబాసి యుండఁగూడదని కదా మా రాజు నన్నిటకుం దోడ్కొనివచ్చె. నావియోగ మొకక్షణమైన సహింపఁజాలని యామహారాజునకు నాకు నెడబాపు సేయుట మీకు ధర్మము కాదు. మామహారాజు నిజకులోచితమైనమరణంబు నొందె. మారాణికూడ మహాపతివ్రతోచితమైనధర్మమనుసరించున ట్లనుగ్రహింపుము. నేను తండ్రిలేనిదానను. నీవు నాకుఁ దండ్రివి. బిడ్డకు మేలెట్లో యట్లు చేయుము." అని సవైధవ్యదుః

ఖముచే పరిపరివిధంబులం బలవించి చేతులుజోడించి నమస్కరించెను ఆమె విలాపమును దీనాలాపమును వినియెల్లవారలు మాటలాడఁజాల క నొక్కమొగిని కనులనుండి బాష్పధారలు విడుచుచుండిరి. అమాత్యుఁడుఁగూడ కొంతసేపుసల్లేయుండి ధైర్యఖడ్గముచే దట్టముగఁ గ్రిమ్మిన దుఃఖారణ్యమును ఛేదించి రాణికిట్లనియె. "అమ్మా! వీరపత్నివైనందుకు వీరపుత్రివైనందుకు మహాపతివ్రతల కుచితములైనపలుకులు పలుకుచుంటివి. కాని సమయోచితముగఁ బలుకుటలేదు. దుఃఖముచేతఁబరవశత్వమునొంది మాటలాడుచుంటివి. నవవైధవ్యదుఃఖ మెంతకుఁ జాలదు. నీవు నిండుచూలాల వన్నమాట మరచిపోయితివి. అంతర్వత్నులు సహగమనము చేయఁగూడదని ధర్మశాస్త్రములు నొక్కి చెప్పుచున్నవి. చాళుక్యతేజము నీగర్భమం దున్నది. వంశప్రదీపకుఁడైన నందనుఁడుదయింపగలఁడు. దుఃఖార్ణవమగ్నమగు రాజవంశము నతఁడుద్ధరింపఁగలఁడు. శత్రుకంటకములతో నిండిన నీవసుంధర నతఁడు నిష్కంటకము చేయఁగలఁడు. పితృమరణంబునకు బ్రతిక్రియ సేయఁగలండు. అట్టి పుత్రుని గర్భమునం దిడుకొని నీవు సహగమనము చేయనగునా? శోకభరంబుచేత గ్రుంగి యిట్లనుచున్నదానవు. కావున నోతల్లీ! నీయుద్యమ ముపసంహరింపుము. బిడ్డలమైన మామాట మన్నింపుము. నీవు నాకన్న జిన్నదానవైనను రాజపత్నివగుటచేత మాతృసమానవు గావున చేతులు మోడ్చి నీకు నమస్కరించుచున్నవాఁడను. ఇది సాహసంబునకు సమయముకాదు. శత్రురాజు కడుక్రూరుఁడు. మనది పరాజయము నొందినపక్షము. మనమిక్కడ నిలువఁగూడదు. కటకేశ్వరుఁడు భయంకర ప్రతిజ్ఞలఁజేయుచున్నాఁడని యిప్పుడే వేగులవాండ్రు నాతోఁ జెప్పిరి. మనమిప్పుడు రాజధాని కరుగుటకు వీలులేదు. ప్రచ్ఛన్నులమయి యేపల్లెయందో కొంతకాలము గడుపవలయు. మాయుపదేశములకు వ్యతిరేకముగా

వర్తింపవలదని మరల నమస్కరించుచున్నాఁడను." అనవుడు రాణి యిట్లనియె. "అయ్యా! నీవెంత వెఱ్ఱివాఁడవు. ఆకాశముమీఁద నున్న మేఘమును జూచి ప్రచండగ్రీష్మతాప మడఁగిపోవు నని యాసపడుచున్నాఁడవు. అయినను గర్భవతులు భర్తృమార్గ మనుసరింపరా దని నీవు శాసించుటచే నీయాజ్ఞ శిరసావహించి నీవు చెప్పినచొప్పున వర్తించుదానను. నేనిప్పు డెచ్చట తల దాచికొందును? దిక్కులేనిదాని నెవరాదరింతురు? గృహస్థులు నన్ను తమయింటఁ జేర్చుకొనుట చెరగున నగ్నిహోత్రము మూటగట్టుకొనుటగాదా! ఆహా! యెంతలో నాయవస్థ మారినది. అఖండసామ్రాజ్య మేలిన మహారాజుభార్యకు నిలువ నీడ లేదు. రాజులయవస్థ లెప్పుడు నిట్టివేకదా! మహోన్నతదశయో మహానీచదశయోగాని వారికిమధ్యదశ యుండదు." అనుచుండ నొకసేవకుఁడు పరుగుపరుగున వచ్చి యమాత్యునితో నిట్లనియె. "స్వామీ! కటకరాజు రాణిగారిని బట్టి తెచ్చునిమిత్తము నాలుగుప్రక్కలకు నాలుగు సేనల బంపవలయునని సేనాపతి కాజ్ఞాపించినాఁడు. అది నాచెవులార నేవింటిని. ఒకజాములోపల నాల్గుప్రక్కలకు సైన్యములు బయలుదేరును. ఆమె రణరంగమునకు వచ్చియున్నదని వినియున్నాఁడు. మీఁద కర్తవ్యము నిశ్చయించుకొనుఁడు." అప్పలుకులు విని మంత్రి "అమ్మా! నీవును వినుచున్నావుగదా! క్షణమైన నిక్కడ నిలువఁదగదు. పోవు టెక్కడికని విచారింపవద్దు. దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు. నీవు నాబిడ్డవు. నేను నిన్ను రక్షించెద. మాఱుమాటాడక నాతో రమ్ము. సైనికులారా! గుఱ్ఱములున్నవారు గుఱ్ఱము లెక్కుఁడు లేనివారు కాలినడకను రండు. దేవీసంరక్షణమే ప్రథమకర్తవ్యము. మావటీఁడా!, రాణిగారియేనుఁగును నడుపుము." అని తానొక గుఱ్ఱముపై నెక్కి యేబదిమంది యాశ్వికులతోడను, మఱి యేబదిమంది పదాతులతోడను, దేవిని ముందిడుకొని దైవము

పై భారము వైచి గమ్యస్థానమేదో యెఱుఁగక కర్తవ్యమేదో తెలిసికొనఁజాలక కేవల రాజభక్తిప్రేరితుఁడై పోవసాగెను.

కటకరాజు తనకు నమ్మికగలబంటు, క్రూరకార్యనిరతియందుఁ దన్ను జయించినవాఁడు నగు వీరవర్మయను సేనాపతిం బిలిచి యిట్లనియె. "వీరవర్మా! యెఱుఁగుదువుగదా నాప్రతిజ్ఞ? చాళుక్యరాజ్యవృక్షము కూకటివేళ్లతో నిర్మూలింప బ్రతిన జేసితిని. ఇట్లు చచ్చినది. కాని వేళ్లు త్రవ్వివేయవలయును. అంతవఱకు నేను హాయిగా నిదురింపఁజాల. భుజింపఁజాల. అతనిభార్య గర్భవతియై యున్నదట. ఆమె మగనిమగంటిమి కనులపండువుగాఁ జూచుటకై రణాంగమునకు వచ్చియున్నదట. వచ్చియుండినను భర్తృమరణము వినినతోడనే యచ్చోటు వాసి రాజధానివైపునకో మఱియొకవైపునకో పోయి యుండును. రాజధానివైపునకు నే నరిగెదను. గోదావరీనదీపరిసరములయందు నీ వామెను వెదకి పట్టుకొనుము. పట్టుకొని నాకడకుం దీసికొనిరమ్ము. ఆమె నీచేతంజిక్కియు నీవెంటరాననిపట్టు పట్టి మొండితనము చేసినపక్షమున బాణంబు ప్రయోగించి ప్రాణంబుదీయుము. కత్తికందినపక్షమునఁ బొడిచి చంపుము. నీయిచ్చవచ్చిన తెఱంగు జేయుటకు నీకధికార మిచ్చుచున్నాఁడను. ఆమె దొరకెడుచోటు నేనున్న తావునకు సమీపముగా నుండినపక్షమున నాకు వెంటనే వర్తమాన మంపుము. వానిచేత వర్తమాన మంపినను నేను రెక్కలుకట్టుకొని వ్రాలుదును. ఆమె యేగ్రామమునం దుండునో యాగ్రామవాసులామెను బట్టి యప్పగింపక బింకము జూపినను దండనంబులకు దొరకొనినను వెంటనే యాగ్రామమును పరశురామక్రియ గావింపుము. గ్రామమునందలి ప్రధానపురుషులను జెఱపట్టుము. కావలయునేని మొగాండ్రను శిరచ్ఛేదము చేయింపుము. మనశాసనం బన్న జనులు భయభక్తులు గలిగి

మన్నించి శిరసావహించునట్లు చేయుము. నేను స్త్రీవధ చేయుమంటి నని నీవు సందేహింపవలదు. తల్లి యని సందేహింపక రేణుకాదేవిని తండ్రియానతిచొప్పునఁ జంపిన పరశురాముని చరిత్రము జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. తాటకాప్రాణాపహరణము గావించిన దశరథరాముని మనసులో నుంచుకొనుము. పూతనాఘాతకుఁడగు వాసుదేవుని ననుసరింపుము. ఇదియునుం గాక నీకొక్క మహాతత్త్వం బెఱింగించెద. వినుము. ఆడువాండ్రు మగవాండ్రను భేదము పామరులకేగాని ప్రాజ్ఞులకు నుండఁగూడదు. మన కార్యసాధన మగునేని మగవాండ్రు నాడువాండ్రు మనము సమానముగా వధింపవచ్చును. అడవికి వేఁటకరిగినప్పుడు మనమెన్ని యాడుపులులం జంపుటలేదు. ఎన్ని యాడుజింకలం బొరిగొనుటలేదు. ముద్దుల మూటగట్టుచుండు నెన్ని యాడుపులుగుల మ్రందించుటలేదు, ఆహారార్థమెన్ని యాడుమేఁకల, నెన్ని నాడుగొఱియల దెగవ్రేయుటలేదు. పాములను తేళ్ళను జూచినప్పుడు జాలిపెంపున నాడుపాము లనియు, నాడుతేళ్ళనియు, శంకించి మనము చంపక విడుచుచున్నారమా? దుష్టజంతు వగునేని నది యాడుదైనను మగదైనను వధింపఁదగినదే. మానవులుకూడ జంతువులే. దుష్టపురుషు నెట్లుసంహరింతుమో దుష్టస్త్రీని నట్లే సంహరింతుము. చాళుక్యరాజపత్ని నీచేతఁ జిక్కి నాకడకు వచ్చులోనఁ బ్రసవించెను పక్షమున మాతాశిశువులను గడుజాగరూకతతో నాకడకుం దీసికొని రమ్ము. ఆపని యన్యుల కప్పగింపవలదు. నీవే స్వయముగాఁ జేయవలయును. చాళుక్యరాజపక్షపాతమున మధ్యేమార్గమున ననుచరులు, మిత్రులు సేవకులు దేవిగర్భజనితమగుశిశువును హరించి దాని స్థానమున నన్య శిశువును బెట్టుదురు. ఈవిషయమున నీవప్రమత్తుఁడవై వర్తింపవలయు మగశిశువైనపక్షమున నీవు మిక్కిలి మెలంకువగలిగి యుండవలయు. దేవియుఁ దత్పక్షమువారును మగశిశువును సర్వదా రక్షింపయత్నిం

తురు. మగశిశువును వధించుటయే నాకు పరమకర్తవ్యము. అప్పుడే చాళుక్యరాజవంశమును కూకటివ్రేళ్ళతోఁ ద్రవ్వినవాఁడ నగుదును. ఆడశిశువు జనించినపక్షమున దానిని వధింపనవసరము లేదు. తల్లియధీనమునుండి దానినిదీసికొని నాదాసదాసీజనంబులచేతఁ బెంపించి యుక్తవయస్కురాలయినపిమ్మట దాని నెవ్వరికో కులహీనున కిచ్చి వివాహము జేసెద. కులహీనున కేలయీవలయునని నీకు సంశయము దోచవచ్చును. క్షత్రియకన్యగదా యని రాచవానికిచ్చి పెండ్లిచేసిన పక్షమున వాఁడు చాళుక్యభూపాలుని యల్లుఁడనని విఱ్ఱవీగి తెగనీల్గి దుండగులం గొందఱఁ దనచుట్టుం జేర్చుకొని సింహాసనమునాక్రమించుకొనుటకు మరల ప్రయత్నము చేయును. మన మహాసైన్యంబులముందట వాఁడు గడ్డిపరకవంటివాఁడైనను దేశంబునఁగొంత సంక్షోభము కొంత యుల్లర జనులకు గొంత యలజడి గలుగకపోదు. కులహీనునకిచ్చినపక్షమున జనులకువానియం దనురాగ ముండదు. జనానురాగము లేనివాఁడు రాజగుట యరిది. నాకుంబరమాప్తుఁడ వగుటచేత నామనంబునం గల తలంపు లన్నియు మర్మంబులేక నీకెఱిఁగించితి. తూచాలప్పకుండ నీవు నాయాజ్ఞ నెరవేర్పవలయు. ఇందరు సేనాపతు లుండ నిన్నే యీకార్యమున నియోగించుటకు కారణమేమో నీవే యూహించుకొనుము. నీవు నా రెండవ హృదయమవు. నీవు నా మూఁడవ హస్తమవు. నాయాఱవప్రాణమవు! ఇంతకంటె నీతో వేరుగా నొక్క చెప్పవలసినది లేదు. సర్వము నీవే యెఱుఁగుదువు. నా కార్యము నీకార్యము. నాయభ్యుదయము నీయభ్యుదయము" అని యేలిక తనయందు విశ్వాసముంచి పలుకుటయు వీరవర్మ చేతులు జోడించి వినయంబున నిట్లని విన్నవించె. "దేవా! దేవరవారికి నా మొదల నధికవాత్సల్యము కలదనియు నందఱికంటె నేనధికవిశ్వాసపాత్రమననియు నెఱుంగుదు. ఆదికాలంబున మీనాయనగారి పాద

రక్షలు మోయుటకై నేను నియోగింపఁబడితిని. అట్టినన్ను మీ రెంతో యనుగ్రహంబున నాయందు నమ్మికయుంచి మొదట కాలిబంటుం జేసి, పిదప గుఱ్ఱపురౌతుం జేసి, పదపడి సేనాపతిని గావించి నాకుఁ బెండ్లిపేరంటములు చేసి రాజ్యంబున బేరుగలవారిలో నొకరనిగ జేసి నన్ను గౌరవపాత్రముగఁ జేసిరి. ఈమహోపకారము వేయిజన్మముల కైన మరతునా? నేను మీయాజ్ఞచేతి కీలుబొమ్మను. మీశాసనమే నాచేతసమస్తకృత్యములు చేయించును. మీయాజ్ఞ యైన పక్షమున నేను నీచ మనక, ఘన మనక, క్రూర మనక, ఘోర మనక, మంచి యనక, చెడ్డ యనక, పాప మనక, పుణ్యమనక సమస్తకార్యములఁగావించెద. మీపాదములయాన పంపుఁడిదె వెళ్ళివచ్చెద.

అని వీరవర్మ పలుకుటయు మహానందభరితుఁడై కటకేశ్వరుఁడు వాని వీఁపుపై హస్తమువైచి తట్టి మొగమున చిరునగ వంకురింప నిట్లనియె. "వీరవర్మ! నీకు నాయందు నట్టిభక్తియే కలదని నేనెఱుంగుదు. ఎవ్వరియెడనైన సందియముండునుగాని నీయెడ నాకు సందియము లేదు. రెండువందల గుఱ్ఱపుదళమును, మూడువందల కాల్బలమును నీవు వెంటఁగొనిపోయి దేశమెల్ల వెదకుము! చాళుక్యరాజపత్ని మారువేషము వేసకొనియుండనచ్చును. కాబట్టి స్త్రీలనందఱఁ జక్కగా శోధింపవలయును. భిక్షుణీవేషంబులం దాల్చియు, కాపాలినీరూపంబుల ధరించియు, సన్యాసినీవస్త్రంబుల దాల్చియు, నీబారి బడకుండ నామెయు నామెపరిచారికలు తప్పించుకొనఁజూతురు. భిక్షుణియని వదలవలదు. సన్యాసినియని శంకింపవలదు. కాపాలినియని జంక వలదు. నెఱజాణలగు నంగనలను బంపి గర్భవతులైన యంగనలను నీకడకు రావించి వాండ్రి రూపరేఖావిలాసంబులఁ బరీక్షించి రాజపత్నీలక్షణము లున్నవేమో యఱయువలయు. రాజపత్నుల సంభాషణలు నాగరికసంభాషణల

యి యుండవచ్చు. అందుచేత మాటలాడకుండు నే యంగనలను వదలివేయవలదు. మాటలనుబట్టి కూడ మనుష్యులను గుర్తింపవచ్చును. ఒకప్పు డామె రోగినివేషముధరించి ముక్కుచు మూల్గుచు నుండవచ్చు. రోగినియని జాలిపడవద్దు. నిజమైన రోగమో యబద్ధపురోగమో తెలియు వఱకు నామెను విడువవద్దు. పరపురుషులం జూడనొల్లని యంతఃపుర చాళుక్య రాజపత్ని నీకు గానఁబడకపోవచ్చు ఆమె రాజపత్ని యని నీవు సంతుష్టుఁడవగువఱకు దానిని చేవాటి పోనీవలదు. అవసరముగనేని మేలిముసుఁగు ని చేతితోఁదీసి మొగము సవాలించి చూడవలయు. ఏయంగనయైన ప్రసవవేదన పడుచున్న దని నీవు విన్నపక్షమున బచ్చుకత్తెకాని, బాపనపడంతిగాని, రాచకూఁతురుగాని, కడజాతి మాలకన్య గాని, యాగృహమును జుట్టుముట్టి ప్రసవించిన వెనుక మాతా శిశువులను కన్నులారఁజూచి వారు చాళుక్యులు కారని నీవు నమ్మినవఱకు వారిని బంధించుట కర్తవ్యము. పదుగురు కుటుంబములున్న గృహమున నొకతె యందకత్తియ కానఁబడిన పక్షమున మసిబొగ్గు నడుమ మాణిక్యంబుబోలె నామె యాగృహంబునఁ గానఁబడుటకు గారణమేమో యరయవలయు. ఆవిషయమున గృహయజమానులు చెప్పు వృత్తాంతముల మిక్కిలి మెలకువతో విచారింపవలయును. సత్రములలోను ధర్మశాలలలోను తోఁటలలోను దొడ్లలోను పొలములలోను పుంతలలోను మహావనంబులలోను కొండగుహలలోను చెట్లతొఱ్ఱలలోను గృహములయం దటకలలోను గాదులలోను చట్లకొమ్మలలోను శ్మశానములలోను పాడుదేవాలయములలోను, మఠములలోను చుట్టము లామెను దాచియుండవచ్చును. దుష్ప్రవేశ్యములనక దుర్గమములనక యట్టిచోటులెల్ల ప్రవేశించి మూలమూలల వెదుకవలయు! మఱియుఁ బ్రచ్ఛన్నలగువారు నిద్దురవోయినట్లు చచ్చినట్లు నటించి శత్రుహస్తంబులఁ జిక్కక ప్రాణములఁగాపాడుకొందు

రు. ఒకశవము నీకుఁ గానఁబడినప్పుడు నిజముగా నది శవమో కాదో బహువిధోపాయంబులఁ బరీక్షింప వలయు. ఇంకను నేను నీకుఁ జెప్పక విడిచిన తావు లనేకములుండవచ్చును: వేయి కనులతోఁ జూచుచు, వేయి కాళ్లతో నడచుచు, వేయి చేతులతోఁ బనిచేయుచు వేయి చెవులతో శబ్దముల నాలకించుచు వేయి బుద్ధులతో నాలోచించుచు నీ వామెను వెదుకవలయును. సజీవముగా నామెను నీవు బట్టి తెచ్చితివేని నీవేమి గోరిన దానిని నీకిచ్చెద. అర్ధరాజ్య మడిగినను నీకిచ్చి నామాట నిలుపుకొందును. నీకార్యసఫలత కొఱకు నీయిష్టదేవత లను నీ గృహదేవతలను వేడుకొనుము. మంచి ముహూర్తమునందు మంచి శకునము జూచి బయలుదేరుము. నీవెంట వచ్చు బంట్లను రౌతులను నమ్మినట్లు కనఁబడుచు మనసులో మాత్రము నమ్మవలదు. జాలిపెంపున నైన మొగమోటమున నైన ధనాశచే నైన నవివేకమున నైన గర్వంబున నైన నెవఁడు కార్యహాని సేయనోపుదుఁ. అట్టివాండ్ర గర్వంబు కాలోచితముగా నడచుచు లంచగొండుల యాగడంబులు సాగనీక యవివేకంబున కవకాశంబు నియ్యక శ్రద్ధాళువవై మెలంగుము."
అని బహువిధోపాయంబుల నుపన్యసించి కటకవల్లభుఁడు తన యాజ్ఞా నర్తియై యుండునట్లు వీరవర్మచే ఘోరంబులగు ప్రమాణంబులు చేయించి వానిం బంపెను. వీరవర్మయు రెండువందల రాహుతులును మున్నూరు కాల్బలమును దన్ననుసరించి రాఁ బయనమై పోయెను. అనంతరము కటకవల్లభుఁడు తక్కిన సేనాపతులం గూర్చుకొని ససైన్యంబుగా చాళుక్యరాజధానిం బట్టుకొనుటకై పయనమై పోయెను. ఆపయనమందలి సైన్యముల మహాకోలాహలంబులు సంగీతనాగధుల కైవారములు భేరీభాంకరణంబులు తూర్యారావంబులు స్వస్తివాచకంబులు వర్ణించుట యసాధ్యము. భేరీభాంకరణములకు మార్గమధ్యమున వృక్షములమీఁదనున్న పక్షులు చచ్చి నేలం గూలెనని చెప్పినచో

మున వారి మహాభైరవస్వన మెంత దారుణముగానుండెనో మీరూ
హించుకొనవచ్చును. మహాసముద్ర ఘోషమువలె సైనికుల కలక
లధ్వనులు రమారమి యొక్క యామడవఱకు వినంబడియెనని చెప్పిన
నాశిబిరముయొక్క కోలాహలమెట్టిదో మీరూహించుక తెలియవచ్చును.
కటకవల్లభుఁడు నవరత్నఖచితమైన బంగరు హౌదాలోఁ దన పట్టపు
టేనుఁగుపైఁగూర్చుండి యిరువంకల నందకత్తియలగు జాణలిరువురు
వింజామరలువైవ స్తోత్రపాఠకులు జయ! జయ! మహారాజాధిరాజ!
చాళుక్యరాజ గర్వాంధకార మహామార్తాండమండల! అష్టదిగంత
దంతావళవిశ్రాంతయశోవిశాల! పరగండభైరవ! భువనైకమల్ల!
యాచకజనకుముద చంద్రోదయ! యని బిరుదులపై బిరుదులం జ
దువుచుఁ దనమనంబున కానందంబుగల్పింప మహావైభవముతో నరి
గెను. ఏపల్లియకడకేగిన నాపల్లియలోని పురుషులనందఱ రావించి "చా
ళుక్యుని నిర్మూలించితిమి. మాయధికారము నంగీకరించితిరా యంగీ
కరింపుఁడు! లేదా యిప్పుడే శిరచ్ఛేదంబు జేయించెద." అని వారా
లోచించుకొనుటకైనఁ దగుకాలము నొసంగక వెంటనే ప్రత్యుత్తరమి
మ్మని బలవంతముపెట్టి, సందేహించినవారి బుఱ్ఱలుదీయించి యనుమ
తించినవారింజూచి "మాసైనికులకు కావలసిన భోజనపదార్థముల స
మకూర్పుఁడు. పశువులకు మేఁత గుఱ్ఱంబులకులవలు మొదలగునవి తెచ్చి
సూర్యాస్తమయమగులోపల మాకుసమర్పింపవలయు. లేదా గ్రామ
ము కొల్లగొనుటకు మాసైనికుల కనుజ్ఞనిచ్చెద" మని పలుకుచుండు
ను. అప్పలుకులు విని గ్రామవాసులందరు గృహంబులకరిగి "బ్రతికి
యుండిన బలుసాకు తినవచ్చు" నని పురులు గాదులువిప్పి తాము
దాచియుంచుకొన్న ధాన్యంబుల నాతనికి సమర్పించుచు వచ్చిరి. అ
నంతరము పురమునందలి భాగ్యవంతులను రావించి "మీకడనున్న
ధనంబుల సగము మాయుద్ధవ్యయములక్రింద నియ్యవలయు తీసికొ

నిరంకు! రారేని చెట్లకొమ్మలకుం గట్టి యురి తీయించెద." నని బెద
రించుచు నామాటలకుజంకి తెచ్చినవారియొద్ద ధనముస్వీకరించి తీసికొ
ని రాకయున్నవారి యిండ్లకు సేనాపతులం బంపును ఆమొనగాం
డ్రుగ్రామవాసుల గృహంబులకరిగి గృహములనలుకెలంకులవెదకి పె
ట్టెలు భోషాణంబులుపగులఁగొట్టి నేల ద్రవ్యముపాతిపెట్టిరేమోయని
సంశయముగలచోట్ల పారలతో గడ్డపారలతో గోంపలుత్రవ్వించి ధ
నము కానఁబడినపక్షమున దురాత్మా! రాజద్రోహీ! ప్రాతరాజులప
క్షమును బూని క్రొత్తరాజును వంచింపఁదలచితివా? ధన మున్నదని
చెప్పక దాచుకొనఁజూచితివా? రాజద్రోహివైనందుకు నిన్నిప్పుడుకొ
అతను వేయించెదము. పద! పద!" యని గెంటుకొనిపోయి రాజునకు
వానిం గాన్పించి వాని యాజ్ఞాప్రకార మామందభాగ్యుని వధించు
చుందురు. ఒకప్పుడట్టి భాగ్యహీనుని గృహము కాల్చుచుందురు.
ఇల్లంతయుం ద్రవ్వినవెనుక వానియింట నొక్క కాసైన కానఁబడక
పోయినపక్షమున నారాజభటు లాగృహయజమానుని "ఓరీ, దురాత్మ
ర్గుఁడా! మాకు వృథా శ్రమ కలిగించితివి. రెక్కలునొప్పులు పట్టినవి.
మాకింత శ్రమ కలుగఁజేసినందులకు నీవు మావెంబడివచ్చి మామూ
టలు మోయుము. మాబరువులు మోయునట్టి గాడిదలుకొన్ని చచ్చి
పోయినవి. వాని స్థానమును నీవాక్రమింపు" మని పరిహాసముచేయు
చు వానిచేత దమమూటలు మోయింతురు.

ఇట్లు కటకేశ్వరుఁడు తా నడుగుపెట్టిన చోటెల్ల నరకలోకం
బుగాఁ దన సైనికులు యమకింకరులుగా సకలగ్రామంబులు భస్మ
పటలంబు గావించి, గ్రామస్థుల నిష్కారణంబుగ హింసించుచు
గొన్ని దినంబులు పయనంబుసేసి యెట్టకేలకు విష్ణువర్ధనుని రాజధాని
జేరి యూరిచుట్టునున్న మామిడితోఁటలలో గుడారములు పన్నించి
యందు విడిసి, గ్రామంబు కొల్లవెట్టుమని సైనికుల కాజ్ఞ నొసం

గాను. రణప్రియమైన యీమరాట రాజుకోటనుండి వెడలఁగనే సైనికులు మహానందభరితులై కత్తులు కటారులు బల్లెంబులు ధరియించి లేళ్ళయడవిపైఁ బడు బెబ్బులులవలెఁ బట్టణముపైఁబడిరి. అప్పటి పట్టణావస్థ నేమనివర్ణింపఁగలము? ఆఁడువాండ్రని సంశయములేదు. చంటిబిడ్డలని శంకలేదు. వృద్ధులని గౌరవములేదు. రోగులని జాలిలేదు. పేదలని విచారములేదు. ఎల్లగృహములపై సైనికులు పడి యింటనున్న స్త్రీల పురుషుల నొక్కచోట జేర్చి స్త్రీల శరీరముమీఁదనున్న నగల ముందుగాఁ దీయించి పుచ్చుకొని వారినక్కడనే యుంచుఁడని వారిగృహమందుగల పెట్టెలు భోషాణములు గొడ్డళ్ళతో భళ్ళుభళ్ళుమన పగులగొట్టి నగలు రొక్కము వెండిచెంబులు గిన్నెలు జరీబట్టలు చీరలు, పట్టుబట్టలురవికెలు, మొదలగు సమస్తవస్తువులంగ్రహించి యంతతో తనివిసనక భాగ్యవంతులని తోఁచినవారిని ధన మెక్కడదాఁచితిరో చెప్పుమని యడిగి మీరు గ్రహించినదానికంటె మావద్ద నితరధనము లేదని వారు ప్రత్యుత్తర మిచ్చినపక్షమున తెక్కలు విఱిచి వారి యాలుబిడ్డలు చూచుచుండ వారిం గఱ్ఱతో మోఁది, దెబ్బలవలన వారు దేహ మెఱుంగక పడిపోయినతరువాత వారిగృహముల నాలుగుమూలలకు నిప్పంటింపఁదొడఁగిరి. కొందఱు సైనికులు స్త్రీలను బానిసలుగాఁ గొనిపోయిరి. కొందఱు ధనములు గ్రహించుటతో సంతుష్టిసనక పాతరలు త్రవ్వియు గాదులు భేదించియు ధాన్యంబులు కూడ దోచుకొనిరి.

అతిభయంకరమైనయీదోపుడు చూచి పురవాసులలోని ప్రముఖులు కొందఱు కటకేశ్వరుఁడు విడిసియున్న తోఁటకుం జని యాతని దర్శనముచేసి, సాష్టాంగనమస్కార మొనర్చి చేతులు జోడించి నెన్నుదుటఁజేర్చి యిట్లు విన్నవించుకొనిరి. "దేవా! దేవరవారు సకలధర్మంబులు దెలిసిన మహానీయులు. కత్తికట్టి దేవరవారి

తోఁ బోరవచ్చిన రాజుం దెగటార్చిరి. సైనికుల దండించిరి. అది న్యాయమే. రాజధర్మమే. వీరధర్మమే. కాని నిరపరాధులు నిరాయుధులు నిరాధారులు దయనీయులు నైనపురజనుల నీవిధంబున నిష్కారణముగ హింసించుట తగవుకాదు. పురజను లాబాలగోపాలము మహావస్థపడుచున్నారు. పురజనులు దేవరవారి కేమియపకార మొనర్చిరి? మీయాజ్ఞ నేమియతిక్రమించిరి? దేవరవారు మాకిప్పుడు ప్రభువులైరి గావున దేవరవారియెడ రాజభక్తి నెఱపుటకు, మీకతిగాఁపులై కప్పంబులు గట్టుటకు మీకు విధేయులై యుండునట్లు మీయడుగుదమ్ములకు మ్రొక్కి ప్రమాణంబులు సేయుటకు, మీయాన శిరసావహించుటకుఁ బ్రజలు సిద్ధముగ నున్నారు. చిరకాలము చాళుక్యరాజుల పరిపాలనములో నుండిన దోసముతప్ప పురవాసులు తదితరదోసము లేమియుం జేసి యెఱుంగరు. కావున నేదోసము జేయని యీపౌరులకు నేఁడు గలిగిన సంతాపమును మీదయారస వర్షంబులచేతఁ జల్లార్చి రక్షింపవలయునని వేఁడుచున్నాము. నరుఁడు ప్రకృతిరంజనముచేతనే రాజగుచున్నాఁడు. చాళుక్యులు దేశముం గెల్చినప్పుడు చాళుక్యులకు విధేయులమై యుంటిమి. ఇప్పుడు మీరు దొరలగుటచే మీకు విధేయులమై యుందుము. మీవంటి ధర్మప్రభువులు మాకు దొరలైన తర్వాత మాయాఁడువాండ్రు బానిసలగుట మాగృహంబులు పరశురామప్రీతి యగుట చెల్లునే? అల్లదె చూచుఁడు పొగలెట్లెగయుచున్నవో! ఈదెస చూడుఁడు! మంటలు తమ నాలుకలతో నాకసమును నాకుచున్నట్లున్నవి. కొంచెము చెవియొగ్గివినుఁడు! స్త్రీల యాక్రందనధ్వను లెట్లువినబడుచున్నవో పసిబిడ్డల రోదనంబులు వినలేక మాగుండెలు నీరగుచున్నవి. పశువుల విప్పుట కైనవ్యవధి లేనందున కాలుచున్న యిండ్లలోఁబడి కొన్నిపశువులు మృతినొందుచున్నవి. అదిచూడలేక వాటి యార్తధ్వనులు వినలేక మీపాద

పర్ణములసన్నిధికి వచ్చితిమి. అని దీనముగా విజ్ఞాపనలుచేయు పుర జనులవంక జూచి చిఱునవ్వు తొలకాడు మొగముతో కటకేశ్వరుఁ డిట్లనియె. "రక్షించుటకు మే మెంతవారము? మే మెవ్వరము? మీ యేలిక చాళుక్యభూపాలుఁడుగదా! అతనినడుగుఁడు! అతని మంత్రు లను వేఁడుఁడు! అతని సైనికుల నాశ్రయింపుఁడు! ఆపత్సమయమున రక్షింపఁజాలని యధమపరిభువుల పరిపాలనమునందున్న ఫల మనుభ వింపుడు! కొల్లగొనుట యుద్ధధర్మము. గృహదహనము వీరకర్మము. ఒకప్పుడు మరణములు కూడ తత్సంబంధమున సంభవించుచుండును. దానికి నే నేమిచేయఁగలను?' పగ లనక రాత్రి యనక చావునకు భయపడక మేనులు దాచుకొనక పగవారితోఁ బలుమారులు పోరి, యెన్నెన్నో గాయములుపడి, పలుబాముల కోర్చి నన్నుఁ గొలిచి యున్నందుకు నాబంట్లకు పగవారి యూళ్లు దోచుకొమ్మని సెల విచ్చుట తప్పా? ఇంతపాటి మేలున కైనవారుతగరా? మీపాపము లట్లున్నవి. కర్మఫల మనుభవింపక తప్పదు. ఇందునేఁ జేయఁగలిగిన దేమియు లేదు. మీకోపికయుండిన నాబంట్లనే యాశ్రయించి వారి యనుగ్రహమును సంపాదించుకొనుఁడు. అంతట వారే మీయాపద గడువంబెట్టఁగలరు. పొగ లెగయుచున్న దనియు మంటలు మిన్నంటు చున్న వనియు నాడువాండ్రు సంక్షోభము నొందుచున్నారనియు, పసిబిడ్డ లేడ్చుచున్నారనియు కల్లబొల్లిమాటలు కొన్ని చెప్పి నా మనంబునొప్పింపఁదలంచితిరి. కాబోలు! మీవంటివారి పిచ్చిమాటలు విని మనోదౌర్బల్యమునకు వశుఁడనై సైనికులకు మొదట యిచ్చిన యాజ్ఞ మఱల్చువాఁడను గాను మాటిమాటికి మీరు నాకడకు రావ లదు. నాకాలము పాడుసేయవలదు" అని ప్రత్యుత్తర మీయ నా పురవాసులు విచారగ్రస్థులై "పూర్వకృత మనుభవింపక తప్పదు. మనదురతి యిట్లున్నది. మన మేమిచేయఁగలము!" అని తమ కర్మం

బులం దూరుకొనుచు వెడలిపోయిరి. అనంతరము కటకేశ్వరుని సేనాపతి యొకఁడు చాళుక్యరాజుల కోటఁబ్రవేశించి తమ రాక విని కావలివాండ్రిందఱు పారిపోవుటం జేసి, నిర్జనమైన యాప్రదేశమంతయుఁ జూచి ధనాగారంబు లందున్న ద్రవ్యంబులం దోచుకొని, కావలసిన వస్తువులనెల్ల సంగ్రహించుకొని, రాజాంతఃపురములు నేలం గూల్పుడనియు, కోట నాశనము చేయుఁడనియు సైనికుల కాజ్ఞ యొసంగెను అప్పుడు సైనికులు పాఱలు గునపంబులు గొడ్డళ్లు కత్తులు మొదలగు నాయుధంబులు పూని, మేడలం బడఁగూల్చిరి. అంతఃపురంబుల నవనిపాలుచేసిరి. కొలువుకూటంబులు క్షోణిపాలు చేసిరి. ప్రమదావనంబులు బట్టబయలు చేసిరి. ఏనుఁగుసాలలు పీనుఁగుసాలలు చేసిరి. ఖడ్గములకు సాక్ష్యముగానివాని నగ్నిపా ల్జేసిరి. చిత్తరువులు చెరపి వేసిరి. వెయ్యేల? సుందరవస్తువుల మనుష్యుఁ డెన్నివిధముల నాశనము చేయఁగలఁడో యన్నివిధముల వారాకోట నాశనముచేసిరి.

కటకేశ్వరుఁడు తన సేనాపతులు కొల్లవెట్టి తెచ్చిన ధనంబు నెల్ల స్వీకరించి యనంతర మాయూరు విడిచిపోవ నిశ్చయించుకొని తమదగ్గఱనున్న దండనాథులలో నొక్కఁడగు కేసరివర్మను బట్టణంబునకు బరిపాలకునిగా నియమించి యాతనిం బిలిచి యిట్లనియె. "కేసరీ! ఈపదవి నీకేసరియని యొసంగినాఁడ. ఇనుపదండము చేతఁబూని నీవీ దేశము పరిపాలింపవలయును. దుష్టులగు చాళుక్యరాజుల పరిపాలనములోనుండి ప్రజలు పొగరెక్కి యున్నవారు. రాజశాసనమన్న భయములేదు. దండనాథులన్న గౌరవములేదు. ఈపురజనులలో మన పక్షమువాఁడొకఁడు కలఁడు. ఆతనితోడ నిన్ననే బ్రసంగించితి. ఆతండు పూర్వవృత్తాంతమంతయు నఱటిపండొలిచి చేతికిచ్చినట్లు చెప్పెను చాళుక్యవల్లభుఁడు ప్రజలతో నాలోచింపక యేకార్యము చేయలేదట. ప్రజలకిష్టములేని పన్ను నెన్నఁడు విధింపలేదట! ప్రజలమానం

గమే తనయాంశముగా నతఁడు భావించెనట! ప్రజలకిష్టమైన మంత్రులనేగాని యితరుల నత డంగీకరింపలేదట! ప్రజలకనిష్టముగా వర్తించిన యుద్యోగులను వారివారి యధికారమునుండి తొలగించువాఁడట? ఈవిధముగా బరిపాలించినపక్షమున నెవ్వఁడైన లోకంబున రాజ్యముచేయుగలఁడా? ప్రజలయిష్టమే మనము చూచుకొన్నపక్షమున నొక్కపన్ను విధింపగలమా? ఒక్కచట్టము నిర్మింపగలమా? ఒక్కకార్యము చేయగలమా? ఒక్కయుద్యోగిని నిజాధికారమున నుంపగలమా? రాజ్యచక్రము రాజ యొక్క నిరంకుశాధికారమును నిరుసుమీఁద తిరుగవలయునుగాని ప్రజలయభిప్రాయ మనునిరుసు మీఁద తిరిగిననది తప్పక స్వల్పకాలమున జెడిపోవును. రాజు పరమేశ్వరాంశమున బుట్టిన వాఁడు. సర్వజ్ఞుడగు పరమేశ్వరునికంటె కించిజ్జ్ఞుడగు మనుష్యుఁడెరుఁగునా? యేపని ప్రజలకు మంచిదో యదిరాజే యెఱుంగును. రాజున కాజ్ఞాపింపఁగూడదు. రాజ్యాధికారమున కొకడు మితినేర్పరుపఁగూడదు. ప్రజలు పశువులు కావున దండనీతియే ప్రధాననీతి. ఖడ్గనీతికి మించిన నీతి లేదు. దెబ్బ దేవేంద్రలోకమును జూపును. ఖడ్గమునకులొంగినట్లు ప్రజలు మాటలకు లొంగరు. బెత్తముదాచిన యుపాధ్యాయుఁడు విద్యార్థులను పాడుచేసిన విధముగానే ఖడ్గముదాఁచిన రాజు ప్రజలను బాడుచేయును. ఎవరినెక్కడ నుంచవలయునో యక్కడనుంచవలయును. అనర్హులకధికారమిచ్చినయెడల వారు చెడిపోదురు. ప్రజలలో విద్యావివక్షత చేయగూడదు. చదువులునేరకయే మనుష్యులు దేవతలకు పంచాంగములు చెప్పుదురు. చదువులునేర్చినపక్షమున వారింబట్ట పగ్గములుండవు. చదువుకొన్నవారు రాజ్యహాని కలుగజేయుదురు. ప్రజలనెప్పుడు నమ్మఁగూడదు. ప్రజలను నమ్మినరాజు కుక్కతోకబట్టుకొని గోదావరినీదినవానివలె జెడిపోవును. మనరాజ్యమున పాఠశాలల నెక్కడ నిలుపవలదు. ఇది

వరకున్న పాఠశాలల నెత్తివేయింపుము. వేదాధ్యయనము మాత్రము చేసికొనుట కంగీకరింపు. స్వాధ్యాయము చదువుకొన్న బ్రాహ్మణులు జడులై ప్రపంచజ్ఞానము లేకయుందురు. గాన వారివలన నరపాలకులకెన్నఁడు హాని లేదు. శాస్త్రాధ్యయనము చేసిన వారివలన నెంతేని యపాయము కలదు. అందు ముఖ్యముగా హేతువాదముఁ దెలుపు శాస్త్రములు వర్జనీయములు. తక్కువ వర్ణములలో మూఢభక్తి ప్రోత్సాహము సేయవలయును. అందువలన జనులు నాగరికులుగాక యధోమార్గమున బడియుందురు. వెయ్యేల! ప్రజలు రాజులకు శత్రువులుగాని మిత్రులుగారు. రాజునకు బ్రజ శరీరము. రాజు ప్రజకు నాత్మయని చెప్పువారి మాటలు కేవలమనుభవసిద్ధములుగావు. అవి పుస్తకములలోనిమాటలు. గ్రంథస్థములగు మాటలకు లోకానుభవమునకు సంబంధముండదు. ప్రజలకు విద్యలుచెప్పుట దొంగలచేతికి దీపమునిచ్చుట. బందిపోటుదొంగలచేతికి పెట్టెల తాళములిచ్చుట. కావున సర్వవిధములచేత విద్యాగంధము లోకమున వ్యాప్తము కాకుండ జేయవలయు! సమస్తరహస్యము లిందులోనే యున్నవి. ఇదిగాక మఱియొకరహస్య మెరిగించెద వినుము. ప్రజలలో నొకానొకఁడొక కాలమున నఖండప్రజ్ఞావంతుఁడై మేధావంతుఁడై జనియించి శాస్త్రంబులనెల్ల జదివి తాను స్వతంత్రబుద్ధిగలవాఁడై తాజెడ్డకోతి వనమెల్ల చెరిచెనన్నట్లు లోకులకెల్ల స్వతంత్రభావమునుబోధించుచుండును. మొండిచేతులవానికిశెనగలుదినుటనేర్పినట్లు రాజనీతి, యేమోయెఱుగనిమూర్ఖప్రజనులకు రాజధర్మంబులు, ప్రజాధర్మంబులు, శుక్రనీతి, బృహస్పతినీతి, మానవధర్మశాస్త్రము, యాజ్ఞవల్క్యవ్యవహారకాండము మొదలగు నాయువుపట్టు గ్రంథంబులలోని మర్మంబులనెల్ల జెప్పి వారికిం బోగరుబోతుతనంబు పెంకెతనంబు నేర్పుచుండును. అట్టివాడొక్కఁడయ్యు లక్షమందిపెట్టు. అట్టివానిని యేయోపాయంబు

లచేత గడ తేర్చవలయును. ఊరకున్న పక్షమున రాచపుండువలె నాడు క్రమక్రమముగ విజృంభించి రాజదేహమును వాఁడు నాశనముచేయును. స్థాలీపులాకన్యాయముగా నీకు నేను కొన్ని ధర్మములే చెప్పగలిగితిని. నీబుద్ధికొలఁది నూహించుకొని దేశపాత్రములంబట్టి మెలకువతో మెలంగుచుండుము! చండశాసనుఁడని జనులు చెప్పుకొనునట్లు బిరుదు తెచ్చుకొనుము.

ఆరాజునకు నాయమాత్యునకు పరిపోవుటంజేసి యతఁడు చేతులు జోడించి తనఱేని కిట్లనియె. "దేవా! ఇన్నివిధముల నాకుఁ జెప్పవలయునే? మీచిత్తవృత్తి ననుసరించి నేను ప్రజాపాలనముఁ జేసెద. ప్రజలకు లవలేశమైన స్వాతంత్ర్యమియ్యను. అట్టి యిచ్ఛ ప్రజలలో నెన్నఁడేసి పొడసూపెనేని యదిచిగురించునప్పుడే త్రెంచివైచెద. ప్రజలు దేవరవారికి బానిసలై యుండునట్లు జేసెద. మనము కట్టినన్ని పన్నులు వారిచ్చుకొనవలసినదే. ఆఁడువాండ్ర మెడలలో మంగళసూత్రములు సైతము మమ్మించి కొయ్యపుస్తెలు కట్టించి మీకు రావలసినసొమ్ము ప్రోగుచేసి పంపెదఁ జూడుఁడు. మఱియు, నాబుద్ధి విశేషము నుపయోగించి క్రొత్తపన్నులు సృష్టించి కట్టెద. మీధనాగారములు వర్షకాలమునందు నీళ్ళతో నిండు చెఱువులట్లు ధనరాసులతో నిండిపోవునట్లు చేసెద. మీపేరు విన్నమాత్రమున వేఁగిదేశ స్త్రీలకు గర్భనిర్భేదమగునట్లు వర్తించెద. నేనిప్పుడేమన్నను నవి యుత్తరకుమారప్రజ్ఞలవలెఁ దోఁచవచ్చును. ఒక్కసంవత్సరము నాపరిపాలనము చిత్తగింపుఁడు." అని విన్నవింప నాకటకేశ్వరుఁడు తన కనుకూలుఁడగుమంత్రి లభించెనని వానిపై రాజ్యభారము నిలిపి కళింగదేశమునఁ గొన్ని రాజ్యవ్యాపారములఁ జక్కఁబెట్టుటకై గోదావరి దాఁటి చనియెను.

ఆవిధముగా భర్తృమరణవార్త విని మంత్రిప్రేరణంబునఁ జాళుక్యరాజపత్ని కొంతపరిజనముతో బయలువెడలి కొంతదూరము చనిన వెనుక నమాత్యుఁడు సమీపించి "తల్లీ! సమరమునఁ బరాజితులమై పరిచ్ఛన్నగుప్తిమైయుండఁ దలంచినమనము మహాగజములతో నంబారీలతోఁ బోవుట యుచితముగాదు. పగతురకుమనజాడలు వీనివలనసులభముగాఁ దెలియఁగలవు. కావున గజముల హయముల విడిచి పరిజనంబునుగొంత వదలి మనము పోవుట సముచితము. మీకొకపల్లకి నిచ్చెద. దానిలోఁ గూర్చుండి పయనము సేయవచ్చును. మీఁద మీచిత్తము." అని విన్నవింప నాదేవి కాలానుసారముగా వర్తింపవలయు నని గ్రహించి యట్ల యగుఁగాక యని చెప్పెను. అమాత్యుఁడొకపల్లకియు నెనమండ్రుగురుబోయలను సిద్ధముచేసెను. దేవి భద్రగజముమీఁదనుండి దిగి పల్లకిలోఁ గూర్చుండెను. అమాత్యుఁడు తక్కినపరివారమునకు సెలవిచ్చి యథేచ్ఛం జనుమని చెప్పి మిక్కిలి నమ్మికగల యార్వురుబంట్లను వెంటఁబెట్టుకొని తాను పల్లకివెంట నడువఁజొచ్చెను. పట్టణములు విడిచి పెద్దగ్రామములు విడిచి వారు క్రమక్రమముగా నరణ్యప్రాంతముల కరిగి యొకగ్రామముఁ జేరిరి. అమాత్యుఁడు గ్రామీణులం బిలిచి తమవృత్తాంత మంతయుం జెప్పి తల దాచుకొనుటకు నెలవొసంగు మని వేఁడెను.

అతని వేఁడికోలువిని గ్రామవాసులలో ముఖ్యు లిట్లనిరి. "అయ్యా! కటకరాజు చండశాసనుఁడు. అతఁడు వేయికన్నులతోఁ జూచుచుండును. మాగ్రామములోఁ దనశత్రుపుత్రిపత్ని యున్నదని వినినేని నామెం దాఁచినందుకు మమ్ము నానావిధవ్యథలపాలు జేయును. మాగృహముల నగ్నిహోత్రుని కాహుతులఁ జేయును. తుత్తునియలుగాఁ జెండి మమ్ముఁ గాకులకుం గ్రద్దలకు నాహారముగాఁ జేయును. మాపడంతులఁ జెఱపెట్టును. మాకు నష్టములేనియుపకారము జేయఁ

గలము గాని మాతలలు ద్రుంచుకొనిపోవునట్టిపనిని మేము చేయఁ జాలము. తనకుమాలినధర్మము మొదలు చెడినబేరము లేదుగదా! రాజపత్నివిషయమై మాకు విచారమున్నదిగాని యిది మాతలకుఁ దగనిపని కావున నిందు మే మెట్టిసాయముఁ జేయఁజాలము. మాతప్పు మన్నింపుఁడు."

అక్కడ నెట్టియాశలు లేకపోవుటచే మంత్రి యాదేవిని మఱియొకగ్రామమునకుఁ గొనిపోయెను. అక్కడివారును దాఁచుట కంగీకరింపలేదు సరిగదా యాపూఁట నన్నమువండుకొని తినుట కయిన నెల వొసంగలేదు. అప్పు డమాత్యుఁడు తనలో నిట్లనుకొనియెను. "ఆహా! ఏమి యీకాలవైపరీత్యము? సప్తద్వీపములు గెలిచి మహీమండల మంతయు నేకచ్ఛత్రముగాఁ బరిపాలించిన నలచక్రవర్తి పుష్కరునిచేత జూదమం దోడి రాజ్యపదచ్యుతుఁడై రాజధానిని విడిచి యూరువెలుపల మూఁడహోరాత్రములు వసియించియున్నను బుష్కరునిభయంబునఁ దమరాజుం జూచుట కొక్కరయినఁ జనలేదని, వారికిఁ బట్టెఁడు గోగిరమయినఁ బెట్టలేదని మహాభారతమున వ్యాసమహర్షి వ్రాసినవ్రాఁతలు కేవల మతిశయోక్తు లనుకొంటిని. నవఖండమండలాధీశ్వరుఁ డగుహరిశ్చంద్రుఁడు మాలకడఁ గొలువుసేసి కాటికాపరియై త్రాఁచుబాము కఱవ మృతినొందినతనకుమారుని దహనము చేసికొనుటకయిన రెండుమూర్లనేల దొరకలేదని విచారించినట్లు పురాణములలోఁ జదివి యది, కవిచాతుర్య మనుకొంటిని. ఇప్పు డవి కవికల్పితములు గావనియు సత్యములే యనియు స్వానుభవమువలనఁ దెలిసికొంటిని. ఆహా! ఏమి చాళుక్యనరపాలునిపాలనంబున సుఖించినజనులు వానివలన మన్ననలం బడసినజనులు వాని యనుగ్రహమునకుం బాత్రులయినజనులు వానియిల్లాలికి నిలువ నీడనైన నిచ్చుట లేదే! పూర్వగాథలు దడవనేల! పురాణములపొంత

బోనేల? నేఁ డిదియెల్ల నాకన్నులముందరనే జరుగుచున్నదే: రాజపత్నీనివాసమున కంగీకరింపనియీరెండుగ్రామములలోనే మనమహారాజు నూతులఁ ద్రవ్వించెను. చెఱువులు ద్రవ్వించెను. బ్రాహ్మణులకు మాన్యము లిచ్చెను. అవియెక్కరైన నం దలఁపెట్టరే. వీరందఱుఁ గృతఘ్నులే. స్వలాభపరాయణులే. కృతజ్ఞత యనునది గ్రంథములలోను నిఘంటువులలోను మాత్రమే యున్నది గాని మనుష్యుల హృదయములయందు లేదు. ఓకాలమా! నీశక్తి వర్ణనాతీతముగదే. సర్వంసహాభర్తను సన్యాసిం జేయఁగలవు. బిచ్చగానిని పృథివీశ్వరుం గావింపఁగలవు. మహాపట్టణము మసనము జేయఁగలవు; వట్టియడవి పట్టణముఁ జేయఁగలవు. నాకవెఱ్ఱియేల? లోక మెప్పుడు నిట్లె యుండును. ముందుపని చూచుకొనవలయును గాని యీశుష్కవితర్కములతోఁ బ్రయోజనమేమి?" అని మఱికొంతదూర మరిగి యొక గ్రామముకడకుఁబోయి దానిపేరేమని కొందఱు బాటసారులనడిగెను. "ఈగ్రామముపేరు ముదివేము" అని వారుత్తరము జెప్పిరి. "ముదివేమా? వేము చేఁదు. ముదివేము మిక్కిలి చేదు. పేరు విన్నంతనే నామనస్సు కీడు శంకించుచున్నది. అయినను వృథానుమానములు కలిగి నిరాశజెంది పోఁగూడదు. పేరుంబట్టి నడచుట పరిహాసము. పిచ్చయ్య యనుపేరుగలవాఁడు మతిమంతుఁడు కావచ్చును. బృహస్పతి యనిపేరుపెట్టుకొన్నవాఁడు వెఱ్ఱివాఁడు కావచ్చును. కావున గ్రామములోని కరిగి యధమపక్ష మీదినమునైన నందుండుటకు వీలగునేమో తెలిసికొనియెద. దేవి మిక్కిలి డస్సినది. బోయీ లలసి యున్నవారు. నాకును విశ్రాంతి గావలసి యున్నది." అని మనంబున దలపోసి పల్లకి నూరుబైట నొకచెట్టుక్రింద దింపించి సేవకుల నక్కడఁ గావలియుంచి మంత్రితో నొక్కఁడ గ్రామంబున కరిగెను.

ఆగ్రామమునఁ జెఱువుగట్టుమీఁద నొకతాటియాకులయిల్లుం డెను. ఆయింటియరుఁగులమీఁద వేదఘోషవినఁబడుచుండెను. మంత్రి తిన్నగా నచ్చటి కరిగి యీయి ల్లెవరి దని యడిగెను. "అయ్యా! ఈయిల్లు నాదే. నాపేరు విష్ణుభట్టుసోమయాజి. మీ కెవరియిల్లు కావ లెను?" అని రమారమి యఱువదిసంవత్సరములువయస్సు గలవృద్ధ బ్రాహ్మణుఁడు వాని కుత్తర మిచ్చెను. అమాత్యుఁడు గంభీరమయి నయావాక్కు విని మూర్తీభవించినవేదములో యనునట్లు విరాజిల్లు చున్నయాప్రశాంతమూర్తికి స్ఫటికాక్షసూత్రధారికి నమస్కరించి యాతనిచే దీవనల నొంది యిట్లనియెను. "స్వామీ! మేము బాట సారులము. మా కిప్పూఁట వంటచేసికొనుటకు బస కావలయును. మీరాబస నొసంగఁ గలరా!" అని యడుగుటయు నాబ్రాహ్మణుఁడు "నాకు విశాలమైనదొడ్డి యున్నది. దొడ్డిలో నొకతాటియాకుల యిల్లున్నది. ఆయింట మీరు వండుకొని తినవచ్చును." అనిచెప్పి మీతోఁగూడ నాఁడువాళ్లున్నారా? యనియడిగెను.

"ఒకర్తమాత్రమున్నది. ఆమె పల్లకిలో నున్నది" యని మంత్రి బదులు చెప్పెను. "మంచిది మీ రాబసలోఁ బ్రవేశింపుఁడు మీరు బ్రాహ్మణులే గదా!" యని బ్రాహ్మణుఁడు బలికెను. "ఆహా! బ్రాహ్మణులమే." యని యమాత్యుఁడు బదులుచెప్పి యూరు బైటకుం జని పల్లకిని దనబంట్లను వెంటం గొని యాయింటం బ్రవేశించి యది సేవకులచేత బాగు చేయించి తాను దప్ప మఱి యొకబ్రాహ్మణుఁడు పరివారమున లేమి తానే స్నానముచేసి బ్రాహ్మ ణునియింటఁ బాత్రసామగ్రి నెరువుతీసికొన వంటచేసి మార్గాయాస మున మిక్కిలి డస్సియున్నరాజపత్నికి ముం దన్నముబెట్టి తరువాత సేవకులకు భోజనముపెట్టి కట్టకడపటఁ దాను భుజించెను. భోజనానం తరమున నందఱును విశ్రమించిరి. ఆరాత్రిగూడ నచ్చటనే యుండఁ

దలఁచి బ్రాహ్మణుని సెలవు గైకొని యామంత్రి మధ్యాహ్నమున్ పాకంబు జేసి యందఱ నారగింపఁ జేసెను.

రాత్రి భోజనమైన వెనుక మంత్రి విష్ణుభట్టసోమయాజితో రహస్యముగఁ గొన్ని విషయములు మాటాడఁ దలఁచి యాతని సన్నిధి కరిగెను. సోమయాజియు భోజనముచేసి వీథియరుఁగుమీఁదఁ గొబ్బరియాకులచాఁపమీఁద గూర్చుండి యుచ్చైస్స్వనముతో సామగానము సేయుచుండెను. ఆతని సామగానముముందర వీణాగానము సైతము పనికిరా దని విన్నవారందఱుఁ బ్రశంసించు చుందురు. అందుచే జుట్టుపక్కల నున్న బ్రాహ్మణు లందఱు నాగానామృతమును వినుజేరలతో జుఱ్ఱుకొనుటకై వచ్చి యరుఁగులమీఁదఁ జేరిరి. మంత్రియు వారిలోఁ నొకఁడై యొకమూలఁ గూర్చుండి మేటియుద్గాతల నోటనుండి యావిధముగా సామముల నెన్నఁడు వినియుండమి గానామృతాస్వాదనమునం జొక్కి పరవశుఁడై యుండెను. జాము రాత్రి యగునప్పటికి సోమయాజి గానము ముగించెను. శ్రోతలు వానికడ సెలవుగైకొని తమతమ గృహంబులకుఁ జనిరి. అందఱు చనిన వెనుక మంత్రి సోమయాజిని గానవిషయమున నెంతయుఁ బ్రశంసించెను. సోమయాజి చిఱునవ్వు నవ్వుకొని యథోచితముగా నుత్తరము జెప్పి యిట్లనియె. "అయ్యా! మధ్యాహ్నమునుండి మిమ్ముఁ గొన్నిమాటలడుగవలయు నని యభిలాషగ నుండు. ఇందుకు నన్ను మీరు మన్నింపవలయును. మీరు బ్రాహ్మణులు. అందులో మావంటివైదికులు గారు. లౌకికులు. మీపై ఖరిజూడ గొప్పపదవుల నధిష్ఠించినట్లు కనఁబడుచున్నది. మీవెంటవచ్చిన యాచూలా లెవ్వరో నే నెఱుఁగఁజాలకున్నాను. ఆమె బ్రాహ్మణస్త్రీవలెఁ గనఁబడదు. వర్ణాంతరయైనయాకాంతకును మీకుఁ గలసంబంధ మెట్టిది? అదియునుఁగాక యామె మిక్కిలి సుకుమారివలెఁ గనఁబడుచున్నది. ఆమెవాలకమును

బట్టి మహాదుఃఖములో నున్నట్లు గనంబడుచున్నదని మాసోమదేవి చెప్పుచున్నది. ఆమెకు నీవేలవంటచేసిపెట్టవలయు? నీయాలుబిడ్డలెచ్చట నున్నారు? ఈసందేహములు నాకుఁ దీర్పవలయు." అని బ్రాహ్మణుఁడు తనమనంబున నున్నదంతయు వెడలఁ దెలుప నమాత్యుఁడు నాఁడబోయిన తీర్థ మెదురైన దని సంతసించి సోమయాజికిట్లనియె.

"మహాత్మా! ఆవిషయమై నేను మీతోఁ జెప్పుటకే వచ్చితిని. రాత్రిసమయముగదా 'యెవ్వరు సన్నిధి నుండరని నే నేకాంతముగ మాటాడఁ దలఁచితిని. కాని, మీసామగానముచేత సమాకర్షింపఁబడి పలువురు వచ్చియుండుటచే నే నావిషయము బ్రస్తావించుటకు వీలులేకపోయినది. మీరే యడుగుటంజేసి చెప్పుటకు నాకు సంతోషముగానున్నది. ఈదేశము పాలించుచుండిన చాళుక్యవల్లభుఁడు కటకేశ్వరునితోఁ బోరి రణముఖమునఁ బ్రాణములు విడిచె నని మీరు కర్ణాకర్ణిగ వినియుందురు. ఈమె మృతినొందిన యామహారాజుపత్ని. దుర్భరగర్భభారసన్నయై యున్నది. ఎన్నోసూడిదలు గావలసిన సమయములు—నెన్నో ముచ్చటలు తీరవలసిన సమయమున, నెన్నో కోర్కెలు సఫలము గాఁదగిన వేళ—నెందఱ పడఁతుల మన్ననలో బడయవలసిన కాలమున---నవవైధవ్యదుఃఖము, సందులోఁ బ్రాణసంశయము పలాయనము మొదలగుదుర్భరక్లేశములు సంభవించినవి. స్వామీ! భగవత్సంకల్ప మెట్లుండునో చూడుము. అసూర్యంపశ్యయై యాదిగర్భేశ్వరి యైన యీదేవి యీయవస్థలోఁ దల దాఁచుకొనుటకు నెలవు దొరకక పల్లెపల్లెయుఁ దిరుగవలసివచ్చె. ఎన్నోసూడుగులు నెన్నో మహాభవనములు నెన్నో యుద్యానవనములు గల యీమహారాజపత్నికిఁ బ్రసవించుటకైన జిన్నగుడిసె దొరకకున్నది. కటకేశ్వరుఁడు దురాచారుఁడై యీమెం బ్రాణములతోఁ బట్టి తెమ్మని తనసేనాపతుల కానతిచ్చెను.

"ఈమె నేమి సేయవలయునని యాయన సంకల్పము! వధింపఁ దలంచుకొన్నాఁడా!" యని బ్రాహ్మణుఁడడిగెను. అనవుడు రెండి యు మంత్రి యిట్లనియె. "అదిగాదు వాని సంకల్పము. అంతకన్న దారుణకృత్యము చేయఁ దలంచుకొన్నాఁడు. ఈమెను బ్రసవించిన దనుక దానేదో యొకనెలవున నుంచి మగబిడ్డం గనినపక్షమున నయ్యర్భకుని గర్భమునుండి వెడలినతోడనే సంహరింపవలయుననియు నాఁడుశిశువు పుట్టిన దానిం బెంచి పెద్దదానింజేసి కడునీచుని కిచ్చి వివాహము సేయవలయు ననియు నాతని సంకల్పము. ఇది రణనిహతుఁ డయిన రాజుపైఁ గలద్వేషముచేతఁ గలిగిన సంకల్పము. వైరములు మరణాంతము లన్నమాట యాతనికి స్ఫురింపలేదు. శిశుహత్యా మహాపాతకమన్నమాట యాతఁ డెఱుఁగఁడు గాఁబోలు! దీర్ఘకోపము త్తమపురుషలక్షణముగా నున్నపలుకు వాని చెవిసోకియుండదు. సోఁకిన నేమి యది సమయంబునఁ దక్కి రాదు. దేవా! ఆరాజు ప్రతిజ్ఞ లావిధముగా నున్నవి. ఈదేవియవస్థ లీవిధముగానున్నవి. చాళుక్యవల్లభుఁడు పరిపాలించిన దేశమునందు వానిపట్టపుదేవి కూర్చుండుటకు మూరెడుచోటయిన దొరకకున్నది. అతఁడెన్నియాలయములు బ్రతిష్ఠించెను. ఎన్నితటాకములు త్రవ్వించెను! ఎన్నియారామములు నిర్మించెను! ఎన్నియగ్రహారము లిచ్చెను! ఎందఱు పండితులఁ బోషించెను! ఎందఱుకవులకుఁ గనకాభిషేకము జేసెను! ఎందఱు సాధుల సంరక్షించెను. ఎన్నిచేసిన నేమి? ఆతనియాదరమునకుఁ బాత్రము లయినవారిలో నొక్కరయినఁ గృతజ్ఞులుకానఁబడరు. కాలమంత చిత్రముగా మాఱిపోయినది. సేనాయనమంత్రిని. మున్ను నావలన నుపకారములఁ బొందినవారుసైతము నేనేదో వారివలననుపకృతిఁ గోరుదునని నన్నుఁ జూచి మొగము చాటుచేయుచున్నారు. కటకేశ్వరుని బారిఁబడకుండ నీరాజపత్నిని గాచుటే నాసంకల్పము.

ఇందు మీరు తోడుపడవలయు నని నాసంకల్పము. మీరు వేదవే దాంగపారంగతులు. సకలధర్మకోవిదులు. మీకు నావంటివాఁడు కర్తవ్యముపదేశింప నక్కఱలేదు. ఈపుణ్యము మీరు కట్టుకొనవలయును. మఱియొకదారి నాకగుపడుట లేదు." అని యాయుదంతము నెఱిఁగించి చేతులు జోడించి యాసచివుఁడు విప్రునకు నమస్కరించెను.

బ్రాహ్మణుఁడుమిక్కిలియాశ్చర్యముతో నిట్లనియె. "అయ్యా ఇది మిక్కిలి చిత్రము గాను దైన్యము గాను నున్నది. ఈమె చాళుక్యవల్లభునిపట్టపుదేవియా? ఆహా! ఎంతలో నీమె కింతదురవస్థ సంప్రాప్తించినది. పరమేశ్వరుని చేఁతలు కించిజ్ఞులయినమానవమాత్రులకు దురూహ్యములుగదా! మొన్నటిరాణి నేఁటిపేదరా లయినది. ఆహా! ఆమె యెల్లవిధముల రక్షణీయ. అయినను దురాత్ముఁడయిన కటకేశ్వరునిఁ దలంచినపుడు గుండెలు జల్లు మనకమానవు. అతఁడు దాక్షిణ్యమెఱుఁగఁడు. దయారస మాతని మనంబున నేకోశమునం గానఁబబడదు. వాని దినుపగుండె. రాతిమనస్సు. ఈమెకు శరణ మిచ్చిన మాకును నామెకును మరణముసంభవించు నని శంకించుచున్నాము. ఈయూరిబ్రాహ్మణులతోడను నిచ్చటనున్న క్షత్రియులతోడను, ముఖ్యులయిన శూద్రులతోడను, నే నాలోచించి నీకు సమాధానము జెప్పెద. రెండుదినము లిందుండుము. ఇప్పుడు ప్రొద్దుపోయినది. పండుకొందము. వెండియు రేపుదయము గలిసికొందము." అని యాతనింబంపి నేలవేల్పు నిద్రింపఁబోయెను. అమాత్యుఁడును బ్రాహ్మణుని సాధుభావము గ్రహించి దనకు గొంత యాశ యున్నదని తన బసకరిగి యొకచాఁపపైఁ బండుకొని నిద్రించెను.

మఱునాఁ డుదయమున సోమయాజి తనకడకు వచ్చినవారితో రహస్యముగా నీవిషయమై కొంచెకొంచెముగా ముచ్చటించి సాయం

కాలము తనయింటికి వారిని రమ్మని చెప్పెను. వారితోడనే గాక యాగ్రామములో నున్న ముఖ్యక్షత్రియులకును నాలవజాతివారికిని గూడ దనగృహమునకు రేయి రమ్మని వర్తమానము నంపించెను. రాత్రి భోజనానంతరమున బ్రాహ్మణులిరువదిమందియుఁ బదుగురు క్షత్రియులు, బదుగురు శూద్రపెద్దలు, బ్రాహ్మణుని యింటివెనుక నున్న దొడ్డిలోఁ జేరిరి. కొందఱు తాఁటియాకుల చాఁపలమీఁదను గొందఱు కొబ్బరిచాఁపలమీఁదను గొందఱు వట్టినేలను, గూర్చుండిరి. అగ్రాతుర్యుఁడు కూడ వచ్చి వారి పక్కను గూర్చుండెను. విష్ణుభట్టసోమయాజి వారినడుమ నిలిచి యుండి చాళుక్యవల్లభుని మరణము మొదలుకొని యిప్పటివఱకు జరిగిన వృత్తాంత మంతయు వారలకుం జెప్పి యామె తనయింటికి వచ్చినమాట దెలిపి యిట్లనియె. "మనమందఱము నొక్కమాటమీఁద నుండినపక్షమున నీదేవిని మనము సంరక్షింపఁగలము. కటకేశ్వరుఁడు వచ్చినను, వాని సేనాపతులు వచ్చినను, వారీమెం గనుఁగొన్నను మనమందఱము నైకమత్యము గలిగియుండినపక్షమున భయములేదు. మన మందఱ మొక్కపడవ నెక్కెదము. మునిఁగిన నందఱము నశింతుము. విపత్సముద్రము నానావ దాఁటెనా మనమందఱము బ్రతుకుదుము. మొదట రాజపత్ని యగుటచే నీమె మనకు రక్షణీయ. ఆఁడుదియగుటచే నంతకుమున్న రక్షణీయ. శూలాలగుటచే మఱియు రక్షణీయ. ఏవిధముచేతఁ జూచిన నీమె మనచే రక్షణ మొందఁ నర్హురాలయియున్నది. కటకనాథుని దండనాథులు వచ్చి నాయిల్లు సొచ్చి యీమె యెవ్వరని యడిగిన నిది నాకూఁతురని చెప్పెద. ఇంతయందక్షత్రియ యైన కూఁతురు నీకెట్లు గలిగిన దని వారు నన్నడుగవచ్చును. ఇంక నెన్నో ప్రశ్నలు వేయవచ్చును. ఆవిషమస్థితి నప్పటికిఁ దోఁచినయుపాయములచేఁ దప్పించుకొందు. ఈ

మెను నాయింటనే యుంచెద. ఆభారము మీకెవ్వరికిని గలుగనీయను మంచివచ్చినఁ జెడ్డవచ్చిన నేనే భరించెద. కాని దైవిక రాజకముల కు మానవుఁడు పూటపడఁజాలఁడు. ఎటుపోయి యెటువచ్చునో? ఈ మెరక్షణార్థము మనమందఱము నాపద బొందవలయునని నిశ్చయిం చుకొనవలెను. అందుకు సిద్ధమై యిందుకు దిగవలయును. ఇటువంటి మహాపత్తులో నున్న మహారాజపత్నిని గావక క్షణభంగురము లయిన యీశరీరములను గాచుకొనుటకై మనము పేక్షించుటధర్మవిరుద్ధము. ఘాతుకకృత్యము. అట్టిమహారాజపత్నియే యిటు గుందుచుండ మనవంటివారము గాసిజెందిననేమి? నశించిననేమి! పోయిన నామెతోఁ బోవుదము, బ్రతికిన నామెతో బ్రతుకుదము. లోకోత్తరమైన యిట్టిధర్మకార్యము మనముచేయుచుండ నార్తత్రాణపరాయణుఁడైన నారాయణుఁడు మనయండనుండి యీవిపత్సముద్రము నుండి యామెను మనలం దేల్పఁడా? తేల్పకపోవుఁగాక. మనమందఱ మీవిధమున నశింపవలసిన యోగమే మనకు విధాత నిర్ణయించియున్నపక్షమున దాని నెవ్వఁడు తప్పింపఁగలఁడు! ధర్మపరాఙ్ముఖులమై కాకివలెఁ గ్రామువలెఁ జిరకాలము జీవించుటకంటెఁ బరోపకారార్థ మిదం శరీర మ్మనుమాట సార్థకముగా ధర్మకార్యాచరణము చేసి మరణంబునొందుట యుభయలోకతారకమైనపద్ధతి. మరణ మెప్పటికయిన రాకమానదు. మంచికార్యము జేసి సత్కీర్తి యనుమిత్రముతోఁ గూడి పరలోకముఁ జేరినవాని భాగ్యమే భాగ్యము. అట్టిభాగ్యము గావలయునన్న నీదేవిని రక్షించుటయే దానికి సాధనము. మనలో నైకమత్య ముండిన నక్కటకరాజుగాని, మఱియెవ్వఁడుగాని మనగుట్టు దెలియఁజాలఁడు. ఐకమత్యము పంచాక్షరీమహామంత్రము. దానిని యథావిధిగ నుపదేశము నొంది జపించి పునశ్చరణము సరిగాఁ జేసి యనుష్ఠించినవారు కాము

తార్థసిద్ధి నొందుదురు. ఇది కార్యసిద్ధికరమైనమంత్రము. సుఖప్రదమైనమంత్రము. అసమానమయినమంత్రము. అమోఘమయినమంత్రము. ఐకమత్యప్రభావముచేత నేగదా స్థావరములలో స్థావరమైన మట్టిచెట్టునాకులు గుమిగూడి మహాగ్రీష్మకాలమున మధ్యాహ్నసమయమున దుర్నిరీక్ష్యప్రభాభాసమానుఁడగు చండభాస్కరుని సహస్రమయూఖముల నెదిర్చి ధిక్కరించి వాటికిం బ్రవేశంబు నీయక దన్నాశ్రయించినవారికిఁ జల్లనినీడ నిచ్చుచున్నవి? ఐకమత్యప్రభావముచేత నేగదా మిక్కిలి తేలికమై సన్నగాలికి సైతము నెగిరిపోవు గడ్డిపోఁచలు సైతము వెంటిగాఁ బేనినప్పుడు దుర్భేద్యమై మిక్కిలి విజృంభించి యొడలెఱుంగక తిరుగు మదపుటేనుఁగనైన బంధింపఁ గలుగుట? ఐకమత్యప్రభావంబుచేత నేగదా మనుష్యుని నోటి నూదినప్పుడె యెగిరిపోవు చెదపురుగులు నయితే యినుమువంటి టేకుదూలములనుగూడ దొలిచి గుల్లలుచేయుట? ఐకమత్యప్రభావముచేత నేగదా యగ్నిశిఖలవంటి కోరలతో జగద్భయంకరవ్యవహారము సేయు కోడెత్రాఁచునైనను జలిచీమలు వేనవేలు పట్టి పీడించి కదలనీయక మెదలనీయక చంపివేయఁగలుగుట? ఇంకను నైకమత్య మహామంత్రప్రభావముల వర్ణించుట కెన్నో యుదాహరణములు గలవు. కాని యిది సమయము గాదు. కాల మతిక్రమించుచున్నది. ఈమంత్రము శంపం చాతురీమంత్రముకన్న నష్టాక్షరీమహామంత్రముకన్న మంత్రశాస్త్రములోఁ జెప్పఁబడిన సకలమంత్రములకన్నఁ బ్రశస్తమయిన మంత్రము. దీనిని మీరు భజింపుఁడు. ఇంక నిమొక్కౌకై యువృతి మెట్లు వచింపఁగలమని మీరు సందియంపడవచ్చును. అట్లు సంశయింప నక్కఱలేదు. అమృతమూర్తిత్వముల నాయుడుగారలఁ దెచ్చెడ వినుఁడు. నిరపరాధియై, యొకానొకమనుష్యుని దురాత్ముఁడు చంపుటకు వచ్చెననుకొనుఁడు. మహార్తిలో నున్న యామనుష్యుఁడు యాచ

రణంబులకు బ్రొక్కి మీశరణంబు వేఁడి మరణంబు దప్పించుకొనుట కై మీయింట దాఁగును. చంపఁదలఁచినవాఁడు ఖడ్గపాణియై "యో మనుష్యుఁడు నీయింట దాగున్నాఁడా?" యని యడుగును. అప్పుడు సూనృతవ్రతానుష్ఠానము కర్తవ్యమని తలంచి నీయింట దాగియున్న యానిర్భాగ్యునిబట్టి యప్పగించుట మంచిదో లేక భూతదయాళుండవై శరణాగతుని గాచుట యుత్తమధర్మమని తలంచి వాఁడు నా యింట లేఁడని బొంకుటేమంచిదో మీ రాలోచించుకొనుఁడు! ధర్మ సూక్ష్మములు గ్రహించుట మిక్కిలి కష్టము. ఆర్తరక్షణముకొఱకు నాడినయనృతము నరకహేతువుగాదు. అది సూనృతమె యగును. సూనృతముకన్న నెక్కువదై మోక్షప్రద మగును. ఒకవేళ మోక్షము రాదని సిద్ధాన్తము జేయుఁడు—నరకమే ప్రాపించినను నిరపరాధిని రక్షించిన సంతోసముతో నరకమునకుఁ బోవుటే యుక్తము. నేను వాదమునిమిత్త మట్లనుచున్నాను. గాని యీ యనృతము శుభప్రదమే యగును గాని పాపహేతువుగాదు. నరకము, మోక్షము పరమేశ్వరుఁడు మనయుద్దేశములంబట్టి ప్రసాదించును గాని కేవల చేష్టలఁబట్టి కాదు. రాజు నరహంత నొక్కని శిరచ్ఛేదము చేయుమని తలారుల కానతిచ్చును. తలవరులు వానితలఁ ద్రెవ్వ నేతురు. తలవరుల కిందేమిపాపమున్నది? అందు శిరచ్ఛేదము జేసిన వానియుద్దేశము నరహత్యజేయుట గాదు. రాజునాజ్ఞ బరిపాలించుటయే. ఈ తెఱంగుననే ధర్మాధర్మముల నెఱుంగవలయు. నేను సాంగ వేదాధ్యయన ప్రవీణు లయిన బ్రాహ్మణోత్తముల వంశమున జనియించినవాఁడను. క్రతువులు చేసినవాఁడను. శిష్టుండను. సత్యసంధుడనని పేరువడినవాఁడను. అట్టినేనే మానినీప్రాణసంరక్షణార్థ మొక్కయనృత మాడఁదలఁచుచున్నాడను. కావున మీరందఱు నవసరమగునేని నామార్గంబు ననుసరింపవలయునని కోరుచున్నాను. బ్రా

హ్మణులారా! మీరు భూతదయాపరులు; స్వార్థత్యాగులలో నగ్రగణ్యులు; వేదస్వరూపులు. మీరంతఱు వెనుదీయక యత్నె చేయుఁడు. క్షత్రియులారా! మీరు శరణాగత పరతంత్రులు; బాహుబలసంపన్నులు; శౌర్యనిధానులు. శరణుజొచ్చిన పావురంబును రక్షించుటకై తనమేనికండలు తఱిగియిచ్చిన శిబిచక్రవర్తి వంశస్థులు. గరుడునిచే వధింపఁబడుటకు సిద్ధముగా నుండిన నాగకుమారుని ప్రాణములఁ గాచి తాను వధ్యశిలనెక్కి తనప్రాణముల నర్పించినజీమూతవాహనుని వంశస్థులు. ఏకచక్రపురమున భిక్షాటనముచే జీవించుచు బకాసురుని బారినుండి బ్రాహ్మణకుమారుని సంరక్షించి వానికి బదులుగాఁ దనకుమారుని దంపిన కుంతీమహాదేవివంశస్థులు. అనాథరక్షణము మీకుగ్గుపాలతోఁ బెట్టినవిద్య. అభయప్రదానము మీకు వంశక్రమాగతమైనధర్మము. ఆర్తత్రాణము మీకు సహజలక్షణము. కావున మీరు లేనిపోని, సందియంబులు మనంబునం బెట్టుకొనక తొల్లి వాసుదేవుఁడు నిండుచూలాలైన యుత్తరను రక్షించినట్లు మీరీచాళుక్యనరపాలుని ధర్మపత్నిని గావవలయు. శూద్రులారా! మీరు శ్రీమన్నారాయణుని పాదరాజీవములయందు జనించుటంజేసి భువనపావనమైన యాకాశగంగకుఁ దోడఁబుట్టినవాండ్రు. అమరవాహిని మీయింటియాఁడుపడుచు. మీకు నాగలి చేఁబూని దున్నుటంజేసి యీధాత్రికి వసుంధరయని పేరుగలిగె. మానవులకేగాక సకలజంతువులకు నిజముగా నన్నప్రదాత లెవరన్న మీరె. ఎండయనక, వానయనక, చలియనక, మూఁడుకాలములు మేను వంచి యిండ్లు వాఁకిండ్లు వదలి పొలములం జేరి ముక్కారుపంటలు పండించుటంజేసి కాదే యీభూమి పాడిపంటలు గలిగి వర్ధిల్లుచుండుట? పసరములు గడ్డిగాదములు గలిగి బ్రతుకుట? చిలుకలు మొదలగు పులుఁగులు పండ్లుమెసవి జీవించుట. మీవృత్తి శ్లాఘాపాత్రము. జగదుప

కార పరాయణు లన్న మీరే. అట్టిమీరు దిక్కుమాలినయొక్క పడంతిని బ్రోచుటలో వెనదీయుదురని నేను తలంపను. ఈసందర్భమున మీ కొక్కచిన్నకథ వక్కాణించెద. అది మహాభారతమందలి శాంతిపర్వమునం దున్నది. ఎన్నోవిహంగంబులఁ జంపిన కిరాతుఁ డొక్కఁడు వానకుం దడిసి చలిచే గడగడ వడంకుచుఁ జలిగాచుకొనుటకు నెక్కడ నయిన నిప్పు దొరకునా యని యెదురుచూచుచుండ నొక్కపిట్ట నెట్టన దాఁపునున్నపల్లియ కరిగి మండుచున్న యొకపుల్ల నోటం గఱచుకొనివచ్చి వానికడం బాఱవైచె. కొన్ని చిన్నచితుకులు పోఁగుచేసికొని వాఁ డానిప్పు పెద్దమంటచేసి చలికాఁగి పేరాఁకలిచే నకనకం బడుచున్న నదిచూచి సహింపక యాపిట్ట యాయగ్నిలోఁ బడి మృతినొంది వాని కాహారమయ్యెను. మనము మనుష్యులమై జ్ఞానసంపన్నులమై ధర్మాధర్మపరిజ్ఞాతలమై యున్నందుకాపిట్ట చేసినమాత్రమైన స్వార్థత్యాగము చేయవలదా? సకలధర్మములలో భూతదయ యుత్కృష్టధర్మము. దానికెనవచ్చునది మఱియొకటి లేదు. మహానుభావుఁడగు భరతుఁడను రాజర్షి యొక్కజింకం బెంచి దాని నిమిత్తమున మరల జంతుజన్మమెత్తెను. ఇవి యన్నియు లోఁదలంచి యనద యయిన యీరాజపత్నిని రక్షింపుఁడు! ఇంతకన్న నధికంబుగ నేను మీ కేమియుఁ జెప్పఁజాల. కర్తవ్యము మీకే వదలుచున్నాఁడను" అని మనస్సులు కరఁగునట్లు, మేనులు పులకరించునట్లు, హృదయములు నీరగునట్లు, మహోత్సాహము జనించునట్లు పరమశాంతుఁడైన యాబ్రాహ్మణుఁడు దీర్ఘముగ నుపన్యసించుటయు సభాసదు లందఱు నైకకంఠ్యముగ "మేము మీతోడివారమే. మేము మీతోడివారమే. ఆమెను రక్షింపుఁడు! రక్షింపుఁడు!" అని యైకకంఠ్యముగఁ బలికిరి. విభ్రుభట్టసోమయాజి తన వచోబీజములు చవిటిపఱ్ఱలం బడక సుక్షేత్రమునఁ బడియె నని సంతసించి వెండియు

నిట్లనియె. "గ్రామీణులారా, 'సంఘే శక్తిః కలౌ యుగే' యని మహనీయు లయిన ప్రాచీనులు చెప్పియున్నారు. కావున మనమందఱ మేకమై యీమహాకార్యము చేయఁబూనుట శ్లాఘాపాత్రము. మనలో నున్నశక్తి యంతయు రాశీభూతమై కటకనాయకుని పన్నుగడలం బ్రతిఘటించుఁగాక! మీసాయము లేకున్న నిట్టికార్యము తలపైఁ బెట్టుకొనఁగలనా? అగతికులా లయిన యీయతివకు మీసాయము పెట్టనికోటయై వజ్రకవచమై యుండుఁగాక! ఇంక మీరందఱు మీమీగృహములకరుగుఁడు. మీకు నిద్రాభంగము జేసి శ్రమపెట్టినందుకు నన్ను మన్నింపుఁడు" అని పలికి వారి నామంత్రణము చేయ వారు సోమయాజిని బహువిధముల శ్లాఘించి యిట్లనిరి. "మహాత్మా! మీవలన మేము నేఁడు చరితార్థుల మయితిమి. ఇట్టిమహాత్కార్యము మాచేత మీరు చేయించినందుకు మేము మిక్కిలి కృతజ్ఞులము. ముదివేము గ్రామము నేఁడు ధన్యమైనది. ఆంధ్రదేశ మున్నంతకాలము—నాంధ్రమహాజను లున్నంతకాలము—దివాకరనిశాకరులు నభోమండలమున వెలిఁగినంతకాలము—ముదివేముగ్రామము సర్వసజ్జనులకు స్తవనీయమై, దేశచారిత్రమునందుఁ బ్రఖ్యాతమై యితరగ్రామములకు మార్గదర్శకమై, త్రిలింగదేశమునకు సువర్ణాలంకారమై, మీకతమున వెలయుచుండును. గ్రహరాజగు సూర్యునిచుట్టుఁ దక్కిన చిన్నగ్రహములు తిరిగి ప్రభావంతములైనట్లు మేమెల్ల మీచుట్టుం జేరి మీవలన యశోవంతుల మగుచున్నారము. పరమపవిత్రమైన మీచరిత్రము భవిష్యత్కాలమున నాంధ్రదేశస్థులు పఠించి చరితార్థు లగుదురుగాక! ఇంక మేము సెలవుదీసికొనియెదము." అని వీడ్కొని స్వగృహంబుల కరిగి నిద్రించిరి.

అక్కడనే కూర్చుండి విప్రపుంగవుని విపులోపన్యాసమును వీనులవిందుగా వినిన యానచివుఁడు మహానందభరితుఁడై పురజను

లండలు వెడలిపోయినవెనుక సోమయాజిం దగ్గరి వారిపాదములకు నమస్కరించి "మహాత్మా! బ్రాహ్మణుడవన్న నీవే బ్రాహ్మణుండవు. సోమయాజి భగవంతుం డగుశంకరుని యష్టమూర్తులలో నొకమూర్తి యని వేదములు వాకొనుచున్నవి. పరమేశ్వరుని యష్టమూర్తులలో నిజముగానీ వొకమూర్తివి. జన్నములపేరుపెట్టి విత్తంబు నార్జించి నల్లమేకలం జంపి చెవులకుం గుండలంబులం దగిలించుకొన్నంతమాత్రమున మానవుఁడు నిజముగా సోమయాజికాఁడు. మేఁకలం జంపుటచేతనే మానవుఁడు సోమయాజియగునేని మనంబున నక్కటికములేని యక్కటికవాఁడు సోమయాజియగును. కుండలధారణముచే సోమయాజి యగునేని రత్నకుండలభూషితలైన యంగనలు సోమయాజిశబ్దమున కర్హలగుదురు. నిజముగ నీవ సోమయాజివి. భూతదయ కలవాఁడు సోమయాజి. అనాథరక్షణపరాయణుఁడు సోమయాజి. ఆర్తత్రాణపరతంత్రుఁడే సోమయాజి. మహాత్మా! ఇష్టమున్న నెట్టిదుర్బలుఁడైన మహాకార్యంబులు చేయవచ్చునని మీచరిత్రము ఘోషించుచున్నది. నీకు శరీరబలమూ లేదు. ధనమూశూన్యము. వయస్సుచెల్లినది. అయినను నిట్టిమహాత్కార్యము నీమనోబలముచేత నీనీతిబలముచేత నీతపోబలముచేత నీజ్ఞానబలముచేతఁ జేయఁగడంగితివి "క్రియాసిద్ధి స్సత్త్వేభవతి మహతాం నోపకరణే," మహాపురుషుల కార్యసిద్ధి యుపకరణము లక్కరలేకయే వారి సత్త్వగుణసంపదవలననేయగుట నిజము. స్వామీ, నేను మీకు మిక్కిలికృతజ్ఞుఁడను. చాళుక్యరాజపత్నియు మీకుకృతజ్ఞురాలు" అని వాని యౌదార్యాదిగుణములఁ బ్రశంసించి కృతజ్ఞతం దెలుపుచుండ జన్నిగట్టు వానిమాటకడ్డముపోయి "అయ్యా! యిల్లలుకఁగానే పండుగ కాదు. నేనిందుఁ జేసిన దేమియు లేదు. చేతనైనసాయమా మెకుఁ జేయుటకు సంకల్పించితిని ఈసంకల్పమాత్రమున కేనన్నింతకొనియాడవలయునా? తలపెట్టిన కార్య

ముతుదనెగ్గిన వెనుక మీకృతజ్ఞతాదులు దెలుపవచ్చును. కాలగర్భమున నేమి యిమిడియున్నదో యెవరు చెప్పఁగలరు? పరమేశ్వరుఁ డేమి చేయఁ దలంచుకొన్నాఁడో మన మెఱుఁగుదుము? నీవింక నిదురింపఁ బొమ్ము." అని యాతని పంపి తాను నిద్రించెను. అమాత్యుఁడు రాజపత్నికడకుఁ బోయి జరిగినవృత్తాంత మంతయుఁ దెలిపెను. ఆమెయు సంతసించి మంత్రికి బ్రాహ్మణునకుఁ దనకృతజ్ఞతం దెలిపెను.

మఱునాఁడుదయమున సోమయాజియుసోమిదమ్మయు రాజమహిషిం జూడఁబోయిరి. ఆమె లేచి యిరువురకునమస్కరించెను. విష్ణుభట్టు ప్రేమతో నామెనుదీవించి యామెయవస్థనుగూర్చివిచారించి కూర్చుండుమని యానతిచ్చి తాను నెట్టయెదుట గూర్చుండి యిట్టులనియె. "తల్లీ! నాచేతనైనంత సాయము నీకు నేను చేసెద. అవసరమైన నీనిమిత్తము నాప్రాణము లర్పించెద. నీవు భయపడకుము. మాకు బిడ్డలు లేరు. నీవే నాబిడ్డవు. ఈసోమిదమ్మ నీతల్లి. నేనునీకు జనకుండను. భగవదనుగ్రహమున నీకింకసుఖమగునని నేను జెప్పఁగలను. ఎందుచేతనో నాయంతరాత్మ యట్లు చెప్పుచున్నది. బిడ్డా! నీ కొక్కయుపదేశము జేయవచ్చితిని. కటకనాయకుని దండనాథులు వచ్చి నీవెవ్వరని నిన్నడిగెడు పక్షమున నేను విష్ణుభట్టుసోమయాజి పుత్రికనని నీవుచెప్పుము. నాతల్లి చిన్నతనమునందె పోయిన దనుము. ఈసోమిదమ్మ సవతితల్లి యనుము. అమ్మ యీయనృతమాడి ప్రాణరక్షణము చేసికొనవలయు. నేను నల్లె యనువాఁడ. ఇదిసరిగా జ్ఞాపకముంచుకొనుము. భక్తవత్సలుఁడగు పరమేశ్వరుని హృదయంబున నిలిపికొనుము. దేవదేవుని నమ్మినవా రెన్నఁడుఁ జెడిపోవరు. నమ్మనివారిలోఁ జెడినవారున్నారు. మా

నుమ ప్రయత్నము దైవబలమిళితమైనప్పుడు ఫలియించును. కుమారీ! పేదపాఱుఁడ నైననే నింతకన్న నీకేమి చెప్పఁగలను. అంగబలము లేనివాఁడ. అర్థబలము లేనివాఁడ. ఆయుధములు లేనివాఁడ." అనవుడు నాదేవి బాష్పాకులితలోచనయై మెల్లగ నిట్లనియె "మహాత్మా! అట్టి మహారాజు చెట్టబట్టి యట్టి మహావైభవముల ననుభవించి యట్టి బ్రతుకు బ్రతికి తుదకిట్టులైతిని. ఇన్ని గ్రామములు దిరిగినను నేను తలదాచుకొనుట కయిన నెలవు దొరకినది కాదు. ఇట మీరు రక్షింపఁగలిగినను రక్షింపలేకపోయినను నాకు విచారములేదు. ముందుగా నాల్గు దినములు నిర్భయముగాఁ దలదాచుకొనుటకుఁ దావు నొసంగిరి. ఇదియే నాకిప్పుడు మహోపకారముగ నున్నది. అంతియేగాక శక్యమైనసాయము చేయుటకు వాగ్దానమొసంగిరి. ఈదానమే చాలు; అన్నదానముకన్న, వస్త్రదానముకన్న భూదానముకన్న గోదానముకన్న నభయప్రదానము శ్రేష్ఠమయినది. ఏలయన నభయప్రదానమనఁగా ప్రాణదానము. ప్రాణము నిలిచినప్పుడుగదా యన్నవస్త్రములు భూములు గోవులు నుపకరించుట? అదిలేనినాఁడు వీని ప్రయోజనమేమి? ఈయభయప్రదానమునా నుత్కృష్టము బాగుండిన జాళుక్యకులసంతతికినిధానమై నాజీవచరిత్రమునందుఁ బ్రధానాంశమైయుండు. మీరంగబలము నర్థబలము నాయుధబలము లేనివారంటిరి. అంగబలము లేకున్నను వేదవేదాంగబలము కలదు. అర్థబలము లేకున్నను పరమార్థబలముగలదు ఆయుధబలము లేకున్నను మంత్రాయుధబలము గలదు. మహారాజులు మేటిదళములతోఁ జేయలేనిపని రాజ్యతంత్రములతోఁ జేయలేనిపని, యంత్రంబులతోఁ జేయలేనిపని మీరు మంత్రంబులతోఁ జేయఁగలరు. వేలకొలఁది యేండ్లనుండి లేఖ్యాహూఢములు గాని నాల్గువేదంబులఁ గంఠంబున నిలిపి లోకంబు

నం బరిసరింపఁజేసిన మహానుభావులరు. మీపలుకు లమోఘంబులు. మీవంటి మహనీయు లుండఁబట్టి ధర్మంబులు నడచుచున్నవి. వానలు గురియుచున్నవి. పంటలు పండుచున్నవి. ఋతువులు క్రమంబు దప్పక సంచరించుచున్నవి. మీ ప్రారంభములు తప్పక ఫలప్రదములగును. ఇప్పటికయినఁ గొంతపుణ్యము నేఁ జేసికొనఁబట్టి నేను మీయిల్లుఁ జేరితిని. దుఃఖాంధకారమగ్న నయిన నాకు భగవంతుఁడు విష్ణుభట్టుసోమయాజి యనుదీపమును బ్రసాదించెను. మీసాయంబున నేఁ డిపుడే నే నీదుఃఖసముద్రము నీఁదఁ గలనని ధైర్యము గలుగుచున్నది. నేను మీబిడ్డనన్నమాట నిశ్చయము." అని వెండియు నామె యాదంపతులకు నమస్కరించెను. వారిరువురు క్రమ్మర నామె నాశీర్వదించి గృహంబునకుం జనిరి.

కటకక్షితిపాలునియాన శిరమునఁదాల్చి వీరవర్మ కొంతదళంబును దోడుకొని చాళుక్యవల్లభుని ప్రాణవల్లభను వెదకుటకై యామె పోయినదెస ననుసరించి గ్రామగ్రామంబునకుఁ బోవుచు గ్రామవాసులం బిలువనంపి యామెజాడల నరయుచు, ననుమానము దోఁచినపట్ల గృహంబుల శోధించుచు శోధింపవలసిన బ్రతిమాలుకొనఁగ గ్రామస్థులవలనఁ గావలసిన ధనకనకవస్తువాహనంబులు గానుకలు గొనుచు గమ్యస్థానము లేనిపయనము సేయుచుండెను. ఒకనాఁడతఁడు సాయంకాలమున నొకయూరుబయట తోఁటబోఁడ సైన్యమును నిలిపి యొక పీఠముపైఁ గూర్చుండి యొకసైనికునితో మాటలాడుచుండఁ గాళ్ళకు గజ్జలు, మొగమునఁ బట్టెనామములు, నెడమబుజమున మంచితంబుర కుడిచేతిలో ముష్టులు గూర్చిన కఱ్ఱచిరుతలు చంకను జోలి మెడలోఁ దులసిపూసలు గలయొక దాసరి యాతని డాసి జోహారుచేసి యెట్టయెదుట నిలువఁబడెను. అప్పుడు కనుచీఁకటిపడుటచే నతఁడు

వానిని గుర్తింపలేక "నీ వెవ్వఁడవోయి!" యని యడిగెను. "స్వామీ! నా మొగము గుర్తించుటకు వీలులేకపోయిన నాకంఠస్వరమును బట్టియైన నన్నానవాలు పట్టవచ్చునే. నేను మీపాదసేవకుఁడను సింగఁడను — నా" యని వాఁడు బదులు చెప్పెను. "ఓహో! సింగఁడా? పరధ్యానములో నుండి నీకంఠము గుర్తింపలేకపోతిని. వేగులవాండ్రలో నీవలెఁ జిరపరిచితుఁడనైన నన్నుఁ గూడఁ గన్నుఁ బ్రామఁగల నేర్పరి మఱియొకండు లేఁడు. నీవేగు సఫలమైనదా లేదా! ఆమె జాడ లెందైన గనబడినవా!" అని వీరవర్మ వానిం బ్రశంసించి యడిగెను. అనవుడు సింగఁ డిట్లనియె.—"స్వామీ! ఈ దాసరి వేసముదాల్చి నే నామెజాడలు నరయుటకై బికిరమెత్తునెపంబున నెన్నెన్నో పల్లియలు కరిగితిని. ఏపల్లియయందును నామె కనఁబడలేదు. ఆయూరు వెళ్లినదని యీయూరు వెళ్ళినదని చెప్పువారే గాని సరియైన నెలవు చెప్పువా రెవ్వరులేరు. కాని, నేఁ గనిపెట్టిన నూతనవిషయమొక్కటి విన్నవించెద. నేను ముదివేముగ్రామమునకుఁ బోయి బిచ్చమెత్తుచు నొకబ్రాహ్మణునిముంగిట నిలిచి పదములు పాడుచుంటిని. అప్పుడు రమారమి యిరువదియైదుసంవత్సరములు ప్రాయముగల చూలా లొకరితె నాకంటఁ బడియెను. ఆమె వితంతు వని నేనూహించితిని. ఆమె యంతో చక్కనిది. అట్టి పేదబాపనియింట నుండఁ దగినది కాదు. తొలుకరిమెఱుపువలె నొకగదిలోనుండి యొకగదిలోనికిఁ బోవునప్పుడు క్షణకాలమే యామె నాకంటఁబడుటచే మఱియేమియు నామెనుగూర్చి నేఁ జెప్పఁజాలను. ఇదే నా చూచిన విషయము. ఇదే నా యుఱికి వృత్తాంతము. మీఁది దేవరచిత్తము" అనవిని తలయూఁచి యాచియాపతి తెల్లవారుజామునఁ బయనమని సైనికులకుఁ జెప్పి భోజనముచేసి పండుకొని వేకువజామున మేల్కొని

స్సైన్యముగా బైలుదేఱెను. రెండుదినములు పయనముచేసిన పిదప వారు ముదివేముగ్రామముఁ జేరిరి.

వీరవర్మ యూరిబయటఁ జెఱువుగట్టునకు సమీపమునఁ దనగుడార ములం బన్నించి యందు విడిసి గ్రామములో ముఖ్యమయిన బ్రాహ్మణుల ను, క్షత్రియులను, వైశ్యశూద్రులను, బిలిపించి యిట్లనియె "ఈగ్రామ మునఁ జాళుక్యనరపాలునిభార్య యున్నట్లు మాకుదెలిసినది. నేను చండ శాసనుఁడైన కటకేశ్వరుని సేనాపతిని. ఆమెయెచ్చటనున్నదో మీరు పట్టి యప్పగింపవలయును. అప్పగింపరేనిమీమేనులు మీవి కావు మీ ప్రాణములుమీవి కావు. మీయిండ్లుమీవి కావుఇల్లిల్లుశోధించునట్టిశ్రమ మాకు లేకుండముందుగా నాపెందోడ్కొనివచ్చి మాకప్పగింతురేని మీకుబహుమానములిప్పించెద. బ్రాహ్మణులకుమహామహోపాధ్యా యబిరుదంబులిప్పించెద. క్షత్రియులకుఁవీరకేసరి,సరగండభైరవ, ప్రతి పక్షభయంకరప్రముఖ బిరుదంబుల నిప్పించెద. శూద్రులకు, బ్రశ స్తములైనభూములు పన్నులు కట్టకుండ నిప్పించెద. ఇంక నెన్నో యుపకారంబుల జేయించెద. చెప్పుఁడు! వేగము చెప్పుడు?" అని హె చ్చరించు సేనాపతిం జూచి వారైకకంఠ్యముగ నామె తమయూర లేదని చెప్పిరి. "ఏమేమీ! లేదా? ఏయూరను లేక యెందుఁ బో యినది? వియచ్చర లగునచ్చరమచ్చెకంటులు శకుంతలను నెచ్చెలు లనడుమనుండి చెచ్చెర నెత్తుకొనిపోయినట్లు లామెను దివ్యాంగనలు తీసికొనిపోయిరా? తొల్లిచుబామును గరుడుఁడు తన్నుకొనిపోయినట్లు విహంగము లేవియైన ముక్కునం గఱచుకొని యెత్తుకొని తీసికొనిపో యెనా? మున్ను సీతాదేవిని భూదేవి తనగర్భంబునకు లాగికొనిపో యినట్లు లీమెంగూడఁ గొనిపోయెనా? ఏదోయూర నుండవలెఁ గాని మాయమగునా? ఇంక మీయసంబద్ధ ప్రలాపములఁ గట్టిపెట్టి యా

మెం దెచ్చి మాకుఁ గానుకగా నర్పింపుఁడు. దీనికి మీ రొడంబడరేని నే నింతమాత్రముతో మిమ్ము విడిచిపెట్ట. మీమాటలునమ్మి పోవువాఁడనుగాను. మీయిండ్లన్నియు శోధించెద. ఆమె కానంబడినదా మొదట నామెం దాఁచినందుకు, మీదుమిక్కిలి దాఁచి చెప్పనందుకు, మాకు, శ్రమ గలిగించినందుకు, మిమ్ము బహుచిత్రవధలపాలు జేసెద. జాగ్రత్త" యని మిక్కిలిభయపెట్టెను. అప్పుడు విష్ణుభట్టుసోమయాజి కొండవలె నించుకేనియుఁ జలింపక వానికిట్లు విన్నవించెను—"అయ్యా! గృహములు శోధింతునని, చిత్రవధలపాలు చేతునని మమ్ము బెదరించవద్దు. మీయిచ్చవచ్చినట్లు శోధింపఁగొనుఁడు! మా కించుకేనియు భయములేదు. దుష్కార్యములు చేసిన వారికి భయముండును గాని మా కేమిభయము! ఆమె మాకడ లేదు. మఱియొక గ్రామమునకు వెళ్ళి వెదకికొనుటమంచిది. లేదా మమ్ముఁ జంపుటయే మీకుఁ బ్రధానమైనపక్షమున నిదిగో నాతల మీరు కానుకగాఁ దీసికొనుఁడు." అని మహాధైర్యముతోఁ బలికిన యమ్ముదుసలి పలుకుల నాలకించి వీరవర్మ యచ్చెరువడి "సరే! నేఁటికి సాయంకాలమైనదిగదా! రక్తసిక్తాంగముతో మీచాళుక్యవల్లభుఁ డస్తమించినట్లె భాస్కరుఁ డస్తమించుచున్నాఁడు. రేపుదయమున మీగ్రామము శోధించెద. సైనికులారా! ఈయూరినుండి యొకపిట్టయైన నీరేయి దాటిపోకుండ నాలుగుమూలల మేటినెగళ్లు వేసికొని కనులుమూయకుండ నలుజాములు కాచికొనియుండుఁడు. ఈ నెగళ్ళకుఁ గావలసినపుల్లలు మీమీగృహములనుండి పురజనులుపంపుఁడు!" అనియానతిచ్చెను. గ్రామీణులు వానికడ సెలవుగైకొని యిండ్లకుఁబోయి తాము సిలువవేసికొనియున్న వంటకట్టియల మోపులుమోపులుగాఁ దెచ్చి సైనికులు బడవేయుచున్నచోట్లఁ బడవై

చిరి. గ్రామవాసులలోఁ గొందఱు భయపడి "మన మూఁడుపేరేఱుఁ గనియొకానొక ర్తనిమిత్తము మాన ప్రాణములఁగోలుపోవనేల? అలుబిక్షలతో సన్న్యాసులము గాముకదా! చేయలేసిధర్మము సమకట్టి సళించుట యేటిపాడి!" యని యధైర్యమునఁ దమ మిత్రులతోనఁ జొచ్చిరి. ధైర్యశాలురగుమిత్రులు వారిమాటలను ఖండించి మొదటఁ జేసినబాసకుఁ గట్టువడి యుండఁదగు ననియుపదేశించిరి. దైవముమీఁద భారమువైచి గ్రామస్థు లారేయి తిన్నగా భుజింపక నిద్రవోవక తోఁచక యిటునటు దిరుగుచుఁ గాలక్షేపము చేయుచుండిరి. సైనికులు వంటకట్టియలతో గ్రామమున నలుదెసల నెగళ్ళువైచి మహోత్సాహముతో నిటునటు దిరుగుచుండిరి. తనకతమున ధర్మాత్ముఁడగు బ్రాహ్మణోత్తమునకు మదివేము గ్రామవాసులకు నేమియాపద మూఁడునో యని రాజపత్ని కంటిమీఁదఁ గును కులేక తెల్లవాఱినదాఁక బెంగపెట్టుకొనియుండెను.

ఎట్టకేలకుఁ దెల్లవాఱెను. గ్రామవాసులు గుండెలు చేతఁ బట్టుకొనియుండిరి. చలిగాలివలె భయ మెల్లవారిని గడగడ వడఁకించెను. వీరవర్మ సూర్యోదయానంతరమున మేల్కని కాల్యకృత్యములఁ దీర్చుకొని ఫలాహారముచేసి యశ్వారూఢుఁడై సైనికులు కత్తులు బల్లెములు విండ్లు నమ్ములు బూని తనవెంట భయంకరాకారులై రా, గ్రామమంతయు నొక్కసారి తిరిగెను. చిచ్చులపిడుగులవలె నాతఁ డెవ్వరియింటిమీఁదఁబడునో ముందుగా నెవ్వరిగృహము నాశనముచేయునో యని యెల్లవారు భీతచేతస్కులై యాతనివంకఁ జూచుచుండిరి. దాసరివేసము ముందు దాల్చినసింగఁ డావేసముం దీసి జోదువలెఁ గటారి చేతఁబూని ముందునడుచుచు వీరవర్మకు దారిఁ జూపి విష్ణుభట్టసోమయాజిగృహంబునకుఁ దోడ్కొనిపోయి

యిదే యాగృహమని చెప్పెను. వీరవర్మ గుఱ్ఱము దిగి సోమయాజిం బిలిపించి "నీయింటఁ జాళుక్యరాజపత్ని యున్నట్లు మాకనుమానముగా నున్నది. నీగృహము శోధించెదవు. ఇందుకు నీ వేమందువు!" అనియడిగెను. "మీరాయిచ్చవచ్చినట్లు శోధింపుఁడు. మహాధికారము చేతఁబూనిన మీవంటిప్రభువులతో నేనింతకన్న నేమి చెప్పఁగలను? దైవగతి యెట్లో యట్లు సిద్ధించుఁగాక!" యని బ్రాహ్మణుఁ డూరకుండెను. వీరవర్మ సైనికులం గొందఱఁ దోడ్కొని మాటుమాటాడక గృహముంజొచ్చి గదియు దొడ్డియుఁజూచి పిమ్మట వంటయింటి కరిగెను. అత్తఱి నాదేవి యుచ్చటనే తలుపుచాటున నొదిగి నిలువఁబెట్టినబంగారుబొమ్మవోలెఁ దల వంచుకొని గోడకుం జేరఁబడియుండెను. ఆమెలావణ్యము సౌకుమార్యముఁ జూచి వీరవర్మ యచ్చెరువడి "ఆమెయెవ్వతె!" యని విష్ణుభట్టు నడిగెను. "అయ్యా! ఆమె నాకూఁతురు. ఈనడుమనే యామెభర్త మృతినొందెను. నిండుచూలు దాల్చియున్నది." యని యతఁడు బదులు చెప్పెను. "ఏమయ్యా, బ్రాహ్మణుఁడా! ఈబూటకము లెక్కడ నేర్చితివి? పోతవోసిన పదియాఱువన్నెబంగారువంటి శరీరచ్ఛాయ గలిగి కొంచిలచినను జేరలకు మీఱి తమ్మితేకులంబోలుకన్నులు గలిగి మహాదుఃఖసముద్రమున నుండియుఁ దనలావణ్యమును గోల్పోక చూపఱకన్నులకు విందు సేయుచున్న యీయిందువదన నీకూఁతురా? నీచికిలికన్నులకు నీబుఱ్ఱముక్కునకు నీబడుగుమేనునకు నీదొప్పచెవులకు నీవంకటటింకరకాళ్ళకు లోకోత్తరసుందరియైన యిటువంటికూఁతురు జనించెనని నీవు చెప్పినను నమ్మువా రెవ్వరు? మసిబొగ్గులోనుండి మానికము పుట్టఁగలదా? చాలుచాలు! ఈమెయెవరో నిజము చెప్పు. లేకున్న నిప్పుడే కొఱత సేయించెద." అని కఠినస్వరముతో నాసేనాపతి మహీసురుని మందలించెను.

నాఁపుడు విష్ణుభట్టు వీరవర్మబిభీషికలకు వెఱ పింతయు లేక యిట్లుత్తరము జెప్పెను. "అయ్యా! నాయంశమునకుఁ జందమునకు నిట్టిచక్కనిచుక్క పుట్టునంటివి. తల్లిం బోలినయాఁడుబిడ్డ లుండరా? ఇది నాప్రథమభార్యకూఁతురు. ఈమె జనియించిన మైదవనాఁడె యామె స్వర్గస్థురాలయినది. ఈసోమిదమ్మ నా రెండవభార్య. ఈమె వలన నాకు సంతానములేదు. ఈబిడ్డతల్లి మిక్కిలి సుందరాంగి. ఈమె తల్లినోటనుండి యుట్టిపడిన ట్లున్నది. ఈమెను నామేనల్లున కిచ్చి వివాహము చేసితిని. అతఁడీనడుమనే కాలధర్మము నొందెను. చక్కనిపడంతులు రాజకులంబుననే గాని యొండుచోట్ల బుట్టరని మీయభిప్రాయము కాఁబోలు! మహారాజాంతఃపురములయందే గాక పేదలగుడిసెలలో సైతము చక్కనివాండ్రు జనియించుచుందురు. చూపులకు విందులు సేయుచు సౌరభంబుల దెసల వెదజల్లెడుమనో హరపుష్పములు ప్రమదావనంబులయందె గాక మహాటవులయందు ను జనించుచుండును. మేను పులకరింపఁ జేయుమందమారుతములు పుడమిఱేఁడుల మేడలనేగాక పేదలయాకుటిండ్లకడ నయితము వీచు చుండును. మసిబొగ్గునందు మాణికములు పుట్టునో లేదో నే నెఱుఁ గను గాని యారెండును నొక్కజాతిపదార్థమే యని శాస్త్రవేత్తలు చెప్పుదురు. పదియాఱువన్నెపసిఁడి మంటిలోఁ బొడముడు. నేత్ర పర్వము జేయు తామరపువ్వు బురదలోఁబుట్టును. ప్రపంచమునంగలి వైచిత్ర్యములు వర్ణనాతీతములు. చంద్రవంశపురాజులకువంశకర్తయు యిన దండితారాతి యయాతి బ్రాహ్మణులలో శుక్రాచార్యునినందన యగు దేవయానిని వలచి యామెను వివాహమాడుట యుధర్మమయి నను భార్గవునియనుమతంబు వడసి చేపట్టెను. అనేకవిలాసినీసమన్వితు డయినయారాజును బ్రాహ్మణకన్యయేసుమీ వలపించినది. అదియునుఁ గాక త్రిలోకాధినాథుఁడయిన దేవేంద్రుని వలపుమునిపట్టిలో మంచి

తనయింటికోడిం జేసి కూయించిన దెవ్వతెయో యెఱుంగుదువా పరమచాందసుఁ డయినగౌతమునిభార్య యహల్య బ్రాహ్మణకన్య చక్కఁదనము రాచవారికొనాచి గాదు. అదియెల్లవారలకు సామాన్యమైనసొత్తు. అనాథ యయినయీబాలిక నాగారాబుకూఁతు రగునో కాదో యని నీకుసందియ మున్నపక్షమున గ్రామీణు లందఱం బిలిచి యడుగుము. దుస్సహమయిన స్వపవైధవ్యఖేదమున మఱుఁగుచున్నయీబిడ్డను నీవంటిలోకజ్ఞుఁడు కర్ణకఠోరము లైనయీ పలుకులతో నొప్పించుట పాడిగాదు నేను పరమచాందసుఁ డగు బ్రాహ్మణుఁడను. ఆమె యనాథ; చూలాలు. కావున నిట్టిదయనీయుల మయినమమ్ము బాధింపక వెడలి పొమ్ము."

అప్పలుకులు వినినతోడనే వీరవర్మమనంబున సందియముతోఁచెను. సాహసించి యేకార్యము జేయఁగూడ దనియు, నవివేక మనేకాపదల కాస్పద మనియు నతనికిం దట్టెను. అప్పుడు బ్రాహ్మణుఁడు చెప్పినప్రకార మాతఁడు గ్రామవాసులం బిలిపించి యాబాలిక యెవ్వరని వారి నందఱ నడిగెను. వారందఱు నేకకంఠ్యముగా 'నీకు మా సోమయాజికూఁతురే' యని పలికిరి అప్పటికిని వానికి సందియము దీరమి విష్ణుభట్టుం జూచి యిట్లనియె. "ఆర్యా! ఈమె నీకూఁతు రయినపక్షమున నా మెచేతినీరు నీవు త్రావుము. అప్పుడు నాసంశయవిచ్ఛేద మగును." అనవుడు బ్రాహ్మణుఁడు సంతోషముతో "నాయనా! నాకూఁతురుచేతినీరు ద్రాగుటకు నాకు సంశయమేముండును?" అని రాజపత్నిం జూచి "బిడ్డా! ఆపంచపాత్రతో మంచితీర్థము దెచ్చి నాకిమ్ము" అని యానతిచ్చెను. అవస్థకుం దగినట్లు నడచుకొనినఁగాని కార్యసిద్ధి గాదని దేశకాలంబుల నెఱిఁగిన యా దేవి తక్షణమే స్వహస్తముతో విష్ణుభట్టునకుఁ బానీయంబులు తెచ్చి యిచ్చెను. బ్రాహ్మణుఁడు తనలో "పరమేశ్వరా! ద్వితీయ

వర్ణంబునం బుట్టినయీబాలికచేతినీరు నేను ధర్మకార్యార్థమై యాపద్ధర్మముగా గ్రహించుచున్నాఁడ. గావున నే నిందు దోసంబు గావించిన నీవ క్షమింపవలయు. ఉషస్థి యనుబ్రాహ్మణుఁడు పేరాఁకలిచేఁ బీడింపఁబడి మాలవానికడనుండి గుగ్గిళ్ళుదిని ప్రాణంబు నిలుపుకొనియె నని యుపనిషత్తులలో వర్ణింపఁబడియున్నది. అట్లు చేసినను నతఁడు తనబ్రాహ్మణత్వమును గోల్పోవలేదు. అటే నాకును నట్టి వెలితియు గలుగకపోవుఁగాక!" యని ప్రార్థనము జేసి యామెచేతి పంచపాత్ర నందుకొని యానీరు గడగడ ద్రావెను.

దానితో వీరవర్మసందియము దీరెను. "ఈపని చాలునా, మఱియేమయినదృష్టాంతరము కావలెనా?" యని విష్ణుభట్టు వెండియు వీరవర్మ నడిగెను. "అయ్యా! చాలు చాలు! నాసందియములు తీరి పోయినవి. ఆమె క్షత్రియాంగన యయినపక్షమున ననేకక్రతువులు చేసిననీవంటి ఛాందసుఁడు కోటివరాలిచ్చినను నామెచేతినీరు ద్రావఁడు నిష్ఠాగరిష్ఠుఁడయినబ్రాహ్మణశ్రేష్ఠుఁడు ప్రాణత్యాగమున కయిన నొడంబడునుగాని స్వధర్మత్యాగమునకు సమ్మతింపఁడు ఈమె నీ కూఁతురే యని నా కిప్పుడు నమ్మిక కలిగినది. అనూచానుఁడవు, పరమపూజ్యుఁడవు. నిర్మలచరిత్రుఁడవు నయిననిన్ను నే నవివేకంబున ముసుముందు దూలనాడితిని. మేము పరులకు శరీరంబుల నమ్ముకొన్న సేవకులము. కావున మాధర్మము నిర్వర్తించునప్పుడు నిష్ఠురోక్తుల నాడవలసివచ్చును. అందుకు నన్ను మీరు క్షమియింతురుగాక! నా కింక సెల వొసంగుఁడు. ఇదే మీకు నమస్కారము." అని శాంతముతోఁ బలికి బ్రాహ్మణునకు వినతులుచేసి సపరివారముగా నాయూరు విడిచి పోయెను. అతనితోడనే గ్రామీణుల భయము పోయెను! చాళుక్యరాజపత్నికి దిగులు దీరెను. విష్ణుభట్టువిచార మడఁగెను. సోమిదమ్మ సుముఖి యయ్యెను. గ్రామీణు లందఱు

విష్ణుభట్టుయొక్క యుదారభావమును, సమయస్ఫూర్తిని, ధర్మపర తను వేయితెఱంగులఁ గొనియాడిరి. అమాత్యుఁడు విష్ణుభట్టునకు నమస్కరించి కౌఁగలించుకొని చేతులు పట్టుకొని "స్వామీ! చాళుక్యవంశము మరల నిలిపితిరి. మీయౌదార్యము శ్లాఘాపాత్రము. పరమభాగవతుఁడవైన నీయందు క్షత్రియులయందుఁగూడ మృగ్యంబగు ధైర్యలక్ష్మి సాక్షాత్కారమున్నది. ఇంక మేమెల్ల బ్రతికితిమి" యని బహువిధముల బ్రశంసించెను.

రాజపత్ని సోమయాజియెడ, సోమిదమ్మయెడ నింతింత యనరానిభక్తి గలిగి తనకృతజ్ఞతం దెలిపి తనమెడలోనున్న వెలలేని ముత్యాలహారము దీసి విష్ణుభట్టుకంఠమునం బడవైచి యది స్వీకరింపుమని కోరెను. విష్ణుభట్టు దానిం దీసి మరల నామెమెడలోనె వైచి "తల్లీ! ఈహారమునకు నాకంఠము తావు కాదు. నాకంఠములో నుండిన నది చిలుకకొయ్యకుఁ దగిలించినట్లై శోభావిహీనమై యుండును. ఏవస్తు వెక్కడ నుండవలెనో యక్కడనే యుండవలెను. స్థానభ్రంశముచేతఁ గొన్నిపదార్థములు శోభింపవు. మాకు స్ఫటికాక్షసూత్రములు రుద్రాక్షమాలికలు ధరింపఁదగినవి. ఇది గాక యీ బహుమాన మందుకొనుటకు నేను నీకుఁ జేసినమహోపకారము లేదు. విపన్నులఁ గాచుటలో నేను మానవధర్మమునే నిర్వర్తించితిని. అందుచే ననేట్టి పారితోషికంబునకుం దగను." అని యామెవేఁడుకోలు నిరాకరించెను. బ్రాహ్మణోత్తముని నిస్పృహతకు యోగ్యతకు రాజపత్ని యాశ్చర్యపడి యిట్టిబ్రాహ్మణోత్తము లక్కడక్కడ నుండుటచేతనే భరతఖండము లోకంబునఁ బ్రసిద్ధిగాంచె నని తనలో ననుకొని ముమ్మాటి కాయనకు నమస్కరించి యూరకుండెను.

విష్ణుభట్టు పండితుఁడయ్యు రాజపత్నికి, మంత్రికిఁ, బరివారమునకుఁ గావలసినభోజనపదార్థములన్నియు నెట్లో సమకూర్చుచుం

డెను. అది చూచి యాదేవి విచారపడి మంత్రిం బిలిచి యిట్లనియె- "అయ్యా! సోమయాజిం జూడ నా కెంతయు జాలి గలుగుచున్నది. ఆయన కడుపేదవాఁడు ఆలుమగఁడు గలిసి వా రిద్దరే యున్నారు. నేను, నాపరివారముతోఁ గలిసి పెక్కండ్రున్నాము. ఇద్దరుగలకుటుంబమే భరియించుకొనుటకుఁ గష్టపడుచున్న యామహాత్మునిపై మన భారముగూడ వయిచి కృంగఁదీయుట ధర్మముగాదు. మన కీబోయలతోఁ బనిలేదు. పరిజనులతో నంతకన్న బనిలేదు. వారిని వారివారి యిండ్లకుం బనుపుము. నీవును నీనిమిత్తమై పరితపించుచున్న నీయాలుబిడ్డలకడ కరిగి సుఖింపుము. నాకొఱకై యీవఱకుఁ బడినచిత్తక్షోభము దేహశ్రమయుం జాలును. ఎంతకాల మీమందభాగ్యురాలికొఱకై నీయాలుబిడ్డల వియోగదుఃఖముపాలు చేసెదవు! ఎంతకాల మీయదృష్టహీనురాలికొఱకు సంసారసుఖములకుఁ బాసి మేనుగాసి జెందించెదవు! ఎంతకాలము నాకొఱకు దుర్భరమైన విదేశవాశము సలిపెదవు! నాకెంత మేలు చేయవలయునో యంత మేలు చేసితివి. చేరువనున్న పట్టణమునకు నాముత్యాలహారముం గొనిపోయి విక్రయించి యీబోయలకు నీపరిజనులకుఁ దలకొకనాలుఁగువఱహాల చొప్పున నిచ్చి పంపుము. వారు నానిమిత్తము మిక్కిలి శ్రమపడి నందుకుఁ బ్రస్తుతావస్థలో నింతకన్న నెక్కువబహుమానము నొసంగఁజాల. తక్కినసొమ్ము దారిబత్తెమునకు నీవు గ్రహింపుము."

అని రాజపత్ని యానతిచ్చుటయు నమాత్యుఁడు విచారముతో నిట్లనియె—"తల్లీ! ఇతరప్రేమ లన్నియు దేశభక్తికి రాజభక్తికిఁ దీసిపోవును. రాజుసొమ్ము చిరకాలము దిని సమయమువచ్చినప్పు డాతనికొఱకు, నాతనియాలుబిడ్డల కొఱకుఁ బ్రాణముల నొసంగక మేను దాచుకొనువాఁడు పరమనీచుఁడు. సజ్జనగర్హితుఁడు. వాఁ డుభయలోకములకుం జెడును. నాయాలుబిడ్డలం జూడవలె నని నాకు లేదు. అ

యినను మీయాజ్ఞ నుల్లంఘింపఁగూడదు గావున నేనొక్కపనిచేసెద. నాకుటుంబమును దెచ్చి యీయూరనె కాపురముపెట్టెద. మీరు సుఖప్రస వమగువఱకు నిందుండెద. కుమారుఁడు గలిగెనా యతఁడు యుక్తవ యస్కుఁడగువఱకు నిందే యుండెద. కుమారిక పొడమెనా యాపె సంప్రాప్తయౌవనయై తగినవరుని జేపట్టువరకు నిందేయుండెద. నాకుఁగల భూములమీఁద వచ్చు ధాన్యమునా కుటుంబపోషణమునకు సరిపోవును. అవి తెచ్చుకొని యిందే తిని యిందేయుండి మీపాదసే వయు దైవానుగ్రహమున్న పక్షమున నీచిన్నిరాజు సేవయుఁ జేసెద. ఇందుకు మీరు సెలవొసంగవలయు." అని వేఁడుకొన వానివిన్నప ము నామె విష్ణుభట్టసోమయాజి కెఱిఁగించి యతని సమ్మతిబడసి యమాత్యుఁడు సకుటుంబముగా నందుండుట కంగీకరించెను.

అనంతర మతఁడు ముత్యాలహారముగైకొని రాజపత్నీకంఠా భరణమును గాలవైపరీత్యమునఁ దనచేతితో నమ్మవలసివచ్చినందుకు విషాదమునొంది దాపుననున్న యొకపట్టణంబునకుం జని రత్నపరీ క్షానిపుణులగు బేహారుల కది చూపి తగినవెలకు విక్రయించి యా మొల్లంబు దెచ్చి యామె యాజ్ఞప్రకారము సేవకులకుఁ బారితోషికము లొసఁగి రాజపత్ని జాడ లెవ్వరికిం దెలి యనీయవల దని నొక్కిచెప్పి ప్రమాణములు చేయించి వారివారి నివాసముల కంపెను. ఆమఱునాఁడు తానును దేవికడ సెలవుగైకొని యామెను పలుతెఱంగుల విష్ణుభట్టునకు సోమిదమ్మకు నప్పగించి బైలుదేరి రహస్యముగ రాజధానికరిగి పరాక్రాంతమైన యాపట్టణ ముం జూచి దుఃఖించి యర్ధరాత్రమునఁ దనకుటుంబమును వెంటఁ బెట్టుకొని యూరుదాఁటి మెల్లమెల్లగఁ బయనములుచేసి ముదివేము జేరెను. ఆతఁడు రాకమునుపె విష్ణుభట్టొకయిల్లుసిద్ధముచేసి సకుటుం బముగా నతని నందుఁ బ్రవేశపెట్టెను. అనుదినము నయ్యమాత్యుఁడు

బ్రాహ్మణునియింటి కరిగి రాజపత్నిని దర్శించుచుండును. ఆతని భార్యయుం బిడ్డలుఁగూడ రాజపత్నిని బహువిధముల సేవించుచుండిరి. ఆదేవియుఁ దనవలన బ్రాహ్మణునకు నెట్టివ్యయము లేకుండఁదన చిన్నిచిన్ని వస్తువుల విక్రయింపఁబనిచి యాసొమ్మునఁ దనకుఁ గావలసినపదార్థములఁ దెప్పించుకొనుచుఁ గాలక్షేపము చేయుచుండెను.

రాజపత్నికిఁ గ్రమక్రమంబున నెలలు నిండెను. గర్భభారమధికమయ్యెను. ఒకశుభముహూర్తంబున నామె ప్రసవించెను. అతిసుందరుఁ డగుకుమారుఁడు జనియించెను. వానిమేనికాంతులతో గదియెల్ల వెలుఁగఁజొచ్చెను. పుట్టినప్పుడే విష్ణుభట్టు నుద్దేశించి కావుకావు మని వేఁడుచున్నాఁడోయన్నట్లు కావుకావు మని మనోహరస్వరముతో నేడ్చెను. సోమిదమ్మ శ్రద్ధాభక్తులతో నేడవనాఁటివఱకు కన్నమ్మకథ జెప్పి బాలారిష్టదోషములు గలుగకుండఁబ్రయత్నించి పథ్యపానములు సరిగ నడిపెను. పురుడు సలక్షణముగా వెళ్ళెను. మహారాజుగారు జీవించియున్నపక్షమున నఖండవైభవముతోఁ బుత్రోత్సవము జరిగించి జాతకరణనామకరణములు మిక్కిలి యెక్కువసంతోషముతో జరిగియుండు ననియు వారు లేకపోవుటచే నది పేదరాలి పురుడువలె జరుగుచున్నదనియు రాజపత్ని మిక్కిలి విచారించెను. విష్ణుభట్టు పదునొకండవదినమున బాలింతరాలిని స్నానముచేయించి బాలకునకు క్షత్రియకుమారోచితమయినజాతకరణము జేసి యామె యిష్టమువచ్చినపేరు పెట్టుకొమ్మని చెప్పెను. అప్పుడాదేవి యిట్లనియె "తండ్రీ! యీబాలకుఁడు నీకతంబున బ్రతికినాఁడు. వానికిని నాకును నీవ ప్రాణప్రదాతవు. కావున నీపేరే పెట్టవలె నని నాసంకల్పము." అని తనయభిప్రాయము దెల్పినయాదేవికి సోమయాజి యిట్లనియె. "బిడ్డా! నేను పేదవాఁడను అనామకుఁడను నాపేరు పెట్టనేల? నీతండ్రి పేరో బాలకునితాతపేరో మఱి యేదేవునిపేరో పెట్టుము నావంటి

యనామకునిపేరు పెట్టినందువలన నేమి ప్రయోజనము? విక్రమశాలుఁరగుబాలురకుఁ బిఱికిపంద లగుబ్రాహ్మణులపేరు పెట్టఁగూడదు.

అది విని రాజపత్ని వెండియు నిట్లనియె "తండ్రీ! నీవు పిఱికి పందవు గావు. మహాధీరుఁడవు శూరుఁడవు. ఖడ్గము చేతఁబూని పగతు అని పేరువెట్టి మనుష్యుల సంహరించినవాఁడే శూరుఁడుగాఁడు ఇండ్లు కాల్చి నరుల హింసించి గ్రామములు దోఁచుకొన్నంతమాత్రముచేత మనుష్యుఁడు శూరుఁడు గాఁడు. నీకున్న శూరత్వ మెవరికిని లేదు. ఎంతో మహాపద రాఁదలఁచుకొన్నను దానిని నిర్భయముగాఁ దలయొగ్గి నన్ను నీకడుపులోఁ బెట్టుకొని కాపాడితివి. మే మెందఱినో వేఁడుకొంటిమిగాని ధైర్యము చాలక వారు మమ్ము తమయూరు నుండి పాఱఁదోలిరి. కావున నీవంటిశూరులు మహాతేజశ్శాలురమని విఱ్ఱవీగు రాజులకన్న నధికులు ప్రశంసనీయులు. ఈవిషయమున నామనవి నాలకించి నాముద్దు సెల్లింపుము. ఈశిశువు నీవలనబ్రతికెం గావున విష్ణువర్ధనుఁ డనిపేరువెట్టెదను. వానినామమున నీనామముకలిసి యుండవలయును. విష్ణుభట్టుచే వృద్ధినొందినవాఁడు విష్ణువర్ధనుఁడు. ఇది నాకృతజ్ఞతాసూచకము. ఈసూచన పీనినామమందేగాదు. దైవానుగ్రహమున వీఁడు బ్రతికి బాగుండెనా నీవుచేసినమహోపకారము తరతరంబులకు జ్ఞాపకముండునట్లు వీనివంశస్థు లందఱు విష్ణువర్ధనుఁడనుబిరుదు గ్రహింతురుగాక! ఇదిమాతృశాసనము. మహాపతివ్రతాశాసనము. ఇది కృతజ్ఞతాప్రేరితము. ఇది తత్కారణమున నవిలంఘనీయము. అనాధనై యగతికనై నేఁడు నే నీతాటియాకులయింటిలోఁ గూర్చుండి చేసిన యీశాసనము నాకుమారుఁడు వానికుమారులు వారికుమారులు వారిమనుమలు మాణిక్యకిరీటములకన్న మున్నుగాఁ దమశిరంబుల దాల్చి మన్నింతురుగాక! అట్లు మన్నింప రేని యాది.

మహాతన్నైననేను వ్యర్థప్రతిజ్ఞనగుదును. చాళుక్యవంశము ప్రపంచము న్నంతకాలము తద్వంశస్థులగు రాజులందఱు విష్ణువర్ధనులె యగుదురు గాక! ఇతరనామములు వారికెన్ని యున్నను నితరబిరుదము లెన్ని యున్నను విష్ణువర్ధనసంజ్ఞ వారికుండితీరవలయు. తండ్రీ! నీవు నావలన లవమైన ధనము గ్రహింపనైతివి. నేను నీ కేయుపకారము జేయఁజాలను. నీవు నా కనేకోపకారములు చేసితివి. నీపేరు పెట్టుకొనునట్టివరము గూడ నిచ్చి యీమహోపకారముగూడ జేయుము. ఈతఁడు విష్ణువర్ధననామధేయుఁ డగుఁగాక!" అని యామహాత్మునకు ముమ్మాఱు ప్రదక్షిణము జేసి చేతులు జోడించి నెన్నుదురు వానియడుగుదమ్ముల సోఁకునట్లు నమస్కరించెను. మనస్సు నీరయిపోవ బ్రాహ్మణుఁడు బాష్పపూరితనేత్రుఁడై రాజపత్నిని పాదములపైనుండి లేవఁదీయుమని సోమిదమ్మతోఁ జెప్పి యామెయట్లు సేయ "బిడ్డా! నీ కింతయుత్సాహమున్నప్పుడు నేనది నివారింపఁజాల! నీయిచ్చవచ్చినట్లు సేయుము" అని వానికి విష్ణువర్ధనుఁ డని పేరుపెట్టెను.

బాలుఁడు శుక్లపక్షచంద్రుఁడువలె క్రమక్రమమున వృద్ధి బొందఁజొచ్చెను. మూఁడవనెలలోఁ జిఱునవ్వులు మొలకలెత్తెను. నాల్గవమాసమునఁ జూపులు నిలుకడగాంచెను. ఆఱవమాసమునఁ దంతములు పొడసూపెను. ఏడవమాసమున విద్దెములు చేయసాగెను. అనంతర మన్నప్రాశము జరిగెను. పదిమాసములు నిండునప్పటికి బాలకుఁడు తప్పటడుగులిడనారంభించి పదునొకండవమాసమున నడచెను. తొమ్మిదవనెలనుండి చిన్నచిన్నమాటలు నేర్చి సంవత్సరము దాఁటఁగానే చిలుకపలుకులు పలుకఁజొచ్చెను. ఒక్కొరకన్నఁ దీయనయినయప్పలుకులు విని విచారాంధకారమును దొలఁగించు నా చిఱునవ్వువెన్నెలలు జూచి యానందించుభాగ్యము మహారాజునకు లేకపోయెనని యామె పలుమాఱు విచారించి యిరువురమానందము దానేయనుభవింపఁజొచ్చెను. బాలకుఁడు సోమయాజిని దాఁ...

యనియు సోమిదమ్మ నవ్వ యనుచుఁ బిలుచుచు బిడ్డలు లేకతపించుచున్నవారిసంసారమునకు వికాసము గలిగించెను. కాలక్రమంబున బాలకుఁడై దేండ్లవాఁ డయ్యెను. సోమయాజి వాని కక్షరాభ్యాసము జేసి చదువుచెప్ప నారంభించెను. ఆకుమారుఁడు కుశాగ్రబుద్ధియై గురువుపదేశించినదంతయు క్షణములో గ్రహించి తల్లికి మహానందము గలిగించెను. ఆయూరనె వారిం గనిపెట్టుకొనియున్న యమాత్యుఁడు బాలకునకు క్షత్రియకుమారులం జతగాఁగూర్చి విల్లుమొదలగుశస్త్రములయందు వానిచేతఁ బరిశ్రమచేయించెను. శాస్త్రవిద్యలయం దెంతయభిరుచి యాతనికిఁ గలిగెనో శస్త్రవిద్యయందు నంతటియభిరుచియే వానికి జనించెను. పదియాఱేండ్లప్రాయము వచ్చునప్పటి కతఁడు శాస్త్రములయందు, ధనుర్వేదమునందు, మిక్కిలి నేర్పరియై యెల్లవారలచేత మెప్పు వడయఁజొచ్చెను. ఆయూరిలోనుఁ జుట్టుప్రక్కలనున్న రాజకుమారులను శూద్రబాలకులను వెంటఁబెట్టుకొని ఘాతుకమృగంబుల వేఁటాడిచంపి గ్రామంబులపైఁ బడి దోచుకొనుబందిపోటులను దారులుగొట్టుదొంగలను నిరోధించి వధియించి యాప్రాంతము నిష్కంటకముగఁ జేసెను. ఆబలంగమునే క్రమక్రమముగ నధికముజేసి తానువసియించుప్రాంతమునకుఁ దానె రాజై క్రమక్రమంబునఁ బెచ్చుపెరిగి విజయంబుపైవిజయంబునొంది కోటపై కోట నాక్రమించి యదృష్టముపై నదృష్టము కలిసి రా మహాసైన్యముం గూర్చుకొనియెను.

కటకేశ్వరుఁడు కన్నుదెఱచి వానిం దండించుటకు మహాసేనాసమేతుఁడై వచ్చెను. నవయౌవనోద్దీపితుఁడైనవిష్ణువర్ధనునకును జరమావస్థలోనున్న కటకేశ్వరునకును మహాసంగ్రామము జరిగెను. విష్ణువర్ధనుఁడు తన జనకునిం గడతేర్చి దేశమంతను మంగలంబునం బెట్టి వేసిన తెలుంగరాఁ గటకేశ్వరుని రణముఖంబున స్వహస్తముతోఁ జయించి పగసాఱ్ఱము దీర్చి కృతకృత్యుఁ డయ్యెను. కృష్ణా

# కర్పూరమంజరి

## మొదటి ప్రకరణము

" ఆహాహా! జన్మస్థాన వియోగ దుఃఖము దుస్సహముగదా! ఆలుబిడ్డల, నన్నదమ్ముల, నాప్త బంధుమిత్రుల, విడుచుట యెంత కష్టమో, స్వదేశమును విడుచుటయు నంతకష్టమె. వేదాంతశాస్త్రజ్ఞులీ యనురాగ మజ్ఞానజనితమనియు, మమత్వము లేనివారలే విజ్ఞాను లనియు జెప్పెదురు. కాని యది యొప్పుకొనదగినమాటకాదు. ప్రపంచ మున నరుడు జీవించునంతకాలము మమత్వాదులు లేక యుండుట యసంభవము. స్వాభిమానము బంధుజనాభిమానము, గృహాభిమానము, దేశాభిమానము, మతాభిమానము మొదలగునవి శ్లాఘ్యములే యగును గాని గర్హ్యములు గావని నాయభిప్రాయము. నేనెంత ప్రయత్నించు చున్నను నామనసునుండి యీ యభిమానమును బాఱద్రోల జాల కున్నాడను. కటకటా! మూడు తరములనుండి మా కుటుంబము నకు గాపురమై, నాకు జన్మభూమియై, సకల సంపదలకు బుట్టినిల్లయి ముక్తిప్రదాయకములగు నగరములలో నొకటియై, విలసిల్లు నుజ్జయిని మహానగరమున నేనిక నెన్నడైన గన్నుల పండువుగ జూడ గాంతునే? వసంతకాలమున సాయంసమయంబుల శిప్రా నదీతీరము నకుం బోయి యా యేటి నీటిబొట్టుల గలిసి వీచు మంద మంద మలయానిలంబులు నెమ్మేను సోక నెన్నడైన సౌఖ్యమనుభవింతునే? ప్రదోషకాలమున నాలయంబునకు జని, సకల భువనరక్షకుడగు విరూపాక్షు. మహాకాళేశ్వరు నింక నెన్నడైన కేలుదోయి బూజించి మనసార ధ్యానింపగలుగుదునే, వత్సరాజు ప్రద్యోత మహారాజనందన

యగు వాసవదత్తాదేవిని పితృగృహమునుండి దీసికొనిపోయి పవిత్ర కథను పల్లియలనుండి వచ్చుచుట్టములకు నెన్నడైన వీనులవిందుగ వినిపింతునే? అంతభాగ్యము నావంటి యదృష్టహీనునకు గలుగదు. నే నెక్కడ? యుజ్జయిని యెక్కడ? పరమసాధ్వియగు నిల్లాలిని బ్రపంచ మెట్టిదో యెఱుగని పసిబిడ్డసహితముగ బుట్టినింట నునిచి దిక్కుమాలినపక్షివయి కానిదేశముల జరియింపుమని పద్మగర్భుండు నా నెన్నుదుట మూఁడుబంతుల వ్రాసియుండ నేను సుఖించు టెట్లు? ఓ మహాకాళేశ్వరా! నాకిట్టి దుర్భరమగు నవస్థ గలుగుటకు నాచేసిన దోసమేమి? అతిథులకు నభ్యాగతులకు మునుమున్న పెట్టక మూఁడు ప్రొద్దులం గుడువ; వైశ్వదేవంబు సేయక యెట్లు వెడల; నీపాదారవింద ధ్యానము చేయక నిదురవోవ; అబ్రాహ్మణకర్మంబుల నాచరింప అట్లు మెలగుచున్నను నాకిట్టిగతి ప్రాప్తించుటకు గారణ మేమి? భవతారకంబులగు నీయడుగు దామరల నొకసారియైన ధ్యానింపని ఖలులు, కలకండంబులగన్న దియ్యనగు నీనామంబు నెన్నండును స్మరింపనికష్టులు, మంగళప్రదమగు నీకోవెలగడప నొకతూరియైన ద్రొక్కి చూడని మొక్కలులు, విశ్వమోహనంబగు నీ సుందర విగ్రహంబు మఱపుననైన గనుంగొనని యధములు, ధనధాన్యములు నాయురారోగ్యములు; నిత్యకళ్యాణంబులు గలిగి వర్ధిల్లుచుండ నాజన్మశుద్ధుడనై, విప్రుడనై, ఘనాంతస్వాధ్యాయవేత్తనై, వేదాంతశాస్త్ర పరిజ్ఞాతనై, విశేషించి నీచరణారవిందసేవకుడనై, నలువురిలో దల యెత్తుకొని గౌరవముగా గాలక్షేపము సేయుచున్న నే నిట్లు దుస్తరదుఃఖసముద్రమునం బడియుండ నుపేక్షించుటకు నీకు న్యాయమే అయ్యయ్యో! నిష్కారణముగా గర్మసాక్షియగు భగవంతుని దూఱ నేల? పూర్వజన్మకృతమగు కర్మమే దీనికి గారణము. ఆ కర్మయే కారణము గాదేని, కాశ్మీర నేపాళ విదర్భ దేశములను గోబ్రాహ్మణ పక్షపాతులు, వైదికమార్గ ప్రవర్తకులునయి, ధర్మస్వరూపు లయిన

రాజులు పరిపాలించుచుండ మాళవదేశమునకు బ్రాహ్మణద్వేషియు వేదబాహ్యుడు నసంగతుడు నగు పరమనాస్తికుడు బౌద్ధరాజు సుదర్శను డేల దాపురమయ్యె? నావలె నాసుదర్శను డెన్నడైన నుజ్జయినీనగరంబు విడిచి మనస్తాపంబు జెందునే? నావలె నెన్నడైన నా దురాత్ముడు తన యాలుబిడ్డల బాసి యేకాకియై చరించునే? నాయును రెన్నడైన వానికి వాని కుటుంబమునకు దగులునే? ఏల తగులకపోవు? సాధులగు నగ్రజన్ము లొక్కనిముసము ననుభవించు చిత్తక్షోభము నూరుమడుంగులై, వేయిజన్మములనైన దపకారకులకు ఫలము గట్టి కుడుపక పోదు. పాడియు బంటయు. సిరియు సంతతియు గలిగి, పండువలెనున్న నాకాపురము గూలంద్రోసిన యారాజాధముని దైవంబు నెరుపకుండునే. ప్రాణంబులు కంఠంబున నుండునంత కాలమును నే నాతనితో పగసాధించి నాయావచ్ఛక్తి వినియోగించి పరరాజుల వానిపై దండివిడియ బంపి యాతని రాజ్యభ్రష్టుని గావించి యుజ్జయినీనగరము పాడుచేసి, యాలుబిడ్డల నెడబాపి, వాని నమ్మిన ప్రజల నిడుముల గుడిపి, వేధింపక పోయితినేని నేను బ్రాహ్మణుడను గాను. ఇదియే నాశపథము. దేవసింహుడు హిరణ్యమిత్రుడు సత్యమిహిరుడు మొదలగు బౌద్ధపండితు లందరు తమ రాజునుం గూడి నాకొనర్చిన యుపకారమునకు బ్రతిఫల మనుభవింతురుగాక! మాళవదేశస్థు లందరు పరమ వైదికుడగు ఛాందసబ్రాహ్మణుడు రుద్రభట్టుమహాత్త్వ మించుక యెరుంగుదురుగాక! సరే! అది యటుండనిమ్ము. ఇప్పుడు నే నేదేశమునకు బోయి వసింతును? తక్కిన విషయంబులకన్న గాశ్మీరంబు సుభిక్షంబని విందు. దానికి రాజధాని యగు శ్రీనగరము సార్థకనామమై సిరులకు నివాసమని విందు. దానిం బాలించు హేమచంద్రమహారాజు బ్రాహ్మణపక్షపాతి యని వాడుక కలదు. కావున నానగరంబునకుం బోయి తలదాచుకొనుట యుచితము, అచ్చట నేనెవ్వరి నెరుంగుదును? క్రొత్తవారి

నెవ్వ రాదరింతురు? ఏమయినను సరే! దైవముపై భారము వైచి పోయెదను. అదిగో నాయెట్టయెదుట నొకపల్లియు కానవచ్చుచున్నది. చీకటి పడకుండ నాగ్రామము చేరవలయును. ఇది యరణ్య మగుటచే దైవోపహతుడనగు నేను మరికొన్ని యుపద్రవముల పాలుగావలసి వచ్చును. భాస్కరుడును నావలెనే తన తొంటితేజము డీలుపడి యొక మారుమూల తలదాచుకొను చున్నవాడు" అని తనలో దాను వితర్కించుకొనుచు నొక బ్రాహ్మణుడు వేసవికాలమున నొకనాటి సాయంకాలము సింధునది తూర్పుటొడ్డునగల యొక యడవిలోనుండి ముందరిపల్లెకు జీకటి పడకుండ బోవలయునని విసవిస నడచుచుండెను.

అతడేబదిసంవత్సరములు దాటినవాడు. శరీరము దబ్బపండు వంటి పచ్చని చాయగలిగి స్థూలమై యుండెను, అతడు పొడగరి యనవచ్చును. గాని స్థూలముగ నుండుటచే జూచువారి కించుక పొట్టిగ గానబడుచుండును. మెడలో బంగారు తీగెనుజుట్టిన రుద్రాక్షతావళమును, దలకుజుట్టిన విలువగల పచ్చని కాశ్మీరశాలువ, చెవుల నలంకరించు కనకకుండలములు, చుట్టజుట్టి వీపుపై నిడుకొన్న కృష్ణాజినము, వ్రేలనున్న కాశికాముద్రయుంగరమును దద్బ్రాహ్మణుడు శిష్టుడనియు, విద్వాంసుండనియు దెలుపు గాని కన్నులు మేడికాయలట్లు పెద్దవై యెఱ్ఱజీరగలవై చూపఱ కించుక వెరవు గొలుపు చుండును. స్వభావముచేత నావిప్రుడు ధూర్తవర్తనుడు కోపకాడు నైనట్లు వాని మొగము జూచువారు మునుముంద యూహింప వచ్చును. ఆ మహీసురుడు మధ్యాహ్న మంతయు నెండలో నడచుటచే వాని మొగ మెంతయు సూర్యకిరణ సంతప్తమై కెంపురించి చెమ్మటలు గారుచుండెను. దీర్ఘప్రయాణంబున నతి డతిశ్రాంతుడై యొకనొక చెట్లనీడల నించుక విశ్రమింప నిచ్చగించెను. కాని ప్రొద్దుకుంకు చుండుటయు మార్గము నిమ్నోన్నత మగుటయు, జిరుచీకటులు గ్రమ్మ

ప్రారంభించుటయు, నంచి సాధ్యమయినంత వేగముగ బోవలసి వచ్చెను. పథికు లెంతవిసురుగ నడచినను శ్రాంతులగునప్పుడు వారికి గమ్యస్థానము గడుంగడు దవ్వున కరగినట్లు తోచునుగదా! ఎంత నడిచినను బ్రాహ్మణుడు చీకటిపడునప్పటికి గ్రామము చేర లేక పోయెను. నిర్జన మగు నాప్రదేశము, సహజముగ ధైర్యశీలుడగు నాతనికి భయము గొలుపజొచ్చెను. రాత్రి యగునంతన నీలవెంట్రుకల వలె కారుచీకటులు నలుదెసల గ్రమ్మెను. ఘోరతర మృగంబులు దుష్ట సర్పములు, చోరకిరాతులు, భూతపిశాచములు బ్రాహ్మణుని తలపున నిలువ నతడు భయకంపితుడై మాటిమాటికి వెనుకకు దిరిగి చూచుచు హరినామస్మరణముచేయుచు చేతికఱ్ఱతో నేల దట్టుచు తాజేయుచున్న పని దానెరుంగక యెటెటో నడచుచుండెను.

ఇట్లు విహ్వలచిత్తుడగు నాజన్నిగట్టు చేసినదోసంబు మూర్తిభవించెనో యన నొక కిరాతుడు వల్లమేనివాడు వాని వెనువెంటనే వచ్చి చేతిదుడ్డుకఱ్ఱతో దలపై నొక్కపెట్టు పెట్టెను వెంటనే బ్రాహ్మణుడు గొడ్డలిపెట్టునం బడు చెట్టులాగున హర హరాయనుచు నేలంగూలె.

## రెండవ ప్రకరణము

ప్రపంచమునందలి కొండలలో హిమాలయపర్వతమే మహోన్నత మయినది. ఇది నిరంతరమును మంచునకు నెల వగుటచే దీని కా పేరు గలిగినది. ఈ మంచుకొండ యార్యావర్తమున కుత్తర దిగ్భాగమున దూర్పునుండి పడమరకు వ్యాపించి భగవన్నిర్మితమగు రాతికోట చందంబున దుర్భేద్యమయి యుండు నధిక్యతనుబట్టి మన పూర్వు లీనగరమునకు బర్వతరాజ మను బిరుదము నిచ్చిరి.

ఆ వైశాల్యము, నాయౌన్నత్యము, నాగంభీర్యము నొక్కమారు గన్నవారు శైలచక్రవర్తి నామము దానియందు సార్థకమయ్యెనని తలపకపోరు. ఏ శైలంబు తలదాచుకొనుట కిల్లులేక వల్లకాట గాపుర ముండు మూడు కన్నుల వేల్పునకు నిలువ నీడయయ్యెనో ఏనగాధిరాజుకడుపున నుదయింప వలయునని దాక్షాయణిగోరి పార్వతి యయి జన్మమందెనో, ఏకొండరాజు తనయునంగు కూతురును గాళ్ళ కడిగి కన్యాదానమిచ్చి చిరబ్రహ్మచర్యముచే వెతలబడు మహేశ్వరు నొకయింటివాని జేసెనో ఏమహీధర గుహాంతరంబులు ప్రమథ గణంబుల కోలాహలంబులకును, పిడుగులచప్పుడు లోలె, వినంబడు నందీశ్వరుని అంకెలకును ప్రతిధ్వను లిచ్చుచుండునో, ఏభూధరకోట ములు తమ ప్రియులం గలసిమెలసి యెడతెవి మమతల విహారంబు సలుపు కిన్నర విద్యాధరబాలికల కాటపట్టులయ్యెనో, ఏకుధరంబును తపోనిష్ఠులగు రాజర్షి, బ్రహ్మర్షి, దేవర్షి, గణంబులకు యజ్ఞ భూమియై దేవతల కన్నసత్రమయ్యెనని పురాణంబుల వినుచుందుమో యేగుబ్బలి భువనపావనములగు సింధు గంగా ప్రముఖ నదీమ తల్లికలకు కన్నతల్లియై విలసిల్లునో, యేగట్టుల దొరకటిప్రదేశము నందె మేఘమండలములు చరియించుచుండునో, యా హిమవంతము దీర్ఘశృంగములతో, దుర్గమారణ్యములతో, నమూల్య రత్నములతో, సువర్ణాది లోహములతో, నుత్తమ దివ్యౌషధములతో, గైరికాది ధాతువులతో, బహుసత్వములతో నెల్లపుడుం బారు సెలయేళ్ళతో, సొబగుమీరు చరియలతో నిండియుండి చూపఱకు గనుల పండువు సేయుచు నాశ్చర్యమును సంతోషమును భయమును గొలుపుచు బర మేశ్వరుని యనంత మహిమంబును బ్రకటించుచుండును. ఈచలికొండ కుత్తరభాగమున గైలాసంబున సింధునది జనించె. సింధుశబ్దమునకు సముద్ర మర్థమగుటచే నీనదిపొడవు వెడల్పులంజూడ చిన్నసముద్రమో లేక సముద్రుని బిడ్డయోయని సందియముతోచును. ఈ మహానది

పుట్టినచోటు వదలి కొంతదనుక టిబెట్టుదేశమున బ్రవహించి యనంతరమున గాశ్మీరదేశంబు జొచ్చి తన్మధ్య భాగమున బారి యవ్వల పాంచాల సింధుదేశంబులు బ్రవేశించి, యనేకోపనదులం గలిసి చవుటిపఱ్ఱల రత్నగర్భములుగ జేసి, పట్టణంబుల బల్లియల నుండు జనంబులకు జీవనంబు లొసంగుచు బలువాయువై పశ్చిమ సముద్రమున బడుచున్నది. ఈ నదియొడ్డున నిప్పటికిని దట్టంబులగు శారదవులు కొన్ని కొన్ని తావులం గలవు. ఈ గ్రంథమున జెప్పబడు కథ శాలివాహనశక ప్రారంభమునకును విక్రమార్కశక ప్రారంభమునకును జాలమున్న జరిగిన దగుటచే నాకాలంబున నిప్పటికన్న దుష్టమృగకిరాతశరణ్యంబులగు నరణ్యంబులు విశేషంబుగ నుండెను. కాశ్మీర దేశ మిప్పటియట్లు చిన్నదిగ నుండక యాకాలమున, మిగుల బెద్దదై యిప్పుడు పంజాబనబడు దేశమును జాలవఱకు నాక్రమించెను. చీనాబన బరగు నుపనది సింధునదితో జేరుప్రదేశమున కుత్తరమున నొక యామడదూరమున సింధునది పరిసరంబున నొక యడవిలో నొక చిన్న పల్లెయుండె. ఆ పల్లెయందు బోయలు మొదలగు నాటవికులే గాని బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులెవ్వరును గాపుర ముండుటలేదు.

నాగరకులెవ్వరు నెన్నడును గనుంగొనని యాగ్రామవాసుల నడుమ కాపుర ముండుటకును నూరుపేరెవ్వరికి దెలియని పురుషులు కొందరువచ్చి యొంటి చేలనో నచట గాలము బుచ్చుచుండిరి. వారిలో నాడువారెవ్వరును గానబడరు. తెలివిమాలిన నోకరులు వారి పూర్వవృత్తాంతముల గూర్చి యడుగక, వారి వేషభాషలం గనుంగొని సందియపడక వారికిం దమచేతనైన సాయంబు నెఱపుచు వారితో గలిసిమెలసియుండిరి. ఒకనాడానగరకులలో నొకడు సేవకులిరువురితో మధ్యాహ్నము వేటకుంజని యెండదేని జరియించి కొన్ని ఫలుగుల మృగముల జంపి వచ్చిన వానిని సేవకులిరువురు మోసితేగా సాయంకాలమున నెప్పటియట్లు సీర లేక చీకటులు గ్రమ్మిన వెనుక నదియొడ్డున నడచి వచ్చుచు వెంటవచ్చు పరిచారకులలో నొకనితో,

నిట్లనియె—"కరటకా! మనమీవేళ జాల యాలస్యము జేసితిమి, వేట మొదలగు దుర్వ్యసనములం దగిలినవారికి నాకలియు దప్పియు బ్రొద్దును దెలియవని పెద్దలు సెప్పుమాటలు నిశ్చయములే యని నేను దలంచెద. మనము నడచుచున్న దరణ్యప్రాంతము; క్రమ్మినది కారు చీకటి; కావున జాగరూకతతో నడువుడు" అని పలుక గరటకుండు వానితో—"స్వామీ! కొంచెము పొద్దుపోయిన నేమి! కావలసినన్ని మృగములు పక్షులు లభించినవి. మన మింక కొంతసేపటికైన నిల్లు సేరక పోము. మనము మువ్వుర మున్నాము గనుక నంతగ భయపడ వలసినది లేదు" అని పలికి వాడింక నేదియో యనబోవుచుండ—"నయ్యయ్యో! కటకటా! యేమి చేయుదున" ని యొక యార్తనాదము వారి చెవులంబడె. ఆ పురుషులు మువ్వురా శబ్దమువిని నిశ్చేష్టులయి నిలిచి యది యేమయి యుండునని తమలో దాము మెల్లగ విచారించుకొని, క్రమ్మర నట్టిశబ్దము వినబడకపోవుటచే మరల సాగి నడచుచుండిరి. వారు కొన్నిగజములదూరము నడచునప్పటికి ముందునడచుచున్న కరటకుని కాలి కేదియో తగిలెను. వెంటనే వాడు పీనుగపీనుగ యని యరచుచు వెనుకకుం బరుగెత్తెను. వాని యజమానుడైన నాగరకుడు–"కరటకా! భయపడకు; భయపడకు. పీనుగున కంత వెరువవలెనా? ప్రాణమున్న జంతువులు హానిసేయగలవు గాని మృతజంతుకళేబరములు కీడొనరింపజాలవుగదా. దగ్గరకుబోయి చూతము రమ్మ" ని పిలిచి ధృడమనస్కుడయి ముందుకు నడచుటయు యజమానివెంట గరటకుడును కరటకునివెంట రెండవ సేవకుడగు పింగళుడును నడిచిరి. అతడా కళేబరమును సమీపించునప్పటికి పాదములు నెత్తుటం దడిసిన నేలం దాక వాని మేను పులకరించెను. ఈ యాశ్చర్య మేమయి యుండునని యా పురుషుడు విచారించుట కారంభింప నంతలో—"నయ్యా! నేను బీనుగను కాను. భగవదనుగ్రహముచేత నిప్పటికి సజీవుడనే. నాయందనుగ్రహముంచి నా గాయములకు కట్టుకట్టి నాకించుక సాయంబు సేయుదురేని నే నాజన్మాంతము మీకు కృతజ్ఞుడనయి

విధేయుడనయి యుందును" ని కొన్నిమాటలు హీనస్వరముగ వినంబడెను. ఆ పలుకులు విని యజమానుడును సేవకులును పడి యున్న వా డాపదలో నున్న మనుష్యుడని యెంచి దగ్గరకుబోయి—"అయ్యా! నీ వెవడవు? ఏల యిట్లు పడియున్నవాడవ" ని యడుగ నామనుష్యుడు గద్గదస్వరముతో వారి కిట్లనియె—"అయ్యా! నేనొక బ్రాహ్మణుడను. నా పూర్వవృత్తాంతమంతయు సవిస్తరముగ మీకెఱిగించుట కిది సమయము కాదు. నాకిప్పు డోపికయు లేదు; ప్రస్తుతచరిత్ర మెరిగించెద వినుడు. ఈ రాత్రి ముందు గనంబడు పల్లెకు బోవలయునని వడివడి నీదారిని నడచుచుండ దురాత్ముడొక చోరుడు నాకుం దెలియకుండ నా వెనువెంట నంటివచ్చి చేతిదుడ్డుకఱ్ఱతో నానడినెత్తి పగులమోదెను. ఆప్రహారముతో తలకుంజుట్టుకున్న సేలువ యొకమూలంబడ నెత్తినుండి క్రొన్నెత్తురు జొటజొటగారఁ గొడ్డలి నఱికినతరువువలె నేను హరహరా యనుచు నేలకూలితిని. అంతట నాకిరాతుడు నా రత్నకుండలములు సేలువ వ్రేలియుంగరము దొంగిలించుకొని యెందేనిం జనియె. నన్నుం గనికరించి ఆయూరికిం గొంపోయి నాగాయములు మాన్పవేడెద" అని జాలిగదుర బలుకుటయు, వానిని లేవదీయుమని యజమానుడు సేవకులం బనిచి, బ్రాహ్మణునకు ధైర్యము జెప్పి మెల్ల మెల్లగ నడిపించుచు నూరికిం దోడ్కొనిపోయి గాయంబులకు దగు చికిత్సలు జేసి పాలు ద్రావనిచ్చి పన్నుండుటకు మంచము వేయించి బహువిధంబుల నాదరించె. తరువాత నాలుగైదు దినములకు బ్రాహ్మణుని గాయము కుదుర నారంభింప వానికాయంబు క్రమక్రమంబుగ దృఢంబు కాజొచ్చెను. ఆ విప్రుడొక్క నాడు నిజప్రాణరక్షకుడగు నాపురుషుని నామధేయంబు నెరుంగగోరి యడుగ నాతడు కొంచెము విచారించి—"అయ్యా! నన్నిచటివారు సుమిత్రు డందురు. ఏ పేరయిన నేమి? నన్ను మీ రిచ్చవచ్చిన పేరం బిలువుడ" ని ప్రత్యుత్తరమిచ్చెను. తన పేరు చెప్పుట కతడు సందేహించినట్లు కనబడుటయు వానియున్న తావు నునికియు వానిసుందరాకారంబునకును మృదుభాషణంబులకును

దగనివై యుండుటయు, బుద్ధిం దలపోసి యతండు ప్రచ్ఛన్నవేషుఁడై యుండవచ్చునని బ్రాహ్మణు డూహించి యడిగి తెలిసికొనఁగోరి సమయము నిరీక్షించుచుండెను. సుమిత్రుడు సేవకులును బ్రాహ్మణుని యెడ భయభక్తులు గలిగి యుపచారములు సేయుచుండిరి.

## మూడవ ప్రకరణము

ఆపద లిల్లుగట్టుకొని కాపుర ముండవని తెల్పుటకో యన చీకటులు గడచిపోయెను. దుఃఖానంతరమున సుఖంబు లిట్లు వచ్చునని యెఱుంగజేయుటకో యన కృష్ణపక్షంబు గడమట్టుటయు మాపులు వెన్నెలలు గాయజొచ్చెను. దుఃఖానుభవంబున గలుషంబులగు మొగంబులు సుఖానుభవంబున గళావంతము లగునని వెల్లడిచేయుటకో యన దిశాముఖములు విశల దెలివినొందె. వేళ నజ్ఞానాంధకారమయమగునప్పుడు మిగులం దేజాల్లు కించిద్జ్ఞులు దేశము జ్ఞానదీప్తిమంతం బగునాడు తమ యూరుపేరు లేకయుందురను నీతి లోకంబునకు జాటుటకో యన మున్ను జీకటిగ్రాతుల దళదళమని మెఱసిన నక్షత్రంబులు వెన్నెలలో వెలుంగు డిందుపడి కానబడనయ్యె. రాజు లొకవేళ జనుల కార్తికరు లయి మఱియొకవేళ నానందకరు లగుదురనుమాట నిజమని ప్రకటించుటకో యన నిశారాజగు చంద్రుడు హేమంతఋతువున జగజ్జనులకు జలిచేత వడకించిన చల్లనికిరణముల చేతనే యీ వసంతరాత్రులలో జనుల నానందాబ్ధి దేలించుచు కువలయానందప్రదాయకుడయి యుండెను. ఎంతటి స్వచ్ఛమూర్తులకయిన నెంతటి కళావంతులకయిన, నెంతటి సన్మార్గవర్తనులకయిన వెదకి చూచిన నించుక లోపముండకపోదను పలుకు నొక్కి వక్కాణించుటకో యన స్వచ్ఛమయి, షోడశకళాపరిపూర్ణమై యాకసంబు నలంకరించు చంద్రమండలమున మచ్చ చూపఱకు గానబడ జొచ్చెను. నిండు

చందురుండు పండు వెన్నెలలు గాయు పున్నమనాటి రేయి సుమిత్రుడు వడివాకిట నొకచాప వేయించుకొని వెన్నెలలో బ్రాహ్మణుడు దానును గలిసి కూరుచుండి పురాణగాథలు, పూర్వరాజుల చరిత్రములు నాతని వలన వినుచుండెను. కరటకుడు పింగళకుడు మొదలగు సేవకులు పగలెల్ల నొడలువంచి పనిచేయుటచే మేను మఱచి గాఢముగ నిద్రించు చుండిరి. గ్రామమంతయు మాటుమణగి నిశ్శబ్దమైయుండె. కొంతసేపు పురాణగాథలువిని సుమిత్రుడు బ్రాహ్మణుని జూచి—"యార్యా! మీముఖవర్చస్సును బాండిత్యప్రభావమునుజూడ మీరు సామాన్యులు గారని తోచుచున్నది మీ రెవ్వరో ఏ దేశమునుండి యెం దరుగుచున్న వారో, యిట్లరుగుటకు గారణ మెద్దియో నాకెరుంగ జేయ వేడెదను. నేను మీకు విధేయుడనగు శిష్యుడనుగాని యన్యుడనుగాను. మీచరిత్రము గోప్యమగు నేని నేనది యిచ్చటనే మఱచిపోవ గలవాడ నని శపథంబు జేసెద. మందభాగ్యుడనగు నేను నాచరిత్రమును మీకు విన్నవింప దలచుచున్నాడను కాని ముందుముందు మీరు నన్ను నమ్మి మీకథ నెరింగింతురేని యవ్వల దెలిపెదను. కావున నను గ్రహించి సెలవిండ" ని ప్రార్థించె. ఆ వేడికోలు విని మహీసురుడును గొండొకవడి యాకసంబువంక దలయెత్తి చూచి విచారించి, యెట్టకేల కిట్లు తన వృత్తాంతము జెప్ప దొడంగె—" ఓ సుమిత్రా! మిత్రదర్శనము లేమిచే శోషిల్లి నామనఃపద్మము మిత్రుండవగు నిన్ను జూచి మరల వికాసవంతమైనది. ఆప్తబాంధవుల నందఱ విడిచివచ్చిన నాకు దైవము దయాళుడై లోకబాంధవుడవగు నిన్నుంజూపె. భాగ్యహీనంబగు నాచరిత్రమును జెప్పెద వినుము. ఆర్యావర్తమునకును దక్షిణాపథంబునకును నడుమను మాళవదేశముగలదు, ఆ దేశంబున కలంకారమగు నుజ్జయినీపురంబు నాకాపురంబు నాపేరు రుద్రభట్టు; నాతండ్రి కుమారభట్టు. మంత్రశాస్త్ర పారంగతుండై పేరు మోసినవాడు. మాతాత మహాదేవభట్టు, నిరతాన్నప్రదాత యయి మడిమాన్యంబుల విక్రయించి బ్రాహ్మణ సంతర్పణములు జేసి కుటుంబమునకు

బేసరికము దెచ్చినను వంశమునకు కావలసినంత కీర్తి ధనము సంపాదించి యిచ్చిపోయెను. కూటికి పేదయైనను కులమునకు సంపన్నుడగుటచే మాతండ్రి యొరుల నాశ్రయింపక నీచవృత్తులకు నింద్యకర్మలకు నొడబడక, తన కున్నంతలో గడుపుకొని తనివి గలిగి పదిమందిలో నింతవాడు లేడనిపించుకొని గౌరవంబుగ గాలక్షేపము జేసె. నేనును మాతండ్రి నడచిన తెన్నున నే నువదలచి కులగౌరవములకు భంగము రాకుండ దినములు గడపుచుంటి. నా పూర్వపుణ్యవశమున నాదనకుచో రానపహార్యంబగు విద్యాధనంబు నొసంగిపోయెను. నా ప్రజ్ఞాదికములు నేను జెప్పుకొనుట యనుచితమే యగును గాని శ్రోత్రవాడ నగుటచే నిందముక నుడువవలసివచ్చెగావున మీరు క్షమియింతురుగాక! చతుర్వేదము లధిగమించితి. షడ్దర్శనములు నేర్చితిని. చతుష్షష్టికళలు నలవరచుకొంటి. నా పాండిత్య ప్రభావము కక్కఁబడఁడి యాదిశేషునకైన జతుర్ముఖునకైన వంకలు దిద్దగల కాశీకానగరపండితులు నాకు విద్యానిధి యని బిరుదొసంగిరి. శాస్త్రచర్చలయందెంతెంత దిగ్దంతులైన నేనవలీల నోడించి వచ్చుటం జేసి లోకులు నన్ను బ్రతివాదిభయంకరుడని చెప్పుకొనుచుందురు. అత్తకోడరికపుం బగచే లక్ష్మియు సరస్వతియు నొకదావున నుండ నిచ్చగింపదు గావున నాకడ విద్య యెంత యతిశయముగానుండెనో నాయింట పేదఱిక మంత యతిశయముగా నుండెను.

మాళవదేశస్థుల భాగ్యదోషమున నుజ్జయినీనగరంబు రాజధానిగ జేసికొని సుదర్శనుడను బౌద్ధమతస్థుడొకరాజు పాలించుచున్నవాడు. అతడు పండితపక్షపాతి యగుటచే నాకీర్తి కర్ణాకర్ణిగ విని తన కొలువుకూటమునకు నన్నుం బిలిపించి. యుచితాసనంబిడి తన దేశీయులగు కొందరు పండితులతో నన్ను వాదింపబనిచి నాప్రసంగంబునకు గడు మెచ్చి యానాడు మొదలు నన్ను దన యాస్థానపండితులలో నొకనిగా జేకొని సబహుమానముగ సగౌరవంబుగ నన్నాదరించె. అతని యాస్థానమున హిరణ్యమిత్రుడు ధర్మగుప్తుడు దేవసింహుడు సత్యమిహిరుడు మొదలగు బౌద్ధపండితులనేకులు విద్యాధనులుగలరు. వారికి నాకు వేద

ములగూర్చి యభిప్రాయ భేదములు గలిగి వాదములు సంభవించుచుండుటంజేసి మనస్పర్ధలు వొడయుచు వచ్చినవి. రాజు బౌద్ధుడగుటచే మతవిషయముల నాతో నేకీభవింపక వారితో గలియుచుండు. ఇట్లు సుదర్శనుం గొలిచి జీవయాత్ర నడపుచుండ విదర్భరాజునకు మా యేలికకు నెల్లలగూర్చి పోరపులు వొడమినవి. ఆ వివాదంబులు పరిష్కరింపుమని తన మిత్రులలో నొకడగు కేసరి యను నాతని నియోగించి వానికిం దోడుగ నన్నుం బొమ్మని మా రాజానతిచ్చె. మే మిరువురము జని వివాద హేతువులగు ప్రదేశంబులజూచి విదర్భరాజు పక్షమే న్యాయమని యెంచి మాప్రభునకు విన్నవించి యా ప్రదేశంబు వైదర్భుల కిప్పించితిమి. మాపై గిట్టనివారు కొందరు మేము విదర్భేశ్వరునివద్ద లంచములు గ్రహించి తప్పుడుమున తీర్పులు చెప్పితిమని మా నృపునితో కొండెముల జెప్పి కసుగాం దెప్పించిరి. రాజును మొట్టమొదట వారి మాటలు విశ్వసింపక కొంతకాలంబుపోయిన వెనుక సాక్ష్యంబు విచారించి మమ్ము నేరస్థులుగా నెంచి దండ్యులమని నిశ్చయించి మమ్ముం గొరత వేయుమని పలువురు పురికొల్పిన నెందుచేతనో యట్లుసేయక మా సర్వధనంబులు దాను గైకొని మమ్ము దేశమునుండి వెడలనడిపె. నా విద్యకు నా గౌరవంబునకు దగనిపని నేను జేసితినని నమ్మి ప్రజలను "యథా రాజా తథా ప్రజా" యను మాట నిశ్చయముగ రాజుతోపాటు నాపై నలిగిరి. భార్యను బుత్రసమేతముగ బుట్టినింటికంపి పైబట్టతో నిలువెడలి కాశ్మీరదేశమున వసియింపవలయునని పోవుచు మీ పాలంబడితి. నాయనా! రాజులు విశ్వసనీయులుగారు. వారితో గూటములు పాములతో జెలగాటములు; వారిపోరాటములు కత్తులమీది సాములు; వారి నెయ్యములు పులులతోడి వియ్యములు, వారి యనుగ్రహంబులు నీటిబుగ్గవోలె క్షణవినశ్వరంబులు, వారి యాగ్రహంబులు చిరస్థాయికంబులు, వారిచ్చు సంపదలు మెరపుదీగలట్లు చంచలంబులు, వారొనరించు నపకారంబులు శాశ్వతంబులు; వారి యాకారంబులు కోడెత్రాచులట్లు దర్శనీయములు, అంతరంగంబులు విషాశయంబులు, వారి

మెవ్వరు లేరుగదా!" యని చెప్ప నప్పలుకులు విని మకరందుఁడు సంతసించి—"మాకు మీకన్న ప్రియజన మెచ్చటను లేరు. ఎంత సేపున్నను మీసన్నిధినుండ నే మనసగుచున్నది. ప్రొద్దుపోవుచున్నది. కావున నేనింక చనకతప్పదు. రత్నసేనుఁడు నా రాక కెదురు చూచుచుండును. కాని ఈమెకు దేహారోగ్యము సంపూర్ణము కలుగుటచే నేను రేపటినుండి యిక్కడకు రానక్కరలేదు. కావలసి యున్నపుడు వచ్చెదన"ని లేచి మువ్వురకు బోయి పురుషసేవకులు మార్గముం జూప విడిదికిం జనెను.

ఆ పలుకులు వినిన తోడనే బాలిక మొగంబున వైవర్ణ్యము తోచెను. చెలికత్తెలు మందు దెచ్చి పుచ్చుకొమ్మని ప్రార్థింప నామె పుచ్చుకొనక ఎవ్వరితోడం బలుకక పండుకొని కొంతసేపిట్టట్టు పాన్పుపయి దొర్లి ఎట్టకేలకు నిదురవోయెను. నిదురలో రెండుసార్లు మకరందుఁడా! మకరందుఁడా! పోకుపోకుమని పలవరించెను. మరునా డుదయమున రాజపుత్రిక నిదుర మేల్కొని చెలికత్తెతో నెప్పటియట్లు పలుకక విచారాక్రాంతయయియుండెను. తల్లియు రాజవాహనుఁడు నాదినమున నామెం జూచి యట్లుండుటకు కారణమేమని నొక్కియడిగిరి. ఏమియు లేదని బాలికయు త్తరమిచ్చె. సఖీజనంబుల నడుగ వారు తమకేదియుం దెలియదని బదులు చెప్పిరి. బిడ్డ మరునాడు నత్తెరంగుననే యుండుటచే వెండియు మకరందుని బిలువనంపి యామె స్థితిం జూడుమని ప్రార్థించె. మకరందుఁడు దద్దయు సంతసించుచు తుమ్మెదవలె మకరందుని గనుంగొని ఆయిందువదన గనుంగొని మహానందమునొందె. ఎక్కడిరోగ మక్కడ నంతరించె. మొగము వికాసవంతమయ్యె. అది మొదలు మకరందుఁడచ్చట నున్నన్నినాళ్ళు రెండు పూటలు నామెం జూచుచుండెను. ఎందుచేతనో యెంతకాలమున్నను మకరందున కాయూరు విడిచిపోవుట కిష్టము కలుగదయ్యె. కాని రత్నసేను డుజ్జయినికిం బోవలయునని నిశ్చయించుకొని తమవచ్చిన వ్యవహారంబు బరిష్కరింపుమని రాజవాహనునిం ద్వర పెట్టెను. రాజవాహనుఁడు సుదర్శనుని బలపరాక్రమాదులకు వెరచియో

మకరందుడు చేసిన యుపకారము దలచియో యది న్యాయమని నమ్మియో వివాదకారణములగు గ్రామముల సుదర్శనున కిచ్చుట కొడంబడి రత్నసేన మకరందులం బిలిచి యెంతయు గారవించి వారికి బలుపసదనములిచ్చి యిట్లనియె—"నాయనా! మకరందుడా! నీవు మా బాలికను మృత్యుముఖమునుండి తెచ్చి మాకొప్పగించితివి నీ మేలు మేము మఱువజాలము. నా ప్రతిజ్ఞ నీ తండ్రికి విన్నవించి గ్రామము లిచ్చితిననుము, మన రాజ్యములు రెండు నిప్పటియట్లె బొరపులు లేక వర్ధిల్లుగాక!" యని యతడు వారల వీడ్కొన మకరందుడు బాలికయొద్దకుంబోయి తన ప్రయాణంబు నెఱింగించి యామెను మరల దుఃఖసముద్రమున ముంచెను. అతడును వదలలేక వదలలేక యామెను విడిచి మరునాడు రత్నసేనునిం గూడి సపరివారముగ నుజ్జయినికిం బోయెను.

## పదునొకండవ ప్రకరణము

"కర్పూరమంజరీ! కర్పూరమంజరీ! యేమమ్మా యెన్ని పిలిచినను బలుకవు? నీ స్థితి యేమియు బాగులేదు. అన్నము తిననే తినవు. తినిన నాలుగు మెతుకులు మునిపండ్ల గొఱికెదవు రేయి కన్ను మూయనే మూయవు. మూసిన బలుతెరంగుల బలవరించెదవు. అడిగినదానికుత్తరం బొసంగవు. పలికిన నవ్యవస్థితముగా బలికెదవు. ఏసుఖంబును గోరవు. ఏముచ్చట దలంపవు. నీకీమరంత సంతాపము గలుగుటకు గారణమేమి? ఇది దయ్యమో భూతమో పిచ్చియో దేహపీడయో మనోవ్యాధియో మేమెరుగజాలకున్నాము. శరీర సంబంధమగు పీడయయ్యెనేని దానికి దగు చికిత్సల జేయవచ్చు. మనోవ్యాధికి మందు లేదందురు. కాని మనసిచ్చి చెలికత్తెలతో జెప్పుకొన్న మనోవ్యాధులు

సయితము మానును. కావున నీమనస్తాపము మాకెరుగఁ జేయుమమ్మా! వడగాడ్పుల కెండిపోవుతీఁగవలె నీ వెంతకాల మీతాపముచే నీరీతిని శోషిల్లెదవు! వెన్నెలకు వడలు నీమేనేమి! ఇవ్విధంబున నిద్రాహారములు లేక కృశియించుటయేమి?" అని యనుంగు చెలికత్తియ లిరువురొకనాఁడు కర్పూరమంజరిఁ జేరి యడుగఁ జొచ్చిరి. కర్పూరమంజరి ఆ పలుకులు వినియు వివశయై యూరకుండె. ప్రియసఖులిరువురు నామె హృదయశల్యమగు నాయంశ మేదియో విస్పష్టముగా వినఁగోరి తమతో నామె యావృత్తాంతము చెప్పువఱకు విడువఁగూడదని నిశ్చయించుకొని మరల మరల తరచి తరచి యామె నడిగి యొంటిగం చెప్పుకున్న నెట్టకేలకు వినువు నిట్లనిరి—

"ప్రియసఖీ! మేము నీకుం గడు దరివార మయినను నీవది యేమోకాని మమ్ముం బెరవారిఁగ జూచుచుంటివి. నిన్నుఁ గనుటయే మీతల్లిదండ్రుల వంతయ్యెనుగాని పెంచుట మాచెల్లులవంతయ్యెను. నీవు పుడమిపై బడినది మొదలు నిప్పటిదనుక నిన్ను మేమొకనాఁడు నెడబాసి యెఱుఁగము. ఆటలాడుకొనుట నేర్చిననాఁడు గోలె మన మొండొరుల సుఖదుఃఖముల జెప్పుకొనుచున్నారము. మాకన్న నెక్కుడగు నాప్తులు నీకుండరని నాయభిప్రాయము తల్లిదండ్రు లెఱుఁగకుండ మరుఁగుచేయవలసినచాటుమాటలు రాజకన్యకలు చెలికత్తెలతోఁ జెప్పుకొందురని వినుచుందుము ఒకవేళ నీమనోగత రహస్యంబుల నీవు మాకెఱింగించినచో నవి బట్టబయలు చేయుదుమేమోయని నీమనంబున నపనమ్మకముండవచ్చును. పసితనంబుననుండి మాస్వభావమును జక్కఁగ నెఱిగిన నీతో స్వవిషయమున మేమేమియు జెప్పుకొన నక్కఱలేదు. అయిన నవస్థాంతరమునొంది నీవిప్పుడు విమనస్కవై యుండుట నించుక చెప్పవలయును. మేము నోట నువ్వుగింజ దాఁగనివారము కాము. ఎక్కడి మాట లక్కడ మరచువారము. మాచెవిలో బడిన మాట పెట్టెలో బెట్టినమాట. ఇంకను నమ్మకము చాలదేని నీగుట్టుమట్టులు వెలిబుచ్చమని చేతిలో జేయివైచి బాసలుచేసెదము" అని చెలికత్తియలగు మల్లికయు

చంద్రికయు నొక్కి నొక్కి యడుగ నాచక్కెరబోడి ప్రత్యుత్తరం బొసగక యూరకుండుట యనుచితమని మెల్లన నిట్లనియె—

“ఓసీ మల్లికా! చంద్రిక మొదటినుండియు వెఱ్ఱిబాగులది యని నీవెఱుంగుదువు. దానికి వెఱ్ఱి యెత్తిన నీకు వెఱ్ఱి యెత్తవలదా! మీపై నాకపనమ్మక మెన్నడు లేదు. ప్రపంచమున నాకు మనసుగలిగిన సంగడికత్తియలు మీకుదక్క వేరొకరు లేరు. ఈ మాట మీ రెఱుంగుదురు. అడవిలో బుట్టి యడవిలో బెరిగి యడవిలోనే జీర్ణమగు పుష్పాల తెఱంగున నాకోరికలు నామనంబున బుట్టి యచటనే పెరిగి యచటనే జీర్ణము కావలసినవి; కాని యొరులకు దెలియ జేయదగినవి కావు. ఏమందు రేని నాకుం దండ్రి దగ్గర లేడు. తల్లి యస్వతంత్రురాలు. నాకు గారాపు చెలిమికత్తెలగుటచే నామనోరథంబుల నొడగూర్ప వలయునని మీరు యత్నించెదరు కాని యది మీకు స్వాధీనము గాదు. ఈగ ప్రాలకుండ మీరు సంరక్షణ చేయగలరు. నాకెద్దియేని తెగులువచ్చినప్పుడు రేయుంబవళ్ళు నిదురయుం గూడును మానుకొని యుపచారంబులు చేయుమన్న చేసెదరు. నాకై నగవమన్న నగెదరు. కావలసిన పదార్థంబుల దెమ్మన్న దెచ్చెదరు. వేయేల! ప్రాణము లీయుమన్న నిచ్చెదరు. అంతియకాని దుస్సహంబులగు నావంతల నెట్లు సహింపగలరు? దుర్గమంబులగు త్రోవల కెట్లుపోగలరు? దుర్లభంబులగు వస్తువుల నెట్లు తేగలరు? నాయలమట మీకుం దెలుపుట మిమ్మును జింతాపరవశలగ జేయుటయే; కావున నన్ను మీ రడుగవలదు. ఇట్టిట్టివని నాపై మీర లలుకబూని మొగంబులు ముడువవలదు.”

అనవుడు మల్లిక యామె దేహవల్లిపై జేయివైచి—“చెలీ! మేము నీకు సుఖదుఃఖ సమానమయిన జనముగదా! మాకన్న నీకార్చువారును దీర్చువారు నుండరు. చెప్పకున్న మాతోడుసరి” అని యొట్టుపెట్టుకొనియె. చంద్రికయు జెప్పుదువా చెప్పవా యని పలుమా రొత్తి యడుగజొచ్చె. తనగుట్టును దానెంత దాచదలంచిన జెలికత్తియలు దాచనీయరనియు దనకు జెప్పక తప్పదనియు దెలిసికొని

కర్పూరమంజరి ప్రాణసమానలగు చంద్రికామల్లికలతోఁ దన వృత్తాంతము జెప్ప నిశ్చయించియు నొకమారు సందేహించి యొకమారు సిగ్గుపడి యొకమారు తన్నందుకు భీతిం జెదరే యని సఖులం గసిరి యొకమారు తనకథ చెప్పఁబూని నాలుక చివరకు మాటరానిచ్చి పైకి వెడలనీయక యాఁచుకొని యెట్టకేలకు నెచ్చెలుల వేఁడికోలు మిక్కుటం బగుడు నిట్లనియె—

"అమ్మయ్యా! నా దారిని వన్నెగడనీయక పీడించుటకు నాకు మీరొక్కఁడె దాపురించిరే. నిజేమని చెప్పుమను! మీకు లోకజ్ఞాన మెఱిగిన జాణలుగదా! నేనేమో యనుకొంటి. మీ తెలివింతేనా? ఇంత కాలమునుండి చూచుచు మీకు నా యలవాటునకుఁ గారణమూహింపరైతిరా! ఎలజవ్వనంబున నివ్వటిల్లు పువ్వుఁబోండ్లకు మనస్సంతాప హేతువు తెలియరో యంద రెఱింగినదే. నెచ్చెలులారా! చల్లకువచ్చి ముంత దాచుటయేల? చెప్పదలంచియు సిగ్గుపడదగదు. మాళవరాజనందనుం డగు మకరందుఁడు నా దేహరోగంబునకు బలె మనోరోగంబునకును దగు చికిత్సలం జేయఁగలఁడు. మీ చేతనగునేని నాకెత్తెరంగునైన నా సుదర్శన కుమారుని దర్శనము చేయింపుఁడు. ఆ రాజహంసముం గనం గోరిన నా మానస సరోవరము శోభావంతమగు. అతని ముఖచంద్ర బింబముం జూచిన నా నెమ్మనంబున గ్రమ్మిన దుఃఖాంధకారంబు నశియించు. ఆ ఘనుని కృపావృష్టుల నీ మేని పరితాప మడంగు. సఖులారా! వేయేల! నాకతనితోడిదియే లోకము. నా మనోవ్యథ సమగ్రముగ మీకెఱిగించితి; గావున మీకుఁ దోఁచిన తెరంగున నా వగ బాపఁ బ్రయత్నింపుఁడు."

అని కర్పూరమంజరి సందియము విడిచి తన మనోవైకల్య కారణమును మఱుంగులేక యనుంగు చెలులకు నెఱుంగఁ జేయుటయు నవ్వాడా సఖు లిరువురు గడు సంతసించి యామెకుం దమయందుఁగల విశ్వాసమునకు మెచ్చి తమసఖికి మకరందుని పొందెవ్విధంబున సమకూరునని యోచింపఁదొడంగిరి. అట్లు నాలుగైదు నిముసంబులు వారు

యోదించిన పిదప గర్పూరమంజరికి వినంబడునట్లు చంద్రిక మల్లికతో మెల్లన నిట్లనియె—"ఓసీ మల్లికా! ఈమె మనోరథము దుర్లభము గాదు. ఏమంటివి యీమకరందునకెంత చక్కనయ్య యైనను వానికిట్టి చక్కలాడి యెక్కడ లభించును? మన చెలిని మనము మెచ్చ గూడదు; కాని యింతటి యందకత్తియ యీనాటి రాచకన్నియలలో నెందున్నదే? ఒకవేళ చక్కని పడంతులున్నారనుకొనుము వారికి విద్దియ జాణతనంబు లెక్కడివి? కావున మన నెచ్చెలి మనోరథంబు మకరందు డెరిగినచో కన్నులు గప్పుకొని మహాప్రసాదమని యామెను బరిగ్రహించు. ఈమెం గాంచినది మొదలు మనసులో నతడెంత మరుగుచున్నవాడో యెవ్వడెరుగు! కావున దీనికిం దగు ప్రయత్నము చేసిన మనము కార్యసిద్ధి గాంచగలము" అనవుడు మల్లిక చంద్రికతో నిట్లనియె—"ఓసీ! నీవు చెప్పినదంతయు నిజమే. కాని నామనంబున నొక్క సందియంబు బాధించుచున్నయది. కర్పూరమంజరి సుక్షత్రియకన్య; మకరందుడు బౌద్ధుడు. వధూవరులు భిన్నమతస్థు లగునపుడు వారి కలయికకు దలిదండ్రు లనుమతింతురో లేదో యని శంకించుచున్నాను."

ఇట్లు నెచ్చెలు లిరువురు తమ యభిప్రాయంబులు దెలుప కర్పూరమంజరి మల్లికాచంద్రికల నూరకుండుడని యిట్లనియె—"మల్లికా! నీవు చెప్పినది నిక్కువంబు. తలిదండ్రులు మాసమాగమమున కనుమతింపరు. ఒకవేళ ఎట్లయిన మెడలు విరిచి కాళ్ళవేళ్ళంబడి ప్రతిమాలి వారి నొప్పింతుమనుకొనుము. మకరందుడు మనకు సులభు డెట్లగును? మీరేమనుకొంటిరో కాని యతడు సామాన్యుడు కాడు. ముక్కంటిమంటల గ్రాగని మన్మథుడు! మచ్చలేని యచ్చపు జందమామ. అతనితలిదండ్రు లనుమతించినమాత్రమున రాజాధిరాజులు వెలలేని కానుకలిచ్చి తమ కూతుల వానిపాదారవిందములపై బడవేయరే! అతడొడంబడిన మాత్రమున నీనాటి రాజకన్యలందరు పరుగు పరుగున వచ్చి వాని పాణిగ్రహణంబు చేయరే! అతని బిగియారు కౌగిటం బెస

గడు భాగ్య మెన్ని నోములు నోచినగాని లభించు? అతనికి రాణియై పూబోడి యెంత యదృష్టవంతురాలు కావలయు! అతని యడుగులకు నూడిగంబు జేయుటకైన నేను దగను. నేనెక్కడ? యత డెక్కడ? నాయాసలు వట్టివే. అయిన మీరు నావలపులమాట మాపెద్దల కింతలో దెలియ జేయవలదు" అని మరియు నేదియో పలుకబోవుచుండ నచ్చటి కంతఃపుర పరిచారికలలో నొకర్తువచ్చి తల్లి రమ్మనుచున్నదని కర్పూరమంజరిం బిలిచెను. అప్పుడా మువ్వురు దమ విస్రంభ సంభాషణమును గట్టిపెట్టి లోపలికిం జనిరి.

## పండ్రెండవ ప్రకరణము

"అది మొగమో షోడశకళాపూర్ణమగు చంద్రమండలమో తెలిసికొనుట ప్రయత్నసాధ్యమయ్యెగదా! అది యంగనయో జాళువాపసిండి బొమ్మయో నిర్ణయించుట సులభసాధ్యముగాదు. అవి కన్నులో కృపారస మకరందమును జిమ్ము నెత్తమ్మిరేకులో నిర్ధారణచేయుట యెంత కష్టము! అది చిరునగవో నిండు వెన్నెలయో నిశ్చయముగా నెఱుంగ వలవియగునే? ఆహాహా! అపకళంకను గడుపారగాంచిన తల్లిదండ్రు లేమి పుణ్యము చేసిరో? అది మనుష్యాంగన యగునో కాదో యని నాకిప్పటికిని సందియంబు గలుగుచున్నయది. అది నిక్కముగ మానవాంగనయయ్యెనేని మానవజాతియు మధ్యలోకమును ధన్యతనొందినవి. ఈవరకు నెందరినో సుందరాంగులను సందర్శించితిగాని యీసుందరయాన బోలు సిందువదన నెందును గనుగొని యెఱుంగ. అది యేమో కాని కాంతలకును భోగములకును పరాఙ్ముఖంబైన నామనసా పడంతిని గనుంగొనినది మొదలు దానియొద్దనే యుండునుగాని యెంత క్రమ్మరించిన వెనుకకు మరలదు. చదువులు సాములుం దక్కిన గొడవలకుం

కాని నేను నిద్రాహారములు విడిచి తెగులులేని బాధలంట బాధలం బడుట కూడ నాలోనాకే సిగ్గగుచున్నది. గంధవహనముపై మనసు పోదు. పౌర్ణిమం దెరచి రెంకపంక్తియైనం జనువజాల మోహా పరవశుండ నగుటచే నాకిప్పుడు ప్రపంచమంతయు కర్పూరమంజరీ మయమై తోచుచున్నది. సువర్ణమయమగు నామె నామమే కాని రెండవపేరు నానోటికి రాదు. మెరుపుదీగవోలు నామె విగ్రహమే కాని మరి యేపదార్థము నామనంబునకు బొడకట్టదు. మధురములై మనోజ్ఞములై మార్దవంబునకు తావులై వెలయు నామానిని మాటలు ముద్దులమాటలై యిప్పటికిని వినంబడుచున్నవి నీస్థితి యిటులున్న దేమని నేనోరు తెరచి తెరచి యడుగు బంధుమిత్రుల ప్రశ్నంబుల కుత్తరంబు లొసంగలేక కడు విసిగిపోవుచున్నవాడ. ఇది లోలోపల నెంత దాచినను దాగునదికాదు నేనిప్పు డేమిచేయుదు! మనసు నిలువదు. మన్మథు డూరకుండడు. మానసము కడు దవ్వున నున్నది. దవ్వున నున్నదననేల! దాపుననున్న మాత్రమున నా కామె యిందువదన సులభమగునే! మతిభేదము చేతనే మాయిరువుర సమాగమము దుర్లభం. అది యట్లుండ నవనిలో నవతారమందిన చక్కదనంపు మొద్ద యగు నాముద్దియ యెక్కడ నేనెక్కడ! నావంటివానిపై నామె వలపు నిలుపునే! ఆ రాజవదన యే రాజనందను ననుగ్రహించి యానందవార్ధి నోలలాడింపదలచి యున్నదో! ఆమెను చేబట్టు భాగ్యము గలుగు వానికి త్రిలోక సామ్రాజ్యాధిపత్యమేల! అతనికి నరలోకంబె నాకమగు. పట్టడవి నందనంబగు. వేయేల! ఆమెయే నాప్రాణము. ఆమె తల్లి దండ్రు లనుమతింపకున్ననుసరే; నాజననీజనకులు వారించిననుసరే; ఆమె నన్ననుగ్రహించునేని నేనామె కేలుబట్టకమానను. నావెఱ్ఱియేగాని కన్యాబాలిక యనుగ్రహించునే! ఏల యనుగ్రహింపకపోవు! ఆమెకును నాకును జరిగిన కలయికల తెరగు చక్కగా నరసిచూచిన నాపై నామె వలపు నిలిపినదనియే తోచుచున్నది. నేనెంతసేపామె సన్నిధిని గూర్చున్నను నన్నింకం గూర్చుండుమని యామె వేడుకొనుట, పద్య

పానంబు నడుగు నెపంబున నెడతెగక నాతో మాటలాడుట, నేను సమక్షమున నున్నకాలమున వికసిత ముఖారవిందయై సుఖంబుగ నుండుట, నేను నాడీపరీక్ష జేయుటకై కరస్పర్శనంబు చేసినపుడు కన్నును మూసికొని స్పర్శసుఖ మనుభవించుట, నేను రెండుదినంబు లంతిపురమునకు బోవుట మానినపు డామె యెవ్వరితోడం బలుకక యస్వస్థయై యుండుట మొదలగు లక్షణంబు లన్నియుం బరికింప నాయం దామె బద్ధానురాగయై యున్నట్టు సిద్ధాంతము చేయవలసి యున్నది. అయ్యయ్యో! మోహపరవశులగు పురుషులు తమ కామించిన కాంత తేపని జేసిన తమనిమిత్తమే చేసిరని తలంచుట లోకప్రసిద్ధమే కదా! మందిచ్చుటకు చికిత్సకుడు వచ్చినపుడు రోగి మాటలాడుట యరుదా! దౌర్బల్యముచేత రోగులు కన్ను మూసికొనరా! పథ్యపానంబుల బలుమారడిగిన మాత్రమున నది యన్యథా తలంపవచ్చునా! ఆడువాండ్ర మనోగతంబుల తెలియ నెవ్వరివశము! ఒక కారణంబున నామె చేసినచేష్టలు పలికిన పలుకులు మఱియొక కారణంబున నయ్యెనని నేను పరిపెట్టుకొను టుచితముకాదు. అందుచేత నాసిద్ధాంతము నిష్ఫలము పూర్వపక్షము చేసికొనవలసియున్నది. ఇంతయేల! అంతంత చనువిచ్చి నాతోడ నాబాలిక పలికినప్పుడు నామనోరథంబు నెత్తెఱంగుననైన విన్నవింపక యూరకుండుట నాతప్పు. ఆమె చెలికత్తెలతో నెవ్వతెనైనం జేరి నామనోరథంబు జెప్పనైతి. నాటిరాత్రి నన్నింక కొంతసేపుండమని యామె యడిగినప్పుడు వల్లెయని యచ్చట నుండనైతి. ఉండిన నేమిచెప్పనోకదా! ఆమె రాజవాహనున కెట్టిచుట్టమో యడిగి తెలిసికొననైతి. ముఖమోటము గలవానికి మోక్ష మెట్లు లభించు! లేనిపోని రాచగోటులకుంబోయి యప్పు డూరకుండి యదను దప్పిన వెనుక నిట్లు విచారించిన నేమిఫలము! నాసిగ్గునకుం దోసము. నాడోచకుండునట్లు రత్నసేనుడు పురికిం బోవుదమని నన్ను ద్వరపెట్టె."

అని యొకనాడు సాయంకాలమున మకరందుడు తన లోనం జింతించుచు మేడపై నొక్కఁడు గూరుచుండె. అప్పుడప్పుడే యుద

యుండిన చందమామ తెలచల్లని కిరణముల గవాక్షమునుండి మకరందు
నిపై బ్రసరింపజేసి మదనతాప సంతప్తమైన యాతని దేహమునకు
శైత్యోపచారంబు చేయంబూనుకొన్నట్లు కానబడెను. సిప్రానదీ జల
కణంబులతోడం గలసిన మందమారుతంబులు వాని మేను సోకి యొక్క-
మారు హాయి హాయి యనిపించెను. ఆ సమయంబున నతడు కన్నులు
మూసికొని దేవినుపాసించు పరమయోగి విధంబున గర్పూరమంజరీ
దేవీ సుందరవిగ్రహంబును మనంబున ధ్యానించుచు నామె సంభాష
ణంబులదలంచుచు భోగసమాధిలోనుండె. అప్పుడు కాషాయవస్త్రములు
కట్టుకున్న యొక బ్రాహ్మణ కుమారుడు మేడపై నెక్కి యడుగుల
చప్పుడుగాకుండ మెల్లమెల్ల నడచివచ్చి మకరందునిప్రక్క నిలువం
బడియె. ఆ విప్రకుమారుడు వచ్చినజాడనైన యెఱుంగక మకరందుడు
సమాధిలోనే యుండుటంజేసి అతడు తన చేతితో నల్లన మకరందుని
వీపుపై దట్టెను. తట్టుటయు నారాజకుమారుడు ద్రుళ్ళిపడిలేచి యెవరు
వారని పలుకరించి కన్నులుదెరచిచూచి-"యోహో చంద్రచూడుడా!
మిత్రుడా! యిటు కూరుచుండుము" అని చెప్పి మరల గన్నుదోయి
మూసికొనియె. తన్నెన్నడు వచ్చినను బవలనక రేయనక
సమయమనక నసమయమనక తన్నెంతయు గారవించి తన మాటల
కత్యంతము సంతసించు మకరందుడు తనరాక కలరక కన్నులు మూసి
కొనుటయు వాని నెమ్మొగంబు కట్టూగ్నిపొగలచే గలుషమగుటయు
మేను కృశత్వంబు నొందుటయు నవలోకించి చంద్రచూడుడు తన
మనంబున నిట్లు విచారించె—

"విదర్భనుండి వచ్చినవెనుక వీనివైఖరి ఇంత మార్పు జెందు
టకుం గారణమేమి! చక్కగా బోలిచిచూడ నీతనికి మన్మధగ్రహము
సోకినట్లు దోచెడిని. చంద్రప్రభాదేవియు సుదర్శన మహారాజును వీని
యునికిం గారణమరయలేక కళవళపడుచున్నవారు. కావున వీని నడిగి
తత్కారణము దెలిసికొని సమయోచితమగు కార్యము జరిపించెదను"
అని విచారించి యతడు మరల మకరందునిపై జేయివైచి-"చెలికాడా!

నీవిట్లుండుటకు గతమేమి? తొల్లిటియట్లు మనసిచ్చి నాతోడం బలుక వేమి? చదువుల పొంతబోవేమి? సాములవంక జూడవేమి? పండితులతో బ్రసంగింపవేమి? అచటి విశేషంబు లేను వినదగనా?" యని చిరునగవు నవ్వుచునడిగెను. మకరందుడు వారిపలుకులువిని—"మిత్రుడా! విదర్భ పురమందు జెప్పదగిన విశేషంబు లెవ్వియులేవు. ఎవ్వియేవియున్న కాలక్రమంబున నీకుం దెలియకపోవుగదా!" యని బదులు చెప్పి యూరకుండె.

తన చెలికాడు మనోగతా వృత్తాంతమును దనకు దెలియ జేయుటకు సందియము నొందుచున్నవాడని గ్రహించి చంద్రచూడుడు తన వచోచమత్కృతి తేటపడ నిట్లనియె—"మిత్రుడా! విదర్భలో విశేషములు లేవని చెప్పినంతమాత్రమున నమ్ముటకు నేనంత వెంగలినా? పసివానివలె నన్ను గన్ను ద్రోయ దలంచెదవేమి! విదర్భ నగరము సంగతి నేనెరుంగుదును. కాని నిన్న మొన్న కన్నులు దెరచిన చిన్నవాడవు నీవేమెరుంగుదువు? నేను నీకన్న వయోజ్యేష్ఠుడ నగుటచే కొంతవఱ కెరుంగుదును. ఆ నగరంబున స్త్రీలు నిలిచి యున్న మనుష్యులు నిలిచి యుండగనె సగమట్లు చేయగలరు. తలలు మార్చి తలలు పెట్టగలరు. వారి మాయ లెట్టివో యెరుంగముగాని శరీరములో బదిలముగనున్న హృదయమునైన నపహరింపగలరు. అట్టి నెరజాణ లెందును లేరుసుమీ! స్త్రీలే యింతటి సాహసములు చేయ నింక నచ్చటి పురుషు లెంత సాహసులో జెప్పవలయునా?" అనుటయు మకరందుడు మందహాసము చేసి తన గుట్టుజాడ నెరింగి చంద్రచూడుడు నర్మగర్భముగా నట్లు పలికి యుండబోలు ననుకొని—"మిత్రుడా! నీమాటల యదార్థము దృష్టాంతరములు చెప్పి బుజువు చేయవలయుగదా?" యని పలికెను. అనవుడు చంద్రచూడుడు—"దృష్టాంతముల కేమికొదువ? నాకు నీవే తార్కాణమవు. నీమేను మునుపటియట్ల లేదు. నీవు చిక్కి సగమై నీశరీరార్ధమును విదర్భలో విడిచి వచ్చితివి. నీతల మునుపటితలగాదు. అది క్రొత్త తలపులతో

నిండియున్నది. విదర్భనుండి వచ్చినవెనుక నీహృదయము నీవద్దనే లేదు నీవు ప్రకాశముగా నీసంగతులనొప్పుకొనక పోయినను నాపలుకులు నిక్కవములో యనృతములో నీమనస్సె యెఱుంగు. నీగుట్టు నీ వెంత దాచినను నీమోము వైవర్ణ్యము నీమేని కార్శ్యము నీవిమనస్కతి చెప్పచున్నయది నీకు బహిఃప్రాణమునగు నాకారహస్యంబు తెలుపుము వేని నేను నీకు దోడ్పడియెదన"ని యుత్తరము చెప్పె.

అప్పుడు మకరందుడు సంతోషముతో దన పీఠమునుండి లేచి చంద్రచూడుని గౌగిలించుకొని—"చెలువుడా! నీపలుకులు నిక్కవములు. విదర్భదేశ స్త్రీలు నెరజాణలె. అందొక్కరిత నాహృదయము నపహరించినమాట సత్యము. నీగ్గు పెంపున నిన్నివాళ్ళు నాగుట్టు నీకు తెలుపనైతి. అంతియెకాని నీవు పరాయివాడవనికాదు. నీవు నాకు సాయుడవై నామనోరథసిద్ధి గావింపవలయున"ని తాను విదర్భకరిగినది మొదలు వెండియు నుజ్జయినికి వచ్చువరకు వర్తిల్లిన యావద్వృత్తాంతము నెరింగించి కర్పూరమంజరీ సమాగమము గానిపక్షమున తన మేనం బ్రాణములుండవని దృఢముగా బలికెను చంద్రచూడుడు ప్రియవయస్యుని పలుకులువిని వానిచిత్తము మూరడిల్లునట్లు సమయోచితముగ బలికి వారిరువురి సమాగమమునకై యుపాయమును వెదకుచుండె.

చంద్రచూడు డెవ్వరని చదువరులకు సందియముం దోచ వచ్చును. అతడు మకరందునకు వేడుక చెలికాడు. వాని పూర్వులు నాలుగు తరములనుండి యుజ్జయినీ మహారాజుల యాస్థానమునందు విదూషకులుగ నుండిరి. చంద్రచూడుని తండ్రియగు గంగాచూడుడు హాస్యరసముయొక్క యవతారమని యానాటిప్రజలు చెప్పుకొనుచు వచ్చిరి. గంగాచూడు డప్పటికి మూడేండ్లక్రిందట పరలోకగతు డగుటచే సుదర్శనుడు వానికొడుకగు చంద్రచూడుని దనకొడుకునకు వేడుక చెలికానిగానొనర్చి కుటుంబమును బోషించుచుండె. మకరందుడును వాని చమత్కార వచనంబులకు పలుమారు మాయురే యని మెచ్చుచు విద్యావ్యాసంగములమీద విసువు దోచినప్పు డెడనెడ జంద్రచూడునిం బిలిచి మనంబునకు బంధువు చేసికొనుచుండును.

# పదమూడవ ప్రకరణము

శ్రీనగరము హిమాలయపర్వతమునకు గడుదాపున నుండుటచే నది యుదయకాలమున మంచుచేతం గప్పబడి దవ్వులనుండి చూచు వారి కన్నులకు తెల్లని మేలిముసుంగు చాటున డాగియున్న రాజ కన్యక యట్లు భాసిల్లుచుండెను. రాతిరి కురిసిన మంచుకతంబున నేలయు, చెట్లు, కొండలు దడిసి దమకు కలిగిన దోషసంసర్గంబు బాపుటకై ప్రభాతసమయమున సంపూర్ణ స్నానముచేసి నిలిచెనో యన్నట్లొప్పె. సిగ్గు పెంపున ముసుంగు మరుంగున నడగియున్న పడంతి ముఖారవిందమును జూచు తమకంబున నాయకుడువచ్చి తన కరంబున గవిసిన దొలంగద్రోసినట్లు పద్మినీనాయకుడగు భాస్కరుడు తూరుపు కొండపై పొడిచి తన సహస్ర కిరణంబుల తోరపులక్కని మరుగు చేసిన మంచుగవిసెనను గ్రమక్రమంబున దొలగించుచుండ, మంచు ముసుగు జారినతోడనే కేమొండ యులమూటయు బురలక్ష్మి కుసుంభ వస్త్రముంగట్టుకొని నిలువబడిన చెలువంబున గానంబడియె. సూర్యో దయానంతరమున నగరము దత్ప్రాంతభూమియు నిర్జనస్థితిలోనుండి జనస్థితికి వచ్చినట్లుండె అట్టివేళ నొక్కనాడు కాశ్మీర రాజకులతిలక మగు హేమచంద్రుడు కాలకృత్యముల నిర్వర్తించి యెప్పటియట్లు సముచితవస్త్రాలంకారములు ధరింపక కొలువుకూటంబునకుం జనక తన యంతిపురమున నొక్క గదిలో చింతాక్రాంతుడై యొక్క పీఠమున గూర్చుండె. విషాద మెట్టిదియో యెరుగక యెల్లప్పుడు కల కల నవ్వు చుండు హేమచంద్రుని మొగంబు విలాసంబు దప్పియుండుట జూచి యంతిపురంబునగల పరిజనులు కారణము తమలో దామూహించియు దెలియజాలక రాజును డాసి యడుగుటకు సాహసింపక వెలవెల బోవు చుండిరి. నరపాలుడు తొంటియట్ల యుదయకాలమున గొలువుకూట మున కరుదెంచి తమ్మలరించునని నమ్మి ప్రధానులు దండనాయకులు

సామంతులు చుట్టములు రాయబారులు ననుజీవులులోనగు నియోగిజనం
బులు వానిరాకం బ్రతీక్షించుచుండిరి. రాజెంతసేపటికి రాకపోవుటయు
వానివద్దనుండి వర్తమాన మేమియు దెలియక పోవుటయు సభాసదు
లందరు కారణ మరయుటేక కలవలపడుటయు జూచి ముఖ్యమంత్రియగు
మణివర్మ రెండవ మంత్రియగు మాధవసేనుని వెంటబెట్టుకొని కారణ
మరయుటకై యంతఃపురికిం జనియె.

వారిరువురును జనునప్పటికి రాజప్రక్క బురోహితుడగు నిగమ
శర్మ కూర్చుండి వానినూరడించుచుండె. రేని ముఖవైఖరి నవలోకించి
మంత్రులిరువురు నతడు గాఢసంతాపమునం దప్పుడయి యున్నవాడని
గ్రహించి దురాత్ముడైన చిత్రభానునికుట్రవలన వానికేదేనినపాయము
వాటిల్లి యుండదుగదాయని తలపోసి వానిసమీపించి నమస్కరించి
యెట్టయెదుట నిలిచిరి. హేమచంద్రుడు వారిని జూచి కూరుచుండు
మని చేసన్న జేయ నమాత్యు లిరువురుం గూరుచుండిరి. అనంతరము
నాలుగునిమిషము లూరకుండి మణివర్మ నిగమశర్మనుద్దేశించి మెల్లగ—
"ఆర్యా! మహారాజుగారి విషాద కారణమేమి?" అని యడిగెను.
నిగమశర్మయు దన పీఠము మణివర్మ సింహాసనంబునకుం దగ్గరగా
జరుపుకొని మెల్లగా నిట్లనియె—

"అయ్యా! మహారాజుగారి సోదరుడు చిత్రభానుడు కాల
ధర్మమునొందెనని తెలిసినది. విధికృతంబున నినడుమ గొన్నిపొరవులు
గలిగినను మహారాజుగారి భ్రాతృస్నేహ మతిశయముగ నుండుటచే
వారిప్పుడు మిక్కుటముగ గుందుచున్నవారు." అనవుడు మణివర్మ
మిక్కిలి యక్కజంబున రిచ్చపడియె. మాధవసేనుడు నోట
మాటలేక తెల్లబోయె. మహారాజు కన్నుదమ్ములనుండి బాష్పములు
విడిచి నిట్టూర్పు పుచ్చె. అప్పుడు మాధవసేనుడు తన మనంబున—
"నహహా! సోదరుడన నీమహారాజే సోదరుడు. తన ప్రాణంబులు
తీయదలచిన తమ్ముడు మృతినొందినప్పుడు మహోపకారమైనదని
సంతసించుటకు మారుగ నతడిట్లు విచారించుచున్నవాడు. ఇతడు

ధర్మమురయొక్క యవతార మనవచ్చునుగాని కేవల మనుష్యుం డన వచ్చునే" యని తలపోసి నిగమశర్మనంక మొగము ద్రిప్పి—"అయ్యా! అదియథార్థమగునో కాదో మీరుచక్కగనరసినారా? కుడిచికూర్చుండి ప్రొద్దుపోవక యెరిపైనేని యపవాదుకలువేయు దురాత్ము లనేకు లుందురు. ఇదియు నట్టివారి పన్నగడ కాదుగదా" యని పలికెను. వర్తమానమును దెచ్చిన మనుష్యు డెవ్వడో యెరింగింతురేని మనము దాని యథార్థము నిర్ణయింపవచ్చును" అని మణిశర్మ నుడివెను.

ఆ పలుకులువిని నిగమశర్మ యిట్లనియె—"అమాత్యులారా! యెరుంగుదురుకదా మన నగరమున కుత్తరదిక్కు సింహాగిరి యను పేరంబరగు కొండ యుండుట. ఆ కొండలో బడమటివైపున నొక గుహాకలదు. ఆ గుహయందు ప్రస్తుతము హరిశర్మయను బ్రాహ్మణోత్తము డొకడు శిష్యసమేతుడై తపంబు చేసికొనుచున్నవాడు. వాని పాండిత్యమేమనిపొగడ? తన యిల్లా వాదోడు లేని చతుర్ముఖుడు. ఎంత శాంతము! ఎంత దాంతము! ఎంత దమము! ఎంత శమము! అతని మొగంబు జూచిన సకల కలుషంబు లడంగు. అతడు రెండు మాసములక్రిందటవచ్చి యాగుహలో విడిసియున్నవాడు. పాలు పండ్లు భక్షించునుగాని యన్నము తినడు. అవియైన నెవ్వరేని సమర్పించి యారగింపుడని బ్రతిమాలినంగాని మెసవడు. జ్యోతిశ్శాస్త్రమున రెండవ బృహస్పతి. జాతకసిద్ధాంత ముహూర్త భాగములయం దతని కతడె సాటి. బ్రహ్మప్రాలున కైనం దిరుగున్నది కాని వాని పెట్టిన ముహూర్తంబునకు దిరుగులేదు. మంత్రశాస్త్రమున మహాపాదుకాంతదీక్షం బడసినవాడు వరమిచ్చి చేపట్టినా సన్యాసిని సార్వభౌమునిం జేయగలడు. బిట్టలిగి తిట్టినా బిడౌజుని బిచ్చగానిం జేయగలడు. అతని వాక్శుద్ధి యెట్టిదియో కాని వైద్యులకు ధనమిచ్చి చికిత్సలు చేయించుకొనజాలని నిరుపేదలు వేనవేలు మన నగరంబు నుండియు నీచుట్టుప్రక్కలనుండు పల్లియలనుండియువచ్చి ప్రతిదినము వాని యనుగుల సేవించి తమ రోగంబులం గుదుర్చుమని ప్రార్థింప

లోకానుగ్రహార్థమై నతడించుక సేపు తపము చాలించి రోగుల మొరలు విని మంత్రతీర్థమించుకయిచ్చి మీ జాడ్యంబు నిశ్శేషంబుగా హరింప బడుగాక యని వారిం బంపుచుండు. ఆమాటలతోనే వారిపీడయంతయు నశియించు. అతనిమాట యటుండనిమ్ము. నాకీవర్తమానము వాని శిష్యులలో నొకడు చెప్పినాడు. దీని విషయమున మీరు సందేహింప బనిలేదు" అని పలుకుటయు మణివర్మ—"అతడే ప్రసంగవశమున మీకీ దారుణ వృత్తాంతంబు నెరిఁగించెన" నియడుగ నిగమశర్మ తత్సందర్భము నిట్లెరిగించె—

"హరిశర్మ యొక్క మహామహిమలు కర్ణాకర్ణి నివిని యమ్మహాత్ముని సందర్శించి జన్మంబు చరితార్థంబు గావించికొన వలయునని తత్సన్నిధి కరిగి రాజపురోహితుండనని నన్నెరిగించికొన్న పిదప నమ్మహాత్ముడు మీ రాజెవ్వరని యడిగె. రామచంద్రసమానుడగు హేమచంద్రుడు మారాజచంద్రుడని నేను విన్నవించితిని. అప్పుడాయన శిష్యులలో నొక్కడు నావంక జూచి—"పాపము మందభాగ్యుడగు చిత్రభానుని సోదరు డితడే కాడా" యని యన్నడిగెను. "వాడు హరిద్వారమందు గంగాతీరమున మారేడు చెట్టుక్రింద మృతినొందిన రాచకుఱ్ఱవాని సోదరుడే నా యితడ" ని హరిశర్మ యాశ్చర్యముతో బలికెను. ఆమాటలువిని మేను గడగడవడంక నేను హరిశర్మను స్వామీ! ఇది నిక్కమేనా యని యడుగ నతడొక్కనిమేష మూరకుండి యయ్యా! ఇది నిక్కమే. ప్రపంచసంబంధములైన గొడవలెల్ల విడిచి జనుల రొదలతో నిండియుండు పట్టణంబుల బల్లియల గాపురముండుటమాని యంతరంగమునం బరమేష్ఠిం బ్రతిష్ఠించి పర్వత గుహాలలో గాలక్షేపము చేయుచున్న మేము ప్రజలకిట్టి దారుణవార్తల నెరిగించి దుఃఖమును కలిగింపరాదు. మీ మహారాజునకు కాలక్రమంబున నీవార్త దానంతటదియే తెలియగలదు. నీవు మామాటలుగ మహారాజుతో విన్నవింపవలదని నొక్కి వక్కాణించెను. కాని దేవరవారి

యుండు నాకుంగల పరమభక్తిచే మనసుండబట్టక నేనదినివేదించితిని. అది నిజమనియే నాకు నమ్మకము."

అని నిగమశర్మ ఎరింగింప నందబద్ధమేదియు నుండదని మంత్రులిమ్ముగ విశ్వసించిరి. హేమచంద్రుడు కన్నుదోయినుండి యశ్రుజలంబులు బొటబొటగార వెచ్చని యూర్పులు పుచ్చుచు—"సమాత్యులారా! నేను భ్రాతృద్రోహిని; నాచేసిన దుర్నయంబునగాదె యాగర్భశ్రీమంతుడై నిత్యము దేవునిగా రాపుగోడుకై సౌఖ్యంబుల హ్వారిగాననుభవించిన యువరాజు కాని దేశములు దిక్కుమాలినపక్షియై భ్రమించె. ఎంతెంతలో నేరములను క్షమించిన నేను నాతుచ్ఛప్రాణముపైగల యభిమానముచే వాని నిల్లు వెడలనంపితిని. అదివరకున్న శాంతమంతయు దిగమ్రింగి వట్టి యామాయకోపము నాకెటులుండివచ్చెనోకదా! వేనవేలు సేవకులకు నియామకుడైన యతడు తన యౌవనసమయంబున నెంతచింతించెనో! నన్నేమని దూరెనో! విధి పరిపాకంబున కెంతవగచెనో యాపరమేశ్వరుడె యెఱుంగు! ఆదారుణ వచనంబులు వినినప్పుడు పరమపతివ్రతయగు విందుమతి నన్ను శపింపకుండునే! బాలికయగు కర్పూరమంజరి పితృవియోగంబున గుండెవడ ముద్దులు మూటగట్టు నామె నెమ్మొగమెంత చిన్నవోయెనో, మహారాజకుమారుడై విక్రమసేనుని మనుమడై భూచక్రంబు బాలింపగల శుభలక్షణంబులం గూడుకొనిన విజయసేనుడు తండ్రిలేనిబిడ్డడయ్యెనే! ఆచిన్నబాలకు దండ్రిలేని వెలితి యెట్లుతీరు? మహామండలాధిపత్యంబు నర్పింపనీ, మేరుపర్వతంబు ద్రవ్వి తెచ్చి ముందు బెట్టనీ, వానితండ్రిని మరల దేగలమే? అది వట్టిమాట. నాయెదుటనుండి లేచిపోయి ఏదేశంబుననైనను సుఖంబుగ బ్రదికియుండునని తలంచితిగాని యింతలో దమ్ముగుజ్జ యిట్లగునని కలలోనైన దలంపనైతి. మహానుభావుండగు హరిశర్మయొద్దకు నన్ను దోడ్కొనిపొండు. నాయనుజుని చరమావస్థం గూర్చి నేను స్వయముగా నడిగి తెలిసికొనియెదన"ని యూరక వాపిడిచి వగవజొచ్చె.

# పదునాలుగవ ప్రకరణము

సింహాగిరి శ్రీనగరంబున కుత్తరమునను౦డెను. తొల్లి నారాయణుడు నరసింహావతారమెత్తి లోకకంటకుడగు హిరణ్యకశిపుని దెగటార్చి ముజ్జగముల కభయప్రధానమొసగియు దుష్టదానవుని మరణానంతరమునగూడ గోపావేశ ముపశమింపక పోవుటచే లోకములనెల్ల భస్మపటలము గావింప నుంకించెననియు బ్రహ్మాది దేవతలు భయకంపితులై వాని పాదరాజీవములకు మ్రొక్కి యవతారము నుపసంహరింపుమని ప్రార్థింప నాతడు కృపాళుడై యాగిరివద్దనే తన యవతారమును జాలించెననియు స్థలమాహాత్మ్యము నెరిగిన కోవిదు లాకాలమున జెప్పుచు వచ్చిరి. అందుచేత నాగిరికి సింహాగిరి యను పేరు గలిగె.

శ్రీనగర ప్రాంతమున నిప్పుడు సింహాగిరి యనుపేరం బరగు కొండయు లేదు. చుట్టుపక్కలగల కొండకట్టి మహిమలు గలవని చెప్పుకొనువారును లేరు. ఆగిరిలో నొకగుహాకలదు అదియెక్కువ నిడివియు దక్కువ వెడల్పుగలదై కారుచీకటులకు నెలవై భయంకరమై యుండును. ఆసొరంగమున జొచ్చిన జంతువులన్నియు మృతినొందెనని జనులు చెప్పుకొనుటయే కాని బ్రదికివచ్చెనని యొన్నడు జెప్పుకొని యెరుగరు. ఆబిలము మావులు నక్కకూతలతో బ్రతిధ్వనులిచ్చుచుండునుగాని పగలు నిశ్శబ్దమై యుండును. జనసంపర్కము రోసి యూరు బైటనే వసింప నిచ్చగించు దిగంబరయోగులు క్షపణకులు మొదలగు మహాత్ము లప్పుడప్పుడు దానియందు విడియుటయు రెండుమూడు దినములందుండి చెక్కుచెదరక యివ్వలకు బోవుటయు గలదు. మృత్యుముఖము బోలు నాబిలము జొచ్చువారెట్లు బ్రదికి బైటబడిరని కొందరు పౌరులకు సందియ మప్పుడప్పుడు తోచుచువచ్చెను. కాని యందు బ్రవేశించిన వారిమహిమయే వారిం గాపాడుచువచ్చెనని పెద్దలు తెలియ జెప్పి యట్టివారి సందియముల బాపుచు వచ్చిరి.

అట్లు హేమచంద్రుడు సోదరవియోగముగూర్చి కొండొకతడవు విలపించి తమ్ముని నిజవృత్తాంతము స్వయముగా వినగోరి మంత్రి పురోహితసమేతుడై హరివర్మవద్దకు బోవ బయన మయ్యెను. అగుటయు నప్పుడు మణిశర్మ పరిచారకు నొక్కనిం బిలిచి—"యోరీ! మహారాజుగారు సింహగిరికి పోవుదురు. అరదము నాయత్తము చేయుమని సూతునకు జెప్పుము"ని పనిచె. ఆమాటలువిని వరపాలుడు మణివర్మనుజూచి—"ఆర్యా! పోవలసినతావు మహాపురుషసమక్షము. మనల నచ్చటికిం గొనిపోవుపని భ్రాతృమరణము కావున నిది యరదంబులు నందలంబులు నెక్కి యూరేగదగిన సమయముగాదు" యని పాదచారియై మణివర్మయు మాధవసేనుడు,నిగమశర్మయు వెంటరా నిరువురు పరిచారికలు ముందునడచి మార్గంబునుండి జనులం దొలంగింప సింహగిరికింజనియె. కాలినడకను జనుచున్న మహారాజును గనుంగొని పౌరు లచ్చెరువడి యందలంబు డిగియెరుంగని యాగర్భశ్రీమంతుని నడిపించుచున్న మహాకార్య మేమైయుండునని విచారించి కారణ మెరుంగజాలక నిలువంబడి చూచుచుండిరి అవ్విధంబున గొంతసేపు నడచి నడచి రాజుపరివారసమేతుడై సింహగిరిసమీపమునకువచ్చి గుహాద్వారసమీపమున మూగియున్న వందలకొలది జనులను జూచెను. ఆ జనసమూహములో నొకడు మహాప్రభూ! నాకు గుష్టవ్యాధి యనియు మరియొకడు నన్ను రాజయక్ష్మము పిన్ననాటనుండియు బీడించుచున్నదనియు వేరొకడు నాకు కన్నులు లేవు! దృష్టి దయచేయుమనియు ప్రార్థించుచుండెను. ఆ కేకలువిని రాజు మంత్రులతో—"నీమూగిన జనంబునుం జూడ లోకములోనున్న రోగులందరు నిచ్చటికెవచ్చినట్లు కనబడుచున్నది. కేకలామహాత్ముని జపతపంబులకు నిశ్చయముగ విఘ్నము గలిగించును. ఇతడు వీరితో నెట్లు వేగుచున్నాడో కదా" యని పలికి యామందలో జొరబడి లోనికి జనజాలక యచటనిలిచె,

ఇంతలో సేవకులు రోగుల నొత్తిగించి దారిచేయుటకు నిగమశర్మ మునుముందునడచి తెరువుజూప రాజు భృత్యామాత్యసమేతుడై

గుహాద్వారమునొద్దకు జనిరయె చని కృష్ణాజినముపై బద్ధపద్మాసనము
వైచుకొని కూర్చున్నవాని రవంతయు నెరసములేకుండ మేనెల్ల విభూతి
పూసుకొన్నవాని, శిరమున రుద్రాక్షమాలికలు ప్రేలుచున్న మెడగలవాని,
సగము నెరసిన వెంట్రుకలుగల గెడ్డమువాని, భక్తిమై-'ఓంహార ఓంహార'
యని శివనామస్మరణము జేయువాని, శాంతరసమున కుప్పకట్టగువాని
హరిశర్మ యనువానింజూచి పెల్లుబికిన భక్తిరసము పెంపున హేమ
చంద్రుడు బ్రాహ్మణునకు సాగిలంబడి మ్రొక్కెను అమాత్యులు పురో
హితులునుంగూడ నమస్కరించి 'యథా రాజా తథా ప్రజా' యను
వాక్యము సార్థకము జేసిరి. హరిశర్మ కన్నులుమూసి మహేశ్వర ధ్యాన
మున నుండుటచేత రాజు నమస్కరించుటయు మంత్రులు మ్రొక్కుటయు
నెరుంగనే యెరుంగడు. నిగమశర్మ హరిశర్మ శిష్యులంజూచి—"మహా
రాజుగారి రాక నెరింగింపవచ్చునే మా గురువుల కెరింగింపుడ"నినంతను
రాజాపలుకులువిని—"వలదు వలదు తపోనిష్ఠులగువారికి విఘ్నముం గలి
గించుటనుచితము"ని వారించెను. అనంతరం గొంతవడికి హరిశర్మ తపస్సు
చాలించి కన్నులు తెరచి గుహాలు నలుదెసల పరికించి కట్టెదుట నిలిచి
యున్న యపూర్వపురుషులంజూచి మీరెవ్వరని పూర్వపరిచితుడగు నిగమ
శర్మనడిగెను. అతడును—"స్వామీ! వీరు కాశ్మీర దేశాధీశ్వరులగు హేమ
చంద్రమహారాజుగారు. మిమ్ము దర్శింపగోరి ఇచ్చటకు విచ్చేసియున్నవా"
రని ప్రత్యుత్తరమిచ్చెను. అదివిని హరిశర్మ—"యోహోహో! ఇతడే నా
శ్రితజన చింతామణి! పండితజన కమలాకర ప్రభాకరుడు సత్పురుష
సందర్శనమగుటచే నీదినము కదా సుదినము సుడీ" యని కొండొకతడవు
ప్రశంసించి వారికందరకు వ్యాఘ్రచర్మములు వేయించి కూర్చుండబనిచి
వెండియు నిట్లనియె—"మీరు రాకరాకవచ్చి మాకతిథులైరి మీకు
మేమేమి సపర్యలు చేయగలము! రత్నకంబళములపై నాసీనులగు
వారికిబులితోళ్ళు, మౌక్తికహారంబులుధరించువారికి, రుద్రాక్షమాలికలు
మంచిగంధము పచ్చకప్పురము బూసికొనువారికి బూడిదయు, మరు
వము దమనము దాల్చువారికి మారేడుదళములు సమర్పించుట మీవంటి

వారి నగౌరవించుటయే. కావున మాయనాదరణమునకు మమ్ము మీరు మన్నింతురుగాక !"

అనవుడు హేమచంద్రుడు విప్రునకుం దనయెడగల గౌరవమునకు సంతసించి వినయంబును భక్తియు మనంబున సందడింప నాతనితో నిట్లనియె—"సరిసరి! మీవల్లనా మేము సపర్యల నపేక్షించుట. మీ పాదరజంబు మాకిరీటంబుల నంటనిచ్చుటయే మిమ్ము గౌరవించుట. మీయడుగుదామరల సేవింపనిచ్చుటమే మమ్మాదరించుట. మీవలన నమోఘంబులగు నాశీస్సు నపేక్షింతుము గాని రత్నకంబళములు మౌక్తికహారంబులు హరిచందనంబుల నపేక్షింపము. మీవిభూతి పిండి కట్లు మోక్షమార్గంబునకెక్కిన సోపానంబులు. మీరుద్రాక్షమాలికలు ముక్తికాంత వలచివైచిన దామకములు. మామౌక్తికహారములు స్వయముగా గంఠమునకు దగిలించుకొనిన యురులు. ఉదయము మొదలు సాయంకాలమువరకు రాజనీతిపేర జగద్వంచనము చేయు రాజులు సంసారపుసంకెళ్ళు విడగొట్టుకొని జీవన్ముక్తులైన మీవంటిమునిరాజుల యెదుట నిలువనైన నర్హులే? మీదర్శనముచేత నేనును నాపితృదేవతలు పదితరంబులవారును నావంశస్థులును బవిత్రులమైతిమి. మీరాకచేత గాశ్మీరదేశమే యనుగ్రహింపబడినది" అని రాజు ప్రశంసచేయ నిగమశర్మయు రాజు బలికిన దంతయు సత్యమని చెప్పి తనకు దోచినట్లు తానును బ్రాహ్మణుని కొంతసేపు కొనియాడి తన యేలికవచ్చినపని విప్రునకు విన్నవింపదలచి వినయముతో—"మహారాజుగారి సోదరుడు చిత్రభానుడు హరిద్వారమువద్ద కాలధర్మము నొందెనని వినియది నిక్కమో లోకప్రవాదమో తెలియగోరి యీయన యిటవచ్చెన"ని పలికెను.

ఆ పలుకు చెవిని బడినతోడనే హరిశర్మ మొగము చిట్లించి కన్నులు మూసికొని—"హరహరా! ఆ మందభాగ్యుని దురవస్థ మరల జ్ఞప్తికి దెచ్చికొనవలసివచ్చెనా?" యని రెండుకన్నులనుండి రెండు భాష్పబిందువులు విడిచి యొకనిముస మూరకుండి హేమచంద్రు

నుద్దేశించి—"రాజా! నీసోదరవృత్తాంతము స్వయముగ నాముఖంబున వినగోరివచ్చితి గావున నిదిగో చెప్పెద వినుము. సహజకోమలములగు మామనములు చాలాకాలముక్రిందట జరిగిన వృత్తాంతములు జ్ఞప్తికి వచ్చినను క్రొత్తగా నపుడు కన్నులయెదుట జరిగినట్లు భావించుకొని దుఃఖసంతప్తములగును. నీయనుజుని చరిత్రము మిక్కిలి దయనీయ మగుటచే వానిపేరు దలపెట్టినతోడనే నాకన్నులనీరు వచ్చెడి" అని పలికి వెనుకటివృత్తాంతమును మరల జ్ఞప్తికి దెచ్చుకొనుటకు గాబోలు నాలుగైదు నిముసము లూరకుండి పైకిజూచి యిట్లని చెప్పదొడగె— "నేను పరమశైవుడను. అందుచేత శివుని సాక్షాత్కరించికొన దలచి బాల్యకాలముననాకు నాగురువుపదేశించినపంచాక్షరీమహామంత్రమును బదిలక్షలసారులు పునశ్చరణచేసి యెంతకు మహేశ్వరుని ప్రత్యక్షము జేసికొనలేక తుదకొకనాడు మెడకు గండకత్తెర వైచుకొని మహేశ్వరా! నీవు ప్రసన్నుడవు గావేని యిదే ప్రాణములు విడిచెదనని ప్రతినజేసి భోజనముమాని కూర్చుంటిని. నాటి యర్ధరాత్రమున భక్తవత్సలుడగు మహేశ్వరుడు చిచ్చుకన్నుల తోడను, చిలువపేరులతోడను, పులితోలుతోడను, బూచులబలగము తోడను, పూపచందురునితోడను, బూదిరేకలతోడను, తెల్లమేని తోడను, నల్లమెడతోడను, నాకుసాక్షాత్కరించి నన్నుబుజ్జగించి కావలసినవరములడుగుమనియె. ఐహికములగు ధనధాన్యాదిసంపదలు గోరక కైలాసంబు జూడగోరుచున్నాడ. నన్నటకు గొనిపొమ్మని ప్రార్థించితి. అతడును వల్లెయని నన్ననుగ్రహించి రెండు పసిడిపాదుకలిచ్చి కైలాసమును జూడ గోరిక పుట్టినప్పుడు వీని నధిష్ఠింపుము. అవియే నిన్నటకుం దెచ్చునని చెప్పి యంతర్హితుడయ్యె. అనేక దివ్యసంవత్సరములు తపంబుచేసి చరితార్థులైన మహాయోగులకు దుర్లభుడగు మహేశ్వరుడు నాకు బ్రసన్నుడగుటకు నాయందలి మహిమలుగాని వేరు కావు. శ్రితజనపారిజాతమగు నమ్మహాదేవునకు నాపై బొడమిన నిర్హేతుకజాయమానకృపయే కారణము.

అమరునాఁడుదయమున నేను గాల్యకృత్యముల నిర్వర్తించికొని పరమేశ్వరుడిచ్చిన పాదుకలు దొడుగుకొని కైలాసంబునకు బోవలయు నని మనంబున సంకల్పించి కన్నులు మూసికొంటి. ఆసంకల్పించుటయే యెరుంగుదునుగాని యువ్వల నేమైనదో యొక్క ముహూర్తమువరకు నెఱుంగ. ఒక్క నిముసములో నేను గైలాసంబుననుంటి. అచ్చటివైభవం బేమని వర్ణింప! అందరు మూఁడుకన్నులు గలవారె, అందరు శీతచందురుని దాల్చినవారె. అందరు పులితోలు గట్టినవారె. అందరు పాముకడియంబులు బెట్టినవారె. పసిడిపావలు దొడిగి టిక్కుటిక్కుమని నడచుచు నేను మహేశ్వరసన్నిధి కరుగుచుండ నమ్మహాదేవుఁడు నన్నల్లంతి దవ్వులఁగని సబహుమానంబుగ దోడ్కొనిరమ్మని నందీశ్వరుం బుత్తెంచె. మధ్యలోకంబునుండివచ్చిన మనుష్యమాత్రుని మహేశ్వరునంతవాఁడంత గౌరవించుటం జేసి నాయందేదో గొప్ప మహిమ యున్నదని శంకరుం బరివేష్టించిన వేలుపులందరు తలంచిరి. నందీశ్వరుఁడు నన్నదుర్కొని కౌఁగిలించుకొని చేయిపట్టుకొని దేవదేవునిసన్నిధికిఁ దోడుకొనిపోయె. శంకరుండును గృపారసపూరితంబులగు చూపులతో నన్నుం గనుంగొని సేమమరసి దేవసేనాపతియు దనకు గారాబు కుమారుండునగు కుమారస్వామిని పీఠమునుండి లెమ్మని యానతిచ్చి యాపీఠమున నన్నుం గూర్చుండ బనిచె.

అది ప్రాతఃకాల మగుటచే శంభుని సేవింప నచ్చటికి వచ్చిన మహేంద్రాది దిక్పాలకులు దక్కిన వేలుపులు ప్రమథగణంబులును నన్ను చూడ నారంభించిరి. అనంతరము భర్గుఁడు కైలాస మంతయుఁ జూచిరమ్మని యానతిచ్చి నందీశ్వరుని తోడిచ్చి నంపెను. నేను నందుగల వైచిత్ర్యంబులనెల్ల మనసారఁ గనుంగొని మరలివచ్చి భవునకు మ్రొక్కి నిలువ నతఁడు వత్సా! నీకేమి కావలయు నది కోరుమని ఆనతిచ్చె. అప్పుడు నేను భయసంభ్రమంబులతో దేవా! మరల నరకలోకంబున కరుగకుండ నిచ్చటనే యుండఁదలఁచుచుంటి. అనవుఁడు చంద్రశేఖరుఁడు కుమారా! నరకలోకంబు పాపభూయిష్ఠమై యున్నయది. నీవింకం

కొంతకాల మందుండి పాపాత్ముల బవిత్రులుగ జేయవలయు. అట్లుచేసి జీవన్ముక్తిం బొంది యిచట నుండుదువుగాక యని సాదరంబున బలికి వెండియు నన్ను నరలోకంబునకు బొమ్మని యానతిచ్చె.

## పదునైదవ ప్రకరణము

"అయ్యా! ఈ ప్రసంగమునుబట్టి నన్ను నేగొనియాడుకొను చున్నవాడనని మీరు తలంపవలదు. హరిద్వారమునొద్దకు నేను రావలసిన కారణంబును మీకెరుంగజేయక తప్పదు. కావున దాని నానుపూర్విగ నెరిగించితిని" అని హరిశర్మ పలుకుచుండ వానిమాట కడ్డమువచ్చి నిగమశర్మ—"మేలు మేలు మిమ్ము మీరు పొగడుకొను చున్నవారని యెట్టి చెనటియైన ననజాలునే. జగంబులు మీమహిమంబుల వేనోళ్లం బొగడుచుండ మీరే కొండాడుకొన వలయునా! మేమట్లు తలంచుకొనువారము గాముసుడీ" యని వాక్రుచ్చి చిత్రభానుని వృత్తాంతము నెరిగింపుమని వారిం గోరెను. హరిశర్మ చేసిన యాత్మప్రశంసవిని మణివర్మ—"ఏమిది? ఇత డప్రస్తుతములయిన యంశములను మిక్కిలి పెంచి చెప్పుచున్నాడు. చిత్రభానుని వృత్తాంతము చెప్పుటకన్న తన మహిమలు చెప్పుకొనుటయే యితనికి ప్రస్తుతమని తోచగాబోలును" అని తనలో విచారించికొని యూరకుండెను. హరిశర్మ నిగమశర్మ పలుకులనాలకించి తనయందు వారికి భక్తితాత్పర్యంబులు మందగింపక యెప్పటియట్లున్నవని తెలిసికొని చిత్రభానుని వృత్తాంతము నిట్లని చెప్పదొడంగె.

అట్లు భగవానుడగు నిందుశేఖరునిచేత నాజ్ఞాపితుడనై వెండియు బసిడిపావల దొడిగికొని బ్రహ్మకపాలంబువద్ద భూలోకము ప్రవేశించితిని. ఆతావు చేరినపిదప మహేశ్వరుడిచ్చిన పాదుకలను తొంటి

యద్భుతశక్తిపోయినది. అందుచేత నేను బాదచారినై మార్గమధ్యమున నాశిష్యులగు భైరవుని గాలకంఠుని గలిసికొని యెడనెడ జుట్టుప్రక్కల నున్న పుణ్యక్షేత్రంబుల సేవించుచు దివ్యతీర్థముల మునుగుచు హరిద్వారము చేరితిని. నేనెక్కడికి బోయినను గ్రామమధ్యమున వసించుట కిష్టము లేనివాడనగుటచే హరిద్వారమునగూడ నూరువెలుపల నొక పెనుమఱ్ఱి క్రింద విడిసితిని. అది భాగీరథీతీరముననే యుండుటంజేసియు చాలనేల నావరించుటంజేసియు బాటసారులకు నత్యంతోపయుక్తముగ నుండును. ఆ మఱ్ఱిక్రింద విడిసి యుచ్చటనొక శిష్యు నుండుమని రెండవశిష్యుడును నేనును గంగాస్నానమున కరిగితిమి. అప్పుడు త్రోవలో నొక మారేడుచెట్టుక్రింద మూలుగుచు నట్టినేలం బొరలుచు బాధపడుచున్న యొక మనుష్యునిగాంచితిమి. కౌపీనం బొక్కటిదక్క వాని మేనిమీద వస్త్రము లెవ్వియు లేవు. మంటిముంత యొండుతప్ప పాత్రములు లేవు. అతడెప్పుడు మృతినొందునా యెప్పుడు పొడుచుకొని తినగలుగుదుమా యని కనిపెట్టుకొనియున్న కాకులు, గ్రద్దలు తప్ప వేరుచుట్టములు లేరు. వాని ముఖలక్షణముల నవలోకింప నతడు సత్కులీనుడనియు మిక్కిలి గారామునం బెరిగియుండబోలుననియు మహారాజకుమారుడైన నై యుండవచ్చుననియు నాకును నావెంట నున్న కాలకంఠునకును దోచినది. ఆపన్నుల సంరక్షణమునందును భగవత్కైంకర్యమునందును శరీరము వినియోగింప దీక్ష బూనినవాడ నగుటచే నేనప్పుడు శిష్యసమేతుడనై యయ్యానదగ్గఱకుంబోయి కుమారు చుండీ నీకేమి కావలయునని బిగ్గరగ నడిగితిని. అతడప్పుడు కన్నులు దెరచి నావంక దేరిపారజూచి నోటమాట లేమిం దనకోరిక చెప్పలేక నోరు తెరచెను. అతనికి దాహము గావలయునగాబోలుననుకొని నేనప్పుడు కాలకంఠుని బంచి గంగాజల మించుక తెప్పించి మెల్ల మెల్ల వాని నోటం బోసితిని. ఆజలబిందువులు ద్రావి యతడించుక సేదదేరిన పిదప—"నాయనా! నీ వెవ్వరివాడవు? నీకింతగతి ప్రాప్తించుటకు గారణమేమి! నీకిప్పుడుగల బాధయేది?" యని యడిగి వాని

దేహతాపము నుపశమింప జేయుటకై యుత్తరీయపు కొంగుతో వించుక విసరుమని కాలకంఠుని నియోగించితి. అతడు నటు సేయువారోగి మరింత సేదదేరి మిక్కిలి హీనస్వరముతో సంగ్రహముగా తన వృత్తాంతము నిట్లని చెప్పె. స్వామీ! మీ రెవ్వరో నెరుగను గాని నాపాలి దైవంబవని భావించుచున్నాడ. నేనింక బ్రతుకుట యబద్ధము. అయినను నిన్నటినుండి నోరాఱుకొనిపోవుచున్నది. కీళ్ళలో బటుత్వము లేమి గంగకుబోయి జలంబు దెచ్చికొన జాలనైతి. దారింబోవువారి బిలుచుటకైన నోపిక లేదయ్యె. మీ యనుగ్రహమున నిప్పుడు ప్రాణమించుక చల్లబడినది. నాకథ సంగ్రహముగా చెప్పెద వినుము— "నేను కాశ్మీరమహీపాలుడగు హేమచంద్రుని తమ్ముడను, చిత్రభానుడనువాడను. నేను దనకు ద్రోహము తలపెట్టితినని మాయన్న నన్ను దేశంబునుండి వెడలనడిచె. అది మొదలు దారపుత్రుల విదర్భకంపి యేకాకినై యనేకదేశంబుల గ్రుమ్మరికుడిచినచోట బండుకొనక పండుకొన్నచోట గుడువక వ్యాధిగ్రస్తుడనై తుదకీగతికి వచ్చితిని. దైవవశమున మాయన్నను మీరు కనుగొందురేని తనయెడ నెన్నడు నేను ద్రోహముచేసి యెరుంగ ననుడు. తాను చేసిన జాగినై యాలుబిడ్డల నెడబాసి యొక చెట్టుక్రింద దిక్కులేక మృతినొందుచుంటి ననుడు. మందభాగ్యులగు నాబిడ్డల గరుణింపుమనుడు. నాపై గోపమున వారి నిరాదరింపవలదనుడు. ఒకవేళ నే నేయపరాధంబునైన దనయెడ జేసితినేని క్షమింపుమనుడు. తన పాదపద్మములకు గడసారి మ్రొక్కితిననుడు. తనకొడుకు లిరువుర ముద్దాడితిననుడు" అని చెప్పి యొక్కనిముస మూరకుండి— "స్వామీ! నాకాయాసము వచ్చుచున్నది. నేనింక మాటలాడజాల"నని యూరకుండి కన్నులనుండి సంతతధారగా బాష్పమును విడువ జొచ్చె. అనంతర మొకదినమతడు జీవించెను. కాని మరల మాటలాడ లేదు మరునాడు మధ్యాహ్న మతడు పరలోకగతుడు కా ననాథప్రేతసంస్కారము, మిక్కిలి పుణ్యప్రదమను నార్యోక్తియందు నమ్మకగల

వాఁడ నగుటచే నేను నాశిష్యులం బురికొల్పి వాని కగ్నిసంస్కారంబు గావించితిని. మరణకాలమునందు నాకతఁడు చెప్పినపలుకులు విన్నవించి కృతకృత్యుఁడనైతిని. కాని మీకధిక మనస్సంతాపము గలిగించితిఁ కదా యని చాలవగచుచున్నాఁడ. ఏకారణమునైన మనుష్యులదుఃఖింపఁజేయుమాట యాశ్రమంబునకనుచితము. అదియునుగాక బంధుమరణముచేత దుఃఖపడుచున్నవారి సమీపమున నేనుండఁ జాలన" ని హరిశర్మ వెండియు నేదో చెప్పఁబోవుచుండ హేమచంద్రుఁడు దుఃఖావేశపరవశుఁడై గోడకు జేరఁబడి మొగంబున నుత్తరీయాంచలము వైచుకొని తమ్మునిగూర్చి బిట్టువగచెను.

మణివర్మయు మాధవసేనుఁడు రాజును బట్టుకొని దుఃఖోపశమనవాక్యంబులు బలికిరి. ధైర్యమువిడిచి యుంగలార్చు రాజు దుఃఖంబుపశమింపఁజేయఁదలఁచి హరిశర్మయు నిట్లనియె—"రాజా! యీశరీరములు వినశ్వరములని యెఱింగియు నీవింత విచారింపఁదగునె! వినశ్వరంబులగు పదార్థములఁగూర్చి విచారించుట వివేకులకు ధర్మము కాదని భగవంతుఁడగు శ్రీకృష్ణుం డర్జునకుపదేశింపలేదే! భగవద్గీతలు పిచ్చికూఁతలని దుర్వారములుచేయు బౌద్ధులు భగవంతుని మాటలపై విశ్వాస ముంచరుగాని యాస్తికులమగు మనము విశ్వాసముంచి జ్ఞానవంతులము కావలదే. ఆత్మ నిత్యము; దేహ మనిత్యము. ఇది యెఱిఁగి నడచుకొన్నవాఁడే వివేకి. అందుచేత నీవు విచారింపఁజెల్లదు" అని పలుకుటయు హేమచంద్రుఁడు కన్నీరు దుడుచుకొని—"స్వామీ! నాతమ్ముని మరణకాలపు బలుకులు ములుకులై నన్నుం బీడించుచున్నవి. వాని చరమావస్థం దలఁచుకొన్న నాకడుపు చుమ్మలు చుట్టుచున్నది. 'రాజ్యాంతే నరకం ధ్రువమ్మ'ను మాట సత్యము. కటకటా! నిరపరాధుఁడగు సోదరుని నేలపాలు జేసికొంటిఁగదా. విమర్శించి కార్యంబుల జేయనివారికి ప్రాప్తించుగతు లిట్టివియేకదా. ఈభ్రాతృద్రోహి మీవంటి మహాత్ముల పవిత్రచరణంబులను ముట్టదగఁడు. నాచేసిన దోసంబునకు శాపం బేదేనినిచ్చి నను దుదముట్టించి నాయులమట దీర్పఁగదవే" యని ప్రార్థించి వానియడుగుల పడియెంబడె,

అనుగులవాలిన నేలకేసి గ్రుచ్చియెత్తి నేలవేల్పు-"చాలుచాలు రాజా! చాలు నీబేలతనము! నీగురువులు నీకు రాజనీతి నుపదేశించుటయే కాని బ్రహ్మవిద్యోపదేశంబు సేయజాలరని తోచెడిని. నీమనోవైకల్యమడగువరకు నీకు మేము తత్త్వోపదేశంబు జేయదలచుకొన్నారము. ఇది నీకు సమ్మతంబ యగునేని మాకడ కప్పుడప్పుడు వచ్చుచుండునది" అని మందలించి మంత్రిపురోహితులం జూచి-"అయ్యా! ఈతని వైఖరి జూడ నాత్మహత్య జేసికొనువాడవోలె కనబడుచున్నాడు. తొల్లి యొకఁడు నరపాలుఁడు తద్దయు సొగసులాడియగు తన రెండవ యిల్లాలు చెప్పిన కొండెములువిని పట్టమహిషివలన దనకుగలిగిన జ్యేష్ఠకుమారుని నిరపరాధుని నిష్కారణముగా వధియించి పిమ్మట కొంతకాలమున కతఁడు నిర్దోషియనివిని యా దుఃఖము పట్టజాలక తన్నుదా బొడుచుకొని ప్రాణములువిడచె. కావున నీతని దెస మీరప్రమత్తులై యుండునది" అని హితోపదేశంబు చేసి తన కనుష్ఠానకాలము మీరుచుండుటచే వారి నవ్వలకుం జనుమని వేడుకొనియె. హేమచంద్రుఁడు హరిశర్మకు ప్రణామంబు జేసి సెలవుగైకొని సపరివారముగ మరల బౌదచారియై మందిరంబునకుంజని సోదరవియోగమునుగూర్చి పరిపరి విధంబులం విలపింపజొచ్చె.

రాజునకు మాధవసేనునకు సిగమశర్మకు హరిశర్మపై నింతింత యనరాని భక్తికుదిరెను. గాని మణివర్మకుమాత్ర మాతని సంభాషణంబులు వినినది మొదలు కొన్ని యనుమానంబులు పొడకట్టె. సందర్భము పొసగియుండకపోయినను హరిశర్మ తన ప్రశంస మెండుగ జేసికొనుటయు దుఃఖముచేత మనోవైకల్యము నొందిన మహారాజునకు నుదాహరణ పూర్వకముగా నితిహాసంబను పేరుపెట్టి యొక దుష్కథ జెప్పుటయు మణివర్మకు వానిపైగల గౌరవంబును గొంత తగ్గించెను. తన మనంబునకుం బొడకట్టిన యనుమానంబులు రాజునకు విన్నవింపం దలచియు దగిన యదను వచ్చినప్పు డట్లు చేయుదమని యతఁడూరకుండెను.

హేమచంద్రుని కరవిందాదేవియు దక్కిన యంతఃపుర పరిచారకులు నెట్టెటో దుఃఖోపశమనంబు జేసిరి. వారి యుపచార వాక్యముల వలన రాజునకు బాహ్యదుఃఖము కొంత యడంగినను సంతాపము మానదాయె. అందుచేత నతఁడు దినమున కొక్కొకసారి యైన హరిశర్మ యున్న నెలవునకుం బోయి వారివలన వేదాంతవిద్య నుపదేశము నొందుచువచ్చె. తరచుగ నతఁ డొంటిగ బోవుచుండుట జూచి మణివర్మ బ్రాహ్మణుఁ డెంత యోగ్యుఁడైనను వానికడ కేకతంబుగ బోవుట రాజున కుచితంబు కాదని మందలించుచువచ్చె. హరిశర్మ భగవంతుఁడే యని మనంబున దృఢవిశ్వాసము నెలకొని యుండుటచే రాజు వాని మాటలు పెడచెవిని బెట్టెను. హరిశర్మయు రాజును మిక్కిలి గౌరవించుచు వానిమీఁద నీగ నయిన వ్రాలనీయక చీఁకటి పడువరకు వాని దనకడ నుండనీక యొకవేళ నట్లుండినచో భైరవ కాలకంఠులను సాయమిచ్చి పంపుచు కన్నబిడ్డ నట్లు కాపాడుచుండె.

## పదునారవ ప్రకరణము

హేమచంద్రుని కరవిందాదేవివలన నిరువురు కుమారు లుద్భవించిరని యీవరకుఁ జెప్పఁబడినది. అందు జ్యేష్ఠునకు హేమచంద్రుఁడు తన తండ్రియందలి భక్తి పెంపున విక్రమసేనుఁడను నామ మిడియె. రెండవకొడుకు హర్షవర్ధనుఁడను పేరంబరగుచుండె. ఆ యిరువురుబిడ్డల యందు దలిదండ్రుల యిరువుర లావణ్యంబును నిరువుర సౌజన్యతయు నిరువుర మహిమావిశేషంబును సంక్రమించెనని ప్రకృతి జనంబులు ప్రమోదభరితులుగా విక్రమసేనహర్షవర్ధను లల్లారుముద్దుగ బెరుగుచుండిరి. విక్రమసేనుని యాకృతి తండ్రి విగ్రహమునుబట్టి యచ్చుగుద్దినట్లు వెలయుచుండు. హర్షవర్ధను డచ్చముగ దల్లిబోలిక

నుదయించె. అందుచే విక్రమసేనుడు దృఢమనస్కుడై గంభీరుడై తన యీడునకు దగని పరాక్రమంబుల నప్పుడప్పుడు చూపి సార్థక నామధేయుడయ్యె. హర్షవర్ధనుని మనస్సును వానిశరీరంబువలెనె కోమలమై యుండుటం జేసి యతండు సాహసంబులకు బరాక్రమంబులకు జేర వడక సంగీతాదివిద్యలకు భూతదయకుం జేరువడియె. తమ్మునియందు భూతదయయు సంగీతప్రౌఢిమ గలుగుటచే నన్నయం దా గుణములు కొరవడియెనని చదువరులు తలంపవలదు. విక్రమసేనుడు భూతదయా విషయమునగాని వేరొండు ప్రజ్ఞయందుగాని తమ్మునకుం దీసిపోవడు; అయినను జను లాతని సాహసంబుల బలుమారు గాంచి వానికి సాహస విక్రమసేనుడనియు దమ్మున కుసుమకుమార హర్షవర్ధనుడనియు బేళ్ళు పెట్టిరి.

ఇప్పటికి విక్రమసేనుడు పండ్రెండేండ్ల ప్రాయము గలవాడు. హర్షవర్ధనునకు బదియవయేడు. క్షత్రియునకు బదునొకండవయేట నుపనయనము చేయవలసినదని ధర్మశాస్త్రములయందు విధింపబడుటచే హేమచంద్రుడు పెద్దకొడుకున కొక సంవత్సరము క్రిందట వడుగుచేసి వేదాభ్యాసము చేయించుచుండెను. ఆ యన్నదమ్ముల మైత్రి యిట్టిదని వర్ణింపనలవిగాదు. ఒకని విడిచి యొకరు నిమిషమయిన నిలువజాలరు. ఇరువు రొక్కచోటనే కూర్చుందురు. ఒకమారే భుజియింతురు. ఒక్కపాన్పుననే పవ్వళింతురు. ఇరువురు తలిదండ్రులయెడ భక్తులు. గురుజనంబులయెడ విధేయులు! భృత్యజనంబులయెడ దయాళురు. ప్రకృతిజనంబులయెడ ననురాగులు, సుగుణాలోభులు, దుర్జనవిముఖులు, అయ్యిరువురుబిడ్డలు నరవిందా హేమచంద్రులకు బున్నముప్రోవులై నోములపంటలై పుట్టి కన్నుల చందమామలై ముద్దులమూటలై పెరుగుచుండిరి. చదువులనే కాక ఈతగొట్టుట, గజాశ్వంబుల నధిరోహించుట, మున్నగు పౌరుషక్రీడలను గడుమెలకువతో నేర్చి బాలురు కాలక్రమంబున సమర్థులైరి. ఆకుమారసింహములలో సాహసుండని బిరుదు నందిన విక్రమసేనుని పరాక్రమంబుల నొకటి రెంటి బేర్కొని యతడా బిరుదమునకు దగినవాడని చూపవలసి యున్నది.

ఒకనాఁడు హేమచంద్రుఁడు సేనాపతియగు దండపాణిని బాలుఁడగు విక్రమసేనుని గొంత పరిజనంబును వెంటబెట్టుకొని యడవికి వేటకు జనియె. హేమచంద్రు డొకమూల సింగపువేట సలుపుచుండె. దండపాణి యింకొక నెలవున పులివేట సలుపనెంచి మృగయాక్రీడలలో దాను నెరప్రోడ యగుటచే దన కెట్టి యపాయంబును లేదని మాటున నిర్భయముగ నొక మఱ్ఱినీడను నిలిచి పులిరాక కెదురుచూచుచుండెను. విక్రమసేనుఁడు వాని వెనుక గొంతదవ్వున నొక మెట్టపై నిలుచుండి యీవినోదంబుఁజూడ నుత్సుకుఁడై యుండెను. అంతట వేటకాండ్రు దప్పటలం జరచుచు బొబ్బలిం దరుముటయు నామెకము తన పొద విడిచి సహజముగ జింతనిప్పుల చొప్పున మెఱయు కన్నుల మఱింత యారుణ్యమును బూని చూపరకు వెరపు గలిగింప దండపాణియున్న వలనునకు బరతెంచె. సేనాపతియు ప్రత్యాలీఢ పాదుఁడయి వింట నమ్ముఁదొడగి గురిచూచి బొబ్బలి వేసె. దైవవశమున వాని యేటు చారలమెకంబునకు దగులక చెవి పొంతనుండి దూసికొని పోయెను. పోవుటయు నాశార్దూలము తొలుతకంటె నినుమడించిన యులుకతోడను మున్నుమడించిన వేగముతోడను బాణమువచ్చినదారింబట్టి రివ్వున దండపాణిమీఁద నెగసిపడుటకు నేల యదురునట్లు పరువెత్తి రాఁజొచ్చెను. మృత్యుదేవతబోలు దాని యుగ్రరూపమును జూచి దంటలగు బంటులు ప్రాణభీతిని యథాయథులై పరతెంచిరి. వేరొక్క యమ్మును దొడిగి యేయుటకు దండపాణికి వ్యవధి లేకపోయెను. ఆయుపాయమ్మును దవ్వుననుండి చూచి సత్వరంబ తన విల్లుఁబూని విసముబూసిన వాలుటమ్ము దొడిగి యెక్కియున్న మెట్టదిగి వలదు వలదని సేవకులు మొఱలిడుచున్నను వినక దండపాణి వెనుకకువచ్చి బరిమీఁద బఱతెంచు వ్యాఘ్రంబును గాటంబుగ నాటవేసె. అయ్యేటు దిని యాక్రోలుపులి దండపాణికి రెండుబారలదూరంబున జెట్టుప్రక్కల కొండలు ప్రతిధ్వనులీయ వేటకాండ్రగుండె లవియ నొక్క యఱపఱచి నెత్తురుకండలు దొరగ నేలంగూలె. విక్రమసేనుఁడు పిరికిబంటుల

మాటవిని యొక్కనిముస మూరకుండినయెడ దన బాణాగ్నియను కాగుచిచ్చునశత్రుసైన్యమహారణ్యంబులంగాల్చు దుర్జయబాహుశాలి, దండపాణి, బెబ్బులినోటి క్రొక్క కబళమై యమపురిని బ్రాతకాపై యుండియుండును. దండపాణియు మృత్యుముఖమునుండి వెలువడి బాలునకు గను కృతజ్ఞుడై వానిం గౌగిలించుకొని వాని కావించిన మేలు మరువననియు వానిఋణ మెన్నడును దీర్చుకొనుటకు దన కలవి కాదనియు జెప్పి యనేకవిధంబుల నుగ్గడించె. హేమచంద్రుడు పుత్రుని సమయజ్ఞత చాకచక్యము విలువిద్దెయందలి నేర్పువిని తన కుమారుడు వంశప్రదీపకు డగునని సంతసించె. అరవిందాదేవియు దన చిన్న పాపని మిన్న చెయువులు విన్నయప్పుడు కన్నుదమ్ముల నశ్రు జలంబులు గార గన్నబిడ్డ నెత్తికొని ముద్దాడి జనుల దృష్టిదోషము దగులకుండ వానికి దృష్టి తీయించెను.

మరియొకసారి విక్రమసేనుడు హర్షవర్ధనుడు వైశాఖమాసమున నొక సాయంకాలమున నుద్యానవనమున నొక కొలనియొడ్డున విహరించుచు చల్లగాలి ననుభవించుచుండ దండపాణికొడుకు హర్షవర్ధనుని యీడువాడు తోడిబొట్టియుల గూడుకొని యాకొలంకున జలక్రీడలు చేయుచు నాటలసందడి నపాయ మెరుంగక నోలయోల యని కేకలు వేయుచు లోతునీళ్ళకుబోయె. ఆ బాలుడు సరిగ నీత నేరనివాడగుటచే మునుముందు పోవుటయే కాని లోతునీళ్ళనుండి మరల నేలకు రా నేరక యలసి నీట నొకటిరెండు మునకలు వైచె. అది గట్టుననుండి చూచి విష్ణుదత్తుడు మునిగె. మునిగెనని హర్షవర్ధను డన్నతో జెప్పెను. అప్పలుకులువిని వినినతోడనే విక్రమసేనుండు జాలినొంది తలమీది రతనాలకుళ్ళాయి నేలంబారవైచి విలువదువ్వలువలు దడిసి చెడిపోవునని వగవక తనచేత నప్పని యగునా కాదా యని విచారింపక తన సాయంబున కెవ్వరి జీరక గుభాలున నీటందుమికి వడివడి విష్ణుదత్తునియొద్ద కీదుకొనిపోయి యామందభాగ్యుని జుట్టుబట్టుకొని యావలకు లాగికొనివచ్చి బ్రతికించెను. తన నందనునకు వాటిల్లిన

యుపాయంబును రాజనందనుఁడు గావించిన సాయమును విని దండపాణి సత్వరంబ యచ్చోటకు వచ్చి కుమారునకుఁ గాలోచితములగు నుపచారములు చేయించి యతఁడు తెలివొందినపిదప రాజకుమారుని బిగ్గర గౌఁగలించికొని-"వత్సా! నాకును నాకుమారునకును నీవు ప్రాణప్రదాతవైతివి. మేమిరువురమును మాశరీరచర్మములు గోసి నీకు పాదరక్షలుగ గుట్టించి యిచ్చినను మీఋణంబు తీరదుసుమీ!" యని కొనియాడి తన పట్టిని వెంటబెట్టుకొని యింటికిఁ బోయెను. అసమానమగు రూపంబునకు దగిన విక్రమంబును విక్రమంబునకు వన్నెవెట్టు సుగుణసంపదయుఁగల విక్రమసేనుని జూచి రాజబంధువులు ప్రకృతి జనంబులు మహానందమగ్నులయిరి. ఈ ప్రకరణంబునఁ జెప్పఁబడిన ప్రథమ సాహసకార్యము హరిశర్మ యప్పటికి వచ్చుటకు నాలుగు మాసముల క్రిందటను రెండవది నెలక్రిందటను జరిగెను. పండ్రెండేండ్ల ప్రాయము నాఁడే యింత మగంటిమి జూపిన యీ బాలకుఁడు యుక్తవయస్కుఁడై రాజ్యమును వహించుపిదప వానిపేరు శత్రుమహీపాలురకు హృదయశల్యంబుగాక యుండునా యని తలంచి మణివర్మ మారవసేనుఁడు మొదలగు మంత్రులు సంతసించి కాశ్మీరమున కంతకంతకును మంచి దినములు వచ్చుచున్నవని సంతృప్తహృదయులయిరి.

హేమచంద్రుఁడు చిత్రభానుని దుర్మరణంబునకు విని దురపిల్లె నప్పుడు విక్రమసేనుఁడును బినతండ్రి చావునకు బిట్టువగచెను. కాని బాలుఁడగుటచే వాని దుఃఖము తండ్రివగపుంబలె దీర్ఘకాల ముండక మఱునాఁడె యుపశమిల్లె. ఆ దినము మొదలు హేమచంద్రుఁడను దినము సాయంకాలమున రాజకార్యములు ముగించి హరివర్మ యొద్దకుం బోయి వేదాంతగోష్ఠి నడుపుచుండుటచే విక్రమసేనహర్షవర్ధనులు మహామహిమములును బేరువడియున్న హరిశర్మ నొక్కసారి చూడఁగోరి యొకనాఁడు సంజకడ దండ్రికడకుఁబోయి నీవడుగుము నీవడుగుమని యిరువురు వంతులువోయిరి బిడ్డలు తన్నేదియో కోరదలంచి భయంబు పెంపున నడుగ సాహసింపఁజాల కున్నవారని హేమచంద్రుఁడు

గ్రహించి వారి జేరఁజీరి మేనులు దువ్వి—"వత్సలార! మీ కేమి కావలయును? భయము లేదు చెప్పుఁడ"ని హెచ్చరించెను. అప్పటికిని విక్రమసేనుఁడు తన కోరికఁ బయలుపుచ్చక యూరకుండెఁ. తండ్రి బుజ్జగింపుచే భయము విడిచి హర్షవర్ధనుఁడు మెల్లన నిట్లనియె—"మీ వంటి యుత్తము లనుదినంబును బోయి కొలువదగిన మహిమలుగల హరిశర్మ నొక్కసారి చూడ నభిలాష పడుచున్న వారము. మా కోరిక కోరరానిది కాదేని మమ్ము మీ వెంట రాననుగ్రహింపుఁడు." అనవుఁడు చిరునగవునవ్వి—"వత్సలారా! ఈపనికింత వేఁడవలయునే! మీ కొకసారి యమ్మహాత్ముని జూపవలయునని నేనుం దలచుచున్నవాఁడ. ఇప్పుడ నేనచ్చటికిం బోవుచుంటి. నా వెంటరండు. మునిం జూచి వత్తురుగాక" యని పలికి తన కొదములు వెంబడింప గుహకు జను మృగరాజు చందంబున గాశ్మీరరాజు కుమారసింహములు వెంటరా మునియున్న గుహకుఁ జనియె. మునియు రాజును సూర్యచంద్రులం బోలె వెలయు నక్కుమారులను గారవించి వారు నమస్కరింప నాశీర్వదించి వ్యాఘ్రచర్మముపయిఁ గూర్చుండఁ జేసి తన యొద్దనున్న బూడిద నించుక వారి నొసళ్లఁ బూసి రేని నుద్దేశించి—"మహేంద్రా! నీ వదృష్టవంతుఁడవు. నీకుం బుత్రరం బొడమిన యారత్నంబు లమూల్యంబులు. దైవము రక్షించిన నింక నైదారేండ్లలోన పెద్దబిడ్డఁడు రాజ్యభారమును వహించి నీకు విశ్రాంతి నొసంగగలఁడు" అని బహూకరించెను. రాజు వాని బహూకరణమునకు లోనగుచు నలరి—"దైవానుగ్రహంబును మీ యాశీర్వచనమును జల్లగ నుండునేని మీ రన్నయట్లు కాగలఁడు. దాని మాట యటుండనిండు. నా చిత్తంబు తమ్మునిదెస మరలింపఁ జాలకున్నవాఁడ. కుమారుఁడు యుక్తవయస్కుఁడు కాక మున్న మహారాజ్యమునకు వాని నభిషిక్తునిఁ జేసి మీ యనుజ్ఞ యగునేని నేను విరాగినై కాలము బుచ్చువాఁడన"ని చిత్తంబునగల యుత్తలంబు సంగ్రహంబుగఁ దెలిపె.

తండ్రిపలుకులు చెవులఁబడినతోడనే బాలకులిరువురు తెల్లబోయి యొండొరుల మొగంబుల జూచుకొనసాగిరి. దానికిం దోడుగ హరిశర్మ

రాజు నుద్దేశించి యిట్లనియె—"నీకంత వైరాగ్యంబుబూన నిచ్ఛగల దేని యడవుల నుండనక్కఱలేదు. రాజ్య మేలుకొనుచు సకలోప భోగంబుల ననుభవించుచు నఖిల లౌకిక వ్యాపారంబుల మెలంగుచు జనకచక్రవర్తి యట్లు శరీరసన్యాసంబుగాక యాత్మసన్యాసంబు స్వీక రించి మంటిలోనుండియు మున్నువంటని కుమ్మరి పురుగు తెరంగున సంసారంబునందుండియు లేనట్లు వర్తింపవచ్చును. నీవు తరియించుటకు సాధకంబగు మంత్రమొకటి నీకుపదేశించెద. అది పుణ్యదినమున, నర్ధ రాత్రమున నుపదేశము కావలయును. దాని పునశ్చరణ మతికఠినము. పునశ్చరణమును హితోపదేశమును మాపులు మాగుహ యుంద చేయుదగు. దీని నీయులనుట యఖిలం బుపశమిల్లు, భవరోగంబులకు మహామంత్రంబులు దివ్యౌషధంబులుగదా!" అని హారిశర్మ పలుకు టయు బాలుర నెమ్మొగంబులు మరింత దెలివితప్పి వెలవెలబోయెను. హేమచంద్రుడు హారిశర్మ పలుకులకు దద్దయు నలరి వాని చరణంబు లకు సాష్టాంగ నమస్కార మొనర్చి—"స్వామీ! మీకు నాపై నింత మాత్ర మనుగ్రహ మెన్నడయిన గలుగునా యని మేఘసమయంబు నకు స్వాతివానకును తైఘాదిస్పయట్లు నామనంబున బ్రతీక్షించుచున్న యుండు. పుణ్యదినంబును సుముహూర్తంబును మీరి యేర్పరుపుడు. అర్ధ రాత్రమందా మంత్రరాజంబు నుపదేశంబు నొంది మూపు లిచ్చుటనే పునశ్చరణము చేసిన సిరి రామోహాలోడ్డువా రెవ్వరు?" అని నుడివి వారియొద్ద సెలవుంగైకొని కుమారద్వయ సమేతుడయి యంతిపురికిం జనియె. అంతిపురిం జొచ్చినతోడనే బాలకు లిరువురు పరుగుపరుగున దల్లికడకుంబోయి తండ్రికోరికలు, మునియిచ్చిన వరంబులు పూస గ్రుచ్చిన ట్లామెకుం జెప్పిరి. అరవిందాదేవియు, దద్వచనముల నాల కించి మహారాజు విరాగియై యేయడవులకు జనునో, యెప్పుడు సన్య సించునో యేమి సాహసంబు గావించునోయని భయపడి యడుగుటకు నడుగకపోవుటకుగూడ వీలులేని యవస్థ వచ్చినదికదాయని యెద్దియుం దోచక విచారించుచుండె.

చుచు నెప్పుడు తెల్లవారు నెప్పుడు తన ప్రాణవిభుఁడు కంటఁబడునని ప్రభాతమును నిరీక్షించుచుండ నంతలో నాల్గవజాము కోడికూత వినంబడియె. మణివర్మయు మాధవసేనుఁడును నిద్రలేచి రాజగృహంబునకు వచ్చి రాజు నిమిత్త మెదురు చూచుచు ద్వారములయొద్ద నిలిచి యుండిరి. హేమచంద్రుఁడు పెందలకడ మేలుకాంచి హరిశర్మవద్ద సెలవుగైకొని గుహవిడిచి నిజగృహంబునకు బయలువెడలి వచ్చుచుండ మహారాజును మార్గమధ్యమున బౌరులనేకులు చూచి మహానందభరితులై—"యదిగో మహారాజు నిరపాయముగ గృహమునకు బోవుచున్నాఁడు. హరిశర్మ యేదో మహాపకారమును జేయునని భయంపడి మనమందరము వానిని నిష్కారణముగ నిందించి పాపము మూటగట్టుకొంటిమి. చిక్కుచిదరగ మనప్రభువు మనకు దక్కినాఁడు. మహాతపశ్శాలురగు బ్రాహ్మణోత్తములు నిర్నిమిత్తముగ నిటువంటి రాజునకు నపకారము సేయఁ జేయుదురా" యని యొకరితో నొకరు చెప్పుకొనిరి. మేలు జలతారు వెలువలు, బంగరునగలు, రత్నహారములు దాల్చి పట్టునారచీరలు గట్టుకొని యా మహాభోగి జోగిచందమున నిల్లు సేర మణివర్మయు మాధవసేనుఁడు మొదలగు నాప్తులందరును దొల్లి తల్లిపంపున నిల్లువిడిచి వల్కలములు గట్టుకొని కారడవుల గాపురము సేయఁబూనిన శ్రీరామచంద్రుని విరటుని కొలువుకూటమునకు గంకుభట్టు వేషమున బోయిన ధర్మరాజును బ్రత్యక్షముగ జూచినట్లు భావించి ఖిన్నమనస్కులైరి. హేమచంద్రుఁడు ద్వారమువద్ద దన నిమిత్తము కనిపెట్టుకొనియున్న మంత్రులను బలుకరించి యంతఃపురికి జనియె.

అతఁడు లోనికిం జనినపిదప మాధవసేనుఁడు మణివర్మతో మెల్లగ—"మిత్రమా! మహారాజుగారు కుశలముగ నిల్లు సేరుటం జేసి మనము భయము విడిచిపెట్టవచ్చునని తోచుచున్నయది" యని పలుక మణివర్మ మనోవిచారమును సూచించుమందస్వరముతో—"'నిల్లు సేరఁగానే పండుగ కాదుగదా! ఈ కుశలము కుశలమా? ఇరువది యొక్క దినములు నిరపాయముగ గడపవలయు. బ్రాహ్మణుఁ డీయూరు విడిచి

పోవలయునప్పుడు రాజుగారు సురక్షితులని మనము నమ్మవలయును. అంతవరకు నాకు ధైర్యములేద"ని చెప్పి మాధవసేనునితో గలిసి కార్యాంతరములమీఁద బోయెను.

అరవిందాదేవియు కుమారులును హేమచంద్రుని గనుంగొని యింతింత యనరాని మహానందమునొందిరి. దారాపుత్రుల మొగములు దీనములై యుండుట గనుంగొని హేమచంద్రుడు వారిని దగ్గరకు బిలిచి లాలించి తన కపాయమేమియు లేదనియు విచారింపవలదనియు నెన్నియో భంగులం జెప్పి యిరువదియొక్క దినంబులు నిరువదియొక్క గడియ లట్లు వెళ్ళిపుచ్చి వత్తునని దృఢంబుగ బలికి మరల నెప్పటియట్లు రాత్రి గుహకుబోయి మంత్రము పునశ్చరణము జేసి మఱునాఁ డుదయమున నింటికివచ్చెను. అట్లిరువది దినములు గడిచెను. ఇరువదియొకటవ నాఁ డుదయమున నరవిందాదేవి మగని వ్రతసమాప్తి దాదాపుగనైనది యెంతయు సంతసించి యా యొక్క రాత్రియు గూడ నెట్లెట్లో గడచిన తోడనే తన మ్రొక్కులు దీర్చవలయునని నిశ్చయించి మంచిగోవులు వేయి తెప్పించి సిద్ధముగ నుంచుమనియు గుంకుమ మ్మైలై పది తెప్పింపుమనియు మంత్రికి నర్మదచే వర్తమానమంపి తద్విషయ ప్రయత్నమున నుండెను.

## ఇరువది నాలుగవ ప్రకరణము

ఇరువదియొకటవనాఁడు హేమచంద్రు డెప్పటియట్లు సాయంకాలము వియుతుడై యేకాంతంబ గుహకుం జనియె. ఇరువది దినముల నుండి సరిగా భోజనము చేయకపోవుటచేతను మాపులు తిన్నగ నిదుర లేకపోవుటచేతను వాని శరీరము కృశించి మొగము వెలవెలబారి చూపరకు విచారము గలిగించుచుండెను. గుహకు జనినపిదప హరిశర్మ వాని నెప్పటియట్లు సమ్మానించి యిట్లనియె—"రాజా! ఈ యిస

పదిదినంబులు దైవభక్తిచే నీవు గడు శ్రమనొందితివి, ఈరేయి నీవు
జాగరూకతతో గడుపుదువేని నీకష్టము గట్టెక్కు; కాని యున్నదినము
లలో నిదియే గడుదినము, నీకుపదేశింపబడిన మంత్రప్రభావముచేత
మహేశ్వరు డనేక రూపములదాల్చి నీమనోనిశ్చలత శోధించును.
అప్పుడు నీవు జంకుదువేని మిగుల నపాయము వాటిల్లగలదు. ఈ
మాటలు నీకిదివరకే చెప్పియుంటిని. నీయందుగల ప్రేమాతిశయమున
మరల జ్ఞప్తికి దెచ్చితిని" అని హరిశర్మ పలుకుటయు హేమచంద్రుడు—
"స్వామీ! అపాయము వాటిల్లినను నాకు విచారములేదు. ఈశ్వర
సేవాసక్తుడనై యుండి మేను విడుతునేని నాకంతకన్న భాగ్యము
గలదే! శోధించుటకైననుసరే, బాధించుటకైననుసరే, ఈశ్వరుడు
నాకు బ్రత్యక్షమైనచో నాకదియేచాలున"ని నిశ్చింతతో బలికి గురువు
ననుమతిబడసి బద్ధపద్మాసనస్థుడై వ్యాఘ్రాసనాసీనుడై జపమాల జేత
బుచ్చుకొని పునశ్చరణ మారంభించెను. అతడు పునశ్చరణ మారంభిం
చినతోడనే హరిశర్మ యచ్చోటువిడిచి యెందుకడకుబోయెను భైరవ
కాలకంతులు రాజన కాపూట గానబడనేలేదు. ప్రపంచ మంతయు
గారుచీకటులు క్రమ్ముకొని యుండుటచే భగవంతు డిచ్చిన కన్నులు
నిరర్థకములయ్యెను. చుట్టుప్రక్కలకొండలలోనుండి నక్కలు తోడేళ్ళు
మొదలగు జంతువుల కూతలెకాని మనుష్యులధ్వని యెక్కడ నాడు
వినబడదయ్యె. ఎందుచేతనో హరిశర్మ హోమగుండమందలి యగ్నిని
గూడ నాటిరేయి యార్పివేసెను. నాటిరేయి తెల్లవారువరకు పునశ్చ
రణముచేయవలెనని సంకల్పించుకొని హేమచంద్రుడు పరమనిష్ఠుడై
కూర్చుండెను.

రెండుజాముల రాత్రియైనపిదప నొక మనుష్యుడు తన యడుగుల
చప్పు డెవరికైన వినబడునేమో యనుభయమున నలుకుడుగాకుండ నడ
చుచు మెల్లమెల్లగ గుహను జేరెను. దారిచూచుటకు రెండుకన్నులను
దప్ప దక్కిన శరీరమంతయు నతడు కంబళముతో గప్పుకొనెను. గుహ
చేరినతోడనే వానిచంకనున్న వస్తువేదో రాతిగోడకు తగిలి టక్కు-

మని చప్పుడయ్యెను. ఆధ్వని హేమచంద్రుని చెవులం బడియెగాని తపోవిఘ్నమగునను భయముచేత వెనుకకు దిరిగి చూడగూడదని గురువానతిచ్చుటచేతను దన వ్యాపారము సతడు విడువక నిశ్చలుడై యుండెను. అంతలో మనుజు డిట్టు పడిచిన ఘులుకుడు వానికి శ్రవణగోచరమయ్యెను. అప్పుడించుక భయమున వాని మేనంతయు నొక్కసారి వడఁక వెంటనే ధైర్యము దెచ్చుకొని భగవానుడగు శంకరుడు తన్ను శోధింప వచ్చియుండబోలునని యెదురుబెదురు లేక మరింత గాటముగ పునశ్చరణము సేయనారంభించెను అంతలో నెవడో యొకడు సన్నని దీపము బట్టుకొని గుహకు దూరమున నొక నిముసము నిలిచి వెంటనే యవ్వలకుంజనెను. క్రొత్తగా గుహాం జొచ్చినవానిని హేమచంద్రుడు చూచుటకు వీలులేకపోయెను గాని యాదివ్వె వెలుగున నాక్రొత్తవాడు హేమచంద్రునకు వెనుకప్రక్కనుండి వానియునికినంతయు సరిగ గని పెట్టుటకు వీలుగలిగె. అప్పుడా నూతన పురుషుడు చంకక్రిందనున్న ఖడ్గమునుదీసి తపోనిష్ఠుడగు హేమచంద్రుని శిరస్సు నొక్కవేటువం దెగవేసె. పునశ్చరణసంఖ్య లెక్కించుటకు ముడిచిన వ్రేళ్ళుముడిచినట్లె యుండ పద్మాసనము వేసిన కాళ్ళు వేసినట్లె యుండ శిరస్సు బంతివము వున నెగిరి రెండు గజముల దూరమునబడియె. చిమ్మిలిగొట్టములనుండి వసంతమువచ్చు తెరంగున కంఠనాళములనుండి క్రొన్నెత్తురు ప్రవాహములుగ బైకివచ్చి యాస్థలమంతయు దడిపె. ఆక్రొత్తమనుష్యుడీ దారుణకృత్యమును నిర్వర్తించి తత్క్షణమె యచ్చోటు వాసి యెందేని జనియె. హరిశర్మగాని భైరవ కాలకింకరులుగాని యచ్చట గనంబడరైరి.

## ఇరువది ఐదవ ప్రకరణము

"హృదయేశ్వరా! హృదయేశ్వరా! మీవాలకమింత పాడువారినదేమి? ఎందుపోయెద రెందుపోయెదరు. నిలుడు నిలుడు" అని

యరవిందాదేవి కలవరించుచు నిద్రలో నించుక యేడ్చెను. అది విని నర్మద నిద్రాసక్తయగు దేవిని మేలుకొలుప దన పండుకొన్న తావు విడిచి పోవుచుండునంతలో నరవింద బాష్పాకులితములగు కన్నులతో కళవళపడుచు మనసుతో మేల్కాంచి—"నర్మదా! నర్మదా! సత్వరము వచ్చి నన్ను కౌగిలించుకొనవే! అబ్బబ్బా! యెంత పాడుకలగంటినే! అదేమో నాయొడలు వడకుచున్నదే" యని డగ్గుత్తికతో బలికెను.

అమ్మాటలు ముగియునప్పటికి నర్మదయు నద్దేవి సమీపమునకు బోయి—"అమ్మా! భయములేదు. ఇదిగో నేవచ్చినదానన" ని యామె మీద జేయివైచి యించుక దట్టి యప్పటికిని మేను వడంకుదీరమి సందిటంబట్టి కౌగిలించుకొని కాలోచితములగు కొన్ని పలుకులు బలికి ఆమె నూరడించి కొంత గడవైనపిదప—"నమ్మా! మీకింత భయము గలిగించిన యాస్వప్న మెట్టిదో నాకెఱిగింపగలరే!" యని యడిగెను. "నర్మదా! ఒక్కనిమిసములో చెప్పగలను. ఇంకను నామనసు మనసులో లేదు. గుండె చెదరియున్నద" ని కొండొక సేపూరకుండి యించుక భీతిదొలగి లేచికూర్చుండి యమ్మగువ నర్మదతో నిట్లనియె—"నర్మదా! పుట్టి బుద్ధియెరిగి యింతటి పాడుకల నేనెన్నడు గనలేదు. అది వెండియు దలపునబొడమ నాశరీరము కంపించుచున్నది. అందుచే నది సంగ్రహముగ నీకు దెలిపెద. కన్నుమూసి కునికినచో నేదుస్స్వప్నములు వచ్చునోయను భయమున నిదురవోవకయె నలుగెలంకులు జూచుచు మేలుకొంటి మహారాజుగారు గుహకు బోవుట ప్రారంభించినది మొదలు నేటిదనుక నిద్రాహారములు సరిగ లేమి బడలికచే నెటనుండియో మాయనిద్రవచ్చి మైకము గ్రమ్మినట్లు కన్నులు మూసినవి. తిన్నగా కన్నులు మూసితినో లేదో వెంటనే నన్ను కునుకుపట్టి సరిగా బట్టినదో లేదో వెంటనే, యీ పాడుకల గాంచితిని. మహారాజుగారు శరీరమునిండ నూనె పూసికొని నల్లని వస్త్రములు గట్టుకొని కోటవిడిచి యెక్కడికో పోవుచున్నట్లు కల గంటిని. అబ్బా! మరల నామేను వడంకుచున్నదే" యని నర్మద గౌగిలించుకొని మరల నిట్లని చెప్పదొడంగెను—

"అప్పుడిది యేమి వాలకమని పలికి నేనాయన పయనమును వారింపదలంచితిని. నామాటలకాయన ప్రత్యుత్తరమునే యొసంగక జాలినించుచూపుల నావంకకే జూచుచు యుద్ధేచ్ఛం జనియెనట" అని తన కథ తుదముట్ట జెప్పకమునుపే రెండవకొడుకగు హర్షవర్ధనుడు— "నాన్నగారూ! గుహకుబోవలద"ని కలవరించె. ఆ బాలకుని కలవరింత విని యాకాంత మరింత చింతాభరముచే గుంది నర్మద నుద్దేశించి వెండియు నిత్తెరంగున భాషించె—"చూచితే నర్మదా! బాలకుడు నయిత మెట్లు కలవరించుచున్నాడో! ఈకలవరింతకు నీస్వప్నములకు నేదో సంబంధమున్నదని నేను భయపడుచున్నదానను. పెద్దకలలుమూడ దలచిన కీడులచాయలని స్వప్నవేదులు వచింతురు. ఆకలగన్నది మొదలు నాకడుపు చేయిపెట్టి కలచినట్లున్నది. మనసు నిష్ఫలం బొరలిన చందమునయున్నది. ఉపద్రవంబను మహాసముద్రము కన్నులకు కట్టినట్లగపడుచున్నది. ఈకల యున్నికలలవంటిది కాదు. ఎన్నిసారులు స్వప్నములు గాంచలేదు. ఎన్నడయిన చిత్తమింత యుత్తలపాటు నొందెనే" యని కుమారు లిరువురిమీద జేయివైచి రెండు కన్నుల నుండి రెండు బాష్పబిందువులు గాల గద్గద కంఠముతో నాచిన్ని యన్నల యదృష్టము లెట్లున్నవో యని యవ్వల బలుకలేక యూరకుండెను.

ఆ స్వప్నవృత్తాంతమువిని యామె తత్తరపాటు జూచి నర్మద సహజముగ గంభీర స్వభావయయ్యు హృదయ దౌర్బల్యము గలిగి యాదేవి యుత్తరపాటును శాంతింపజేయుటకు లేని ధైర్యము దెచ్చుకొని యల్లన నిట్లనియె—"అమ్మా! కలలు నిక్కంబులగునా? ఒకప్పుడు స్వప్నములో నెంతటి యసందర్భములయిన జూచుచుందుముకదా! ఒకనరుడు తాను మృతినొందినట్లు తన శవమును నరులు మోసికొని పోవుచుండ వారితో దాను మాట్లాడినట్లు కలగాంచు. అది యసంభవముకదా! కలలోవచ్చిన యాపద లాపదలా? సంపదలు సంపదలా? పగలెల్ల మన మేపదార్థముమీద దగిలియుందుము నాపదార్థముగూర్చియే స్వప్నములు

వచ్చుచుండును. మహారాజుగారింగూర్చి మీకు కడుభయము పొడముచుండెడి గావున మీభయమున కనురూపములగు స్వప్నములే వచ్చుచున్నవి. కలలోనైన హేమచంద్ర మహారాజుగారి కాపద రాదు."

అనవుడు నామాట తనమనంబునకు బరమానందదాయక మగుటచే నయ్యారవింద—"నర్మదా! యింతమాటబుట్టి నీనోటి వాక్యమున రాజుగారు చిక్కుదీరక నాకన్నులకు గానబడుదురేని నీనోటినిండ గలకండఖండంబులు బెట్టెదను. నీమేను బంగారముతో నింపెదను. అంత భాగ్యము నాకబ్బునా! నర్మదా! ఏమయిననుసరే నాబొంది యిచ్చట నున్నది గాని యాత్మ యిటలేదు. ఇప్పు డెంత రాత్రియైనదో చూచి నాకును రాజ్యలక్ష్మికిని బితృప్రాయుడగు మణివర్మ కడకు నీవుపోయి నాకన్న కలయును నాయున్నయునికియు నన్ను బొదివిన వెరపుతెరంగును నాతనికి జెలిపి కతిపయ పరివారముల దోడ్కొని గుహావద్దకుబోయి మహారాజుగారిస్థితి నరసి కుశలవార్త నాకుబంపుమని చెప్పవలయును. ఎన్నివిధముల నివారించుకొన్నను మనసు కీడునే శంకించుచున్నదిగాని శుభమును శంకించుటలేదు. తన సహాయమే రాజకుటుంబమునకు వజ్రకవచ మనుము. రాత్రి యని బద్ధకింప వలదనుము, ఈ రాత్రి గడపితిమేని యాపద గడపితిమనుము, తత్క్షణము చనుమనుము. త్వరపెట్టుము."

నర్మదయు నట్లగా యని యాక్షణము లేచి యొక దివ్వె చేత బూని బలుతనముగల యిరువురు బంట్లను దనకు సాయము జేసికొని మందిరము వెడలి ప్రతీకవాటమువద్దనున్న యారెకులు నడిరేయిం దన పోకకు గారణంబు ననేక ప్రశ్నంబులు వేసి యడుగ వారి కందరకు దగు ప్రత్యుత్తరంబుల నిచ్చుచు గోటదాటి రాజవీథిం గొంత దవ్వు పోయి మంత్రియగు మణివర్మ గృహంబునకుజని ద్వారమువద్ద నిలిచి తానెరింగిన సేవకు నొక్కని నెలుగెత్తి పిలిచెను. పిలుచుటయు సేవకుడు బండనిద్దురలోనుండి మేల్కని తలుపు దీయకపోవుటచే మేడ మీదనున్న మణివర్మయే యామె పిలుపునకు బలికి సేవకుని లేపి

తెలుపుదీయించి యంతటి యర్ధరాత్రము నంతఃపురపరిచారిక తన ఇంటికి వచ్చుటకు నుత్కృష్టమయిన కారణ ముండవలయునని యది తెలిసికొనుటకు వేగిరపడి మేడమెట్లుదిగివచ్చి—"నర్మదా! రాజుగారికి కుశలమా? అంతఃపురమున నద్భుతవార్త లెవ్వియు లేవుగదా? ఇట్టి సమయమున నీవు నాకడకు రాగతమేమి?" యని గుక్క తిరుగకుండ నొకమాటవెంట నొకమాట వచ్చునట్లడిగెను. నర్మద యా నుడువులువిని—"దేవా! అంతఃపురమున నద్భుతములు లేవు. దేవిగారు దుస్స్వప్నమొకటిగాంచి మహారాజుగారి క్షేమమును గూర్చి సందియము నందుచున్నారు. కలలు నిక్కువంబులు గావని నేనెంత ధైర్యము చెప్పిననామె నిలుచుటలేదు. ఆయుధహస్తులగు కొందరు పరిజనుల వెంటబెట్టుకొని సింహగిరివద్దకు మిమ్ము బొమ్మని వేడుకొనుటకు నన్ను బంపిరి. ఆమె యిప్పుడు మతిలేక యున్నది. ఆమె ప్రార్థనమున కనుగుణంబుగ మీరు వర్తింతురేని నేనత్వరంబ యామె సముఖమునకు జనియెద. ఈసమయమున నేను దాపునలేకున్న నామెచింత యినుమడించు. మీాద దేవరచిత్తము" ని చేతులు జోడించి వాని యెదుట నిలిచెను.

మణివర్మ తచ్ఛ్రుతిమాటవిని తలయెత్తి యాకసమువంక చూచుచు, నొక్క నిముసము నాలోచించి—"నర్మదా! దేవిగారి యానతి చొప్పున నిప్పుడే కొంత పరివారము దీసికొని యానెలవునకుబోయి రాజుగారికుశలవార్త తెలియవచ్చెదనని చెప్పుము. నామనస్సును సందేహావిష్టమగుటచేత నేను నిదురవోవక నీవు వచ్చునప్పటికి మేల్కొని యిట్టటు దిరుగుచుంటిని. ఈ విషయమున దేవిగారెంత భయపడుచున్నారో నేనును నంతే భయపడుచున్నవాడను. ఇదిగో, నేనిప్పుడే దండపాణి మాధవసేన ప్రముఖులను దోడ్కొని యచటికి బోయెద. నీవంతిపురి కరుగుము" యని [illegible] యొక సేవకునిం బిలిచి—"ఓరీ! సింగవర్మను, మాధవసేనుని, దండపాణిని తత్క్షణము నాకడకుం దోడ్కొనిరమ్ము" ని పంపెను.

అనంతరము నర్మదయు మణివర్మవద్ద సెలవు గైకొని మరల నంతిపురికరిగి మంత్రివచనంబులు రాజపత్నికిం జెప్పె. అన్నెలత చన్న

ప్రాణముపడియుండి క్రొన్నెత్తురులు చూచుటచేత బెదరి చీకటులు గ్రమ్మిన కన్నులు దెరచి—"యింకేమున్నది! మన మహారాజు నేల పాలయ్యె. హా! మహారాజా!" యని మూర్ఛిల్లెను. సేవకు లందరు హాహాకారములఁజేయ గుహ ప్రతిధ్వను లెసెంగెను. మణివర్మ నూరడించుటకు దండపాణి ప్రముఖులు నెత్తురులోనం జదికిలబడిరి. మాధవసేనునకు గన్నులనీరు కాల్వలై పారజొచ్చె. నిగమశర్మ మేను ముచ్చెమటలంబోసె. పరిజనమ్ము లొక్కరొక్కరుగ లోనికి వచ్చి రేపం గాంచి నెత్తినోరు గొట్టుకొనువారును, రొమ్ము మోదుకొనువారును, తల రాళ్ళం గొట్టుకొనువారు, నిలువలేక యున్నచోటనే చదికిలబడువారు, హరిశర్మం దిట్టువారు నై యుండిరి. అప్పుడు నిగమశర్మ మిక్కిలి గడుసుతనము లేని ఛాందసుఁ డగుటచే యూరడిల్లఁజాలక వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనియె—"అయ్యయ్యో! ఈ యుపద్రవంబునకంతకు గారణము నేనే. హరిశర్మ మేకవన్నె పులియని యెఱుంగ! వాని మహిమలు వేయినోళ్ళం బొగడి మహారాజుగారి ప్రాణము తీయించితిని. దురాత్మా! హరిశర్మా! ఎంతపని జేసితివిరా? బ్రాహ్మణుఁడ వనుకొంటిని, గాని కటికవాఁడ వనుకొనలేదు. ఓ బ్రహ్మదేవుఁడా! నీ వెంత యవివేకివి. సృష్టి మొదలుకొని నేటివరకు నీ విట్టి మహారాజు నెప్పుడు సృజింపలేదు, నీతలగొట్ట! నీచేతిలోని పని గావున సర్వస్వతంత్రంబుగా నొక్క నిముసములో నిరుపమాన గుణరత్నాకరుని నేలపాలు జేసితివి. మరల నిట్టిరాజును నీజన్మమధ్యమందు నీవు సృజింపఁగలవా? ఇంతకు పూర్వజన్మకృతమగు పాపమిట్లున్నది యెవ్వరేమి చేయఁగలరు?" అని వగచుచుండ మాధవసేనుఁడు మహారాజు మొగము వంక దిరిగి—"హా! మహారాజా! నీవు లేకపోవుట శ్రీనగరంబు నిరాధారమయ్యె. సరస్వతి నిరాలంబయయ్యె. పండిత ప్రకరము నిరాశ్రయమయ్యె. భృత్యజనము నిర్గతికమయ్యె. వసుంధర నిరాభరణమయ్యె. రాజకులము నిస్సారమయ్యె. దారాపుత్రులు నిర్భాగ్యులు, ప్రజలు నిర్భాగ్యులు, మంత్రులు నిర్భాగ్యులు నయియుండ వారికి

యని వగచి తనవంతు దుఃఖముగూడ చెల్లించి తక్కినవారితో సమాను డయ్యె. మణివర్మయుం గొంతెత్తి యేడ్చు బిట్టు వగచి వగచి కొంతవడి కించుక యూరడిల్లి మాధవసేనుని చేయి పట్టుకొని—"మిత్రమా! మొదటి నుండియు గార్యములు మనకెడ్డెగా నడచుటచే నేనసల వచ్చినను మన కిరు ప్పురకుండదప్పుడు, నీవంటి సత్పురుషుని సత్వరము యెరిగి మనసారా కై నిలుపరాని యాత్రముతో నిరీక్షించుచుండ నిరపరాధిని దేవికి ఘోరవార్త విన్నవింపవలయు. నేను దక్కుంగల పరిజనంబుతోడ నుండెదను" ని పలుకుటయు మాధవసేనుండు నిండియు దుఃఖావేశ పరవశుడై— "యమాత్యా! రాజశాసనంబునకుం లోనై నీయాజ్ఞయు నాకు మన్నింప దగినదే కాని పిడుగువంటి యీదుర్వార్త యాలకింపనుంకించు నెక్కువ సుకుమారియగు నరవింద కెట్లు విన్నవింతు? యంతకు నేనగపడినతోడనే యాదేవి నాకెదురుగవచ్చి మహారాజు కుశలియే యని యడిగిన నేనేమని చెప్పుదు? ఈకథ చెప్పుటకు నాకు నోరెటులాడు? మంగళ వార్త తెరిగింపవలసినచోట నమంగళవార్తల దెలుపవలసివచ్చెనే! ఇక్కార్యంబు నే జేయనొల్ల. మీరు రండు. మీవెంట నేను వచ్చెద" నని వినయముతో విన్నవించెను.

మాధవసేనుని మనస్సు తెలిసి మణివర్మ తప్పదనియు నతఁ డట్టి దారుణవార్తలు దెలుపజాలడనియు మణివర్మ యెరిగి యంతటఁ జే డానే యమ్మాధవసేనుని వెంటబెట్టుకొని బోవనలంచి దండపాణిని, నిగమశర్మను గుహాంతరాళంబున సంరక్షణ నిమిత్తము నిలిపి వారికి సాయముగ దక్కిన పరివారమునుండి యిరువురబంట్ల వెంటగొని బయలుదేరి గుహవిడిచి రాగల్లు యొకసారి నిలిచి—"బ్రాహ్మణుడా! ఎంతపని చేసితివిరా!" యని యొకమారును—"హా! రాజా! రాజా! నీవంటి యుత్తమోత్తముని కెంతటిగతి ప్రాప్తించెను" అని వేరొక మారును—"నయ్యయ్యో! ఆబిడ్డ మొగమెట్లు చూతును"ని ఇంకొక మారును మనసు పోయిన తెరంగున మరుగుచు నోటికి వచ్చిన విధమున నుడువుచు రెండడుగులు నడిచి మరల వెనుకకు వచ్చుచు గొంతసేపు పిచ్చివానివిధమున జరించి యెట్టకేలకు సాగిపోయెను.

అని పరిపరివిధంబుల నడిగి వారిరువురు తనమాటల కుత్తరం బొసంగక పోవుటయు దల్లి కన్నులనుండి తన ప్రశ్నంబుల కుత్తరంబువోలె భాష్పంబులు రాల్పుటయు నీక్షించి యతడు జిన్నవోయి లేచి నిద్రించుచున్న విక్రమసేనుని కడకుంబోయి—"అన్నయ్యా! అన్నయ్యా! ఒకసారి లెమ్మ"ని మీద జేయివైచి తట్టెను. అనుజుని కరస్పర్శ మగుటతోడనే విక్రమసేనుడు మేలుకాంచి యందరు జూచి—"ఏమేమి! మీరందరు మేలుకొని యున్నారేమి? తమ్ముడా! అమ్మ యిట్లున్నదేమి? నర్మదా! నీవు నట్లుంటివేమే?" యని వేర్వేర నందర నడుగ నాతనికి నర్మద యిట్లనియె—

"అమ్మగారు మీనాయనగారిమీద నొకపాడుకలగని విచారించుచున్నారు. ఆయన కుశలవార్త నరయుటకు సింహగిరియొద్దకు మణివర్మ ప్రముఖు లరిగియున్నారు. వారింకను రాకపోవుటచే నీమె యాందోళనము మరింత హెచ్చినది. ఇదియే విచారకారణము" అని యెరిగించుటయు హర్షవర్ధనుడు—"ఇదియా కారణము! నేనెంతయడిగిన నాకెవరుం జెప్పరైరేమే? అన్నయ్యా! మన మిద్దరము సింహగిరికిప్పుడేపోయి నాయనగారి వార్త స్వయముగా నరసివత్తము రమ్మ"ని పిలువ—"నౌనౌను. పదపద" యని విక్రమసేనుడు పాన్పుడిగ్గ, అయ్యిరువుర యుత్సాహముంజూచి సహజముగ వారు సాహసులౌట యెరిగిన దగుటచే నరవిందాదేవి చివాలునలేచి యిరువుర జెరియొకచేతం బట్టుకొని—"నాకులదీపములారా! చాలు మీసాహసములు, నాదినములు మంచివి కావు. గడపదాటి మీరావలకు జనవద్దు. సింహకిశోరములవంటి మీరుండ మీతండ్రిగారికి భయమేమియుండు? ఇంతలో మణివర్మ యీపాటికి వచ్చుచుండును" అని పలికి యాకుఱ్ఱల యుత్సాహంబు నివారించి కూర్చుండబెట్టె. అంతలో మనుష్యులు నడచిన చప్పుడు శ్రవణగోచరం బగుటయు నందరు ద్వారము వద్దకుం జనిరి.

# ఇరువది యేడవ ప్రకరణము

అప్పుడు తెల్లవారుచుండె కాకులు కావుకావుమని కూయ జొచ్చెను. పోవుచున్న చీకటుల, మెల్లమెల్ల వ్యాపించుచున్న వెలుగుల నడుమనడుమ మనుష్యుల మొగములు స్వల్ప ప్రయత్నముతో గుర్తించుటకు వీలుగ నుండెను. కోట సమీపమునకు వచ్చినకొలఁది యా యమాత్యుల కిరువురకు మనోధైర్యంబులు జారిపోయె. మొగంబులు వెలవెలబోయె. నడచుటకు గాళ్ళాడవయ్యె. ఊర్పులు నిముడలయ్యె. అచ్చట నేదిచూచిన వారికి మహారాజే జ్ఞప్తికివచ్చె. రాజభటులు వారి వాలకముం జూచి భయపడి యేదియో మూడినదని యొండొరులతో జెప్పుకొనసాగిరి. ఆ మంత్రులిరువురు రొప్పుటతో కోట జొచ్చి యనేక కక్ష్యాంతరంబులు గడచి గడచి వంచినతలలతో బాష్పాకులితములై మార్గమును జూడరాని కనులతో మంద మందములగు నడకలతో నెంతో యడచిన నడఁగని సముద్ర తరంగమువలె నుబికి యుబికివచ్చు దుఃఖముతో నంతఃపుర సమీపమునకు వచ్చుచుండ ద్వారముకడ నదివరకే చేరియున్న విక్రమసేను—'అదిగో మాధవసేనుఁడు'ని వ్రేలితోఁ జూపెను. "అదిగో మణివర్మ" అని సగద్గదపలికెను! ఆపలుకులు వినినంతనే యరవిందాదేవి రెప్పవాల్చక వారివంక తప్పకచూచి, చేష్టలుడిగి తలలువంచి కట్టబొమ్మలవలె కదలక వారి వాలకములు తనకుం దృష్టికరముగ నుండకపోవుటచే, రాజకుటుంబోజ్జీవకమగు శుభవార్త వినంబడునో పిడుగు తునుకవంటి యశుభవార్త వినంబడునోయని సందిగ్ధమునకు, భయంబునకులోనై భయమను గొప్పబరువుతో నిండిన తన దేహమున నరటికంబమువంటి కాళ్ళు భరింపజాలమి నిలువలేక గోడకుం జేరబడి కూర్చుండెను. బాల్యచాపలంబునకు భయంబుతోడునూప హర్షవర్ధనుడు తన యంతరంగంబున నెలకొన్న యాత్రము నిలుపలేక విసవిస నడచివచ్చుచున్న మంత్రుల

కెదురుగాబోయి మణివర్మ చేయిబట్టుకొని—"మానాన్నగారు కుశలముగ నున్నారా? ఏమిచేయుచున్నార" ని యడిగెను.

అడుగుటయు జాలిగొలుపు బాలకుని పలుకులు ములుకులై నాట దుఃఖజలముతో నిండిన మణివర్మమనస్సు కడవ చిల్లివడియెనో యున్నట్లు రెండుకన్నుల కొలకులనుండియు వేడికన్నీళ్ళు దొరగి బాలకుని మస్తకమున నభిషేకము చేయజొచ్చెను. వేడికన్నీళ్ళు తలదడుపుటయు వేడినిట్టూర్పులు మొగమునకు సోకుటయు నిట్టూర్పుల కతమున కడుపు మాటిమాటికి నుబుకుటయు దన యడిగిన ప్రశ్నము కుత్తరము లేకపోవుటయుం జూచి బాలుడు హర్షవర్ధనుడు తెల్లబోయి నిలిచెను. అంతలో విక్రమసేనుడు పరుగెత్తుకొని మంత్రికడకుబోయి—"అయ్యా! తండ్రిగారిం దోడ్కొనిరాక మీరొంటిగ వచ్చితిరేల?" అని మరియు నేదో పలుకబోవుచుండ మణివర్మ దుఃఖపరవశుడై—"హా మహారాజా!" యని నేలపయింబడి మూర్ఛిల్లె. "నాయనా! మీతండ్రిగారి కుశలవార్త నెరిగించునట్టి పుణ్యము మేము చేసికొనమైతిమ" ని భాష్పరోదనముచేసి మరేమియు మాటలాడనోపక మాధవసేనుడు నేలం జదికిల బడియె.

అమాత్యుల దారుణవచనములనెడు మేఘగర్జనములు వినబడినతోడనే మందిరమున దుఃఖవర్షము కురిసెను. అరవిందాదేవి—"హా హృదయేశ్వరా!" యని యొక్కకేక వైచి మూర్ఛిల్లెను. నర్మదదేవి పాదములయొద్దబడి యేడ్వసాగెను. తండ్రివార్తయు దండ్రి యవస్థయు నెరింగి బాలకులిరువురు వెక్కివెక్కి యేడ్చుచు లోనికిం జని స్మృతియెరుంగక పడియున్న తల్లికడకుబోయి రెండుప్రక్కల జేరియొకరు గూర్చుండిరి. పిదప నంతఃపురమందలి సేవకు లందరు—"హా! హేమచంద్రమహారాజా!" అని ఆక్రందనముచేసిరి వారలరోదనంబులువిని యారెకులు మొదలగు కోటకాపరులు వినువారికుండెలవియునట్లు మిన్నుముట్టునట్లెలుగెత్తి విలపించిరి. కోటలోని కళవళమును బట్టి మహారాజు మరణవార్త యానోటనుండి యానోటంబడి నగర

మెల్ల నిముసములో వ్యాపించెను. వ్యాపించుటయు బ్రజలు హాహా కారములు జేయువారు, హరిశర్మఁ దిట్టువారు, పానుపులపై నుండి దిగ్గున లేచువారు, పరుండినవారికి వార్త జెప్పుచు లేపువారు, తోచక యిందందు దిరుగువారు, కొట్టుపాటున పనులు మరచువారు, తమ్ముడుగవచ్చిన వారికావార్త జెప్పువారు, చెప్పవచ్చినవారి గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నలడుగువారునై పలుతెరంగుల నుత్తలపాటు పడజొచ్చిరి. అంగనలు ప్రాతఃకాల గృహకృత్యములు మాని గుంపులుగూడి కన్నులనీరు పెట్టుకొనుచు నొండొరుల నమ్మా యక్కా యని పిలుచుకొనుచు నింక నరవిందాదేవి బ్రదుకదని కొందరు, కళాగారిమైన యీ మొగమునకు బ్రహ్మ వైధవ్య మెక్కడ వ్రాసెనో యని కొందరు, దైవమునకంటికి పేలగింజయుం బెద్దయయ్యెనని కొందరు, దేవి నోచిన నోములన్నియు నేమయ్యె నేయని కొందరు, మంచివారికి దినములు కావని కొందరు, దైవరీతి యిట్లున్నది యొకరి ననేల యని కొందరు దోచిన పోలికం బలుకజొచ్చిరి. పురుషు లనేకులు ప్రభాతకృత్యములు నెరవేర్పక యే రాజకళేబరము గనుంగొనుటకు సింహగిరివంకకు జనిరి కొందరు సత్వరంబున కార్యంబులం దీర్చి యా ప్రదేశమునకుం జనిరి.

అట మణిశర్మయు మూర్ఛనుండి తెలివిదెచ్చుకొని సంతతధారగ గన్నీరు కారుచుండ బ్రక్కను గూర్చున్న మాధవసేనుని జూచి గద్గదకంఠముతో—"మిత్రమా! రాజపుత్రుడు లేడే! దేవి యవస్థ యే తెరంగున నున్నదని యడుగ నేల! మగపులుగు నెడబాసిన యాడు లకుముకి తెరగున నలుగొన్న పాపుబాసిన తీగలాగున నిరాధారయై యున్నది కాబోలు. నన్నొకసారి దేవి సన్నిధానమునకుం గొంపోవుము. పూర్వపు మహారాజుగారి కొలువువాడనైన నేను ముందుగా కడతేరక యీ ఘోరవార్త వినుటకు దేవికి వినుపించుటకు గాబోలు నిరుడు పుట్టెడురోగమువచ్చి బ్రదికితిని, హేమచంద్రుని నాచేతులతో నెత్తి యాడించితిని. ఇప్పటికి సరిగ ముప్పదిమూడేండ్లయిన జెల్లలేదు. వచ్చెడు దశమికి ముప్పదిమూడవ

యేము నిండును. ఇంతలోనే యీ మహాత్మునకు నూరేండ్లు నిండినవి. తండ్రియగు విక్రమసేనుఁడు మరణకాలమునకు నన్ను బాన్పుకడకు జేరంబిలిచి తనచేత నాచేయిపట్టుకొని—"హేమచంద్రుఁడు నీవాఁడుకాని నావాఁడుకాఁడు. రాజ్యము గొప్పది. వయసు చిన్నది. పగతురనేకులు; బుద్ధిసంపన్నుఁడవగు నీవె అతనికి సప్తాంగములను పనిచేసి నేనున్నప్పటి యట్ల వానిచే రాజ్యంబు జేయింపవలయునని నాచేతిలో జేయివైచి వాని నప్పగించె. అప్పగించినందుకు నేఁ డప్పుడా మహారాజును జేతులార మృత్యుదేవత కప్పగించితి. ఈ విషయమునందు నస్వవిషయమాల ఖతఁడు నాగీచినగీఁటు దాటి యెఱుంగఁడు. ఏమైననేమి! తుద కిట్లయ్యె గదా! నన్నా యమ్మకడకుం బోఁదొక్కనిపొమ్మ" ని వేఁడుకొనియెను.

మాధవసేనుఁడు డగ్గుత్తికతో—"నయ్యో! దేవి యవస్థ యతిదీనముగ నున్నది. నీవు మూర్ఛిల్లినతోడనే దేవియు—'హా! ప్రాణేశ్వరా!' యని మూర్ఛిల్లి చైతన్యములేక పసిడిబొమ్మ తెరంగున లోనం బడి యున్నది. తండ్రిచావు నిప్పుడిప్పుడే విని గుండెలు చెదర బెంగటిల్లి యున్న బాలకులిద్దరు తల్లి యేమగునో యని యామె కిరుప్రక్కలచేరి తల్లిని కన్నీటితో స్నానము చేయించుచున్నారు. ఆ తల్లిబిడ్డల దురవస్థం జూడ నాకడుపు చుమ్మలు చుట్టుచున్నది నీవదిచూచి సహింపఁగలవే? ఐన నటు పోదలఁతువేని పోవుదము రమ్మ" ని పలికెను.

అనవుడు మణివర్మ—"మాధవసేనుఁడా! యెంత వెఱ్ఱివాఁడవు. అంతటి మహారాజు శరీరమును రెండుతునకలైన యవస్థలో జూచి యింకను బ్రతికియుండిన రాతిగుండెవారము. మనము తల్లిబిడ్డలయవస్థ జూచి సహింపఁజాలమే. పదపద; నన్నటకుం గొనిపొమ్మ"ని పలికెను. పలుకుటయు మాధవసేనుఁడు వానిని లేవనెత్తి మెల్లమెల్లఁగ దేవియున్న నెలవునకుం గొంపోయెను. అట్లిరువురు నరవిందయున్న గదికిఁబోయి యొకచోట జతికిలబడి చేష్టలుదక్కి పడియున్న రాజపత్నిని రెండు ప్రక్కలజేరి విలపించు కుమారులను, పాదపద్మ

ములగు దన యశ్రుజలములతోఁ బూజించుచున్న నర్మదను జూచి యువకలి ధైర్యులయి యాదువాంగ్రదంబోలె 'బాబు' మని యేడ్చిరి. ఆయిరువుర విలాపంబు వినినతోడనే బాలకులు నర్మదయు వావిడిచి విలపించిరి. మణివర్మ కొండొకసేపున కించుక శాంతించి—"అహా! అరవిందా! మహాదేవి! అరవిందవాసినియగు నాదిలక్ష్మికయిన నెంచ దలచితిమేని వంకలుగలవుగాని నీకు లేవు నాడు స్వయంవర కాలమున సకల మంగళాకారములతో నిండియుండి మాపిన్నరాజునకు పట్టపు దేవివయి మాకెల్ల రాణివై మెరుపుదీగయట్లు చూపులకు మిరుమిట్లు గొలుపు నిన్నుచూచిన కన్నులతోడనే నేమీ నీదురవస్థం జూడ వలసివచ్చె. నాచిన్న యన్నలారా! రాజపుత్రులారా! మీకెంత దశ వచ్చెన"ని విలపించుచుండునంతలో నరవిందాదేవి కించుక స్మృతి తెలిసెను. అది యెరుంగక నర్మద పలవరించుచున్న మణివర్మను ఉద్దేశించి—"స్వామీ! మహారాజుగారి నిశ్చితవార్త యేమియు"ని దగ్గుత్తికతో నడిగెను. ఆమె ప్రశ్నమువిని మణివర్మ—"నర్మదా! ఏమిచెప్పుదును? హరిశర్మయో వాని ప్రేరణంబున నేదురాత్ముడో ఖడ్గముతో మహారాజుగారిని వధియించి" యని వాక్యము సమాప్తము చేయకమునుపే యప్పుడే మెలకువ దెచ్చుకొన్న దేవి—"హా హృదయేశ్వరా!" యని యొక్క కేకవైచి వెండియు మూర్ఛనొందెను. నర్మద చేతులతో దలయు రొమ్ము మోదుకొని రోదనము చేసెను. బాలకు లిరువురు దుఃఖావేశముచేతను భయముచేతను గడగడవడంకుచుంటచే మణివర్మ యొకనిని మాధవసేను డొకనిని జేరదీసి యొడిలో గూర్చుండ బెట్టుకొని బిగ్గ కౌగలించుకొనిరి. తక్కిన దాసీజనంబు మూర్ఛిల్లిన దేవికూడ మృతినొందునను భయంబున శీతలజలంబులు పన్నీరు దెచ్చి తెలివి దెప్పించుట కామెపై జల్లనారంభించిరి. అట్లు కొంత తడవు శైత్యోపచారములు నరపినపిదప నరవిందాదేవి చైతన్యము గలదయి తెలివిందెచ్చుకొని యుత్తెరంగున విలపింపదొడంగె—"అయ్యో! చెలులారా! ఏల ఈశైత్యోపచారములజేసి నాకుం దెలివి దెప్పించెదరు?

నాకు మరల స్మృతి రాకుండు ప్రయత్నములుచేసి యెన్నడు నన్నెడబాయని మహారాజుగారి సన్నిధికి నన్ను గూడ బంపుడు. విశ్వాసమున దంపతులను గలుపుటయేకదా చెలికత్తియలు చేయ వలసినపని. ఇంతకాలంబు మీరు నాకు మిక్కిలి యుపకరించి భర్త సన్నిధికిం బంపువారు. నేను నాపై యెప్పటిస్నేహముంచి యుల్లు సేయుడు. నర్మదా! నీవయిన నామాట వినవేమే! ఆ జగదేకవీరు నా ప్రసన్నవదను నా గుణరత్నాకరు బాసి నిమేషమైన నేనుండగలనే! హా హృదయేశ్వరా! నావంటి పాపాత్మురాలికి మీవంటి సర్వగుణ సంపన్నుడు దక్కునే! నాపయి మీకింత యాగ్రహం బేలకలిగె! ప్రాయంబునకయిన మీరయి యలిగియెరుగ. పరిహాసంబునకయిన బ నొప్పించి యెరుగ. కలనయిన మీపాదసేవ మరచి యెరుగ. ఇట్టి సత్య శరణ్యుడగు నన్ను నేకతంబ యిందు విడిచిపోవుట పాడికాదు. ఈ మాయ వారిశర్మ మీకెక్కడ దాపురించె. శుద్ధ స్ఫటికమువంటి మీ మనస్సును మలినాత్ముడగు నా బ్రాహ్మణుడు కలంచివైచి యింత తెచ్చె. నేనెందరిచేతనో యెన్ని విధంబులలో చెప్పించినను వాని మాటలనియెడు నురులనుండి తప్పించుకొని మీరీవల బడజాలరయిరి. ఆ కుశాగ్రబుద్ధి యెందరిగెనో! ఆ శాస్త్రజ్ఞాన మేమయ్యెనో! అధర్మ సూక్ష్మవేదిత్వ మెడనుగంటెనో! ఆ బ్రాహ్మణుడరచేతితో వైకుంఠం చూపుటచే వానిమాయలజిక్కి త్రాచుపాములు పూలదండలనినమ్మి శరీరంబు బాసితిరి. కుమారులారా! నేను మందభాగ్యురాలనై నను మీరూపురేఖా విలాసములంబట్టి మీరదృష్టవంతు లనుకొంటి, మీపూర్వజన్మపుణ్యమయిన దండ్రిగండముగాచుననుకొంటి. అయ్యో! తండ్రిలేని బిడ్డలయితిరే. బ్రదికియు బ్రయోజనము లేనిదానను. నేను పోయి బంధుజనపారిజాతము, మానినీ మన్మథావతారము, విద్వజ్జన విబుధమణియగు నామహారాజు బ్రదుకరాడే. ఇంతకు నానోచిన నోములపంట యిటులున్నది. దైవోపహతులకు శుభంబులు గలుగునే! యేనాడు మహారాజు మంత్రోపదేశంబు నా నిశ్చయించుకొనెనో

యీనాడె నాకు ప్రభువునకు దీరెనని నిశ్చయించుకొంటి. ఆ బ్రాహ్మ
ణుని మాయమాటలలో నేమి మహత్త్వమున్నదో కాని వానితో
మాటలాడిన పిదప నాప్రాణేశ్వరుడు నాతో నొకనాడయిన
జిన్నగా మనసిచ్చి మాటాడలేదు. కనువిచ్చి చూడలేదు. హాయిగా
నిదురింపలేదు. సుఖముగా భుజింపలేదు. పితృసమానుడయిన
యీ మణివర్మ మాటయిన వినలేదు" అని చివాలున లేచి బాగను
దూరమున గూర్చుండిన మణివర్మ కడకుజని యతని పాదములపయిం
బడి—"తండ్రీ! మణివర్మా! మామామగారు నీకుం జేతిలో జేయి
వైచి యప్పగించిన పుత్త్రప్రాయుడగు నీరాజును బ్రాహ్మణున
కప్పగించి వచ్చితిరే! నిన్ను బిత్రుప్రాయముగ జూచు మీమహారా
జేడీ? నానోములపంటయేడీ? కాశ్మీర రాజతిలకమేడీ? నాముద్దుల
చందమామయేడీ! నాకళ్యాణమూర్తి నింక చూడదలచుకొనరాదే!
తండ్రీ! కడసారి నాకాతని దర్శనము చేయింపుము. ఆయనను సున్న
వసియించు నంతఃపురమునకు గడసారి రప్పింపుము. ఇదియే నేను
మహోపకారముగ నెంచుకొనియెద" యని యంగలార్చుచు బలికిన
దయనీయంబులగు నామె వచనంబులువిని మణివర్మ యూవరచినట్లరచి
దుఃఖించుచు దన యనుంగులకడనున్న యమ్మహాదేవి చేతుల బట్టు
కొని—"తల్లీ! నేను రాజులాగున బ్రదికియుండి జననుదనుడయిన
నీప్రాణనాథుని జేతులార బ్రాహ్మణున కప్పగించి చంపించిన మహా
పాతకుడను. నేను నీకేమి సాయంబు జేయగలవాడను. నేటి కాలము
నకు నీకు మగని శవమును జూపుటయే మహోపకారము జేయుటగ
నెంచికొనవలసిన యవస్థ వచ్చినది. నాతల్లీ! దారుణ మరణమొ
ందిన భర్తృకళేబరమును జూచి నీవు సహింపజాలవు. కావున
నావిజ్ఞాపన మాలించి యీవిషయమున గట్టిపట్టుపట్టకుమని వేడుకొనియె.

రాణి యాపలుకుల నంగీకరింపక—"అయ్యో! ఈవార్త విని
బ్రతికినదానను, భర్తృదేహమును జూచి బ్రదుకజాలనే? బంగరు

బరిణలో వజ్రమును దాచినట్లు బ్రహ్మ నామెత్తని దేహమున వజ్రపు గుండె చేసి పెట్టినాడు. కావున నమ్మహాత్ము నిటకు దెచ్చినసరియే లేక నన్నటకుం గొంపోయినను సరియే" యని యాతని యొడిలోనున్న హర్షవర్ధనుని, మాధవసేనుని యొడిలోనున్న విక్రమసేనుని జేరియొక చేత జేరదీసి కౌగిలించుకొని—"బిడ్డలారా! యీకెంతగతి వచ్చెరా!" యని దుఃఖావేశంబున వెండియు మూర్ఛిల్లె. అంతి మునివర్మ ప్రక్క-నున్న మాధవసేనునిజూచి—"మిత్రమా! ఈదేవి మహారాజు మొగము కడసారి చూడకమానదు. చూడనీయకపోవుట మనపట్లంగూడదుర్ణయ మగును. కావున తిరచుగా మహారాజు రెక్క బంగరు బల్లకి మోయించుకొని సింహగిరికిబోయి దానిలో శరీరముం బెట్టించుకొని" యని యర్ధోక్తిగ జెప్పి కడమపలుకులు పలుకలేక—"హా హేమచంద్ర మహారాజా! నిన్నుగురించి నేనెంతటి దారుణవచనములు పలుకవలసి వచ్చెన"ని కొలకులనుండి కారు బాష్పములు తన నరసిన మీసములపై బడి తనుప రోదనముచేసెను. మాధవసేనుడును గన్నీరుత్తరీయాంచలముచే తుడుచుకొని సరేయని భటుల బిలిపించి పల్లకి మోయించుకొని సింహగిరికిజనిరి. అప్పు డంతఃపుర పరిచారకులు మునుపటియట్లు మూర్ఛిల్లినదేవికి శైత్యోపచారములు చేసిరి. చేయ చేయ కొండొకవడికా దేవి తెలివిందెచ్చుకొని మగని సుగుణంబుల దలంచియు దన దైన్యంబు తలపోసియు బిడ్డల దిక్కుమాలి తనంబు నూహించి దైవ నిర్ణయమును జింతించియు బరిపరివిధంబుల బలవించుచు—"నయ్యో! ప్రాణనాథుని మృతకళేబరముచూచి సైరింపగలనే"యని యొకమారును బల్లకివచ్చుటకెంత యాలస్యమేల కావలయు; సత్వరము తోడితెండని యొకమారును మతిలేనిదియుంబోలె నుడువుచునుండె. కొప్పవీడుటచే జీరాడుపడిన వెన్నరులు చిక్కువడిన హారములు కన్నీటం గరగిన కాటుకలు వడకుచున్న యవయవములు గలిగి వివర్ణమై మనోజ్ఞతను బాసిన యామె దేహమును చూచి పరిచారకులు చెలికత్తియలు దేవి యింక జీవింపదని తమలో దాము చెప్పుకొనిరి. అంతలో మాధవ

సేనుడు నిగమశర్మ సమేతుడయి యంతిపురికివచ్చి పల్లకి వచ్చినదని మణివర్మతో జెప్పి దానివెంట వచ్చిన వందలకొలది పురజనుల కోటగుమ్మమువద్ద నిలిపి రాణియొద్దకు దండపాణి నచ్చట నుండ నియమించి మెల్లగ బల్లకిలోనికిం దెప్పించె.

పల్లకి చూచినతోడనే నర్మదాదేవి యేమి సాహసము చేసికొనునోయని భయపడి యామె యంతికంబున నుండె. పల్లకి దింపి బోయలవ్వలకు జనుటయు నర్మద తలుపులు రెండుతీసి రెండు తునియలయిన రాజదేహముం గనుంగొని హా! యని గుండె మోదుకొని—"దేవీ! ఇదిగో మహారాజుగారు. చంపిన దురాత్ముడు తల ద్రెవ్వనేసినాడు. కాడ యూడిన తామరపువ్వట్లు నేల కూలిన చంద్రబింబమట్లు తల వేరయి యుంచున్నయది" యని యామెం గౌగిలించుకొని హేమచంద్రుని కళేబరముం జూపెను. చూచుటయు నయ్యరవింద రక్తసిక్తమయి ధూళిధూసరితమయి భయంకరమయియున్న మగని మొగమును చూచి మేవం జేతులువైచి హా హృదయేశ్వరా! యని వాని వక్షస్థలముపై మూర్ఛిల్లెను. మాధవసేనుడు రెండవప్రక్క పల్లకి తలుపులం దెరచి బాలకుల నావంకకుం గొనిపోయి తండ్రిం జూపెను. విక్రమసేనుడు జనకునిం జూచుచు మాధవసేనుని యొడిలో నుండెను గాని హర్షవర్ధనుడు తన్ను నిగమశర్మ ప్రముఖు లెంత పట్టుకొన్న నొదుగక తండ్రిమీదనేపడి యేడ్వ జొచ్చె. అంతలో నరవింద వెండియుం దెలివిదెచ్చికొని యిత్తెరగున విలపింపజొచ్చె—

"హా హృదయేశ్వరా! హా జగదేకవీరా! హా రసికాగ్రగణ్యా! హా కాశ్మీరరాజవంశజలధిచంద్రమా! హా నాభాగ్యరాశీ! నేనరవిందను. మీపరిచర్యనిమిత్తమైవచ్చితి. ప్రాణేశ్వరా! కనువిచ్చిచూడవేమి? వీడె హర్షవర్ధనుడు మీగారవుకొడుకు. మీనిమిత్తమై వానిడిచి ఏడ్చుచున్న

వాడు. వాని నెప్పటియట్ల నెత్తుకొని బిగ్గ గాగిలింపవేమి! ఏడువవలదని వానిని వారింపవేమి? వాడు విక్రమసేనుడు నీతొలిమాలిపట్టి, వారిసైనం దేరిచూడవేమి! అల్లవారే మంత్రులు, వారితో రాచకార్యంబులు యోచింపవేమి? ఇది ప్రాతఃకాలము. మంగళ తూర్యధ్వనులు వైతాళికులపాటలు వినఁదగిన సమయమున మా రోదనంబులు మీకు మంగళనాదంబు లయ్యెనే. మీకులగురువగు నిగమశర్మ దీవింపవచ్చె. లేచి నమస్కరింపకుండుట ధర్మమా? ఓసి నర్మదా! మూసికొనియున్న యాకన్నులు చూడనీయక యెప్పటియట్ల నిద్రించుచున్నట్లు తోఁచెడివి. మొగముమీఁద మృతిపొందినజాడ తోఁచుట లేదు. మున్ను జరాసంధుని మేనిభాగములు కలియఁజేర్చినట్లు పుణ్యాత్ము లెవ్వరైన తమ ప్రభావముచేత నీశిరస్సు నీదేహముతో జేర్చి బ్రదికింపరాదే! ఓ వేల్పులారా! నెలవేల్పులారా! ఈ మహారాజు వేదవేదాంగవిదుఁడు. నిత్యసత్యనిరతుఁడు. ధర్మపరావతారుఁడు, మీకవశ్యము రక్షణీయుఁడు. మీమహిమంబులం జూపి యాతనిం గావరాదే! దేవతలు మందభాగ్యుల కుపకారము సేయుదురే!”

అని యిట్లు లామె విలపించుచుండ మణివర్మ కొంతతడవు తానును బిట్టువగచి పిదప మాధవసేను నవ్వలకుం బిలిచి—“మహారాజున కగ్ని సంస్కారంబు సేయవలయు. ఇప్పటికి దాదాపుగ జాము ప్రొద్దెక్కినది. కాబట్టి చెండి యను నేనుఁగుపై నంబారి వేసి సమయోచితాలంకారములు చేయింపుము. మహారాజునకు మనము చేయగలిగిన కడపటియుపచారము గౌరవము నిదియేకదా!” యని చెప్పి వాని నావలకు బంపి లోనికిం జని హర్షవర్ధనుని తండ్రి మేనుమీఁదినుండి యావలకు దిగిచి దేవి కభిముఖుండై—“అమ్మా! చిరకాలప్రవర్ధితమైన మీస్నేహలత తెగినది. ఎంత వగచిన వగపున కంతముండదు. మీరించుక యూరడిల్లి మహారాజుగారికి మేము చేయఁగల కడపటి సపర్య చేయుటకు మాకనుజ్ఞ నీయవలయు” నని గద్గద

కంఠముతో విన్నవించెను. విన్నవించుటయు నరవింద మణివర్మ నుద్దేశించి—"తండ్రీ! దైవంబు చేసినదిగాక నీచేతులార నీవు నన్ను మగని కెడబాపుదే అయినను నన్నెవ్వ రెడబాపగలరు! చంద్రుని విడిచి వెన్నెలయుండదు. మేఘమును విడిచి మెరుపుండదు. సూర్యుని విడిచి ఛాయయుండదు. అట్లే నేనును భర్తను విడువజాల; ఆ చితి యే నన్ను హృదయేశ్వరుని కడకు గొంపోవు విమానమగును. అగ్నిదేవుడు సంధానకర్తయగును. సహగమనము పతివ్రతాలక్షణము. సహగమనము మాకులాచారము. సహగమనము చేయక చిన్నవోయిన యీ మేడలు మిద్దెలు నంతిపురములు తల్పములు చూచి నేను సహింపగలనే! మహారాజు తిరిగినచోట్లు మరువగలనే! ఏది చూచిన హృదయేశ్వరుడు జ్ఞప్తికివచ్చు. సహగమనంబునకు నాకు ననుజ్ఞ నొసగుడు" అని యొత్తి పలుకుటయు దండ్రిలేని వెలితికిదోడు తల్లి లేని వెలితికూడ సంభవించునని భయపడి హర్షవర్ధనుడు తల్లియున్న కడకుజని యామె కంఠము గాగిలించుకొని—"యమ్మా! నీవును మమ్మువిడిచి పోవుదే" యని రోదనము చేసెను. అదివిని జాలినొంది నర్మద మణివర్మ మాధవసేనుడు నిగమశర్మ తక్కిన పరిచారకులు చుట్టుంజేరి—"బిడ్డల మొగము చూచియైన నట్టి మహాసాహసము చేయువలద"ని దేవిని వేడుకొనిరి. అతిప్రయత్నమున నెట్టకేల కామె తన సాహసకృత్యమును మానుకొనియె. మణివర్మ రాజకళేబరము నటనుండి తోడ్కొనిపోవ యత్నించుచుండ నది యెరింగి దేవి చివాలున లేచి భర్తయున్న పల్లకికి మూడుసారులు ప్రదక్షిణముచేసి పాదముల స్పృశియించి కన్నుల నద్దుకొని—"పర్వేశ్వరా! కోటి జన్మములకయిన నాకు హేమచంద్రుని భర్తగా జేయుము" అని చేతులెత్తి నమస్కరించి యేనుగు సిద్ధముగా నున్నదని మాధవసేనుడు మణివర్మతో మెల్లగ జెప్పుచుండ విని—"యో మహారాజా!" యని నేల మూర్ఛిల్లెను.

# ఇరువది ఎనిమిదవ ప్రకరణము

"ఇదియే మంచిసమయము. ఈ దేవి మూర్ఛనుండి లేచినేని మహారాజు కళేబరము నిటనుండి యావలకు గొనిపోవుట మిక్కిలి కష్టము. కావున నీమెకు దెలివిరాకమున్నె పల్లకి నవ్వలకుం గొంపోయి కళేబరము నేనుగుమీద బెట్టించుట యొప్పుదే" యని మణివర్మ మాధవసేనునితో బలికెను. "అదియే యుచితమని నేనును దలంచుచుంటి" నని మాధవసేనుడు ప్రత్యుత్తరమిచ్చి యేనుగు సిద్ధముగ నున్నదో లేదో చూచుటకై స్వయముగ బోయి చూచివచ్చి మణివర్మ కది విన్నవించి పల్లకి నేనుగుకడకుం గొనిపొమ్మని సేవకుల కాజ్ఞాపించెను. పల్లకి నెత్తుటకు బోయిలు వచ్చినతోడనే మణివర్మ విక్రమసేన హర్షవర్ధనులను నర్మదవద్దకుం గొంపోయి—"నర్మదా! తల్లికి దెలివివచ్చువరకు బాలకుల జాగరూకతతో జూడుము. తెలివివచ్చినపిదప నీవిలాసముచే వెండియు దేవిని మూర్ఛిల్లజేయక ధైర్యము చెప్పి సాహసముల పొంత బోవనీయక కాపాడుము" ని చెప్పి వారి నప్పగించెను. అంతలో బోయులు పల్లకి నెత్తుటయు బాలకులు రోదనము చేయుచు నర్మదం గౌగలించుకొని—"యోసీ! బోయులు పల్లకి నెత్తుకొని పోవుచున్నారు. మమ్ము గూడా నేనుగువద్దకు దీసికొనిపోయి యింకొకసారి నాన్నగారిని జూపవే" యని దయనీయంబుల వేడుకొనిరి. ఈనడుమ పల్లకి యావలకుం బోయెను.

అంతట మణివర్మ మాధవసేనుని నిగమశర్మను దనకడకుం బిలిచి—"మనము మహారాజుగారి కుత్తరక్రియలు చేయవలయుగదా! జ్యేష్ఠకుమారున కుపనయనమైనది. అతనిచేత నుత్తరక్రియలు మనము చేయింపదగునా? లేదా? యని శంకించుచున్నాను. బాలుడగుటచే నింత శంకింపవలసె. ఇందు మీయభిప్రాయమేమని యడుగుటయు నిగమశర్మ మంత్రికిట్లనియె—"ఉపనీతుండైన జ్యేష్ఠపుత్రుడుండ నితరు

లుత్తరక్రియలు సలుపరాదు. కాలుండైనను దప్పదు. ఉపనయనమైన తోడనే కర్మాధికారము వానియందు సంక్రమించినది" అనవుడు మాధవసేనుడు వానిపలుకులు యుక్తియుక్తములనియె. మణివర్మయు వాని పలుకుల నాదరించి లోకాచారము నతిక్రమించుట పాడిగాదని నర్మదయొద్దనున్న విక్రమసేనుని చేయిబట్టుకొని—"వత్సా! తండ్రికిఋణము దీర్పవలసిన సమయము వచ్చినది. లెమ్మ"ని శోకగద్గదుడై పలికి వానిని లేవదీసి వెంటబెట్టుకొని యేనుగుకడకు బోయెను. హర్షవర్ధనుడు తనయున్నను మణివర్మ కొంపోవుట జూచి తన్నుగూడ నవ్వలకుం దోడ్కొనిపొమ్మని కొంతసేపు నర్మదను వేడుకొనెను. దేవి నెంతమాత్రము విడువవలవని మణివర్మ నియోగించుటచేత నర్మద వాస నివ్వలకుం గొనిపోవదయ్యె.

అంతలో నరవిందాదేవి మూర్ఛనుండి మేలుకాంచి కన్నులు దెరచిచూచి పల్లకి యచ్చట లేమి మరల దుఃఖవివశయై—"నర్మదా! ఎంతపని జేసితివే? నేను మేనెరుంగక పడియున్నప్పుడు నాప్రాణనాథు నొరులు నాకన్ను బ్రామి తీసికొనిపోవుచుండ నిన్నుగానట్టునూరకుంటివటే. ఇంత ద్రోహము చేయుటకు నీకు నేనేమి విషము పెట్టితిని? నాకును మహారాజునకును మీరు శాశ్వతవియోగము గలిగించితిరకదా. వికచారవిందంబుల మిసిమి మెచ్చని యాదివ్యసుందరవదనంబు జూచు భాగ్యము నాకీజన్మమధ్యమున లేదుగదా! హృదయరంజకమై మనోవ్యథల దప్పింగజేయు ద్రాక్షామధురములగు సద్వచనములు విను నదృష్టము నాకీజీవితమున లేదుగదా! ప్రాణప్రతిష్ఠ గలిగిన బంగారు బొమ్మవంటి యాశరీరముగొను పుణ్యమింక నాకు నెన్నడు లేదుగదా? ఆహా! యెన్నడు స్వయంవరము జరిగెనో, యెన్నడాయన చెట్ట బట్టితినో, యెన్నడు కాపురముచేసితినో, యెన్నడు సుఖపడితినో, యన్నియు స్వప్నవార్తలయ్యెను. అయ్యో! ఆయనను జూచి యెంత కాలమాయెనట్లున్నదే! ఎంత విశాలవక్షమే, ఎంత పెద్దకన్నులే!

ఎంత మృదు దేహమే! ఆ శరీర మగ్నిపాలు చేయుదురటే, ఆ రూపము మంటగలుపుదురటే! అట్టి జగన్మోహనమూర్తి నిష్ఫలపాలగుచుండ నెందుకుంగోరగాని నాపాడు మేనిమీద మీకెంత దురభిమానమున్నదే! మహారాజు సుఖముల ననుభవించునపుడు వానిలో గలసి యవ్వారిగా సౌఖ్యంబులం దేలుటకేగాని వాని కష్టంబుల ననుభవించుటకు నేను నోచుకొననైతిని హంసతూలికాతల్పములమీద నాతనిసరసను మున్న గులుకుచు బండుకొంటిని, నేను చితిమీద వానిసరసను బండుకొనుటకు నేజోవనైతి. ఆమహాభాగ్యుని భుజముమీద నాభుజముచైచికొని యుద్యానవనముల విహరించితినిగాని నేడు శ్మశానమునకు బోవుచున్న యాతని ననుసరింపనొల్లకుంటి. నేనెంత కృతఘ్నురాలనో చూచితివే! ప్రాణము లెంత తియ్యనివోకదే! నాయనా! హర్షవర్ధనా! నీయున్న యెడీ! హా! తెలిసినది తెలిసినది జనకునకు బరలోకక్రియలు నిర్వర్తించుటకు నాచిన్నియున్న యరిగెం గాబోలు, హా మహారాజా! నీకెంతలో దిలోదకంబులపై భ్రాంతి వొడమె, కనుపారగని పెంచిన కొడుకువలన నపేక్షించు నుపకార మగ్నిసంస్కారమేకదా. నావిక్రమసేనునకు బండ్రెండు సంవత్సరములు దాటకమునుపే యిన్నిపాట్లు సంభవించెన"ని వెచ్చనూర్చుచు బలుతెరంగుల విలపించుచు నడనడ మిన్నకుండి వర్మదతో భర్తృగుణంబుల నగ్గడించుచు హర్షవర్ధనుని జేరదీసి కౌగిలించుకొనుచు వలసినప్పుడు వగర్చుచు దుఃఖపరవశయై యుండెను.

అంతట నక్కడ మణివర్మ విక్రమసేనునిం దోడ్కొని కోట సింహద్వారమువద్దకుం బోయి నిగమశర్మ కబ్బాలకు నప్పగించెను. అంతయు సిద్ధమగువరకు నిగమశర్మ రాజపుత్రుని వేరొకచో గూర్చుండబెట్టి దుఃఖోపశమనంబు చేయుచుండెను. సేవకులు చండియను నేనుగును ద్వారమువద్ద నిలువబెట్టి యేయలంకారము సేయక మీద నీలిగుడ్డలుకప్పి యామీద శవదహనము నిమిత్తమేర్పడిన

ప్రాతయంబారిం బెట్టిరి. అప్పటికి పురవాసులు వేనవేలచ్చట జేరి యుండిరి. అంబారీ అమర్చినపిదప మావటీడు కూర్చుండుమని సన్న చేయ నేనుగు వాని చెప్పినట్లు చేసెను. అప్పుడు పల్లకి నేనుగు సమీపమునకు దెప్పించి మాధవసేనుడు రాజకళేబరము జాగరూకతతో నంబారిలో బన్నుండ బెట్టించి వెలలేని పట్టుశాలువమీద గప్పించెను. ఆ విధముగానున్న హేమచంద్రుని శరీరముం జూచి యచ్చట జేరిన జనులందరు—"హా మహారాజా! హా మహారాజా!" యని గుండెలు మోదుకొని బాష్పకలితలోచనులై దురపిల్లిరి.

చిరకాలమునుండి యా దివాణమును గనిపెట్టుకొనియున్న సేవకులు, వృద్ధులు, బాలురు, పురుషులు, స్త్రీలు పెద్దపెట్టున రోదనము చేసిరి. పట్టణమునందున్న మగవారందరు నష్టాదశ వర్ణములవారు నాటి దినమచ్చటనే యుండిరి. అంతయు సిద్ధమైనవెనుక నిగమశర్మ విక్రమసేనుని స్నానము చేయించి పవిత్రవస్త్రములు గట్టించి యగ్నిహోత్రము చేతికిచ్చి యేనుగుముందట నిలువంబెట్టెను. మున్నఖిల పౌరజనులకు నయనాభిరాముడై యుండునట్టి అతని సుందరమూర్తి పితృకర్మ కుచితమగు వేషమును ధరించియుండ జూచి పౌరులలో ధైర్యసారము గలవారు సయితము శోకవిహ్వలులై వలవలయేడ్చిరి. అంతయు నాయత్తమైనవెనుక నేనుగును నడుపుమని చెప్పుటకు నోట మాటరాదు. మణివర్మ మావటీనికి సన్న చేసెను. మాధవసేనుడు, మణివర్మ, దండపాణి, వజ్రపాణి, బాలుడగు విక్రమసేనునకు నలుప్రక్కలనుండి మెల్లమెల్లగ నడువసాగిరి. శోకభారమున నడువలేకయున్న విక్రమసేనుని నిగమశర్మ పట్టుకొని నడిపింప జొచ్చెను. ఏనుగువెనుక వందలకొలది బ్రాహ్మణులు చేరి స్వస్తిచెప్పుచు వెంటబోయిరి. తక్కిన పౌరు లేనుగునకు ముందును వెనుకను నిరుప్రక్కలను హాహాకారములు సేయుచు విధిని దూరుచు హరిశర్మం దిట్టుచు తమ దురదృష్టము నెన్నుకొనుచు శవము ననుసరించిరి. పౌరాంగనలు నాడు పొయిలలో నిప్పైన వేసి

కోనకద్వారములయొద్దను, గవాక్షములయొద్దను మేడలున్నవారు మేడల మీఁదను, మిద్దెలున్నవారు మిద్దెలమీఁదను నిలిచి కడసారి తమ యేలిక దర్శనముచేసికొని యొండొరులతో—"అమ్మక్కా! మున్ని మహారాజు పగవారి నోడించి జయదుందుభులు మ్రోయ పట్టపు టేనుగునెక్కి యూరేగుచుండ చూచిన మనకన్నులే ఆయనశవమూరేగుచుండ చూడ వలసివచ్చె ఈమహారాజెంత ప్రజానురంజకుఁడో ఇంకమక చల్లిన గాలకుండు కట్లు దట్టముగనున్న యీజనబాహుళ్యమే చెప్పుచున్నయది. పుర మందున్న స్త్రీపురుషుల యంతఃకరణములన్నియు నీమహారాజు తన యంబారీలో వేసికొని శ్మశానమునకుఁబోవుచున్నట్లుతోఁచుచున్నయది. ఈజన మింజూడ పురమంతయు నీయనతోఁ బోవుచున్నట్లున్నది. పాప మీమాణి వర్మకు దినములు గడచినవికావుగదా! అయ్యయో! విక్రమసేనుని జూడవే! పున్నమచందురునివంటి చక్కనయ్యకు నెంత పాడువేసము వేయవలసివచ్చినదే" యని బహువిధంబుల దమలోఁ దాము భాషింప జొచ్చిరి. అంతట నమ్మహాజనము శ్మశానమును డాయుటయు నిగమ శర్మ మంచిగంధముతోడ జితి పేర్పించి రాజశరీరము నేనుఁగుమీఁదనుండి దింపించి యచ్చితిపై బెట్టించెను. అప్పుడు ప్రకృతి జనులందరు కడ సారి తమరేనింజూచి చేతులుమోడ్చి నమస్కరించిరి. భూనభోంతరము మారుమ్రోయున ట్లెలుగెత్తి యేడ్చిరి. విధ్యుక్తముగ నచ్చట నిర్వర్తింప వలసినకర్మలన్నియు నిర్వర్తించినవెనుక నిగమశర్మ రాజదేహంబుపై నారతి కప్పురంపు టచ్చులు పరపించి నేతితో జితియంతయు దడిపించి పిమ్మట విక్రమసేనుని చేత నగ్నిసంస్కారంబు చేయించె. అంత పవిత్ర మైన దేహము సాధారణముగా దనకు లభింపదని కాఁబోలు నగ్నిహోత్రుఁడు దరికొల్పుటయె తడవుగ వాని దేహము నాహుతి జేసికొని క్షణములో భస్మావశేషము చేసెను. దహనానంతరము మణివర్మ ప్రభృతులు విక్రమసేనుని వెంటబెట్టుకొని పౌరులు వెంట ననుసరించి రా నగరాభి ముఖులైరి. క్రమక్రమంబున పౌరులు తమ యిండ్లకుం జనిరి. విక్రమ

సేనుండును, మణివర్మ ప్రభృతులతో సంతిపురి కరిగి మనోదహనము చేత మిక్కిలి గాసిపడుచున్న తల్లిం గాంచి యామెం గౌగిలించుకొని కొండొక సేపు వగచి యమాత్యుల యూరడింపుల కతమున నూరడిల్లి యుండె. ఆ సాయంకాలము మణివర్మ మాధవసేనుడు మొదలగు మంత్రులను దండపాణి మొదలగు సేనాపతులను నిగమశర్మ మొదలగు వైదికులను రావించి వారలతో—"దేశము రాజకముగ నుండకూడదు కదా! కావున హేమచంద్రుని స్థానమున జ్యేష్ఠతనయుడగు విక్రమసేనుని బ్రతిష్ఠించి యతఁడు యుక్తవయస్కుడగువరకు మనలో నెవ్వడయిన నొకడు సంరక్షకుడుగ నుండవలయు" నని పలికెను. అనవుడు నందరు విక్రమసేనుడే కాశ్మీర దేశాధిపతియనియు మణివర్మయే వానికి సంరక్షకుడుగ నుండవలయుననియు నైకకంఠముగ బలికిరి. ద్వాదశరాత్రంబులుగడచి సముచితంబుగ నుత్తరక్రియలుజరపి విక్రమసేనుడు పైతృకఋణమునుండి విముక్తుడయినపిదప మంత్రులు వానికి బట్టాభిషేకముచేసి విక్రమసేనుడు కాశ్మీర దేశాధిపతియని యెల్లచోటుల జాటింపించిరి. హేమచంద్రుడు దాల్చిన కిరీటంబు మాత్రమే ధరియింపక విక్రమసేనుడు వానిరూపమును సద్గుణంబులును ధరించుటచే ప్రకృతిజనులు హేమచంద్రుడే బాలుడై తమ్ము బరిపాలింప వచ్చెనని తలంచిరి; కాని క్రొత్తరేడుగ నెంచక యతడైన దీర్ఘాయుష్మంతుడై యుండుగాక యని దీవించుచుండిరి.

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము

హేమచంద్రునిమరణవార్త కారుచిచ్చుచందంబున దేశమంతట వ్యాపించెను. ఆమహీపాలునకు బగవారు లేనేలేరు. లౌకికవ్యవహార ధర్మములచేత వానికిం గిట్టనివా రెప్పట్టున నుండినవారు సైతము గుణగ్రహణ పారీణులై హేమచంద్రుని యకాలమృతిచే మధ్యమలోకము

నకు దీరని వెలితి ప్రాప్తించెనని పలికి వగవ, వాని యేలుబడికి లోబడి వాని పాలనంబను చల్లనివెన్నెలలో గొన్నినాళ్ళుసుఖించి వాని పుణ్య చరిత్రంబను నమృతంబు చెవులనియెడి దోయిళ్ళతో జుర్రి కన్నులకలిమి సఫలముగ వాని చక్కదనంబును వేమాఱుగాంచి ఆనందించిన ప్రకృతి జనంబులు పిడుగుం బోలిన రాజు మరణవార్తవిని తొలుదొల్త నమ్మక యొండొరుల నడిగికొని తగిన దృష్టాంతములమీఁద నాకఠోరవార్త విశ్వసించి తమతమపనులుముట్టక యన్నముదినక నీరుద్రావక నిదుర వోవక దురపిల్లిరని చెప్పిన నందతిశయోక్తి యొక్కింతయు నుండదు. కొందఱు ప్రకృతిజనంబులు రేని మరణవార్త నమ్మక దాని యాథార్థ్యముం గనుగొనదలచి బత్తెములు కట్టుకొని శ్రీనగరంబునకుంబోయి నిజస్థితి నెఱింగిరనుట కవిచాతుర్యము కాదు. ప్రతిపల్లెయందు ప్రతి పట్టణమందు జనులు రేని దుర్మరణమువిని శోకించి దశరాత్రంబులు మైలపట్టి విక్రమసేనుడు చేసిన తెరంగున దమ యోపినకొలది యుత్తరక్రియలు చేసిరనుట సత్యమునకు దవ్వుగాదు. కొందఱు తండ్రి బోయిన బాలుర కరణి వగచిరి, కొందఱు తల్లిలేని పిల్లల తెరగున దల్లడిల్లిరి కొందఱు కాశ్మీరదేశము వాసయోగ్యము కాదని పరదేశములకుం బోయిరి. వేయేల! దేశమంతట శోకదేవత విహరించినట్లుండెను. సిరియు సౌఖ్యము హేమచంద్రునితోడనే పోయినట్లు కానబడెను. మగని మరణానంతర మరవిందాదేవి నవవైధవ్య దుఃఖభారముచే క్రుంగి మానసంబున బతి చరణారవిందములె నిలిపి ధ్యానించుచు జెలిమికత్తెలతో నైన సరిగ ముచ్చటింపక మణివర్మతోనైన మాటాడక మందిర మధ్యముగ నాహారంబు విసంబుగ దినంబులు గడుపఁజొచ్చెను. విక్రమసేనుడు బాలుడయ్యు మణివర్మయు మాధవసేనుడు చూపినత్రోవను బోవుచు బంధు జనంబునకును ప్రకృతి జనంబునకును నిష్టుడై మెలంగుచుండెను.

అట మాళవేంద్రుడగు సుదర్శను డొకనాడు మంత్రులు సామంతులు మిత్రులు పరిజనంబులు పరివేష్టింప నిండుకొలువు దీర్చి

యుండ నొక బ్రాహ్మణుడు సింధునదీతీరవాసుడును పుణ్యక్షేత్రములు సేవింప దక్షిణాపథంబునకు బోవుచు మార్గమధ్యమున నుజ్జయినిలో నున్న మహాకాళేశ్వరుని సేవింపవచ్చి యద్దేవునారాధించి యనేకమహాపండితులచేత నలంకృతమైన రాజసభ యెట్లులుండునో చూడనభిలషించి కొలువుకూటమున కరుదెంచెను. సుదర్శనుడా బ్రాహ్మణుని చూచి సగౌరవంబుగ రావించి యుచితాసనంబునగూర్చుండబెట్టి వానినామము స్వదేశనామము రాకకుం గారణము నడిగి తెలిసికొని ఉత్తరదేశమందలి విశేషంబులు చెప్పుమని యడిగెను. ఆ భూసురుడు—"వేగులవాం డని యెడు విశాలనేత్రములతో నెల్ల దేశములయందలి వృత్తాంతముల జూచు మీకు నేను క్రొత్తవార్తలు విన్నవింపగలనే? ఐనను మీకు నేనొక్క వార్త నెరింగించెద. అది మీరు వినినదై యుండవచ్చును. మీకందరకు బ్రాతదై యుండవచ్చును. నామట్టుకది మిక్కిలి క్రొత్తదై మనస్సున దహించుచున్నది. ఆ వార్తయిది కాశ్మీరదేశాధీశ్వరుండగు హేమచంద్ర మహారాజు రమారమి రెండుమాసములక్రిందట దారుణమరణంబొందెను. అతనితమ్ముడు చిత్రభానుడు వానికి దొలుదొల్త కొండొక ద్రోహము గావించి సోదరునిచే నింటనుండి వెడల నడువంబడి యాయక్కసు మనసులో బెట్టుకొని సోదరుంగడ తేర్చినాడని లోకులు చెప్పుకొనుచున్నారు. ఇంతకన్న జెప్పవలసిన వార్తలెవ్వియు లేవ" ని పలికెను. బ్రాహ్మణుని నోటనుండి వెడలిన యక్షరములు సభాసదులవీనులకు జురుకుచురుకున నాటెను. హా మిత్రమా! యని సుదర్శనుడు గద్దెకుం జేరంబడి కన్నీరు విడిచెను. దేవసింహుడు మొదలగుపండితులు కటకటా! యని చెవులు మూసికొనిరి. మంత్రులు ఛీ! వాడు దనుజుడుగాని యనుజుడు కాడనిరి. తక్కిన సభాసదులు విస్మితులై హా! యెంతపని పుట్టెనని విచారింప దొడగిరి. వృద్ధులగు బంధుజనంబులు సుదర్శన మహారాజును మెల్లగ నూరడింపజొచ్చిరి. అట్లు కొండొక తడవు విచారించి సుదర్శనుడు తన యుత్తరీయపు కొంగున గన్నీరు తుడుచుకొని సభాసదుల నుద్దేశించి యిట్లనియె—

"సభాసదులారా! నామిత్రుఁడు జగద్రంగమున దనవంతునాటక మాడి నిష్క్రమించినాఁడు. అతని చరిత్రలో గడపటి అంకము ముగిసినది. సహనటుఁడను, సహకారుఁడను, సహపాఠుఁడనైన నేను వెనుకంబడియున్నవాఁడ. కాశీనగరమున నేనును హేమచంద్రుఁడును విద్యాభ్యాసము చేసితిమి. నామిత్రుని నేఁగొనియాడఁగూడదు కాని యతని పాండిత్యమును జూడ బదునాల్గువిద్యలు రక్తమాంసములతోఁ గూడిన శరీరమును దాల్చి భూలోకమునకు వచ్చెనేమో యనితోఁచును. సముద్రమునకైన మేర యుండవచ్చును గాని వాని మంచితనమునకు మేర లేదు. మధ్యలోకమున నేకపత్నీవ్రతస్థుఁ డెవ్వఁడన్న హేమచంద్రునే చెప్పవలయు. రాజకులమున సత్యవ్రతుం డెవ్వఁడన్న హేమచంద్రునే యెన్నవలయు. విలువిద్దియయందు బరశురాముని ద్రోణాచార్యుని దలపించు నేర్పరి యెవ్వఁడన్న హేమచంద్రునే పేర్కొనవలయు. పలుమాటలేల! సద్గుణంబులముద్ద యెవ్వఁడనిన హేమచంద్రుని పేరెత్తవలయు. అహాహా! ఎంతవాఁడు మృతినొందెను. ఓ మృత్యువా! నీకు మంచిచెడ్డలు లేవుగదే, ఎంతెంతవారినైన నీవొక్క నిమేషంబున గబళింతువుగదా! అవును, మనుష్యుఁడు చెడిపోయిన పదార్థములను భక్షింపక మంచి వస్తువులనే తినునట్లు నీవును దురాత్ముల పొంతఁబోక మంచివారినే మ్రింగుచుందువు. ఓ ప్రపంచమా! అంతవాఁ డస్తమించినను నీ వెప్పటియట్లుంటివిగదా! ఓ మిత్రమా! హేమచంద్రా! ప్రియమిత్రుఁడగు నన్ను బాసిపోవ నీమన సెట్టులొప్పెనయ్యా! మన యిరువుర నెయ్యమును స్థిరముగా నిలుపుటకు నీతో వియ్యమందవలయునని యున్నది. కాని మామకరందునకిచ్చి పెండ్లి చేయుటకు నీ కాఁడుపిల్లలు లేరుగదా యని పలుమారు విచారించితిని. ఆ యనురాగం బెందువోయె! అక్కచెల్లెండ్రుగ గాశ్మీర మాళవ దేశంబు లుండునని భావించితి. అక్కడ వైధవ్యము ప్రాప్తింప జెలియలేమి యుత్సాహంబు గలిగి పెంపొందగలదు! మిత్రరత్నమా! నీవు పోవ నాకుం గుడిభుజంబు పడిపోయె. ఈశరీరంబుతో నేనింక నిన్ను జూడఁజాలనుగదా!" యని క్రమ్మర బాష్పపూరితలోచనుఁడయి వగవ జొచ్చెను.

క్రొత్త బ్రాహ్మణుడు, సత్యమహిమగుడు మొదలగు నాస్థాన పండితులు రాజుం బెక్కువిధముల సమాశ్వాసించి మరణంబు ప్రకృతి యనియు శరీరంబు లస్థిరంబులనియుఁ జెప్పి పూర్వగ్రంథములనుండి యనేకోదాహరణంబుల జూపిరి. సుదర్శనునకు దుఃఖ ముపశమిల్లిన పిదప క్రొత్త బ్రాహ్మణుడు సెలవు గైకొని చనియెను. రాజును మన స్స్థిమితము లేక నాటికి కొలువు చాలించి యంతఃపురి కరిగెను. కుసుమ కోమలియగు కర్పూరమంజరి హేమచంద్రుని మరణవార్తవిని యెట్టి సాహసము చేసికొని యేమగునో యని నెమ్మనంబున దద్దయు భయం పడుచు మకరందుడు తండ్రి చెలికాని చావునకు మిక్కిలి వగచెను.

అట విదర్భనగరంబున నొక్కనాఁడు సాయంకాలమున రాజ వాహనమహారాజు తన పూవుదోటలో విహారము చేసిచేసి యలసి యొక తిన్నెపై గూర్చుండెను. నలుప్రక్కల నలువురు సేవకులు చేతులు జోడించుకొని రేనియాజ్ఞల బ్రతీక్షించుచు నిలిచియుండిరి. అప్పుడే సూర్యాస్తమయ మగుటచే బూదోటయెల్ల గనుచీకటిగ నుండెను. రాజవాహనుఁడు తిన్నెమీఁద వెనుకకు జేరబడి కూర్చుండి గారాబుకూఁతురగు బిందుమణియు, ముద్దుల మనుమడగు విజయసేనుఁడు, మనుమరాలగు కర్పూరమంజరి యనదలయి తనయింట నుండుటయు నల్లుని వార్త లించుకేనియు దెలియకపోవుటయు దలచి వారలు సుఖించు నుపాయమేదియని విచారించుచుండెను. అంతలో నొకభటుఁడు కడువేగంబున నచ్చోటికివచ్చి సేవకు నొక్కని బిలిచి— "యల్లునివద్దనుండి భటుఁడు వచ్చినాడని మహారాజుగారితో విన్న వింపుము" ని చెప్పెను. నల్లెయని యాసేవకుఁడు వానిరాక వినయమున రాజవాహనున కెరిగించె. అల్లుని తావునుండి భటుఁడు వచ్చెనని వినిన తోడనే విదర్భరాజు చివాలున లేచి కూర్చుండి—"యేడీ భటుడేడీ" అని భటునివంక జూచి—"యోరీ! మాచిత్రభానుఁడు కుశలియై యున్నాఁడా!" యని మిక్కిలి యాత్రముతో నడిగెను.

"స్వామీ! మీయల్లునకు గుశలమే, ఆయన మూఁడు దినము లలో విదర్భకు రానైయున్నారు. ప్రస్తుతము గొప్పదుఃఖములోనుండు

టచే మనస్స్థిమితము లేక పరితపించుచున్న వారని అబంటు ప్రత్యుత్తర మిచ్చెను. రాజవాహను డావచనము లాలకించి యదిరిపడి మరింత యాత్రముతో—"గొప్పదుఃఖములో నున్నాడా! ఏమి దుఃఖము! అత డిప్పు డెచ్చోట నున్నవా డెచ్చోట నున్నవాడ" ని యడిగిన మాట రెండుసారు లడిగెను. అప్పుడా భటుడు విదర్భరాజున కిట్లనియె—"దేవర వారి ప్రశ్నముల కన్నింటికి నుత్తరములు మీయల్లుడంపిన యీజాబు నందుగలవు. కావున దానిం జిత్తగింప నవధరింపుడ" ని యొక చీటి వాని కిచ్చెను. అంతలో సేవకు డొకడుపోయి దీపము గొనితేర దాని వెలుగున రాజవాహను డాజా బిట్లని చదివెను.

స్వస్తి శ్రీరాజవాహనమహారాజుగారికి మీయల్లుడు చిత్రభానుడు నమస్కరించి వ్రాయుమనవి. నాడు నాకుటుంబమును మీకడ నిలిపి విదర్భ విడిచి తీర్థయాత్రాపరుడనయి బహుపుణ్యనదుల స్నానముచేసి యనేక తీర్థములసేవించి హరిచరణధ్యానము జేసికొనుగా గాలముబుచ్చుచుంటి. అట్లుతిరుగుచు బదిదినముల క్రిందట నేను కురుక్షేత్రమునకు వచ్చితిని. అచ్చటనుండ మాయన్నగారు హేమచంద్రమహారాజుగారు దారుణముగ మృతినొందిరని ఘోరవార్తవింటి. అదిమొదలు నాకుం జిత్తస్థిమితము లేదు. మీదర్శనముచేసినంగాని యపారమైన యీమనః పరితాపము శాంత మొందదు కావున మూడునాలుగుదినములలో మీపాదసందర్శనము చేయువాడను. ఇందుమణికి విజయసేనునకు ముఖ్యముగ గర్పూరమంజరికి మాయన్న వార్తలు మెల్లమెల్లగ నెరిగింప వలయు. ఈలేఖ తెచ్చినవాడు నాప్రియసేవకుడు పింగళుడు. నేవచ్చు వరకు విదర్భాపురమున నుండువాడు.

ఇట్లు విన్నవించు మీవిధేయుడు,

చిత్రభానుడు.

ఆ లేఖం జదువుకొని విదర్భరాజు తద్దయు జాలినొంది—"హరి హరీ! పాపము హేమచంద్రుడు దారుణముగ మృతినొందెనా! కట

కటా! రాజులకు దినదినము గండమేకదా! పురాకృత కర్మఫలం బను భవింపక యెవరికితప్పును? ఓయీ పింగళుడా! చిత్రభానుడు వచ్చువఱకు నీవిటనే యుండుము" అని రాజవాహనుడు పూదోట విడిచి యభ్యంతర మందిరంబునకుజని పుత్రికయగు నిందుమణిని బిలిచి యాలేఖ యామెకు జదివి వినుపించి కర్పూరమంజరి కావార్త గను నేర్పుతో నెరిగింపవలయునని చెప్పెను. ఇందుమణి కర్ణకఠోరమగు నావార్తవిని వికలచిత్తయైనిలుచుటకుశక్తిలేక కూర్చుండి హేమచంద్రుని గూర్చి తద్దయు వగచి కర్పూరమంజరి కావార్త యారాత్రి యెరిగింప వలదని పరిచారకులతో జెప్పెను. చిత్రభానుని పుత్రుడగు విజయసేనుడు రాజవాహనుడు జాబు చదువుకొనుచుండ దాపుననుండి వినిన సేవకులలో నొకనివలన బెదతండ్రి మరణవార్తవిని ఖిన్నుడై చిన్నవోయి యుద్యానవనములో మల్లికాచంద్రికలతో గలసి కూర్చుండిన కర్పూరమంజరివద్దకు బరుగుపరుగున బోయి—"అక్కయ్యా! పెదనాయనగారి నెవ్వరో చంపినారట! విన్నావా" యని యడిగెను. అదుగుటయు గర్పూరమంజరి—"ఏమీ ఏమీ! పెదనాయనగారు మృతినొందినారా! అయ్యో! అయ్యో'' యని కసుగందిన పూలదండచందంబున విలాసముతప్పి మల్లిక యొడిలోబడి మూర్ఛిల్లెను. అది చూచి చంద్రిక తత్తరపడి దాపుననున్న దిగుడుబావియొద్దకు బరుగెత్తి దోసెడు చన్నీళ్ళు దెచ్చి బాలికమొగముపైనగొట్టి—"యమ్మా! మూరడిల్లుమూరడిల్లు"మని యొకయరటియాకుతో విసరనారంభించెను. అంతలో విజయసేనుడు తన యవస్థ జూచి భయము ద్విగుణముకాగా విస విసం బరుగెత్తి తల్లికడకుబోయి కన్నీళ్ళతో సోదరీవృత్తాంతము దెలిపెను. ఆదేవియు దనకుమార్తెకు బెదతండ్రిపైగల ప్రేమాతిశయ మెరిగినది గావున బిడ్డ యేమగునోయని దిగులుపడి యచ్చోటు తనకు జూపుమని విజయసేనుని వెంటబెట్టుకొని బయలుదేరెను.

అంతలో దెలివి వచ్చుటయు గర్పూరమంజరి దుఃఖపరవశయై చెలికత్తెలతో నిత్తెరంగున జెప్పి విలపించెను—"సఖులారా!

ఎంతటిరా జస్తమించెనే! నామీఁద పంచప్రాణములు నిలుపువాఁడు కదా! నన్ను నేల నడువనియ్యలేదు కదా! కనుటయే మాయయ్య వంతయ్యెఁగాని నన్ను పెంచిన దాయనయే కదా! మేము శ్రీనగరము బాసి వచ్చునపుడు నన్ను తనవద్ద నుంచుమని యతఁడు మాయయ్య నెంత ప్రతిమాలాడెనే! కాని మాయయ్య పరాభవము నొందినవాఁడు గావున దాని కియ్యకొనఁడయ్యె. ఎన్నదలంచిన రఘురామునకైన వంకలుగలవు. హరిశ్చంద్రునకైన గొఱతలుకలవు. ధర్మరాజునకైన దప్పులుగలవు. కాని మా పెదతండ్రి కేవంక లేకొఱత లేతప్పులు లేవు. చందమామకు జల్లదనంబు నైజగుణం బైనట్లు మంచితనంబు నా పెదతండ్రికి నైజగుణంబు. పుష్పంబులకు గోమలత్వంబు నైజగుణం బైనట్లు దయామయత్వంబు నా పెదతండ్రికి నైజలక్షణంబు. కారుమబ్బుల కయాచితముగ జలదానంబు సేయుట యెట్లు స్వభావంబో నా పెదతండ్రికి గూడ దానగుణం బట్లె స్వభావంబు. అలోకైక పూజ్యుని వధించుట కెవనికి చేతులాడెనో? ఏదురాత్ముఁడు మహాపాతకంబున కొడిగట్టి శాశ్వత నరకకూపమునంబడ సాహసించెనో! అతనిబాసి బ్రదుకుటకన్న వానికడ కేగుటొప్పదే. బ్రదికి నన్నాళ్ళు రాజకులమున కెంతవన్నె దెచ్చెనే! బంధుమిత్రుల నెట్లు కాపాడెనే! ప్రజల నెట్లుపాలించెనే! మాయదృష్టమున మాయయ్యకు నతనికి రవరవలు వొడమెనుగాని లోకులకెల్ల నతఁడు మంచివాఁడె; ఈదుఃఖమునకుఁదోడు నామనంబునందొక భయము పుట్టుచున్నది. ప్రాతపగలచేత నీయకార్యమును మాతండ్రియే చేసినాఁడని లోకు లెక్కడందురో యని నామనంబు శంకించుచున్నది. అట్టినింద మాజనకునకు రాకపోవుఁగాక! నన్ను జేరదీసి యెత్తుకొనిన నాతండ్రి హస్తములు సోదరరక్తమున మలినములుగావని నేదలంచెదన" ని మరి యేదో యనబోవుచుండ నిందుమణి విజయసేనునితో వచ్చోటికి పోయి కొన్ని యడుగులదూరమున నుండియే—"చంద్రికా! బిడ్డకు దెలివి వచ్చినదా" యని యడిగెను. వచ్చినదని ప్రత్యుత్తర మిచ్చు

నంతలోనె యాదేవి కూతుకడకుం బోయి కూర్చుండి-"బిడ్డా! స్మృతి వచ్చినదా!" యని యడిగి చేయి పట్టుకొనెను. బాలిక బదులు పలుక లేక కన్నీరు సోనలై ప్రవహింప వెక్కి వెక్కి యేడ్చె. ఇందుమణియు విజయసేనుడు కర్పూరమంజరితో గలిసి హేమచంద్రుని కొరకు కన్నీళ్ళు విడిచిరి. ఆ సమయము రాజవాహనుడు మనుమరాలు మూర్ఛితయైనదనియు దనకూతురు కూతుం జూడ నుద్యానవనమున కరిగినదనియు విని యాతొందరను దాను స్వయముగ బోయి విలపించుచున్న యా సతులను విజయసేనుని మృదువచనంబుల నూరడించి యంతిపురమునకు గొనిపోయెను.

## ముప్పదియవ ప్రకరణము

వెనుకటి వృత్తాంతము జరిగిన నాల్గవనా డుదయమున గరటకుడు విదర్భాపురమునకు బోయి మునుముందు బింగళుని గాంచి యనంతరము రాజవాహనుని సందర్శించి నాటి సాయంకాలము చిత్రభానుడు పురప్రవేశము జేయునని విన్నవించెను. విన్నవించుటయు విదర్భరాజు దుఃఖితుడైన యల్లు నెదుర్కొని తోడితెచ్చుటకు తన కుమారుని మంత్రులలో నొకనిని నియోగించి వారితో గొంత పరివారము నడువం బనిచి యీవార్త నిందుమణికి విజయసేనునకు గర్పూరమంజరికి వీనులవిందుగ ముందుగ దెలియజేసి జామాతరాక కెదురు చూచుచుండెను. పంపబడిన పరివారము దారి జూపుటకు గరటక పింగళుల ముందిడుకొని రెండుక్రోసుల మేర చని యచ్చట విడిసి మధ్యాహ్నము చిత్రభానునింగాంచి మామగారి పంపున వచ్చినట్లు తెలిపెను. చిత్రభానుండు మఱదితో జాలసేపు ముచ్చటింపక మంత్రితో బలుమాటలాడక పరిజనంబును బలుకరింపక చిన్నవోయి ధూళి

ధూసరమైన మేనితో బంధుగులు తెచ్చిన పల్లకి నెక్కెను. ఆ సమయమున నాతనితో నొక బ్రాహ్మణుడు పదుగురు సేవకులుగూడ నుండిరి. విదర్భ రాజకుమారుడు మంత్రియు బ్రాహ్మణుని గుర్తుపట్టి పలుకరించి రొక యందలము నెక్కించిరి. ఆ పరివారము సాయంకాల మగునప్పటికి బట్టణము చేరెను. రాజవాహనుడు మేడదిగివచ్చి యల్లుని సమ్మానించుటకు సోపానములమీద నిలిచియుండెను. చిత్రభానుడు పల్లకి దిగి మామకడకుం బోవ నా వృద్ధరాజు వానిం గౌగిటఁ జేర్చి—"వత్సా! నీ సోదరమరణంబు నా సోదర మరణంబు వలెనున్నది. చుట్టములు కాని వానికైన మనోదాహము సేయు వాని మరణము కేవలము సోదరుడవగు నిన్ను బరితపింప జేయుట యాశ్చర్యమా? అయిన నీశ్వరాజ్ఞ దాట నెవరికాదు గదా" యని యాశ్వాసించెను. చిత్రభానుడు దుఃఖము చేత మాటలాడ నోపక తలవంచి కన్నీరు విడుచుచు నిలువబడెను. మామ యల్లుని కన్నీరు తన యుత్తరీయపుటంచున దుడిచి యిందుమణి మొదలగువారిని జూడ వాని మేడమీదకిఁ గొనిపోయెను.

అక్కడ కుమారుడు కుమార్తెయు నిరుప్రక్కలనుండ నిందుమణి యొకచో నిలిచి యుంటిపట్టెరుగక చాలకాలము పరదేశముల దిరిగి వేళ కన్నపానాదు లరసి యడువారు లేక కముడస్ని యా నెలతకు తోడగు భ్రాతృమరణము చేతం గడు చిక్కి శల్యమైయున్న మగని జూచి బాష్పోద్గమము చేత మితిలేని తన మనస్తాపము నెరిగించెను. కర్పూరమంజరియు విజయసేనుడును దండ్రి నాలింగనము జేసికొని విలపించిరి. చిత్రభానుడు వారికన్నీరు దుడిచి యాలుబిడ్డలతో నిట్లనియె—"సోదరవియోగమున నేనిపుడు దుఃఖపరవశుడనై యున్నాడను. మీరుగూడ మిక్కిలి యడలఁదొడంగొనినచో నేను బ్రతుకజాలను. మీరు బెంగగొందురను భయమున నేను దుఃఖమంతయు దిగమ్రింగి ధైర్యము చిక్కబట్టి పైకి గంభీరభావము దాల్చి నాలోనే దిగ్రుళ్ళుచున్నాడను. ఇంక మీరు హేమచంద్రుని గూర్చి నాయెదుట విలపింప వలదు" అని వారి నంతిపురికి వీడుకొలిపి తన్ను పరామర్శింపవచ్చిన బంధుజనులను

బలుకరించి తనతో వచ్చిన బ్రాహ్మణుని దోడితెమ్మని సేవకుల కానతి యిచ్చెను. చిత్రముని వారకిగి యావిప్రుం దోడి తెచ్చిరి. చిత్రభానుడు వానిని సగౌరవముగ బిలిచి తన ప్రక్కం గూర్చుండ బెట్టుకొని విదర్భరాజువంక దిరిగి—"మామా! మీకీ విప్రుంగవుం జూచిన జ్ఞాపకమున్నదా? ఈయనపేరు రుద్రభట్టు. మాళవేంద్రుని మంత్రియగు కేసరితో నీమహాత్ముడు మున్నొకసారి యిటకువచ్చి మీచేత సత్కారములంబడసి మీకుపకారము జేసినాడను నెపమున సుదర్శనునిచే నవమానితుడై సర్వస్వము గోల్పోయి యిప్పుడు దారాపుత్రుల నెడబాసి యిడుములు పడుచున్నవాడు. నాయదృష్టవశమున నాకీమహాత్ముని సందర్శనము దొరికినది. చూచుకొన్నదిమొదలు మాకొండొరులపై ననురాగమతిశయిల్లినది. మహాదుఃఖసాగరమును నీమహాత్ముడను తెప్పచే నీదికిని. ఈయన సాంగత్యము లేనిచో నేనెంతకాలము క్రిందటనో మృతినొందియుందును" అనవుడు రాజవాహనుడు తేరి చూచి—"ఔనౌను. నేనీయనను జూచినట్లు జ్ఞప్తికి వచ్చినది. సజ్జనుడగుటచే నీకాపద్బాంధవుడయ్యెన"ని బదులు చెప్పెను. ప్రియమిత్రుడు తన్ను బలుతెరంగుల గొనియాడుచు విదర్భరాజున కెరిగింప దానూరకుండుట భావ్యముకాదని రుద్రభట్టు రాజవాహనునితో నిట్లనియె—

"మహారాజా! మీదర్శనము నాటికి నేడు క్రమ్మర లభించె. మిమ్ము వీడ్కొనిపోయినపిదప నాయవస్థయంతయు మారినది. కీడులో మేలన్నట్లు మాళవరాజు మైత్రిపోయినను హేమవంతుని యల్లునిబోలు మీయల్లుని మైత్రి నాకు లభించినది. మీయల్లుడు లోకము తోడిసాటి మనుష్యుడుగాడు. ఆయన నెట్టయెదుట నుంచుకొని నేను గొనియాడరాదుగాని యాతనింబోలు గుణవంతు డుండుటరిది. మీయదృష్టమున మీయింటియల్లుడయ్యె. అతని గుణసంపద నెన్నుట కొక్క యుదాహరణ చాలును వేయిమాట లక్కరలేదు. అన్న యతిక్రూరుడై కొండెములువిని నెవరోకింతయు లేక దారపుత్రసమేతముగ దన్నింటనుండి వెడలనడచినను వాని దుర్మరణమువిని యాతడుపడు పరితాప

మింతింతగాదు. మనసులో దీర్ఘక్రోధము పెట్టుకొని సోదరమరణమునకు మహానందము నొందవలసిన యవస్థలో నుండియు నింతగా దురపిల్లు నతఁడొక్కఁడే కానబడుచున్నవాఁడు. నామాటలు మీరు నమ్ముదురో నమ్మరో కాని మీయిల్లు డొకనాటి రేయి సోదరమరణ దుఃఖముచేత బరవశుఁడై నే బండుకొనఁగా జూచి యాత్మహత్య జేసికొనబోయెను. ఈతని సాహసము నే నెరిగినవాఁడనే కావున నేవేళ కేమి తెగువ చేయునోయని పండుకొనియు మేలుకొనియుండి సమయము గుర్తెరిగి యీదారుణకర్మను మాన్పితిని" అని తెలుప రాజవాహనుఁడు మిక్కిలి సంతోషముజెంది రుద్రభట్టు హస్తములం బట్టుకొని-" దేవా! మీరు నాపుత్రికకు బతిభిక్షమును బెట్టిరి. మీఋణమును దీర్పఁజాలన" ని కృతజ్ఞతను దెలుపు వాక్యముల బలుకుచుండ చిత్రభానుఁడు వారిమాటల కడ్డముపోయి—"అయ్యా! వెనుకటి వృత్తాంతమును దలపెట్టకుఁడు. ప్రస్తుతము కర్తవ్యమేమో నాకుపదేశింపుఁడు. శ్రీనగరమునకు బోయి తండ్రిలేక దురపిల్లు నాయున్నబిడ్డల నొకసారి కన్నులారం జూచి వారి నొకసారి బిగియార కౌగిలించికొని ముద్దిడినం గాని నాయులమట తీరదు. అన్న నాకనిష్టుఁ డయ్యెగాని పసికూనలగు నన్నబిడ్డ లేమి చేసిరి? అదియునుంగాక మావిక్రమసేనుఁడు క్రొత్తవాఁడు; బాలుఁడు రాజ్యము గొప్పది. మంత్రులు దుర్మార్గులు. బాలరాజును బొమ్మపగిది నాడించి వారు రాజ్యమును దురవస్థకు దెచ్చి బిడ్డలప్రాణములకు హానియు గావింతురని భయపడుచున్నాను. నేబోయి వారికిష్టుఁడగునేని సంరక్షకుఁడనై యుక్తవయసు వచ్చినపిదప వారిరాజ్యము వారి కప్పగించి మరలవత్తు. ఇష్టము లేదేని చూచి యూరకవత్తు. ఎంతపగ యున్నను దండ్రిపోయినపుడు వారిని చూడకుండుట భావ్యముకాదు. ప్రేమసంబంధమగుటచే నాకను రాగము పోవకున్నది. ఇందుకు మీరేమి చెప్పెదరు" ని యడుగ రాజవాహనుఁడును దక్కినవారును వానిబుద్ధినే మెచ్చి యట్లు చేయుమని యుపదేశించిరి. బంధుజనంబు తన యభీష్టమున కనుగుణ

ముగా నుపదేశము చేయుటయు జిత్రభానుడు సంతసించి మూడు దినంబులు విదర్భాపురంబుననుండి ప్రాతచెచ్చెలుల జట్టుల గూడ సుఖంబున ప్రొద్దులు పుచ్చి నాల్గవనాడు కాశ్మీరమునకు బయనమయ్యెను. అల్లుడు తగుపరివారముతో బోవకున్న నపాయము వాటిల్లునని రాజవాహనుడు తన బలములో మేటియౌలనంటి మున్నూరుగురు బంట్లనేరి యుగ్రసేనుడను సార్థకనామధేయుడగు సేనాపతిని వారికి నాయకునిగ నేర్పరచి జామాత వెంట బొమ్మని యానతిచ్చెను. రుద్రభట్టు, కరటకుడు, పింగళుడు, ధీరుడగు నుగ్రసేనుడు వెంటరా జిత్రభానుడు విదర్భనగరము విడిచి శ్రీనగరమునకు బయనమైపోయెను.

## ముప్పది యొకటవ ప్రకరణము

అది గ్రీష్మకాలము, సమయము ప్రాతఃకాలము. అస్తమించినా డస్తమించినాడని లోకు లందరు జెప్పుకొన్నట్లు తేజోవిహీనుడై నిరాలంబుడై దుఃఖమహాసముద్రమున మునిగి యేకొండలనడుమనో తిరిగితిరిగి భానుడెల్లవారు "వీని చరిత్రము చిత్రమైనది. ఇతడు నిశ్చయముగ జిత్రభాను" డని తలంప దెల్ల తెర జిమ్ముకొని వచ్చు నటుని వోలె మంచుగవిసెన దెమల్చుకొని యుదయించె. ఉదయించిన తోడనే వాని తేజము నలుదెసల వ్యాప్తమయ్యె. వ్యాప్తమగుటయు నతడు క్రమక్రమంబున నధికుడై చుట్టుపక్కల దేశమంతయు నాక్రమించి పర్వతములకు వృక్షములకు జిత్రవర్ణము గలిగించి చిత్రభానుశబ్దము సార్థకము చేసికొనియె. అతని కాపులై పరమభక్తులైన జనులు శరీరముల నిండ రక్తచందనములు పూసికొని విధివిధానముగ బూజలు నమస్కారములు చేసి మంత్రముచేతను బద్యగద్యములచేతను స్తుతియించి తమ మనోరథసిద్ధి జేయుమని ప్రార్థించిరి. దుర్నిరీక్ష్యమై దుస్సహమైన వాని

తేజమున గోడికన్నత్తి వాని జూడలేక సుకుమారులగు స్త్రీపురుషులు మందిరంబునడంగియు లతాగృహంబులం డాగియు స్వశరీర సంరక్షణము జేసికొని—"కటకటా! బంగారమువంటి చంద్రుడు డస్తమించుటయు నస్తమించినాడనుకొన్న యీచండశాసనుడు మరల దలనూపుటయు మనదోసంబుగాని వేరొకటికాదు. ఇంతకు గాలవశమున వచ్చు నాపదలకు మనమేమి చేయగలము" ని ఖేదపడజొచ్చిరి. వేదపురాణ కథలలో జెప్పబడిన సూర్యవర్ణనము నెరింగిన విద్వాంసులు వారికియథావిధిగనర్ఘ్య ప్రధానమొసంగి తీక్ష్ణతీక్ష్ణము చిత్రమై గానుపించువానిబింబమును రెప్పవాల్చక చూచి—"ఆహాహా! చిత్రభానువిమహిమ నేమని కొనియాడగలము? ఈతనిరథమునకు చక్ర మొకటియేకదా! అయురదము నీవ్వనవి పలురంగులుగల గుఱ్ఱములేదు ఆయశ్వములం గట్టుపగ్గములు త్రాచుపాములు; పోవుపట్టె దారి నూతనున్న నిరాధారమైనఆకాశము. ఆరథమునందోలువాడు తొడలు లేనివాడు. పోవలసినదూర మపారము. ఉపకరణములబట్టిచూడ వానిసాహసమున నీమహాత్మ్యము ప్రతిదినము గగనమండల మతిక్రమించుటకు వీలులేదు. కావున నితనియందుగల యద్భుతతేజమే యీతను చేయుపనికి సాధనమయ్యెను. నిరాధారులైనవారు నయితము సహజముగ తేజోవంతములైన పటిమున బేగునకు మాత్రము కొన్ని యుపకరణముల స్వీకరించి విజయము నొందుదురు గదా!" యని భావమునం దలపోయజొచ్చిరి.

అట్టిసమయమున మణివర్మ యుదయకాల కృత్యములందీర్చుకొని తన మేడమీద నొకపీఠముపై గూర్చుండి యేదో యోచించుచుండ గవాక్షపు సందులనుండి చిత్రవర్ణములుగల భానుని కిరణములు మొగమునకుం గన్నులకుందాకి యించుక వేదన గలిగించె. కిటికీ తలుపులు మూయుమని సేవకుని బిలిచి యానతిచ్చెను. అపరిచారకుడు తలుపులుమూసి యజమానుని యెదుట నిలిచి—"దేవా! పేరుగసేనుడట ! కాపురము విదర్భపురమట ! వచ్చినది మీదర్శనార్థమట ! సెలవగు నేని వానిం దోడితెచ్చెద" ని వినయముతో విన్నవించెను.

"ఏమీ! కాపురము విదర్భాపురమా! పేరు ఉగ్రసేనుడా! నా నిమిత్తము వచ్చెనా! సరే, తోడ్కొనిరమ్ము" ని యాతడానతిచ్చెను. చిత్తమని సేవకుడుబోయి యాక్రొత్తపురుషునిం దోడ్కొనితెచ్చె. నల్లనై పొడవై దృఢమైయున్న యాపురుషుని శరీరము దీర్ఘబాహువులును పెద్దఫాలమును వెడదరొమ్మును జూచిన తోడనే మణివర్మ యెదురుపోయి వానిందోడితెచ్చి యొకపీఠమున గూర్చుండబెట్టి గౌరవించి కొండొకతడ వూరకుండి మెల్లగ నిట్లనియె—"విదర్భనాధుడగు రాజవాహన మహారాజుగారి కొలువరులగు మీకు స్వాగతము. నాకడకు మీరువచ్చిన కారణమేమి? ఆప్రభువు పంపెనో మీరు స్వయముగ వచ్చితిరో తెలియగోరుచున్నాడ" నని యడిగెను. అనుటయు నుగ్రసేనుడు వానికిట్లనియె—"మంత్రిశిఖామణీ! విదర్భరాజు నన్ను దూతగా బంపలేదు. రాజవాహన మహారాజు యల్లుడు చిత్రభానుడు సోదర వియోగమునకు జాల ఖిన్నుడై యున్నబిడ్డలను మిమ్ములను జూచిపోవ వచ్చినాడు. ఆయనతో గూడ విదర్భరాజు నన్ను బంపినాడు. చిత్రభాను డీనగరము వెలిగుడారములలో సపరివారముగ నున్నవాడు. పురము ప్రవేశించి సోదర పుత్రులం జూడ నభిలషించుచున్నవాడు. అప్పటికిని మీయనుజ్ఞ వేడుమని నన్ను బంపినాడు. ఇదె నావచ్చినపని,"

అనవుడు మణివర్మ—"ఏమీ! చిత్రభానుడు జీవించియున్నాడా? హరిద్వారమువద్ద నతడు మృతినొందెనని హేమచంద్రమహారాజుగారు జీవించియున్నపుడె మేమందర మొక్కవార్త వింటిమి" ని యాశ్చర్యముతో నడిగెను. అప్పలుకులువిని యుగ్రసేనుడు వచ్చియు రాని చిరునవ్వు మొగమునదోప—"నమితలోకానుభవముగల మీకు నేను జెప్పవలయునా? అన్నదమ్ములకు వరవలు పొడముటచే నదే సందుగ జేసికొని రాజున కామాటలు మనఃప్రీతికరము లనుకొని కిట్టనివారట్లు చెప్పియుందురు. అంతేకాని చిత్రభానుడు మృతినొందలేదు. మృతి నొందిన సోదరునినిమిత్త మతడొందు చింత యింతింతయని చెప్ప

నలచి కాదు. అన్నకుమారులను వదిలెను దక్షిణ చుట్టములను జూచి పోవ వలదు వచ్చితాను. అన్నితమ్ములకుగల ప్రాతపగలు మీరు తలంపవద్దు, ఉత్తములకు విరోధము స్థిరముగానుండదు. అదియును గాక చిత్రభానుని మాటయే కఠోరముగాని మనస్సుమృదువు. కావున వానిరాకకు మీరు సమ్మతింపవలయునని వేడుచున్నాడన" ని పలికి యతడేమి యుత్తరము చెప్పునో వినుటకు వానివంక కన్నులు నిగిడ్చి చూడదొడగెను. మణివర్మ యుప్పెలుకులు సమగ్రముగ నాలకించి తల యూచి కొంతతడ వాలోచనచేసి యిట్లని వచియించె— "ఉగ్రసేనుడా! మా రాజకుటుంబమునకు జిత్రభానునకుగల పరస్పరసంబంధమెట్టిదియో నీ వెరుగుదువు. చిత్రభానుని రాకయు వానిపోలికయు దక్షిణ మంత్రులకు సేనాపతులకు జిన్నరాజునకు రాజమాతకు దెలిపి మేమందరము గలిసి విచారించి రేపుదయమున మీకుత్తరము బంపువాడ. నేనొక్కడనే మాట చెప్పుటకు వలనుపడదు. రేపటివరకు నగరము వెలుపలనే చిత్రభాను నుండుమనుము" అనవుడు వల్లెయని యుగ్రసేనుడు లేచి వానికడ సెలవుగైకొని తన నివాసమునకు బోయెను.

ఉగ్రసేనుడు గుమ్మము దాటిపోయినది మొదలు మణివర్మ మనసు మనసులో నుండదయ్యె. ఒక పరియాయము పీఠముమీదనుండి చివాలున లేచినిలుచును. నిలిచి నిలిచి యిట్టట్టు దిరుగును. తిరిగి తిరిగి మరల పీఠమున గూర్చుండును, కూర్చుండి పలుతెరంగుల యోచింపు చుండును. "ఈదురాత్ముని మరల నగరములో నడుగు పెట్టనీయ వచ్చునా" యని యొకసారి తలంచును, "రానీయనిచో నతడు దండువిడిసి మన కెగ్గు సేయుడా" యని యొకమా రూహించును. ఎన్ని విధముల విచారించినను వాని కేయుపాయంబును బాలుపోవమి యావిషయమే తరచి తరచి మరల మరల జింతించి యెట్టకేల కీక్రింది ధవిమున కృతనిశ్చయుడయ్యెను. "ఏమయినం గానిమ్ము. చిత్రభానుడు నిశ్చయముగ హేమచంద్రుని జంపిన మహాపాతకుడు. కావున నామాట చెల్లునేని వాడు శ్రీనగరము మరల బ్రవేశింపక

పోవునట్లు చేసెద.” అట్లు కృతనిశ్చయుఁడై నపిదప స్నానముజేసి భోజనముగావించి యానాఁడు పెందలకడ రాజనగరునకుంబోవ సమకట్టి యరద మెక్కి సత్వరము యుచ్చోటికిం బోయెను. పోయి ప్రధాన పురుషులగు దండపాణి వజ్రపాణి మాధవసేన ప్రముఖులను నిగమశర్మలను తక్కిన రాజబంధువులను బిలిపించి వారిం గలియఁగట్టుకొని కాలరాజగు విక్రమసేనుని సన్నిధికిజనియెను. విక్రమసేనుఁడు వారల నందఱ సగౌరవముగ నాదరించి యుచితాసనముల గూర్చుండ నియమించి యందఱి నొకసారి రావించిన మహాత్కార్య మేమని యడిగెను. అందఱు మణిశర్మవంక జూచిరి, రాజకుమారుని దృష్టియు ప్రత్యుత్తరము నిమిత్తము మణిశర్మమీఁద నేపడెను. అంతట మణిశర్మ తనపీఠము నించుక ముందరకు జరపుకొని మరల నందఱ నుద్దేశించి యిత్తెరంగున బలుక దొడంగెను—“రాజేంద్రా! మిక్కిలి యవసరమగు నొక విషయమును జర్చింపదలఁచి వీరలనందఱ మీసమ్ముఖంబునకు రావించితి, మిత్రులారా! ఈ విషయము పరమ గోప్యమైనది. అందఱము కుమార రాజుగారి మేలుగోరు వారమైకావున నిచ్చట జరిగెడు చర్చ లీమందిరము దాటి యావల వ్యాపింపఁగూడదు. నా చెప్పఁబోవు నంశము మీరు చక్కఁగ విచారించి మీమీ యభిప్రాయముల మర్మము లేక వెల్లడిచేయుఁడు. చిత్రభానుఁడు మృతినొందెనని మున్ను మనము వింటిమికదా, అతఁడు జీవించియున్నాఁడట! సోదర మరణమునకు మిక్కిలి పొక్కుచున్నవాఁడట! అన్నబిడ్డలను వదినెను జుట్టములను దానొకసారి చూచి పోవలయునని వచ్చినాఁడట! ఊరుబైట గుడారములలో నున్నాఁడట! పురప్రవేశమునకు మన యనుమతి వేఁడుచున్నవాఁడట! వానితో వచ్చిన విదర్భరాజు సేనాపతియగు నుగ్రసేను డనువాఁడు వాని పంపునవచ్చి వాని మనోరథము నాకెఱిగించె. కావున వాని పూర్వచరిత్రము జ్ఞప్తికి దెచ్చికొని మన ప్రస్తుతస్థితి నెంచికొని మీకుం దోఁచిన పోలిక హితము నుపదేశింపుఁడు.”

చిత్రభానుఁడు సజీవుఁడై యున్నవాఁడని వినినతోడనే దండపాణి మొగము తెలివొందెను. వజ్రపాణి మనసు హెచ్చరికతో నుండెను.

ఈయుభయుల ముఖ మనోవికాసములను మణివర్మ తక్క తక్కిన వారు గ్రహింపలేరైరి. "అయ్యో! మరల వచ్చినాడా?" యని నిగమశర్మ గుండె కొట్టుకొనెను. అతడు మనలం జూచి పోయినంత మాత్రమున మన కేమినష్టముండున" ని విక్రమసేనుడు మణివర్మతో ననియె. "చూడవలసినదేమో యిదివరకే చూచినాము. అన్నగారి మరణము చూడలేదా? ఇంకను జూచుట కేమున్నది?" అని మాధవసేనుడు పలికెను. అప్పుడు నిగమశర్మ మరల నేదియో యనబోవుచుండ నంతలో దండపాణి యందుకొని—"అనుమానబలముచే దోషారోపణము చేయుటయె కాని చిత్రభాను దౌష్ట్యము ప్రత్యక్షముగ జూచినవారు లేరు. సోదరవియోగమున మిక్కిలి పొగిలిపొగిలి ప్రేమాతిశయమున సోదరపుత్రుల జూడదలచిన చిత్రభానుని రానీయకపోవుట మనకు న్యాయము కాదు. సోదర వియోగమున వాని మనసెంత కుందుచున్నదో యతని హృదయ మెంత దుఃఖాగ్నిని మండుచున్నదో యెవ్వ రెఱుంగుదురు? కావున వానిని రానియ్యవచ్చునని నాయభిప్రాయమ" ని పలికెను. వజ్రపాణియు దన యన్నయగు దండపాణి మార్గము ననుసరించి చిత్రభానుని రాక కనుమతించెను. నిగమశర్మ—"మీకందరకు నేది యిష్టమో నాకు నదియే యిష్టమ" ని చెప్పెను. "ఎవ్వ రేమనుకొన్నను సరే చిత్రభానుడు మున్ను దాటిపోయిన కోటగుమ్మము మరల దాటి లోనికి రాగూడదు. ఇదియే నాయభిప్రాయమ" ని మాధవసేనుడు పలికెను. "మాయమ్మగారి మన సే తెఱగున నుండెనో తెలిసికొనుట యుచితము" ని విక్రమసేనుడు పలికెను. అంతట మణివర్మ యుత్సాహవశమున బీఠమునుండి లేచి తన ముసలి మేను గంపింప కోపముతో నిట్లనియెను—"దండపాణీ! చిత్రభానుని దౌష్ట్యము ప్రత్యక్షముగ జూచినవారు లేరంటివికదా! అతని నిటకు రావించితిమా దుండగములు ప్రత్యక్షముగ జూడగలము. మీరేమనుకొన్నను సరే; హేమచంద్రుని గడతేర్చిన మహాపాతకు డతడే యని

నాయభిప్రాయము. సోదరునిగూర్చి యతడు పొక్కుచున్నవాఁడా ? కటికివానికి జాలియుండు నేని, వ్యజనమునకు మెత్తదన ముండు నేని, వేమునకుం దియ్యదన ముండు నేని వానివద్ద సుగుణములుండును. వానిని గృహప్రవేశము చేయించుట యమ్మ స్వర్గపుర ప్రవేశము చేయించుటయే; వానిని రానిచ్చుట మృత్యుదేవతను రానిచ్చుట; వానిని నమ్ముట పెద్దపులినోట దలనిడుట; వానిని మనకడ బెట్టుకొనుట, పామును మెడజుట్టుకొనుట. దుష్టునకు దూరముగ నుండవలయు ననుమాట నిజమగుటంజేసి మనము వానిని పరిత్యజింప వలయును. నరికివేయబడిన కొమ్మను మరల జెట్టున కెన్నఁడయిన నదుకవచ్చునా ? అట్లె కుటుంబమునుండి విడిపోయిన వానిని మరల గలుపుకొనుట యసంభవము. కావున జాలినొందక, మోమాటపడక, భీతిజెందక చిత్రభానుని రాక నిరాకరింపుము.

మహారాజగారు సెలవిచ్చినట్లు తల్లిగారి మతము తెలిసికొనుట కర్తవ్యము. కావున నో నిగమశర్మా! పురోహితులగు మీరు రాజమాత సన్నిధికింజని యుద్దేవికి నా పలుకులు దండపాణి ప్రముఖుల వచనములు సరిగ విన్నవించి యామె యిష్టము ననుసరించి కార్యనిశ్చయము జేయుడు. ఆమె నరదిరాక ననుమతించినచో మీరు పోయి రేపుదయమున జిత్రభానుని దోడ్కొనిరండు. అనుమతింపదేని మేమందర మనుమతింపలేదని వానితో జెప్పిరండు. ఇదియే నాచేయవలసిన హితోపదేశము" అని పలికి కూర్చుండెను. అంతట సాయంకాలమయ్యెను. విక్రమసేనుడు సంధ్యాకాల కృత్యములు దీర్చుట కభ్యంతర మందిరమునకుం బోవదలచి పీఠమునుండి లేచి—"మీ యిందరి పలుకులు వేరువేరుగ మాయమ్మకు విన్నవించి యామె యిష్టముం బట్టి కార్యనిశ్చయముం జేసెదను. మీరింక గృహములకరుగుడ" అని సెలవిచ్చి యంతిపురికిం జనియె.

# ముప్పది రెండవ ప్రకరణము

మఱునాఁడు చిత్రభానుఁడు రేపకడ మేలుకాంచి భానుండు పొడుపుగొండమీఁద నుదయించకముందె ప్రాతఃకాలకృత్యంబులు నెరవేర్చుకొని గుడారంబునం గూర్చుండి తన రాకం గూర్చి మణివర్మ ప్రముఖు లెట్లు నిర్ణయించిరో తెలియక యనేక విధంబుల మనంబున దలపోయుచుండ నంతలో నుగ్రసేనుఁడును గాలకృత్యంబుల దీర్చుకొని యాతనికడకు పోయెను. పోవుటయు చిత్రభానుఁడు వానిం జూచి—"యుగ్రసేనుఁడా! మన కేమాటయుం దెలియకపోవుటకుఁ గారణ మేమి? మణివర్మ యేమనియెను? ముఖలక్షణంబుల బట్టిచూడ నతండు మన కార్యంబు దెస ప్రసన్నుఁడై యుండినట్లు నీకుం దోఁచెనా? మనయెడ ద్వేషము బూనినట్లు కానఁబడెనా? మణివర్మ బుద్ధికుశలత యసాధారణము. ఆవులించిన వారి ప్రేవులు లెక్కపెట్టును. ఇంతకు మన తలంచినపని యేమగునని నీబుద్ధికిం దోఁచుచున్నది? ఇందు నెరవేరితిమా?" అని వాక్యము సమాప్తము చేయకముందె యుగ్రసేనుఁ డందుకొని—"దేవా! మణివర్మ ముఖవైఖరి మనకు భాగ్యసూచకము కాదు. దండపాణి మొదలగువారు మాత్రము మన కనుకూలు రగుదురా! ఎట్లయిన మనకార్యము కష్టసాధ్యము కాని సులభసాధ్యము కాద"ని యుత్తర మిచ్చెను. "మిత్రమా! దండపాణి నాకు జిన్ననాటి మిత్రుఁడు కాని మాయన్నకుం గడుగూర్చు. నేనొక్క రహస్యము జెప్పెద. అది నీమనస్సుననే యుండవలయు. నిన్న రేయి మీరందరు నిద్రించినపిదప నిదురరామి నేమియు దోఁచక నేనీ గుడారమున నిట్టటు దిరుగుచుంటి, అప్పుడు గుడారము గుమ్మమువద్ద కావలియున్న పింగళకుఁడు నాకడకొక క్రొత్తమనుష్యునిం దోడ్కొనివచ్చి—"దేవా! దండపాణి మీకడ కీతనిం బంపె. దేవరవారితో నీతఁ డొకమాట మనవిచేయ సెలవు వేఁడుచున్నాఁడ"ని వానిని నాయెదుట బెట్టెను. నేనును సంభ్రమ సంతోషంబులు మల్లడిగొని నప్పురుషునిఁజూచి దండపాణి

సేమమడిగి వచ్చినపని దెలుపుచుంటి. అప్పురుషుఁడు నలువంకలుఁజూచి— "క్రొత్తవా రెవ్వరును లేరుగద! ఈమనుష్యుఁడు మనవాఁడేకద" అని యడిగి క్రొత్తవా రెవ్వరును లేరనియు బింగళకుఁడు నాపరిజనుఁడే యనియు నేబదులు చెప్పినపిదప నిట్లనియె—"దేవా! కాశ్మీరరాజ సేనాపతి దండపాణి మీదర్శనముచేయ జాల కుతూహలపడుచున్నవాఁడు. రేపురాత్రి రెండుజాములవేళ నిక్కడకువచ్చి మిమ్ము దర్శింపఁగోరుచున్నాఁడు. మీద దేవరచిత్తము"ని యూరకుండెను. అప్పలుకులు విని నేను గడు సంతుష్టుఁడనై—"వానిజూడ నేనును మిక్కిలి యుబలాటమందుచున్నవాఁడ. తప్పక రేపటిరేయి రమ్మనుము. వానిరాకకే నెదురు చూచుచుండెదన"ని చెప్పి వానినంపితిని. వానిరాక నేను బింగళకుఁడుమాత్ర మెరుగుదుము. దీనింబట్టి దండపాణి నాకనిష్టుఁడుగ నుండఁడని యూహించెదను. వజ్రపాణి నేనిక్కడనున్నప్పుడె మాకర్పూర మంజరిపై మనసు నిలిపియుండినవాఁడు కావున వానికి నాయెడ నధికానురాగము గలదు" అని పలికి వెండియుం గొంత పలుకఁబోవుచుండ బింగళకుఁడు వారిని సమీపించి—"దేవా! రాజపురోహితుఁడు నిగమశర్మ మీదర్శనార్థము వచ్చియున్నవాఁడ"ని విన్నవించెను. "వాని సత్వరమే ప్రవేశపెట్టుమ"ని చిత్రభానుఁడు సెలవొసంగుటయు బింగళకుఁడు పోయి నిగమశర్మం బ్రవేశపెట్టి తాను గ్రమ్మర ద్వారముకడకుం జనియెను.

ఆబ్రాహ్మణుఁడు గుడారమునం దడుగుపెట్టినతోడనే చిత్రభానుఁడు పీఠమునుండి లేచి యెదురుగాజని వాని పాదములకు సాష్టాంగదండ ప్రణామము గావించెను. నిగమశర్మ వాని భక్తికి దద్దయుమెచ్చి— "దీర్ఘాయురస్తు కల్యాణమస్తు" అని దీవించి వంగి చేతులతో వానిని లేవనెత్తెను. అంత జిత్రభానుఁడు వానిం దోడ్కొని యొక పీఠమునం గూర్చుండబెట్టి సువర్ణపాత్రముతో నిర్మలజలంబును దెప్పించి వెండి పళ్లెరమున నాబ్రాహ్మణుని యడుగులుంచి కడిగి యయ్యుదకంబు శిరంబునం జలుకొని ధన్యోస్మి ధన్యోస్మి యని యిట్లు పలికెను—

మునకు వచ్చెను. అసందడి కనిపెట్టి పింగళకుడు క్రొత్తపురుషునిడాసి—
"స్వామీ! మీరెవ్వరు? లోనికి రాగోరుదురా?" యని యడిగెను;
"నేనెవ్వడనైన నీకెందుకు? నీశక్యమగునేని నన్ను జిత్రభానుని కడకుం
గొనిపొమ్మ" ని యప్పురుషుడు బదులు చెప్పెను. ఆ యిరువుర
సంభాషణము దూరమునుండివిని చిత్రభానుడు సత్వరము బయటికి
వచ్చి యప్పురుషుని సమీపించి—"దండపాణీ" యని మెల్లగ బిలువ—
"నేనే" యని యత డుత్తరము చెప్పినతోడనే వాని నచ్చుటనె బిగ్గ
గవుంగిలించుకొని చేయిపట్టుకొని లోనికిం దీసికొని పోయెను.

గుడారములో దీపపు వెలుతురున రమారమి రెండుసంవత్సరముల
క్రిందట నెడబాసిన ఆ మిత్రులిరువురు నొండొరుల మొగంబుల బరిశీ
లించిచూచి గిరానవాలుపట్టి తనివిదీర నింకొకసారి కౌగిలించుకొనిరి.
అనంతరము చిత్రభానుడు దండపాణి పీఠములపై గూర్చుండబెట్టి—
"మిత్రమా! నీ దేహస్పర్శచేత చిరకాల వియోగతాపముకూడ కొంత
వరకు దీరినది. ఇది కనుసుదినము. మిత్రమా! నాడు నిన్ను నేబాసినది
మొదలు నేటివరకు నే దిరుగని యడవులు, దూరని గుహలు, పడని
కష్టములు లేవు. ఇక నాకష్టములు గట్టెక్కనవని ధైర్యము గలిగినది.
నిన్నుచూచుకొని నేను సోదరవియోగము మరచుచున్నాడన" ని ప్రీతి
పూర్వక భాషణంబులాడెను. దండపాణియు మిత్రునకు దీసిపోవక
యిట్లనియె—"చెలికాడా! నీవు లేని ఈ రెండేండ్లు రెండు యుగములుగ గడిపి
తిని. నాబొందిశ్రీనగరమునను, నాయాత్మ నీకడనునిలిపి కాలముగడపితి.
నీవు కుశలివై మరల నీవిధంబున మాకన్నులకు విందుసేయుదువని
కలనయిన దలంపలేదు. మిత్రుడా! నిన్ను రెండు మూడు మాట
లడుగవలయునని యభిలాష గలదు; వీడిట్లు సాహసించి యడుగునే
యని నామీద గినుక బూనక ప్రత్యుత్తరములు చెప్పవలయు. నీవు
హరిద్వారమున మృతినొందితివని హరిశర్మయను నొక బ్రాహ్మణుడు
హేమచంద్రునితో విన్నవించె. ఆమహారాజు నీనిమిత్త మశ్రుజలంబులు
ఎడుచుచునే పరలోకంబునకు బోయెను. నీపై నసత్య మరణవార్త

లెట్టుపుట్టె! మహారాజు మరణమునకు నీవే కారణుడవనియు హరిశర్మ ప్రేరణంబున నీవే. నీపనిచిన హంతకులో మహారాజుం గడతేర్చిరనియు లోకులు చెప్పకొనుచున్నారు. ఇందేమైన సత్యముకలదా, మిత్రుడను నాకడ నెద్దియు దాచక హృదయ పేటిక దెరచియున్న దున్నట్లు పలుకుము, నేను నీవాడనెకాని యన్యుడనుగాను. మిత్రుల హృదయములు రహస్య రత్నములు దాచందగిన యినుపపెట్టెలుకదా!"

అనవుడు చిత్రభానుడు వచ్చియురాని నవ్వొకింత నవ్వి— "ప్రియసఖా! అడిగితివి గాన జెప్పెదవినుము. నేను హరిద్వారమువద్ద మృతినొందితినని ప్రవదము పుట్టించినవాడు మణివర్మ. మాయన్నగారి మనస్సు గలచి యా ధర్మస్వరూపుని జంపినవాడు మణివర్మ. మాయన్నతో జెప్పరాని కొండెములు చెప్పి నన్నీ వీటినుండి వెడలనడచినవాడు మణివర్మ. మాకులవృత్తి నిర్మూలనముజేయు పురుగు మణివర్మ. మాకు బ్రక్కలో బాము మణివర్మ. వానినినమ్మి మాయన్న మరణము దెచ్చుకొనియె, మావదినెయే నాసోదరునితో నామీద బలు కొండెములు చెప్పి నాకింతపాటు గలిగించినదని నేనిన్నినాళ్ళు దలంచుచుంటిగాని యరసిచూడ మణివర్మయే దీనికిం బ్రధానకారణమని యిప్పు డెరింగితిని."

"నిన్ను దేశమునుండి వెడలనడచి మహారాజును జంపించిన మణివర్మ కేమిలాభము" ని దండపాణి వానిసంభాషణము నడుమ నాపి యడిగెను. అడుగుటయు జిత్రభానుడు—"దండపాణీ, లోకవ్యవహార విదుడవగు నీకిది తెలియకపోయెనా? రాజుం జంపించినచో రాజకుమారులు బాలురు గావున వారి పేరుపెట్టి తానే కాశ్మీరరాజ్యమంతయు నేలవచ్చు. నేనిక్కడనే యుండిన పక్షమున రాజుం జంపించినను వానికి లాభముండదుకదా! విక్రమసేనుడు పెద్దవాడయి రాజ్యభారము పూనిన వానిం దనచేతి కీలుబొమ్మవలె నాడింపవచ్చు.

మంత్రులు రాజులయెడల జేయు దుండగము లెన్నియోకలవు. రాజకుటుంబమును నాశనముచేసి కాశ్మీర సింహాసన మెక్కవలయునని

మణివర్మ మనసార దలపోయుచున్నట్లు నేనిచటనున్నపుడె వినియుంటి. పలుమారులు నేనీమాటమాయున్న కెరిగింపదలచితినిగాని మాకిరువురకు మనస్పర్ధ లుండుటచే నది నాపన్నుగడగా నెంచునే కాని యతడు సత్యముగా గ్రహింపడని యూరకుంటి. మణివర్మయు హరిశర్మయు దోడిదొంగలు. ఆ శర్మవర్మ లిరువురుం గలిసి ఆదుష్కర్మ మొనర్చిరి" అనుచుండ దండపాణి మరల వానిమాట కడ్డమువచ్చి—"మిత్రుడా! హరిశర్మ మణివర్మ ప్రేరణంబుననే యీ ఘోరకృత్యము చేసియుండు నేని హరిశర్మకు నీయందు దిష్టముండదుగదా! అతడు నిన్నుంగూర్చి యెంతయువిచారించె. నీయందు పక్షమువూని నీకు సాయము చేయుమని నన్నుంబురికొల్పె. నీయాత్మ చేత నతను మాటలాడించె. మణివర్మ శాపు డైనవాడు నీయెడ నిట్లు మైత్రిజూపుటకు గారణమేమి!" యని యడిగెను. అతని హృదయమున గాటముగ నాటిన యా సందేహం దీర్ప జిత్రభాను డిట్లనియె—"ఓయి వెఱ్ఱివాడా! నేను బ్రదికియుండగా జచ్చితినని బొంకి న యాత్మచేత మాటలాడించెదనని డంబములు కొట్టినవాడు దొంగగాక మునియగునే! మాయోపాయములుపన్ని నిన్ను త్రెంగున మోసపుచ్చె. వాడు నాదెస ననురాగము జూపుటయు మణివర్మ పన్నిన పన్నుగడయే. నీవును నేనును బాల్యస్నేహితుల మగుటచే నామీద నీకెంత యనురాగమున్నదో పరీక్షించుటకు మణివర్మ హరిశర్మచేత నట్టి పలుకులు బలికించి యుండవచ్చు. వాని పలుకులకు మోసపోయి నీవు నాపైగల యనురాగముం బ్రకటించితివి కాబోలు నీమంత్రి నీమీద నొకకన్ను వేసియేయుండును."

బుద్ధ్యాతిమగు నావృత్తాంతము నాకర్ణించి దండపాణి మొట్ట మొదట నడినమ్మజాలక వెనుక తనయెదుట జరిగినవిషయముల జ్ఞప్తికి దెచ్చికొని చిత్రభానునిమాటలను వానిచో బోల్చిచూచుకొని యట్టకేలకు దనమిత్రునిమాటలే తన కెక్కుడు విశ్వాసముగలిగింప గొండొక సేపటికిట్లనియె—"చెలికాడా! ఇంతకాలము నేను హేమచంద్రుని నీవ కడతేర్చితివని దురభిప్రాయము పడియుంటి. ఇప్పుడది నామనంబున

నుండి తొలంగె. నీవు చెప్పినది నిజము. మణివర్మ నన్ను సరిగా నమ్ముటలేదు. నామీద వాని కేదో యనుమాన మున్నది. నేను నీవాడనే. నిన్నటి సభలో రాజు నెదుట మణివర్మ నిన్ను చేసిన నిందలిన్నియన్నియని చెప్పజాలము. అధికారగర్వముచేత వాడు మిక్కిలి విఱ్ఱవీగుచున్నాడు. మన మిరువురము గలిసి వానిగర్వ మడంప వలయు నేను నీవిచ్చట నుండునట్లు జాగ్రత్తపెట్టెద" నని యూరకుండుటయు నంతవర కేమియు బలుకక మౌనముద్ర వహించిన రుద్రభట్టు లేచి—"మీ స్నేహబంధ మంతకంతకు వృద్ధినగుగాక! మీ యిరువుర మనోరథములు సఫలమగుగాక! భక్తవత్సలుడు పరమేశ్వరుడు మీకు తోడ్పడుగాక!" యని వారియిద్దరి కుడిచేతులం బట్టుకొని యొకరి చేతిలో నొకరి చేయి వేయించి రహస్యములు వెలిపుచ్చకుండున ట్లొండొరుల నిమిత్తము ప్రాణములయిన విడుచునట్లు వారిచే ప్రమాణములు చేయించెను.

అట్లిరువురును శపథములు గైకొన్నపిదప దండపాణి చిత్రభానుని వంకజూచి—"సఖుడా! నేను వచ్చినప్పటినుండి నిన్నడుగ దలచుచున్నాడను. శరీరము దాల్చిన బ్రహ్మతేజమట్లున్న యీ మహాత్ము డెవ్వడు? పోలిచూడ హరిశర్మ మొగము, నీయన మొగము నొక్కలాగున నున్నది. మనుష్యులం బోలిన మనుష్యు లుండకపోదురా? ఈత డతడుగాడని తలంచెద. ఈయన యెవ్వరో నాకెఱిగింప వలయున" నని యడిగెను. చిత్రభానుడు—"మిత్రుడా! యీతడు మనకు బరమాప్తుడు. బ్రాహ్మణుడ" ని వానికి బదులు చెప్పె. అంతలో రుద్రభట్టు దండపాణినిజూచి—"నాయనా! నేను హరిశర్మను గాను. కాని నాకును హరిశర్మకును ముఖలక్షణంబుల నేల పోలిక కలదో కాలాంతరంబున మీకు నెఱిగించెద" నని పలికి విరమించెను. అంతట జాము కోడి కూయుటచే దండపాణి సత్వరము బోవలయునని చిత్రభానుని వీడ్కొని యెప్పటియట్లు ముసుగు బెట్టుకొని స్వగృహమునకు జనియె.

## ముప్పది మూడవ ప్రకరణము

చిత్రభానుడు మరునా డంతిపురమునకు వచ్చునని యరవిందాదేవి నిగమశర్మవలనవిని వానినెదుర్కొని సంభావించుటకు బ్రవేశము నడపుటకు మణివర్మను రమ్మని వర్తమాన మంపెను. ఆ వర్తమానము విని మణివర్మ తన రాణికీ క్రింది సందేశ మంపెను—"అమ్మా! మీరు నిప్పులం జొరబడుమన్న జొచ్చెద. నీట దిగుమన్న దిగియెద. విషము ద్రావుమన్న ద్రావెద. కాని చిత్రభాను నెదుర్కొని సంభావింపజాల. నేను జీవించియుండగా జిత్రభానుడు మరల బురప్రవేశము జేసినాడన్న యపకీర్తియే నాకు జాలు. కావున నన్ను క్షమియించి యీ కార్యమునకు నొరుల నియోగింపవలయు."

ఆ సందేశము విని యరవిందాదేవి సంధిగ్ధమనస్కయై సత్వరము మాధవసేనుని రావించి మణివర్మ పంపిన సందేశ మెరిగించి వెండియు నిట్లనియె—"ఆర్యా! చిత్రభానుని రాకను నేననుమతించుట మొగమోటముచేతగాని ప్రేమచేతగాదు. అది నీవు నెరుంగుదువు. మణివర్మ కీకార్యం బింత యనిష్టముగా నుండునని నేననుకొనలేదు. ఇప్పుడు కర్తవ్యమేమి? రావలదని చిత్రభానునకు వర్తమాన మంపుదునా? మొదట రమ్మని పిదప వద్దనుట వెనుకటి క్రోధాగ్నిని నేయివేసి మంట చేయుట, పండుకొన్న త్రాచును లేవ గొట్టుట. కావున జేయదగుదాని నుపదేశింపుము." అనవుడు మాధవసేను డించుక విచారించి—"తల్లీ! మొదట వానిరాక కనుమతి నియ్యనే కూడదు. ఇచ్చినపిదప వెనుదీయ గూడదు. ప్రవేశంబు నేనడిపెద. కానున్నది కాకమానదుకదా!" యని పలికి ఆమెచేత ననుజ్ఞాతుడై వాని ప్రవేశంబునకు గావలసిన యత్నంబు చేసి గృహంబునకు జనియె.

అట్లు దండపాణి గుడారము విడిచి చనునప్పటికి జాము రాత్రి మాత్రమే యుండుటచే జిత్రభాను డటమీద నిద్రపోక మిగిలిన

కాలము రుద్రభట్టుతో ప్రసంగించుచు గడపెను. అంతలో దెల్లవారుటయు నా రాజకుమారుడు సమయకృత్యములు నిర్వర్తించి స్నానము జేసి సంధ్యావందనము గావించి పార్థివలింగపూజ యొనర్చి రుద్రభట్టు పాదములకు నమస్కరించి దీవనలు వడసి పయన మయ్యెను. అంతలో నిగమశర్మ కోటనుండి యొక్క రథము దోలించుకొని, చిత్రభానుని నెలవునకుం జని యద్యాగరద సమధిష్ఠించి రాజమందిరమునకు రానోపునని యా రాజకుమారుని బ్రార్థించెను. చిత్రభానుడు వల్లెయని తేరునెక్కి నిగమశర్మ సమేతుడై పురము ప్రవేశించెను. ప్రవేశించుటయు పురజనంబులు వానింజూచి విస్మితులై వానిరాక యశుభసూచకమని భావించిరి. పురాంగనలు కొందరు రథముమీద బోవు వాని నామధేయములు పురుషుల నడిగి తెలిసికొని యసంతుష్టలై— "యమ్మక్కా! యిది యేమమ్మా! రాజకుటుంబము నిప్పు లొడిలో గట్టుకొన్నట్టు మరల నీరాజహంతకుని దెచ్చిపెట్టుకొనియె. వాని మొగములో నున్న క్రూరభావమును వెలిబుచ్చుచున్నదై భయంకరముగ నున్నది. వానికన్నులు వానిమనోమాలిన్యమును దెలుపుచున్నట్లున్నయవి. కటకటా! రాజకుమారు లేమి కానున్నవారో కదా!" యని తమలో దాము చెప్పుకొనసాగిరి. అంతలో గొంతసేపటికి రథము కోట సమీపమునకు బోవుటయు నిగమశర్మయు జిత్రభానుడు క్రిందికి దిగి సింహద్వారమువైపు నడచిరి. రథావతరణంబు జేసిన ఆ రాజకుమారుని గని యదివరకే వానినిమిత్త మక్కడ నరవిందాదేవి శాసనంబున వేచియున్న మాధవసేనుడు, దండపాణి, వజ్రపాణి వాని కెదురుగా వచ్చి సమ్మానించిరి, "చిత్రభానునకు స్వాగతము"నని మాధవసేనుడు పలికెను. "యువరాజున కనంతాభ్యుదయంబులు కలుగుగాక!" యని దండపాణి వచియించె, "మీయాగమనము శుభారంభము గాక!" అని వజ్రపాణి నుడివెను. అనవుడు—"లోకైకపూజ్యయగు మావదినె మేలుతలంపులచేత నాకు మరల మిమ్మందర సందర్శించు మహాభాగ్యము బ్బెన"ని చిత్రభానుడు పలికి వారి ముందు నడువ సింహద్వారమును దాటి లోనికిం

జనియె. చని కొన్ని యడుగులు నడచి తన నడుచుదారి కిరుకెలంకుల బారజూచి పూర్వస్మృతిగలిగి మాధవసేనునిడాసి జాలిగదుర నిట్లనియె-
"అయ్యా! ఈకోటం జొరకమునుపు నేనెపుడు కోటలో రెక్కలు గట్టుకొని వ్రాలుదునా యని యువ్విళ్లూరుచుంటిగాని ప్రవేశించినది మొదలు నాకడుగైన సాగుటలేదు. ఏమి చెప్పుదు నాయవస్థ! కోట గుమ్మము దాటుటతోడనే నామనస్సునకు మాయన్న హేమచంద్ర మహారాజుమాట జ్ఞప్తికివచ్చెను. ఈమొగసాలలు, నీలాయములు, నీయేనుంగులు, నీసైనికనివేశములు, నీపసులకొట్టములు మొదలగు సమస్త ప్రదేశములు మాయన్ననే తలపునకు దెచ్చుచున్నవి. చేరలం గొలువదగిన వెడదకన్నులతోడను, నిరంతరమగు చిరునవ్వుతోడను, విశాలములగు ఫాలములతోడను, నేనుగుదంతపుం బలకలవంటి చెక్కులతోడను త్రిలోకసుందరమగు నాతని ముఖమండలము, పోత బోసిన బంగారు విగ్రహమువంటి వానియాకారము నాకిప్పుడు కన్నుల గట్టినట్లగపడుచున్నది. ఇవి చూచినప్పుడే నామనస్సింత దుఃఖానలం బున మరుగుచుండ నాఅన్నబిడ్డలను, వదినెను జూచినప్పుడు దుఃఖ మును నేనెట్లు భరింపజాలుదునో తెలియకున్నాడ!"

అని రెండు నేత్రములనుండి జారిన బాష్పబిందువులను తన ఉత్తరీయాంచలమున దుడుచుకొని మాధవసేనునిమీద జేయివైచి మెల్లగ నడచుచుండె. మాధవసేనుడు వాని దుఃఖమునుజూచి యది నిజమైన మనఃపరితాపమని నమ్మక తనలో—"నీవెంతకైన సాహసు డవురా! చేతులార నతిఘోరములు చేయుటకు గల్లబొల్లి యేడ్పు లేడ్చుటకు నీవే తగుదువ"ని యనుకొని ప్రకాశముగా-"మృతినొందిన వానికొరకు విచారించుట పగిలిపోయినకుండకొరకు వగచుట, కావున నూరకుండుమ" ని సమాశ్వాసించెను. "సోదర స్నేహ మెంతకు జాలద" ని దండపాణి పలికెను. "దుఃఖతుని మనస్సు దుఃఖతుడే యెఱుంగును. కాని పైవారి కెఱుంగ నలవి కాదుగదా!" యని వజ్రపాణి యూరడించెను. అట్లు సంభాషించుచు మెల్లమెల్లన నడచి యనేక

కవాటంబులుదాటి వారు కొలువు కూటమును జేరిరి. నిగమశర్మ రథము దిగినతోడనే చిత్రభానునిబాసి యంతఃపురమున కరిగి మరది వచ్చినవార్త నామె కెరిగించి విక్రమసేన హర్షవర్ధనులను వెంట బెట్టుకొని యదివరకే కొలువుకూటమునకు వచ్చియుండెను.

కొలువుకూటంబు జూచినతోడనే చిత్రభానుని దుఃఖవార్ధి మరియాద నతిక్రమించి పొంగిపొరల నతడు మాధవసేనునితో నిత్తెరంగున జెప్పుకొని విలపించె—"అయ్యో! నేనెంతో మందభాగ్యుడను. మున్ను మాయన్న విదేశమునుండి వచ్చిన రాయబారులు, బ్రహ్మసమానులగు వేదవేత్తలు, శేషుని ధిక్కరించు పండితులు, తనయాస్థాన కవీంద్రులు, మంత్రులు, సామంతులు, మిత్రులు, బంధుజనులు పరివేష్టించియుండ బేరోలగంబుండగా జూచిన యాకన్నులతోడనే ఈశూన్యసభాభవనంబు జూడవలసె. ఈకొలువుకూటంబుకాదె శారదాదేవికి రంగస్థలంబు. ఈసభామంటపముకాదె చతుష్షష్టి విద్యారత్నములకునికని, ఈసభామంటపముకాదె కవిజనంబుల మనోరథములు పంట పండు శాలిక్షేత్రము. అయ్యో! ఇది యెంతచిన్నవోయె, ఎంత శోభావిహీనమయ్యె"నని దుఃఖాతిశయముచే నడువజాలక యొక్కచో జదికిలబడి యొక స్తంభమునకు జేరబడి కూర్చుండి విలపింపజొచ్చె. దండపాణియు వజ్రపాణియు వాని కిరుగెలంకుల గూర్చుండి యతడు నేలబడకుండ సంరక్షింపజొచ్చిరి, మాధవసేనుడు వానిని విశేషముగా నూరడింపక—"విషాదము గతజల సేతుబంధనముగదా!" యని యొకటి రెండుసారు లనియె. అంతలో నిగమశర్మ రాజకుమారుల నిరువురం దోడ్కొనివచ్చి—"యయ్యా! వీరె నీయన్న కుమారులు విక్రమసేన హర్షవర్ధనుల"ని వారిం జూపించెను. నిగమశర్మ యట్లనిన తోడనే బాలకులిరువురు పినతండ్రి పాదములకు నమస్కరించి నిలువంబడిరి, చిత్రభానుడు వారి ప్రణామములకు బ్రత్యుత్తరములుగ దీవన

లేమియు నొసగక యె—"నాతండ్రులారా! రండు రండ" ని తన రెండు చేతులతో వారి జెరియొక హస్తమునం బట్టుకొని చెరియొక తొడపై గూర్చుండ బెట్టుకొని దుఃఖపూరితమనస్కుఁడై యేమియుం బలుకనోపక మొగమున గుడ్డవేసికొని కొండొకసేపు బిట్టుగ దుఃఖించెను. అదివరకు తమ తండ్రిమాట క్రమక్రమంబుగ మరచుచుండిన యా బాలకులు పినతండ్రి దుఃఖముచేత బితృవియోగము జ్ఞప్తికిం దెచ్చుకొని వలవల యేడ్చిరి. అంతట మాధవసేనుడు నిగమశర్మ వారిం డాసి యిద్దరు జెరియొకరిమీద జేతులువేసి వగవవలదని కొన్నిమాటల జెప్పి యూరడించిరి. చిత్రభాను డంతలో దండపాణి వజ్రపాణుల సమాశ్వాస వచనములం దేరి యించుక ధైర్యము దెచ్చుకొని బిడ్డలం గౌగిలించుకొని యిట్లు విచారించెను—"నాచిన్ని యన్నలారా! మీ రెంత మందభాగ్యు లయిరో నేను నంతియు మందభాగ్యుడను. తండ్రిలేక మీరు తండ్రివంటి యగ్రసోదరును లేక నేను, యావజ్జీవము విలపించునట్లు బ్రహ్మ మన లలాటమున వ్రాసియుండె. అంతటి సోదరుండు నావంటి మందభాగ్యునకు దక్కునా? నాదుఃఖము పరమాత్మ డెరుగును. నే నెరుంగుదును సన్న్యాసినై ప్రమాదవశమున మనపురము వెడల వడచినను నాకు విషాదము లేదు. ఏలయన నే నెక్కడ నున్నను నాకు గొడుగులాగున నాయన్న యుండెగదా యని ధైర్యముతో బ్రదుకుచుంటి. ఇంక నాకు దిక్కెవ్వరు? నన్ను మాయన్న యువ్వాలకుం దోలెనని నాకు గోపము లేదు; తండ్రివెనుక తండ్రియంతవాడు; నన్ను దండించుటకు గారవించుటకు నతనికి స్వాతంత్ర్యము గలదు. బిడ్డలారా! మీవంటి కుమారరత్నముల జూచి యానందించు భాగ్యమాతనికి లేదు. నాకు సోదరుడనియే కాదు నే విచారించుచుండుట; లోకములో నంతటి గుణవంతుడు లేడు. అంతటి దయావంతుడు లేడు. అంతటి సత్యవంతుడు లేడు. మాయన్నను దారుణ మరణంబు నొందించిన దురాత్ము లెవ్వరో నే నెరుంగుదును. వారలందరు తత్ఫల

# ముప్పది నాలుగవ ప్రకరణము

చిత్రభానుడు కోటవిడిచి పోయినతోడనే మాధవసేనుడు ప్రధానమంత్రియగు మణివర్మకు యువరాజు సందర్శనమును గూర్చి తెలియజేయుటకు వానిగృహమునకు బోయెను. మణివర్మ వానిని సత్కరించి యువరాజు రథముదిగి కోటలో ప్రవేశించినది మొదలు కోట విడుచువరకు జరిగిన వృత్తాంతమంతయు బూసగ్రుచ్చినట్లు చెప్పుమని మాధవసేను నడిగెను. మాధవసేనుడు తుచ తప్పకుండ నావృత్తాంతము సవిస్తరముగ నెరిగించి పిదప నిట్లనియె—"ఇందు ముఖ్యముగా మన మాలోచింపవలసిన యంశములు మూడు నాల్గున్నవి. తన యన్న నెవరో చంపిరట, ఆ దురాత్ములు తత్ఫలము చిరకాలమున ననుభవింతురట. తన యాలుబిడ్డలు దేవిం జూడ వత్తురట, వారు వచ్చువరకు దానిక్కడ నుండునట. అన్న బిడ్డలమీద దనకుం బ్రేమ పొమ్మన్నంబోదట సోదర మరణవార్త చెవిసోకుటాదిగా బాలకు లెట్లు బ్రదుకుదురో యని తనకు మిక్కుటంబగు మనఃపరితాపము కలిగెనట, పూర్వోత్తర సందర్భములంబట్టి ఈ మాటలరసిచూడ నీతని కేదో దుష్టసంకల్ప మున్నట్లు తోచుచున్నది. మిత్రమా! నీవు చూడలేదు, కాని వాని కల్లబొల్లి దుఃఖాలు వారి దుర్వినయములు వాని తియ్యని మాటలు విన్నవారు వాడు నిర్దోషియని తలంపకపోరు. నాటకమందు వేసగాడు తన పాత్రమును జక్కగా బ్రయోగించుట కభినయించినట్లే యీ కుటిలుడు కూడ నెంతో నటన చేసెను. దీని కిప్పుడు ప్రతిక్రియ యేమి?" యని పలుకుటయు మణివర్మ యాతని మాట లాలకించి—"దేవి యాతని మాటల కేమి ప్రత్యుత్తర మిచ్చినద"ని యడిగెను. "వంచినతల యెత్తక దేవి కన్నీరు విడచెనేకాని మారదిం బలుకరించలేదు. వాని పలుకులకు బదులు చెప్పలేదు. వానినుండుమనలేదు, వెళ్ళుమనలేదు,

ఉండగలిగినంతనే పచ్చట నతనుండి మరల వచ్చునట్లు చెప్పిపోయె" నని మాధవసేనుడు ప్రత్యుత్తర మిచ్చెను.

అది విని మణివర్మ తలయెత్తి మీదికిం జూచి యించుక యోచించి—"మిత్రుడా! మగనిజంపి మొగసాలకుబోయి మొరలెత్తిన దన్నమాట నేటికి నిజమగును, భాతృద్రోహియైన ఈదురాత్ముడు తన యన్నమరణ మితరుల కెవ్వరికో యారోపింప దలచుచున్నాడని నేనూహించెద. ఆలుబిడ్డల నిచ్చటికి బిలిపింప దలంచుట నీయూర నతడు నివాసము చేయుదలచుటయే. ఇది యాతని భవిష్యచ్చరిత్రమున కుపోద్ఘాతము, బిడ్డలయెడ ననురాగము జూపుటయు, వారినేనుముగోరి నట్లభినయించుటయు, మనపై నాతడు స్వకపోలకల్పితముగా రచియింప బూనిన నిందానాటకమునకు ప్రస్తావన. మన మేమియును నాతని విచారము లేదు. కాని వీడు తన కటిలో పాయములను వలలో దగిలించి దేవిని రాజపుత్రులను నేమిసేయునోయని విచారించుచున్నవాడ. రాజు యుక్తవయస్కుడు. కాని బాలుడగుటచేతను, సంరక్షణ చేయునది కౌటిల్యమెరుగని శుద్ధ స్ఫటికమువంటి యాడుదగుటచేతను ప్రతిక్రియ తగినట్లు చేయు వీలు లేదు. ఇది యిట్టిదని చెప్పుట తప్పు; చెప్పకుండుట ముప్పు. ఏమైనంగానిమ్ము. కార్యభారము మన తలపై నున్నది. కావున మనము హితోపదేశము జేయకపోవుట తప్పు. ఈవరకే చెప్పవలసినదంతయు మన మామెతో జెప్పినారము. చర్వణమైననుసరే నీవుపోయి దేవింగాంచి మరదిని శ్రీనగరమునుండి సాగద్రోలుటకు మన కనుమతి నిమ్మని వేడుము. చిత్రభానుడు ప్రబలశత్రుడై చేయుదలచిన ఘాతలు సంపూర్ణముగ బాలు ద్రాగింప జాలము. కాని వేనకొని విసము ద్రావింప వచ్చునను సామెత సార్థకమగుననుము. తనయాజ్ఞ యగునేని కార్యము మించకుండ వానిని సాగదోలగలమనుము. దూర మాలోచింపుమనుము. పై మెరుంగులచేత మోసపోవలదనుము, కుమారుల నేనము జూచుకొమ్మనుము. మిత్రు

లెవ్వరో శత్రులెవ్వరో చక్కగా నరయుటకు సమయమిదే యనుచును, సత్వరంబ చనుము"ని పలికి పీఠమునుండి తాను లేచి తత్క్షణము మాధవసేనుని రాజమందిరమునకు బంపెను. అట్లు మాధవసేనునిం బంపి యప్పటికిని మనస్థిమితము లేక మానవర్గ తన సేవకులకు దేవి యేమనునో యనియు కార్యసరణి క్షత్రియుల చులకన పడకపోవునేమో యనియు నుండుటచే నెటువోయిన నెటు వచ్చునో యనియు జింతించుచు నిట్టటు దిరుగుచు వేగముగ నడచుచున్నాడో లేదో మాధవసేనుని పోయిన దారిం జూచుచు మిక్కిలి కళవళము పడుచుండెను.

చిత్రభానుడు కోట విడిచి యరుగ దొక్కి తన నెంతయు సంతోషమున వికసించిన ముఖపద్మముతో, సంతుష్టుడై హృదయముతో గుడారము ప్రవేశించెను, రుద్రభట్టు వాని యాగమనము నిరీక్షించుచు, నతనిం జూచినతోడనే—"మిత్రుడా! ప్రథమదర్శనము సుముఖముగా బరిణమించెనా? విశేషము లెవ్వియును లేవుగదా! విలాసవంతమైన నీముఖవైఖరియే కార్యపద్ధతి సుఖప్రాయమై యున్నది సుమ్మా!" యని యెదురుగావచ్చి బహూకరించెను. హితాభిలాషియైన యా బ్రాహ్మణుని పలుకులువిని చిత్రభానుడు—"దేవా! మీయాశీర్వచనమున ప్రథమ సందర్శనము శుభోత్కరముగా నున్నది. మనము తలపెట్టిన కార్యమింక నిర్విఘ్నముగ సాగునని శుభసూచనలు పొడగట్టుచున్నవి" అని పలికి తాను గుడారము విడిచి మరల జొచ్చువరకు జరిగిన యావద్వృత్తాంతము వానికెరిగించెను. ఆ వృత్తాంతము విని రుద్రభట్టు మిక్కిలి సంతసించి చిత్రభానుని బహూకరించి—"మిత్రమా! మనము తరచుగా దండపాణిం గలిసికొనుచుండవలయును. కలిగిన గార్యసిద్ధి వానివలననే కలుగవలయును" అని యుపదేశించిన—"నిజము నిజము మీరు లెస్సగా బలికినారు. అతడు తలంచిన నెంత పనియైన నగున"ని చిత్రభానుడు చెప్పి పిదప భోజన ప్రయత్నము చేసెను.

మణివర్మ మితిమీరిన యుత్తలపాటుతో దన మేడమీద బిచ్చివానివలె తిరుగుచు నాంటిమాటికి మాధవసేనుడు వచ్చుచుండెనేమో యని వీధివంక జూచుచు గొంతసేపు గడపునప్పటికి మాధవసేనుడు రెండు మూడు గాసు లొట్టుకొని దిరుగుటచేత గడు డస్సిన మేనుతో నుస్సురస్సురని యాయాసపడుచువచ్చి మేడయెక్కి మణివర్మను సమీపించెను. మణివర్మ మిక్కిలి యుత్సుకముతో— "దేవి యేమన్నది? దేవి యేమనె" నని యడిగెను. మాధవసేనుడు విక్కమొగముపెట్టి—"మిత్రమా! నరకకృత్యులగు సంభాషణలు చెప్పక సారాంశము జెప్పెద వినుము. దేవి యాడికోడలిని గర్పూర మంజరిని జూచి సుబలాటము పడుచున్నది. అంతవరకు మరది యిచ్చటనే యుండువాడట! అనంతరము వానిని వెడలగొట్టుటకు మనకు సర్వాధికారమిచ్చునట. ఇదియే జరిగిన కార్యనిశ్చయము" ని యెరిగించెను. అప్పలుకులువిని మణివర్మ కార్యసరణి చక్కజేయు నాశలన్నియు నడుగంటినవని దేనిమాధత్వమునకు వగచి మాడ దలంచిన యాపదలం దలంచి భయపడి యిట్లనియె—"వినాశకాలే విపరీతబుద్ధిః' యను వాక్యం, 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' అను లోకోక్తి నేడు సార్థకములైనవి. మనము దైవముమీద భారమువైచి యూరకుండవలసినదే!"

మొదటి భాగము సమాప్తము.



రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.

# వివిధ గ్రంథాలు

**గాంధీజీ అడుగు జాడల్లో** రచన : డాక్టర్ జార్జికాట్లిన్

ప్రపంచ గాంధేయ సాహిత్యంలో మహనీయ గ్రంథం! విఖ్యాత పాశ్చాత్య రచయిత సత్యాహింసలనే గాంధేయ సిద్ధాంత ఉత్కృష్ట తను సూటిగా స్పష్టంగా శాస్త్రీయ దృక్పథంతో వివరింపబడిన ఆంగ్ల గ్రంథానికి లక్ష్మణస్వామి సరళమైన తెలుగు అనువాదం. క్రౌను సైజు. 17 చిత్రాలు. ద్వివర్ణ అట్టబోర్డు జాకెట్. వెల 10-0

**భారత అర్థశాస్త్రం** రచన : డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి

తెలుగులో మొట్టమొదటిసారిగా వెలువడిన అర్థశాస్త్ర [Political Economy] గ్రంథం. ప్రతి ఒక్కరు పఠింపతగిన శాస్త్రీయ గ్రంథం. డెమ్మీసైజు. ద్వివర్ణ జాకెట్ ఫుల్ క్యాలికో బైండు. వెల 10-0

**హిందూయుగం** రచన : తిరువళ్లుల కృత్తివాసతీర్థులు ఎం. ఏ.
(భారత రాజకీయ సంస్కృతిక చరిత్ర)

క్రీస్తుపూర్వం 3-5 వేల సంవత్సరాలకన్న పూర్వంనించి క్రీస్తు 11 వ శతాబ్దందాకా అవిచ్ఛిన్నంగా ప్రవహించుకొచ్చిన భారత రాజకీయ సాంస్కృతిక చరిత్ర సంగ్రహం. అత్యాధునిక పరిశోధనల ఆధారంగా రచన కావించబడి వెలువరించిన చారిత్రక గ్రంథం. క్రౌన్ గ్లేజు కాగితం. ద్వివర్ణ జాకెట్ ఫుల్ క్యాలికో బైండు. వెల 7-8

**బౌద్ధయుగం** రచన : రత్నాకర బాలరాజు ఎం. ఏ.
(భారత రాజకీయ సంస్కృతిక చరిత్ర)

బౌద్ధోదయం, పరిణామం, అభివృద్ధి పతనం, నాటి భారత రాజకీయ సంస్కృతిక చరిత్ర, దేశ విదేశాల్లో బౌద్ధ ప్రభావ పరిణామ చరిత్ర చక్కగా అనేక నవీన చారిత్రక శోధనలను అవరోధనచేసి రచన కావించబడిన మహత్తర గ్రంథం. క్రౌన్ సైజు ద్వివర్ణ జాకెట్. ఫుల్ క్యాలికో బైండు. 1, 2 భాగాలు వెల 12-0

**భగవద్గీత-బైబిలు-ఖొరాన్** రచన : విన్నకోట వేంకటరత్నశర్మ

ఆంధ్రావనంతా అఖండంగా కీర్తించబడిన మహత్తర మతత్రయ గ్రంథం. క్రౌన్ 915 పుటలు. ద్వివర్ణ జాకెట్ ఫుల్ క్యాలికో బైండు. అందమైన ఐదవ ముద్రణ. వెల 12-8

# వచన పురాణములు

**శ్రీమదాంధ్ర రామాయణం** రచన : మోచేకుర్తి గున్నయ్య బి. ఏ.

మహర్షి వాల్మీకి విరచిత సంస్కృత రామాయణం తెలుగులో స్త్రీలూ, పురుషులూ, పండితులూ, పామరులూ చివరకి పిల్లలు సహితం చదివి అర్థంచేసుకొనే సులభశైలిలో అత్యంత ఆధునిక పద్ధతిలో రచన కావించబడిన సంపూర్ణ గ్రంథం. డెమ్మీ సైజు. ద్వివర్ణ అట్టుబోర్డు జాకెట్. 1200 పుటలు. గ్లేజు పేపరు. వెల **15-0**

**విష్ణు పురాణము** రచన : నల్లాన్ చక్రవర్తుల

అష్టాదశ పురాణాల్లో ఒకటైన ఈమహాపురాణం చక్కని తెలుగులో వెలువడింది. క్రౌన్ సైజు. క్యాలికో జాకెట్ బైండు. వెల **5-0**

**మార్కండేయ పురాణము** రచన: పోలేటి వెంకటలక్ష్మీనర్సింహశర్మ

తెలుగులో వెలువడిన మార్కండేయ పురాణం. క్రౌను సైజు. ఆఫ్ క్యాలికో జాకెట్ బైండు. వెల **3-0**

**అష్టాదశ పురాణములు** రచన : పోలేటి వెంకటలక్ష్మీనర్సింహశర్మ

పద్దెనిమిది మహా పురాణాల సంక్షిప్త రచన. మహా పురాణాల పరిచయం కోరువారు తప్పక చదువవలసిన చక్కని తెలుగు వచన గ్రంథం. క్రౌన్ సైజు. ఫుల్ క్యాలికో జాకెట్ బైండు. వెల **8-0**

**బసవ పురాణము** రచన : పూడిపెద్ది లింగమూర్తి పంతులు

బసవేశ్వరుడు, అతని సమకాలికుల చిత్ర విచిత్ర చరిత్రలు, అతని కాలంలో వీరశైవం జాతైె, తరంగాల్ల పారవారమెలాగైందో ఇందులో విరచితమైనది. డెమ్మీసైజు. ఆఫ్ క్యాలికో జాకెట్ బైండు. వెల **4-0**

# కర్పూరమంజరి

## మొదటి ప్రకరణము

"సఖీ! కర్పూరమంజరీ! మహారణ్యమతిక్రమించి బయలుగా నున్న భూమికి మనము వచ్చుటచే సంధ్యాసౌందర్యము జూడగలిగితిమి. చూడు! చూడు! దాని రమణీయకము వర్ణనాతీతమైయున్నది. తన ప్రభావముచే బగలు గలిగించి యసాధారణ తేజంబున జగమెల్ల నాక్రమించి భువనంబులు సంతాపింపజేసి యెట్టకేలకు గాలవశమున నిజతేజము గోల్పడి పగతురచే బరాజితుడై కాయమునుండి క్రొన్నెత్తురులు దొరగ నస్తమించు మహావీరుడుంబోలె భాస్కరుడు పడమటికొండలో గ్రుంకుచున్నాడు. ఎంతలెంతలకైన నీయవస్థ తప్పదుకదా!" అని మల్లిక పలుకుటయు కర్పూరమంజరి యిట్లనియె- "మల్లికా! ఈ సూర్యాస్తమయ సమయము నాకు మరియొకలాగు దోచుచున్నది చూడు! పరమేశ్వర నిర్మితమైన జగన్నాటకమునకీ సంధ్యాసమయము ప్రస్తావనవలె గనబడుచున్నది. కాలపురుషుండను సూత్రధారుడు బిలువ రాగమనియెడు కుసుంభారుణచేలముగట్టి క[illegible]యైన భానుబింబంబను కాశ్మీర తిలకంబువెట్టి సంధ్యయను నటి ప్రవేశించి రాగల నిశానాటకమును సాగించుచున్నది. పులుగులు మొఱుంగు నటిసేయు గానమువలె వినబడుచున్నది. అదే ప్రభాకరుడస్తమించినాడు. ఇక నిశానాటక ప్రథమ రంగమును మనము దర్శింపగలము. అల్లదె! కథానాయకుడైన రాజు చంద్రు డుదయించుచున్నాడు. చూడు! ఆకాశంబను ఇంద్ర నీల మణి మయంబయిన

గద్దియ నాడెక్కినాడు. నిగనిగలాడు నాగద్దియపై నెక్కిన వజ్రంబులట్లు లెక్కకుమీరిన చుక్కలు మెరయుచున్నవి. ఈతడు చల్లని రాజయ్యు మహాతేజశ్శాలియై సహజశత్రువైన యంధకారమును బటాపంచలుగ దోలియున్నాడు" అని కర్పూరమంజరి ప్రత్యుత్తరమీయ మల్లిక—"సఖీ! నీయూహ సరసముగా నున్నది. కాని యిది విను. ఈ నిశా సౌందర్యము నాకు మరియొకలాగు కనబడుచున్నది. గగన లక్ష్మి షోడశ కళాపరిపూర్ణమైన చంద్రమండలము నెమ్మొగముగా నందలి కళంకము కస్తూరి తిలకంబుగా నీలనీలంబగు నాకసంబు కొప్పుగా జుక్కలు కొప్పునం దురిమిన మల్లెపూవులుగా నలుగడల నలముకొను తేటవెన్నెలలు నవ్వులుగా హొయలుగులుకు జగన్మోహనంబగు నాకృతిదాల్చి ఈ సమయమున విశ్వమెట్లున్నదో చూచుటకు బయలు వెడలినది. చెలీ! యీ నభోలక్ష్మి యెల్ల తెరంగుల నిన్నుబోలి యున్నయది" యని పలికెను.

"సఖీ! నీకు నాపై గల ప్రేమచే నన్ను గగనలక్ష్మితో బోల్చుచుంటివి గాని ప్రకృతి సౌందర్యమునకు నావంటిదాని సాటియగ మీదగునే! దాని కడసాటి. చిత్రకారుడు బుద్ధికుశలతచేతను, హస్తనైపుణిచేతను వృక్షమునో పూవునో పండునో యొక ఫలకముమీద జిత్రించుగాక! ఆ యాచోటుల కనువుగా రంగులు పులుముగాక! ఎన్ని యందముల దేవలయునో యన్ని యందముల దెచ్చుగాక! ఎట్లయిన దేవదేవ నిర్మితమయిన వృక్షమట్లు ఫలమట్లు పువ్వట్లు చిత్తరువుండునా!"

అని వారిరువురు ప్రకృతి సౌందర్యమును జూచి మెచ్చి యానందము నొందుచుండ నంతలో జంద్రిక వచ్చి—"అమ్మా! గడియ రాత్రియైనది. అమ్మగారు గుడారములోనికి రమ్మనుచున్నారు. రండు పోదము" అని పిలిచెను. పిలుచుటయు వారిరువురు—"నిదే వచ్చుచున్నారమ"ని గుడారములవంక కరిగిరి.

జయంతుడు వెంటవచ్చిన పరివారమునకు బసల నిమిత్తము భోజనముల నిమిత్తము దగిన యేర్పాటుల గావించెను. చెట్లక్రింద

గుడారములం గట్టిరి. రాజకుటుంబము దట్టమైన గుడారములలో విశ్రమించెను. ఇందుమణియు, కర్పూరమంజరియు, విజయసేనుడును బెందలకడ భోజనము చేసిరి. అనంతరము జయంతుడు మొదలగు ప్రధానపురుషు లారగించిరి. పగలెల్ల పయనము సేయుటచే బడలికల పెంపున గుఱ్ఱపురౌతులు బదాతులు భోజనములు సత్వరము ముగించి చెట్లనీడల చాపలు, కంబళ్ళు బరచుకొని నిమేషమాత్రమున కనులు మూసికొని నిద్రించిరి. ప్రయాణములలో సైతము రాజకుటుంబములకు సకల సౌకర్యములు జరుగవలసి యుండెను. గనుక మంచములు, పానుపులు, పల్లకులు, దీపస్తంభములు, రత్నకంబళములు, బహువిధ ఫలములు, నానావిధ భోజన పదార్థములు వారివెంట నుండునట్లు రాజవాహను డేర్పాటుచేసెను. పరిచారికలు పానుపులు పరుప నిందుమణియు విజయసేనుడును బవ్వళించి నిద్రించిరి.

పండువెన్నెలలు గాయుచుండెను. మలయమారుత తరంగములు యథేచ్ఛముగ శరీరములసోకి హాయి యనిపించెను. కొన్ని పులుగుల మెలుగులు వీనులకు విందగు గానమువలె మనమున కానందము గూర్చెను. నేలయంతయు తెల్లదుప్పటి పరచినట్లు గానబడెను. వెండిపూత పూసినట్లు, కప్పురపుంబొడి చల్లినట్లు, పాలగచ్చు చేసినట్లు గానబడెను. ఆ సమయమున కర్పూరమంజరి నాడు మకరందుడు తన రుగ్మతలో దనకు గావించిన భేషజరూపక మహోపకారము దలచి యాతని యాకారమును స్మరించి యాతని మృదుమధుర సంభాషణలను మందహాసములను సుందర విలాసములను జ్ఞప్తికిం దెచ్చుకొని వెండియు నతనితోడి కూటమి సంప్రాప్తించు పుణ్యకాలము గలుగునా యని తలపోయుచు నిద్రవోవక యుండెను. మల్లికయు రెండుమూడుసారు లామెను బలుకరించి ప్రత్యుత్తరము గానక—"ఏమమ్మా! నామాటలు వినబడుటలేదా? నీమనంబు మకరందరసము నాస్వాదించిన తుమ్మెదవలె మత్తిల్లి యున్నది కాబోలు! నీచెవిలో మకరంద బిందువు లడ్డుపడెనేమో? కానిచో నాపిలుపులేల

వినబడవు!" అని చిరునవ్వు మొలకెత్తిన మోముతో నర్మగర్భముగా పలికెను. అప్పలుకులు విని—"మూర్ఖురాలా! చమత్కారముగా మాటాడగలనని గర్వించి నీ యిచ్చవచ్చినట్లు నన్ను దెప్పుచున్నావు. చాలు చాలు! నోరు మూసికొని యుండుము" అని కర్పూరమంజరి మందలించు నంతలో—"సందెకబళి మమ్మా! సందెకబళము. పట్టెడన్నము పెట్టుడమ్మా! పెట్టుడు" అని యొక కేక వినబడెను. గుడారములచుట్టు గావలి గాచుచున్న యామికులు కేకవైచిన యా పడుచుకను లోపలికి బోనీయక నిరోధించిరి. అది యొక్కపెట్టున మొర వెట్టజొచ్చెను. కర్పూరమంజరి దాని కుయ్యాలించి మల్లికం బిలిచి—"దాని మొర యేమో తెలిసికొని నాకడకు దోడుకొని రమ్మ"ని పంచెను. మల్లికయు గుడారముదాటి యావలకుబోయి కావలివాండ్రకు కర్పూరమంజరి యాన దెలిపి యా నెలంతను లోపలికిం దోడ్కొనివచ్చెను. మెడనిండ గురివెందపూసల సరములు, చేతుల గవ్వలగుత్తుల కంకణములు గలిగి కడు మాసిన ప్రాతబట్టగట్టి, చేత నొక కుండదాల్చి కట్టెదుట నిల్చెను. ఆ యంగనం జూచి కర్పూరమంజరి—"నీకేమి కావలయు? నీ వెవ్వతెవు?" అని యడిగెను. అప్పడంతుక రాజపుత్రికం జూచి కుండ క్రిందబెట్టి దండము బెట్టి—"తల్లీ! నే నెఱుకలదానను. ఈ సమీపముననే మా పల్లియ కలదు. మా కన్నవస్త్రములు లేవు. మిక్కిలి పేదవాండ్రము. ఈ దారినిబోవు బాటసారులం జేరి కూడుగుడ్డ నడుగుకొని తెచ్చుకొనుచుందుము. ఇంటికడ నా బిడ్డ లన్నములేక మాడుచున్నారు. గొప్ప దొరలు గుడారములు వైచికొని దిగినారుగదా, పట్టెడన్నము దొరుకకపోవునా, యని యాసపడి వచ్చితిని. నే నెఱుక జెప్పగలను. కావలయునేని మీకుగూడ జెప్పగలను" అని విన్నవించెను. దాని దీనాలాపముల నాలించి కర్పూరమంజరి జాలినొంది—"దాని కేమైనా నాహారమిడు" మని మల్లికతో జెప్పెను. "అమ్మా! అట్లే చేసెదన"ని చెప్పి మల్లిక చెంచెతం జూచి నవ్వుచు—"నోసీ! యెఱుక జెప్పగలనంటివి,

మా రాజపుత్రికకు నీ జాతకజెప్పుము" ని హెచ్చరించెను. "వలదు వలదు" ని కర్పూరమంజరి పలుకుచున్నను నయ్యెరుకసాని యూరకుండక చేత నొక పుల్లబట్టుకొని క్రింద నేల రెండు మూడు గీట్లు గీచి యాకసమువంక జూచి—"చేయి చాపుము" ని కర్పూరమంజరిని వేడి హస్తపరీక్ష జేసి యిట్లనియె—

"భాగ్యశాలివే తల్లి! అదృష్టం గలదానవే తల్లి! చుట్టాల సురభివే తల్లి! కొడుకుల కోట పట్టుదువే తల్లి! నీమనసులో నున్న రాచబిడ్డడె నిన్ను పెండ్లాడగలడె తల్లి! దాపున నున్నాడె తల్లి! దగ్గర నున్నాడె తల్లి! నీపంట పండునే తల్లి! సిరి నీకన్నల కాపుర మున్నాడె తల్లి! వరాలబొజ్జవే తల్లి! నీదొరను గలసినప్పుడు నన్ను మరచిపోకు తల్లి! ఒక పాతచీర యియ్యవే తల్లి!" అని యెరుక చెప్పుటయు కర్పూరమంజరి ముసిముసినవ్వులు నవ్వి—"దానోటికి వచ్చినట్లు ప్రేలినది. ఈ చెంచుపడతు లందరకు నీవిధముగానే చెప్పుదురు. ఇందు విశేష మేమియు లేదు" అని పలికి దానికిం బిల్లలకు సరిపడిన యాహారముం బెట్టించి గట్టిచీరలు రెండిచ్చి పంపెను.

మల్లికయు దానిని సాగనంపి—"సఖీ! దాపుననే యున్నాడు. దగ్గరనే యున్నాడు అని చెప్పినది. అచిరకాలములోనే నీవు నీప్రియుని గలిసికొందువు గాబోలున" ని పరిహాసించెను. "చాలు చాలు నీమొగతాళి కట్టిపెట్టు. నాకు నిద్ర వచ్చుచున్నది. రా పండుకొందము" ని రాజపుత్రిక మేను సెజ్జం జేర్చెను. మల్లికయు నామె దగ్గరనే తన పానుపుమీద బండుకొనెను. అందరు గుఱ్ఱుపెట్టి నిద్రించిరి. యామికలు మాత్రము మేలుకొని కావలి గాచుచుండిరి. ఎడనెడ బెబ్బులుల యఱపులు సింగపు బొబ్బలు నక్కకూతలు భయంకరములై వినబడుచు రాజపుత్రిక నిద్రకు భంగము గలిగింప— "మకరందుడా! మకరందుడా!! రక్షింపుము! రక్షింపుము!!" అని యొకటి రెండుసారు లామె పలువరించెను.

# రెండవ ప్రకరణము

"చంద్రచూడుడా! నాయనగారి యాజ్ఞాప్రకారము మనము మాళవదేశమంతయు దిరిగితిమిగదా! రాజధానియగు నుజ్జయిని యతి దూరమున నుండుటచే బ్రజ లంతదవ్వు నడచిపోయి తామే చేసికొన వలసిన మనవి సనవుల ప్రభువుతో సరిగా జేసికొనుట కవకాశము గలిగియుండదని పాలితులకు, జనుల సుఖదుఃఖముల నారయుమని మహారాజుగారు మనల బనిచినందులకు బ్రజలు మిక్కిలి సంతోష భరితులైరి. వారు నాకు దెలిపిన యిబ్బందు లన్నియు మహారాజు గారికి విన్నవించి యచిరకాలమున వాని దొలగించుటకు దగిన ప్రయత్నము జేసెద. రాజాజ్ఞ సరిగా నెరవేర్చుటచే నాతలపై భార మిప్పుడు దిగినట్లున్నది. నా హృదయ మిప్పుడు చులకనైనది. కార్య వ్యగ్రత యుడిగినందున నీ వెన్నెలసుఖ మనుభవించుటకు మనస్సుత్సాహించుచున్నది. కాలపురుషుడు బ్రహ్మాండ భవనమునకు వైచిన వెల్ల తెరగున కర్పూర పరాగము చల్లిన భాతిని నెల్లయెడల వసుంధర తెల్లనైయొప్పె. పైతృకంబగు రాజ్యంబు రెండు భాగములు చేసి సమానముగ బంచుకొను నన్నదమ్ములట్లు దివాకర నిశాకరులు క్రమముగా నహర్నిశల బంచుకొని నైజతేజములచే జగముల కుపకారము సేయుచున్నారు. ఈ చల్లదనము నీవుగూడ ననుభవింపుము" అని మాళవేంద్ర నందనుడగు మకరందుడు వేడుక చెలికాడగు చంద్రచూడుని జూచి పలికెను. చంద్రచూడుడు వాని మనోభావ మెరిగి మెల్లగ నిట్లనియె—"మిత్రుడా! నీవంటి మహారాజ కుమారుడు సాంద్రసుధాధవళములగు మేడలనుండు వాడు వనాంతరములకు వచ్చుటంజేసి వనలక్ష్మి గౌరవ పురస్సరముగా నీకు స్వాగత మియ్య దలచి వెన్నెల పేరి సున్నము బ్రహ్మాండమంతయు బూయించినది. కర్పూర పరాగము జల్లినట్లు విశ్వము తెల్లనైయుండుట నిజమే! అంతేకాదు. చెట్లనున్న పూలగుత్తులు పండ్లగుత్తులు వెన్నెలకతమున

డెల్లనై కర్పూరమంజరులట్లు వెలయుచున్నవి" అని నర్మగర్భముగ బలికిన చంద్రచూడునింగని మకరందుడు—"మిత్రుడా! నీమాట నిజము. పుష్పఫలగుచ్ఛము లన్నియు గర్పూరమంజరులట్లే వెలయుచున్నవి. ఈ గగనలక్ష్మియు గర్పూరమంజరివలెనే యున్నది. ఏది చూచిన నాకా పద్మాక్షియే జ్ఞప్తికి వచ్చుచున్నది. అది లావణ్యరాశి. అంగనాకృతి దాల్చిన శృంగార రసాధిదేవత; వడకలు మాటలు నేర్చిన జాళువా పసిడిబొమ్మ పూబోడి యను శబ్ద మన్యకాంతలయందు నిరర్థకమేగాని కర్పూరమంజరియందది సార్థకము, పలుకుపలుకున నది యమృత మొలుకుచుండును. ఆమెనోట విడలునవి మాటలుగావు చెవుల త్రుప్పువదల్లజేయు పాటలుగాని. ఆమె లోచనము పద్మగర్వ నిర్మోచనము, ఎవడైన నొకసారి యామెంజూచిన నేత్రములు చరితార్థము లగును పలుకులువిన్న వీనులు చేసికొన్న పాపంబు దొలంగును. మిత్రుడా! ఆమెంజూచి యెంతకాలమైనది! నాడు విదర్భాపురము బాసినదాదిగా నామనసు మనసులో లేదు, ఆత్మ నిరంతరము విదర్భలో నుండుటచే నాదేహము దీపములేని గాజుకుప్పవలె నజ్జమునిలో నున్నది. మరల కన్నుల కరవుదీర నావెన్నెలదీవిని జూడగల్గుదునే! ఆమె యే రాజనందనుని జెట్టబట్టనున్నదో! ఆమె కరస్పర్శనంబున నే రాజు హస్తము ధన్యతనొందునో! ఓహో! నామాటలు పిచ్చివాని పలుకులట్లు నీవు గ్రహించుచున్నావు కాబోలు! ఆసుందరీ ప్రసంగ మిప్పు డప్రస్తుతమై నీకు విసుగు గలిగింపవచ్చును. కావున విరమించెదనులే" అని పలికి నిట్టూర్పు విడిచి యూరకుండెను.

అప్పుడు చంద్రచూడుడు—"మిత్రుడా! నాకను రెప్పలమీద నిద్రాదేవి రెండుకాళ్ళువైచి నిలిచియున్నట్లవి యెంతో బరువుగానున్నవి. అతిప్రయత్నమునగాని రెప్పలు లేచుటలేదు. నేను నీమాటలు వినుచుండియే నిద్రపోవుచున్నాను. నేను కలగనుచున్నానో నీతో మాటలాడుచున్నానో సరిగా జెప్పజాలను. ప్రపంచమంతయు నీకు

కర్పూరమంజరీమయమై యున్నది. కొంతసేపటివఱకు నన్నుగూడ నీవు కర్పూరమంజరిగా భావించి చిక్కలి గాయమగునట్లు గట్టిగా ముద్దు పెట్టుకొందువేమోయని భయముగా నున్నది. వలపు యెక్కి యెత్తిన వాఁడు కేవలము పిచ్చివాండ్రకు సమానులు" అని చంద్రహాసుఁడు డింక నేమో చెప్పబోవుచుండ నంతలో నొకమూలనుండి—"పొడువుడు. తఱుముఁడు. పట్టుఁడు పట్టుఁడు. అయ్యో! రక్షింపుఁడు. రక్షింపుఁడు!" అను నార్తనాదము వినఁబడెను. అందులో నొకటి రెండు స్త్రీ కంఠములు వినఁబడెను. చంద్రహాసుఁడు ఉలికిపడి లేచినిలిచెను. మకరందుఁడు పీఠమునుండి దిగ్గున లేచి—"మిత్రుఁడా! ఏదో యార్తధ్వని వినఁబడు చున్నది. అందులో స్త్రీస్వరముగూడ వినఁబడుచున్నది. ఏదీ ఖడ్గము! ఖడ్గము! నేనిప్పుడే పోయి యక్కడ నుఱికెద. ఓరీ! ఎవఁడురా యక్కడ? ఖడ్గము దెమ్ము" అని గుడారమువైపున కరిగెను.

చంద్రహాసుఁడు భయమున గడగడ వడఁకి—"మిత్రుఁడా! నా ప్రాణము ప్రాణములో లేదు; నన్నెవరి కప్పగించి పోయెదవు! అయ్యో! పేదవాఁడను, బ్రాహ్మణుఁడను. మాతల్లి కొక్కఁడనే కుమారుఁడను. నా ప్రాణము రక్షింపుము" అని యాతనిని బిగ్గరగా కౌఁగిలించుకొనెను. మకరందుఁడు వాని పిఱికితనమునకు నవ్వుకొని— "వయస్యా! భయములేదు. నీ ప్రాణమునకు నా ప్రాణ మడ్డము వైచెదను. నీ వీ గుడారములో నుండుము. నీకిరువురు సేవకుల నప్పగించెదను. వారు నిన్ను గట్టిగా బట్టుకొందురు" అని చెప్పి ఖడ్గము ధరించి మెఱయులవంటి పోటుబంటుల బదుగుర దనవెంట రమ్మని యార్తధ్వని వచ్చిన వైపునకు విసవిస నడచిపోయెను. విండ్లు నమ్ములు బల్లెములు మొదలగు సాధనంబుల ధరించి దంటలగు బంటులు పదుగురేగాక పెక్కండ్రు రాజకుమారుని వెంటనరిగిరి.

"వెరువకుఁడు! వెరువకుఁడు! ఇదే నేవచ్చుచున్నాఁడన" ని యుచ్చైస్స్వరముతో దెసలు మారుమ్రోగునట్లు కేకలు వేయుచు మకరందుఁడు మిక్కిలి వేగముతో బరుగెత్తి గుడారములకడ కరిగెను.

వీరభటులు యజమానుననుసరించి గమ్యస్థానముఁ జేరిరి. అప్పు డేమి చెప్పను? మొగమున జేగురుబొట్లు, తలలపై నెమలిపింఛియములు గ్రుచ్చిన తీగచుట్టలు, చేత విల్లులు నమ్ములు, భుజములపై తాపులతో వల్లిన యమ్ములపొదులు, మెడలలో గవ్వల సరములు, గురివెంద పేరులు, ముంజేతుల దంతపు నియుకల కంకణములు, నెన్నడుము కత్తిరింపు బడని బారుమీసములు, గడ్డములు, వ్రేలుచున్న కెంజడలు, పుట్ట గోచులు, వెడద రొమ్ములు, చింతనిప్పులట్లు మెరయు కన్నులుగల భిల్లులు దిక్కులు పిక్కటిల్లునట్లరచుచు కర్పూరమంజరి యుండునట్టి యున్న గుడారములో ప్రవేశించి కొల్లపెట్ట జొచ్చిరి. వాండ్రు క్రోల్పులులవలె నాగ్రహమూర్తులై వచ్చి మునుముందు కావలివాండ్రం గడతేర్చి నిద్రించుచున్నవారు నిద్రించుచుండగనే కుత్తుకలు త్రెంచి బరిమార్చి యాకస్మికముగా లేచి చేతికి దొరకిన యాయుధంబులం బట్టి తిమ్మెదిర్చిన జోదుల గాయపరచి కొందరిని జెట్లకు బంధించి యథేచ్ఛముగ ప్రవర్తించుచుండిరి.

జయంతుడు వారిచే బంధింపబడెను. బాలుండైన విజయసేనుడు గాయము దగిలి నేల బడెను, కల్పలతయు చంద్రికయు మల్లికయు— "రక్షింపుడు, రక్షింపుడ" ని యరువజొచ్చిరి. ఇందుమతి దొంగలను జూచి తన మేనినగలు కర్పూరమంజరి యొడలి యలంకారములు ద్రిస్సి యిచ్చి తమ కేవిధమైన కీడు సేయకుండ గావలసినదంతయు దోచు కొనిపొమ్మని యమూల్యాభరణంబులు, చీనిచీనాంబరములు, విలువ గల దువ్వలువలు, శాలువలుగల పెట్టెలం జూపెను. కర్పూరమంజరి మూర్ఛిల్లెను. భిల్లులు కొల్లలు గొట్టుటకు దక్కిన యవకాశము దొరకెనని సంతసించి యాడువాండ్ర జోలికిం బోక తమ వచ్చినపని చేయఁజొచ్చిరి.

అంతలో మకరందుడు సపరివారముగా నప్పటి కరుదెంచి భిల్లులం దాకెను. రాజవాహనుని భటులెవ్వరో దొంగలెవ్వరో తెలిసి కొనుట యటవికుల వేషములం బట్టి యతనికి సులభమయ్యెను.

నిశాచరులట్లు భయంకరకాయులై నిర్భయ విహారము సేయుచున్న నిర్దయాత్ముల కరకుచురకుల కరకుకత్తులతో మకరందుడును సమరకుశలురగు వాతని యనుచరులును వనటిబొందెల నరికినట్లు వేటునకు రెండుతునియలుగా నరుకజొచ్చిరి. దోవ్రదు గొందవలోనున్న భిల్లులు మింటనుండి పిడుగులు పడినట్లు హఠాత్తుగా మహాశూరులువచ్చి తమ్ము దాకుదురని యూహింపలేక చెట్లుకూలినట్లు కూలిరి. కొందరు మకరందుని విక్రమ విహారము నెదుర నిలువలేక చేతనున్న పెట్టెలు మొదలగునవి జారవిడిచి పారిపోయిరి. రాజవాహనుని భటుల కళేబరములతోను, భిల్లుల పీనుంగులతోను నచ్చోటు భయంకరమై యుండెను. ఒక్క ముహూర్తములో దొంగలలో ననేకులు హతులైరి. తక్కినవారు పలాయితులైరి.

## మూడవ ప్రకరణము

ఆపద్బాంధవులయిన మహనీయు లెవరో తమ కుయ్యాలించి వచ్చి సాయముచేసి ముచ్చుల పీచమడచి తమ్ము గాపాడిరని యిందుమణియు మల్లికా చంద్రికలు జరిగిన చిన్ని కయ్యంబువలన గ్రహించిరిగాని వచ్చినవారెవ్వరో వారెరుగరు. దొంగల దాడివలన గలిగిన భయము రవంత శమించుచుండ గాదిలికూతురగు కర్పూరమంజరి మూర్ఛవలన నిందుమణికిని, మల్లికా చంద్రికలకును వెండియు మునుపటికన్న నధికమైన మనోవేదన కలిగెను. యోధుల గంభీర భాషణంబులవలనగాని. మృతినొందువారి యార్తనాదమువలనగాని కర్పూరమంజరికి తెలివిరాలేదు. మల్లికా చంద్రికలు శైత్యోపచారములు చేయుచుండిరి. ఇందుమణి ప్రక్కన కూర్చుండి మీద చేయి వైచి—" బిడ్డా! తాతయు తండ్రియు దగ్గరలేనితరి మహారణ్య మధ్యమున దిక్కుమాలి నీవీలీల నాకు దక్కుదువని నేనెన్నడు దలంప

నైతివమ్మా! అక్కటా! నీదేహస్థితి యెట్లున్నదో తెలియజేయుటకై వైద్యులయిన లేరుగదా! దంటలగు శూరులు హతులైరిగదా! తల్లీ! తెల్లదామరవంటి మొగము నల్లబడినది. ఇక నీబ్రతుకు! ఏటియాశ! మల్లికా! నీప్రాణసఖి చైతన్యము దక్కియున్నది. చంద్రికా! ఇంక నీవెవ్వరితో నర్మోక్తు లాడుదువే!" యని పలువిధముల వగచుచు నొక్కమచ్చున నోడికగట్టుచున్న కన్నీటి సోనలచే నప్రయత్నముగ దుఃఖవర్షము పుత్రికపై గురిపించుచుండెను.

మకరందుడు భిల్లులు పలాయితులైనవెనుక వాండ్రు తీసికొని పోక విడిచిన పెట్టెలను వెదకి తెమ్మని తనభటుల కానతిచ్చి చెట్టునకు బంధింపబడిన జయంతుని విడిపించి భుజాదండముమీద గాయము తగులుటంజేసి కదలలేక జొటజొటగారు క్రొన్నెత్తుకు నావృతుడై ప్రయత్నించియు నట్లు చేయలేక సొక్కియున్న విజయసేనునిగని లేవదీసి యాతని మొగము జూచి యాశ్చర్యపడి జయంతుని నావ వాలుబట్టి—"ఎవరో యనుకొంటిని మీరా! అడువాండ్రతో గూడ వచ్చిరా!" యని యడుగ వారు—"మేము స్త్రీలతో గూడవచ్చితిమి. వారు గుడారములలో నున్నారు అటకు బోదము రండు" అని యుత్తరమీయ వారలం దోడ్కొని పటకుటీరములకడ కరిగెను. అరిగి లోన ప్రవేశించి చూచునప్పటికి మోహపరాయణయై కనుగవమూసి కొని వివశయై పండుకొనపెట్టిన బంగారుబొమ్మవలెనున్న కర్పూర మంజరి యతని నేత్రముల కగపడెను. ఇందుమణియు మల్లికా చంద్రికలును వానిం జూచి తెల్లబోయిరి. సుదర్శనుడగు సుదర్శన నందనుని జూచిన తోడనే వారికందరకు ప్రాణములు లేచివచ్చెను. నూరుమంది యాప్తబంధువులను జూచినట్లు వారికి ధైర్యము గలిగెను. కాని కర్పూరమంజరి యవస్థ వారి యుత్సాహమున కంతరాయము గలిగించెను. కుమారునకు గాయము తగిలినదని యిందుమణి యెరుంగదు. నెత్తుటం దడసిన వస్త్రములతో నున్న కొడుకుం జూడ నిందుమణి వగ పినుమడించెను. ఆ విధముగానున్న కుమారికం గనుగొని యీ విధముగానున్న కుమారునిం గనుగొని యిందుమణి ధైర్యము

చిక్కబట్టజాలక కొడుకుం గౌగలించుకొని—“ కుమారా ! మీకిరువురకేక కాలమందే యాపద సంభవించెగా !” యని వాపోయెను. మకరందుడు జయంతుని జూచి—“ విజయసేనుని గాయము మిక్కిలి గొప్పదిగాదు. వెంటనే వ్రణపట్టికలు వైచి చికిత్స జేయుడు. అచిర కాలంబున గాయము మానున” ని చెప్పి—“ బాలిక యిట్లుండుట కేమి కతము ” ని యడిగెను.

నల్లిక నేత్రములనుండి బాష్పము లురుల—“ దేవా! దొంగలం జూచి యీమె మూర్ఛిల్లి పరవశయైనది. ఇంకం దెలివి రాలేదు. కొన యూపిరిమాత్ర మున్నది. నాడు మా చెలి విదర్భానగరమున దారుణ జ్వరపీడిత యైనప్పుడు మీరే మా దేవికి బ్రతికాభిక్షము బెట్టిరి. నేడును మరల మీరే వచ్చిరి. మీరు వచ్చుట యీమెకు బ్రాణము వచ్చుట. మాకు శుభము వచ్చుట ” యని పలికెను. “ కుమారా ! ఈమె మేన బ్రాణము లున్నవో లేవో సత్వరము జెప్పుము ” ని యిందుమణి మకరందుని నడిగెను. మకరందుడు—“ అమ్మా ! భయపడకుము. ఇది మూర్ఛగాని మరణముగాదు. దురాత్ములైన భిల్లుల దుండగముల జేత భయంపడి యీ తీగబోడి మూర్ఛిల్లినది ” అని చేయి జూచి—“ నాడి స్ఫుటముగా నున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు సరిగా నున్నవి. శబ్దము జేయక మీరు దూరముగా నుండుడు. క్రమక్రమముగ నామెకు జైతన్యము వచ్చును ” అని పలికి నారికి ధైర్యము గొలిపి తా నామెప్రక్కను గూర్చుండెను.

మోహావస్థ క్రమక్రమముగా సడలుటచేతనో మకరందుని హస్తస్పర్శ సుఖముచేతనో బాలిక కాలుసేతులు గదపి కొండొక సేపటికి గనులువిచ్చి చూచి యెట్టయెదుట సాక్షాత్కరించిన మన్మథు నట్లు గూర్చున్న మకరందుని గనుగొని సిగ్గుపెంపున మొదట గనులు మూసి మరల గన్నులు దెరచి యీ లావణ్యరసమున దన నేత్రమీనముల నోలలాడించెను. అట్లొండొరులు దర్శన స్పర్శన సుఖముల ననుభవించుచు వారిరువురు గొండొకసేపు పరమానంద సముద్రమున

దేలియాడుచుండ నంతలో షల్లికా చంద్రికలు వేరొక పాన్పు నమర్చి మూర్ఛితయైయున్నప్పుడు నేలబడియున్న కతమున ధూళిధూసరితమైన బాలిక మేను దులిపి లేవదీసి యా శయ్యం బండుకొనబెట్టిరి. ఈయంతరాయము వారికిరువుర కనిష్టమైనను సహింపక తప్పినదిగాదు.

జయంతుడు విజయసేనుని గాయమునకు దగిన చికిత్సలజేసి రక్తస్రావము గట్టించి యతనిని గూడ బవ్వళింపజేసి నిహతులైన పరిజనులకు నగ్నిసంస్కారవిధానము దుస్సాధ్యమని హతశేషులచేత వారికి దగినట్లు ఖననక్రియలు జేయించెను. పరిజనులలో గాయములు దగిలినవారికి సైతము చికిత్సలు చేయబడెను. పూరిపుల్లయైన దొంగల పాలుగాకుండ స్త్రీల కవమానము గలుగకుండ దమ్ము గాపాడిన మకరందుని జయంతుడును దక్కిన పరిజనులును బలుతెరంగుల గొని యాడిరి. తనకు బుత్రికా భిక్షము నాడు మకరందుడు ప్రసాదించెనని యిందుమణి పలుతెరంగుల నాతని నుతించె.

ఆ నడిరేయి యా నట్టడవిలో వారుండుటకు గారణమేమని మకరందుడు ప్రశ్నించెను. అప్పుడు జయంతు డిట్లనియె—"కుమారా! ఎరుగుదువుకదా హేమచంద్రుని యనుజుడును విదర్భరాజగు రాజవాహనున కల్లుడనగు చిత్రభానుడు కలడని. కర్పూరమంజరి యాతని గారాబు కూతురు. చిత్రభానుడు శ్రీనగరమం దున్నాడు. ఇందుమణీదేవియు గర్పూరమంజరియు హేమచంద్రుని రాణియగు నరవిందాదేవిని, వాని గారాబుకొడుకులగు విక్రమసేన హర్షవర్ధనులను జూచి పరామర్శించుట బంధుధర్మముగదా! అకారణంబున వీరు చిత్రభాను ప్రేరితులై రాజవాహనుని యనుమతంబున నచ్చటికి బోవుచున్నారు. విదర్భేశ్వరుడు తగు పరిజనంబునిచ్చి యశ్వములిచ్చి యందలములిచ్చి యఖిల ప్రయాణ సాధనంబులనిచ్చి పెద్దవాడను లోకానుభవము గలవాడను గనుక నన్ను దోడిచ్చి కాశ్మీరమునకు వీరిని బయనముచేసి పంపెను. మందభాగ్యుడనైన నేను వీరికీ యవస్థ దెచ్చితిని. సమరమున ముక్కలు దేరిన వీరులు నిష్కారణముగా

ప్రముచ్చులచేతజిక్కి చచ్చిరిగాని హతాశుడనైన నేను కడతేరిన బాగుండునుగదా! నీవు సమయమునకు రాకున్న క్రూరులు నీతి దూరులునగు చోరులు మమ్మేమిచేసి యుందురో! ఆర్తత్రాణ పరాయణుడవైన నీచరిత్రము శ్లాఘపాత్రము" అనవుడు మకరందుడు జయంతు నుద్దేశించి—"అయ్యా! ఇందు మీతప్పు లేదు. కాలవశమున నెటువంటి తేజమైన నొకప్పుడు మందగించును. అంతమాత్రమున మీయట్టివారు మందప్రజ్ఞులుగారు. నేను మానవధర్మమును జేసితిని గాని శ్లాఘింపవలసినంత ఘనకార్య మేమియు జేయలేదు. హేమ చంద్ర మహారాజమాట మీరిప్పుడు తలపెట్టుటంజేసి వారి దుర్మర ణము నాకు జ్ఞప్తికివచ్చి నామనంబు గాసిల్లజేయుచున్నది. పుంభావం దాల్చిన ధర్మదేవతగదా యతడు! హేమచంద్రాస్తమయమైన కాశ్మీరదేశము—కాశ్మీరమననేల! ప్రపంచము, చంద్రాస్తమయమైన నిశవలె నున్నది. నాతండ్రికి నతనికి నొక్కటే ప్రాణమని చెప్ప వచ్చును. కాలగతి మగలించువా రెవ్వరులేరు."

అని పలుకుచుండ గర్పూరమంజరియు బెదతండ్రిం దలంచి కన్నులనీరు నించెను. ఇతర విషయములగూర్చి కొంత ప్రసంగమైన వెనుక జయంతుడు తమ ప్రయాణముమాటయెత్తి—"మేము మరల విదర్భాపురమునకుంబోవలయునా. హతశేష పరివారయుతో గాశ్మీరము నకు బోవలయునా యని నామనంబు సందేహ డోలికలోబడి యూగు చున్నది. బాలుడవైనను నీవు జ్ఞానమున వృద్ధుడవు. ఇందు నీఆలోచన మేమో చెప్పుము" అని యడిగెను.

అంతలో నిందుమణి యందుకొని—"పరిజనములో సగము కడ తేరినది. ఈ యల్ప పరివారముతో మనము పయనము సేయజాలము. పైగా విజయసేనునకు గాయము తగిలినది. బాలిక మిక్కిలి భయ విహ్వలయైనది. కావున విదర్భకరిగి తగినంత పరివారము వెంటబెట్టు కొని పోవుట మంచిద"ని పలికెను. "అయ్యో! ఇంతలోనే వియోగము గలిగెనా!" యని కర్పూరమంజరి తనలో ననుకొని నిట్టూర్పు విడిచెను. మల్లికా చంద్రిక లిందుమణితో నేకీభవించిరి.

అప్పుడు మకరందుడు వారితో నేకీభవింపక వారందరు వినునట్లు జయంతున కిట్లనియె—"ఆర్యా! మీరిప్పుడు మాళవదేశపు సరిహద్దులలో నున్నారు. నాకడ దగిన పరివారమున్నది. మీరు నావెంట నుజ్జయినికి రండు. అచ్చటనుండి మీకు గావలసిన పరిజనంబును బరికరములను నిచ్చి మాజనకుడు మిమ్ము సురక్షితముగా గాశ్మీర దేశము జేర్పగలడు. అది కర్తవ్యముగాని వెనుకకు బోవుట సముచితముగాదు. ఈరేయి మీరందరు నాలోచించుకొనుడు. ఇంక నేను నాశిబిరంబున కరిగెద!" అది విని కర్పూరమంజరి మల్లికం జేరబిలిచి చెవిలో—"ఓసీ! తెక్కలికాంత్రము మరల వత్తురేమో? ఆయన నిండే యుండుమని చెప్పవే!" యని మెల్లగ బలికెను. "అట్లకాక!" యని మల్లిక మకరందు నచట నుండుమని ప్రార్థించెను. ఆ వేడికోలు కర్పూరమంజరీ ముఖంబుననే వచ్చినదిగా భావించి మకరందు డియ్యకొనియె. నిద్రించుటకు వారు ప్రయత్నించిరిగాని వారికందరకు ముఖ్యముగా గర్పూరమంజరికి గనులు మూసినతోడనే వెఱపుగొలువు కరకు చురుకల మోటరూపములు గనబడుటంజేసి యామె పలుమారు త్రుళ్ళిపడి లేచుచువచ్చెను. మల్లికా చంద్రికలు గుఱ్ఱుపెట్టి నిద్రించిరి. తెల తెల వేగునప్పుడు మకరందుడు తన సైనికులలో గొందర నచట నునిచి తక్కిన వారితో కలిసి తన నెలవున కరిగెను.

అతడు చనినపిదప విందుమతియు జయంతుడు మున్నగు వారందరు గలిసికొని తమ ప్రయాణ విషయమును జర్చించి మకరందుని మాటలు సహేతువులుగా నున్నవని తలంచి యాతనివెంట నుజ్జయినికిబోయి యటనుండి శ్రీనగరమున కరుగుట సముచితమని నిశ్చయించి యావార్త నతని కెఱిగించిరి. ఈ నిశ్చయము చెవిని బడినతోడనే కర్పూరమంజరి మకరందుల యానందము మిన్నుముట్టెను. కొంతకాలమైన మరల నన్యోన్యావలోకన సుఖము సంప్రాప్తమగుటచే వారి హృదయములు ప్రశాంతములయ్యెను. ఆ మరునాడు కర్పూరమంజరీ ప్రముఖ స్త్రీజనమును, విజయసేనుని, జయంతాదులను

దోడుకొని మకరందుడు తన పరివార సంగరక్షకా నచ్చోటు గదలి యుజ్జయినికి బయనమయ్యెను.

మకరందుడు మార్గమధ్యమున వనవాసులు మిక్కిలి వినయంబున గొని తెచ్చి యిచ్చు నెమలిపింఛములు, పులికళాసములు, జింక కొమ్ములు, తేనెపెరలు మొదలగు సూడిదల నాదరపూర్వకంబుగ నందుకొనుచు, వారు గావించు విన్నపములు సావధానుడై యాలకించుచు, జెంచులు గావించు విపరీత నృత్యములు గనుంగొని యానందించుచు నాకులు, చిగురులు, పండ్లు గాయలుదిని దిగంబరులై వృక్షశాఖలు నిలయుంబులుగ మహాతపశ్శాలుల విధంబున నుండెడు నానావిహంగముల సందర్శించి యక్కజంపడుచు బయనము చేసెను. కర్పూరమంజరియు నమాయిక వేషభాషలుగల చెంచుకన్నియలం జూచి యచ్చెరుపడుచు నవ్యక్తమధురములైన పులుగుల గానములను మెచ్చుచు నల్లజింకకొమ్ము కొనయందు దన కన్నుజేర్చి దురదవోవ రాచుకొను నాడు జింకంగని కన్నులు చరితార్థములైనవని తలంచుచు సింహవ్యాఘ్రాది క్రూరసత్వంబుల బొబ్బలువిని యదరిపడుచు ప్రకృతి సౌందర్యమంతయు గన్నులం జుర్రుచు మకరందుని వెంట నరిగెను. ఎకనెడ విడిసిన తావుల మూపులు వీణబూని యూరెలనాగ దాని నాదములో దన కంఠస్వరముగలిపి యేది కంఠమో యేది వీణానాదమో తెలియనట్లు వినువారల మేనులు గగుర్పొడుచునట్లు వారు తన్మయత్వము నొందునట్లు పాడి పరిజనంబులకును, జెలిమికత్తెలకును ముఖ్యముగా మకరందునకును మార్గశ్రమ మపనయించుచుండును. మకరంద సాహచర్యమున గర్పూరమంజరికిని, గర్పూరమంజరీ సహవాసంబున మకరందునకును మార్గాయాసమున్నది కనబడ లేదు. ఉజ్జయిని సమీపించుకొలది సంతోషము కలుగుటకు మారుగా పరస్పర వియోగము గలుగునేమో యని భయము పొడముచొచ్చెను. గమ్యస్థానము నానాటికి దవ్వయిన బాగుండునని వారికి దోచెను. బాధ్యుడైన మకరందుడు జీవహింసా విముఖుడు గావున నొక్క-

జీవజంతువునైనను జంపక శాకాహారముతోడనే కాలము గడపెను, భూతదయాపరుడైన యాతని నియమంబులు బాగున్నవని కర్పూరమంజరియు మాంసాహారము వర్జించెను. వ్యసనంబులలో నొక్కటియై పాపహేతువైన వేట నా రాజనందనుడు చిన్ననాటంగోలె వర్జించెను. మనుష్యులకు హానిసేయు క్రూరమృగంబులందక్క నాహారము నిమిత్తమతడెన్నడు నేజంతువును జంపి యెఱుంగడు.

ఈ విధంబున బయనంబుచేసి కతిపయదివసంబులకు వారు తమ కన్నిదినము లాతిథ్యమిచ్చి చక్కచెదరక తమయింటికి జేర్చిన వనలక్ష్మియొద్ద సెలవుగైకొని యుజ్జయినీ పురలక్ష్మిం జేరిరి కుమారుని రాకకు సుదర్శనుడు సంతసించి వానిం గౌగిటజేర్చి కర్పూరమంజరీ ప్రముఖ స్త్రీజనంబుల రాకవిని ఆనందమొంది వారల సగౌరవంబుగా సాదరంబుగా సస్నేహంబుగా దోడ్కొనిరమ్మని చంద్రప్రభాదేవిని బంపెను. ఆమెయు శుద్ధాంతకాంతాజనోచితమైన గౌరవాదరంబులు నెరపి వారల నంతఃపురము ప్రవేశింపజేసెను. ఇందుమణి రెండు మూడుదినములైనతరువాత దమ్ము గాశ్మీరమంపుమని చంద్రప్రభాదేవి ముఖంబున సుదర్శనునకు విన్నవించెను. అటనుండి పోవుటకు కర్పూరమంజరి కిష్టములేదు, పంపుటకు మకరందుని కిష్టములేదు అటమీద జిత్రభాను పుత్రికకు దేహపీడయు మనఃపీడయు గలుగ జొచ్చెను. పయనమనుకొన్నప్పుడెల్ల నామె కొకనాడు తలయేరు, మరియొకనాడు బద్ధకము, వేరొకనాడు నిద్రాభావము, అన్యదినంబున మనోవికారము మొదలగు విపరీత చేష్టలు పొడమెను. మకరందుడు వైద్యుడగుటచే ప్రతిదిన మామె చేయిజూచి రోగము చిన్నదైనను ప్రశ్నలధికముగ నడిగి పేరునకేదో మందిచ్చి చికిత్స చేయుచుండును అతడు సన్నిధి నున్నంతసేపు, చేయి చూచునంతసేపు, మాటలాడునంతసేపు, ప్రేమరసము జిలుకుచూపులు చూచునంతసేపు నామె కేవిధమైన బాధయు గనబడదు, అతడావల కేగినతోడనే మరల నెప్పటి నొప్పులు తలయెత్త జొచ్చెను. మల్లికా చంద్రికలుమాత్రము

జీవగఱ్ఱ. ఆశ యను గుఱ్ఱము నెక్కినవాడు మహావేగముగ బదునాల్గు లోకములం సంచరించి యది యెట్టకేలకు నడువలేక కూలి దిగబడ గూల్చినప్పుడు భగ్నమనోరథుడై కూలి మరల వెనుకకు బోవుటం కనకాశకు లోనియగుచు గాఢపశ్చాత్తాపము నొంది నాశనము నొందును. కాకపోయెనాక తన సంబంధముగలవారి నందరను జెరచును. ఆశ విషవృక్షము దహనముకన్న దారుణమైనది. ఇది పిరికి వారికి గాక యెల్లవారికి వారి వారి యవస్థలకుం దగినట్లు లాత్రియమై దుస్తరమగు జంబాల పటలమున దింపును.

హేమచంద్రుని మరణమునకు బూర్వము దండపాణి యొక్క కుటుంబమునకు మిక్కిలి కూర్చువాడు. తనకుమారికయైన మణిమాలికను హేమచంద్రుని జ్యేష్ఠనందనుడగు విక్రమసేనునకిచ్చి వివాహము చేయవలెనని ప్రయత్నించుచుండెను. కాని నాడు గురువుగా హారికర్త విక్రమసేనుడు మందభాగ్యుడనియు చిత్రభాను పుత్రకుడగు విజయసేనుడు మిక్కిలి యదృష్టవంతుడనియు జెప్పి మణిమాలికను విజయసేనునకే యిమ్మని హితోపదేశము చేసినదాదిగా దండపాణి మనస్సు నావమీది సూచీయంత్ర ముత్తర దిక్కువైపు దిరిగి యుండునట్లు నిరంతరము చిత్రభానునివైపు దిరిగియుండెను. చిత్రభానుడు కాశ్మీరదేశాధీశ్వరుడు గావలెనలయు, వానికుమారుడు విజయసేనుడు యువరాజు గావలెననియు దనకూతురు మణిమాలిక మొదట యువరాజపత్నియై, పిమ్మట గాశ్మీరరాజ పట్టమహిషి గావలెననియు గోరి యీ మనోరథసిద్ధికి నేకార్యము లవశ్యకములో వానిం జేయుటకును నేదారింబోయిన గమ్యస్థానము జేరవచ్చునో యాదారిం బోవుటకును నిశ్చయించుకొనెను. కాశ్మీరరాజ్యసైన్యములు వానియధీనమం దుండుటచే సేనాచక్రమునకెల్ల నియామకుడయిన తన కిష్టమగునట్లు దళములు దాటవను దృఢవిశ్వాసమున నెల్లరను దాను చిత్రభానునకు బాసటయై యుండ నిశ్చయించుకొనెను. దండపాణి తమ్ముడగు వజ్రపాణి చిన్న సేనాపతియై మొదటినుండియు హేమచ

చంద్రుని గొలిచియుండియు జిన్ననాటంగోలె కర్పూరమంజరిపై గన్నువైచి తన్నిమిత్తము చిత్రభానునియెడ బక్షపాతము గలిగి యుండెను. అహల్యాసంగమాభిలాషియై తొల్లి వజ్రపాణి కోడియై మునిగృహము జొచ్చినట్లు, కర్పూరమంజరీ సమాగమము గాంక్షించి యీ వజ్రపాణి చిత్రభానుని యింటికుక్కయై తిరుగుచుండెను. ఆ పరమమూర్ఖుడు కర్పూరమంజరి తనపై వలపు నిలుపుచున్నదో లేదో తెలిసికొనజాలక చిత్రభానుని పాదసేవయును నొలివిచ్చిన గన్య యన్యవశముగాక తన చేజిక్కునని యూటలూరుచుండెను. స్వసుఖాభిలాషియై తమ్ముడును, స్వపుత్రికా సుఖాలాషియై యన్నయును చిత్రభానుని కనుసన్న మెలంగుచుండిరి. ఆ యన్నదమ్ము లిరువురు ప్రతి దినము రాత్రులు చిత్రభానుని నెలవున కరిగి యతనితో గాశ్మీర రాజసంబంధములైన ప్రసంగములు సేయుచుందురు. రంధ్రాన్వేషియైన చిత్రభానుడు కాశ్మీరరాజ్యమందలి లోటుపాటులు దౌర్బల్యములు వారివలన దెలిసికొనుచుండును. రాజకుటుంబముపై నిర్హేతుకముగా వారు పూనిన ద్వేషాగ్నిని రుద్రభట్టు తన వాక్సమిధలచేత బ్రజ్వలింప జేయుచుండును. ఈ యిరువుర దన వశవర్తులుగా జేసికొనుటతో దనివినొందక చిత్రభానుడు శ్రీనగర వాసులలో ముఖ్యపురుషుల దన కడకు రావించియు వారియిండ్లకు స్వయముగా బోయియు, బూర్వము తన్ను హేమచంద్రుడు నగరమునుండి వెడలనడచినప్పుడుగాని, తరువాతగాని దనయెడ నెంతమాత్రము దోసములేదనియు దురాత్ము లెవ్వరో మహర్షితుల్యుడైన తన యన్నను సంహరించిరనియు భ్రాతృ హనన దోషము తన కారోపించిన దురాత్ములు తత్కార్యముచేసిన వారి దుర్గతులకే పోవుదురనియు నొక్కివక్కాణించి యొట్లుపెట్టుకొని ప్రమాణములుచేసి వారిలో గొందరి మనస్సులు తాను నిర్దోషియని నమ్మునట్లుజేసెను. కొందర తనిమాటలు నమ్మినను మరికొందరు వాని బలుకులకుం దలయూచి యట్లు కావచ్చునని పలికి మనసు లెప్పటి యట్ల నుంచుకొనిరి.

చిత్రభానుని సంతఃపురికి రానిచ్చినందునను, నదిచాలక నగరమున నుండనిచ్చినందునను వాని యాలుబిడ్డలువచ్చి తన్ను సందర్శించుటకు సమ్మతించినందునను నరవిందాదేవిమీద మణివర్మకు బట్టరాని కినుక పొడమెను. కొన్నిదినము లతడు రాజ్యవ్యాపారములం జూడనే లేదు, అంతిపురి కరుగనేలేదు. ఇల్లు కదలనేలేదు వైదేశికులగు రాయబారులకు గొన్ని ముఖ్యాంశములపై దగిన యుత్తరము లీయ లేదు. అరవిందాదేవి రాచనగరునకు రమ్మని యంతఃపుర పరిచారకుల చేతను, నిగమశర్మచేతను, మాధవసేనుని చేతను పెన్నోసారులు వర్తమాన మంపినను మణివర్మ—"ఇదె వచ్చెద నదె వచ్చెద శరీర మస్వస్థముగా నున్నది. పెద్దవాడ నగుటచే మునుపటివలె రాజ్య వ్యాపారములయందు బుద్ధి ప్రసరించుటలేదు" అని మెన్నోవంకలు చెప్పి తప్పించుకొనుచుండెను. కాని అతని మనంబున నాశ్రయించిన తిక్క తిరుగదయ్యెను. అరవిందాదేవి యెట్టకేలకు మణివర్మ తనపై బిట్టలుకబూనినాడని యూహించి యొకనాడు విక్రమసేన హర్షవర్ధనుల నుబిలిచి—"మీరిరువురు రథారూఢులై మణివర్మ యొద్దకు బోయి అతని యలుకదీర్చి మన నగరునకు గొనిరాగలరా నాయనలారా!" యని యడిగెను. "తప్పక దీసికొని వచ్చెదము" ని వా రుత్తరమిచ్చి మరునాటి యుదయమున సముచిత వస్త్రాలంకారములు ధరించి, తల్లికి వందనమొనర్చి స్యందనమెక్కి నందను లిరువురు తగు పరివారము వెంటగొని కాశ్మీర రాజ్య వజ్రవర్మయగు మణివర్మ గృహమున కరిగిరి. వారి రాకవిని మణివర్మ విస్మయమునొంది—"అయ్యో! నా పాపాత్మ్యమువలన నతిసుకుమారులగు రాజకుమారు లిల్లు విడలి రావలసి వచ్చెగాదా!" యని నొచ్చుకొని విసవిస మేడదిగి యెదురు వోయి యిరువుర బిగి కౌగిటజేర్చి ముద్దులాడి చేతితో దలమీద వీపుమీద నిమిరి—"నాయనా! మిమ్ము నేను నకారణముగా మిక్కిలి శ్రమపెట్టితిని, ఈ మందభాగ్యుని కతమున మీరంతఃపురము విడలవలసివచ్చెగదా! సీ! నాబతుకు కాల్పనా!" యని మనంబున

హేమచంద్రుని దలఁచి బిగ్గరగా వాపోయిన వారు శోకితులని శంకించి సమ్మలిక నెమ్మనమున నడంచుకొని వారి ముఖవికాసంబుల గూర్చుండబెట్టి సేమ మడిగి గారవించి వచ్చినపని యేమని యడిగెను.

అనుగుటయు విక్రమసేనుఁడు మెల్లగ నిట్లనియె—"తాతగారూ! నేను రాజును మీరు మంత్రియను సంబంధముచేత నిచ్చటికి రాలేదు. మా తండ్రిగారికి మీరు పితృప్రాయులై యుండిరి, మాకు మీరె పితామహులు, మీరె మాతామహులు, మాకు నిజమైన పితామహుఁడు లేనే లేఁడు, మాతామహుఁడు మహేంద్రదేవుఁడు మాయమ్మను మమ్మును మా తండ్రిగారి మరణానంతరమున బరామర్శచేసి తన రాజ్యమున కరిగెను, ఆపత్సముద్రమును జెలియలికట్టయై నిరోధించి శుభపరంపరల నొనగూర్చుటకై మిమ్ముంజూపి మాజనకుఁడు స్వర్గస్థుడయ్యెను. రాజ్యమునకు రాజు లేని వెలితి, మాకు దండ్రి లేని వెలితి నీవలనం దీరునని మేము పుట్టెడాస పెట్టుకొనియుంటిమి. అట్టి యాస తెల్ల జెడిపోయినవి నవవైధవ్య దుఃఖభారమున నడగిపోయిన మాయమ్మకు మీదర్శనాభావ మురిసినపుండున నుప్పుపెట్టినట్లయినది. ఇంతలోనే మీరు మాపై నింత యనుగ్రహము దప్పియుందురని మేమెన్నఁడు దలంపలేము. మాధవసేనుఁ డొక్కడే మంత్రాలోచనము చేసి కార్యభారము నిర్వహింపజాలఁడు. కావున నెప్పటియట్ల మీరు రాజకార్యంబుల నిర్వర్తింపవలయునని నేను వేఁడుచున్నాను. మాయమ్మ మిమ్ము రమ్మని వేఁడుచున్నది" అనుచుండ నంతలో హర్షవర్ధనుడందుకొని—"తాతగారూ! మీరు రాకపోవుటచేత మాకోట చిన్నపోయినది. మీరచ్చటికి రానియెడల మేమే మీయింటిదగ్గర నుందుము. మిమ్ము గెంటినను నిక్కడనుండి వెళ్ళము" అని ముద్దులొలుకఁ బలికెను, అంతకుమున్ను విక్రమసేనుని పలుకులకే సగము కరఁగిన యయ్యమాత్యుని హృదయము సహజమధురములై జాలి గొలుపు హర్షవర్ధనుని పలుకులకు నీరైపోవ మణివర్మ యిద్దరి బిడ్డల మరల గౌగిలించుకొని—"నా చిన్నియన్నలారా! ముద్దుల

మాతులారా! మీమాటలు వినినవాడు మీచెప్పిన చొప్పున చేయక యుండగలడా! మీనుడువులకు గరుగని డెందము రాయిగాని డెందము కాదు, నేనెప్పటికి మీవాడనేగాని యన్యుడనుగాను. శిథిల గృహము వలెనున్న యీ ముసలిమేనున నెంతకాలము ప్రాణముండునో యంత కాలము నేను మీక్షేమమే కోరుచుందును. ఎండుకట్టెవలెనున్న ఈ దేహము మట్టికరకు వచ్చునంతకాలము మీనిమిత్తమె పనిచేసి మీనిమిత్తమె వినియోగింపబడును. ఈ దేహమే మీకవసరమైన పక్షమున నిర్వ్యాజముగా నేను దీనిని మీకు సమర్పింతును. కాని నాడు నాచెప్పిన యుపదేశము సరకుగొనక మీతండ్రి దుర్బుద్ధిచే మరణంబు దెచ్చికొనియె. నేడు మీతల్లి నాపలుకులు ద్రోసిపుచ్చి చిత్రభానుని చేర్చినది. మీరు పసికూనలు. కార్యాకార్యము లెరుగరు. మీపినతండ్రి దురాత్ములలో నగ్రగణ్యుడు. తొలుదొల్త నితడు వైదర్భులం గొందఱ జేర్చి కుట్రపన్ని మీతండ్రిం గడతేర్ప జూచెను. అయ్యది నేనును మాధవసేనుడును మహాప్రయత్నంబున గనిపెట్టి లిఖిత మూలకమగు సాక్ష్యముతో గూడ మీతండ్రి కెరిగించితిమి. దానం జేసి మీయయ్య చిత్రభానుని దేశమునుండి వెడలనడచెను. అనంతరము హరిశర్మయను దురాత్ముని బంచి యితడే మీజనకుని వంచించి చంపించెను. చంపించె నననేల? స్వహస్తములతో నితడే చంపెనని నానమ్మిక, నేను కన్నులార జూడలేదుగాని, మీపినతండ్రి స్వభావమునుబట్టి యితడే స్వయముగా జేసినాడని యనుచుంటిని. రాజభక్తిపూరితమైన మనస్సుతో నే నిట్లనుచున్నాడను గాన నా యాలాపములలో పాపమున్నయెడల సకలపాప పరిహారయగు మహాభర్త నన్ను క్షమియించుగాక! మీపినతండ్రి తేనెబూసినకత్తి, వాని మాటలనియెడి నురులలో నెట్టివారు దగుల్కొనుచుందురు. మేకవన్నె పులి. మాటలలో దేనియ లుట్టిపడుచుండును. హృదయము విషకుంభము. అట్టివానిని జేరనిచ్చుటం జేసి నామాట చెల్లదుగదా యని నాచేసిన హితోపదేశములు నిరర్థకములని నేనట వచ్చుటలేదు

అంతియేగాని మీమీదగాని మీయమ్మమీదగాని నాకు రవంతయు నలుక లేదు. నా పుత్రికకు నరవిందాదేవికి నెట్టి భేదములేదు, ఇదె యామె దర్శనము జేయ మీతోడ వచ్చుచున్నాడన" ని మేడమీదికిబోయి తలపాగయు నిలువుటంగీయు దాల్చి బిడ్డలతో గలిసి రథమెక్కి రాజాంతఃపురమునకు బోయి యరవిందాదేవిని సందర్శించెను. ఆ దేవియు నతనికి నమస్కరించి తెలివిలేని దుష్టులున్న క్షమియింపుమని ప్రార్థించి యెప్పటియట్ల రాజ్యకార్యంబుల జూడుమని కోరెను. మణిశర్మ విక్రమసేనునితో జెప్పినట్లు యామెతో గూడ జెప్పి కడపట నిట్లనియె—" తల్లీ! నాకన్న నీవు చిన్నదానవు. నీబిడ్డలు పసిపాపలు. చిత్రభానుడు బెబ్బులులకన్న సింగములకన్న కోడెత్రాచులకన్న క్రూరుడు. నిజముగా నతడు దానవుడు గాని మానవుడు గాడు. అతడు నిను నీబిడ్డలకు హాని సేయుటకు దండపాణులు వజ్రపాణులు ప్రతి నిత్యము నీ నగరమునకుబోయి క్రొత్త వృత్తాంతములయు వాని కెరిగించు చున్నారనియు వారే వానికి సహాయులైయున్నారనియు నాగూఢ చారులవలన నెరిగియుంటిని. సైన్యమంతయు వారి యధీనములో నున్నది. అందుచేత మనము జాగ్రత్తగా నుండవలయును" అనవుడు నరవింద—" తండ్రీ! నాచేసిన పొరపాటు క్షమింపుడు. నాతోడికోడలు కర్పూరమంజరియు రేపో నేడో వత్తురు. వారువచ్చి నన్ను జూచిన తరువాత గార్యపద్ధతియంతయు నీ చెప్పిన చొప్పున జరుగుగాక! ఇక మీద నీగీచినగీటు దాటుదాననుగాను. నేను నీబిడ్డను. నాబిడ్డలు నీమనుమలు. నన్నును నాయనుంగు సిసువులను నీకప్పగించితి నా మహారాజాగారు స్వర్గస్థులైరి" అని యనివార్యమైవచ్చు కన్నీటిసోనల నాపలేక వలవల నేడ్చెను. మణిశర్మయు దుఃఖము నాపలేక వేడి కన్నీళ్ళు విడిచి—" అమ్మా! నాశక్తివంచనలేక నేను పాటుపడియెద. అవసరమైన మీనిమిత్తము నా ప్రాణములైన నర్పించెదన" ని యభయప్రదానమిచ్చి కొన్ని యితర విషయముల మాటలాడి సెలవు గైకొని యింటికి బోయెను.

# అయిదవ ప్రకరణము

ప్రియజన విరహము దుస్సహము. అది జీవితమును దుఃఖ భాజనము జేయును. ప్రియజన వియోగమైన కాలమున భానుడు సహస్ర మయూఖములతో నైజతేజమున వెలుగుచున్నను జగమంధకారమై తోచును. చలువలు వెదజల్లుచు మింట జందమామ కాయుచున్నను జంతువు దుర్భర సంతాపము నొందుచుండును. సౌఖ్యప్రదములగు వస్తువులన్నియు దుఃఖప్రదములట్లు కనబడును. ఉజ్జయిని నుండి బైలుదేరిన నాటగోలె కర్పూరమంజరి సరిగా నన్నము ముట్టక, నీరు ద్రావక, నిదురవోవక, మునుపటియట్లు గలకలలాడు నెమ్మొగముతో సఖీజనమును బలుకరింపక విధిలేక పయనము సేయుచుండెను. ఆమె యెండలమందున్నను నెజ్జయీడనున్నను మకరంద నామస్మరణమే సేయుచుండును. పరమయోగిని కన్నులు మూసి పరమేశ్వరుని ధ్యానించునట్లు మకరందుని సుందరమూర్తిని ధ్యానించుచుండును. కన్నులు మూసి మూసి తన్మయత్వముజెంది మైమరచి తన మనోనాథు డెట్టయెదుట నున్నట్లు భావించుకొని చేతులు చాచి బయలు గౌగిలించుకొనును. [illegible] సన్నిధియున దాని నున్న చెలుల [illegible] సిగ్గుపడును. [illegible] హా! యని నిట్టూర్పు విడుచును. ఇట్లు [illegible] తలిరుబోడి మకరందుని వియోగమునకు చిత్తమున నుత్తాపము నెక్కుటచే [illegible] నెచ్చెలులతోడను గలసి పయనముచేసి తనవు శ్రీనగరము జేర్చెను.

జయంతుడు తమరాక ముందుగా శత్రుభానునకు దెలియజేసి యున్న కతమున నాతడు దారిపొడుగునను నానాబంధువుల నెదుర్కొని సంభావించెను. జయంతుడు వనములో దొంగలు కొట్టుట, మగటిమి గల బంట్లు కూలుట, విజయసేనుడు గాయపడుట, కర్పూరమంజరి మూర్ఛిల్లుట, మాళవ రాజనందనుడు సాయపడి వారి నపాయము నుండి యుద్ధరించుట, పిమ్మట నుజ్జయినిలో గొంతకాలముండుట,

సుదర్శనుం డాదరించి తగు పరిజనమునిచ్చి పంపుట మున్నగు వృత్తాంత మంతయు జిత్రభానునకు విన్నవించెను. అదివిని యాతడు విస్మయంబును విషాదంబునుం బొంది మకరందుని తోడ్పాటునకును, సుదర్శనుని యాదరంబునకును బద్ధయు సంతసించి వారినందర దన గుడారంబుల యందె యా రేయి నిలిపి వారిరాక మరునాఁ డరవిందా దేవికి తెలియబరచెను.

ఆ దేవి వారిరాక ననుమతించుటయు నాటి యపరాహ్ణమున నిందుమణి కర్పూరమంజరిని విజయసేనుని బరిచారికా జనమును వెంట బెట్టుకొని రాచనగరునకుం జనియెను. కర్పూరమంజరి కంటికి మొగసాలలు, కొలువుకూటములు కళాహీనములై కానబడ నామె మొగము గాఢవిషాదమును దెలుపుచుండెను. దేవింజూచి యందరు దుఃఖాక్రాంత చిత్తులైరి. కర్పూరమంజరి చిన్ననాటనుండియు హేమచంద్రుని దండ్రిగ నరవిందను దల్లిగ భావించి వారు కన్నబిడ్డయట్లె పెరుగుటం జేసి హేమచంద్రుని మృతికి దన పెదతల్లి దురవస్థకు నామె యెంతేని యుమ్మలికము జెందెను. అరవిందాదేవి తన దుఃఖమును మాటల చేతగాక బొటబొటదొరగు బాష్పములచేతనే వెలిబుచ్చెను. విజయసేనుడు విక్రమసేన హర్షవర్ధనుల నోదార్చెను. ఇందుమణి సముచిత వచనముల దోడికోడలిని సమాశ్వాసించెను. పరామర్శ ముగిసిన పిదప నందరు మరల గుడారములకు బోవ బయనమగుచుండ నరవింద కర్పూరమంజరిం బిలిచి—"బిడ్డా! నీవిచ్చట నిలువుము. మీయమ్మయు దక్కినవారు బోయివత్తురుగాక!" యని పలికెను. ఇందుమణియు గర్పూరమంజరి యచ్చట నుండుటకు సమ్మతింప నామె పెదతల్లి కడ నిలిచిపోయెను. తక్కినవారందరు గుడారములకుం జనిరి. ఆ బాలిక యంతిపురినుండుట విక్రమసేన హర్షవర్ధనులకును సంతోషకరముగా నుండెను. అరవిందాదేవి నిరంతరము భర్తృమరణ దుఃఖమున గమంగను గుందుచుండుటంజేసి యామె దుఃఖోపనోదార్థము కర్పూరమంజరి పురాణములనుండియు బూర్వరాజుల

చరిత్రములనుండియు మనోహరములైన కథలనేర్చి పెదతల్లికి జెప్పుచుండును. విక్రమసేన హర్షవర్ధనులుగూడ మిక్కిలి తమకముతో వాని నాలకించుచు వచ్చిరి. ఒకసారి తన ప్రయాణమునుగురించి ముచ్చటించి త్రోవలో జెంచుపడతి చెప్పిన మొరుగు తెలిపి యామె వానిని నవ్వించెను. వెంటనే యా పడిరేయి జరిగిన భిల్లుల బందిపోటు జెప్పి వారందరికి భయము గొలుపును. ఒకతూరి విదర్భాపుర వృత్తాంతములు, మరియొకసారి యుజ్జయిని విశేషములు దెలిపి వారి నానందింపజేయును. ఒకసారి మకరందుని సాహసౌదార్యాదిగుణములు వర్ణించి వారి వీనులవిందు సేయును. మరియొకతూరి హేమచంద్రుని మరణ వృత్తాంతము సవిస్తరముగా సర్పడ పడిగి తెలిసికొని పెద తండ్రి కంత దుర్మరణము సంభవించినందునకు బిట్టు విచారించుచుండును. విద్యావతి యగుటచే సంచాలిత శోకవిహ్వలయగు నరవిందకు నప్పుడప్పుడు వేదాంత వాక్యములు చెప్పి యామె యులసట మందగింపజేయును. ఈ విధముగా దనకు శక్యమైనంతవరకు పెదతల్లి మనస్సునుండి శోకాంధకారమును వెడలద్రోలుటకు సర్వప్రయత్నములఁ జేయుచుండెను. అందుచే నరవిందాదేవి కర్పూరమంజరిని విడిచిపెట్ట నిచ్చగింపదయ్యెను.

విదర్భాపురమునుండి తన కుటుంబము వచ్చినవెనుక చిత్రభానుడు రమారమి యొక వారమునకు గుడారములయందు బసచేసి పిమ్మట దండపాణి ప్రముఖులు తన నిమిత్త మరసి సమకూర్చిన భవనమున కాపురముండ వెళ్ళెను. ఆ గృహము విశాలమైన యావరణము గలిగి వెనుకప్రక్క చిన్న యుద్యానము గలిగి ముందు విశాలమైన వాకిలిగలిగి రమణీయములగు మేడలు మిద్దెలు గలిగి రాజబంధువులు సపరివారముగా వసియించుట కనువుగా నుండెను. అందు విడిసిన రెండు మూడు దినములకు కర్పూరమంజరి తండ్రి పిలువనంప నా భవనమును తల్లిదండ్రులను జూడబోయెను. వారా పిరికి బాలికను రెండు మూడు దినములు లాపిరి, అలో నరవింద కర్పూర

మంజరిని రమ్మని నర్మదచేత వర్తమానమంపెను. కర్పూరమంజరి మీఁద నరవిందకు గాఢానురాగము గలుగుట చిత్రభానున శోకవిధము చేత సంతోషకరముగాను, వేరొక విధముచేత సంతాపకరముగాను నుండెను. తన పుత్రికచేత మణిశర్మ ప్రముఖులమీఁద గొన్ని కాని మాటలు రాణితో జెప్పింపవచ్చునని వారి కలయిక నభిడిచ్చగించెను. కాని చిర సహవాస దోషమున దన పుత్రికకు నరవిందమీఁదను నామె బిడ్డలమీఁదను చెప్పరాని కూర్మి జనించి భవిష్యత్కాలమున బాధకర మగునేమోయని భయము గలుగఁజొచ్చెను. అయినను నాఁత డామె రాచనగరమునకు బోవుట కాటంకము గలిగింపలేదు. రెండవనాటి రేయి చిత్రభానుఁడు భోజనానంతరమందు గూఁతురుం జేరబిలిచి— "బిడ్డా! నీవు నీ పెదతల్లితో గలిసిమెలసి కొన్నినాళ్ళనుండి యుంటివి గదా! భర్తృ మరణమునుగూర్చి యామె నీతో నేదేని చెప్పినదా?" యని యడిగెను. "నర్మద యడిగి నేను పెదనాయనగారి దుర్మరణ వృత్తాంతము దెలిసికొంటిని. అది యున్నదున్నట్లు జెప్పెనుగాని యెవరి మీఁదను నిందారోపణము జేయలేదు. నర్మద చెప్పినంతసేపు నా పెద తల్లి నోట మాటరాలేదు. కంటివెంబడి ముత్యాలపేరులు నేలకు వ్రేల గట్టినట్లు బాష్పధారలు దొరగెను. ఇదియే జరిగిన వృత్తాంతము" అని కూఁతురు తండ్రికి వృత్తాంతము చెప్పెను. "అంతేనా! ఎవ్వరిమీఁద ననుమాన మున్నట్లు చెప్పలేదా? సరే! వాండ్రకు నిజము తెలియక పోవచ్చును. నిజము కలకడమీఁద దెలియకపోదు."

అని పలికి కొంతసేపూరకుండి యేదో యాలోచించుచున్నట్లు పైకిఁజూచి వెండియు జిత్రభాను డిట్లనియె—"బిడ్డా! అరవిందాదేవి కడ నీవు తరచుగా నుండుదువు గనుక నామెకొక రహస్యము జెప్పవలయు నని కోరుచున్నాఁడను. అది యేమనిన నీవు సావధానవై వినుము. మాయున్నట్టి దారుణ మరణము పాలుచేసినవాఁడు పయోముఖ విషకుంభమని చెప్పదగిన మణిశర్మ. వాఁడు మానవరూపముననున్న ఘోరరాక్షసుఁడు; మిత్రరూపముననున్న కాలభుజంగము. అమ్మా

కృతితోనున్న కాలకూటవిషము. బిడ్డా! యీ పలుకులువిని నీవు కలతెల్లబోయెద వేమి? వాడంతపని చేయలేడనియా నీయభిప్రాయము? నీవక్కడ వచనక్కరలేదు. అమాత్యుల హృదయములు విషపాత్రములు. అమాత్యులు చేయని పాపములు లోకములో లేవు. నరుల ప్రాణములు దీయుట నల్లుల జంపుటగానైన నుండదు. పేను నుక్కిన మాత్రమైన నారికుండదు. స్వలాభపరాయణులై వారు కావించు దుండగముల దన దివ్యహస్తములతో—దివ్యలేఖినియై—దివ్యపత్రముల మీద—వాధికృతగపుడే వ్రాయవలయుగాని మరియెవ్వరు లిఖింప జాలరు. ప్రకారమిత్తురేని సూయకమాత్యుడు తనకు నమ్మిన భృత్యుడుగా మిత్రుడుగా నుండ నాతనిమ్మి నమ్మియున్న తన యోగమును దెచ్చుకొనెను. ఇట్టి మహాత్ముని నమ్మట ప్రక్కలో పామును పెట్టుకొని పవ్వళించుటయని యెరుగవు. బిడ్డా! ఆతఁడు నన్ను దేశమునుండి వెడలనడచుట మహాపాతకమైన ఈ పదినాథుని మాటలనమ్మితివే! లేకున్న మాయన్న నన్నట్లు సేయునె?" అని బాష్పరోధమున దన కంఠము గద్గదస్వరయుక్తముగా మాటలాడలేక కన్నీరు విడిచెను. కర్పూరమంజరియు దుఃఖపూరితయై కన్నీరు దుడుచుకొని—"తండ్రీ! విచారింపకు. నీ సోదరభ్రమము నిరుపమానమైనదె. కాలవశమున మనస్సులలో రవరవలు పొడముటయు దాపికం దగినట్లు హేమచంద్రుని జంపుటకు గొన్ని కుట్రలు బైలుబడుటయు నప్పుడు సంభవించెను ఎందుచేతనో నీపై నప్పుడనుమానముగలుగ నతడట్లు చేసెను ఆయన మరణమునకు విచారించిన గార్యమేమి? నీయభిమతమేమో చెప్పుము. శక్యమైన పత్నమున జేసెదన"ని హెచ్చరించుటయు చిత్రభానుడు మరల నిట్లు చెప్పదొడగెను—"అమ్మా! మణివర్మ హేమచంద్రుని జంపించినట్లు నీవరవిందాదేవి మనసునకు నచ్చునట్లు గట్టిగ జెప్పవలయును. మణివర్మయున్న మాయన్నయట్లు నామెయు బడిచచ్చును. అతడే తన తండ్రిగా గురువుగా క్షేమంకరుడుగా నమ్మి తన ప్రాణము కొడుకుల ప్రాణములు వానిచేతం బెట్టినది. అందుచేత

నాకు నతనిపై ద్వేషము వెలుగునట్లు నీవు నాకు పలుకవలెను. మాయన్న యున్నప్పుడే మణివర్మ కాశ్మీర రాజ్యచక్రమును నిచ్చవచ్చినట్లు త్రిప్పినాడు. ఇప్పు డతడే రాజు. వానిమాట నిరంకుశమై చెల్లుచున్నది. మాయన్న పేరుమీరుగా నాయిద్దరి బిడ్డలనైన వాడు బ్రతుకనిచ్చునని నాకు నమ్మిక లేదు. ఆ పసికూనలగూడ వాడెప్పుడో తన పొట్టం బెట్టుకొనును. కాబట్టి మణివర్మపై బ్రాలియున్న యామె మనసును నీవు యథాస్థితిని మరలింపవలెను. నీవు విద్యావతివి. మాటలయందును జాణవు. వాక్పటుత్వముగలదు. హేతుకల్పన చక్కగా జేయగలవు. పూర్వోత్తర విరోధము గలుగకుండ సందర్భ శుద్ధి చెడకుండ నెట్లు చెప్పవలెనో యట్లు చెప్పి కాశ్మీర రాజ్యమును రాజకుటుంబమును రక్షించునట్టి మార్గము చూడుము. అట్లయిన నీవు కష్టపరంపరలను వేడిగాడ్పులచే శోషిల్లుచున్న మన వంశవృక్షమునకు నీరుపోసి రక్షించినదానవగుదువు. నేనేమో చెప్పితినని చక్కగా నాలోచించి కర్తవ్యము చేయుము. నాయన్న కుమారులు, నాయన్న రాజ్యము చక్కగా నుండుటయే నాకోరిక."

అప్పలుకులు విని కర్పూరమంజరి విస్మయమునొంది క్షణ మాలోచించి తండ్రి కిట్లనియె—"నాయనా! కాశ్మీర రాజ్యమునకు మన విక్రమసేన హర్షవర్ధనులకు క్షేమము గలుగుట నాకు బరమ సంతోషము. కాని యెవరు చెప్పినను మణివర్మ మిక్కిలి యోగ్యుడనియు, రాజకుటుంబమునకు హితకారియనియు, నాత్మలాభపరాయణుడు గాడనియు జెప్పుచున్నారు. నీమాటలు చూడ నతనివంటి మలినవర్తనుడు లేడని స్పష్టమగుచున్నది. పెదనాయనకు మణివర్మ యుపకారము సేయుచుండ నేజూడలేదు, ఇంతవరకు వినలేదు. అట్టి సజ్జనునిపై రాజద్రోహము, రాజహత్య మొదలగు మహాదోషముల నారోపించి నేనేవిధముగా నరవిందాదేవితో జెప్పగలను! ఈ పని చేయుటకు నా యంతరాత్మ యొప్పుకొనుటలేదు, ఒక సద్గుణవంతుని జెరచుట మహాపాతకహేతువు. కావున నన్ను నీవీ విషయమున

క్షమింపవలయు. మణివర్మయే హేమచంద్ర హంతకుడని నీవు చెప్పితివి. కాని ప్రపంచమున నెట్టి దుర్వాదములయున్నదో యెరుగుదువా? మాళవ రాజాంతఃపురమున నేనున్నకాలమున నీ యిద్దరు ముగ్గురివలన నీవే నీ యన్నను జంపితివని—చంపించితివని వింటిని. అప్పలుకులు నేను నమ్మెదునా? కర్పూరమంజరిని కన్నతండ్రి చేతులు భ్రాతృరక్తముతోడ నరుణంబులగునే! నీపై నపవాదము నెట్లు విశ్వసింపనో మణివర్మపై నారోపణలుకూడ నట్లె విశ్వసింపను; కావున నీపని నాతలపై బెట్టకుము. అది నాచేతగానిపని" అని బాలిక యూరకుండ చిత్రభానుడు—"పోనీ! బిడ్డా! నీవాపనిని జేయ లేకున్నను నాపై లోకులు మోపిన యపవాదము నీవు నమ్మలేదు. అదియే నాకు బరమ సంతోషము అదియే పదివేలు. ఇంక బండు కొనుము" అని యామెం బంపి తాను శయనాగారమునకు బోయెను.

## ఆరవ ప్రకరణము

మణివర్మ యరవిందాదేవి యాజ్ఞ శిరసావహించి యెప్పటి యట్లు రాజ్యవ్యాపారముల జూచుచుండెను. గాని యాతని మనస్సు యథాస్థితికి బ్రాపింపలేదు. చిత్రభానుడు శ్రీనగరమునకు వచ్చుటే యతని కిష్టము లేదు. వచ్చినను నత డచ్చట నిలువజేసియుండుట కిట్టదు. అతని కుటుంబము వచ్చుటంతకన్న నతనికి సరిపడ లేదు. కుటుంబమువచ్చి రాజపత్నిని బరామర్శ చేసినపిదప సకుటుంబముగా దా నూరువిడిచిపోవునట్లు దేవియెదుట వాగ్దానముజేసి చేసినట్లు వీడు విడిచిపోకపోవుటగాక, మీదుమిక్కిలి యచ్చట స్థిరవాసము చేయ దలంచి యొక విశాలభవనము నాక్రమించుకొనుట వానికి మిక్కిలి కష్టముగా నుండెను. అన్నిటికంటె నెక్కువగ చిత్రభాను పుత్రికయైన

కర్పూరమంజరి నిరంతరము దేవికి సన్నిధానవర్తినియై యుండుట లోకజ్ఞుఁడైన యతని కనుమానము హెచ్చించుచుండెను. అందుచేత నతఁ డేమిచేయుటకు దోఁచక మూఢునివలె కార్యపద్ధతి నిర్ణయింప లేకయుండెను. ఒకసారి కాశ్మీర రాజ్యముతో సంబంధము వదలు కొనుట యుక్తమని యతఁడు తలంచును; వెంటనే మృతుఁడైన హేమ చంద్రుని దలఁచియు లేఁబ్రాయముననున్న రాజకుమారులం దలఁచియు బిడ్డవలె దన్ను నమ్మిన యరవిందం దలఁచియు నాయాలోచన మంతయు నొందించును. ఒకతూరి చిత్రభానుని నూరువిడిచి తక్షణమె పొమ్మని సందేశ మంపవలయునని తలపోయును. రాణి యానతిలేక యట్లుచేసిన నామె యెట్లుగా దలంచునో యని శంకించును. తన వేగులవాండ్రెంత తెలివిగలవాండ్రైనను లోలోపల నేమి జరుగు చున్నదో వారు తెలియఁజేయజాలరుగదా! ఏమి జరుగుచున్నదో! ఏమి పన్నుగడలు చిత్రభానుఁడు పన్నుచున్నాఁడో యని భయపడు చుండును. ఈ విధముగా కొన్ని దినము లతఁడు తలపోసి తలపోసి యరవిందాదేవికడకుఁబోయి యామెతో నీవిషయమై ముచ్చటింప దలఁచి విక్రమసేనునిం బిలిచి—"కర్పూరమంజరి లేనిసమయమున మీయమ్మతోడను నీతోడను నేనించుక ప్రసంగింపదలంతు. ఇట్లు మీయమ్మతో జెప్పుము" అని పలుక నక్కుమారుఁడు వల్లెయని తల్లికడ కరిగి యమ్మాట చెప్పెను. ఆమెయు మరునాఁ డేకాంతమున బ్రసంగించుటకు దగిన సమయము స్థలము నిర్దేశించి యమాత్యుని రావించెను. మణివర్మ ముడుతలుపడిన మొగము ముగ్గుబుట్టవలె నెరసినతల, మాంసహీనములై వ్రేలుచర్మములు, వయోభారమునకు దోడు స్వయముగా బైవైచుకొనిన కార్యభారముచేత గొంచెము వంగిన నడుము, దేవికి కుమారునకు జాలిగొలుప వారిని సమీపించి సన్మానితుఁడై పీఠముపై గూర్చుండి మెల్లగ నిట్లనను—"అమ్మా! చిరకాల జీవనము కష్టపరంపరా దర్శనముకొఱకే. కానిచో నట్టి నర పాల చంద్రుని హేమచంద్రుని చేతులుమీఁదుగా నేనుబోక

జీవచ్ఛవమునై యుండునా? చిత్రభానుని రాకనుగూర్చి నేను మీతో నివరకే మనవి చేసికొనియుంటిని. అతడు వచ్చుటే ముప్పు. రానిచ్చుట తప్పు. చేసిన తప్పు దిద్దుకొనుట యొప్పు. తన కుటుంబము మిమ్ము బరాబర్లు చేసిన తరువాత దాసీయూరు విడిచిపోవునట్లు మాట యిచ్చెనుగదా! ఇప్పుడు చేసినపని చూడగ నిచ్చట శాశ్వత నివాసము చేయుదలచి కాబోలు విశాలభవనము నాక్రమించుకొనియె, ఏకువలెవచ్చి మేకువలె బిగుసుకొనెనన్న సామెత నిజమైనది. మీ మనసులో మీకెట్లున్నదోగాని యతడిక్కడ నుండుటచే నేను ముండ్లమీద నున్నట్లున్నాను. నా మనస్సు నిప్పుల బొరలుచున్నది. జ్వరము లేకయే నేను తాపపడుచున్నాను. రోగము లేకయే నాకాహార ద్వేషము కలిగినది. తెగులు లేకయే నిద్రాశూన్యములైన రాత్రులు గడపుచున్నాను. చిత్రభాను డున్నచోట మనముండుట క్రొత్త పామున్న యింట మెలగుట, వాని నుండనిచ్చుట కొంగున నిప్పు మూటగట్టుకొనుట. ఈ విషయములన్నియు నేను మున్నె సూచించి యుంటిని. విశేషించి కర్పూరమంజరి మిమ్ము క్షణము పాయక తోడు నీడవలెనున్నది ఆమెపై మీకెంత మక్కువయున్నను నామె శత్రుని బిడ్డగదా! ఆమెకు మీపై నెంత యనురాగమున్నను వారు తల్లి దండ్రుల తరువాతివారుగదా? మీగుట్టుమట్టు లామెతండ్రికి తెలిగింప కుండునా? ఎంతమంచిదైనను బాలిక మీకు వారికి వైరము వచ్చి నప్పుడు తండ్రిపక్షమునుండక మీపక్షమునుండునా! అతడేమి దుస్తంత్ర ముల బన్నుచున్నవాడో మనమెరుగము. నావేగులవాండ్రు విహంగకుడు కైరవుడు మున్నగువారు పలుతెరంగుల వారిజాడల దీయ యత్నించుచున్నారు. కాని పైపై వార్తలేగాని లోపలిగుట్టు తెలియుటలేదు. కావుననో తల్లీ! వాని నిచ్చటనుండి వెడలనడచుట మంచిది. ఆదికాలమున మన మహారాజుగారే వానిని దేశభ్రష్టుని జేసిరి. కావున నింద మనమీద నుండదు. వెనుకటి మహారాజు చేసిన పనియే మన మిప్పుడు చేయుచున్నాము. బలవత్తరములైన పూర్వ

కారణములే యిప్పుడు నున్నవి. అంతకన్న నెక్కుడు కారణములుం గలవు. కావున వానిని వెడలనడచుటకు నాకు సెలవిమ్ము. నీముదల యయ్యేనేని వానిం బంపివేయుటకు యత్నించెద. నగరము విడిచి పోవునో లేదో నాకును సందియమే. అందుచేతనే యత్నించెదనంటిని. మీద మీచిత్తము" అని పురోహితాభిలాషియగు వృద్ధామాత్యుడు వచియింప నద్దేవి విక్రమసేనునివంక జూచెను. విక్రమసేనుడు తల్లివైపు జూచెను.

"అమ్మా! తల్లి కొడుకు లొండొరుల మొగములు చూచుకొని తెల్లబోవనేల? ఏదో కార్యపద్ధతి సత్వరము నిశ్చయింపుడు" అని యమాత్యుడు హెచ్చరింప రాజమాత యిట్లనియె—"తండ్రీ! నీపలుకులు వేదవాక్యంబులుంబోలె సత్యంబులు. మాకెల్ల చుట్టములు నీవ! నీవంటి క్షేమంకరుడు మాకు వేయిజన్మములు దపస్సుచేసినను లభింపడు. నీయిష్టమెట్లో యట్లే నేను చేసెద. కాని యొక్క విషయమాలోచింపుడు. మామరది నిప్పు డూరువిడిచి పొమ్మనుట నిద్రించుచున్న బెబ్బులిని మేల్కొలుపుట యగునేమో! పండుకొన్న త్రాచుపామును పడగవిప్పి యాడించుట యగునేమో! రాజుచున్న నిప్పు మండించుట యగునేమో! ఆడుదానను. రాజనీతి నెఱుగనిదానను. అందుచేత నామాటలే పాటిగా గొనక నీవును మాధవసేనుడును రాజభక్తియుక్తులగు దక్షిణ నియోగులతోడను గార్యాలోచనము సలిపి యథోచితముగా వర్తింపుము. కర్పూరమంజరి చిత్రభానుని పుత్రికయైనను సుగుణరాశి. ఇక్కడమాట లక్కడ, నక్కడిమాట లిక్కడ జెప్పునదిగాదు. ఎక్కడమాట లక్కడనే జీర్ణముచేసికొను స్వభావము దానిది. అయినను రాజ్యపరిరక్షణార్థము దానిం గూడనే బరిత్యజించెద" అనవుడు మణివర్మ విక్రమసేనునివంక దిరిగి—"కుమారా! సాలగ్రామము చిన్నదైనను బెద్దదైనను పూజ్యమె. రాజు బాలుడైనను వృద్ధుడైనను మాననీయుడె. కావున నీయభిమతము జెప్పుము" ని యడిగెను. అడుగుటయు నతడు—"అయ్యా!

కిరీటభారమే నేను తలదాల్చితినిగాని రాజ్యభారము మోయువాడవు నీవు. దండపాణి ప్రముఖులతో గూడ నీవాలోచింపుము. మనకు వారిపై ననుమానమున్నట్లు మన వర్తనముచే వారికి దెలియనీయ గూడదు అందరితో పాటు వారిం గూడ గౌరవ పురస్సరముగా బిలిచి కార్యనిశ్చయము చేయుట కర్తవ్యము. మీ శాస్త్రజ్ఞానము మీలోకానుభవము, మీ బుద్ధివిశేషము నాశ్రయించి మీ యిచ్ఛ వచ్చిన తెరంగున వర్తింపుము. మీకుపదేశము జేయుటకు నేనెవ్వఁడ!" యని వినయమున బదులు చెప్పెను. అప్పలుకులు విని యాసచివాగ్రణి— "సరే మీ యిరువురు నాకుం దోచిన పోల్కి సేయుమని సెప్పిరి గదా! మాధవసేనుఁడు సర్వకార్యములందును నన్ననుసరించును. దండపాణిని, వజ్రపాణిని గూడ బిలువనంపి వారిమతము దెలిసి కొనియెద. వారు నాతో నేకీభవింపకపోయినను నేను చిత్రభానుని పురము విడిచిపోవలసినదని చెప్పెద. ఏలయన వారి రాజభక్తిగూర్చి నాకనుమానము గలదు. వారయినను చాటుచాటున వానికి సాయము చేయువలసినదేగాని సాహసించి బహిరంగముగా మనకు వ్యతిరేకముగా నుండజాలరు. అట్లు సేయుటకు గూడ వారికి దగిన హేతువులు లేవు. ఇప్పటికి నేను సెలవుగైకొని పోయివచ్చెదన"ని స్వగృహమునకు బోయెను.

ఆ రేయి మణివర్మ దండపాణిని, వజ్రపాణిని దన గృహంబునకు బిలువనంపి మొదటినుండియు జిత్రభానునకు హేమచంద్రునకు గల సంబంధ మువన్యసించి యతఁడు భ్రాతృహంత యని లోకమునం గల వాడుకలనెత్తి నగరమున నతని నుంచుట కర్తవ్య మగునా కాదా! యనుమాట గట్టిగా విచారించవలసినదని వారితో జెప్పెను. అప్పలుకులు వారికి శ్రోత్రపేయములుగా లేవు. మనసులో జిత్రభానుని యెడ ప్రేమ గలిగియుండుటచేసి వారిరువురును నెటు చెప్పుటకు వీలులేక గొంతసేపు మనసులలో వితర్కించుకొనినపిదప దండపాణి యిట్లనియె— "ఆర్యా! చిత్రభానునిమీద నలుకవొడమి హేమచంద్రమహారాజు

వానిని దేశమునుండి వెడలనడచినమాట నిజమే అదియే పొరపాటని మేము తలంచుచుంటిమి. చిత్రభానుడు భ్రాతృహంత అనుమాట మేము నమ్మజాలము. మేమే కాదు. బుద్ధిమంతు లెవ్వరు నమ్మరు. అన్న నిమిత్త మత డెంతో యేడ్చుచున్నాడని వినుచున్నాము. అది కపటనాటకముగాక నిక్కమైన దుఃఖమే యని మాతలంపు. అత డిక్కడ నున్నందువలన మన కేమి యుపకారము గలుగును ? ఆతనిం గడుపుట కందిరీగలతుట్టం జెదరగొట్టుట ఔగాములు చక్కగ విచారించి మీ రిచ్చవచ్చిన తెఱంగున జేయుడు ఈ కార్యము నాకుమాత్ర మిష్టములేదు" అదివిని మణివర్మ—"వజ్రపాణీ! నీయభిప్రాయమేమి ?" యని యడుగ వజ్రపాణి—"అయ్యా! అన్నదమ్ములకు నేమి కారణముచేతనో మనస్పర్థలు కలిగినవి వినాకటి మహారాజు విషయము సరిగ విమర్శించియో విమర్శింపకయో తమ్ముని వెడలగొట్టెను. హేమచంద్రునితో వైరము లంత నొందినవి. చిత్రభానుడు వెనుకటి వైరము మరచి స్వదేశమునకు వచ్చినాడు. అతని జోలికిబోవుట యుక్తముగాదు. అదిగాక యత డేమి చేయగలడు ? ధనమా, రాజ్యమా, యధికారమా, సైన్యమా, యతనిచేత నేమి గలదు ? కావున మన మతని నుపేక్షించియుండుట సముచితమని నామతము."

అప్పలుకులువిని వారి మనస్సులోనున్న భావము సంపూర్ణముగ గ్రహించి యంతకన్న వారితో నెక్కువ ముచ్చటించుట యప్రస్తుతమని యప్పటికి వారికి సెలవిచ్చిపంపి మణివర్మ తన మనస్సులో నిట్లు వితర్కించెను—"అన్నన్నా! రాజ్యతంత్ర నిర్వాహణము కడుంగడు గష్టముగదా! ఇది యనేకాపదల కాస్పదము, ప్రమాదము మానవమాత్రునకు సహజము, అది మంత్రిపట్లవచ్చినా దానిని లోకము సహింపదు ; రాజు సహింపడు. తలపెట్టిన కార్యము శుభముగా బరిణమించినా యా మంత్రి యభినవ బృహస్పతియనియు, గలియుగ శుక్రుడనియు, యుగంధరుడనియు బ్రకృతి జనులు వేయి

తెరంగుల సన్నుతింతురు. దైవవశమున నకార్యము మంత్రిలోపము లేకయే చెడినా వాడు పనికిమాలినవాడు, దండనార్హుడవని యానోళ్ళతోనే నిందింతురు. ప్రజాభిప్రాయము బహుముఖములుగల రాక్షసి. కార్యధురంధరులపట్ల లోపమువచ్చినా యది వారిం దప్పక మ్రింగివేయును. రాజుల చిత్తవృత్తులు నట్టివే. అందు రాజు పిన్నవాడైనప్పుడు మంత్రిపాట్లు చెప్పవలసినదే లేదు. ఇక్కడ రాజు చిన్నవాడు. సంరక్షకురాలు తల్లి యాడుది చేయవలసినకార్య మతికష్టమైనది. చిత్రభానుడు పరమదుర్మార్గుడు. మిత్రులెవరో శత్రులెవరో తెలియకుండ నున్నది దైవమా! ఏమి తెరువు! ఇట్టి సంధిగ్ధసమయ మెన్నడు రాలేదు. ఏమైననగుగాక! దైవముమీద భారమువైచి రాజకుటుంబ క్షేమము విచారించి నాబుద్ధికి వచ్చినట్లు జేసెద. ప్రయత్నమే మనుష్యునివంతు; కార్యసిద్ధి దైవాయత్తము" ని నిశ్చయించి ద్వితీయమంత్రియగు మాధవసేనుని మరునాడు పిలువనంపి యాతనితో ననేక రాజకార్యములను ముచ్చటించి చిత్రభానుని ప్రసంగము దెచ్చి నగరమునుండి బహిష్కరించుట కర్తవ్యమా యకర్తవ్యమా యని యడిగెను. మాధవసేనుడును మణివర్మ యట్ల యఖండ రాజభక్తియుక్తుడు. అతనియట్లు చిత్రభానునియెడ విశ్వాసము లేనివాడు. అయినను మణివర్మ యట్లు కార్యనిశ్చయము సత్వరముగా నతడు చేయజాలడు. నోటనుండి మాట వెడలకమునుపు దాని ఫలి తెన్నిసారులో తూచును. భావమున నెన్నిసారులో దానిని మర్దనచేయును. అందుచేత నతడు చాలసేపాలోచనచేసి కట్టకొన కిట్లనియె— " అన్నివిధముల జిత్రభానుడు శ్రీనగరమునకు దూరమున నుండవలసినవాడే. కాని, మనమింత తొందరపడవలసిన యవసరమేమి? సాహసించిన పక్షమున నేమి ప్రమాదము సంభవించునో? వాని చర్యలు మరికొంతకాలము కనిపెట్టి యవి విపరీతములయిన పక్షమున మనమప్పుడు వానిని బహిష్కరింపగూడదా?" అనుచుండ నతని మాట కడ్డమువోయి మణివర్మ—" ఎంతకాలము మనము నిదా

నించుట? తలుపులు గొళ్లెము పెట్టి వాడు నాలుగు చూరులంటించిన పిదప మన మేమి చేయగలము? వాడిచ్చట దుస్తంత్ర వృత్తిమును కొంపదలచి మొక్కనాటినాడు. దోహదము సేయుచున్నాడని నానమ్మిక. అది మ్రానై గొడ్డళ్ళకైన దొరకనప్పుడు మన మేమి చేయగలము? మొలకయయిననాడె పెల్లగించుట కర్తవ్యము. కావున నా మాట వినుము. నీవుపోయి చిత్రభానునిం గలసి సకుటుంబముగా నతను శ్రీనగరము విడిచి వెళ్ళవలసినట్లు రాజశాసనమైనదని చెప్పుము, నేను పిన్నరాజుతోను రాణితోను మాటలాడితిని. ఎప్పుడో యొకప్పుడు మనమీ కార్యము జేయవలసినవారమె. వెందలకడ జేయుట మంచిది" అని కఠిన స్వరముతో బలికెను. "మీచిత్తమువచ్చినట్లు జేసెద. ఈ సాయంకాలమె పోయి చిత్రభానునకీవార్త నెరిగించెద. అతని ప్రత్యుత్తరము మీకు నేజెప్పెదన" ని మాధవసేనుడు చెప్పి సెలవుగైకొని పోయెను.

## ఏడవ ప్రకరణము

మణివర్మ సందేశము మాధవసేను డెరిగింపకముందె దండపాణి వ్రజపాణులవలన ముందుగ జిత్రభాను డెరింగి సందేశము కడకు వచ్చినప్పు డేమి చెప్పనొప్పునాయని విచారించుచుండెను. వార్తాహరులెవ్వరైయుందురో యతడు ముందుగా నూహింపలేకపోయెను. గాని మరునాడు మాధవసేనుడు వచ్చినతోడనే యతడా సందేశమెరిగించుటకై వచ్చియుండునని నిశ్చయించియు యథోచిత గౌరవమున నామంత్రి నెదుర్కొని యర్హాసనమున గూర్చుండబెట్టి సేమమరసి రాజకుటుంబముయొక్క క్షేమమడిగి పిమ్మట నక్కడకు వానిం దోడితెచ్చిన పనియేమో తెలియజేయదగునని పలికెను. మాధవసేనుడు చేతులు నలుపుకొనుచు మెల్లమెల్లగ నేదో చెప్పబూనెను

"అయ్యో! మీరు నేడేదో యుత్కృష్ట కార్యముమీద వచ్చినట్లు గనబడుచున్నారు. నసుగుచు మాటలాడవలసిన పని లేదు. చెప్పదలచినమాట లేవో స్పష్టముగా గంభీరముగా బలుకుడు. నావల్ల మీకెట్టి భయములేదు. మనము ప్రాతచుట్టాలముగాని మొగమోటక లేనివారముగాము" అని చిత్రభానుడు కంఠమెత్తి పలికెను. "అయ్యా! నసుగుచు సగము చెప్పదలంచుకొని రాలేదు. చెప్ప వలసిన దేమో సంపూర్ణముగా జెప్పిపోయెదన" ని మాధవసేనుడు చెప్పెను. "అదే నాకు కావలసినద" ని చిత్రభానుడు మరల నొక్కి పలికెను. అప్పుడు మాధవసేను డిట్లనియె—"మనము చిరకాల మిత్రులము. అయినను స్వధర్మనిర్వహణము మానవులకు విధిగావున నేనప్రియము చెప్పుటకు వచ్చితిని. ఇందుకు మీరు నన్ను క్షమింతురు గాక! మీయన్నగారు మిమ్ము గొన్ని కారణములచేత వెడల నడచిరిగదా! ఆ క్షణమే మీరు దేశమును విడిచిపోయిరి. ఇప్పుడు రాజకుటుంబమును బరామర్శచేయుటకై వచ్చిరిగదా! మీరు మీకుటుంబము బంధుప్రేమపేరితులై వచ్చుట, విపత్సముద్రమున మునిగిన రాజపత్నిని రాజపుత్రులను సమాశ్వాసించుట యుక్తమె. మొట్టమొదట మీరు మీకుటుంబమునకువచ్చి పరామర్శించినపిదప నగరము విడిచిపోవునట్లు మాటనిచ్చిరి మీమాట మీరు నిలుపు కొనుడు. మీరు మహారాజపుత్రులు మహారాజసోదరులు. చంద్ర వంశసంజాతులు. మీపూర్వులందరు నాడి తప్పనివారు. కావున మాటతప్పక సకుటుంబముగా మీరు శ్రీనగరము విడిచి మూడు దినములలో వెడలవలయు. ఇది రాజశాసనము. ఇది రాజమాతృ శాసనము. మీరొకరిని శాసించువారేగాని యొకరిచే శాసింపబడు వారుకారు. మీభృత్యులమైన మేము మీకు జెప్పవలసినవారము గాము. మీయన్నగారున్నప్పుడు మీరు వచ్చి వారి యనుమతిము ననో వారి శాసనము ప్రబలిఘటించియో ఇక్కడ నుండిన నది శ్లాఘ్యమైయుండును. వారి మరణానంతరమున సమాశ్వాసము పేరు

బెట్టి వచ్చి భర్తృవియోగముచేత మూలబడియున్న రాణిని లోకానుభవములేని చిన్నరాజును లోకువచేసి యిచ్చట నుండుట భావ్యము గాదు. ఇదియే నామనవి" అని సంపూర్ణముగా నతఁడు చెప్పదలచిన దంతయు జెప్పి ముగింపకమునుపే చిత్రభానుని మొగము గీచిన కంద దుంపవలె నెఱ్ఱపడెను. కన్బొమలు ముడిపడెను. కన్గొనలు గురివింద గింజల ట్లెఱ్ఱపడెను. పెదవు లదర జొచ్చెను. మేను గగుర్పొడిచెను. ఆగ్రహము వానిని సంపూర్ణముగ నావేశించి వశపరచుకొనెను. అపుడు వాని నోటనుండి యుచ్చైస్స్వరముతో నీక్రిందిమాటలు వెడలెను.

"మాధవసేనుడా! నీవును నీకన్న నీచుడైన మణివర్మయు మాయన్నతో నామీద గాలి ప్రోగుజేసి నేరములు కల్పించి కొండెములు చెప్పి మాయిరువుర మైత్రి జెరిపి పరస్పర ద్వేషములు గలిగించిరి. మాయలమాటలగు మీమాటలు వేదాక్షరములుగా నమ్మి వెంగలియగు మాయన్న నన్ను దేశమునుండి పొమ్మనియె. అతడు పెద్దవాడగుటచేతను, నేను మంచివాడనగుటచేతను, వానినిర్ణయ మధర్మగర్భితమైనను వానియందలి గౌరవముచేత వానియాన శిరసా వహించి యాలుబిడ్డల వెంటగొని నేను దేశాంతరముల కరిగితిని. తండ్రిలేని బిడ్డలను నవవైధవ్య దుఃఖితయైన వదినెను జూడవచ్చుట తప్పా! నన్ను మీరు పొమ్మని నిర్బంధింపక పోయిన పక్షమున నాయంతట నేనే వెడలిపోయి యుందునుగాని నాపుర నిర్గమనమును గురించి మీరింత పట్టుబట్టుచున్నారు కావున ముక్కంటి వచ్చినను నేనిక్కడనుండి కదలువాడనుగాను. ఎవ్వఁడు వచ్చి నన్నిక్కడనుండి కదపునో చూచెదగాక! వ్రేలితో నవ్వల ద్రోసివైచుటకిది గుండుగాని బెండుగాదు. మీబెదరింపులకు బారిపోవుటకిది పిల్లిపిల్లగాదు సింగపుగొదమగాని. ఇది నాతండ్రి రాజ్యము. నాతాత దేశము. నాముత్తాతల యార్జితము. ఇది నాజన్మభూమి. కావున నేనిక్కడ నుండి కదలను. స్వామిద్రోహులైన నీవును మణివర్మయు నాడు దానిని

చిన్నవాండ్రను గన్నబ్రాము రాజ్యము పంచుకొని తినవలెనని చూచుచున్నారుగాబోలు! నేనిటనుండి పోవని మీపిన్నరాజుతోను, రాజమాతతోను, వృద్ధబంధుకమైన మణివర్మతోను గట్టిగ జెప్పుము. పొమ్ము. పూర్వమిత్రుండవు బ్రాహ్మణుడవు నగుటచే గణించితిని గాని కానిచో నిట్టి సందేశము దెచ్చినందుకు గత్తితో నీకుత్తుక నుత్తరింపవలసినదే!"

అట్లు చిత్రభానుడు కడుదీవ్రముగాబలుక మాధవసేనుడును రోషఘూర్ణితమనస్కుడై యిట్లనియె—"రాజకుమారా! కుత్తుక నుత్తరింతునని నీవు పలికిన బెడిదము వాడనుగాను. నీకట్టి సంకల్పము గలదేని నీసంకల్ప మీడేర్చుకొనుము. బ్రాహ్మణుడనని నీవు దయ దలపనక్కరలేదు. మారాజశాసనము ననుసరించి మేము నీతో జెప్పవలసినమాట జెప్పితిమి. నీకడ మేము సేవజేసినను నీయాజ్ఞ నెరవేర్పవలసినవారమే గదా! సేవకులమీద నాగ్రహించిన లాభ మేమి? వార్తాహారులను దెగటార్చుట పౌరుషముగాదనియు నీతి గాదనియు రాజపుత్రుండవైన నీవే యెరుగుదువు. ఎరిగియుండియు నిట్టి సంభాషణలు చేయుదువని యెన్నడు దలంచియుండలేను. హేమ చంద్రుని యనుజునినోట నిట్టిమాట వెడలుట మిక్కిలి యాశ్చర్యము. సరే! మీప్రత్యుత్తరము మారాజునకు, రాజమాతకు నెరిగించెద. ఇంక మాకు సెలవిమ్ము" అని చివాలున లేచిపోయెను. అతను వెళ్ళిన పిమ్మట చిత్రభానుడును మాధవసేనుని విషయమున దాను గావించిన సంభాషణ కఠినమై రాజకుమారోచితముగా లేదనియు దాను తొందరపడెననియు నతడించుక పశ్చాత్తప్తుడై విచారించి మరల నెప్పటియట్ల బింకముగలిగి యుండెను.

రుద్రభట్టు చిత్రభానునితో గూడ శ్రీనగరమునకు వచ్చినది మొదలు వానికి సకల విషయములయందు నుపదేశము చేయుచునే యుండెను. చిత్రభానుడు వాని యుపదేశము పరమప్రమాణముగా, వేదవాక్యముగ గ్రహించుచుండెను. కొన్నికారణములచేత రుద్రభట్టు

బహిరంగముగ నెల్లవారికి గనబడుట కిష్టపడమి మేడమీద నొక మూల కృష్ణాజినము బరచుకొని శాలువ గప్పుకొని సంస్కృత గ్రంథ మేదో చూచుకొనుచుండును. చిత్రభానుడు సన్నిధానమున కరిగి విషమసమస్యలవంటి సందిగ్ధ విషయములలో నాలోచన మడిగినప్పుడు బూర్వోత్తర పరిస్థితుల బరికించి ఉపదేశము చేయుచుండును. దండపాణియు వజ్రపాణియు దప్ప రాజసేవకులలో నెవ్వరికి నతడు కనబడలేదు. మాధవసేనుడు 'తన్ను విడిచి వెళ్ళిన తరువాత జిత్ర భానుడు మేడమీదికిబోయి రుద్రభట్టునకు నమస్కరించి తనకు నయ్యమాత్యునకు జరిగిన సంభాషణ మంతయు జెప్పెను. అతిడదివిని- "రావలసిన పరిస్థితులు వచ్చుచున్నవి. వీని కెంతమాత్రము నీవు జడియవలదు. నీవు మాధవసేనునకు జెప్పిన ప్రత్యుత్తరము రాజ కుమారోచితముగా నున్నది. అంత తీవ్రముగ బలికినందుకు బశ్చా త్తాపము నొందితివంటివి. పశ్చాత్తాపమున కవసరము లేదు. సన్నిపాత జ్వరమునకు మేకు గాల్చి వాత బెట్టుటయే మందు. ఇప్పుడు నీవు దండపాణిని వజ్రపాణిని బిలిపించి కార్యాలోచనము జేసి తెంపుసేయ వలయు. గొప్ప సంధిగ్ధ సమయము వచ్చినది. నీవిప్పుడు సంశయింపక సాహసింపదగును. ఆ దండనాథు లిద్దరు నేమికోరుదురో యవియెల్ల వారికొడగూర్చినట్లు బాసజేసి వారిని నీయధీనము చేసికొనవలెను. సైన్యమంతయు వారిచేతిలోనున్నది. వారు నీకు వశవర్తులగుదురా కాశ్మీర రాజ్యలక్ష్మి నీవశవర్తినియగును. ఈ రేయి వారిని బిలిపించి మంతనముండవలయు. అంతయు వారితోనున్నది. అర్ధరాజ్యమడిగి నను నిచ్చునట్లు వాగ్దానము చేయుము" అని గట్టిగా జెప్పెను. అట్ల కాక! యని చిత్రభానుడు కరటకుని బిలిచి దండపాణి వజ్రపాణులను రాత్రి పిలుచుకొని రమ్మని యానతిచ్చెను. చీకటి పడినతోడనే కరటకుడు వారిరువురకడకు బోయి తన స్వామి సందేశ మెరిగించెను. జాము రాత్రియైన వెనుక వీధులు నిర్మానుష్యములైన వెనుక రాజ వీధులు పరిత్యజించి వారు సందుగొందులంబడి చిత్రభాను గృహము

జేరిరి. వారు లోపల ప్రవేశించినతోడనే వీధికవాటము దృఢముగా బంధింపబడియెను. చిత్రభానుడు వారి నెదుర్కొని మేడమీదికి గొని పోయి రుద్రభట్టు సన్నిధానమున నిలిపెను. మొగమున వెండిరేకు లదికినట్లు బూదిపిండికట్లు మెరయ మెడలో స్ఫటికాక్షసూత్రము ధగ ధగలాడుచుండ బ్రహ్మతేజ ముట్టిపడునట్లు జింకతోలుమీద బద్మా సనము వైచికొని యపరశివునివలె గూర్చున్న యా బ్రాహ్మణుని జూచి యన్నదమ్ములు శిరసాదములకు నమస్కరించిరి. అతడు— "మనోరథ సిద్ధిరస్తు!" అని దీవించి రత్నకంబళములపై గూర్చుండ నియమించిన వారందు సుఖాసీనులై యుండిరి. చిత్రభానుడును వారి ప్రక్కనే గూర్చుండెను. రుద్రభట్టునకు గుడిప్రక్క నొక మూకుడులో నగ్ని వెలుగుచుండెను. అది యారిపోకుండ నడుమ నడుమ నతడే రెండు మూడు సమిధలు వేయుచుండెను. అపుడు రుద్రభట్టు ముందుగా నిట్లు సంభాషణ మారంభించెను—"అయ్యా! నేను చిన్ననాటనుండి యాసేతుహిమాచలమగు భరతఖండమంతయు దిరిగి నాడను. ఎన్నో దేశములు జూచినాడను. ఎందరో రాజులతో సంభాషించినాడను. బహుజనుల స్వభావములను గ్రహించినాడను. కాని, మీవంటి సజ్జనుల నెందు జూడలేదు. మైత్రియనగా మీదే మైత్రి. మిత్రుని నిమిత్తము ప్రాణములనయిన ధారవోయునట్టి సజ్జను లను మిమ్మె చూచితిని. అట్లే కానియెడల నీయర్ధరాత్రమున నీగాఢాంధకారమున నెవ్వరెరుగకుండ నతిరహస్యముగ ముసుగులు వైచుకొని యెంతో కష్టపడి మీరీమిత్రుని గృహంబునకు వత్తురె? ఇంతశ్రమ మీరేలపడవలె? మీరెయంతటివారు మీరు, విశేషించి కాశ్మీర సైన్యముల కధిపతులు. పిల్చినవాడో—రాజ్యములేనివాడు, పూజ్యతలేనివాడు, ధనములేనివాడు, పరిజనములేనివాడు, బలగము లేనివాడు. అట్టివానిమాట తలదాల్చి మీరిట్లువచ్చుట మీచరిత్రము నకు వన్నెపెట్టుచున్నది. ఐశ్వర్య మున్నప్పు డందరు మిత్రులె; ధనహీనునకు నాపత్కాలమున మిత్రులైనవారే మిత్రులు. అన్నయు,

జట్టములు, దేశీయులు బరిత్యజింప నేకాకినై తిరుగు వీనిని మీరు చేపట్టినందుకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. వేల్పులు సంతసింతురు. వెయ్యేల! పరమేశ్వరుడు సంతసించును. ఎడారిలో నోరెండి తిరుగు బాటసారికి మంచినీటినూయి దొరికినట్లు, పేరాకలికి నకనకబడువానికి నట్టడవిలో బండ్లచెట్టు దొరకినట్లు నిర్భాగ్యుడైన వీనికి వీనియదృష్టమున మీరు లభించిరి. ఇతనికి ముంగిట రెండు పెన్నిధానములు దొరికెను. రెండు కల్పవృక్షములు పెరటిలో లభించెను. ఆ వృక్షచ్ఛాయ నింక జల్లగ మనగలడు. ఆ శాఖలు బట్టుకొని పైకెగ బ్రాకగలడు. ఆతని ముంచిన దేల్చిన మీదే భారము" అనవుడు దండపాణి వినయముతో—"స్వామీ! మేమేమి చేయగలము! పూర్వమైత్రిచేత మేమీయనను వదలలేక పట్టి ప్రాకులాడుచున్నాము. మాచేతనైన సాయము చేయగలము. ఇప్పుడు మమ్ము బిలువనంపిన కార్యమేదో సెలవీయవలయును" ని పలికెను. పలుకుటయు జిత్రభానుడు వారి చెరియొక చేయి తన చెరియొక చేతితో బట్టుకొని మెల్లగా నిట్లనియె—"మిత్రులారా! నేను భయపడుచునే యిటకు వచ్చితిని. వచ్చినందుకు నేననుకొన్నంతపని జరిగినది. మాధవసేనుడు నిన్న వచ్చి సకుటుంబముగా నన్నీయూరునుండి పొమ్మని తమ రాజయొక్కయు రాజమాతయొక్కయు శాసనమైనదని చెప్పెను. అది విని కోపపరవశుడనై నేనిక్కడనుండి కదలనని దృఢముగా బలికితిని. ఆ పలుకుల కేమి! నన్నిక్కడ మీరుండుమన్న నుండెద పొమ్మన్న బోయెద. నాకు నిలువనీడ లేదు. చెట్టుమీది పక్షికైనను నెలవున్నదిగాని నాకు నెలవు లేదు. సువిశాలమైన ఈ విశ్వమే నామందిరమైనది. నక్షత్రయుతమైన యాకాశమె మణిరంజిత వితానమైనది. మెత్తని పచ్చిక బయళ్ళు రత్నకంబళములైనవి. వృక్షచ్ఛాయలు పందిళ్ళయినవి. అడవులు పూవుదోటలయినవి. రాజకుమారుడనైనందుకు నేనీవిధముగా భోగముల ననుభవించుచున్నాను. విదర్భలో నుండుదుమన్న నత్తవారియింట బ్రతుకకన్న

హీనమైనది మరియొకటి లేదు. అదిగాక చంద్రవంశజుడనై విక్రమ సేనుని గారాబుకొడుకునై యమిత సౌఖ్యంబు లవ్వారిగా ననుభవించిన నేను పరులపంచల నొకరిచేతిక్రింద నొదిగియుండగలనా? వెనుక మాయన్నయందలి గౌరవముచేత నేనెట్టులో వీడు విడిచి పోయితిని. ఇప్పుడు నాకిక్కడ నుండవలెనని యున్నది. మీయుత్తాల భుజలీల యూతకోలగా నేనిందు నిలువబడ దలచుచున్నాను. మీరు ససైన్యముగా నాకు బాసటయై నిలిచిరేని యీ కార్యము తుద నెగ్గును. ఇందుకు మీకు నేను ప్రత్యుపకారము మీయిచ్ఛాప్రకారము జేసెద. నన్నిక్కడ సుప్రతిష్ఠితుని జేసితిరేని మీకష్టైశ్వర్యము లొసంగుదును. చదరంగపుటాటలో నొక గుఱ్ఱమును మరియొక గుఱ్ఱము గాచినట్లు నన్ను మీరు గాతురేని మిమ్ము నేను మహోన్నత దశలో నిలువుదును. ఇన్నిమాటలెందుకు! కాశ్మీరరాజ్యమే మీది. మీమనస్సులోనున్న కోరికయేమో దాచక చెప్పుము. సముఖమున రాయబారములెందుకు? చల్లకువచ్చి ముంత దాచనేల?" అని యుపన్యసింప దండపాణి వెంటనే యుత్తరమీయలేక సందేహించెను. అతని మొగమున జెమటలు తోచెను. అతడు భయపడినట్లు కనబడెను. వజ్రపాణి వెలవెల బోయెను. చిత్రభానుడు దండపాణిమీద జేయివైచి—"మిత్రుడా! ఏమి భయపడుచున్నట్లున్నావు? ఇది సేనాపతికి దగిన లక్షణముగాదు. క్షత్రియుడవు. మహావీరుడవు. జంకన్నది నీవున్న యూర నుండగూడదు. అట్టిదానికి నీమనస్సు నెలవు గాగూడదు" అని హెచ్చరించుచుండ దండపాణి—"రాజద్రోహము, రాజద్రోహము" అని మెల్లగా బలికెను. అది విని చిత్రభానుడు—"నేనుమాత్రము రాజునుగానా! ఈ వరకు నాయెడలజేసిన ద్రోహము మాటేమిచెప్పెదవు? మిత్రులయినందుకు నాకు జరిగిన యన్యాయమునకు మీరు ప్రతిక్రియ సేయవలయు. అవి పిచ్చి మాటలు. రాజెవడు? మీరాజు చనిపోయినాడు. ఈ పసికూన నీకు రాజా? మూలగూర్చున్న యా వితంతువు నీకు శాసకురాలా? ఇంత

బ్రతుకు బ్రతికి చివర కాముదాని శాసనములా నీవు శిరసా వహింప వలసినది ? దుస్తంత్ర పేటికయైన యీ ముసలి రాబందు మణివర్మయీ నిన్ను శాసించువాడు ? ఛీ ! ఈ పిరికితనము విడువుము. వజ్రపాణీ ! నీహృదయము వజ్రమువలె నుండవలె. మున్ను నేపాళసైన్యముల నురుమాడిన యా ధైర్యమొకసారి నీమనమున నెలకొల్పుము. పిరికితలపు దూరముగ దొలగింపుము. ధైర్యము చిక్కబట్టుము” అని మందలించెను. వజ్రపాణి యేదో యుత్తరము చెప్పబోవుచుండ రుద్రభట్టందుకొని—“ రాజద్రోహము భీరువులమాట. మీరెవరిని రాజును జేసిన వాడే రాజు. చిత్రభానుని రాజుం జేయుడు. అప్పుడు మీరు రాజభక్తులగుదురు. ఇతడు విక్రమసేనుని కొడుకుగాడా ? శూరుడుగాడా ? రాజ్యము సమర్థతతో బాలింపలేడా ? సైన్యముల నడుపలేడా ? సమరముల విక్రమవిహారము సలుపలేడా ? వీనికేమి కొరత ? మీమనంబుల శంకలు బారద్రోలి యీతని రాజుంజేసి ధనము, పలుకుబడి, యధికారము నన్నియు గలిగి మీరు మెలంగుడు. అదిగో ! లక్ష్మివచ్చుచున్నది మీకా లడ్డుపెట్టకుండ దిక్కుమాలిన యీ చిత్రభానుని బాగుచేసిన ప్రతిష్ఠ మీకు దక్కగాక ! మీ యభిప్రాయము జెప్పుడు !” అని ప్రబోధింప దండపాణి—

“ మహాత్మా ! సందియము లేదు. చిన్నరాజును దండపాణి మోసము చేసి శత్రుపక్షమును జొచ్చినాడని లోకాపవాదము గలుగునని సందియపడుచున్నాను ” అని మెల్లగా జెప్పెను. వెంటనే రుద్రభట్టు—

“ లోకాపవాదమా ? లోకులనందర మెప్పింపదరమా ? మన కిష్టమైన పని మనము చేయవలయునేగాని లోకు లిట్లనుకొందు రట్లనుకొందురని శంకించిన నొక్క కార్యము జేయగలమా ? స్వబుద్ధి ననుసరించిపోవుట శ్రేయము. లోకులు కాకులు. ఇష్టమువచ్చినట్లు కూయుదురు. ఆ కూతలన్నిటిని మనము లెక్కసేయరాదు ప్రతిమనుష్యుని గొందరు నిందింతురు. కొందరు మెత్తురు. ప్రతికార్యమును గొందరు శ్లాఘింతురు. కొందరు దూషింతురు. యెల్లరు దేనిని మెచ్చరు.

ఎల్లరు దేనిని దూషింపరు. 'ఆత్మబుద్ధి స్సుఖంచైవ' యను నార్యోక్తి వినవే? ఎల్లవారికి నంతఃకరణ ప్రవృత్తియే ప్రమాణము. కావున నీవిందు సందియపడక చిత్రభానుని కండవై నిలువుము. ఇదే సమయము. జంకిన లాభము లేదు, వెనుదీసిన ప్రయోజనము లేదు, అదను పదనుదప్పిన మరల గూడిరాదు" అని గంభీరభావముతో బలికెను. దండపాణి మాఱాడలేక వారి యుపన్యాసములకు దాసుడై— "మీయిచ్చవచ్చినట్లు జేసెద. ఈశరీరము మీది. దీనిని మీయిష్టము వచ్చినట్లుపయోగించుకొనుడు. నామిత్రుడు నాతోడిపాటివాడే. మేము చిత్రభానునికొరకు జచ్చుటకు సిద్ధముగనున్న సాహసులము, జలధి బడుమన్న బడుదుము, పంచప్రాణములు విడువుమన్న విడుతుము, కాని మేముగాక యితర సైన్యాధిపతులు కొందరు గలరు. అందు ముఖ్యముగ గదాధరుడు, శూలపాణి మున్నగు దండనాథులు రాజభక్తికి బేరుపడినవారు, సేనలో బలుకుబడి వారికి గూడ మెండుగా గలదు. వారు మనపక్షము రారు. ఆ విషయమై మనము గట్టిగా విచారింపవలెను. అది యట్లుండగా మా కోరికలు గూడ మీరు వినవలయు, జెప్పుమన్న జెప్పెదన" ని చిత్రభానుని మొగమువంక జూడ— "నిస్సంశయముగా చెప్పవచ్చును" అని యతడు పలికెను. "వ్యవహారమట్లు మొగమాటము గూడదు" ని రుద్రభట్టు చెప్పెను. అప్పుడు దండపాణి యిట్లనియె—"సంకూతును మనోమాలికను విజయసేనునకిచ్చి వివాహము సేయవలెనని చిరకాలమునుండి నేనభిలషించుచుంటిని. ఆ విషయమై మీయభిమతమేమో తెలుపవలయు. ఇది నావిషయము. మామిత్రుని మనోరథము గూడ జెప్పెద నాకర్ణింపుము. సిగ్గుపెంపున వాడు చెప్పజాలకున్నాడు. మీకిరువురమంజరిని చట్టబట్టవలెనని మావజ్రపాణి తడవులంబట్టి తలపెట్టియున్నాడు. మామిత్రుని మనోరథము మీరిదేర్పవలయునని కోరుచున్నాను. మాకింతకన్న గోరికలు లేవు. మన మనోవ్యస్య మనోరథసిద్ధులు చేసి సుఖింపవలెనని నాప్రార్థన" అని విరమింప చిత్రభానుడు—"మన

మీగోపురము వియ్యమందుట నాకు బరమానందకరము. విజయసేనుడు నీయల్లుడు నేడే యయ్యెనని నీవు నిశ్చయించుకొనుము. ఇక కర్పూర మంజరిని వజ్రపాణి కిచ్చుట విషయమున దాని మనోరథ మెట్లుండునో చెప్పజాలను. అయినను దానిమనసు విరిచి తప్పక నీకు వివాహము చేసెదన" ని దృఢముగా బలికెను. అతని పలుకునే దృఢీకరింపదలచి రుద్రభట్టుగూడ నిట్లనియె—"ఇదియా మీకోర్కెలు! ఇందసాధ్యమైనదియు, నసంభవమైనదియు నేదియు లేదు. విజయసేనున కెవ్వతెనో యొక బాలికను దెచ్చి వివాహము సేయవలయునుగదా! ఆ కన్య మణిమాలికయే యగుగాక! మణిమాలిక గుణమణిమాలిక యని విందును, ఆబ్బాలిక విజయసేనుని సహధర్మచారిణియై, యర్ధాంగి లక్ష్మియై, మహాపతివ్రతయై, సంతానవతియై, భావికాలమున శ్రీ కాశ్మీరరాజ పట్టమహిషియై వర్ధిల్లుగాక! యని మేమాశీర్వదించుచున్నాము. కర్పూరమంజరి యీనాటి బాలికలవంటిదిగాదు. జననీ జనకులకు విధేయురాలు. చదువుల సరస్వతి, గానముల ప్రోవు. చక్కదనంపు దీవి. ఆమె తండ్రిమాటవిని తప్పక వజ్రపాణి చేయి పట్టును. వజ్రపాణికి శచీదేవియుం బోలె నీవజ్రపాణి కీమె యిల్లాలై పేరుప్రతిష్ఠలగాంచి జయంతునిబోలు నందనుంగని చిరంజీవినియై వర్ధిల్లుగాక యని దీవించుచున్నాడ. నాయాశీర్వచన మమోఘమగుగాక! దివ్యులు ప్రసన్నులగుదురుగాక! చిత్రభానుడా! ఏమి యిది నీకిష్టమేకదా?" అన నతడు—"సందేహము లేదు. అట్లె జరుగుగాక!" యనెను. "అట్లయిన మీరీ యగ్నిసాక్షిగా నాయెదుట ప్రమాణములు సేయుడు" అని రుద్రభట్టానతిచ్చి ఋగ్వేదములోని యగ్ని సూక్తమంత్రము బఠించి యగ్ని కభిముఖుడై యుండెను. చిత్రభానుడు లేచి యగ్నికి ప్రదక్షిణము జేసి—"ఓ యగ్నిదేవా! నీవు సాక్షిగ మణిమాలికను విజయసేనునకు భార్యగా జేసెద, కర్పూర మంజరిని వజ్రపాణికి వివాహము చేసెద" అని నమస్కరించెను. అనంతరము దండపాణి లేచి వహ్నికి ప్రదక్షిణము చేసి—"నేను సుఖ

దుఃఖములయందు నాప్రాణములకయిన నాసపడక చిత్రభానుని పక్షమున నుండెద. ఓ యగ్నిదేవా! నీవిందుకు సాక్షివి!" అని ప్రమాణము చేసెను. వజ్రపాణియు నట్లు చేసినయట్లే ప్రత్యక్షము ప్రమాణము గావించెను. అనంతరము వారిరువురు చిత్రభానునకు నమస్కరించి గృహముల కరిగిరి. "వలలో బెద్దచేపలు పడినవి. ఇక విజయమున కాటంకము లేదు. ఇక నిర్భయముగ నిద్రబోవచ్చును" అని రుద్రభట్టు చిత్రభానుని బహూకరించి పంపెను.

# ఎనిమిదవ ప్రకరణము

ఇట్లు మాధవసేనుడు చిత్రభానునకు దన సందేశ మొసగించి యాతని వీడ్కొని మణివర్మ కడకుబోయి తాను వానికి సందేశ మెరిగించుటయు నతడు తన్ను దూలనాడుటయు రాజశాసనము దిరస్కరించుటయు లోనగు వృత్తాంత మంతయు నొక్క యక్షరమైన విడువకుండ జెప్పెను. సందేశఫల మట్లేయుండునని యిదివరకే మనం బున నూహించుటంజేసి మణివర్మ వాని పలుకులు విని విస్మయము నొందలేదు. కాని యటమీది కర్తవ్యమేమియని అతడు విచారింప దొడగెను. "మాధవసేనుడా! దండపాణియొక్కయు, వజ్రపాణియొక్కయు బలము జూచుకొని మనయెడ నిట్టి తిరస్కారభావము జూపియుండునా, లేక మామయైన విదగ్ధరాజువలన సహాయము నపేక్షించి యిట్లు తూలనాడియుండునా? ఏమని నీవూహించెదవు?" అని యడిగెను. "ఉభయుల ప్రాపు గూడ జూచుకొని యతడిట్లు పరుషప్రలాపములు నోట వెడలనిచ్చెను. అందు ముఖ్యముగ నిక్కడి వారిబలము జూచుకొనియె. యతడు నిర్భయముగ నున్నాడు. అట్టి ప్రాపు లేనియెడల రాజశాసనము ధిక్కరించుటకు వాడెంతవాడు? పట్టుమని చూచితిమా పదిమంది సైనికులు లేరు, కావలసిన విత్తము

లేదు. పలుకుబడి యంతకుముందే సున్న. అట్టివానికి ధైర్య మెక్కడి నుండి వచ్చును? ఏదో దృఢమైన మూలకారణ ముండియుండవలయు" నని పెద్దమంత్రికి జిన్నమంత్రి యుత్తర మిచ్చెను. "సరే! ఈవార్త రాజమాతకు మన చిన్నరాజునకు నెరిగించి వారి యభిప్రాయమేమో తెలిసికొని మనము చేయవలసిన యుపదేశముచేసి కర్తవ్య మిదమిత్థ మని నిర్ణయింతము. శంఖమున బోసినంగాని తీర్థము గాదుకదా! ఏకార్యమునకైన రాజశాసనము ప్రధానముగదా? పదపద! అక్కడికే పోవుదము" అని యిరువురు కాచనగరునకుం జని యరవిందాదేవిని గనుంగొనిరి. అప్పుడు మాధవసేనుడు తనకుం జిత్రభానునకు జరిగిన సంభాషణమంతయు వరుసగా నామెకు దెలిపెను. విక్రమసేనుడు తెల్లబోయి మంత్రులవైపు జూచెను. అరవిందాదేవి హృదయము చెదరినట్లు ముఖవైఖరి తెలియజేసి—"అట్లయిన మనకు మరల దుర్దినములు సంభవించినవా? యని యామె హీనస్వరముతో బలికెను. "సైన్యమును బంపి అతని నేల వెడలగొట్టగూడదు?" అని విక్రమసేనుడు బలికెను. "అదియే మేమును జేయదలచుచున్నాము. కాని సేనాపతుల రాజభక్తి స్థిరముగా నున్నదో యూగులాడుచున్నదో తెలిసికొనుట కష్టముగా నున్నది" యని మణివర్మ పలికెను. "వారింతలో నంత కృతఘ్ను లగుదురా?" యని యరవింద వచియించెను. "నాకనుమానముగా నున్నది. అది యిప్పుడే నిశ్చయింప వలయును. కావున మనము ముందుగా గదాధరుని శూలపాణిని బిలిపించి వారి మనసెట్లున్నదో కనుగొందము" అని మణివర్మ వాక్రుచ్చెను. "అట్లకాక!" యని నమ్మికగల బంటు నొక్కని బిలిచి విక్రమసేనుడా దండనాథుల నిరువుర బిలుచుకొనిరమ్మని పంచెను. వాడు నతిత్వరితముగ నరిగి యా చమూపతులం దోడ్కొని వచ్చె. వారిని సముచిత సత్కారములం గారవించి మణివర్మ సుఖాసీనులంజేసి హేమచంద్రుడు చిత్రభానుని గుణములంరోసి దేశమునుండి వెడలనడచుట మొదలు నాటివరకు జరిగిన యావద్వృత్తాంతము మరల వారికి జ్ఞాపకముచేసి యిట్లనియె—

"మిత్రులారా! రాజ్యమున కావశ్యకములైన సప్తాంగములలో సైన్యకోశములు ప్రధానములు. సైన్యమున్నగాని రాజ్యలక్ష్మి నిలువజాలదు. కోశము సమృద్ధిగా నుండినంగాని సైన్యము తనధర్మము తాను చేయదు. కాశ్మీర రాజ్యమునకు వలసినంత కోశసమృద్ధి యున్నది. సైన్యమును మీవంటి సేనాపతులుండుటచే సర్వలక్షణ సంపన్నమై సమర్థమై యున్నది. కాని రాజ్యమునకు వెండియు చిత్రభానునివలన గొన్ని కీడులు సంభవించునని తోచుచున్నది. ఒక్క కడుపునబుట్టి యొక్కచో బెరిగి యొక్క మంచమునం బవ్వళించి యొక కంచమునం గుడిచిన హేమచంద్రుడే యతనిని నమ్మజాలక గాఢమైన యనుమానముమీద దేశమునం దుండదగనివాడని వెడల నడచెనుగదా! హేమచంద్రుని మరణమునుగూర్చి యెట్టి వాదములున్నవో మీరే యెరుగుదురు. చిత్రభానుని చరిత్ర మొకనాటకముగా నున్నది. ఎవడో హరిశర్మ యనువాడు వచ్చి ప్రయాగలో చిత్రభానుడు మిక్కిలి దీనముగా మరణమొందెనని మాయమాటలు చెప్పి మహారాజుగారి మనస్సు కలచెను. ఆ మనఃక్షోభముచేతనే యాయన వికలచిత్తుడై హరిశర్మ చేతిబొమ్మయై యాడి మరణము దెచ్చికొనెను. చిత్రభానుడు సజీవుడై రావలె నున్నాడు. చుట్టరికము వంకబెట్టి తన యన్నబిడ్డలయందలి ప్రేమరసమెల్ల నిక్కడ వర్షించుటకు మరల వచ్చెను. వీరిం బరామర్శించి వెడలిపోవుదునని చెప్పెగదా! పిమ్మట నాలుబిడ్డలం దెచ్చె. పురమువిడిచి పోవలసినదని సందేశ మంప రాజమాతగారొక్కయు, రాజొక్కయు శాసనము నిరాకరించి సందేశముం గొనిపోయిన మాధవసేనుని దృణీకరించి తూలనాడెను. అతడు నగరమునందుండుట రాజకుటుంబమునకు రాజ్యమునకు నపథ్యము. అతని నెట్లయిన వెడలనడుపవలయును. కావున మీరందరు నవసరమైన పక్షమున సైన్యములతో నాతనియిల్లు ముట్టడించి వానిని దేశమునుండి యావలకి బంపవలయును. కరుకుదన మెక్కుడైన మనము చురుకుదనము నెరపి వానిని బంధింపవలయును.

బంధింపవలె ననేల? అవసరమగు నేని శిరచ్ఛేదము జేయవలయు. ఇంత కఠినముగా బలికితినని మీరు నొచ్చుకొనవలదు. మంత్రులు వైద్యులవంటివారు. వైద్యుడు దయాళుడయ్యు నిష్కరుణముగా వ్రణమును ఛేదించునట్లు మంత్రులు రాజద్రోహులను నిర్దయాత్ములై దండింపవలయు. ఇవియెల్ల నేను మీకు జెప్పవలసినవికావు. ఇదిగో మీరాజు! అదిగో అతని తమ్ముడు. అదే హేమచంద్ర మహారాజ పట్టమహిషి. వారిని ముగ్గురను మాకు మీకు మీసైన్యమునకు నప్పగించి హేమచంద్ర మహారాజు స్వర్గస్థుడయ్యెను. మీరు రాజభక్తి జూపవలసిన సమయమిది. మీచిత్తనైర్మల్యము ప్రకటింప వలసిన తరుణమిది. మీయున్నతాభావముల వెల్లడింపవలసిన యవసరమిది. రాజ్యలక్ష్మిని గాపాడవలసిన యదనిది. కావున మీరు మృతుడైన హేమచంద్రుని దలంచి రక్షణీయమైన రాజ్యలక్ష్మిని దలంచి, బాలుడై యేమియు నెరుంగకయున్న రాజు మొగము జూచి నవవైధవ్య దుఃఖభార వినమ్రమైన దేవిమొగముజూచి, భగవంతుని మొగముజూచి, మోమోటమువిడిచి చిత్రభానుని మాయలోబడక అతని నెడలనడచుటకు సర్వప్రయత్నములను జేయవలయు. దండపాణి వజ్రపాణుల వైఖరి వేరుతెరంగుగా నున్నదని యనుమానము గలుగుచున్నది. అయిన నట్లు నిశ్చయముగా జెప్పజాల. ఇది మీకు సమ్మతమగునో కాదో చెప్పుడు. మనసులో నొకటి పెట్టుకొని పైకొకటి చెప్పవలదు."

అప్పలుకులు గదాధర శూలపాణుల హృదయంబులం గదలించుటంజేసి వారుత్సాహపూరితులై రాజభక్తి ప్రేరితులైరి. గదాధరు డిట్లనియె-"మహాత్మా! సైన్యము రాజ్యలక్ష్మికి నంగరక్షక బలము. అది సమర్థమై యుండదేని రాజ్యలక్ష్మి యచిరకాలంబున బరహస్తగతయై నశియించు. ఇంతవరకు గాశ్మీర సైన్యంబులు సమర్థంబులై శత్రుదుర్భేద్యములై పరచక్ర భయంకరములై యున్నయవి. దండపాణియు హేమచంద్రునియెడ భక్తితత్పరుడై యుండెను.

ఆతని మనస్సు వాని తిమ్మని మనస్సు మారుటకు దగిన కారణములు నాకగపడవు. అయినను దగిన కారణము లుండినంగాని మీరు వారిచరిత్ర మనుమానాస్పదమని పల్కిరు. వారెట్లయిన నగుదురు గాక! నామాట చిత్తగింపుము. ఈ లోకమున నెవడైన హేమచంద్ర మహారాజునెడ గాశ్మీర రాజవంశమునెడ నాజన్మాంతము కృతజ్ఞుడై యుండవలయునేని నిశ్చయముగ నట్టివాడు గదాధరుడే. గదాధరుని జీవనమంతయు గాశ్మీరరాజుల ద్రవ్యమే. రక్తమంతయు గాశ్మీర రాజుల ప్రేమరసమే. అట్టి గదాధరుడు కృతఘ్నుడగునేని నింక ప్రపంచమున గృతజ్ఞత యనుమాట లేదనవచ్చును. నాపూర్వవు వృత్తాంతము నిమ్మహాదేవియు నీచిన్నరాజు నెరుంగక పోవచ్చును. గాని సంపూర్ణముగ మీరెరుంగుదురు. నేనొక రాచబిడ్డడను. హిమాలయ పర్వత ప్రాంతమున నొక కొండపల్లియ మాయునికిపట్టు. మాతండ్రి కృషీవలుడు. నాజననీ జనకులకు నేనొక్కడనే పుత్రుడను. మందభాగ్యుడనైన నేనుదయించిననాడే నాతల్లి భూలోకమును బాసి పరమపదము నొందెను. నిరుపేదయైన నాతండ్రి నాకుం దల్లియై పురిటి మంచమెక్కి యుగ్గుపాలుబోసి పెంచి మిక్కిలి కష్టపడి నన్నుం బదియేండ్లవానింజేసెను. ఆపదల కదృష్టహీనులు పరమ బంధువులు. నాతండ్రి నాపదియవయేట నన్నును దనకు నితరులకుగూడ భారముగ నున్న తన శరీరమును విడిచి పరలోకమునకైన సుఖము కలుగక పోవునా యని యచ్చటికి జనెను. అప్పుడు చేయునది లేక నేను కొన్ని దినంబులు చుట్టములయింట నిరుగుపొరుగువాండ్రయింట గాలక్షేపము జేసి వారిచే దిరస్కృతుడనై కట్టగుడ్డ లేక నిలువనీడ లేక తినుట కన్నము లేక యాదరించుట కొప్పులు లేక నాది యని చెప్పందగిన పదార్థము లేక పొట్టజరుగుట కుపాయముగానక మాధుకర వృత్తిచేత భిక్షాటనముచేత నొక పూట తిన్నట్లు నొక పూట తిననట్లు గొన్ని ప్రొద్దులుపుచ్చి విసిగి దుండగులగు బాలకుల గొందరం గలిసి చిన్న చిన్న దొంగతనము లారంభించితిని. క్రమక్రమముగా నందారితేరి

పదియేనేండ్ల ప్రాయమున బందిపోటుల జట్టులో గలసితిని. హేమచంద్ర మహారాజుతండ్రి విక్రమసేన నృపాలుడు కాశ్మీరమును బాలించుచు దేశసేవ మరయుటకై మంచుకొండ దాపుననున్న ప్రాంతముల కొకసారి వచ్చెను. ఆ ప్రాంతమున వసియించు జనులు—"దురాచారులగు చోరుల బారినుండి తమ్ము రక్షింపుము" ని యా నరేంద్రుని వేడ నత డక్కడ గొన్నిదినములుండి సైనికులచేత బందిపోటుల వెతకించి పట్టించి వారిలో నెక్కుండ్రకు దగిన దండనల విధించి నన్ను జూచి యిట్లనియెను—"ఓరీ ! నీది లేత ప్రాయము: ఆకారమును జూడ సద్వంశజాతుడవని తోచుచున్నది. మొగము విలాసమును గక్కుచున్నది. నీ తెలివితేటలు, నీసాహసము, నీబాహుబలము మంచిదారి నుపయోగించిన లోకమున కెంతో మేలగు. నీవు నీవృత్తిమాని వెనుకటి కార్యములకై పశ్చాత్తాపమునొంది సన్మార్గమున సంచరింతువేని నీభవిష్యచ్చరిత్రము శ్లాఘాపాత్రమగును. ఈ తలంపుల విడువుము. నా వెంట రమ్ము" అని దయార్ద్రహృదయుడై పలికిన యా నరపాలుని వాక్యములు నా చెవులలో నిప్పుడును ధ్వనించుచున్నట్లున్నవి. కరుణారస పరిపూర్ణములైన యాయన చల్లని చూడ్కులు నామీాద నిప్పుడు ప్రసరించుచున్నట్లున్నవి. శాంతరస మొలుకు నామహాత్ముని మూర్తి యిప్పుడు నాకన్నుల గట్టినట్లున్నది. ఆయన వాక్యామృతము నాశ్రవణముల బడినతోడనే నా మనో మాలిన్యము నీటం గడిగిన తెరంగున దొలగిపోయెను. మనస్సు నిష్కలుషమయ్యెను. పశ్చాత్తాప మహాగ్నిచే బాపపటలము భస్మమయ్యెను. ప్రాతయాకు లూడిపోయిన చెట్టువలె గుబుసమూడ్చిన త్రాచువలె నామనస్సుడు స్వచ్ఛమైయుండెను. వెంటనే నే నా మహాత్ముని పాదములపై బడి—"దేవా ! నాతప్పులు క్షమింపుడు. నేను మహాపరాధిని. దండ్యుడను. మీాదండనలకన్న మీాహితోపదేశమే నాకు గొప్ప శిక్షయై నన్ను శుద్ధునిం జేసెను. పశ్చాత్తాప మహాగ్ని నాహృదయము గాల్చుచున్నది. ఇక నే సన్మార్గమున

సంచరించెద. ఇక నన్ననుగ్రహింపుము" అని వలవలనేడ్చి యారాజశేఖరుని పాద రాజీవముల నాబాష్పధారలచే నభిషేకించితిని. భూమండలాఖండలుడగు నప్పుడమిఱేడు నన్ను స్వయముగా దన చేతులతో నెత్తి—"వగవకు. బాగుపడియెదవ" ని ధైర్యముచెప్పి చేతితో వీపు దట్టి నన్ను స్నానము చేయింపుమనియు నూతన వస్త్రములను గట్టింపుమనియు సేవకుల కానతిచ్చెను. వారట్లుచేసిరి. అప్పుడు నేను క్రొత్త మనుష్యుడనయితిని. నామనోవృక్షమున గ్రొత్త తలపులను చివుళ్ళు మొలకలెత్తసాగెను. మహారాజుగారితో నేను రాజధానికివచ్చి విద్యాభ్యాసము జేయనారంభించితిని. నేను మిక్కిలిశ్రద్ధగా జదివి గురువుల యనుగ్రహమునకు బాత్రమునైతిని. ఎప్పటి కప్పుడు మహారాజుగారు నావర్తనముగూర్చియు నావిద్యాభివృద్ధినిగూర్చియు గురువుల నడిగి తెలిసికొనుచు వచ్చిరి. సామాన్య విద్యతోబాటు ధనుర్విద్యయు నేర్చితిని. అందనేక బహుమానములు వడసితిని. గురువులయు సహపాఠులయు మెప్పుగాంచితిని. అంతలోన మహారాజు పరమపదము నందెను. హేమచంద్ర మహారాజు రాజ్యాభిషిక్తుడయ్యెను. పితృభక్తిని హేమచంద్రుడు రామచంద్రుడు. సత్యభాషణమున హేమచంద్రుడు హరిశ్చంద్రుడు. ప్రసన్నభావమున హేమచంద్రుడు శరచ్చంద్రుడు. ఆ తండ్రికిం దగిన కొడుకుగావున దండ్రిచే గారామున బెంపబడిన నన్ను మిక్కిలి కనికరంబునం గని యమ్మహారాజు మరణంబువలన దుఃఖితుడనైన నన్ను నోదార్చి కొంతసేన కధిపతింజేసి వివాహముజేసి నన్నొక యింటివానిం జేసెను. ఆ మహాత్ముని దయవలన గౌరవ మార్జించితిని. ధనమార్జించితిని. సంతానవంతుడ నయితిని. గృహారామ క్షేత్రముల సంపాదించితిని. మిత్రుల పొగడ్తలకు చుట్టముల యాదరణకు లోకుల మన్ననకు నాస్వామి యనుగ్రహమునకు బెద్దల దీవనలకు భాజనమైతిని. ఉదయమున లేచి హేమచంద్రుని పేరుదలచి విక్రమసేనుని నామము దలచి మ్రొక్కులిడుదును. నేవసించు గృహము వారిది. తినెడి

యున్నము వారిది. కట్టుబట్ట వారిది. నాచర్మముగోసి పాదరక్షలుగ గుట్టి యా మహాత్మున కిచ్చినను నాఋణముతీరదు. వారు పసిబాగును దెచ్చి మానికము జేసిరి వత్తిగుల్లను ముత్తెము జేసిరి. ఇత్తడి పుత్తడి జేసిరి. పశువును మానిసిం జేసిరి. ఇంతకన్న మహోపకార మెవ్వరు చేయుగలరు ? ఇట్టి నేను గాశ్మీర రాజులయెడ కృతఘ్నుడ నగుదునేని—ఛీ! నాజన్మమేల ? జంతువులకు యిన కృతజ్ఞత గలదు. పరమనీచమైన కుక్క. పిడికెడన్నము పైచిన పదివేలయేండ్లు మరువదు, వృక్షముల సైతము తమకు జిన్ననాడు నీరుపోసి పెంచిన మనుష్యులకు బ్రతికి యున్నంతకాలము నీడనిచ్చును. కాయలిచ్చును. ఆకు లిచ్చును, పండ్లనిచ్చును. చచ్చియు వారి కనేకవిధముల నుపక రించును. క్షుద్రజంతువులు, స్థావరములయిన మట్లే కృతజ్ఞత గలిగి యుండ నీశ్వరాంశ సంభూతుడై జ్ఞానేంద్రియ వ్యాపారము గర్మేంద్రియ వ్యాపారము గలిగి విద్యాసంపన్నుడైన మానుష్యుడు కృతజ్ఞుడగుట యాశ్చర్యమా ? అది లేనివాడు వానరుడుగాని నరుడు గాడు. కావున నో మహాదేవీ ! యో రాజా ! యో యమాత్యులారా ! ఈ గదాధరుడు రాజకుటుంబమునకు రాజ్యమునకు క్షేమకరముగునట్లు వర్తించును. రాజా ! బాలుడవయినను రాజవగుటచే మాకు బూజ్యుడవు. అందుచే మీపాదములపై నేను ప్రమాణము చేసెద " అని మహోత్సాహముతో బలికి రాజకుమారుని పాదములు స్పృశియించి ప్రమాణముచేసి రాజభక్తి బ్రకటించెను. అంతకు ముందు నిరుత్సాహముచే గ్రుంగియున్న రాజమాత్య విక్రమసేనుల మనస్సులు నూతనోత్సాహ భరితము లగుటయు వారి మొగములు వికాసవంతము లయ్యెను.

అంతట మణివర్మ—" గదాధరా ! నీవృత్తాంతము గొంత నేనెరుగుదును. నీనడత నీమాటలకు విస్పష్ట వ్యాఖ్యానముగానున్నది. ఉప్పునీరు మంచినీరుగా మారినట్లు ఎండ కాలవిశేషముచే వెన్నెల యైనట్లు దురాచారుడవు పరమసాధువైతివి. నాటనుండియు

నీచరిత్రము శ్లాఘాపాత్రమై యున్నది. మేము నిన్ను నమ్ముకొని యుండెదము. శూలపాణీ! నీయభిమతమేమో చెప్పుము?" అని యడిగెను.

అనవుడు శూలపాణి యిట్లనియె—"మహాత్మా! చెప్పుట కేమున్నది? కుత్తుకలో విసము బెట్టుకొన్నవాఁడు సైతము రాజు నెదుట విపరీతముగా బలుకునా? తేనెతేట లూడిపడునట్లు పలుకును. నా నడతయే నా భావమును వెల్లడింపవలెను. పలుపలుకు లేల? నేను గదాధరుఁడు క్రోడివాఁడనే అతని మనస్సు నా మనస్సు నొక్కటియె. అవసరము గుఱించి మే మిరువురము మా ప్రాణములను మాచిన్ని రాజునిమిత్తమై సమర్పించెదము. మా శిరస్సులు రాజ్యలక్ష్మికి గానుకగా నిచ్చెదము. ఇంతకన్న వేఱు చెప్పవలసినది లేదు. దండపాణిని వజ్రపాణిని గూడ బిలిపించి వీరిద్దఱియెదుట వారి మనోగతము నరయుము. మాటలంబట్టియు ముఖలక్షణములంబట్టియు వారి భావ మెరుఁగ వచ్చును. ఈవఁగ మీరు వారితో మాటలాడియుండుట వేఱు. రాజు నెదుట బలికించుట వేఱు."

"అది లెస్సయైనపని" యని మాధవసేనుఁడు హెచ్చరించెను. "వారు రాకుండనే మాకు ముందుగా సెలవియ్యదగును" అని గదాధరుఁడు వెండియు నిట్లనియె—"ఈసితిగతులలో నామనవి యొకటి వినుఁడిఁక. వెంటనే చిత్రభానుని వెడలగొట్టుటకు మనము ససైన్యముగా వాని యిల్లు ముట్టడించుట కర్జముగాదు. వారి చేష్టలు మనము కనిపెట్టుచుందుము. మీరిక్కడికి వచ్చినవెంటనే మేము వానిం దాకుదుము. రేపు మాపు వచ్చిన తొందరలేదు. నాకిపుడు సెలవొసంగుడు. పోయి వచ్చెదను" అని యందర వీడ్కొని శూలపాణి సహితుండై వెడలెను. మరియొక పరిచారకుం బిలిచి దేవి దండపాణిని వజ్రపాణిని దోడితెమ్మని బనిచెను. వాఁడతివేగమున వారి సదనముల కరిగి రాజశాసన మెరిగించెను. "నీవు ముందు నడువుము, మేము వెనుక వచ్చెదము" అని వారిరువురు నొక ముహూర్తము తమలో

తాము రహస్యముగ మాటలాడుకొని సేవకు డరిగిన యొక గడియ లోనే రాచనగరు జొచ్చిరి. మనో మాలిన్యము పైకి దోచినో యున్నట్లు మొగములు తొంటియట్లుండక వికాసశూన్యములై యుండెను. మణివర్మ వారినిగూడ సబహుమానముగా గౌరవించి యుచితాసనంబులం గూర్చుండ బనిచి మెల్లగ నిట్లనియె— "ఇదివరకు నేను మీతో జిత్రభానుని విషయమై ప్రసంగించినను మన రాజుగారు గూడ దద్విషయమున మీయభిప్రాయమును స్వయముగా దెలిసికొన గోరి మాల్యశాసనమున మిమ్ము రావించిరి. మీహృదయ మకలంక మని నేనెరుగుదును. అదియే రాజుగారు మీనోట వినగోరుచున్నారు. చిత్రభానుడు పురమునుండి వెడలవలయునా లేదా! తనయంతట దాను వెడలకున్న మీరాతని సైన్యసహాయమున దేశమునుండి ద్రోలవలయునని మన మహారాజుగారి యాశయము. దండాధినాథు లగుటచే నీకార్యభారము మీపై బడియున్నది." ఆ వచనంబులువిని దండపాణి మొగము చిట్లించుకొని యిత్తెరంగున బలుకజొచ్చె— "అయ్యా! మున్నొకసారి మీరీవిషయము నన్నడిగిరి అప్పుడు నాకుం దోచిన తెరంగున మీకుత్తరమిచ్చితిని. చిత్రభానుడు పురము వెడలిపోవలయునో లేదో నిర్ణయింపవలసినవారు రాజుగారును మంత్రులైన మీరునుగాని మేముగాము. కార్యనిశ్చయము మీరు చేసిన వెనుక మీయాజ్ఞప్రకారము దళములగొని శత్రుమర్దనము చేయుట మాపని. అదియునుగాక మాటిమాటికి మిమ్ముం బిలిచి మాయభిప్రాయ మడుగుటకు మేము రాజద్రోహులమా! కుట్రలు పన్నుచున్నామా? మాకుమాత్రము గౌరవము లేదా? ఇట్లవమానించుట మీకు దగునా?" యని కఠిన స్వరముతో బలుకుచున్న యా దండపాణి మాట కడ్డముపోయి విక్రమసేనుడు— "అయ్యా! దండపాణీ! మీరు రాజద్రోహులని యెవరన్నారు? మీరు కుట్రలు పన్నుచున్నారని యెవరు పలికిరి? రాజకార్య విషయములను సమాలోచించుటకు మిమ్ము బిలువనంపుట మిమ్మవమానించుటా?

మణివర్మ యాడిన మాటలలో దోషమేమున్నది ? మీకింత రోషము నకు గారణమేమి ? రాజ్యక్షేమము జూడవలసినవారు మంత్రులు దండనాథులుగదా ! రెండుచెట్లు కొమ్మ లొండొంటితో రాపాడి నిప్పుబుట్టించి వనమెల్ల గాల్చునట్లు ప్రధానపురుషులగు మీరు పరస్పర వివాదములుగలిగి రాజకులమున కాపద వాటింప జేయుదురా ! ఇదిధర్మమా కౄరకర్మమా !" అని గంభీరముగా పలికెను. అడుగు టయు దండపాణి మొదటికన్న గొంచెము శాంతించి దన చిన్న ప్రభువున కిట్లనియె—" రాజా ! మణివర్మ వైఖరిజూడ మాయెడ ననుమానము బూనినట్లు దోచుచున్నది. మేమనుమానింపవలసిన వారముగాము. ఈవరకు రెండుసారులు మమ్మితడీవిషయమున ప్రశ్నించుటంజేసి యాత్మగౌరవము గలవారముగుటచే మాకించుక కష్టముగా నున్నది. అందుచే నట్లనవలసివచ్చె. అంతేగాని దేవరవారి యెడ మాకెట్టి దురభిప్రాయములేదు. మేమెట్టి ద్రోహము దలచు కొనలేదు. మీయాజ్ఞకు బద్ధులము. మీకనుపన్నల మెలగెదము. మీ మదలయగునేని యెట్టిపనియైన జేయగలవారము. కావున మాయందు సంపూర్ణ విశ్వాసము నిలుపవలయునని ప్రార్థించు చున్నాము " అనవుడు మణివర్మ—" నావైఖరింబట్టి మీకాగ్రహము గలిగినదా ? మీకవమానము గలిగింపవలెనని నేగలనైన దలపలేదు. నామాటలలోగాని భావములోగాని నాముఖలక్షణములోగాని మీకవమానకరములైన చిన్నలేవియు లేవు. ఒకవేళ మీకట్లు తోచిన పక్షమున నేను వయోవృద్ధుడను చంచలస్వభావుడను గావున నన్ను క్షమియించి రాజకార్యమును జక్కజేయుడు. మనకు వివాదము లున్నపక్షమున బిమ్మట దీర్చికొనవచ్చునని " యనునయ పూర్వక ముగా బలికెను. అంతట వారు రాజును మంత్రులను వీడ్కొని స్వగృహముల కరిగిరి.

వారు వెడలిన పిదప మాధవసేనుడు మణివర్మతో—" జిత్త గించితిరా వాని మాటల వరుస ? వారి నీడలుచూచి వారే భయపడు

చున్నారు. అంతఃకరణము మలినమైనప్పుడు మానవుని కెదుటివారి మనస్సులుకూడ మలినములైనట్లు కనబడును. శాంబిలరోగికి జగమంతయు పచ్చగా కనబడును గదా? చూచితిరా! గదాధరుని మాటలకు వీనిమాటలకు నెంత వ్యత్యాసమున్నదో! అతని రాజభక్తి హృదయమునుండి వెల్లివిరిసినది వీని భక్తి జిహ్వాగ్రమునుండి వచ్చినది. కావున వీనిని విశ్వసించియుండుట శ్రేయస్కరముగాదు" అని వచియించెను "నీవు యథార్థము వచించితివి దోషాత్ములకు లేనిచోట ననుమానము గలుగును" అని మణివర్మ వానికుత్తరమిచ్చెను. విక్రమసేనుడు చిరునవ్వు నవ్వి—"ఉన్నమాటన్న నులుకెక్కువన్నట్లు దండపాణికి నిర్వ్యాజమైన యాగ్రహమువచ్చినది. మనము వీనివిషయమున జాగ్రత్తగా నుండవలెన"ని పలికెను. మీరిద్దరు గదాధర శూలపాణులు నను నాలుగు స్తంభములమీద నిప్పుడు కాశ్మీర రాజ్య సౌధము నిలిచియున్నది. దండపాణి రాజభక్తి మలినమైనదో శుద్ధమైనదో సమయమను గీటురాతిమీద గాని తెలియదు ఇంక మీరు మీపనులమీద నుండుడు" యని యరవిందాదేవి పలికి వారికి సెలవిచ్చెను.

## తొమ్మిదవ ప్రకరణము

రాచనగరమునుండి వెడలి దండపాణియు సోదరుడును స్వగృహంబులకు జనక యారేయి నెండియు చిత్రభానుని గృహంబున కరిగి రాజగృహంబున నాడు జరిగిన వృత్తాంత మంతయు దెలిపిరి. చిత్రభానుడు తన యెడ వారికిగల యమితానురాగమునకు సంతసించి కొండొకవడి పొగడి యిట్లనియె—"మిత్రులారా! అయస్కాంతమునకు సూదికింబలె నాకును మీకును గాఢసంబంధము కుదిరినందుకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. మీ చెవిని బడిన చిన్నమాటయు దాచక నాకు వెంటనే తెలియజేయవలెనని మీరు సంకల్పించుట

మన కార్యసిద్ధికి సూచకము. ముందుగా వారే కలహమునకు ఢీకొను నట్లు మనము చేయవలయునుగాని మనము దిగఁగూడదు. అందుచే నీలోపున సైనికుల విషయమున మీరు వ్రాసిన ప్రయత్నము చేయుచుండుము" అనుచుండ రుద్రభట్టు—"కీలకమంత్రియు సైన్యములోనే యున్నది. దానిం గలచుట కనేక ప్రయత్నములు గావలయు. కొంత యత్నము మేముగూడ జేయుచున్నాము. అది యిక మీఁద గాల క్రమమున మీకు దెలియఁగలదు" అని పలికెను. అనంతరము కొంత సంభాషణము జరిగిన వెనుక దండపాణి యిట్లనియె—"మా కొక్క-కోరిక యున్నది. అది మీయిరువుర సన్నిధానమున విన్నవింప దలచుచున్నాము. కర్పూరమంజరిని మా వజ్రపాణికిచ్చి వివాహము చేయుటకు మీరంగీకరించిరి గనుకను, మా మణిమాలికను విజయసేనునకు బెండ్లి చేసికొనుటకు మీరిష్టపడిరి గావునను నీ రెండు కార్యములను బ్రధానము చేసికొనవలెనని మేము బలాట బడుచున్నాము. మా ముద్దు చెల్లించి యీ కార్యము చేయవలయు"

అప్పలుకులలో మొదటి భాగము చిత్రభానునకు రుచింపలేదు. ఏలయన గుణముల పేటికయైన కర్పూరమంజరి వజ్రపాణిని వరించునో వరింపదో చిత్రభాను డెరుఁగఁడు. ఇంతకుమున్నామెతో నాప్రసంగము చేయనేలేదు. రెండవ భాగమైన మణిమాలికా వివాహము చిత్రభానున కిష్టమే, ఆ విషయమై ప్రధానము చేసికొమ్మన్నను నతఁడు చేసికొనుటకు సిద్ధముగ నుండెను. ఒకటిచేసి రెండవది మానినపక్షమున వారి కనుమానము కలుగవచ్చును. చేసిన రెండును జేయవలయు; మానిన రెండును మానవలయు. చిత్రభానున కప్పుడు విషమ పరిస్థితులు తటస్థించెను. తాము తలపెట్టిన కార్యములన్నియు ముగిసిన పిదప ప్రధానములు చేయవచ్చునని చెప్పినచో వారికి విశ్వాసముండ దని భయము. అందుచే నెద్దియుం దోచక యతఁడు వెంటనే యుత్తర మీయక మనోవేదనము బడుచుండ వాని చేష్టలం బట్టి మనోగత భావ మెరిగి రుద్రభట్టు దండపాణి కిట్లనియె—"దండపాణీ! నీసంకల్పము

మంచిది. 'శుభస్య శీఘ్రమ్మ' ను నార్యోక్తినిబట్టియు, 'నాలస్య మమృతం విషమ్మ' ను న్యాయమునుబట్టియు నిట్టివి వెంటనే జరుగుట మంచిది. కాని యవి క్రొత్తవారి విషయమునగాని మీవంటి పూర్వ పరిచితుల విషయమునగావు. మాటయే ప్రధానముగాని మానవంతులకు బ్రధానము ప్రధానముగాదు. పసుపుం గుంకుమ పండ్లుదెచ్చి యొండొరులకిచ్చి పుచ్చుకొనుటచేత ననుకొన్న మాటలు స్థిరమగునా? కానిచో గార్యములు భగ్నమగునా? అగ్నిసాక్షిగ జేసిన ప్రమాణములకన్న బ్రధానములు బలవత్తరములా? ఇదియొక ముచ్చట. అదియు నాడువారి ముచ్చట. మగవాండ్రు దానింగూర్చి యంత పట్టింపులు బట్టగూడదు. కాబట్టి కాలాంతరమున నన్ని ముచ్చటలు దీర్చికొనవచ్చును. ఇది విషమ సమయము. తాంబూలములు పుచ్చుకొనుటకైన బదుగురు పెద్దమనుష్యులు వచ్చుటకు వీలులేని తరుణముగదా యిది! పదిమందిజేరి వెల్లడిగా జరుగవలసిన శుభకార్యము చాటున మాటున జేసికొనుట యేటితగవు? కావున సర్వవిధముల నిది కాలాంతరమున గావచ్చును. మీద మీయిష్టము."

అదివర కేమియు దోచక యేమి యుత్తరము జెప్పుదునా యని సందిగ్ధ మనస్కుడై యున్న చిత్రభానునకు రుద్రభట్టు పలుకులు ధైర్యము గొలిపెను. అప్పలుకు లూతగాగొని చిత్రభానుడు వారి నుద్దేశించి—"విజయసేను డెక్కడి కేగును? కర్పూరమంజరి ఎక్కడి కరుగును? ప్రధానములు కాకపోవు. వివాహములు గాకపోవు. వివాహము ప్రధానముగాని, ప్రధానము ప్రధానముగాదు. చంచల చిత్తులకు మాటనిలుకడ లేనివారికి బ్రధానముగాని మనకేల? ఈ మహాత్ముడు సెలవిచ్చినట్లు గాలాంతరమున గావచ్చున" ని పలుక వజ్రపాణి—"యిప్పుడు చేసికొని నందువలన దప్పేమి?" యని మెల్లగా బలికెను. "నామాట యెటులున్నను జిన్నవాడైన మాతమ్ముని కోర్కె దీర్చుట సర్వోత్తమము!" అని దండపాణి వాక్రుచ్చెను. వారు పట్టినపట్టు వదలకపోవుటచే సమయము

దాటించుటకు రుద్రభట్టు—"సరే! అట్లె యగుగాక! ప్రధానమునకైన మంచి ముహూర్త ముండవలయు. నేనా సుముహూర్తము బెట్టి మీకుం దెలియబరచెద. మీకిష్ట మేకద?" యని బలికెను. "ఆహా! మాకిష్టమే!" యని వారిరువురు సంతుష్టులై సెలవుగైకొని పోయిరి వారు వెడలిన పిదప రుద్రభట్టునకును చిత్రభానునకును నీక్రింది విధమున సంభాషణము జరిగెను.

చిత్రభాను—స్వామీ! నేనిప్పుడు పిశాచమునకు సముద్రమునకు నడుమ నున్నాడను. ముందరకువచ్చిన దయ్యము మ్రింగును. వెనుకకుబోయిన సముద్ర తరంగములు ముంచి చంపును.

రుద్రభట్టు—ఏమిట్లనుచున్నాడవు?

చిత్ర—వజ్రపాణికోరిక దుర్ఘటముగా నున్నది. కర్పూరమంజరి మనస్సు చందము నేనరయ లేదు. అది వీనిపై వలపు నిలుపునో లేదో తెలియదు. అది వీనిగూర్చి మేలుపడదేని పండబారిన పొల మెండ బారినట్లు కార్యమంతయు భగ్నమగును. వీరు ప్రధాన మిప్పుడే చేయవలె ననుచున్నారు.

రుద్ర—ఇందుకా యింత బెంగ? మానవుడు కష్టసమయముల యందే ధీరోదాత్తుడై, తన మనశ్శక్తిని జూపవలయు, తొందరపడక బెంగగొనక కలతనొందక నరుడు నిర్మలమగు తటాక జలమువలె ప్రవిమల మనస్కుడై యుండెనా యెంతెంత కష్టసమయములందును మబ్బులేని యాకసమున సూర్యోదయమైనట్లు చక్కని యుపాయములు తోచును.

చిత్ర—అది జితేంద్రియులగు మీకు సాధ్యముగాని మావంటి సంసారులకు సాధ్యముకాదు. కష్టసమయము రాగానే మనస్సు నిప్పుద్రొక్కిన కోతివలె చంచలమై యాలోచన కనర్హమై యుండును కావున నిప్పుడు నాకేమియు దోచకున్నది.

రుద్ర—నీకూతురు మనోరథమేమో తెలిసికొనకయే నీవింత కలతజెందనేల? ఆమె నీకోరిక నిరాకరింపకపోవచ్చును. ఆమె నడిగి

రమ్మ. కార్యము సఫలమయ్యెనా సరే! కాదేని నాటి కొక యుపాయ మూహింపజాలమా ?

చిత్ర—అట్లయిన నేనామె నడిగి వత్తునా ?

రుద్ర—ముందుగా నీవడుగుట యుక్తముకాదు. ఆడుబిడ్డలకు జిన్ననాటనుండి తల్లిదగ్గర చనవులు మెండు. కావున నామె మనోరథ మేమొ తల్లిచే నడిగింపుము.

చిత్ర—సిగ్గుపెంపున దల్లికి జెప్పని పక్షమున ?

రుద్ర—అంతకన్న నెక్కుడు మచ్చికయు జనవులుగలవారు చెలికత్తియలు. చంద్రికను, మల్లికను వేరువేరుగ బిలిచి రహస్యముగ నడుగుము. రాజపుత్రికల తలంపులకు చెలికత్తెలు దాపుడు బరిణలు.

చిత్ర—అట్లయిన నేను తద్విషయ ప్రయత్నమున నుండెద. ఇవి యన్నియు దేలినతరువాతనే మనము సుముహూర్తము మాట నాలోచింపవచ్చును.

రుద్ర—నీ కూతురు రాచనగరములో నున్నదికదా ? మీ నెయ్యము లంతకంత కెడమగుచున్నప్పుడు మీపుత్రిక శత్రుగృహమున నుండుట నీకును వారికిని శ్రేయముగాదు. వెంటనే బిలువనంపుము. పాము పగయు బడగ చుట్టము నగునా ?

చిత్ర—ఔను ! ఆమె నిటకు దోడితెచ్చుట యుభయులకు శ్రేయస్కరము. అట్లుచేసెద.

అని యాతని వీడ్కొని చిత్రభానుడు దీర్ఘాలోచనావశంబున మెల్లమెల్ల నడుగు లిడుకొనుచు నభ్యంతర మందిరమునకుం జని యిందుమణిం గాంచి—" కర్పూరమంజరిని వెంటనే పిలిపింపుము " ని యానతిచ్చెను. " అట్లకాక !" యని యామె చంద్రికా మల్లికల బిలిచి—" రాచనగరమున కరిగి బాలికం దోడితెమ్మ " ని సెలవిచ్చెను. సెలవిచ్చుటయు తడవుగా వారిరువురు నచ్చోటికిం జనిరి. ఆ లోపున నిందుమణితో జిత్రభానుడు గృహకృత్యంబులంగూర్చి కొంత

ముచ్చటించి కర్పూరమంజరి మాటయెత్తి ప్రసంగవశమున నిట్లనియె- “బాలిక వివాహ యోగ్యమగు వయస్సును బ్రాపించినది. ఇంక మన మాలసింపక వరాన్వేషణమునకు గడంగవలయు.”

ఇందుమణి—నానోటితో నేననకూడదుగాని దానిం జూచిన వారందరు నిది సర్వలక్షణ సంపన్నయగు కన్య. దీని కనుకూలుడగు వరుడు లభించుట కష్టమని పలుమారు నాతో ననిరి.

చిత్రభాను—అన్ని లక్షణములు నొక్కచో గూమిగూడి యుండునా ! చెరుకునకు గావలసినంత తీపియున్నదిగాని పండ్లు లేవు, పనసపండు గర్భమున రసవంతములైన తొనలుండును. మీదిభాగము మిక్కిలి మోటగా నుండును. విశేషించి పనసకు బూవులు లేవు. మామిడికి జీడియుండును. సీతాఫలమునకు లెక్కలేనన్ని గింజలు. భానునియందు దుస్సహమైన వేడియుండును. చంద్రుని యందతి శైత్యముండును. అట్లే పురుషులయందు నొకడు సత్కుల ప్రసూనత గలిగి యుండును. ఒకడు చక్కదనంబున కెక్కయగును. ఒకడు గానమునకు స్థానమగును. ఒకడు మాటలలో దేనె తేటలు గురిపించును. ఒకడు విద్యానిధియై పుంభావ సరస్వతి యగును. ఒకడు వాక్పటిమలో నపర శేషు డనిపించుకొనును. ఒకడు మేటిమగంటిమికి బేరువడును. ఒకడు సౌజన్యమునకు భాజనమగును. ఇన్ని శుభలక్షణములు నొక్కచో నుండునా ! అది యసంభవముగాదా ? అందుచే నేవో కొన్ని శుభలక్షణములు జూచి వరనిర్ణయము జేసికొనవలయును.

ఇందు—ఆ లక్షణములు మీకును నాకును నచ్చవచ్చును. బాలిక మెచ్చవలదా ?

చిత్ర—మెచ్చ కేమిచేయును ! దివ్యౌషధుల నన్నిటినో గలిపి వైద్యుడు మాత్ర జేసినట్లు బ్రహ్మదేవుడు సమస్త శుభలక్షణములు గల పురుషుని గ్రొత్తగా మన కన్యకకొరకు సృష్టింపవలెను !

ఇందు—ఇదివరకే సృష్టింపబడి యున్నాడు. గ్రొత్త సృష్టితో బనిలేదు.

చిత్ర—అట్లయిన బాలిక యెవనిమీఁద మనసు నిలిపినదో చెప్పగలవా ?

ఇందు—ఇంతవరకు నేనెరుగను. ఇదివరకే సృష్టింపబడినాడని మాటవరుస కంటిని.

చిత్ర—వజ్రపాణియుని యొక సేనాపతి యున్నాఁడు. వాని నెరుగుదువా ?

ఇందు—నేనెన్నఁడు చూడలేదు. వినియుంటిని.

చిత్ర—అతఁడు సేనాపతియగు దండపాణి తమ్ముఁడు. అతని వంశము మంచిది. స్థితి మంచిది. ప్రాయమున నున్నవాఁడు. అతనికిచ్చి వివాహము చేయవలెనని నాకోరిక. అతనిం జేపట్టుమని బాలికతో నీవు నాకొఱకు చెప్పవలయును.

ఇందు—చెప్పెదనుగాని నామాటయందు దానికి విశ్వాసము లేదు. మల్లికకు దానికి సత్యాంతమైత్రి. దానిచేత జెప్పింపుము. బిడ్డ మాత్రము యుక్తాయుక్త మెరుఁగదా ? మంచిసంబంధమైనచో నది యేల నిరాకరించును ?

చిత్ర—మంచిదనుట నిశ్చయము. నీవు చెప్పినట్లు మల్లికతోఁ గూడ మాటలాడెదను.

అని సంభాషణ ముగించి యావలకు జనెను. సంధ్యాకాల మగునప్పటికి మల్లికా చంద్రికలు కర్పూరమంజరిం దోడుకొని గృహముం జేరిరి. రేయి భోజనమైనతరువాత కర్పూరమంజరి పెండలకడ బండుకొనెను. ఆమె నిద్రవోవగాఁ జూచి చిత్రభానుఁడు మల్లికను దన పడకగదిలోనికి బిలిచి పీటపై గూర్చుండబెట్టి కొంతసేపు దాని సేమమరసి రాజాంతఃపురమందలి వార్తలేమని యడిగి కొండొకవడి కిట్లనియె—“మల్లికా ! నీయెడ నటుల నిన్ను బొగడఁగూడదు గాని నీవు నిజముగా గుణపుష్పములతో నిండిన వల్లికవు. ముద్దులమూటగట్టు నీమొగము జూచినను గమ్మతేనియలొలుకు నీపలుకులు విన్నను హృదయంగమములయిన నీగుణములు జూచినను నాకు బ్రహ్మదేవుని

దిట్టబుద్ధి. ఎందుకందువా ? మతిలేని యీ ముసలి దయ్యము బహు లక్షణ సంపదగల నిన్ను నేదో యొక మహారాజ గర్భమున బుట్టింపక సేవకురాలిగా జేసినాడని. ఆ వెఱ్ఱిముండాకొడుకు చేసెడి సృష్టిలో నిట్టివి వందలకొలది గలవు. నిన్ను స్తోత్రము చేయుటకుగాదు నేనిట్లనుచుంట. యదార్థము నాకడుపులో దాగదు. చెడ్డదైన మంచిదైన కుండ పగులగొట్టినట్లు వెంటనే యనుట నాకలవాటు. కర్పూరమంజరి యొక్కర్తయే నాకు కూతురైనదని మరియొక కూతురు లేకపోయెనని చాలాకాలము విచారించితిని. కాని నిన్ను జూచుకొని యీ విచారము పోగొట్టుకొంటిని. నీవే నా రెండవ కూతురవు. అట్లగుటచేత మీయక్క విషయమున నీతో నొక్క మాట ముచ్చటింపవలెనని పిలిపించితిని. బిడ్డ సంప్రాప్త యౌవనయైనది. వివాహయోగ్యకాలము ప్రాపించినది వరాన్వేషణము చేయ వలయును. నీజిహ్వ దాని యభిప్రాయము ప్రతిఫలించు నద్దము. అందుచే నిన్నడుగుచుంటి. అది యీపర కెవ్వనిమీదనైన మనసు నిలిపినదా ? నిజము దాచక చెప్పు ?" అనవుడు మల్లిక చిరునవ్వునవ్వి— "ఏమోనండి ! నాకు దెలియదు. ఆమె మనస్సులో నేమున్నదో నాకెట్లు తెలియునండి ?" యని బదులు చెప్పెను.

అనుటయు నతడు వెండియు నిట్లనియె—"ఓసీ ! నీ వెఱుగని రహస్యములు దాని కుండవు. దానిమనసులోమాట నీ చెవిలో నుండును. చెప్పకపోతివా నన్ను జంపుకొన్నట్లె !" యని నిర్బంధించి యడిగెను. "అయ్యో ! ఇదేమిపాపమండీ. చిన్నపిల్లలము. మాలో మేమేదో పరిహాసమునకో మరెందుకో యేవోమాట లనుకొందుము. వాటి విషయమై నిర్బంధించి యిట్లు దిట్లు ప్రయోగించిన మేమెట్లు బ్రతుక గలము ? నన్ను మీరు నిర్బంధింపవద్దు" అని నిష్ఠురముగా నామె బలికెను. "పోసీ ! నన్ను జంపుకొన్నట్లె గాబోలును. నీవు నాకూతురవని చెప్పితినిగదా ! నీవును గర్పూరమంజరియు దండ్రిలేని కూతులగుదురుగాక !" యని కఠినముగ బలికెను.

అప్పుడు చేయునదిలేక మల్లిక మెల్లమెల్లగా నిట్లనియె—“నాతో నామె చెప్పలేదుగాని మున్నామెకు జబ్బుచేసినప్పుడు మాళవరాజు కుమారుడగు మకరందుడువచ్చి వైద్యము చేసెను. అప్పటినుండి యాతనిమీద మనసు నిలిపినదేమోయని నాయూహ. అయ్యగారూ! నేనీమాట చెప్పితినని యామెతో జెప్పవద్దు. ‘నీనోట నువ్వుగింజ దాగదు. పనికిమాలినదానా!’ అని నామీద మీబిడ్డయు చంద్రికయు గోపించి చెప్పుదురు.”

అనవుడు చిత్రభానుడు—“బిడ్డా! నీవు చెప్పినట్లు నేను చెప్పను. కాని, నేనొక్క రహస్యము జెప్పెద. అది నీమనసులో నుంచుకొని పనిచేయుము. అట్లు చేసెదవా?” యని యడిగెను. “నాచేతనైన పక్షమున నది తప్పక చేసెదన”ని యామె యుత్తర మిచ్చెను. అంతట జిత్రభాను డిట్లనియె—“బిడ్డా! మకరందునిమీద నిలిచిన యామె మనస్సును నీవు త్రిప్పుటకు బ్రయత్నము సేయవలయు. మకరందుడు బౌద్ధుడు. నాస్తికుడు. వేదశాస్త్రములను విశ్వసింపనివాడు. అట్టివాని జేపట్టగూడదని నీబుద్ధికుశలతకొలది హేతువుల గల్పించి దృఢముగా చెప్పుము. నీవు బుద్ధిమంతురాలవు ఇటు జెప్పి మటు జెప్పుమని నీకు నేజెప్పవలెనా? ఓసీ! తెలియక అడుగుచున్నాను. మకరందు డేలాగుండును?”

“ఏలాగుండునని చెప్పను స్వామీ! భూలోకమున విహరింప వచ్చిన మన్మథుడు. గుణములు చెప్పదలచితిమా వర్ణింప శక్యమే గాదు. దానికిం దగిన పరాక్రమము, అందుకు దగిన విద్య. ఇది అది యననేల? అన్ని మంచిగుణము లున్నవండి!” యని మల్లిక యుత్తరము చెప్పెను. చిత్రభాను డది విని వెండియు నిట్లనియె—“ఎఱ్ఱగా బొఱ్ఱగా నుండగానే సరియా? మేడిపండు మిక్కిలి మెరయుచుండును. పొట్టవిచ్చితిమా పురుగులగుంపు. ఆకారమును జూచి ఎవ్వరిని వరింపరాదు. గుణములకేమి ఎవరి గుణములు వారికుండును. ఎన్నిగుణములున్న నేమి? వాడు మనవాడుకాడు. బౌద్ధుడు,

పాషండుడు. అట్టివానిం జేపట్టుట పాపముగాదా!" అనవుడు మల్లిక- "స్వామీ! మకరందుని విడిచి యేరాజకుమారుని వరింపవలసినదని మీయభిప్రాయము?" అని యడిగెను. అడుగుటయు నతడు మరియు నిట్లనియె—"ఆ, ఇపుడు మంచిదారికి వచ్చితివి. చెప్పుచున్నాను విను. ఈ పట్టణమున దండపాణి యను సేనాపతి గలడు. అతని తమ్ముడు వజ్రపాణి కలడు. అతనిని వరింపవలసినదని నాయభిప్రాయము. అతడు సద్గుణవంతుడు, బాహుశాలి. సత్కులజాతుడు. ఎప్పుడైన నం జూచితివా?"

అనవుడు మల్లిక నవ్వుచు నిట్లనియె—"చూచితినండి! సన్నికల్లుమీది గంట్లవలె మొగముమీద మశూచికము మచ్చలు గలిగి నల్లగానున్న యతడేకాదా? చూచి చూచి అమ్మాయికొరకు మంచి పెండ్లికొడుకు నేరినారండి! అతని యొడ లతడే కదుపుకొన లేనంత లావు. అతని శరీరమునుండి చెమటలు గారినప్పుడు కొండ మీదినుండి సెలయేళ్ళు ప్రవహించినట్లుండును; అతని మీసములు మొగము నొకటే రంగున నుండును. వయస్సు చూచినను పరువ దేండ్లకు దక్కువ యుండదు. ప్రథమభార్య యున్నది. ఆమెవలన నలుగురో ముగ్గురో బిడ్డలు కలరు. ఈ వన్నె పెండ్లికొడుకును జేపట్టుమని చెప్పుటకు మాకు నోరెట్లాడును? మేమొకవేళ చెప్పినను నామె యెట్లు సమ్మతించును? అట్టి వివాహము లోకులెట్లుమెత్తురు? చెప్పుటకు మాకే సిగ్గగుచున్నది. ఆ పెండ్లికొడుకు సరసను మీబిడ్డ యెట్లు కూర్చుండునండీ? వారిద్దరు కాటుకముద్ద పసుపుముద్దవలె నుందురు" అని పరిహాసోక్తులు పలుకుచున్న మల్లికకు బ్రత్యుత్తరము జెప్పదలచి చిత్రభాను డిట్లనియె—"ఓసీ! శరీరము నల్లగా నున్న నేమి? కొరుకుకొని తిందురాయేమి? వంశము గుణము భాగ్యము చూచు కొనవలెనుగాని రూప మెందుకే? అట్లయిన జైతన్యములేని బంగారపు బొమ్మను బెండ్లాడవచ్చునా! నీయుల్లసోక్తులు గట్టిపెట్టి నామాట విని నీచెలికత్తెదగ్గర వజ్రపాణిని జక్కగ బొగడి వర్ణింపుము. అతడు

సత్కులజాతు డనుము, గుణనిధాన మనుము, పరాక్రమంబున రెండవ కుమారస్వామి యనుము, అతనిం జేపట్టిన వీరపత్ని యగుననుము, అనంతరము వీరమాత యగుననుము, కావలసినంత భాగ్య మున్న దనుము, ఒక భార్యయున్నను దానే యగ్రమహిషి కావచ్చుననుము, స్త్రీ కింతకన్న గావలసిన దేమున్నదనుము. ఓసీ! ఇన్నిమాట లెందుకు? ఎట్లు చెప్పవలెనో యట్లు చెప్పి కార్యము సఫలము చేసితివా నీకొక రత్నాల హారము వెలలేని యొక ముత్యాలహారము బహుమాన మిచ్చెదను. నీమేలు మరచిపోను.”

అతడు చెప్పినదంతయువిని మల్లిక—“అయ్యా! మీయాజ్ఞ శిరసావహించి నేనామెతో జెప్పెదనుగాని యామె నామాట విశ్వసించునని నాకు నమ్మకము లేదు” అని యాయనయొద్ద సెలవుగైకొని మల్లిక శయనాగారమున కరిగెను. “ఈ పలుగుముండయే శకునపక్షి లాగున విరుద్ధముగా జెప్పెను. ఇక నామె నాకనుకూలముగ జేయునా?” యని తనలో వితర్కించుకొనుచు జిత్రభానుడు పండుకొనెను.

## పదియవ ప్రకరణము

కాశ్మీరరాజు సైనికులు వసించుటకు శ్రీనగరమునకుం బడమట ప్రత్యేకముగా నొక పేట కలదు. అందు సైనికులు సేనానాయకులు మాత్రమే వసియింతురు. సైనికుల దేహపరిశ్రమలకు వ్యాయామములకు వారిబిడ్డల ఆటలకు ధనుర్విద్యయందు నభ్యాసము చేసికొనుటకు మల్లయుద్ధములు నేర్చుకొనుటకు యుద్ధవిశారదు లగుటకు శుష్కరణములు గావించుకొనుటకు దగు విశాలభూము లక్కడ నేర్పడి యున్నవి. ఉదయాస్తమయములయందు సైనికులు నానావిధములైన సాధనములతో బహుపరిశ్రమలజేసి నేర్చినవిద్య

మరపురాకుండునట్లు చేసికొనుచుందురు. యోధులు సాధారణముగా విద్యావిహీనులై యుండుటచే గ్రంథపఠనము చేతగాదు. కావున బహుపురాణవేత్తలు ధర్మశాస్త్రవిశారదులు చిత్రకథాకథనకుశలురు జ్యోతిశ్శాస్త్రవేత్తలునగు బ్రాహ్మణులు స్కంధావారముజొచ్చి పూర్వరాజుల చరిత్రములు మొదలగునవి చదివి వినిపించియు మనోహరములగు కథలు చెప్పియు వారి మనోరంజనము చేయుటయేగాక వారికి బుణ్యము పురుషార్థము నెరిగించి యుక్తాయుక్త వివేచన జ్ఞానము గలిగించుచుందురు. అందుచే బ్రాహ్మణులన్న వారికి బరమభక్తి, వారు నిజముగా స్వర్గమునుండి భూమి కవతరించిన దేవతలని నమ్మి జోదులు వారి యెల్లెడ మిక్కిలి వినయంబు గదుర వారికి నమస్కారములుచేసి సన్మానించి యుచితాసనంబుల నునిచి శక్తి కొలంది ధనధాన్యాదుల నూత్నవస్త్రముల నొసంగి సత్కరించుచుందురు, ఆడువాండ్రు పగలు గృహకృత్యములం దగిలియు మగవాండ్రు నానావిధ పరిశ్రమల జిక్కియు దీరిక లేక యుండుటంజేసి సాధారణముగా బురాణశ్రవణాదు లప్పేటలో రాత్రులే జరుగుచుండును. పౌరాణికుని వసంతఋతు రాత్రులయందు వారు చల్లని లేతగాడ్పులు వీచు బయళ్ళయందు గూర్చుండబెట్టి వందలకొలది స్త్రీపురుషులుచేరి పురాణ మాలకించి ఆనందించుచుందురు. వర్షకాలమునను శీతకాలమునను భజనమందిరములయందే యీ సభలు జరుగుచుండును.

అత్తరి నొక్కనాటిరేయి నొక బ్రాహ్మణుడు మార్గాయాసమున రోజుచు నొక జోదుగృహమునకు బోయి—" అయ్యా! పండుకొనుటకు నాకించుక తావు నొసంగు ధర్మాత్ము లెవ్వరైన నున్నారా? నేను బాటసారిని. బ్రాహ్మణుడను. పగలెల్ల నెండలో మల మల మాడి నడిచియున్న కతమున మిక్కిలి డస్సియున్నాడను. అడుగులు పుడపుడబొక్కినవి" యని యడిగెను. ఆ గృహయజమానుడగు జోదు—" స్వామీ! మాయురుగుమీద మీరు పండుకొన

వచ్చెను. దయచేయుము " అని యుత్తరమిచ్చెను. " నాయనా! నీకెంతైన బుణ్యముగలదు, రక్షించితివి " అని యా బ్రాహ్మణుడు తన కృష్ణాజినము నా యింటి యరుగుమీద బెట్టి యంగవస్త్రముతో నడికికట్టిన యిత్తడి చెంబుదీసి—" నాయనా! పాదప్రక్షాళనమున కుదకము కావలెను, చేరువ నెక్కడైన నూయికలదా!" యని ప్రశ్నించెను. " స్వామీ! అల్లదె నూయి!" యని చూప విప్రుడు ముఖహస్త ప్రక్షాళనము జేసికొని కడుపునిండ నీరుద్రావి మరల నప్పుడాతి యింటికిబని దర్భాసనము బరచుకొని యుచ్చైస్స్వరముతో మహిమ్నస్తోత్రము జదువ నారంభించెను. అదివిని జోదులనేకు లచ్చట జేరిరి, కొందరాశ్లోకముల యర్థమడిగి తెలిసికొనిరి, అది ముగిసిన వెనుక వారిలో గొందరు బ్రాహ్మణుని నామధేయము దేశము నాముము దెలిసికొనగోరి ప్రశ్నలడిగిరి, వారి ప్రశ్నలకు బ్రాహ్మణు డిట్లుత్తరము జెప్పెను—" అయ్యా! నాపేరు వేదశర్మ, నాది గాంధార దేశము. అందు దక్షశిలయను గ్రామముగలదు. అది నాని వాసస్థలము. ఏమహానుభావుడు సంస్కృత భాషయందలి శబ్ద జాలమున కెల్లనియమముల నేర్పరుప దలచి సర్వబుధజన శ్లాఘ్యమైన వ్యాకరణ శాస్త్రము వ్రాసి భాషాప్రపంచము నుద్ధరించెనో సుశబ్ద ప్రయోగము జేసినప్పు డెవ్వాని పవిత్రనామము ప్రతిపండితునకు మొట్టమొదట జ్ఞాపకమువచ్చునో యట్టి మహానుభావుడు పాణిని జనిత్రించినట్టి గ్రామమది, ఆమహాత్ముడేగాక బహు వ్యాకరణవేత్తలు, బహు వేదపారంగతులు, బహు పురాణ సంవిదులు, సకల ధర్మశాస్త్ర విశారదులు, బ్రహ్మవాదులు నచ్చట బలువురు గలరు, ఆసేతు హిమాచలమగు భరతఖండమందలి నానాభాగములనుండి విద్యార్థులై బ్రహ్మచారు లప్పురికివచ్చి భిక్షాటనముజేసి జీవించుచు గురు శుశ్రూషా పరాయణులై తమ కభిమాన శాస్త్రంబుల నేర్చికొని పోవు చుందురు. అది గొప్ప విద్యాసత్రము, సరస్వతి కొలువు కూటము. చదువుల కోటారు. కాశ్మీర దేశమున హిరణ్యపురమున నాకుం జుట్టము

లున్నారు. వారిం జూడదలంచి నేను పయనమై పోవుచున్నాడ. మార్గపరిశ్రమ మెక్కుడగుటచే నగరమునకుబోలేక నిప్పేటలో విడిసినాడ. కాని కాశ్మీరదేశ మింత యల్పకాలముననే యింత దుస్థితికి వచ్చునని నేను స్వప్నమందైన దలపలేదు. తక్షశిలలోని పండితులందరిందుకై వగచుచున్నారు." ఈ చివర వాక్యములు రెండు మెల్లగా ననెను. "ఏమి! అట్లనుచున్నారేల?" యని పలువురు తొందరతో నడిగిరి.

"అయ్యో! పొరబాటున నోరుజారి యనగూడని మాటంటినే! అయ్యా! బాటసారిని, పేదబాపడను. ఈ గొడవలు నాకెందుకు నన్ను విడిచిపెట్టుడు. ప్రశ్నల వర్షముతో నన్ను దడుపకుడు" అని యతడు బదులు చెప్పెను.

"స్వామీ! అట్లుగాదు. అదియేమో విన్నదాక మామనస్సులు తత్తరపడుచున్నవి. మీరిది చెప్పితీరవలయు. మీరు బ్రాహ్మణోత్తములు, లోకులందరికి మేలుగోరువారు. అట్టివారు మాదురవస్థయేమో తెలుపవలదా? దానికిం దగిన ప్రతిక్రియ జేసికొనమా? అట్టివారు మీరు నోట పొరబాటుమాట రానియ్యనే గూడదు. మాట వచ్చినదా మూలముట్ట జెప్పవలయున"ని వారనిరి.

అప్పుడు బ్రాహ్మణుడు బలవంతముమీద నిట్లు చెప్ప దొడగెను—"అయ్యా! ఇది రహస్యము. అయిన మా దేశములో నంద రెరిగిన రహస్యమే. గాంధారదేశపు రాజగు భాగ్యవర్ధనుడు కొన్ని దినములలో మీ దేశముపై దండువిడిసి జయించి తన రాజ్యమున గాశ్మీరమును గలుపుకొనవలయునని ప్రయత్నము జేయుచున్నాడు. చుట్టుప్రక్కల దేశములనుండి సమరమున మిక్కుటకలు దీరిన జోదులను రావించి తన సేనలో జేర్చుకొనుచున్నాడు. మహాటవులనుండి మదపుటేనుగులంబట్టి తెప్పించి కదనమున కాయత్తము సేయుచున్నాడు. వేనవేలు పారసీక హయంబుల బహుధనములిచ్చి కొనుచున్నాడు. పదివేల యేనుగులు, ముప్పదివేల

గుఱ్ఱపుదళము, ఏబదివేల కాల్బలము, పదివేల రథములు రణమునకు సిద్ధమైయున్నవి. పదాతులందరు నీటజరించు చేపల, మింటబారెడు పురుగుల సైతము గురిదప్పక నొక్కు యమ్ముల గూల్పగల మేటి విలుకాండ్రు. అట్టి సేనతో జయము గాంచవలయుననుపేరాసతో మనంబున వెల్లివిరిసిన యుత్సాహముతో నమ్మహాసేనకు గావలసిన సకల సంభారములతో నతడు రాగల శరత్కాలమున దండెత్తదలచుచున్నాడు. కటకటా! చిరకాలమునుండి స్వాతంత్ర్య మనుభవించుచున్న కాశ్మీర దేశము—భూలోక స్వర్గఖండమని పేరువడసిన కాశ్మీర దేశము—హేమచంద్ర మహారాజు పరిపాలించిన కాశ్మీర దేశము—నెల్లసిరులకు నిల్లగు కాశ్మీర దేశము—దిక్కుమాలిన పడంతివలె నన్యవశవర్తిని యగుచున్నది. రత్నగర్భవంటి యీ దేశము మాసామ్రాజ్యములో జేరునని నాకెంతో సంతోషముగానున్నను మీకు రాగల దుర్దశ దలంచిన నాకడుపు చుమ్మలు చుట్టుచున్నది. మారాజును గురించి వేరుతెరంగున జెప్పుట నాకు ధర్మముగాదు. కాని భాగ్యవర్ధనుడనగా నెవడో యెరుగుదురా? పాండవ ధార్తరాష్ట్రులకు మొదట గలిగిన మనస్పర్ధ యను చిన్ని మొక్కను తన దురాలోచన లనెడు దోహదములచేత మహావృక్షముజేసి కురుపాండవ వైరమునకు ప్రధానకారణుడై కౌరవ కులమును గూకటివ్రేళ్ళతో నాశనముజేసిన శకుని వంశస్థుడు. 'శ్యాలకో గృహనాశాయ' యను సామెత నిజముజేసిన దుష్టచిత్తు డతడు. అతని వంశస్థుడైన యీ భాగ్యవర్ధనుడు వానికన్న బది యాకులెక్కువ చదువుకొన్నవాడు. ప్రజలను మంగలములో బెట్టి వేచినట్లు హింసించును. భరింపరాని పన్నులు గట్టును, భాగ్యవంతుల గృహములపైబడి దోచుకొనును. ఎదురాడినవారి పుఱ్ఱెలు దీయించి కోటకొమ్మలకు గట్టించును. చక్కని యాడువాండ్రందరు దన ప్రక్కకు జేరవలసినదె. వానికి నీతిలేదు. ధర్మభీతిలేదు. పాపభయములేదు. శాపభయములేదు. అట్టి రాజు పాలనక్రింద మీరెట్లు వేగుచున్నా

మందురో! విప్రక్రిమి న్యాయమున బ్రదుకుచున్నాము. వానిమంత్రులు కుటిలమార్గ పరతంత్రులు. దేశము పరాక్రాంత మగుటకన్న జనులకు గొప్పకష్టము లేదుగదా! కాటకముల సహింపవచ్చును. ఈతిబాధల నోర్వవచ్చును. అంతఃకలహముల నడచుకొనవచ్చును, మహామారి మొదలగు ప్రళయ రోగముల భరింపవచ్చును; కాని, పరరాజుపాలన మెక్కడిదైన సైరించుట కష్టము. దేశమందలి ధనధాన్యములనెల్ల నతఁడే తరలించుకొనిపోవును. రత్నగర్భలవంటి భూములు చవుటిపఱ్ఱలు చేయును. గనులన్నిటిని త్రవ్వుకొనిపోవును. తన దేశస్థులకన్ని గొప్ప యుద్యోగముల నిచ్చును. వెయ్యేల! జయింపబడిన దేశస్థులను బానిసలం జేయును. నోరున్నవారు మాటాడ రాదు, చెవులున్నను వినరాదు. చేరెడు కన్నులున్నను జూడరాదు. వారి సాహసము నశించిపోవును. ధైర్యము తరిగిపోవును, మగంటిమి మంటిపాలగును. ధైర్యమును వెడలగొట్టి భీతి వారి మనస్సుల నాక్రమించును. అడుగడుగునకు వారు పరరాజులకు జేతులు జోడించి జోహారులు సేయుదురు. పరులకు బట్టులవలె బొగడి స్తోత్రపాఠకు లగుదురు. వెయ్యేల! పరరాజు పాలనలోనున్న జనులు మృగముల కన్న బులుగులకన్న బురుగులకన్న నికృష్టమైన జీవనము జేయుదురు. నాశత్రులకైన నేనెన్న డట్టికష్టముల గోరను. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యను నార్యోక్తి మీరు వినలేదా? తల్లియు జన్మభూమియు స్వర్గముకన్న నెక్కుడని దీనిభావము. తల్లిని గోల్పోయి బ్రదుకవచ్చును. బిడ్డలు మృతులైన బ్రదుకవచ్చును. కులకాంత కూలిన మనవచ్చును. ధనముపోయిన బ్రతుకవచ్చును. కాని మాతృదేశము పరాక్రాంత మయినచో బ్రతుకజాలము. ఆదినమే దేశస్థులకు మరణదినము. ఆ దినమే యాత్మగౌరవంబునకు గడపటిదినము. సర్వసుఖముల కంత్యదినము. ఆ దుర్దినము మీకు రాకపోవుగాక! ఆ యాపద మీకు దప్పుగాక!"

ఈ సంభాషణము మొదట సామాన్య స్వరముతోనే యత డారంభించెనుగాని వెళ్ళినకొలది క్రమక్రమముగా నుత్సాహ

పూరితుడై మొలుగెత్తి చెప్పెను. అది వినునప్పు డచ్చట చేరిన సైనికులలో గొందరు—"హాహా" యనియు, "శివశివా" యనియు, "హరిహరీ" యనియు, "ఎంతకర్మ మెంతకర్మ" యనియు సంతాపార్థములైన పదముల నుచ్చరించిరి. అతడు సంభాషణ ముగించిన పిదప నందులో నొకడు—"గాంధార రాజునకు మన దేశముమీద నింత కోపమేల? మన మతని కేమపకారము జేసితిమి?" యని తక్కినవారి నడిగెను. అందుకు వేదశర్మ యిట్లుత్తరము చెప్పెను.

"ఒకరాజు మఱియొక దేశముపై దండెత్తుటకు గారణ మవసరములేదు, అపకారము చేయనక్కఱలేదు. మీ దేశము దుర్బల మగుట యొక్క కారణము. అతడు బలవంతుడగుట యొక్క కారణము. అతనికి గొప్ప యాశ లుండుట యొక్క కారణము. కారణము లరయ నేల? పెనుచేప చిరుచేపం దినును. ముంగిస పామం జంపును. సర్పము కప్పను గబళించును. కప్ప పురుగులను మ్రింగును. పులి మేకం జంపును. ఇందొకదానికొకటి యేమి యపకృతి గావించెను? బలవంతులు బలహీనులం జెఱుపుట నైజము. అదియునుగాక కొన్ని జంతువులకు వలెనే కొందఱు మానవులకు గూడ దుష్కార్యాచరణము సహజము. నూరువరాలు వెలగల చీర చిమ్మట బొత్తలు పొడిచి పాడుసేయును. ప్రశస్తమయిన పుస్తకముల జెదపురుగులు నాశనము జేయును. కావున దురాత్ముల కపకారముతో బనిలేదు. అంతియేగాక భూపతు లాశాపిశాచగ్రస్తులు. నేల నాలుగు చెఱంగు లేలినను వారి యాశ దీరదు. మూడులోకములు హస్తగతములైనను వారి నావహించిన యాశా పిశాచమున కాకలిదీరదు. భూమండలమంతయు జయించినవాడు సైతము భగవంతుడు తన విజయము నిమిత్తము నూతన ఖండముల సృజియించిన బాగుండునని తలంచుచుండును! ఇవియన్నియు నటుండనిండు! విభీషణుడు త్రేతాయుగమందు రావణ సైన్యమునందేగాక ప్రతియుగమునందు, ప్రతిదేశమునందు, ప్రతి సైన్యమునందు నున్నాడు. తన నెత్తురు తన జాడ జూపినప్పుడు తన

నీడ తన్ను బగతురకు బట్టి యిచ్చినప్పుడు తన యుడుగులజాడయె తన నెలవు దెలిపినప్పుడు మానవుడు పరులచే హింసింపబడక పోడుగదా !"

ఈ కడపటి మాటలు కర్ణములం జొరబడి మనస్సునకు సూదులువలె నాటెను. "ఎవడా విభీషణుడు ? ఎవడా దేశద్రోహి ? ఈరాజ్యమం దట్టివాడుండగలడా ?" యని కొందరరచిరి. "శాంతిపుడు. శాంతింపుడు" అని మరికొందరు వారిని వారించిరి. వేదశర్మ— "క్రమక్రమముగా మీకే తెలియును. నిప్పు లోపలి యటక మీద బెట్టి యిల్లంటించినను మంటలు పైకి రాకపోవు. ఓపికపట్టి యుండుడు" అని బదులు చెప్పెను, అందులో గొందరు— "స్వామీ ! మర్మము బెట్టి మాటలాడి మమ్ముం జంపనేల ? ఇంతవరకు జెప్పితిరికదా ! తక్కినదిగూడ స్పష్టముగా జెప్పుడు, మేము పరరాజులకు దాసులము కాలేము. బెబ్బులులవలె బరసైనికులువచ్చి దేశమాక్రమించి యూళ్ళు కొల్లగొనుచుండగా మేము చూడలేము, కాశ్మీరదేశము కొరకు, రాజకుటుంబముకొరకు మేము మానెత్తురు ధారపోయుదుము, ప్రాణములు బలియిత్తుము. ద్రోహులను శిక్షింతుము. విషయము సమూలకముగా దెలిపి మమ్మనుగ్రహింపుడు" అని పలికిరి.

"అయ్యా ! మీరు బలవంతపెట్టుచున్నారు. గనుక చెప్పక తప్పదు. మీరాజ చిన్నవాడగుటచే మంత్రులు లంచగొండులై దేశము పరుల కప్పగించుచున్నారు. మీరాజకుటుంబమున వెనుకటి రాజు సహోదరుడైన చిత్రభానునకు సరిపడదుగాని, యుత డధికారము వహించునేని, నేటిమంత్రులు తొలగింపబడుదురేని రాజభక్తిగల దండనాథుడు మీవంటి శౌర్యధైర్యముగల బంట్లును రణరంగమునకు నడువుదురేని ఇటువంటి గాంధార రాజులను నూరుమందిని మీరు జయింపవచ్చును. అన్నిబలములుకన్న నైక్యమత్యబల మెక్కువది, అదియే జయమును సమకూర్చును" అని సన్నసన్నముగా దన యుపన్యాసము ముగించెను.

ఆ మాటలు వానినోట వెడలినతోడనే—"మంత్రులే? మంత్రులే? ఓరీ రాజద్రోహులారా! ఓరీ దేశద్రోహులారా! ఓరీ నీరామొగములముండా! ఓరీ లంచగొండి ముండాకొడుకులారా!" యని కొందరు దూషింప నారంభించిరి.

"లంచగొండులు ధనమునకై దేశమునైన నమ్మివేయుదురు. వారిని నిలువనీయఁగూడద" ని కొందరు పలికిరి. "చిత్రభాను డధికారము వహించుట దేశక్షేమకరమ" ని కొందరు వచించిరి. "చిత్రభానుఁడు భ్రాతృద్రోహి. వాని కధికారమిచ్చుట తప్ప" ని కొందరు భాషించిరి.

ఇట్లు పలువురు పలువిధంబుల సంభాషించుచు నర్ధరాత్రమగుటచే నిద్రాపీడితులై స్వగృహముల కరిగిరి. వేదశర్మ తెల్లవారుజామున సైనికులు మనస్సులలో జిచ్చుపెట్టి తన దారింబోయెను.

మరునా డుదయమున సైనికులు లేచి గుంపులుగూడి వేదశర్మ చెప్పిన వృత్తాంతమంతయు బహువిధముల చర్చింపదొడగిరి. "అది నిజమ" ని కొందరు, "సిలివార్తయ" ని కొందరు, దమకుం దోచిన పోల్కి బలికిరి. "మంత్రుల నమ్మరాద" ని కొందరు, "వారివంటి సజ్జనులు లేర" ని కొందరు వాదించిరి. "చిత్రభానుఁడు దుర్జనుఁడ" ని కొందరు, "సజ్జనుఁడ" ని కొందరు వక్కాణించిరి.

పిమ్మట దండపాణి వజ్రపాణియు, గదాధరుఁడు, శూలపాణియు నెప్పటియట్లరాగా వారికా వృత్తాంత మెరిగించిరి. గదాధరుఁడు శూలపాణియు—"నిదియెల్ల కల్ల, ఇవి శత్రువుల కల్పనలు, నమ్మరాద" ని గట్టిగా జెప్పిరి. దండపాణియు వజ్రపాణియు—"నిజమని నమ్మరాదు. కల్లయని త్రోసివేయరాదు. ఏపుట్టలో ఏపామున్నదో మనమే మెరుంగుదుము?" అని చెప్పి చాటుచాటున దమకాప్తులయిన క్రింది యుద్యోగస్థులతో—"బాలరాజు పరిపాలనము చేటునకు మూలమని" యు "సమర్థు డెవరైన రాజ్యాధికారము వహించిన మేలగున" నియు జెప్పుచు వచ్చిరి.

మరునాడు మధ్యాహ్నమునకీవార్త కారుచిచ్చువలె శ్రీనగర మందంతట రేగెను. అత్యుత్సాహముతో ప్రజలందరు దీనిని గురించి మాటలాడు కొనుచుండిరి. ఏమూల జూచిన మనుష్య గుంపులే. ఎక్కడ నాలకించిన దండయాత్రా విషయమే. ఎక్కడ జర్చించిన మంత్రుల ప్రవర్తనమే. కొందరు హేమచంద్రుని గూర్చి విచారించిరి. కొందరు విక్రమసేనుని దురవస్థకు జింతించిరి. కొందరు మంత్రులను దూషించిరి. ఇన్నిమాటలేల? ఆడువాండ్రు మగవాండ్రు బాలురు వృద్ధులు భిక్షుకులు పరిచారికులు సర్వజనులు తద్విషయములనె జర్చించుచు బనిపాటలు మానియుండిరి. ఊరంతయు నట్టుడికి నట్లుండెను. కొందరు పిచ్చివాండ్రువలె సంచరించిరి. కొందరు మంత్రుల యింటిమీదబడి వారిని గఠిన ప్రశ్నము లనెడు రాళ్ళతో రువ్విరి. దండయాత్రాభయమున గొందరు నగరము విడిచి పల్లెలకు బోవ దలపెట్టిరి. క్రమక్రమముగా నీవార్త రాచనగరు జేరెను. విక్రమసేనుడు రిచ్చవడియెను. హర్షవర్ధనుడు తల్లికడకరిగి యువ్వార్త జెప్పి యామె నాశ్చర్యసముద్రములో ముంచెను. కొంతసే పామె విచారించి యది కల్పితకథయని కొడుకులతో జెప్పెను. నర్మద యేదో పనిమీద నగరములోనికిబోయి ప్రజలలో వ్యక్తమగుచున్న యమ్మహోత్సాహము భయము స్వయముగా జూచి వచ్చినదగుటచే నది చేతులు ద్రిప్పుకొని యభినయము జేయుచు నేత్రవిభ్రమము చేతను ముఖవైలక్ష్యముచేతను నెంతో చిత్రముగా వర్ణింప దొడగెను. నగరమెట్లుండెనో నగరునట్లె యుండెను. సేవకులు మిక్కిలి కలవళముపడిరి. గాంధారరాజ దండయాత్ర ప్రతివారి పెదవులమీద నుండెను.

మణివర్మయు మాధవసేనుడును ప్రజల కోలాహలమును దమ యభయప్రదానముచే గొంతవరకు నివారించి యరవిందాదేవికిని విక్రమసేనునకును దప్పక చిత్తక్షోభము గలిగియుండునని తన్నివారణార్థము రాచనగరునకు దేవి పిలువనంపకయే పోయిరి.

అరవిందాదేవి వారి నెప్పటియట్ల గారవించి గాంధారరాజ దండి యాత్రా విషయమున నేదయిన సత్యమున్నదా యని యడిగెను. ఆ ప్రశ్నకు మణివర్మ యిట్లుత్తర మిచ్చెను.

"అమ్మా! ఇందు లేశమయిన సత్యము లేదు. మన వేగుల వాండ్రు గాంధారదేశపు సరిహద్దులనుండి యీ నడుమనే వచ్చినారు. ఆ దేశము యుద్ధసన్నాహము లేక నిస్తరంగమగు సముద్రమువలె నున్నదని చెప్పిరి. అదిగాక, మనదేశమునుండి వణిజులు కొందర కక్కడికి బోయివచ్చిరి. అక్కడనుండి బేహారము సేయుట కిక్కడికి గొందరు వచ్చియుండిరి. వారెవ్వరీమాట చెప్పలేదు. ఇది యెవ్వరో రాజకుటుంబమునకు నగరజనంబులకు జిత్తసంక్షోభమునకు గలిగింప వలెనని పుట్టించిన కల్లవార్త ఇదినమ్మి మీరు మోసపోకుడు. మీ మనస్సులు ప్రసన్నములుగా నుంచుకొనుడు. భయము సర్వావయవముల పటుత్వము నడంచును. ధైర్యముం జెరుచును. కార్యముల నెల్ల విఘాతి మొనర్చును. కావున భయమున కెడమీయవలదు. మేము గూడ మిమ్ము ద్రోహము సేయుచున్నామని లోకములో నపవాదములు బైలుదేరినవి. మావిషయమై మేము చెప్పకొనరాదు. మాపూర్వచరితము, మాస్వభావము, మాఋజుత్వములను గురించి సాక్ష్యమీయవలయును గాని మామాటలుగావు. దీనికి మీయంతఃకరణమే ప్రమాణము."

అనవుడు రాజమాత—"ఇవి కట్టుకథలని విక్రమసేనునితో మొట్టమొదటనే చెప్పితిని. మీపై మాకనుమానము లేదు" అని చెప్పెను. అమాత్యులు సెలవు గైకొని యంతఃపురము విడిచిపోయిరి.

## పదునొకండవ ప్రకరణము

వేదవర్మ పలుకులవలన గలిగిన యలజడి సంపూర్ణముగా నడగకమునుపే మరియొక విషయము రాజకులమునకు మహాందోళనము

కలిగించెను. వెనుకటిగొడవ జరిగిన నాల్గవనాటి రేయి రెండు గడియలు గడచిన వెనుక రాచనగరుకడకు నొక క్రొత్తపురుషుడు పోయి ద్వార రక్షకులం జూచి—"అయ్యా! అరవిందాదేవి పుట్టినింటనుండి నేను వచ్చితిని. ఆమె జనకుడగు మహేంద్రదేవుడు నన్నతి రహస్యముగా దేవిగారి కొక రహస్య సందేశ మెఱింగించి రమ్మని పనిచె. తత్కారణమున నేనిటవచ్చితిని. నేను వచ్చినపని రాజకులమునకు మహోపకారకముగా బరిణమించును గావున మీరతి శీఘ్రమున నా రాక యమ్మహాదేవి కెఱిగించి దర్శనము చేయింపుడు" అని రహస్యముగ జెప్పెను. అప్పలుకులువిని—"మీరెవ్వరు? మీ పేరేమి? పాంచాల నాయకులైన మహేంద్ర దేవులు మమ్ము పంపిరని మిమ్ము నమ్ముట కానవాలేమున్నది?" అని యడిగిరి. అనవుడు నప్పురుషుడు—"నా పేరు సోమభట్టు. నేను బ్రాహ్మణుడను. పాంచాలరాజ పురోహితుడగు హరదత్తుని పుత్రుడను. దేవిగారు నాతండ్రి నెరుగుదురు. మహేంద్ర దేవునకు వివాహకాలమున నత్తవారిచ్చిన వజ్రపు టుంగరము నాకాయన కూతునకుం జూపుమని యానవాలుగ నిచ్చె. ఇది యాయుంగరము. కావలయు నేని దీనిం జేకొని మీరామెకుం జూపుడు" అని బదులుచెప్పి యప్పురుషు డంగుళీయకము వారి కిచ్చెను. రాజ భటులు దానిం గైకొని యంతఃపుర సంరక్షకునికడ కరిగి యావృత్తాంతము జెప్పి యది వానికిచ్చిరి. అతఁ డది యెల్ల నర్మద కెఱిగించి యుంగర మామె కిచ్చి దేవికడకు బంపెను.

నర్మద దానిం బుచ్చుకొని యరవిందాదేవి కడకు బోయి యవ్వార్త నెరిగించెను. ఆదేవి దీపముల వెలుగున నయ్యంగుళీయకము ముందరభాగము వెనుకభాగము మిక్కిలి శ్రద్ధతో బరిశీలించి చూచి—"ఓసీ! నర్మదా! ఇది మా జనకునకు వివాహకాలమున నామాతామహులిచ్చిన యుంగరమే. కావున నితడు తప్పక మహేంద్రదేవుని చేత బంపబడినవాడే యైయుండును. లోపలికి రానిమ్మని చెప్పుము. పురోహిత నందను డగుటచే నితడు పరమ వైదికుడు గావున నన్నుం

జూడదగును" అని దానిం బంచెను. అదియు యథాక్రమముగా నంతఃపుర రక్షకునకును నతడు ద్వారపాలకులకును దెలుప వారా భూసురుని నగరు ప్రవేశపెట్టిరి. ఒక వృద్ధకంచుకి దారిజూప నాజన్నిగట్టు బహుద్వారములు గడచి యభ్యంతర మందిరముం జేరి కిశోరద్వయ మధ్యముననున్న యాడుసింగముంబోలి కుమారద్వయ సమేతయైన యరవిందాదేవి యెట్టయెదుట నిలిచెను. ఆమె యుచితాసనంబున నాతనిం గూర్చుండ బనిచి మహేంద్రదేవునియు దన తల్లియు సోదరులయు బంధుగులయు సేమమరసి యాతని తండ్రి క్షేమమడిగెను. తనతండ్రి కాలధర్మము నొందెనని యాతడు విన్నవించి యిట్లనియె—"అమ్మా! నాతండ్రి స్వర్గస్థుడగుటచేతనే మీతండ్రిగారు మీయొద్దకు నన్ను బుత్తెంచిరి. ఆయన యున్న పక్షమున నాయననే పంపియుందురు" అనవుడు దేవి—"అయ్యో! మహానుభావులైన మీతండ్రిగారు గతించిరా! సామగాన మాయనతో నంతరించినదని చెప్పవచ్చును, నావివాహ మాయనే చేయించిరి" అని వివాహముమాట జ్ఞప్తికి రాగానే తన నూతనావస్థను దలంచుకొని కన్నీరు వెట్టుకొనెను. సోమభట్టు దేవిని సమయోచితముగా సమాశ్వాసించి యిట్లనియె—

"అమ్మా! నావచ్చినపని జిత్తగింపుము. మీజనకుడైన మహేంద్రదేవుడు భర్తృవిహీనయైన నీయొక్కయు, పితృవిహీనులయిన మనుమలయొక్కయు సేమమరసి యతిరహస్యముగ మీకొక్క మాటజెప్పి రమ్మని నన్నుం బుత్తెంచెను. మీరది సావధానముగా నాలకింపుడు. సింధుదేశ నాయకుడగు పరంతపుడు కాశ్మీరదేశముపై దండు విడియవలెనని సంకల్పించి మహోత్సాహముతో మహాప్రయత్నము సేయుచున్నవాడు. పరంతప శబ్దము నేతిబీరకాయగాదు. అతడు పరంతపుడే. అతనికి మ్లేచ్ఛులు సమరదోహదులు చండప్రతాపులునగు పారసీకులు మిడుతల దండులువలెవచ్చి సాయము చేయుదురట. వారికి జీతములు బత్తెములు నీయనక్కరలేదట.

దోపుడువలన నెంతసొమ్ము వారికి దొరకునో యంతయు వారికిచ్చినం జాలునట. సింధుదేశము మంచిగుఱ్ఱములకు పేరువడియె, గావున నారాజు సేనలో గుఱ్ఱపు దళము మెండుగ నుండును. అవి గుఱ్ఱములు గావు లేళ్ళుగాని, అదిగాక కాల్బలము గజబలము రథబలము గావలసినంత యుండును" అంతవరకు జెప్పినప్పటికి విక్రమసేను డందుకొని—"దండెత్తువాడు సింధురాజనుచున్నారు, గాంధారరాజని చెప్పడ" ని పలికెను. అనవుడు సోమభట్టు—"కాదు. కాదు, సింధు నాయకుడే, దానికిం దగిన తార్కాణములున్నవి. లిఖితరూపకములైన తార్కాణములు దొరకినవి. కానిచో శాస్త్రజ్ఞానము లోకానుభవము సంపూర్ణముగాగల మహేంద్రదేవునివంటి రాజనీతి కోవిదుడు తన పురోహితుని శ్రమైక సాధ్యంబగు నీపయనమునకు బురికొల్పి పంపునా!" యని యుత్తరమిచ్చెను. అనవుడు నరవిందాదేవి మిక్కిలి విస్మయము నొంది—"ఏమీ! లిఖితరూపకమగు తార్కాణము దొరికినదా? ఎవరు వ్రాసినది? ఎవరికి వ్రాసినది? ఎప్పుడు వ్రాసినది? ఏదేది! చూడనిమ్ము" అని మాటవెంబడి మాట వచ్చునట్లు మిక్కిలి తొందరతో నడిగెను.

అడుగుటయు సోమభట్టు—"అమ్మా! ఎవరననేల? మన చేతులు, మనకాళ్ళు, మనకన్నులు, మనచెవులు వారు మన తోడు నీడలవలె మనతో నుందురు. ఆ నీడలే మనకు శత్రువులు. మన గోడలే మనకు శత్రువులుగదా!" యని బదులు చెప్పెను.

"అయ్యో! వారి నామధేయములు వినువరకు లిఖిత రూపక దృష్టాంతములు చూచువరకు నామనస్సు తొత్తరపాటు చెప్ప నలవి గాకున్నది. కావున నీక్షణమే వాటిం బ్రదర్శించి స్థానముదప్పి భ్రమించుచున్న నామనస్సునకుం గుదురుపాటు గలిగింపుము" అని యరవిందాదేవి వానిం ద్వరపెట్టెను. అప్పుడు సోమభట్టు తన కృష్ణాజినముచుట్ట విప్పి యందుండి యొక యడపసంచిదీసి ఆసంచిలో గట్టకడపటి సొరంగములో నట్టనుగున సన్నగుడ్డ చుట్టబడి రెండు

మడతలుగానున్న యొక భూర్జపత్రముదీసి విక్రమసేనుని చేతికిచ్చి చదువుమనెను. అతడు దీపము దగ్గరకుబోయి యిట్లు చదివెను—

శ్రీమన్మహారాజాధిరాజ త్రిభువనమల్ల కిన్నరేంద్ర ఘటా పంచానన పరరాజ వేశ్యా భుజంగ సకల సమరాంగణ సార్వభౌమ ప్రముఖ బిరుదాంకితులును సింధుదేశాధీశ్వరులునునగు స్వస్తిశ్రీ పరంతప మహారాజుగారి దివ్యచరణారవింద సన్నిధికి కాశ్మీరరాజ మంత్రియు మీ సేవకుడునగు మణివర్మ వందన శతపురస్సరముగా వ్రాసికొన్న విజ్ఞాపనము.

బౌద్ధభిక్షుక వేషధారియైన మీ వేగులవానిచేత దేవరవారు పరమానుగ్రహమున నాకు వ్రాయించి పంపిన లేఖ నందుకొంటిని. కన్నుల నద్దుకొంటిని. పూవుదండవలె శిరమున ధరించితిని. ఈసేవకుని మీద నిర్హేతుకముగా మీకింత యనుగ్రహము గలిగినందుకు మిక్కిలి సంతసించితిని. నాహృదయానందము దెలియజేయుటకు దగిన మాటలు నేనేరకున్నవాడ. మీరు కాశ్మీరదేశము దండెత్త గుతూహలపడుచున్నట్లు వ్రాసినారు, ఆ దేశ మేపాటిబలము గలదని యడిగినారు. మీసంకల్పము శ్లాఘాపాత్రము. ఈరాజ్యము పూర్వము బలమైనదేగాని నేటికాలమున రాజు చిన్నవాడగుటచే రాజ్యము దుర్బలముగానున్నది. మానవశరీరమునం దరిషడ్వర్గమువోలె నీదేశమున నంతశ్శత్రువులు బలాఢ్యులు గలరు. వారి రాయిడిచేత నెలుకలు దొలిచిన యిల్లువలె నీదేశము శిథిలమైయున్నది. దేశము సారవంతమై రత్నగర్భలగు భూములుగలదై స్వర్గఖండమువలె నుండుటంజేసి బాహ్యశత్రు లనేకులు దీనిపై గన్నువైచియున్నారు. మాకు ముప్పదివేల సేనకంటె నెక్కువలేదు. దేశస్థితియిది. సాయము జేయుమని నన్ను మీరు కోరినారు. మీచిత్తప్రకారము నేను మీకు దోడుపడియెద. నేను కోరుకొన్నచోట నాకు సారవంతములైన పది యగ్రహారములు, పదిలక్షల రూకలు మీరిచ్చెదనని వ్రాయించిరి. ఇరువది యగ్రహారములు నాకు దయచేయవలెనని కోరుచున్నాను.

మీాద మీాచిత్రము. మహారాణిగారు మిమ్ముబట్టి మీాకొప్పగించెదరు. కోట మీాస్వాధీనము జేసెదరు. ధనాగారములోని ధనము చిరంతనములనుండి ప్రోగు చేసిన ధనరాసులతో నిండియున్నది. అప్పుడు లక్ష్మి తాండవ మాడుచు మిమ్ముం బిలుచుచున్నది. మీారు వచ్చి యాక్రమించుటయే కొరత. ఈదేశము మీాస్వాధీనమగుచోట స్వర్గము మీాచేతిక్రిందకు వచ్చినట్లు, మేరుపర్వతము మీాయధీనమైనట్లు, కైలాసము మీాగడపలో నున్నట్లు. ఆలస్యము చేయక వెంటనే బలములను గూర్చుకొనిరండు. దండపాణియు వజ్రపాణియు సజీవులైనట్లు వినరుగాని గదాధరుడు శూలపాణియు నాయింటి కుక్కలు. వారు నాపనువు దప్పక సేయుదురు. వారు తమ తమ సైన్యభాగములతో వచ్చి మిమ్ముం జేరుదురు. మాధవసేనుడు గూడ మనవాడే. ఆ మువ్వురకు గూడ మీారు మనపని తీరిన పిమ్మట దగిన పారితోషికములిచ్చి సంతోషపెట్ట వలయు. మీారు నా పేర దీనికుత్తరము వ్రాయునప్పుడు దానిలో నాపేరు వ్రాయక యశోవర్ధనునకని వ్రాయవలయును. పాములవాని వేషము వేయించి నా వేగులవానిని మీాకడకీ యుత్తరమిచ్చి పంపుచున్నాను. ఇదే వందన శతము.

ఇట్లు విన్నవించు మీావిధేయుడు,

మణివర్మ.

కుమారుడు జాబు చదువుట ముగించినతోడనే యరవిందా దేవి—"నాయనా! నీవు మణివర్మ వ్రాత నెరుగుదువుకదా! ఇది యతని వ్రాతయగునా?" యని యడిగెను. "తల్లీ! మణివర్మ లేఖనము నేనెరుగుదును, అక్షరములు గుండ్రములై యాణిముత్తెము లట్లులుండును, పంక్తులు వంకర లేక ముత్యాలకోవలు పరచినట్లుండును; అక్షరములు మిక్కిలి దగ్గరగా వ్రాయుట యతని కలవాటు, పెద్ద గ్రంథము చిన్నచోటున నతడిమిడింప గలడు. ఆ నైపుణ్య మిందు స్పష్టముగ గనబడుచున్నది. తలకట్లు పొల్లులు తీర్చుటలో నతని హస్తమున కొకానొక వింతకౌశలముగలదు. అదియు నిందు గనబడు

చున్నది. కావున నీవ్రాత యాతనిదేయని నాకు దోచుచున్నది" అని యుత్తరము జెప్పెను. అదివిని యాదేవి నిట్టూర్పు విడిచి—"ఈవ్రాత తప్పక మణివర్మదే యైనపక్షమున గాశ్మీర రాజ్యలక్ష్మి ముఖమున బ్రహ్మ మిక్కిలి చెడ్డవ్రాత వ్రాసెనని నేను దలంచెద. అట్లుకానిచో మేరువువంటి ధైర్యమును సముద్రునివంటి గాంభీర్యమును రాజ సామాన్యదుర్లభమైన సౌజన్యమునుగల మీతండ్రిగారేల దారుణముగా నస్తమింతురు ? హా రాజ్యలక్ష్మీ ! నీకును మాకును ఋణము దీరినదా ? మాపైని నీకు విసుగుదోచినదా ? మమ్ము విడిచి పరరాజుల పాలుగాదలచితివా ? పరమేశ్వరు మాయ యెట్లున్నదో యట్లు కాగలదు" అని పలికి కుమారు లధైర్య పడుదురేమోయని వెంటనే శంకదోప నాధోరణి దప్పించి యాదేవి వెండియు సోమభట్టు నుద్దేశించి—"అయ్యా ! ఇది యెట్లు మాతండ్రిగారికి దొరికినది ?" యని యడిగెను. అందుకు సోమభట్టనియె—"అమ్మా ! ఇది చిత్రముగా లభించినది. ఒక పాములవాడు కన్యాకుబ్జపట్టణమున దన పాముల నాడించి ధనమార్జించుకొని యుందందు దిరుగుచుండెను. ఒకనాడు వాడు తానార్జించిన విత్తముం దీసికొని యూరుచివరనున్న కల్లంగడికిబోయి రెండు లొట్టియల కల్లుద్రావి యొడలుమరచి కొంత సేపు దొరలి కొంతసేపు నేలబొరలి తెలివివచ్చినతోడనే మరల కొంత ద్రావి ప్రక్కనున్నవారితో నిర్హేతుకముగా గయమునకు గాలుదువ్వి వారిపై బడెను. అప్పుడు జుట్టుజుట్టు పట్టుకొని వాండ్రు పోరాడిరి. ఈ భూర్జపత్రము వాడు తన తలపాగలో జాగ్రత్తగా దాచెను. ఈ కలహములో తనగుడ్డ వీడిపోవుటంజేసి యిది నేలంబడెను. మహేంద్రదేవ మహారాజుగారి వేగులవాండ్రు దేశమందంతట వ్యాపించియుందురు గావున నాడు కల్లంగడిలోనున్న యొక చారుడు మెల్లగా దీనిం దీసికొని మహారాజుగారి కిచ్చెను. ఈ భూర్జపత్రము యొక్క చరిత్రమిది. ఇందు నమ్మకపోవుట కేమియు లేదు. అంతయు సహజముగా నున్నది. అసంభవ మేమియు గానబడదు. కావున

మీతండ్రిగారిట్లు మీతో జెప్పుమనిరి ; మణివర్మను మాధవసేనుని నమ్మి మీయర్ధప్రాణము లాతని చేతం బెట్టవలదు. అవి పూలదండలు గావు. కుబుసమూడ్చిన కోడెత్రాచులు. అవి పగడములుగావు. చండ్రనిప్పులు. అవి క్షీరములుగావు సున్నపునీళ్ళు. అవి హంసలు గావు. కొంగలు. అవి గోవులుగావు. గోచర్మముదాల్చిన బెబ్బులులు. కావున నమ్మి మోసపోకుడు. స్త్రీప్రాణములు బాలుర ప్రాణములు విషాగ్నులవలన శస్త్రాది సాధనములవలన గాపాడుకొనునది. ఇది మీనాయనగారి సందేశము. దీనిని రత్నాభరణమువలె మీశిరంబున దాల్పనగు. మహామంత్రమువలె భక్తితో స్మరియింపవలెను. అమ్మా ! నావచ్చిన పనియైనది. చీకటి పడినతరువాత నగరుసొచ్చి రేయి రెండుజాములు గాకముందే యూరు విడిచిపోవలసినదని మీతండ్రిగారు సెలవిచ్చిరి. నేనిచ్చట తెల్లవారువరకు నుండరాదు. మీయమాత్యులు మీసేనాపతులు నన్ను బలుసిలుగుల బెట్టుదురు. మీతండ్రికి బురోహితుఁడనై మీకు హిత మాచరింపవచ్చితిని. మేము ఛాందసులము. అలౌకికులము. ముక్కునకు సూటిగ బోవువారము. దారిన వెళ్ళి దారిన వచ్చువారము. మీసేమ మతనికి వెంటనే యెరిగింపుమనికూడ మీతండ్రిగారు సెలవిచ్చిరి అందుచే నాకు సెల వొసంగుము ” అని లేచెను.

అరవిందయు విక్రమసేనుడు హర్షవర్ధనుడును లేచి వానికి నమస్కరించిరి. “ అయ్యా ! మేమీగడియవరకు సేమముగా నున్నామని మానాయనగారితో జెప్పుడు. ఇక్కడి స్థితిగతుల నరసి నేనాయనకు కర్తవ్యమును గురించి జాబువ్రాసి విశ్వాసముగల బంటు నంపెదను, అందర నడిగితినని జెప్పుడు. దైవానుగ్రహమున బ్రతికితిమా మరల దర్శనము జేయుదుమని జెప్పుము ” అని యరవిందాదేవి వ్రాకుచ్చి వాని నంపెను.

ఆ భూర్జపత్రము విక్రమసేనుని చేతినుండి హర్షవర్ధనుడు దీసికొని చదువుకొని—“ అమ్మా ! మనము దొంగలగుంపు నడుమ

నున్నాముసుమీ!" యని పలికెను. "కుమారా! అది యిటు తెమ్ము నేను జాగ్రత్తగా దాచెదన" ని తల్లి పుచ్చుకొని మరల మరల దానిం జదువుకొని—"వత్సలారా! ప్రొద్దుపోయినది. పండుకొనుడు. భయములేదు" అని వారిం బానుపుల జేర్చి నిద్రపుచ్చెను.

అరవిందాదేవికి జాలసేపు నిద్రపట్టనే లేదు. తెల్లవారుజామున నొక చిన్నకునుకు పట్టెను. అంతలోనే పగతురు కోట నాక్రమించి విక్రమసేనునిం బట్టుకొని బంధించినట్లు దుస్స్వప్నము రాగా నామె నిద్రలో నయ్యో యయ్యో యని యరచి వగచి త్రుళ్ళిపడి మేల్కాంచి లేచి విక్రమసేనుని పాన్పునకడకు బోయి కొడుకు జూచుకొని యది కలగదా యని ధైర్యము దెచ్చుకొని నర్మదను లేపి తన దుస్స్వప్నమంతయు నెరిగించి మరల గన్నుమూసిన నెక్కడ పాడుకల వచ్చునో యని శంకించి తెల్లవారువరకు దానితో మాట్లాడుచుండెను. తెల్లవారినపిదప సమయోచిత కృత్యములు దీర్చి ఆ దేవి మణివర్మం బిలుచుకొని రమ్మని యొక సేవకునిం బనిచెను.

అతడును స్నానసంధ్యాద్యనుష్ఠానములు దీర్చికొని సముచిత వేషంబు దాల్చి రాచనగరు జొచ్చి దేవిని సందర్శించెను. విక్రమసేను డామె ప్రక్క నుండెను. వారి మొగము లెప్పటియట్లు ప్రసన్నములు గాక వేరుభంగి నుండుటచే నేదో క్లిష్టవిషయము వారి మనస్సులం బీడించుచున్నదని వృద్ధమంత్రి యూహించి కారణ మడుగబోవుచుండ నంతలో నరవిందాదేవి యుచితాసనంబున నతనిం గూర్చుండబనిచి కడచినరేయి సోమభట్టు తెచ్చిన భూర్జపత్రము నతని చేతికిచ్చి చదువుకొమ్మనియెను. ఆ సచివోత్తముడు లేఖ నామూలాగ్రముగ జదువుకొని విస్మితుడై యేమనుటకు నోటమాట రాక చదివినదే చదువుచు లేఖ దిరుగవేయుచు వెఱ్ఱివానివలె నుండెను. అప్పు డరవిందాదేవి వాని నుద్దేశించి—"అయ్యా! లేఖలోని వ్రాత నీయదియగునా?" యని యడిగెను. "అమ్మా! వ్రాత నాయది కాదు. ఈ జాబు నెన్నడు నేను వ్రాయలేదు. సింధునాయకుడగు పరంతపుని పేరు

వినుటయేకాని వాని నెన్నడు జూడలేదు. వానికి నాకు సంబంధము లేదు కాని యీ వ్రాతి యచ్చముగ నావ్రాతవలెనే యున్నది. అక్షరముల పొందిక తలకట్లయొక్కయు పొల్లులయొక్కయు తీరు నేవ్రాసినప్పు డెట్లుండునో యట్లేయున్నది. ఇదిచూడ మాయగానున్నది" అని యతడు బదులు చెప్పెను.

"అయ్యో! వ్రాత నీవ్రాతవలె నున్నదా? అక్షరములు పొందిక తలకట్లతీరు పొల్లులతీరు నీవ్రాతలో నున్నట్లె యున్నవా? కాని బాబు నీవు వ్రాసినదికాదా? ఇది యెవ్వరైన విశ్వసింతురని నీవు చెప్పుచుంటివా? నీపలుకులు శిశువులు నమ్మవలయును. పశువుల వంటి బాలీసులు నమ్మవలయు. మతిలేనివారు నమ్మవలయు. ఇట్టి పలుకులు నమ్ముటకు మేము వెఱ్ఱివాండ్రము కాము. నీవే తండ్రివి; నీవే సోదరుడవు. నీవే మాకేడుగడయు, మామామగారినాటినుండి మమ్ముం గొలిచియున్నవాడవు నని నేనెంతో విశ్వాసముంచి మాయర్ధప్రాణములు నీకప్పగించినందుకు బదులుతుల రూకలకు నిరువది యగ్రహారములకు నాసపడి మాగొంతు గోయదలచితివా? చిన్నరాజునుబట్టి పగతుర కప్పగింప దలచితివిగా! ఇంతకన్న ద్రోహమున్నదా? భర్తృవియోగ దుఃఖమున మరుగుచున్న నన్ను జూడవైతివి? తండ్రిలేని పసిపాపలని జాలిపడవైతివి? నీవు బెబ్బులులకన్న తోడేళ్ళకన్న విషసర్పములకన్న ఘాతుకకృత్యముల సేయదలచితివే! నీవు చేయదలచుకున్న ద్రోహమునకు యమధర్మరాజు నీనిమిత్తమై క్రొత్తనరకముల సృష్టింపవలయుగాని ప్రాతనరకములు పనికిరావు. నీకగ్రహారముతో కావలసిన పక్షమున నన్నడిగిన నేనియ్యనా? రూకల నేనియ్యనా? బిరుదుల నేనియ్యనా? దీనికై గడ్డితినవలెనే? చిరకాలము జీవించితివే! ఎందుకు నీజీవనము? జగజ్జనుల బీడించుచు సర్పము వేయి సంవత్సరములు జీవించును. గదాధరుడు శూలపాణి మాధవసేనుడు మొదలగు నందరనుగూడ జెరచితివే. అహా! తేనె బూసిన కత్తియని గడ్డిగప్పిన గొయ్యియని యెరుగక మేము మోస

పోయితిమి. చాలు చాలు! చిత్రభానుడు పరమ దుర్మార్గుడంటివి. అతడు మహారాజుగారిని వధించెనంటివి. అతనికన్న నీయాధిక్యమేమి? నీదుశ్చరిత్రమువలన నిక నెవ్వరిని నమ్మకూడదను నీతి మేము నేర్చుకొంటిమి. బ్రాహ్మణుడవు. వయోవృద్ధుడవు. చిరకాల పరిచితుడవు. కావున మేమూరకుండవలసి వచ్చెగాని నీవెట్టిశిక్షకైన పాత్రుడవు. నీకంతఃకరణము లేదు. నీకు గుండెలు లేవు. కటికివాడైన నీకన్న యోగ్యుడు. రాక్షసులైన నీకన్న యోగ్యులు. చాలుచాలు నిక పొమ్ము" అని యాగ్రహావిష్టయై యురవిందాదేవి యాతని గడుంగడు దూలనాడెను. విక్రమసేనుడు—"తాతగారూ! మాయమ్మ కోపావేశమున మిమ్ముం దూలనాడినదన్నమాటకాని యీ జాబు మీరు వ్రాయని యెడల నిట్లుండుటకు గారణమేమో చెప్పగలరా? ఇది యసంభవముగాదా?" యని యడిగెను. మణివర్మ మొగము కళావిహీన మయ్యెను. చిరకాలమునుండి కడువిశ్వాసముతో దానొనర్చిన సేవంతయు బూడిదబోసిన పన్నీరయ్యెనని యతడు మనంబున విచారించెను. అయినను ధైర్యము దెచ్చుకొని యిట్లనియె—"కుమారా! రాజపత్ని యైనందున నీకుంబలెనె నాకుం దల్లి. తల్లి బిడ్డలను లోపమున్నప్పుడు లోపమున్నదని భావించినప్పుడు చీవాట్లు పెట్టుట యుక్తము. నేను మహాపరాధము జేసితినని నమ్మి యామె బాణములవంటి మాటలతో నన్ను నొప్పించె. అందుకు నేవిచారింపను. రాజ్య మీస్థితిలో నున్నప్పుడు మిక్కిలి యనుమానాస్పదమైన యిట్టి లేఖ చేయి జిక్కినప్పుడు మీయమ్మయే కాదు—ఎవ్వరైన నిట్లే యందురు. ఈ యపరాధమును నేను జేసినపక్షమున నామె యన్న మాట లన్నిటిని నేనర్హుడనే. నేనీతప్పు చేయలేదని నాయంతరాత్మ యెరుగును; భగవంతు డెరుగును. మాధవసేను డెరుగును. ఇది శత్రువుల కల్పనము. బ్రహ్మసృష్టికి బ్రతిసృష్టి జేసిన విశ్వామిత్రుడు వలె నావ్రాత కెవరో మిక్కిలి బుద్ధిమంతుడు ప్రతిసృష్టి గావించినాడు. లోకములో నెంతెంత నేరజాణలైన గలరు. పరమేశ్వరుడు

సృష్టించిన ఆకులం బోలిన ఆకులు, పండ్ల బోలిన పండ్లు, మవ్వపుం జిగురులుం బోలిన మావ్వపుం జిగురులు జిత్రింపగల చిత్రకారులున్నట్లే రూపంబులం బోలిన రూపంబుల నిర్మించు శిల్పులున్నట్లే వ్రాతలం బోలిన వ్రాతల సృష్టింపగల భూలోక విశ్వకర్మలు, కలియుగ విశ్వామిత్రులు లోకంబునం గలరు. మీకు నామీద నాగ్రహము బుట్టించుటే వారి సంకల్పము. అందు వారు సంపూర్ణముగా కృతకృత్యులైరి. నన్ను మీరు తూలనాడినట్లు, నాయెడ నమ్మిక గోలుపోయినట్లు, నన్ను గొలువునుండి తప్పించినట్లు వారు విందురేని వారి కార్యము నెరవేరినట్లు వారానందింతురు. ఎట్లయిన శత్రువులు సంకల్పసిద్ధులు. తల్లీ! నీవు రోషావేశమున నన్నుం దూలనాడినను నేనాగ్రహింపను. నేను మనోవాక్కాయ కర్మముల మీయెడ దోసమాచరింప దలతునేని కాశీమహాక్షేత్రమున గోసహస్రమును వధించినట్టు. కురుక్షేత్రాది పుణ్యస్థలములలో బ్రాహ్మణహత్యలు చేసినట్లు. నాతల్లిం జంపినట్లు. నాతండ్రిం జంపినట్టు ఇంతకన్న నేనేశపథంబులు చేయుదు? నన్ను గురించి నేజెప్పుకొనుట న్యాయముకాదు. సూర్యచంద్రులు సాక్షులుగా, భూమ్యాది పంచభూతములు సాక్షులుగా నేను మీయెడ కృతజ్ఞుడనై యున్నాడను. ఏపాపమెఱుగను. నాచేసిన మేటిసేవ బూడిద బోసిన పన్నీరైనదని నాబ్రతుకు హాస్యాస్పదమైనదని నేను విచారించుచున్నాడను ఏలయన నమిత రాజభక్తి గల్గియుండుటచేత నేనావల జిత్రభానునకు బగతుడనైతిని. అతని మాయలను నురులలో మీరు చిక్కుటంజేసి మీకు నేబగతుడనైతిని. ఏమైననేమి? మీరు నన్ను గొలువులోనుండి తప్పించినను సరే, దూషించినను సరే, రాజకులమునకు నామేన ప్రాణము లున్నంతసేపు నేనుపకారమే కాని యపకారము సేయను. నాతల దెగవేసి కోటకొమ్మలకు గట్టించినను నేను విచారింపను. నామరణమువలన గాశ్మీరరాజ కుటుంబమునకు మేలగునేని నాజన్మము సార్థకమైనదని నేను సంతోషింతును. నాబుద్ధి, నాశరీరము, నాకాలము, నావయస్సు

మీ సేవకై గడపితిని. కొనయూపిరి యున్నంతసేవు నికముందు నట్లే చేయుదును. ఇట్లు సేయనైతినేని బంచమహాపాతకులు వోవు దుర్గతు లకుం బోవుదును."

ఇట్లు సంపూర్ణ మనోవేదనతో సంభాషించి యా వృద్ధసచివుడు వారికడ సెలవు దీసికొనిపోయెను. పోవుటకు సెలవిమ్మని యడిగినప్పుడు గూడ నరవిందాదేవి వానితో మాటలాడలేదు. విక్రమసేనుడు మాత్రము—"మంచిది. పోయి రండ"ని పలికెను. మణివర్మ రాజాంతఃపురమున జరిగిన చిత్రకథ యంతయు మాధవసేనునకు గదాధరాదులకు దెలిపి రాజకుటుంబము చిత్రభానుడు త్రవ్విన గోతిలోబడి లేవలేక యున్నదని మిక్కిలి విచారించెను. వారును దేవి ప్రమాదమున దప్పుదారిం ద్రొక్కినదని నొచ్చుకొనిరి.

మంత్రి వెళ్ళినవెనుక విక్రమసేనుడు తల్లితో—"మణివర్మ చెప్పిన సమాధానము ప్రశాంతమైన సమయమున వెండియు నాలోచింపదగి యున్నద"ని చెప్పెను. "నాయనా! మిత్రు లెవ్వరో శత్రు లెవ్వరో దెలిసికొనుటకు వీలులేని యవస్థలో మనమున్నాము. నా మనస్సు చెడిపోయి యున్నది. అది చక్కబడిన వెనుక నట్లు జేయుదము" అని యుత్తరము చెప్పెను.

## పండ్రెండవ ప్రకరణము

చిత్రభానుడు కర్పూరమంజరికి వజ్రపాణిపై ననురాగము గలుగునట్లు జేయవలసినదని తన భార్యతోడను మల్లికతోడను దన వాక్పటిమ మంతయు వినియోగించి చెప్పెనుగదా! తన యాశ లన్నియు దానిమీదనె నిలిచియుండుటచే నప్పని యెట్లు పరిణమించునో యని మనసులో నింతింత యనరాని బెంగబెట్టుకొని యుండెను. "బాలికతో మాటలాడితివా? మాట్లాడితివా?" యని

యిందుమణి ప్రత్యహముం దొందరపెట్టుచుండెను. మల్లిక కంటబడి నప్పుడెల్ల—"బిడ్డయేమన్నది? చెప్పితివా!" యని యడుగుచుండును. మూడు నాలుగు దినములు గడచిన తరువాత నొకనా డిందుమణి బిడ్డం బిలచి భర్త తనతో జెప్పిన విషయమంతయు నామె కెఱిగించెను. అదివిని కర్పూరమంజరి యనిష్టమును సూచించు చిరునవ్వునవ్వి యూరకుండెను. భావజ్ఞురాలయిన తల్లి యక్కన్యామతల్లి యుల్లము దానివలన దెల్లముగ నెఱిగి వల్లభునితో నావృత్తాంతము జెప్పెను. అంత నతడు మల్లికను ద్వరపెట్టి వేధించుటచే నామె కర్పూరమంజరితో మాటలాడి యామె భావమును జిత్రభానుని కెఱిగించెను—"అయ్యా! మీ బాలిక మీసందేశము నాముఖమున విని నన్ను మొగము వాచునట్లు జీవాట్లు పెట్టినది. బుద్ధిలేదాయని యడిగినది, ఇట్టి సందేశములు తేవలదని నొక్కి చెప్పినది. కావున దేవరవారె స్వయముగా నామె నడుగుట సమంజసము. మీయెడగల భక్తినైన భయమునైన నామె మీయుపదేశమును మన్నించి మీకోర్కె దీర్పవచ్చును. ఇది మాకు సాధ్యముగాదు. ఆమె కెవ్వరి యెడ గౌరవమున్నదో వారీ ప్రసంగము చేయవలయుగాని మిక్కిలి చనువుగల మాబోంట్లు చేయగూడదు. అనవుడు చిత్రభానుడు తల యూచి—"సరే! ఆమె యభిమతము నేనే కనుగొనియెదన" ని యారేయి భోజనానంతరమున బాలికయున్న గదిలోనికిబోయి సముచితాసనమున గూర్చుండి—"అమ్మాయీ! నీతో నేనొక్క మాట చెప్పదలచి వచ్చితి. స్థిమిత మనస్కవై వినుము" అని చెప్పెను.

ఎన్నడు దన గదిలోనికిరాని తండ్రి యారేయి తనకడకు వచ్చుటచేత నతడు తన వివాహ విషయమునుగూర్చి ప్రసంగింప దలచి యరుదెంచి యుండునని యామె గ్రహించి యాతనికి జెప్పదగిన సమాధానము ముందుగా నూహించుకొని ధైర్యముతో నెదుట మంచముమీద గూర్చుండెను. అప్పుడు తండ్రికి బిడ్డకు నీక్రింది విధమున సంభాషణము జరిగెను.

చిత్రభాను—కుమారీ! నేనును నీతల్లియు మున్ను చేసిన పూజల ఫలముగా నోచిన నోములపంటగా దేవతా వరప్రసాదముగతె మాయదృష్టవశమున లేక లేక యొక్క కుమారితవు జన్మించితివి. నాకు నీవొక కన్ను. నీతమ్ముడు విజయసేను డొక కన్ను. అందు నీవే నామనోరథంబవు, నాకనుల చందమామవు. నాబహిఃప్రాణంబవు. అట్లగుటచే నేను నిన్నొక్క కోరిక గోరదలంచి వచ్చితిని. అది నీవు సఫలము చేసెదవో బహుదుఃఖపరంపరచేత నవసియున్న నామనస్సు చెడిపోవునట్లు నిరాకరించెదవో యెరుగ, ఏమనియెదవు?

కర్పూ—తండ్రీ! అది వినకుండ నేనేమి యుత్తరము చెప్ప గలను?

చిత్ర—బిడ్డా! నీవది విన్నదే! నీతల్లి వలన వింటివి. మల్లిక వలన వింటివి. అయినను నానోటకూడవిని సమాధానముజెప్పు. నీకు వివాహయోగ్యకాలము ప్రాప్తించినది. తగినవరుని నన్వేషింపవలసిన భారము నాపై నున్నది. బిడ్డలకు మాతాపితలకన్న హితార్థులు క్షేమంకరులు నాప్తులు ప్రపంచమున మరియొకరు లేరుగదా! అందుచేత మేమెల్లవిధముల నీమేలు నీసుఖముగోరి వరనిర్ణయము సేయుదుము. స్వయంవరమనుపద్ధతి రాచకొలమున నున్నదిగాని దాని వలన గొన్ని యరిష్టములుండుటచే నది నాకిష్టములేదు. బాలికలు నవయౌవనప్రేరితలై పౌర్వాపర్యములు విచారింపక భావికాల కష్టముల నెన్న లేక—"కన్యా వరయతే రూప" మ్మనునట్లు కేవలము చక్కదనమునే చూచుకొని యేదరిద్రుడనో గుణహీనునో నాస్తికునో కులభ్రష్టునో విద్యాగంధశూన్యునో వరింతురు. స్వయంవరమున ప్రమాదమున కెన్నో యవకాశములున్నవి. కావున దానిని నేనంగీకరింప. అందుచే మేముచేసిన నిర్ణయమునే నీవు తలయొగ్గి యనుసరింపవలయునని కోరుచున్నాను. 'మాతృదేవోభవ పితృదేవో భవ' యని వేదము చెప్పుచున్నది. మాతాపితలు బిడ్డలపాలి దైవతములు. వారిమాట యవశ్యము గ్రాహ్యము. అట్లగుటంజేసి నీవు

నామాట ననుసరింతువని నమ్మియుంటి. విశేషించి నీవు తక్కిన రాజకన్యల వంటిదానవుకావు. కావ్యనాటకాదులేగాక శాస్త్రముల గూడ నభ్యసించినదానవు. గుణగ్రహణపరాయణవు. సంగీత సాహిత్య ధౌరంధర్యమున నీకు సాటియగుకన్య నేటికాలమున లేదు. నాబిడ్డవగుటచే నేను నిన్ను బొగడకూడదు. గాని నీవిద్యకు వినయము వన్నె పెట్టుచున్నది. ఈనాటి కన్యలవలె గర్వము పెంకెతనము నీకడ నున్న పక్షమున నేనట్లు చెప్పుటకు రాకనేపోదును.

కరుణా—తండ్రీ! స్వయంవరమున ప్రమాదము లున్నవనుట నిజమేకాని దమయంతి పొరబడినదా? రుక్మిణి పొరబడినదా? తల్లిదండ్రుల కిష్టములేని పెండ్లికొడుకును జేపట్టినను సుభద్ర పొరబడినదా? విద్యావంతులైన కన్యకలు మనసులో నెంత వలపున్నను నెంత మోహపరవశులైనను స్వయంవర సమయమున దమ కులగౌరవంబును వరుని యాభిజాత్యమును గుణసంపదను జూచుకొనకపోరు

చిత్ర—బిడ్డా! అందరు కన్యకలు దమయంతియట్టివా రగుదురా? అందరు రుక్మిణివంటివా రగుదురా? ఎల్లరు సుభద్రలగుదురా? అవి పురాణములలోని గాథలు. అదిగాకను గాక కవి చాతుర్య మందు మెండుగా నుండును. కవులు గోరంతలు కొండంతలుజేసి వర్ణింతురు. ఆమాట నీవే యెరుగుదువు. దానికేమిగాని నీవెవ్వరి కొరకైన మేలు పడితివేమో చెప్పుము. నీవలపున కేరాజకుమారుడైన గురియైనచో నది నా కెరిగింపుము. అతడు స్వీకరింప దగినవాడగునో కాదో చెప్పెద.

కరుణా—ఆ విషయమున నేనిప్పుడేమియుం జెప్పజాల. (అని సిగ్గున దలవంచినది.)

చిత్ర—అమ్మా! మాళవ రాజనందనుడగు మకరందుడు నీకు వచ్చినాడని గర్ణాకర్ణికగ వింటిని. అయ్యది నిజమగునో కాదో నీవు నా కెరిగింపుము. నాకడ సిగ్గుపడకుము. నీమనోభావము స్పష్టముగా దెలుపుము. పెరవాడనుగాను. కన్నతండ్రిని. నీభావము దెలుపుదువేని నేనందున్న గుణదోషము లుగ్గడించెద.

కర్పూ—భావమున కేమిగాని యక్కుమారుని యందుగల గుణదోషముల నుగ్గడింపుము.

చిత్ర—బిడ్డా! గుణదోషము లుగ్గడింపవలసినదని నన్నడుగుచుంటివా? నీవు విద్యావతివి. గుణగ్రహణశక్తికలదు. అనగూడదుగాని నాకన్న నెక్కువ చదువుకొంటివి. నీవు గ్రహింపలేని గుణదోషముల నేనెన్నగలనా? అయినం దండ్రినగుటచేతను బెద్దరికము నామీఁద బెట్టుటచేతను జెప్పెద వినుము—మాళవేంద్రుడగు సుదర్శనుడు బౌద్ధుడు. మనము క్షత్రియులము. మనము వర్ణాశ్రమ ధర్మముల బాటింతుము, వారికవి లేవు. మనకు యజ్ఞములు మొదలగు క్రతువులుకలవు. శ్రాద్ధములు మొదలగు పితృకర్మలుగలవు. సంధ్యావందనాది నిత్యకర్మలుకలవు. ఇవి వారికి లేవు. వారు వేదమును ప్రమాణముగా గ్రహింపరు. శాస్త్రములు విశ్వసింపరు. పురాణములు కల్పిత కథలందురు. ఆత్మ లేదందురు. ఉత్తరలోక ఫలమును నమ్మరు. జగన్నిర్మాణ ధురీణుడగు చతుర్ముఖునికన్నను, విశ్వరక్షణ కళాప్రవీణుడగు నారాయణునికన్నను, జగత్ప్రళయ కారణుడయిన శివునికన్నను శాక్యకులుడైన గౌతమబుద్ధుడె సర్వవిధముల నధికుడని వారు విశ్వసింతురు. ఇన్నిటికన్న గష్టమైన దింకొకటికలదు. వారు పరమేశ్వరుడు లేడందురు. అందుచే నాస్తికులు. ఇట్టి యపవిత్రమగు ధర్మ ముపదేశించి లోకులను ధర్మభ్రష్టులను బరమపతితులను జేసిన యీ గౌతమబుద్ధునకు నధమగతి లేగాని యుత్తమగతు లుండవుగదా!

కర్పూ—తండ్రీ! బౌద్ధమత సిద్ధాంతములు నీకు సరిపడకపోయిన బోవుగాక! నీచెప్పిన దోసములు బౌద్ధమతస్థులకడ నుండిన నుండుగాక! కాని లోకోత్తర చరిత్రుడును, బరమపవిత్రుడును, సర్వదీనజనమిత్రుడును నయిన సిద్ధార్థుని నీవట్లు దూషించుట ధర్మముగాదు. ఆ మహాత్మునికన్న నుత్తముడు నమ్మహనీయునికన్న మాననీయుడు—నా దేవునికన్న మహానుభావుడు జగంబున మరియొకడు గలడా? ఆ సిద్ధాంతములు నీవు చదువలేదు. వైదిక ధర్మనిరతులగు

పండితులవలన నిజములు కొన్ని, యబద్ధములు కొన్ని విని పౌరత ధర్మములు నింద్యములని దురభిప్రాయము గలిగియుంటివి. అది పొరబాటు. చిత్తగింపుము. అమ్మహాత్ముడు పవిత్ర రాజవంశమున జన్మించి మహీమండలమేలుట కర్హుడైయుండియు దండ్రికొక్కడె కొడుకయ్యు, నమితలావణ్య కారుణ్య సమేతయగు భార్యం గూడి యుండియు, సకలైశ్వర్యసమృద్ధి గల్గియుండియు లోకము పాప భూయిష్ఠమై యున్నదని విచారించి దుర్గతి పాలగుచున్న మానవ లోకము నుద్ధరింప నమకట్టి యాలుబిడ్డలను, తల్లిదండ్రులను, బంధు మిత్రులను భాగ్యభోగ్యములను విసర్జించి చీని చీనాంబరములకు మారుగా గాషాయవస్త్రములదాల్చి, ముత్యాలహారములకు మారుగా రుద్రాక్షమాలలు ధరించి శిరమున రత్నమకుటమునకు మారుగా జటాజూటము వహించి, గమగమతావులనీను కలపంబులకుమారు బూదిబూసికొని, యుద్యానవనములురోసి వనములడాసి, మేడలు విడిచి చెట్లనీడలవిడిసి, హిరణ్మయ పాత్రముల త్యజించి మృణ్మయ పాత్రముల భుజించి, పరమనిష్ఠాగరిష్ఠుడై తపంబుసేసి, మేను శుష్కింప జేసి యింద్రియంబులగెల్చి, జీవితముయొక్క పరమార్థముం గని పెట్టెను. ఆ మహానీయుడు మధ్యమలోకమున కలంకారము. క్షత్రియు డగుటచే రాచకొల మాయనవలన వన్నెకెక్కెను. మానవలోక మాయనవలన బవిత్రమైనది. దయాదాక్షిణ్యములే యా మహాత్ముని మతమునకు మూలరాళ్ళు, ఆ శాక్యసింహుడు మూర్తీభవించిన భూతదయయని చెప్పుట యతిశయోక్తిగాదు. భూతదయ యాతని కళేబరముతో నాడు దగ్ధమైపోయినదనుట పొగడ్తగాదు. శాంత మా మహానీయునితో నాడు చితిమీద బూడిదయయ్యెనని పలుకుట కవిచాతుర్యముగాదు. ఆయన బోధామృత మాస్వాదించినవారు ధన్యులు. ఆయనం జూచినవారు కృతకృత్యులు. ఆయన మతము స్వీకరించినవారు పవిత్రులు, ఆయనవలన మానవులు పతితులుగాలేదు. పతితులు పావనులైరి. దుర్జనులు సజ్జనులైరి. అపవిత్రులు పవిత్రులైరి.

ఆ భగవానుడు దేవుడున్నాడనిగాని లేడనిగాని చెప్పలేదు. అంత మాత్రముచేత వాడు నాస్తికుడుగాడు. అతని మతము నాస్తిక మతముగాదు. అతడాస్తికులలో నగ్రగణ్యుడని చెప్పవచ్చును. ఆస్తికులమని విర్రవీగు మానవులలో ననేకులు సత్యనాస్తికులు, ధర్మనాస్తికులు, దయానాస్తికులు, భక్తినాస్తికులు కలరు. ఆ నాస్తికులలో నెందరో యాస్తికులు గలరు. భూతదయా జితేంద్రియత్వము ననురెండును దన్మతమునఁ బరమ సిద్ధాంతములు. ఆ మత మవలంబించినవారు జీవహింస చేయరు. 'ఆత్మవత్సర్వభూతాని' యను ధర్మము వారియందు స్థిరమైయున్నది. జీవహింసా భయముననే వారు యజ్ఞములు మానిరి.

చిత్ర—అమ్మాయీ! బౌద్ధమతసిద్ధాంతములు నీతల కెక్కినవే! అవి యెక్కడ నేర్చితివి? ఆ మతమున్న నీకింత గౌరవము కలుగుటకు గారణమేమి? గురివెందగింజలు నిప్పులని, గాజుపూసలు జాతిరత్నములని, యెర్రని పెంకులు కెంపులని నీవు భ్రమించుచుంటివి.

కర్పూ—తండ్రీ! నేను భ్రమించుటలేదు. నేను విదర్భలో నున్నప్పుడు మైత్రేయియను బౌద్ధయోగిని యొకతె రాజాంతఃపురమునకు వచ్చుచు బోవుచు శుద్ధాంతకాంతలకు నప్పుడప్పుడు సుగతస్వాముల ధర్మములు నుపదేశించుచుండెను. అవి నేను మిక్కిలి శ్రద్ధగ వింటిని. పిమ్మట నామె పాళీభాష నాకుపదేశింప నందులో నున్న ధమ్మపదము మొదలగు నుత్కృష్ట గ్రంథముల జదివితిని. అది కారణముగా నాకు మహనీయుడైన బుద్ధదేవునిమీదను వాని మతముమీదను నమితగౌరవము గలిగినది.

చిత్ర—సహవాస దోషమున సుశీలురు దుశ్శీలురగుట ఆశ్చర్యముగాదు. నీళ్ళకు వస్త్రములకు వాయువునకు వస్తుసహవాసములనుబట్టి సుగంధ దుర్గంధములు గలుగునట్లు మనుష్యులకుగూడ దుర్జన సజ్జన సహవాసమువల్ల దురభిప్రాయ సదభిప్రాయములు పట్టువడును. ఒకవేళ బౌద్ధమతములో నుత్కృష్ట ధర్మము లున్నను బౌద్ధులందరును సుగుణసంపన్నులగుదురా?

కర్ణా—తండ్రీ! అందరు సుగుణవంతు లుండరు. కాని మానవేంద్రుడగు సుదర్శనుడు లాటివారితో బోల్పదగినవాడు గాడు; ఆయన గుణరత్నాకరుడు. అతడు తనదేశమున జీవహింస మాన్పించెను. ఆయన నిష్కళంక చరిత్రుడు. పరమ కృపాళుడు; ప్రజలం దన బిడ్డలుగా జూచును, ఆత్మసుఖముకంటె ప్రజాసుఖ మెక్కువగ జూచును. ఎక్కువ పన్నులుగట్టి ప్రజల బాధింపడు. బౌద్ధమతస్థులమీద బక్షపాతము, వైదికమతస్థులమీద ద్వేషము లేదు. అందర సమానముగ జూచును. ఆయన కొమరుడు మకరందుడు పితృమార్గానువర్తి. తల్లిదండ్రులకు విధేయుడు. ప్రజాబాంధవుడు. తండ్రివలెనే యతడుగూడ రాజ్యమందలి ప్రజలలో దండ్రి లేని వారికి దండ్రి. సోదరులు లేనివారికి సోదరుడు. మిత్రులు లేనివారికి మిత్రుడు, బిడ్డలు లేనివారికి బిడ్డ. ఈ విధముగా వారు సర్వజన శ్లాఘనీయులై, కృపాసముద్రులై, ధర్మతత్పరులై రాజ్యపాలనము సేయుచున్నారు.

చిత్ర—ధర్మతత్పరులై పరిపాలించుట నీ వెట్లెరిగితివి?

కర్ణా—మాళవ దేశమున నేనున్న కాలములో వారి యౌదార్యాది గుణములు దెలిసికొనుట కనేకావకాశములు గలిగినవి.

చిత్ర—అంతఃపురమునందున్న విదేశాంగనకు నీకు లోకము నందలి వ్యవహారము, రాజుల పరిపాలనాపద్ధతులు దెలిసికొనుట కవకాశము గలిగినదా? ఎంతో కాలము దేశమందుండి నల్గడలు దిరిగి జనులతో గలసి మెలసి యున్నవారికి . తెలియుట కష్టముగదా! నీకవలీలగా దెలిసెనని నీవనినంత మాత్రమున నమ్మవచ్చునా? ఏదో యభిమానమున నిట్లనుచుంటివి.

కర్ణా—తండ్రీ! నాపలికినది సత్యముగాని యభిమాన ప్రేరితమైన మాటగాదు! శత్రువులయందైనను గుణమున్నచో గ్రహించుట సత్పురుష లక్షణము.

చిత్ర—గుణమున్న గ్రహింపవచ్చును. లేనిచో గ్రహించు టెట్లు? ప్రస్తుతాంశమువిను! మకరందునిమీద నీవు వలపు నిలిపి

తివో లేదో నీమాటలచే స్పష్టముగా దేటపడలేదు. కాని వానియెడ నీకుగల యభిమానముంబట్టి నీకాతనిపై గూరిమి గలదని నేను నిశ్చయింపవలసివచ్చినది. మనము వైదికాచార సంపన్నులము. వారు వేదబాహ్యులు, కర్మరహితులు. మనకు వారికిం గలయిక యుపేక్షణీయముగాదు. నీవు దేవాలయమున కరుగుదువు; వారు దేవాలయములను రోయుదురు. మనము శివకేశవులను బరమాత్ములుగా నెంతుము, వారు మనుష్యమాత్రుడైన బుద్ధునే యారాధింతురు. నడవడులలో నాచారములలో నభిప్రాయములలో మనకు వారికి నమిత భేదము గలదు. అట్టివారి మనసు లెట్లు కలియును? పొత్తులెట్లు కలుగును? సామరస్య మెట్లు కుదురును?

కర్పూ—తండ్రీ! అన్నింటికి మనస్సు ప్రధానము. మనస్సులో నిష్టమున్నయెడల నన్నిట సామరస్యము గుదురును. దంపతులు భిన్నమతస్థులయినను దాంపత్యమున భంగముండదు. భర్త శైవుడు, భార్య వైష్ణవియైన దాంపత్యము లున్నవి. మతములో నెవ రిష్టము వారిది. ఎవరి యిచ్చవచ్చినట్లు వారు దేవతల నారాధించుకొన వచ్చును. అంతమాత్రముచేత బరస్పర మైత్రికి భంగముండదు. అరమరలేని కూరుములు నిలుపుటకు మత మడ్డమురాదు.

చిత్ర—బిడ్డా! నీవు వెఱ్ఱిపడుచున్నావు. అట్టి దంపతుల కెన్నడు గాపురము సరిగా బొసగదు. 'అయ్యా దాసునకు బెట్టు, నమ్మ జంగమునకు బెట్టు' నన్న సామెత నిజమగును. నీవు జక్కదన మొక్కటే మెచ్చి యాతని వరింపదలంచుచుంటివి. వరునియందు జూడదగిన లక్షణ మదియొక్కటియేగాదు. త్రాచుబాము తలలో వెలలేని మణి యుండును. అది చూపుల కెంతో చక్కగా నుండును. ఈ గుణములంబట్టి దాని నెట్టి వెంగలియైన మెడలో హారము వైచుకొనునే? దానిం బ్రక్కలో బెట్టుకొని పండుకొనునే? మెరయుచున్నదంతయు బంగార మనుకొనవద్దు. కస్తూరీపంకము బూసికొనవచ్చునుగాని బురద బూసికొనగూడదు.

కర్పూ—అయ్యా! చక్కదన మొక్కటే మెచ్చి కార్య నిశ్చయము చేసికొనుట లేదు. మెడదాల్చునది కుసుమమాలగాని కోడెత్రాచుగాదు. మేన బూసికొనునది మృగనాభిగాని, మెత్తని బురదగాదు.

చిత్ర—బిడ్డా! చదువుకొన్నదానవు గావున వీరుడు బాణము నకు బాణము వైచినట్లు మాటకు మాట సమయోచితముగ జెప్ప గలవు. యుక్తుల నటుంచి నామాట వినుము. మకరందునిపై మక్కువ మానుము.

కర్పూ—అట్లయిన నెవ్వని పాణిగ్రహణము సేయుమందువు?

చిత్ర—భళీ! ఇప్పుడు దారికి వచ్చితివి. చెప్పుచున్నాను వినుము—ఈ పట్టణమున దండపాణి వజ్రపాణి యని యిరువు రన్న దమ్ములున్నారు. వారుత్తమ క్షత్రియులు; చంద్రవంశజులు. మనము పాండవసంతతి; వారు యాదవసంతతి. మనకు వారికి బూర్వకాలము నుండియు నిచ్చికోలు బుచ్చుకోలులు గలవు. వారిద్దరు సేనాధిపతులు. అసహాయశూరులు. నిరుపమ పరాక్రములు. అందు వజ్రపాణి భుజాబల మున భీమసేనుడు, ధనుర్విద్యయందు సవ్యసాచి. సౌజన్యమునందు సహదేవుడు, శాంతమునందు ధర్మరాజే.

కర్పూ—చక్కదనమందో?

చిత్ర—పాడు చక్కదనము, వరునకు జక్కదనమే ప్రధానమా? అది యప్రధానమని నాయభిప్రాయము. అదిగాక యెవరి చక్క దనము వారికుండును. కన్ను ముక్కు చెవి నోరు కాలు సేతులు వంకర లేక సరిగానుండెనా యెట్టివరుడైన జక్కగా నుండును. గుణము ప్రధానముగాని చక్కదనమెందుకు? తురాయిపువ్వు కట్టెర్రగా నుండును. అందములేదు చందములేదు. వాసనలేదు. అతడు నల్లగా నుండును. నల్లగా నున్నంత మాత్రమున యువతీదూష్యుడగునా? అట్లయిన నల్లనివారికి బెండ్లి కాగూడదా? కస్తూరి నల్లనై సువాసనల చేత మాననీయముగాదా? కోయిల నల్లనై మనోజ్ఞ ధ్వనులచే

జగద్వంద్యముగాదా ? ఇంద్రనీలము నిగనిగకాంతుల నీనుచు నవరత్నములలో నొకటికాలేదా ? భగవంతుండగు పరమేశ్వరుడు స్ఫటికమువలె తెల్లని మేనుగలవాడయ్యు నల్లనిదానిని పార్వతిని పెండ్లియాడలేదా ? శ్రీమహాలక్ష్మి బంగారుబొమ్మవలె నుండియు నీలమేఘశ్యాముడైన నారాయణుని వరింపలేదా ? నీలవర్ణము హరిహరులకు భార్యలతోడి కూటములు చెరిపెనా ? పాంచాలి నల్లనిది ; పాండవులు చక్కనివారు. ఇట్టివెన్నో యుదాహరణము లున్నవి. కావున నల్లనివాడని రోయక వజ్రపాణిం జేపట్టుము. అతడు వేయికన్నులు లేని వజ్రపాణి. రక్కసులచే వెక్కసాగుల కయ్యముల నోడిపోని వజ్రపాణి. మునిశాపమును బొందని వజ్రపాణి మర్త్యులోకమందున్న వజ్రపాణి.

కర్పూ—రాజ్యము లేని వజ్రపాణి, పూజ్యత లేని వజ్రపాణి యని చెప్పుము.

చిత్ర—అక్కా! ఆలాగు నిరసింపగూడదు. అందరకు రాజ్యములుండునా ? శ్రీకృష్ణున కేమి రాజ్యము గలదు ? రుక్మిణీ సత్యభామ మొదలగు కాంతలెంతమంది గుణములను వలచి యాతని చెట్టబట్టలేదు.

కర్పూ—ఆయన కిదివరకొక భార్య యున్నదిగదా ?

చిత్ర—ఉండినేమి ? చిన్నదానవయ్యు నీవె పెద్దభార్యవగుదువు. నిన్ను జేపట్టినపిదప నామె గౌరవము కడముట్టును, ఆమె నీకు దాసియై యుండును.

కర్పూ—హరిహరీ ! తండ్రీ ! ఆయన చెట్టబట్టి యెంతో సుఖపడవలెనని సంతానవతియై మహాపతివ్రతయై యాతని సేవించిన యిల్లాలిని నేను దాసిగా నేలుదునా ? అట్టి పాడుపని యెన్నడు నే జేయను. నాదురదృష్టముచేత నొకవేళ నాతని చెట్టబట్టుటయే సంభవించునేని నేనాయనకు రెండవపత్నినై యామెకే నేను దాసినై యూడిగములు సేయుదునుగాని యాసాధ్వి మనస్సునకు రవంతయేని

నొప్పిగలిగింపనుసుమీ! నీవు లక్ష్మీదేవిని శంకరుని ప్రసంగవశమున జేర్కొంటివి. నారాయణుని యందున్న గుణములు నీవజ్రపాణియందున్నవా? దేవతల సామ్యము పనికిరాదు. దేనికైన మనస్సు ప్రధానము. మహారాజునకు మందిరములు కావలెను; విరాగికి విపినములు గావలెను. మనస్సునకు నచ్చినవాడె మన్మథుడు; నచ్చనివాడు నాగుబాము.

చిత్ర—ఇంతకు వజ్రపాణి నీకు నచ్చెనా లేదా?

కరుణ—తండ్రీ! అడుగుచుంటివిగాన జెప్పెద వినుము. అతనిచేయి బట్టుటకంటె శాశ్వత బ్రహ్మచర్యమున నుంట మేలు.

చిత్ర—బిడ్డా! నీవాతని చేపట్టుటవలన మనకు గొప్ప యుపకారమగును. అది యేదందువేని—వజ్రపాణియు వాని యన్నయగు దండపాణియు మన పక్షమున నున్నారు. నీవు వజ్రపాణిని జేపట్టుదువేని వారు హేమచంద్రుని వంశమును సింహాసనమునుండి కూలద్రోసి కాశ్మీరరాజ్యమునకు నన్నభిషిక్తు జేయుదురు. నేను పెద్దవాడను. నాలుగైదేండ్లు రాజ్యము చేసి చనిపోదును. నాయనంతరమున నీతమ్ముడు విజయసేనుడు రాజగును.

కరుణ—(చెవులుమూసికొని) హరిహరీ! ఎంతమాట! విక్రమసేనుని రాజ్యభ్రష్టుం జేయుదురా? అందుకని నేను వజ్రపాణి పాణిగ్రహణము జేయవలెనా? నావివాహ మిట్టి దుష్కార్యమునకై నుపయోగింపబడునా? కటకటా! అట్టి పాడుపనిలో నేనెన్నడు బాల్గొనను. విక్రమసేనుడు తండ్రిలేనిబిడ్డ. మనమందరము వానికి సాయముజేసి రాజ్యమునం దతని సుప్రతిష్ఠితుని జేయుటకు మారుగా నిట్టి దుష్కార్యము సేయదగునే! ఈ కార్యము నింద్యము. దూష్యము. నరకహేతువు. తండ్రీ! అట్టిపని యెన్నడును సేయకుము. విక్రమసేనుడు విజయసేనుడు గూడ నాతమ్ములే. ఎవరు గద్దె నెక్కినను నాకు దద్దయు సంతసమే కాని, పైతృకంబగు రాజ్యమునకు విక్రమసేనుడే యర్హుడు. అతడు రాజగుటే ధర్మము. ధర్మేతరములగు మాటలు నాకడ జెప్పవలదు.

చిత్ర—(రోషముతో) నయమున భయమున నేనెన్నివిధముల జెప్పిన నామాటలు నీమనసున కెక్కకున్నవి. తలక్రిందుగా దపస్సు చేసినను నీకు మకరందుడు భర్తగాడు. నిన్ను వజ్రపాణికే పెండ్లి చేసెదను జూడు.

కర్పూ—(రోషముతో) తండ్రీ! అంతవరకు వచ్చునేని నాశరీర మగ్ని కాహుతి జేసెద, అంత కవకాశములేదేని—ఇదిగో! నా చేతి వజ్రపుటుంగరము కర్పూరమంజరీ శవమునే నీవు వజ్రపాణికి వివాహము సేయవలయునుగాని, యీమేన బ్రాణములుండగా చేయ జాలవు. ఒకవేళ నీవతనిచేత నామెడలో ద్రాడు గట్టించి సంకల్ప సిద్ధుడగుదువేని యది నామెడ కురిత్రాడగునుగాని మంగళసూత్రము గాదు. నీవు శూరుడవు. చలముగలవాడవు. నేను నీకడుపున బుట్టిన కూతును. నీరక్తమే నానాళములలో బ్రవహించుచున్నది. నీ చలమే నాలో బ్రతిఫలించుచున్నది. నేను మనస్సుచేత మకరందుని వివాహ మాడితిని. దేహముచేత వివాహముగాదేని ఈ దేహ మితరులకొర కుపయోగపడక పోవుగాక! బలవంతముగజచ్చి మరియొక జన్మమెత్తి యైన నతనిం జేపట్టెద.

చిత్ర—బలవన్మరణమున బిశాచమగుదువు.

కర్పూ—వజ్రపాణిని వివాహమాడి వానిభార్య యనిపించు కొనుటకన్న బిశాచమైనను మంచిదే, రక్కసియైనను మంచిదే. ఆ పెనుభూతముతో గాపురముసేయుటకన్న భూతమునైనను మంచిదే. వివాహము సామాన్య మనుకొంటివా! నీయిచ్చవచ్చినట్టు సేయుట కిది బొమ్మలపెండ్లి గాదు. రెండు హృదయములు లొక హృదయము కావలె. రెండు మనస్సు లొక మనస్సు కావలె. భర్త చంద్రుడు, భార్య వెన్నెల. మగడు సూర్యుడు; మగనాలు కాంతి. గృహస్థుడు పూవు. ఇల్లాలు తావి. ఏకమనస్సుతో వారవినాభావముగ నుండ వలయు. బలత్కార వివాహములు పనికిరావు.

చిత్ర—నీవు చచ్చిననుసరే! వివాహమాడి చావుము,

కర్పూ—ఆహాహా! నీవంటి తండ్రి ప్రపంచమున లేడు. నేమృతినొందిననుసరే నీకార్యమైనం జాలుగాబోలు!

చిత్ర—సరే! జాగ్రత్తగా నుండుము. నీవు నాకు ధర్మపన్నములు చెప్పదొడగితివి. దీనిఫల మనుభవింతువుగాక!

అని గాఢమగు రోసమున జివాలున లేచి గదివిడిచి యవ్వలకుం బోయెను,

## పదమూడవ ప్రకరణము

ఆశాదేవత జగన్మోహనాకారము దాల్చి హస్తమున బహురసభరితమైన రాజ్యఫలంబును బట్టుకొని మొగమున జిరునవ్వు వెన్నెలలుగాయ—"నన్ను మెప్పించితివేని యీ ఫలంబు నీయదియు నీయదియ! త్వరపడుము, ప్రయత్నింపుము" అని యూరించుచు బలుతెరంగుల బురికొల్పుటం జేసి చిత్రభానుండు స్వలాభపరాయణుడై కన్నబిడ్డ సౌఖ్యము వీటింబుచ్చి నిష్కరుణుడై కర్పూరకుంజరి నట్లు తూలనాడి తన శయ్యాగారమునకుం జని నేత్రములనియెడు కొలుములనుండి రూక్షవీక్షణములను విస్ఫులింగములు వెడలిపడ మొగము జేవురుబూసిన తెరగున శోణమై భయంకరముగ దోప బల్లు పటపట గొరుకుచు నిందుమణిం బిలిచి తనకుం గూతునకుం జరిగిన సంభాషణమంతయు జెప్పి యామె పెంకితనమునకు దగిన దండన చేయునట్లు ప్రతినబట్టెను.

ఇందుమణి మిక్కిలి భయపడి కూతుకడకు బోయి శాంత వచనములతో నిట్లనియె—"బిడ్డా! మీతండ్రిగారి స్వభావ మెరిగి యుండియు నీవాయనకంత కోపము దెప్పింపదగునా? తండ్రిమాట వినవలదా? పితృవాక్యపాలనము నీవంటి విద్యావతియే చేయని పక్షమున సామాన్య బాలికలు చేయుదురా? నీవు తండ్రిని దిరస్క-

రించితినని లోకమున వెల్లడియైన నది మన కప్రతిష్టగాదా? నీవు మిక్కిలి కఠినముగా మాటాడితివట! అట్టి కఠినోక్తులు తగునా?" అని మందలించుటయు గర్పూరమంజరి—"అమ్మా! తండ్రిమాట వినదగినదే. పితృవాక్యపాలన ముత్తమధర్మము, కాని, వివాహము పేరుపెట్టి నాకు దున్నపోతునో పెద్దపులినో లేక మరియొక మోట పశువునో గట్టిపెట్టవలెనని తండ్రిగారు స్వలాభపరాయణులై సమకట్టి నప్పుడు తండ్రిమాట గ్రాహ్యమా? అధర్మము పలికినప్పుడు గ్రాహ్యముగాదు. తండ్రి యసత్య మాడుమన్న నాడవలెనా? జనకుడు నరహత్య సలుపుమన్న సలుపవలెనా? తండ్రి నీతిమాలి వర్తింపుమన్న వర్తింపవలెనా? ఆయన యధర్మము పలికెను గావున నేనాయన యాన దాటితిని" అని బదులు చెప్పెను.

"బిడ్డా! చదువుకొన్నదానవు, నీకు నేను జెప్పజాలనుగాని యొక్కమాట వినుము! మహాత్ముడైన భీష్ముడు తండ్రిసుఖము కొరకు స్వసుఖనిరభిలాషియై వివాహము మానుకొని బ్రహ్మచర్య దీక్షాపరతంత్రుడై లోకవంద్యుడయ్యెను. వివాహమే కాదు రాజ్యము గూడ జనకుని సుఖము నిమిత్తము తృణప్రాయముగా బరిత్యజించెను. రఘురాముడు జనకుని శాసనమున రాజ్యపరిత్యాగంబు గావించి సుకుమారియైన జనకకుమారితో గూడ వనములకేగి పితృవాక్య పాలకులలో నగ్రగణ్యుడయ్యెను. చెప్పబూనిన నిట్టి వనేకములు గలవు. వారి తెరంగున నీవును నీజనకుని నిమిత్తము స్వసౌఖ్యముల నాసింపక యాయన ప్రీతికొరకు నీదేహము సర్పింపరాదె" యని యిందుమణి యుత్తరము చెప్పెను.

"తల్లీ! రాజ్యములు వదలవచ్చును, వివాహములు మానవచ్చును. నేనును వలయునేని వివాహముమాని బ్రహ్మచారిణినై తపోవనమున కరిగి జీవయాత్ర జరిపెద. అది తండ్రిగారి కిష్టమగునేమో కనుగొనుము. కాని, యా నరపిశాచమును మాత్రము జేబట్టను, వివాహమాడదలచితినా నామనసువచ్చిన రాజకుమారుని

నాకు నచ్చిన గుణములు గలవానిని—నాకందోయి నలరించెడు లావణ్యవంతుని—నాహృదయము రంజింపగల రసికశిఖామణిని—నాప్రాణమునకు ప్రాణమైనవాని—నామనోరథము సఫలముసేయువాని—నామేనికి గంధపుంబూతవలె నుండువాని—నొక లోకవంద్యుని—గుణరత్నాకరుని—సత్కులీని, విద్యావంతుని జేపట్టెద. లేదా గార్గివలె శాశ్వత బ్రహ్మచర్యవ్రత మవలంబించి నారలుగట్టి కందమూలములు నాకలములు దిని జడలుదాల్చి మేను శుష్కింపజేసి కోరికలు మొలకలెత్తకుండ పరమపదము నందెద. ఈ రెండుదారులే గాని మధ్యమార్గము నేనొల్ల. దాంపత్య మన నెట్టిదో యెరుగుదువా? అదియు సుఖదుఃఖములయందద్వైతము సర్వావస్థలలో నసంగతము. ఉదయమునకు విశ్రామము ఆజన్మాంతము బరస్పరానంద సంధాయకము. అట్టిదికాని పెండ్లి పెండ్లిగాదు, తల్లీ! ఇన్నిమాట లెందుకు? విదర్భరాజపుత్రికయగు దమయంతి జగత్త్రయ నాయకులు వరప్రదాతలు మహామహిమాఢ్యులునగు దేవతలువచ్చి తమ్ము వరింపుమని ప్రార్థించినను వారిం గ్రేగంటిచూపులనైన దనుపక మానవుడు—తన వలపుకాడునైన నిషధరాజును వరించెను. మరియొక విదర్భ రాజపుత్రిక రుక్మిణి తలిదండ్రులు, నన్నదమ్ములు, బంధుమిత్రులు తన్ను శిశుపాలునకిచ్చి పెండ్లిచేయ నిశ్చయించినను నారికనుమ్రోయి యతిరహస్యమున శ్రీకృష్ణునియొద్దకు దనకు నమ్మికగలయొక బ్రాహ్మణుని రాయబారమంపి తన మనోరథ మాయనకెఱిగించి యాయనచే బలాత్కారముగా గొనిపోబడి రాక్షసవిధిచే నాయనను వివాహమాడెను. అదికాక సాక్షాన్నారాయణావతారుడైన శ్రీకృష్ణునియొక్కయు శేషావతారుడైన బలభద్రునియొక్కయు చెల్లెలు, వసుదేవుని కూతురు, సుగుణభద్ర సుభద్ర తన్ను బలదేవుడు దుర్యోధనున కీయదలచినను మేనత్తకొడుకగు నర్జునుని వలచి వలపించి పితృభ్రాతృవచన తిరస్కారముగావించి యాతని వెంటబోయెను. తల్లీ! వారి సాదృశ్యమేల తేకూడదు? నా చెప్పిన

పలుకులన్నియు జక్కఁగ బరిశీలించి తండ్రిగారి కోపమును శమింప జేయుము. ఇంతకన్న నా చెప్పునది లేదు" అని కర్పూరమంజరి బ్రతిమలాడవచ్చిన తల్లి కుత్తరమిచ్చెను.

పుత్రిక కట్టిపట్టుపట్టియున్నదనియు దనమాట లామె తల కెక్కవనియు గ్రహించి యిందుమణి మారుమాటాడక పడకగదికి బోయి తన యనునయంబులుగూడ దనయయెడ నిష్ప్రయోజనంబులైనవని యాగ్రహావిష్టుడైన భర్త కెరిగించి యాతని యాగ్రహము ద్విగుణము జేసెను.

చిత్రభానుడా రేయి కన్నుమూయలేదు. చాలసేపు తోచక నటునిటు బచారుచేసి తాను తలపెట్టిన కార్యము ఫలోన్ముఖమునకు వచ్చినప్పుడు తానెన్నడు దలపని విధమున గూతురువలన భగ్నమైనదని చింతించి కార్యసాధనము జేయుట యెటులనాయని విచారింప దొడగెను. గాఢముగ నిద్రించుచున్న రుద్రభట్టును మేల్కొల్పి కార్యాలోచన మడుగవలయునని యొకటి రెండుసారులు వాడు శయనించిన తావునకుబోవ సమకట్టి యాతనికి నిద్రాభంగముసేయుట యనుచితమని మరల తనలో దానె సమర్థించుకొని యూరకుండెను. అంత వేకువజామయ్యెను. తెల్లవారబోవుచున్నది. మేలుకొనుడో హోయని కాలపురుషుండు వైచిన కేకవోలె గొక్కొరో కోయని కోడికూసెను. ఆ కూతవినగానే రుద్రభట్టు మేల్కొని యరచేతులు రాపాడజేసి కన్నులు నులుముకొని పుష్పదంత విరచితమైన మహిమ్న స్తవము పారాయణము జేసికొనుచుండెను. అప్పుడు చిత్రభానుడు సమీపించి యా స్తవము ముగిసినపిదప గడచినరేయి దనకుం గూతునకు జరిగిన సంవాదప్రకారము సమగ్రముగా విన్నవించి యిట్లనియె—

"స్వామీ! మీయాశీర్వచన ప్రభావమున గార్యము దాదాపుగా బంటకు సిద్ధమైనది. పరమమూర్ఖురాలైన నాకూతువలన బోటుపొడిచిన సముద్రము పాటువడినప్పుడు వెనుకకు దగ్గినట్లు

కార్యము యథాస్థానమునకు బోవుచున్నది. ప్రధానము చేసినంగాని మనకు సేనాపతులు తోడుపడరు. వారి తోడులేనియెడల మన మిచ్చట జిల్లిగవ్వకైన కొరము. బాలిక మూఢయై నామాటల ద్రోసిపుచ్చుచున్నది. వజ్రపాణి చక్కనివాడుగాడట. సవతియున్నదట మాళవ రాజనందనుడగు మకరందుడు మహీతలమున వెలసిన మన్మథుడట. అతనినేగాని వివాహమాడదట. బుద్ధివిశేషమున శుక్ర బృహస్పతులను జీరికింగొనని మీరే యుపాయాంతర మన్వేషించి తప్పదారింబడక ఈకార్యమును సరియైన త్రోవకు ద్రిప్పవలయును."

అనవుడు రుద్రభట్టు మెల్లగా—"అలాగా! బాలిక కడు మూర్ఖురాలుగా నున్నదే. చదువుకొనిన యాడుది, చదువునేరని మగవాడు పనికిరారని మొదటినుండియు నేను వాదించుచుంటిని. నీకూతురు మొద్దుముద్దియుగాక ముద్దులమూటగట్టునట్లు విద్దియలు నేర్చి పెద్ద పండితురాలయినదని అద్దిరయ సంతసించితివిగాని తుదకు నీకెదురురొమ్ముమీఁది కుంపటివలెనుండి సంతాపకారిణియగునని యూహింపవైతివి. 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' యని మనువు వెఱ్ఱివాడై జెప్పెనా? మనువు మాటలు మనము పెడచెవిని బెట్టుటచే మనకూతులు మనము తెచ్చిన మనువుల నొల్లక మన మనవులు సరకుగొనక యిచ్చవచ్చిన తెరంగున మెలగుచున్నారు. తేలునకు ముల్లు, పామునకు విషపుతిత్తి, బెబ్బులికి వాడికోర యెట్టిదో పడతికి చదువట్టిది. స్త్రీని నేలబెట్టి రాచివేయవలెనుగాని స్వాతంత్ర్య మీయ గూడదు. వారియెడ జాలి పడగూడదు" అని చేతులతో నభినయించుచు మొగము ద్రిప్పుచు పెండియు నిట్లనియె—"వివాహమున నాడుదానికి స్వతంత్ర్యభావమా? తా వలచినవానిని పెండ్లి చేసికొనుటా? రుక్మిణితోను సుభద్రతోను తనకు సామ్యమా? నక్క-యెక్కడ, దేవలోక మెక్కడ? తల్లిదండ్రులు తెచ్చిన సంబంధ మంగీకరించి చచ్చినట్లు పడియుండవలసినదేగాని యాడుబిడ్డ వలపులు గిలపులు నిలిపి మనసునకు నచ్చినవానిని పెండ్లియాడుటా? పూర్వ

కాలవుమాట నేను చెప్పనుగాని యీ కాలమున స్వయంవరమనగా నాడుపిల్ల తన చూపులకు నచ్చినవానిని దగులొ్కని పోవుటయే. ఈ వెట్టి యాగడములు సాగనీయగూడదు. రాజా! నేనింత కఠిన ముగా బల్కితినని మనసులో వేరువిధముగా దలపకుము. నాబిడ్డ యొకటి నీబిడ్డయొకటిగాదు. అదియే నాబిడ్డ యగునేని నీ తెరంగున నాతో వితండవాదము సేయునేని దాని శరీరము ఖండఖండములు చేయనా? ఇట్లనుటచేత నీబిడ్డం జంపుమనుటగాదుసుమీ! నామనస్సు మండిపోవుటచేత నిట్లంటిని, ఇందు కొక్కటే యుపాయమున్నది. కాలహరణమైన కార్యము చెడును. దండపాణిని వజ్రపాణిని బిలిచి ప్రధానము చేయుదము. కర్పూరమంజరి వివాహమున కంగీకరించినదని మనవారితో జెప్పుదము. అబద్ధ మెట్లు చెప్పుదునాయని నీమనస్సు శంకించవచ్చును, ఇట్టి విషయమున శంకలు పనికిరావు. మనము తెల్ల వాఱలేచి యెన్ని యబద్ధములు నుడువుటలేదు? రాజనీతి కసత్యము కన్నతల్లి, సత్యము సవతితల్లి. రాజనీతి యసత్యమునబుట్టి యసత్య మున పెరుగుచున్నది. అది యసత్యాత్మకమె, రాజయినవాడు రాజ నీతి నవలంబింపక తప్పక ప్రాణవిత్త మానభంగములందు సూనృతంబు విడిచి యనృతంబు నాశ్రయింపవచ్చునని భగవానుండైన శుక్రుడు పదేశింపలేదా! అందుచేత నిశ్శంకముగా మన మసత్యమును సత్యముగామార్చి మాటాడవచ్చును, ప్రధానము చేయుదునని వారికి జెప్పిపంపుము. ఎల్లుండి మిక్కిలి మంచిది, తిధివార నక్షత్రములు సరిగా గుదిరినవి. తారాబల చంద్రబలములు సమకూడినవి, ఆ దినమున దప్పక ప్రధానము జరుగునని వారికిం దెలుపుము. అతి రహస్యముగా జరుగవలెనని మాత్రము చెప్పుము. వారి సన్నిధిని నీవూరకుండుము, కర్పూరమంజరి సమ్మతించినదని నేనే చెప్పెద, వానితో నిన్నే వలచినదని చెప్పెద, నీదర్శనమునకై నిరీక్షించుచున్న దనియెద. నీచేయి పట్టెడు భాగ్య మెప్పుడు లభించునాయని యువ్వి ళ్ళూరుచున్న దనియెద. నీపేరే యామెకు హరినామస్మరణ మనియెద.

నీ విజయముతే పాడుచున్నదనియెద. అది యిది యననేల! ఏమన వలెనో యన్నియు ననియెద భగవంతుఁడు కపటోపాయములకు గట్టితల యిచ్చినాఁడు నాటిని వ్యాపారమున నెల్లడించుటకు నాలుక నిచ్చినాఁడు, ఆశక్తి నీక్రింద వినియోగింతుఁ" అని నిశ్చింతముగ బలుకుచున్న రుద్రభట్టుమాటాలించి చిత్రభానుఁడు—" స్వామీ! ఎటువంటి క్లిష్టమార్గములందైన మీబుద్ధిరథము నిరాఘాట సంచారము గలిగియుండును. చికిలిచేసిన కత్తివలె మీబుద్ధి యెట్టి సంకటారణ్యములనైన ఛేదించును. మీమాటలు విషాదముచే జడములైన నామనస్సునకు నవయౌవనము నెంతో చైతన్యము గలిగించినవి. మీరుచెప్పినట్లు జేసెదగాని కొట్టకొనకు మనము వివాహము చేయక పోవుదుమేని దండపాణియు వజ్రపాణియు మనము వంచించితిమని యాగ్రహించి యెదురుతిరిగి యపకారము సేయరా? ఈలోపున బాలిక యభిమతము దెలిసి కోపించి కార్యభంగము సేయరా? బాలిక యీ వార్తవిని యాత్మహత్య చేసికొనదుగదా? ఈ మూఁడుశంకలు నామనంబును బీడించుచున్నవి. దీనికేమి యుపాయము?" అని పలికెను.

నిశ్చింతహృదయుఁడైన రుద్రభట్టు ప్రత్యుత్తరమునకై వెదకుకొనక తత్క్షణమే యిట్లనియెను—" కర్పూరమంజరికి వానిపై వలపు లేదను మాట లోకమున బొంకకుండ మనము గోప్యముగ నుంచవలెను. ఈ వార్త మనలో జీర్ణముకావలెను. ఎవ్వరియొద్ద నిది యెత్తవద్దని భార్యతో నొక్కి వక్కాణింపుము. చెలిమికత్తె లీమాటబారవిడిచెదరేని బ్రతికియుండగానే నేలం బాతిపెట్టింతుమని చెప్పుము. సలసల గాగుచున్న నూనెలో బారవేయించి వడియములట్లు వేయింతుమని చెప్పుము. ఇట్లు చేసితిమేని యీమాట పైకి బొక్కదు. మన కార్యమయిన తరువాత వివాహము మనము సేయలేకపోయినను మనలను వాఁడేమి సేయఁగలఁడు? బాలిక మొదట పెండ్లి కంగీకరించి పిదప దుర్బోధనలవలన మానుకొన్నదని చెప్పవచ్చును. అది వినక వాఁడు

తెగసిల్లి పెంకితనము చేసినా నాగజట్టు మనచేతిలో నుండును గనుక నోరు మూయించి శిరచ్ఛేదము చేయించెదము. బాలిక యాత్మహత్య చేసికొనునేమో యని భయశంకగదా! చేసికొన్నపక్షమున నీపీడయే పోవునదని నమ్ముము. ఏదో రోగమువచ్చి చచ్చినదని మనము చెప్పవచ్చును దైవికమున కేమి చేయగలమని వాడు తన యదృష్టమును నిందించుకొనుచు నూరకుండి యెప్పటియట్ల మనకు సాయము చేయును. ఆమె బలవన్మరణమునొందిన నవ్వార్త లోకమునకు తెలియకుండ చేసి నీబిడ్డ గాని దైన మల్లికనో చంద్రికనో తెచ్చి యదే కర్పూరమంజరియని వానికి వివాహము చేయుదము, నీవు చిన్నప్పుడెప్పుడో బాలీశం జదివియుందువు గాని యీ నడుమ నెప్పుడు జూడలేదుగదా? 'శతకోటి దరిద్రాణా మనంతకోట్యుపాయాః' అని ప్రాచీనులు చెప్పియేయున్నారు. 'నందో రాజా భవిష్యతి' యని వినలేదే? నాటికొక్క దైవముండదా? భక్తవత్సలుడైన మహేశ్వరుడు నాశిష్యుని కార్యము భంగము సేయునా? వెనుకటియట్ల నేనిప్పుడో యొకనాటి రాత్రి రెండుజాముల వేళ మహేశ్వర సాక్షాత్కారము జేసికొని నాకభీష్టసిద్ధి చేయుమని కోరెదను. భయపడకు."

చిత్రభానున కతడు చేసిన యుపదేశము సమంజసముగా నుండెను. మూడవనాడు ప్రధానమునకు సుముహూర్తము నిశ్చయింపబడినదని యతడు వారికెరిగించెను. వారాదినమున రాత్రి జాము ప్రొద్దుపోయిన తరువాత దమ కాప్తులైన యిరువురు బ్రాహ్మణులం దోడ్కొని పసుపు, కుంకుమ, పండ్లు, యగరు, చందనము, సుగంధ పుష్పములు, వెలలేని యాభరణములు, మేలైన పట్టుచీరెలు దెచ్చి తమతోడవచ్చిన సేవకులను వీధిలో నిలిపి వారైన నెరుగకుండ నింటిలోనివా రెరుగకుండ రుద్రభట్టు నెదుట బెట్టిరి, యథాక్రమముగా ప్రధానము జరిగెను. ఈ కార్య మతిరహస్యముగా నుంచవలసినదని వచ్చిన బ్రాహ్మణులతో రుద్రభట్టు జిత్రభానుడు జెప్పిరి. రుద్రభట్టు

కర్పూరమంజరి వాని సమాగమమునకై తహతహం బడుచున్నదని మిక్కిలి దృఢముగా జెప్పెను. వజ్రపాణి మేరమీరిన యానందము నొంది కర్పూరమంజరీ పాణిగ్రహణ మహోత్సవమునకై యూట లూర దొడగెను. భవిష్యత్కాలమున దన కూతురు కాశ్మీరదేశపు రాణియగునని దండపాణి పరమానందము నొందెను. ప్రధానము ముగిసినపిదప వారు నిజనివాసముల కరిగిరి. చిత్రభానుడు గుణధరు లిట్లు తాము త్రవ్విన మాయాకూపమున వారు పడిరని చప్పట్లుగొని నవ్వుకొని పిమ్మట నిద్రపోయిరి.

## పదునాలుగవ ప్రకరణము

తెల్లవారజొచ్చెను. "కాశ్మీర రాజ్యలక్ష్మిని దమవశము జేసికొనుటకై గొప్ప కుట్ర జరుగుచున్నది. గాఢభక్తులందరు వెంటనే మేలుకొనుడోహో!" యని కాలపురుషుడు పెట్టుబొబ్బవలె జాముకోడి కూసెను. విషాద మాలిన్యముపోవ జిత్రభానుల మొగము తెలివొందినట్లు తూర్పుదెస తెల్లబారెను. విక్రమసేనుని పక్షముననున్న మిత్రులు క్రమక్రమముగా నిట్లె యంతరించుచున్నవారని తెలియజేయుటకో యన జుక్కలదృశ్యములు కాజొచ్చెను. రాజ్యలక్ష్మి పరహస్తగతమగుచున్నది. పరమేశ్వరా! కావుకావుమని పక్షులుసైతము మొరచుచున్నవో యనునట్లు కాకులు కావుకావుమని కూయజొచ్చెను. అరవిందాదేవి మనంబున నెలకొన్న కొంచెపు టాసలుగూడ నడుగుచుండినట్లు తెల్లవారుజామునను(న్న) చిలుపవన్నెలలు క్రమక్రమముగా క్షీణించెను. దినమనియెడు కాంత నల్లచీర విడిచి తెల్లచీర కట్టినట్లు చీకటిపోయి వెలుగు పొడమెను. క్రొత్తవేసముతో శ్రీనగరంబున జిత్రభానుడు పొడసూపినట్లె పొడుపుగొండమీద జిత్రవర్ణములతో భానుడుదయించెను. ఎవ్వరికిం గానబడకుండ బైపైని జరుగు

చిత్రభానుని ప్రయత్నంబులట్లు యుదయకాల ప్రభాకరుని లేయెండలు మునుముందు నేలపై బ్రసరింపక యిండ్లమీదను జెట్లమీదను వ్యాపింపజొచ్చెను. ఆతని కిరణంబులు క్రమక్రమంబుగ నిక్లే పురంబున వ్యాపించుచున్న తెలుపుటావోయున లేయెండ లించుకించుక తీవ్రములై నేలం బరువజొచ్చెను.

వైదిక కర్మనిరతులగు బ్రాహ్మణోత్తములు స్నానముచేసి ప్రాతస్సంధ్యావిధులదీర్చి భగవానుడగు భాస్కరున కర్ఘ్యప్రదాన మొసగి నిత్యనైమిత్తికములకుం జొచ్చిరి. మూర్ఛనొండి లేచిన జంతువువోలె ప్రపంచమంతయు వెండియు చైతన్యముగలిగి వికాసవంతమయ్యెను. మానవులు తమ తమ వ్యాపారములయందు బ్రవేశించిరి. రుద్రభట్టు తన మొగ మప్పటికి బ్రజలకు జూపదలచుకొనలేదు గావున దొడ్డిలోనున్న బావికడనే స్నానముచేసి ప్రాతరనుష్ఠానముల దీర్చికొని, వ్యాఘ్రాసనమున గూర్చుండియుండ జిత్రభానుడాయన కడకుబోయి నమస్కరించి యెట్టయెదుట నాసీనుడయ్యెను. "రాజా! సుఖముగ నిద్రపట్టినదా?" యని రుద్రభట్టడిగెను. "దేవా! మీయనుగ్రహమున మనోవిచారము లెల్ల దూరములగుటచే నిద్ర పట్టినది, కాని, 'రాజా!' యని పిలుచుచున్నారేమి? అది లభింపలేదే?" యని చిత్రభానుడు బదులుచెప్పెను. అప్పుడు రుద్రభట్టు చిరునవ్వు మొగమున నంకురింప నిట్లనియె—"లభింపలేదా? నీమట్టుకు లభింపలేదని తోచుచున్నదిగాని, నాబుద్ధికి లభించినట్లు తోచుచున్నది. నీవు కాశ్మీర సింహాసన మెక్కినట్లు నీశిరంబున నానారత్న విరాజితమగు కనకకిరీటము భాసిల్లుచున్నట్లు బహుపుణ్యనదీ జలంబుల దెచ్చి భూసురులు వేదోక్తముగ నీకభిషేకము చేయుచున్నట్లు సామంత మహీపాలురు తమ మకుటకాంతుల నీపాదములకు నీరాజనం బిచ్చునట్లు వంగి నీకు నమస్కరించినట్లు హస్తకంకణంబులు ఘల్లుఘల్లుమని మెరయ రాజులు కానుకలుగా బంపిన యంగనలు నీకు వింజామరలు విసరుచున్నట్లు, హెగ్గడలు కైవారము సేయుచున్నట్లు, ప్రగ్గడలు

రాజకార్యములు నివేదించుచున్నట్లు, రాయబారులు వినయంబున దమ తమ రాజుల సందేశంబుల నెరిగించుచున్నట్లు, నీవు వారి మనవి సనవులవిని మెచ్చి తలయూచి కృపారస పూరితములగు కీగంటి చూపుల జూచుచున్నట్లు నామనోనేత్రమున కిప్పుడే పొడగట్టు చున్నది. సర్వాలంకార శోభితమగు మదపుటేనుగునెక్కి నీవు శ్రీనగరంబున నూరేగుచున్నట్లు నేలవేల్పులు గంభీరస్వరమున నిన్నాశీర్వదించుచున్నట్లు, పౌరాంగనలు నీపై నక్షతలు లాజలు పూవులుజల్లి మందహాస విలసితములగు సుందర వదనారవిందములతో నిన్నుం జూచి యానందించి పసిడిపళ్ళెరంబుల గప్పురంపు టారతు లిచ్చినట్లు నామనోలోచనమునకు గానవచ్చుచున్నది. కాకపోయెడు కార్యంబు నామనంబున నింత దృఢముగా ముద్రయిడినట్లు నిలువదు. పరమేశ్వరానుగ్రహము నీపై సంపూర్ణముగాగలదు. తెల్లవారు జామున భగవంతుండగు చంద్రశేఖరుడు నాకు స్వప్నమున సాక్షాత్కరించి మీద జేయివైచి తట్టి—"వత్సా! నీసంకల్ప మీడేరును, నీవింక విచారంబు దక్కియుండుము. చాణక్యుడు చంద్రగుప్తుని మగధరాజ్యంబున ప్రతిష్టించిన చందంబున నీవు చిత్రభానుని గాశ్మీర సింహాసనంబున నిలుపగలవుసుమీ!" యని యానతిచ్చెను. అంతలో నాకు మెలకువవచ్చెను. శాంతరసమొలుకు నామూర్తిని, సువర్ణములవంటి సువర్ణములతో గూడిన యా చల్లని మాటలను మరియొకసారి కని వినవలెనని కుతూహలము పొడము చున్నది, మరల నెప్పుడో గాని లభింపదు. ఇక మన కార్యసిద్ధి యైనట్లె. మనదే యాలస్యము. రాజ్యలక్ష్మి రాక్షసివంటిది, అది కామరూపిణి. చిరునవ్వునవ్వి యొకనితో మేలమాడును, భయంకరాకారిణియై యొకనిని బెదరించును. ఎండమావులవలె దన యునికి నిజమ్మని భ్రమింపజేసి వేరొకని బేలుపుచ్చును. ఒకని నిజముగా ననుగ్రహించి బాగుచేయును. దాని నెప్పుడు నమ్మరాదు. మాంత్రికుడు పిశాచము దొరకినప్పుడు మంత్రప్రభావమున బట్టుకొని దిగ్బంధనముజేసి కదలనీక

మొదలనీక దనవశము జేసికొనినట్లు రాజనీతి కోవిదు లదను జిక్కి-నప్పుడు రాజ్యలక్ష్మి బట్టుకొని బంధింపవలయు. ఇప్పు డయ్యదను వచ్చినది. మనదే యాలస్యము. కార్యమునకు దిగవలయు. ”

అనవుడు చిత్రభాను డుత్సాహపూరితుడై —“ ఏమి చేయవలయునో యిప్పుడె యానతిండు. చేసెదన ” ని బదులుచెప్ప రుద్రభట్టు వాని కిట్లనియె—“ నీమామగారి మంత్రియగు జయంతుని మున్ను నీతోవచ్చిన విదర్భరాజ సేనాపతి మృగసేనుని విదర్భకుబంపి యిచ్చటి పరిస్థితులు విదర్భరాజునకు విన్నవించి గొప్పసేనం దీసికొని సాధ్యమైనంత వేగముగా రమ్మనుము. ఇక్కడ దండపాణియు వజ్రపాణియు దోడ్కొనివచ్చు సేనలకు దోడుగ విదర్భసేన యుండవలయు. అదియే మనకు ముఖ్యాధారము. అది ప్రథమ కర్తవ్యము. తరువాత మన కరటకుని వాక్యవాయువులు ప్రశాంతమైన సేనాసముద్రమున సంక్షోభ తరంగములను సృజియించినవి. పింగళుడు రాజకుటుంబము మనస్సున బెట్టిన చిచ్చు నేటికిని మండుచునేయుండి మంత్రులయెడ విశ్వాసమును దగ్ధము చేసియుండును. రాజ్యలక్ష్మిని సమీపించుటకు మార్గమేర్పడినది. అనవుడు జిత్రభానుడు—“ ప్రథమమున నేమి సేయవలయునో యది యానతిండు. అట్టిపనికి గూడ మీరు సుముహూర్తము నిర్ణయింపుడు. అమరేంద్రునకు బృహస్పతియట్లు, దానవేశ్వరునకు శుక్రునట్లు మీరు మాకు ధర్మోపదేష్టలు విజయము మీమాట ననుసరించి పోవును ” అని వినయమున మనవి చేయ రుద్రభట్టు వెండియు నిట్లనియె—“ రాజా ! సేనానివేశమునకు బోయి పాములవాడు నాగస్వరముతో వల్మీకములలో నిద్రించు పాములను లేవగొట్టి యాడించునట్లు చిత్రవిచిత్రములు మహోత్సాహభరితములగు నీవచోగుంభనలచేత సైనికుల ప్రబోధించి పురికొల్పుము. సింధు గాంధార నాయకుల దండయాత్రలు నీవాడు నాటకమున కిటిష్కృత్తములగుగాక ! నీయన్నగారి మరణము నాందియగుగాక ! మణివంత్ర ప్రముఖులు ప్రతినాయకులగుదురుగాక ! నీవు

కథానాయకుడవు. రాజ్యలక్ష్మి కథానాయిక. ఈ నాటకమునకు నేనే సూత్రధారుడను. నీవు వినిపించు కలాప మెంత రసవంతముగా నుండిన నంత త్వరలో నీకు జయము చేకూరును. నీమాటలకుజొక్కి సైనికులు తియ్యనీటికి జేప లెక్కినట్లు నిన్ననుసరింపవలెను ప్రస్తుతము నేను వచ్చుటకు వీలు లేదు. అయినను నాయాశీర్వచనమె నిన్ననుసరించి నీకు జయము నాపాదించును. రేపురేయి మంచి ముహూర్త మున్నది. మనశిష్యులు సైనికుల మనస్సులు కలచెదరుగాక !"

అనవుడు జిత్రభానుడు—" మహాప్రసాదము స్వామీ ! యట్లు చేసెదన " ని వానికడ సెలవు పుచ్చుకొని యావలకుంబోయి తద్విషయ ప్రయత్నముల నుండెను.

మరునాడు తెల్లవారుజామున సేనానివేశమున నొక కలకలము గలిగెను. తలపై నాకుపచ్చని పెద్దపాగ నమర్చి మోకాళ్ళంటుచున్న ప్రాత నిలువుటంగి దొడిగి, మెడలో నొక గవ్వలదండ వైచుకొని జనులు ధర్మార్థమిచ్చిన ప్రాతగుడ్డలు రెండుభుజములపై వైచుకొని మెడలో గట్టుకొన్న కంచుగంట మాటిమాటికి కంగుకంగుమని మొరయ నెడమభుజమునుండి పీపుమీఁది కొక కఱ్ఱకు దగిలించిన పంచి ప్రేలుచుండ గుడిచేతిలోనున్న ఢక్క ఢుణఢుణము నాయించుచు భయంకరముగా క్షుద్రదేవతల నాహ్వానించుచు నొక సాయిలవాడు సైన్యనివేశమందలి వీధులలో దిరుగజొచ్చెను. గంటమ్రోతయు, ఢక్కచప్పుడును, వాని పెద్దకేకలును నిద్రించుచున్న సైనికులకు వారి యాడువాండ్రకు మేలుకొలుపులయ్యెను. అందరు లేచి వానిం జూచుటకు గుమ్మములలో నిలిచిరి. సాయిలవాడిట్లు సంభాషించెను—

" ఆ ! కాళీ! పల్కవే, భద్రకాళీ! పల్కవే, జగజ్జననీ పల్కవే, భైరవీ పల్కవే, శాంకరీ పల్కవే తల్లీ నిజము పల్కవే, యక్షిణీ పల్కవే, దుర్గా పల్కవే, చెప్పవే నిజము చెప్పవే. సాయిల రామజోగి నోట పల్కవే, సత్యము చెప్పవే, ఈ దేశమునకు గొప్ప కీడు రాదలచి యున్నది. పడమటినుండి పగ రాదలచియున్నది. దక్షిణమునుండి

దండు రాదలచియున్నది, రాత్రి రెండుజాములప్పుడు నల్లచీర కట్టు కొన్న యాడది, మొగమున పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొన్న యాడది కాళ్ళకు గజ్జెలు కట్టుకొన్న యాడది చీపురుపట్టుకొని యూడ్చు చున్నది. ఈ రాజ్యములో సిరులన్నిటిని తానాలాగే యూడ్చెద నన్నమాట. మనుష్యుల జీవాలన్నియు నూడ్చెదనన్నమాట. తనువులు దక్కవన్నమాట. ఆ తల్లి దుర్గకు నీదేశముమీద దయ తప్పినది. ఇది పరరాజులపాలై పోనున్నది. గట్టివానిని బట్టుకొన్న పక్షమున రానున్న యాపద తప్పిపోవును. చిన్నవారివల్లగాదు. చిరుత వారివల్లగాదు. ఆడవాళ్ళవల్లగాదు. జాగ్రత్త జాగ్రత్త! భద్రము భద్రము! మేలుకొనుడు మేలుకొనుడు! మూసినకన్నులు తెరువుడీ! మోసపోకుడీ. ప్రాణాలు దక్కించుకొనండీ, బాగుపడండీ."

ఆ మాటలువిని మనస్సులలో భయము శంకయు నెలకొన వానిం బిలిచి కొందరు—"ఏమియాపదవచ్చు? నీకెట్లు తెలిసినది?" యని ప్రశ్నించిరి. ఆ ప్రశ్నలకు వాడిట్లనియె—"ఏమి యాపదని చెప్పెదను? మానములు దక్కవు. మాటలు దక్కవు. తనువులు దక్కవు. ధనములు దక్కవు. నీకెట్లు తెలిసినదని మీరడుగవద్దు. మేము భద్రకాళికి పెంపుడు కొడుకులము, ఎర్రమారికమ్మ మాయిలవేల్పు. శంకరుని రాణి సాయిల రామజోగిని సాకును. అతడు రమ్మంటే యాతల్లి వచ్చును. పొమ్మంటే యాతల్లి పోవును. పలుకుమన్న పలుకును. నిలుమన్న నిలుచును. అదుగో అతల్లి నానోట పలికించుచున్నది. ఇట్టి ప్రశ్నల మీరు వేసితిరా తల్లి కోపించి యిప్పుడే నిప్పులవాన గురిపించును. అట్టి ప్రశ్న లడుగ బోకుడు. అది మీకు మేలుగాదు. అది మీకు మంచిగాదు. కొరవి బెట్టి తల గోకికొనవద్దు."

అతని మాటలు విన్నతోడనే యెల్లవారును భయమున గడ గడ వడకిరి. బుద్ధిమంతులగు పెద్దవాండ్రు ప్రశ్న లడుగువారిని జీవాట్లుపెట్టి యా యుద్యమము మాన్పిరి, కొందరు—"స్వామీ!

సాయిలరామజోగీ! మాతప్పు మన్నింపుము" ని దండములు పెట్టిరి. కొందరు రూకలు బియ్యము వస్త్రములు మొదలగు కానుకలు భక్తియుక్తులై యాతనికి సమర్పించిరి కాని, యాతడు వానిం గైకొనక యిట్లనియె—"మాకు బట్టలువద్దు. పాలువద్దు. బియ్యమునకు రాలేదు. బిచ్చమునకు రాలేదు. రూకలువద్దు కోకలువద్దు మీమీద దయచేత జగజ్జనని దుర్గ పంపగా వచ్చితిని, కీడరిగించితిని మేలుదారి తెల్పితిని పోవుచున్నాను; పోవుచున్నాను, జాగ్రత్త. జాగ్రత్త!" అని పలుకవలసిన పలుకులు పలికి కలిగింపదలచిన యలజడి కలిగించి వెలుగు రాకమునుపే తనదారిం బోయెను

అంతట సైనికులు పరిపరివిధముల నవ్విషయమై చర్చింప దొడగిరి. "ఎవడో బిచ్చగాడు పిలువని పేరంటముగ వచ్చి వానికి దోచిన కూతలు గూసి పోయినాడ" ని కొందరనిరి. "బిచ్చగాడైన పక్షమున మనము సమర్పించిన తండులములు వస్త్రములు ధనము నేల గ్రహింపక పోవు? నందుచేత నతడు తిక్కన సాయిలవాండ్రవలె జనులను బీడించి తిరుపమెత్తువాడుగాడు. మంత్రప్రభావమున క్షుద్ర దేవతల వశపరచుకొన్నవాడుగాని సామాన్యుడుగాడ" ని కొందరు పలికిరి. "వట్టికూతలుగా వానిమాటలు త్రోసిపుచ్చరాద" ని కొందరు వచించిరి. "నల్లచీర గట్టుకొన్న యాడుది చీపురు పుచ్చుకొని యూడ్చుట శ్రేయస్కరముగాద" ని కొందరు వక్కాణించిరి.

అట్లు వారు గుంపులు గుంపులుగ జేరిరి. ప్రాతఃకాలమున బలుతెరంగుల ప్రసంగించుచుండ నంతలో దండపాణి యశ్వారూఢుడై యచ్చోటికి బోయెను. సైనికులు లేచి జోహారులు చేసిరి. "అట్లు గుంపులు గుంపులుగా జేరుటకు హేతువేమ" ని యా సేనాపతి యడుగ వారు వేకువను జరిగిన వృత్తాంతమంతయు బూసగ్రుచ్చినట్లు జెప్పిరి అదివిని దండపాణి యచ్చెరువుపడి—"ఏమీ! నల్లచీర గట్టుకొన్న యాడుదియా? చీపురు పుచ్చుకొని యూడ్చుచున్నదా? చిన్నవాండ్రవల్లగాదు, చిరుతవాండ్రవల్ల కాదని చెప్పినాడా?

గొప్పవారియండ జేరుమన్నాడా? జగజ్జననియైన మహాకాళి తనకే దేవరహస్యములు చెప్పినదన్నాడా! సరే! మనకేదో మూడదలచుకొన్నది. సాయిలవాండ్ర మాటలు కల్లలని మనము త్రోసివేయరాదు. వారికి క్షుద్రదేవతలు ప్రత్యక్షమగుచుందురు. కల్లు మాంసము మొదలగు పదార్థములు నివేదించి వారా దేవతలను వశము జేసికొందురు. అందుచే నాగతానాగతములు వారికి దెలియుచుండును. నల్లచీరగట్టుకొన్న యాడుది, మనపాలిటి నాశనదేవత. ఇది చాల దుశ్శకునము. దీనికిం దగిన ప్రతిక్రియ మనము చేసికొనవలెను. పడమటనుండి పగవచ్చునని వాడు చెప్పెనుగదా! పడమటిపగ యనగా గాంధారదేశపు దండయాత్ర. దక్షిణమునుండి దండు వచ్చుననగా సింధురాజు దండెత్తుట. ఇది మీ రెరుగరుగా బోలు! పండ్లచెట్లపై రాళ్ళువిసరినట్లు ఫలవంతమగు దేశముగొట్టి యాక్రమించుట కనేకులు సిద్ధమగుదురు. మనోజ్ఞ వస్తు వెల్లవారి కాసగొల్పును. అట్లే కాశ్మీరరాజ్యము రాజసింహముల కామిషముగా నున్నది. ఆ రాజులిద్దరువచ్చి చెరియొకప్రక్క ముట్టడించిరా తలుపుసందునబడిన వెలగకాయవలె మనము నలిగిపోదుము. కావున మనము దీనికి దగిన ప్రతీకారము సేయవలయున" ని వారి కుపదేశించెను. "ఎట్టి ప్రతిక్రియ? ఏమి ప్రతిక్రియ?" యని వారు కొందరతో నడిగిరి.

అడుగుటయు నతడు స్వరము కొంచెము తగ్గించి—"ఎట్టి ప్రతిక్రియ యని చెప్పుదును? దానికొక్కటే మందున్నది" అని స్వరము హెచ్చించి—"మనరాజు బాలుడు. అలమున ముక్కాకలుదేరిన మీవంటి పోటుబంట్లకు మొనగాడై నిలిచి మిమ్ము రణరంగములకు దోడుకొనిపోయి మీమనస్సులు నుత్సాహరసముతో నిండించి పురికొల్పి మీచేత సాహసక్రియలు చేయించి మనదేశమును రక్షింపగల మేటిశూరు డొక్కడున్నాడ" ని యూరకుండెను. "అత డెవ్వ డెవ్వడ" ని యందరడిగిరి. "అతడా—అతడా—చెప్పనా? మీరు

నాచెప్పిన చొప్పున చేయుదురా ?" యని యతడు సందిగ్ధ మనస్కుడై పల్కెను. "మీరు చెప్పిన చొప్పున దప్పక చేయుదుము. తప్పక చేయుదుము" అని వారైకకంఠ్యముగ బల్కిరి. "అతడీ రాత్రివచ్చి స్వయముగానే మీతో మాటాడునులెండు. నేనిప్పు డాయనపేరు మీతో జెప్పను. భానుదర్శనమున దామరలు విచ్చినట్లు వానింజూచి మీ మొగములు వికసింపగలవు. చంద్రదర్శనమున స్రవించు చంద్రకాంత శిలలవలె మీ మనస్సులు వానిం జూచినంతనె యుత్సాహరసపూరితములై యుండగలవు. పేరు చెప్పమని నన్నడుగ వద్దు. నేటిరాత్రి జామయిన తరువాత మీకడ కాయనవచ్చును. మీరు భోజనములు చేసి సిద్ధముగ నుండుడు" అని దండపాణి వారికి నచ్చ జెప్పి యథేచ్ఛం బోయెను. "ఆ వచ్చునట్టి మహావీరు డెవడై యుండునా ?" యని సైనికు లూహించుచు వారిరాక నిరీక్షించు చుండిరి.

## పదియైదవ ప్రకరణము

క్రమక్రమముగ సాయంకాలమయ్యెను. దీర్ఘప్రయాణము చేసిన తెరువరి గమ్యస్థానముజేరి విశ్రమించు తెరగున భానుడు పశ్చిమాచల శృంగము నలంకరించెను. చరమగిరిమీద వ్రేలాడు జపా కుసుమ గుచ్ఛమువలె నావృద్ధ భానుని బింబము యెఱ్ఱనై చూపర కనులకు విందుసేయుచుండెను. చిన్ననాటి గుణములు చరమ కాలమునైన విడువవనుటకు దృష్టాంతరముగ నుదయవేళనున్న యారుణ్యమే ప్రభాకరునియందు సాయంకాలమున గూడ గనబడెను. ఆశ్రమ చతుష్టయములలో గట్టకడపటిదగు సన్యాసమును కర్మసాక్షియైన ప్రభాకరుడు స్వీకరించి ధరియించిన కాషాయంబరమో యనునట్లు సంధ్యారాగము నభోమండలమున వ్యాపించి దర్శనీయమయ్యెను.

మహాసౌధమునుండి క్రమక్రమముగా గ్రిందికి దిగునట్టి పురుషు నట్లు క్రమక్రమంబుగా దివాకరుడు క్రిందికి దిగి దిగి యస్తమించి యగోచరుడయ్యెను. చండశాసనుడగు పరమేశ్వరుని నియమప్రకార మెవ్వరి ధర్మము వారు నిర్వర్తింతురని తెలియజేయుటకో యన సూర్యాస్తమయానంతరమున కలవరమున జంద్రోదయమయ్యెను. జనుల కానందోదయమయ్యెను. కాలపురుషుండు గప్పుకొన్న తెల్లపట్టుపుట్టంబువలె నిర్వ్యాకట వెన్నెల వ్యాపించెను. మహా పురుషుని తేజము నందర నెందుకుం బనికిరాని యల్పపురుషుల ప్రభావముంబలె లెక్కకు మిక్కిలియగు చుక్కల వెలుంగు శీత మయూఖుని తేటవెన్నెలలముందర వెలవెలబోయెను. చల్లదనములకు సీమయైన చందమామను జూచినతోడనే యెల్లజీవుల కనులు చల్ల బడెను. ఉల్లములు చల్లబడెను. సేనానివేశములో సైనికులందరు దమకొరకై రాదలచిన యాపద్బాంధవుని జూడ నుబలాటపడుచు బెందలకడ భోజనముచేసి తెల్లబట్టపరచినట్లు చంద్రికాప్రసరణముచేత వెలయుచున్న బయలునేల కరిగి గుంపులుగూడి తద్విషయకములైన ప్రసంగములు జేయుచుండిరి. ఎవరువచ్చినను నాతఁడేమోయని యఱ్ఱులెత్తి చూచుచుండిరి.

అంతలో దండపాణి యొక పురుషుని వెంటబెట్టుకొని యచ్చోటికి వచ్చెను. అప్పురుషుడు కనబడినతోడనే—"చిత్రభానుడు చిత్రభానుడ"ని సైనికులు మెల్లమెల్లగా పవజొచ్చిరి. అందరినోట చిత్రభానుని పేరేయుండెను. అందర కన్నులకు జిత్రభానుడే కనబడెను. చంద్రప్రభయు భానుప్రభయు నేకకాలమున సంభవించిన పక్షమున నెట్టి యాశ్చర్యము జనించునో నాటిరేయి జనులకట్టి యాశ్చర్యము జనించెను. "ఇతడు హరిద్వారమున జచ్చినాడని వింటిమిగాదా!" యని యొకరు, "కాదుకా దీనడుమ నిక్కడనే యున్నాడ"ని యొకరు, "భ్రాతృమరణహేతు వితడేగాదా!" యని యొకడు, "నది వట్టిమాట" యని యొకడు, "పురమునుండి

వీనిని వెడలనడువ మణివర్మ సమర్థుడుగాడా !" యని యొకరు, దేవిగా రుండుమనినార " ని రొకరు సైనికులు తమలో దాము నానావిధముల భాషింపజొచ్చిరి. అప్పుడు దండపాణి యచ్చట జేరిన జనులను గూర్చిండ బనిచి యుపోద్ఘాతముగా నిట్లు చెప్పెను—

" వీరులారా ! అనేక యుద్ధముల బేరుగాంచిన శూరులారా ! మీకు మొనగాడై మీ దేశము పరాక్రాంతము గాకుండ జేయుగల మహావీరుడు మీ యెట్టయెదుటకు వచ్చియున్నాడు. మీకీయన చిరపరిచితుడుగాని క్రొత్తవాడు గాడు. ఈ మహాశూరుని ప్రజ్ఞా విశేషములు మీరు నావంటివానివలన వినగోరుట చిన్న దివ్వె సాయమున సూర్యబింబమును జూడగోరుటవంటిదని తలంచి ఈ మహా భాగుని విక్రమ విహారములు వర్ణింప నిశ్చయింపను. కుమారస్వామి దేవతలకు దళవాయియై మొక్కలులగు రక్కసుల నుక్కడంచి దేవలోకము నుద్ధరించిన తెరంగున నీరాజకుమారుడు శత్రుసైన్య ముల నురుమాడి మీ దేశమునకు సౌఖ్య మాపాదింపగలడు. ఈయన హేమచంద్ర మహారాజు తమ్ముడు చిత్రభానుడు. అన్నగారి కుటుంబమును బరామర్శ చేయుటకును తనకు శక్యమైన సాయము జేయుటకును వచ్చియున్నవాడు. విల్లుబట్టెనా రఘురాముని భృగు రాముని దలపించును. ఇతడు బాణంబు విడిచెనా శత్రువుడు ప్రాణంబు విడుచును. ఇతడు కలియుగార్జునుడు. మనల నాపత్సము ద్రమునుండి యుద్ధరింపగల యోడయిదే మన విచారాంధకారమును మాపగల భానుమండలమిదే ! మన సంతాపమడచి చల్లని నీడనిచ్చు వృక్షమిదే. కావున వీని నాశ్రయింపుడు. ఆయన చెప్పెడు మాటల సావధానులై యాకర్ణింపుడు " అని యతడు విరమించెను.

" జయము ! చిత్రభానుడా !" అని సభాసదులలో ననేకు లరచిరి. " స్వాగతము ! మీకు స్వాగతము !" అని కొందరు కేకలు వైచిరి. " మీవచనామృతమును వర్షించి మాసంతాపము దీర్పుడ"ని కొందరు బిగ్గరగ జెప్పిరి. అదివిని సభాస్థారులలో దన కనుకూలమైన

భావము పొడమినదని తెలిసికొని ధైర్యము దెచ్చికొని చిత్రభానుడు ముందరకువచ్చి సభాసదులముందర నిలిచి యీ విధముగా బ్రసంగించెను—

"మహాయోధులారా! దండపాణి చెప్పినట్లు మీకు నేను క్రొత్తవాడనుగాను. పూర్వపరిచితుడనే. హేమచంద్ర మహారాజు తమ్ముడనని విక్రమసేనుని రెండవ కొడుకునని నాపేరు చిత్రభానుడని మీరందరెరుగుదురు. మీలో ననేకుల నేను మున్ను మాయన్న గారి యనుగ్రహమునకు బాత్రమైన కాలమున జూచియుంటిని. కొన్ని యుద్ధముల మిమ్ము గొనిపోయి గెల్చియుంటిని. మీవలన నేను పేరు గాంచియుంటిని. నావలన మీరు కీర్తిగాంచియుంటిరి. కాలవశమున మంత్రుల మాయలచేత నాకును మాయన్నకును మనంబుల స్పర్ధలు జనించినవి. నాటనుండి సమిధలువైచి సచివులు వైరాగ్నిని బ్రజ్వలింపజేసిరి. ఆ యగ్ని మాసోదరుల సహజమైత్రిని దగ్ధముచేసినది. ప్రేమను భస్మపటలము గావించినది. అప్పుడు మాయన్న మంత్రుల మాటలువిని నిరపరాధిని—నిష్కపటిని—నిర్మలచిత్తుని—నిజసోదరుని నిరాధారునిజేసి స్వదేశమునుండి వెడలనడచెను. అపుడు నేను సపుత్రికముగా సకళత్రముగా నూరువిడిచి—దేశమువిడిచి—బంధుమిత్రుల విడిచి పోయి దారాపుత్రుల విదర్భలోనిలిపి యత్తవారింట నుండుట యనుచితమని భావించి రాచబిడ్డనగుటచే నాత్మగౌరవమును బాటించి దేశములపాలై తిరిగితిని. నాపడిన కష్టములన్నియు వరుసగా మీకు జెప్పబూనితినేని మీమనస్సులు విచారసముద్రమున మునుంగును. కన్నీరు వరదలై పారును. ఒక్కొక్కసారి యాత్మహత్య చేసికొనుట యుక్తమని ప్రయత్నించితిని. అది నామిత్రులు వారించిరి. పక్షులకైన గూడులుండును. పులులకైన దలదాచుకొనుటకు పొదలుండును. సింగములకైన గుహాలుండును. నాకంతమాత్రమైన నెలవు లేకపోయినది. రాచవాడ నగుటచే నొకరి నడుగజాల. అగర్భసుకుమారుడ నగుటచే మేనువంచి పనిచేయజాల. అభిమానధనుడ

నగుటచే నీచవృత్తులం దిగజాల. అన్నములేక—బట్టలులేక—నిలువ నీడలేక—చుట్టములులేక—పక్కములులేక యేకాకినై చిరకాలము తిరిగి తిరిగి యీశ్వరానుగ్రహమున నెట్టులో బ్రతికి యుంటిని. దైవమునే నమ్మియుంటిని. శివుని నమ్మినవాడు చెడిపోవడని నానమ్మిక. ఎందుకు బ్రతికించెనో దైవము నన్ను బ్రతికించెను. స్వాప్నావస్థయందైన నేను మాయన్నగారిని దూషింపలేదు. నాదురదృష్టమును నిందించుకొంటిని గాని మాసోదరుని నిందింపలేదు. ఆయన నిష్కళంక చరిత్రుడు. నిరుపమాన త్యాగశీలి. లోకోత్తర చరిత్రుడు. అగ్నికి ధూమము పేరిట మాలిన్యముగలదు. చంద్రునకు మచ్చగలదు. కాని యీ మహాత్ముని చరిత్రమునకు మచ్చలేదు. అతడు నేలపై నవతరించిన నారాయణుడే. అట్టివాని నీచల్లని సమయమున జ్ఞప్తికి దెచ్చుకొనిన మనమందరము ధన్యుల మగుదము గాక! అట్టి మహారాజును—అట్టి దయాశాలిని—అట్టి శాంతచిత్తుని—అట్టి పరమమిత్రుని—నట్టి లోకమిత్రుని—నట్టి సుగుణరత్నాకరుని—హా! దురాత్ములెవ్వరో దారుణవధపాలు చేసిరిగదా! హా! హేమచంద్రా! హా! భ్రాతృవత్సలా!" అని కన్నులనీరు జొటజొట గార మాటాడలేక దుఃఖపరవశుడై నిలువబడలేక నేలపై జదికిలంబడెను. అతని దుఃఖము జూడగానే సభాసదులకుగూడ మిక్కిలి విషాదము జనించెను. వారును బాష్పధారలచేత దమ దుఃఖము బ్రకటించిరి. అనంతరమున జిత్రభానుడు వెండియు నిట్లు బ్రసంగించెను.

“ఆ మహాత్ముని జంపించినవారెవ్వరో నేనెరుగుదును. కాని వారి పేర్లిప్పుడిక్కడ జెప్పను. పాప మెన్నటికైన బయలుపడక మానదు. మగనిజంపి మొగసాలలో మొఱ్ఱలెత్తినది యను సామెత నిజముగా నాసైదోడును జంపించిన దురాత్ములే తమమీద నెవ్వరి కనుమానము లేకుండ జేసికొనుటకై నేనే యీ ఘాతుకకృత్యము జేసితినని లోకమునం బ్రవాదము బుట్టించిరి. ఎక్కడో నరులుచేరని నట్టడవులలో గాకులైన లేని కారడవులలో మృగములయట్ల నేనును

నాకులలములుదిని పొట్టబోసుకొని గాలక్షేపము చేయుచుండ దుస్సహమయిన యపవాదము వారు నాపై బడవైచిరి. మహేశ్వర పూజానిరతములైన యీ హస్తములా యిట్టి ఘాతుకకృత్యము జేయుట! మహాత్ములగు మునిజనులకు నమస్కరించునట్టి యీ చేతులా— యన్న నెత్తురుతోటి యపవిత్రములగుట! ఛీ! అట్టిపని నేనా చేయుట? విక్రమసేనుని కొడుకా యీ నింద్యకర్మము బొల్పుట! ఈ యపవాదము వచ్చిననాటంగోలె నాహృదయము విషాదాగ్నిచే మండిపోవుచున్నది. ఈ సంతాపము చేతనే నేను చిక్కి సగమైతిని. నాహృదయ మెవ్వరయిన బరీక్షించి చూతురేని యది సంతాపమను నగ్నిలోబడి కాలిపోవుచున్నట్లు దెలియును. నరుడెట్టిదైన మోయ గలడు గాని నిందాభారము మోయజాలడు. నిందపడుటకంటె చచ్చుటమేలు. నాపైనున్న యపవాదము బాపుకొనుటకే నిటు వచ్చితిని. నిర్హేతుకముగ నిందపైబడినను సజ్జనుడు దానిం బాపుకొనుట కర్తవ్యము. కర్తవ్యమగుటచేతనే గదా సాక్షాన్నారాయణావతారుడైన భగవానుడు శ్రీకృష్ణుడు శమంతక మణిక్యాపహరణ ప్రవాదము తనపై బడినపుడు తానాదోష మెరుంగక పోయినను లోకాపవాదము బాపుకొనుటకై దేశదేశములు తిరిగి జాంబవంతుడమ్మణిని గ్రహించినాడని తెలిసికొని యా భల్లూక ప్రభువుతో బోరాడి మణిం గ్రహించి సత్రాజిత్తునకిచ్చి నిందాభారమును దించి హృదయమును జల్లన జేసికొనెను. కర్తవ్యమగుటచేతనే గదా యిక్ష్వాకు కులప్రదీపకుడైన రాముడు నిర్మల చారిత్రయైన జనక రాజకన్యకను నిండుచూలాలనియైన శంకింపక గహనాంతరములకు బంపెను. మానవంతునకు ప్రాణముకన్న సత్కీర్తి ప్రియము. అతడసువులనైన విడుచునుగాని సద్గుణము విడువడు. అందుచే నేనట్టి మహాపాతకము జేసినవాడనుగానని మీరెల్లరు నమ్మి మున్ను మీమనంబుల దురాత్ములచే నాటబడిన యనుమాన బీజంబుల బెల్లగింపవలయునని చేతులు జోడించి వేడుచున్నాను. ఏమి

మీయనుమానములు తీరినవా లేదా? ఇంకను శంకాశల్యములు మీ మనంబుల బీడించుచున్నవా?" అని బిగ్గరగా నడుగ వారిలో ననేకులు—"లేదనుమానము లేదు. శంకలుతీరినవి" యని కేకలు వైచిరి. వైచుటయు జిత్రభానుడు—"మంచిది. ఇప్పుడు నేను ధన్యుడ నైతిని. ఇప్పుడు నేను మనుష్యుడనని తలంచుచున్నాను. ఇప్పుడు నేను రాచబిడ్డనని గర్వించుచున్నాను. ఈ మహాజనాభిప్రాయమే మా నాకు ధైర్యము కలిగించుచున్నది. ఇంక నే ప్రస్తుతాంశములనుగూర్చి కొన్నిమాటలు చెప్పి విరమించెదన" ని యుత్తరంగున బలికెను—

"యోధులారా! పరమసాధులారా! మనదేశము కల్పవృక్షములు లేని స్వర్గఖండము. ఈ నేలయంతయు రత్నగర్భ సింధునది తన బాహువులతో గాశ్మీరదేశలక్ష్మిని గాఢాలింగనము చేసికొన్నదో యన్నట్లు లుపనదుల నెల్లనెల్లయెడల వ్యాపింపజేసి దేశమును సార వంతము జేయుచున్నది. ఎక్కడజూచిన తీయని నీరు. ఎక్కడ జూచిన ఫలవృక్షములు. ఎక్కడ జూచిన బచ్చని పంటలు. ఎక్కడ తృణకాష్ట జలసమృద్ధి. ఎక్కడ జూచిన గామధేనువువంటి పాడి మొదవులు. ఎక్కడ జూచిన ధనధాన్యసమృద్ధి. ఇక్కడి పడతుల చక్కదనమున వేల్పుటువిదల వెక్కిరింపగలరు. ఈ పర్వతములు, ఈ సెలయేళ్ళు, నీపూదోటలు, నీవనలక్ష్ములు మధురగానములుసేయు నీవిహంగములు నీ నానావిధ జంతుసంతతులు జూచిన నెవని కన్నుకుట్టదు? ఎవని నోరూరదు? ఎవని కాస పుట్టదు? ఎవని చిత్తము భ్రమింపదు? నవలావణ్య విరాజమానయగు సుందరిని గన్నప్పుడు పరమయోగియైన వికలచిత్తుడగునట్లు వనంబులనియెడు శిరోజములు సరస్సులనియెడు నేత్రములు నదులనియెడు ముత్యాలహారములు వసుంధర యనియెడు మేనుగల దేశాంగనంజూచి చుట్టుప్రక్కలనున్న రాజులు మంచివా రైనను నాసపడుట సహజము. అందు ముఖ్యముగా నేలిక బాలుడు డైనప్పుడు వైరివాని యిల్లాలు వాడకెల్ల వదినయైనట్లు దేశమెల్ల రాజులకు లోకువయై యాసలకు గురియై యుండును, ఇప్పుడు

గాంధారరాజు మన దేశముపై దండువెడల బోవుచున్నాము. ఈవార్త మీరు వినియే యుందురు, విశేషించి సింధురాజుగూడ దీనిపై గన్ను వైచినాడు. చియ్యపట్టిన మేకను జూచిన బెబ్బులుల నోరూరదా? పడమటినుండి గాంధారులు దక్షిణమునుండి సింధురాజు మనపై దాడి వెడలిన ముక్కుపచ్చలారని ముద్దుబాలుడు దేశమును రక్షింపగలడా? తన్ను గాచుకొనగలడా? సైన్యము నడుపగలడా? సన్నాహము సేయగలడా? చేయగలడనుకొనుము. మంత్రులతనికి గాళ్ళసంకెలలు. వారు హారముల కాసపడియు నగ్రహారముల కాసపడియు, ధనముల గోరియు సౌఖ్యసాధనములగోరియు పగరతో జేరి దేశమును వారి కప్పగింప దలచుచున్నారు. ఇంతకన్న రాజద్రోహముగలదా? ఇంతకన్న దేశద్రోహముగలదా? ఇంతకన్న బాపముగలదా? ఇట్టి యమాత్యుల—స్వామిద్రోహుల—లంచగొండుల—దేశవిక్రయుల—బయోముఖ విషకుంభముల—గోముఖ వ్యాఘ్రముల గొరతనేసిన బాపమున్నదా? మేనిచర్మ మొలిపించిన దోషమున్నదా? బ్రతికి యుండగ నిప్పులం బొరలించిన దప్పున్నదా? పాపములేదు. దోషము లేదు. కాని రాజు బాలుడు. సాధుశీలుడు. తల్లి యాడుది. అసూర్యంపశ్య. పరపురుషవిముఖ. మంత్రులే యామె చెవులు. మంత్రులే యామె కన్నులు. మంత్రులే యామె చేతులు. ఇట్టిస్థితిలో నామె యేమిచేయగలదు? బాలుడేమి చేయగలడు? కావున మీ దేశ సంరక్షణము యోధులైన మీరు—మహాయుధపాణులైనమీరు—శూరాగ్రేసరులైన మీరు—దేశాభిమానులైన మీరు—రాజభక్తులైన మీరు నేడు చేసికొనవలయు. దానంజేసి దేశసంరక్షణమేగాక మీయాత్మసంరక్షణము రాజకుటుంబ రక్షణము మొదలగునవన్నియు జరుగును. మిమ్ము నడుపుటకు దగిన దళవాయి నేర్పరచుకొని నగరము చక్కజేసికొని దురాచారుల మేరమీరకుండ బంధించి వలయు సాధన సామాగ్రుల సమకూర్చుకొని పిమ్మట పగరపై నడువవలయు. యోగులైనను ముందుగా నంతఃపుర శత్రువుల గెలుతురుగదా! తగిన

మొనగాడుండిన గాంధారరాజు గర్వము క్షణములో నణపవచ్చును. సింధురాజుసేన త్రుటిలో నణపవచ్చును. మీకందర కిష్టమైన యెడల దండపాణి వజ్రపాణి ప్రముఖుల సాయముగొని నేనే గాంధారుల నెదిర్చి జయము చేకూర్చెద. కాశ్మీర రాజ్యము సురక్షితమై యుండుటే నాయభిప్రాయముగాని నాప్రజ్ఞ జూపుట నాయిష్టముగాదు. 'జనవాక్యం తు కర్తవ్య' మ్మను లోకోక్తినిబట్టి మీకందర కేది యిష్టమో అదియే చేయుట నాయిష్టము. మీయభిమత మెరిగింపుడు" అని యుపన్యాసము విరమించెను. వెంటనే పెక్కండ్రు లేచి— "అయ్యా! మీరే మమ్ము నడుపుడు. రాజ్యమును గాపాడుడు. దురాత్ములైన యామంత్రుల బంధింపుడు. స్వామిద్రోహుల సంహరింపుడు" అని బిగ్గరగా నరచిరి. "తొందరపడుట కర్తవ్యము గాద"ని కొందరు లోలోపల ననుకొనిరి. కొందరు—"అట్లుకాద"ని మూలిగిరి. కొందరు స్పష్టముగా దెలియకుండ గొణుగుకొనిరి.

మొత్తముమీద సైనికులలో పెక్కండ్రు చిత్రభానుని గంభీర వచఃప్రభావమువలన సమ్మోహితులైరి. జనసామాన్యమునకు నేదేనొక విషయము మనస్సుల నాటునట్లు చెప్పుట గడ్డిమేటికి నిప్పుపెట్టుట. అది చరచర యంటుకొని మహోజ్జ్వాలగా మండునట్లు జనసామాన్యము గూడ వట్టి సంభాషణ విన్నపిదప నొడలు దెలియక వర్తించును. 'కలౌ సంఘేశక్తిః' యను నార్యోక్తి నిజము, సంఘశక్తికి మించిన శక్తిలేదు. అందుచేత సంఘము నెదుట సాహసోక్తులుబల్కి పురికొల్పుట యేనుగునకు సిడులు చూపుటయని భావింపవలెను. మదించిన యెద్దున కెఱ్ఱగుడ్డ చూపుటయని తలంపవలెను. వేటకుక్క నుసికొల్పుటయని యెంచవలెను. జనసామాన్య స్వభావ మిట్టిదని యెరిగినవాడగుటవలననే చిత్రభానుడు వారిచెవులలో నయ్యుపన్యాస విషము బోసెను. అది వారి తలకెక్కెను. "రండు! లెండు! చిత్రభానుని సేవింపుడు. దేశము గాపాడుడు. ద్రోహుల దుద ముట్టింపుడు" అను కేకలు వినంబడెను.

అప్పుడు చిత్రభానుడు—"యోధులారా! మీరందరు శాంతింపుడు. సాహసించి యెట్టిపని చేయుగూడదు. నిదానించి కార్యములు చేయవలెను. అవిచారత సకలాపదలకు హేతువు. మీరు స్థిరబుద్ధితో నుండుడు. మరి యెవ్వరేమాటలు చెప్పినను వినకుడు. స్వకార్య పరతంత్రులగు మంత్రులు తంత్రములు పన్ని మిమ్ముం బేలు పుచ్చ బ్రయత్నింతురు వారిమాయలలో బడవద్దు. ఎల్లియో నేడో నేనువచ్చి మిమ్ముం దోడ్కొనిపోయి కర్తవ్యము గావించెద. ఇప్పటికి నాకు సెలవొసంగుడు" అని చెప్పి దండపాణి సహితుడై తన నిలయంబునకుం బోయెను. అతడు వెళ్ళిన పిదప సైనికులు మరల గుంపులు గుంపులుగా గూడి నోటికి వచ్చినట్లు జెప్పుకొనజొచ్చిరి. "అతడే తమ్ము నడుపదగిన మొనగాడ" ని కొందరు పలికిరి. "ఆహాహా! వాని భ్రాతృప్రేమ కనుగొంటిరా అతని పేరెత్తగానే యెంత దుఃఖపడెనో!" యని కొందరు, "వాని పలుకులన్నియు సత్యములే యం దొక్కటి పొరపాటు లేద" ని కొందరు, "వానికన్న మనకు గత్యంతరము లేద" ని కొందరు బలికిరి.

"ఈ వెంగలిమూకను కల్లబొల్లి మాటలతో బేలుపుచ్చి యతడు స్వకార్యసాధనము చేసికొనుచున్నాడ" ని కొంద రనిరి. కాని యిట్టివా రల్పసంఖ్యాకులై యుండిరి. అధిక సంఖ్యాకులు చిత్రభానుని వలలోని చేపలయిరి. వానిచేతి కీలుబొమ్మల ట్లాడదలచిరి. రెండుజాముల రాత్రి యైనపిదప నెల్లవారు స్వగృహంబులకుం బోయి నిద్రించిరి.

విక్రమసేనునిమీద బక్షపాతమును మణివర్మమీద నభిమానమును సంపూర్ణ విశ్వాసమునుగల సైనికులు కొందరు తెల్లవారు జామున లేచి గదాధరుని శూలపాణిని గలిసికొని గడచినరేయి చిత్రభానుండు నెరపిన చిత్రవృత్తాంతమును దెలిపిరి. వారును కలత జెందిన మనంబులతో మణివర్మ నిలయమున కరిగి చిత్రభానుని సాహసమును, దండపాణి ద్రోహమును, సైనికుల మహోత్సాహ

మును దెలిపిరి. వారి పలుకులు విని యా వృద్ధసచివుడు వారితో నిట్లనియె—

"మిత్రులారా! ఇంతవరకు వచ్చునని నేను మున్నే కని పెట్టితిని. దేవి నామాటలు పాటిచేసినదికాదు. విశేషించి చిత్రభానుని మాయలవలన దేవి మనలనందర రాజద్రోహులుగ బరిగణించినది. చేప లెర్రమింగి చెడును. పక్షులు దమములచేతి భంగపడును. మానవులు మాయలమాటలవలన నష్టపోవుదురు దేవి కెవ్వరో మన మీద బలు కొండెములు జెప్పి మనపై ద్వేషము గలిగించిరి. ఇప్పుడు మన మేమి చెప్పిన నామెకు రుచింపదు పైత్యరోగమున రుచిచెడిన జిహ్వకు జక్కెరయు జేదగును. అట్లే యాగాముల విచారింపక సేవకుల పూర్వచారిత్రముల దలంపక వంచకుల మాయలం బడినవా రెండమావులు నీళ్ళనినమ్మి నశియింతురు. ఇప్పు డొకపని చేయుట కర్తవ్యము. మీరుపోయి మీపక్షముననున్న సైనికుల నందర వారితో జేరకుండ జేయుడు. రాణికి మాధవసేనుని ముఖమున నీవృత్తాంత మెరిగించెద. మీద నామె ఇష్టము. ఇంతకు విక్రమ సేనునకు రాజకులుంబమునకు దుర్దినములు వచ్చినవి. మనకు దుర్దినములు వచ్చినవి. చిత్రభానుని యదృష్టము పండినట్లు గనబడు చున్నది. అఘటనఘటనా సమర్థుడైన పరమేశ్వరుని లీలల నధ మాధములైన మన మెట్లు తెలిసికొనగలము? వేగమెపోయి మీరు పనిచేయుడు. నేనును మాధవసేనుని బిలిపించి కర్తవ్యము చేసెదను."

గదాధరాదులు తద్వచనము లాకర్ణించి వాని పనిచిన తెరగున జేయ జనిరి. మణివర్మ మాధవసేనుని బిలువనంపి దేవికా వృత్తాంతం దెలియబంచెను.

## పదియారవ ప్రకరణము

రాజ్యవ్యాపారము లీతెరంగుననుండ వజ్రపాణి గృహ వ్యాపార మెట్లుండవలెనో యట్లుండెను. ప్రధానవు నాటంగోలె నతడు

ధర్మపత్నియైన సునందను మున్ను గారవించినట్లు గారవించుట మానెను. వెనుకటియట్లు దంపతుల కిష్టాగోష్ఠి చెప్పుకొనుట కవకాశము లేకపోయెను. విరసోక్తులేగాని యాతనినోట సరసోక్తులు రాక పోయెను. అంతఃపురమున క్షణకాలమైన నతడు నిలువలేకపోయెను. ఏదో కారణము కల్పించుకొని యామె యతనితో బలుకబోవ నతడు తగిన యుత్తరము జెప్పక విసుగు జెందుచుండెను. ఆమె సమావేశమే వానికి గిట్టకపోయెను. దానికిం గారణమేమని యామె బహువిధంబుల వగసెనుగాని కారణ మామెకుం బొడగట్టలేదు. కారణ మరయుమని పలుమారు పరిచారికలకుం జెప్పెనుగాని వారు నందు గృహకృత్యములు కానలేకపోయిరి. కర్పూరమంజరీ విరహమున నతడు మరుగుచుండ భర్త చేసెడి యనాదరణంబున నామె వనరుచుండెను. అట్లు దంపతు లిద్దఱు వేర్వేరు కారణంబుల మనస్తాపము నొందుచుండుటచే గృహము శోభావిహీనమై యుండెను.

ఒకనాడు వజ్రపాణి గాఢనిద్రపోవుచుండెను. సునంద మందమతియై తన పానుపుమీద బండుకొని నిద్దురరామి దన యవస్థం గూర్చి యిట్లు తలపోసెను—'మిక్కిలి మక్కువగల హృదయేశ్వరు డాకస్మికముగ నూతన పురుషుడట్లు మారిపోవుటకు గారణమేమి? నేనెరిగినంతవరకు నాచేసిన యపచార మేమియు లేదు. ఎప్పటియట్ల వినయవృత్తి గలిగియుంటి. మునుపటియట్ల నాయన మనస్సు రంజించుటకై యత్నించుచుంటి. ఆయన కనుసన్నల మెలగుచుంటి. నాపాలిదైవమని నమ్మికొంటి ఆయన యడుగులు కన్నుల నద్దుకొని వచ్చి యిరుప్రొద్దులు రుచ్యంబులగు భక్ష్యంబులు సేవకులచేత జేయించి సమర్పించుచుంటి. గీచినగీటు దాటకుంటి అనృతము చెప్పితినా? అప్రియము పలికితినా? పరపురుషులతో సంభాషించితినా? ఎన్నడేని దలవాకిటనైన నిలిచితినా? ధనవ్యయము చేసితినా? అత్తల యెడ నాడుబిడ్డలయెడ దుర్వినయంబు సల్పితినా? ఆయన చుట్టముల జుల్కన జేసితినా? ఏమి నావల్లలోపము? ఎవరితప్పు వారికి

దెలియదుగదా ? అడుగులొత్తుదమన్న స్పృశింపనీయరు. ఊడిగములు చేయుదమన్న నొల్లరు. మాటలాడింతమన్న పలుకరు. కేదార రాగమన్న నీయనకెంతో యిష్టము. తరచుగా వీణెయమీద నది వాయింపుమని నన్ను గోరుచుండెడివారు కొంతకాలమునుండి యామాటయే లేదు. పాడుమనాయని యడిగిన వలదని తలయూచు టయేగాని మాటయైనం జెప్పరు. నామీదిరాగ మీదారినున్నప్పుడు కేదారరాగమెందుకు ? ప్రాణేశ్వరుని మనస్సున కెక్కనిపడతి జీవితమేల ? ఆయన చిత్తరంజనముసేయని చెలువమేల ? ఆయన కానందము గలిగింపని యలరుబోడి బ్రతుకేల ? నావలనగల తప్పేమో చెప్పక రొప్పరికించినప్పుడు నేనేమి సేయువలయు ? నాతప్పు నాకు జూపిన దిద్దుకొని తగిన తెరగున మెలంగుదునుగదా !" యని చింతించుచు రెండు కనుగొలకులనుండి వేడినీరు పానుపుపై బడ సునంద వెచ్చని యూర్పులు విడుచుచు నిద్రించుచున్న భర్తపై చూడ్కులు నిగిడించెను. అతడు గాఢనిద్రలో—"కర్పూరమంజరీ ! కర్పూరమంజరీ ! ఏల సిగ్గుపడియెదవు" అని పలవరించెను.

అప్పలుకులు చెవిని బడినతోడనే యప్పొలతి మిన్నకు మగని మనసును దెరచిచూచుటకు సరియైన తాళముచెవి దొరికినట్లయ్యెను. కర్పూరమంజరి యెవ్వతెయో యామె యెరుగును. ఆమెకు వివాహము కాలేదని యెరుగును. ఆమె యసాధారణ లావణ్యవతియని యెరుగును. ఆమె చూపు తూపు లెవ్వరిపై బడునో వారి హృదయములు గాయములు పడునని యామె యెరుంగును. అప్పుడామె వెండియు నిట్లు తలపోసెను—"చిత్రభాను పుత్రికయైన కర్పూరమంజరిపై నీయనకు వలపునిలిచినదని నిద్రావశమున నప్రయత్నముగ నీయననోట వెడలిన మాటలవలన దెలిసినది. ఈయనం గూర్చి యామెయు మేలుపడెనా లేక యాలోకైకసుందరి నిమిత్త మీయనే పరితపించుచుండెనా ? ఎట్లయిననేమి ? బంగారమువంటి నా కాపురము చెడిపోయినది. నిక్షేపమువంటి నాసంసారము నిస్సారమగుచున్నది.

ఒక యొరలో రెండుకత్తు లిముడునా ? ఒక యర్ధశరీరములో నిరువురు పడతులు నిలుచుట కవకాశమున్నదా ? ఒకతెను ద్రోసి రాజననలె. రెండవదాని నచ్చోట నెలకొల్పవలె. ఇంతకన్న గత్యంతర మేమున్నది ? పెద్దదానను జవ్వనము కొంతవరకు జెల్లిపోయిన దానను. మగని మనసు రంజింపజాలనిదానను. నేనే యొత్తిగిల వలయుగాని నిండుజవ్వనంబును నెరజాణతనంబును జక్కదనంబును సౌకుమార్యంబునుగల లేమ తొలగిపోవునా ? అరువదియవయేట యగ్నిగుండ మున్నట్లు పదునైదేండ్లు కాపురముజేసి సంతానవతి నైన నాకు నీనాటికి సవతిపోరా ? నేను వయసు మరలినదాన నగుటచే మిసమిసలాడు లేజవ్వనంబుగల క్రొత్త పెండ్లికూతురు మీదనే యీతనకు గౌరవముండును గాని నామీద లేశమైన నుండదు. ఆమె యడుగులకు మడుగులొగ్గుచు, నామె చిరునవ్వుల కలరుచు, నామె బొమముడుల కడలుచు బ్రొద్దులు పుచ్చవలయు గాబోలు ! హా ! పరమేశ్వరా !" యని విచారించుచు నొకమారు పాన్పుమీద నుండిలేచి యిట్టటు దిరుగుచు నొకమారు పండుకొనుచు నొకమారు భర్తను లేపదలచి నిద్రాభంగము సేయగూడదని మరల వెనుకకు బోయి తెగులులేని వేదనం బడుచుండెను.

అంతలో నాల్గవజాము కోడికూసెను. కోడికూసిన కొలది సేపటికి గాకులు కావుకావుమని యరచెను. అప్పుడు వజ్రపాణికి మెలకువవచ్చెను. వచ్చినతోడనే యతడు మంచముమీద లేచి కూర్చుండి కన్నులు తుడుచుకొని మహేశ్వరధ్యానము చేసికొని మంచము దిగెను. సునంద చేతులు జోడించి మగని యడుగులమీద బడి కన్నీటితో వాటిం దడుపజొచ్చెను. అతడు మిక్కిలి విస్మితుడై విస్మయమునకు భయము తోడుగ మిక్కిలి తొట్రుపాటుతో— "సునందా ! ఏమిది ? ఏమిది ? ఎన్నడు లేనిపని చేయుచుంటివి ? నీకేమికష్టము వచ్చినది ? బిడ్డలు సుఖముగా నున్నారా ? నీపుట్టినింటి నుండి యేదేని చెడువార్త వచ్చినదా ? నీశరీరమున నేదేని రుగ్మత

కలిగినదా! చెప్పుము చెప్పుము” అని పాదములపైనున్న ప్రాణసఖిని జేతులతో లేవనెత్తెను. ఆమె కన్నీరు విడుచుటయేగాని యాతని మాటలకు బదులు చెప్పదయ్యె.

అతఁడు భయము రెట్టింప నామె వీపుపై జేయువైచి తట్టి— “కల్యాణీ! భయములేదు, చెప్పు చెప్పు. పాదుకల యేదేని గంటివా? భయపడకు చెప్పు చెప్పుము” ని వెండియు హెచ్చరించెను. కొంతవడి కామె యూరడిల్లి గద్గద స్వరముతో నిట్లనియె—“ బిడ్డ లింతవరకు సుఖముగా నున్నారు. ఇకమీఁద వారికి సుఖముండదని విచారించు చున్నాను. నాపుట్టినింటివారికి నేటివరకు గుశలమే. ఇకముందది యుండదని వెరచుచున్నాను. నాశరీరమం దింతవరకు రుగ్మతలేదు. ఇకముందు జీవితశంక గలుగవచ్చునని భయపడుచున్నాను. పాదుకల [illegible] చేయుచున్నాను.

అప్పలుకులువిని వజ్రపాణి తెల్లబోయి—“ సుందరీ! నీపలుకులు నాకర్థమగుటలేదు. ఇది పిశాచభాషవలె నున్నది. విస్పష్టముగా జెప్పి నామనస్సును జక్క-జేయుము” ని పలికెను. అనవుడు సునంద కంఠ గాద్గద్యము కొంతవరకు దిండుపడ స్పష్టమైన భాషతో నిట్లుత్తరము జెప్పెను—“ అయ్యా! నేను మీకంటికి బెద్దపిశాచమువలె గానబడు చుండుటచేత నాసంభాషణము పిశాచభాషవలె మీకు దోచుచున్నది. మీమనస్సు చక్క-గ జేయుట నావంటిదానికి శక్యమా? కొంత కాలమునుండి దుర్గంధమునకు దొరగినట్లు నాకు మీరు దవ్వు దవ్వుగ దొలగుచున్నారు. కర్పూరమంజరీ కారణమున దుర్గంధము తొలగి బోవునుగదా! నాకంపు దొలగించుకొని వెంటనే మీకింపుగలుగు నట్లు కర్పూరమంజరిని హృదయముచెంత ధరింపుడు. భర్త భరింపలేని మగనాండ్రను బావులు భరించును. వాగులు భరించును. భగవాను డైన పావకుడు భరించును. మనసులో గర్పూరమంజరిపై మీకు మక్కు-వగలదని యెరుగనుగాని మీపై ఖరియుంతయు మారిపోవుట

నేగని పెట్టుచుంటిని. కంటిచూపు కరువయ్యె. నోటిమాట యురుదయ్యె కలలోనైన నేబనికి రాక కర్పూరమంజరి కావలసివచ్చె. ఎనలేని యా మమత లేయేట గలసె? ఆ ప్రేమ యెందరిగె? ఆ విశ్వాస మే దేశాంతర మరిగె? ఇంతలోనే నాకింత దురవస్థ కలుగునని నేనెన్నఁడు దలంపనైతి. ఒక రాటను రెండు పశువులం గట్టిన నవి యొండొంటిం బొడుచుకొని చచ్చును. నేను కొంతకాలమైన సుఖ మనుభవించినదానను. పదికాలములపాటు కాపురము చేసినదానను. సంతానవంతురాలను, కొంతవయసు మీరినదానను. జవ్వనము సడలినదానను. కావున నాకు సెలవొసంగుడు. భర్తకు ప్రియము సేయుటయే భార్యకు ధర్మముగనుక రాచకన్నియనగు నేను మీకును భూమికిని భారముగానున్న నామేనువిడిచి మీకన్నుల చందమామ యైన వన్నెలాడికై తావొసంగెదను. అదే! నిదురించుచున్న యా చిన్నబిడ్డలం గాచికొనుఁడు. సవతితల్లి కప్పగింపక మీరే కనిపెట్టుఁడు. మీరు విక్రమశాలురై యనేక రణరంగముల విజయ ములుగాంచి విఖ్యాతులఁ బడసిన మహాత్ములరు. ఇట్టి మహనీయులకు భార్యనైనందుకు నేను సంతసించుచున్నాను. ఐదవతనము, బసుపు కుంకుమలతో గాటికిబోవుచున్న కాంత కడు ధన్యురాలు. అందుచే నాకు సెలవొసంగుఁడు. రేపు తెల్లవారకమునుపే మీకన్నులు చల్లనగునట్లు—మీ మనస్సు చక్కబడునట్లు—మీ మనోరథము సిద్ధించునట్లు—మీ సంకల్పమున కాటంకము దీరునట్లు—మీ యుద్యమము సఫల మగునట్లు—తగిన మగఁడు గావలెనని తహతహపడుచున్న యా తలిరు బోఁడి తపము ఫలించునట్లు నేను చేయుదలచిన కార్యము జేసెద" అని కోపావేశంబునఁ నాయెలనాగ యింక నేమియో పలుకఁబోవుచుండ వజ్రపాణి యెఱ్ఱబడిన యామె కన్నులను—దృఢనిశ్చయము దెలుపు చున్న యామె మొగమును—గంపించుచున్న గాత్రమును—తొట్రు పడుచున్న యామె మాటలను జూచి విని యేమియుందోచక భయ విహ్వలుడై యామె చేతులు బట్టుకొని యిట్లనియె—

"కల్యాణీ! నీమాటలనుబట్టి కలలో నేను కర్పూరమంజరి యనుమాట దలపెట్టితినని తేటపడుచున్నది. నీవు విస్పష్టముగ జెప్పక పోయినను నీసంభాషణమువలన నది గ్రహింపవచ్చును. స్వప్నములు నీ వెరుగనివిగావు అదృష్టపూర్వములు నశ్రుతపూర్వములు. స్వప్నమున మనము గనుచుందుము. స్వర్గమున బోయినట్లు కలగందుము. అప్పు డేమేమో పలవరింతుము. అవియన్నియు నిజములగునా? చిత్రభానుని కూతురు కర్పూరమంజరియని యొకర్తె కలదు. ఆపేరు నాకు మిక్కిలి చిత్రముగా నున్నది. అది క్రొత్తపేరు. రమణీయమైన పేరు. మనోహరమైనపేరు. అందుచేత నాకీసారి యాడుబిడ్డ పుట్టునేని దానికాపేరు పెట్టవలెనని సంకల్పించుకొని తరచుగా మనసులో దాని స్మరియించుచుందును. అందుచే గలలో నప్పేరు పలవరించితిగాబోలు! ఇంతమాత్రమునకై యింతగొడవ కావలెనా? కర్పూరమంజరి త్రిలోకసుందరి. తేజస్విని. అట్టిదానిని వయస్సుచెల్లిన నాకిచ్చి తండ్రి పెండ్లిసేయునా? నాయందమును నాచందమును జూచి యాబాల నన్ను వరించునా? ఇటువంటి పిచ్చితలంపులు తలలో బెట్టుకొని సాహసంబులు చేయదలంతునా? నేను కొంతకాలమునుండి యెప్పటి యట్లు నీతో జనవుగా మాటలాడక పోవుటకు గొప్పకారణము గలదు. రాజ్యవ్యవహారములు యథాపూర్వకముగా లేవు. పరిస్థితులు మారినవి. సేనలలో గొప్పకలత బయలుదేరినది. వైదేశికులు మనదేశముపై దాడివెట్ట గమకించుచున్నారు. నిరంతరము వాటికి ప్రతిక్రియలు వెదకుచు నామనస్సు స్థిమితముగా లేదు. అందుచే నట్లుంటిని, అంతేగాని నామనస్సులో నీపై నలుకలేదు. నీవె నాయర్ధాంగము, నీవె నాబహిఃప్రాణము. నీకన్న నాకు వేరులేదు. కఠినోక్తులు గట్టిపెట్టుము. సాహసము లుపసంహరింపుము. నన్ను మన్నింపుము. బిడ్డల నడల జేయకుము. నాకప్రతిష్ఠ ఘటింపకుము. నేను మనోవాక్కాయ కర్మముల నీయెడ నట్టి విరుద్ధభావము లేనివాడనునమ్ము. మన కుటుంబము పరువుగలది, అవసరముమాలిన యల్లరిచేసి యప్రతిష్ఠ

సంఘటింపకుము" అని ప్రతిమాలుటయు సునంద—"సరే! మీచిత్తమువచ్చినట్లు చేయుడు. బహుభార్యా పరిగ్రహణమునకు మీకధికారము గలదు. పరకాంతాసక్తులైన పురుషులు తరుచుగా ననృతంబులకు వెరువరు. వారు చేయు బాసలు, ప్రమాణములు విశ్వసింపదగినవి కావు. వారి సంభాషణలకు, సత్యమునకు జీకటికి వెలుతురునకుగల దూరముండును. పాలముంచుటకు నీటముంచుటకు మీరు సమర్థులు. ప్రాణేశ్వరుడె దైవంబని నమ్మి యిల్లాలి నుసురు పెట్టగూడదు" అని కఠినముగా జెప్పి గది విడిచి లోనికి బోయెను.

వజ్రపాణి కలలో దాను ప్రేలిన ప్రేలాపనలవలన కార్యమింత చెడివచ్చినదని విచారించి యామె సాహసకృత్యముల జేసినపక్షమున హానియు లోకనిందయు దనకు సంప్రాప్తించుటయేగాక కర్పూర మంజరీ పాణిగ్రహణ మహోత్సవముగూడ తప్పిపోవచ్చునని భయపడి యిల్లాలి నదివరకే తిరస్కార భావమున జూచుట తప్పని గ్రహించి యింకమీద నామెను లాలించి గౌరవించుటయే కార్యసాధకమని నిశ్చయించెను. కాని యతడు మిక్కిలి యాలస్యముగా మేల్కొనెను. తన యనునయము లామెయెడ బనిసేయలేదు. తన మాటయెడ నామెకు విశ్వాసము గలుగలేదు. ఆమె హృదయ మింతమాత్రము మారలేదు. ఆమె యింట నడయాడుచున్నను మనస్సు మహా వాయు పథమున సంచరించుచు నెన్నెన్నో పాట్లు పడుచుండెను. స్త్రీలకు సాహసము మెండని యతడు పెద్దలవలన బలుమారు వినియుండుటచే నామె యాత్మహత్య చేసికొనునేమో యను భయమున నతడా పగలిల్లు గదలక నారాత్రియు నిద్రపోక జాగ్రత్తగ నుండెను. ఆ రేయి సునంద నిదురింపనేలేదు. మంచముమీద గూర్చున్నది కూర్చున్నట్లె యుండెను. పండుకొమ్మని భర్త యెన్నివిధముల బ్రతిమాలినను శయనింపదు. ఆ రేయి సతీపతుల జాగరణముతోనే గడచెను.

మరునాటినుండి సునందకు మతిచలించెను. ఊరకె నవ్వును; కారణములేకయే పెద్దపెట్టున నేడ్చును. ఆహారము ముట్టదు.

"కర్పూరమంజరీ, కర్పూరమంజరీ" యని పిలుచును. ఒకచోట స్థిరముగా నిలువక గృహమునందు, గృహముచుట్టునున్న దొడ్డియందు దిరుగుచుండును నిష్కారణముగా బిడ్డలం గసిరికొట్టును. పరిచారికలను దిట్టును. అయ్యయ్యో! నన్ను సేవకులు కొట్టుచున్నారని కేకలు వేయును. తినుటకేదేని బెట్టిన విసము పెట్టుచున్నారేయని యరచును. మాటిమాటికి మొత్తుకొనును, రొమ్ము మోదుకొనును. నిలువగల దువ్వలువలు దెచ్చి చింపును. ఎలబింపెదవన బొమ్మలకు బట్టలు కావలెనను. అద్దములు పగులగొట్టును. అట్లుపని చేయవలదని భర్త నివారింప తల గోడకు గొట్టుకొనును. చీనిచీనాంబరములు మైలపడిన వని తడుపును, తన యమూల్యాభరణములదీసి పరిచారికలం బిలిచి యొక్కొక్కరి కొక్కొకనగ పంచిపెట్టును. ఇల్లు కాలిపోవునని వంకబెట్టి పొయిలో నిప్పులార్పును. కర్పూరమంజరి యామెకంటి కనుకణము గనబడ జొచ్చెను. తనవెనుక నామె నడచుచున్నట్లు చెప్పును. కర్పూరమంజరి యటకమీద నున్నదని నిశ్చయించుకొని యటక మీద కెక్కును. పెరటిలోనున్న పొదరిండ్లలోను గృహమందలి చీకటిభాగములలోను, మంచముక్రిందను, బరువుచుట్టలలోను, భోషాణమునందును నిలువెత్తునున్న గుండిగలలోను, కర్పూరమంజరి యున్నదని శోధించి చూచును. కర్పూరమంజరి యింట బ్రవేశించు నని చెప్పి కవాటములు బంధించును. నిశ్శబ్దముగా నున్నసమయమున నను భర్తం బిలిచి—"యదిగో కర్పూరమంజరి, వీధిలోనుండి నన్ను బిలుచుచున్నది. వినబడినదా!" యని యడుగును. "పిలుచుటలేదు. నీది వట్టిభ్రమ!" యని భర్త బదులుచెప్ప—"అయ్యో! అంత బిగ్గరగా బిలుచుచున్నప్పుడు మీకు వినబడకపోవుటేమి? ఇది వట్టి మాట. నాకంటిలో దుమ్ముగొట్టవలెనని మీరిలాగనుచున్నారు" అని కొరకొరమనుచు భర్తం దూలనాడును. ఛీ! నాయింటికిరాకు. నాభర్తం బిలుచుటకు నీవెవ్వతెవే? వచ్చితివా నీనెత్తురు కంట జూచెద. రాచకూతురవైనయెడలరా. నేను రాచబిడ్డనే!" యని

కత్తి చేతబూని కర్పూరమంజరి వీధిలోనున్నదని తలుపులు తెరచి పరుగెత్తబోవును.

వజ్రపాణి తన నూతనవధూ సమాగమము ప్రయత్నమిూవిధముగా బరిణమించినందుకు దద్దయు విచారించి యది స్వయంకృతాపరాధమేయని నిశ్చయించి పశ్చాత్తాపము నొందిన గార్యములేదని గ్రహించి యామెను నలుగురు పరిచారికల కప్పగించి తలకు నిమ్మకాయలురుద్ది స్నానము చేయించుచు గదిలోనుండి యావలకు రాకుండ దలుపులు మూయించుచు నొక వైద్యునిం బిలిచి చికిత్స చేయింప జొచ్చెను.

వైద్యుడు చేయి చూచుటకు రాగా—" ఛీ దురాత్ముడా! నీవు కర్పూరమంజరికి దండ్రివటరా! నీవు కన్యాదానము చేయుటకు వచ్చితివా!" యని మీద నుమ్మివైచెను. పరిచారికల కప్పుడప్పుడు చెంపకాయలు దగులుచు వచ్చెను. బిడ్డలు తల్లి యవస్థజూచి తండ్రిం గౌగిలించుకొని యేడ్చిరి. బిడ్డల దైన్యముజూచి తండ్రియు బాష్పాకులిత లోచనుడయ్యెను. లోకైకసుందరిని పెండ్లియాడి భూలోకస్వర్గ మనుభవింపదలచుచుండగా భూలోకనరక మనుభవింపవలసి వచ్చెనదే యని యతడింతింత యనరాని చింతచే గ్రుస్సుచుండెను.

వలవంతలు వంతులుగా నగుట యద్భుతముగదా! మనుజుడు తలచిన దొకటి, దైవము గావించిన దొకటి యనుమాట సామెత వజ్రపాణియెడల నిజమయ్యెను. మానవు డాకాశమున మేడలుగట్ట యత్నించును. స్వర్గమర్త్యపాతాళముల కేకసూత్రము పన్నును. కాని యఘటనఘటనాసమర్థుడును, సర్వసాక్షియు, సర్వశక్తుడును, సర్వనియామకుడును నైన పరమేశ్వరుడు తరచుగా వారి తలంపుల భగ్నము చేయుచుండును.

## పదునేడవ ప్రకరణము

" మల్లికా! ఏమి యుపాయమే! నీ వెంతో చతురమతివని సఖీజనము చెప్పుకొనును, జనకుడు నన్ను వజ్రపాణి కిచ్చుటకు గృత

నిశ్చయుడై నాఁడు. పట్టిన మకరందుని చేటబట్టినట్లే, లేదా నావంటి దైవోపహతులకు ప్రాణసఖియైన మృత్యుదేవతను గాఢాలింగనము జేసికొనవలెను. ఇంతియేగాని మరియొక పురుషుని కేలునట్టనోపను, అతఁడు నవమన్మథుడేగాని మర్త్యలోకమునకు దిగివచ్చిన జయంతుఁడు గాని, పురుషాకృతి దాల్చిన వసంతుడుగాని, యా మదనునింగన్న తండ్రిగాని. రూపవడైన నాకక్కరలేదు, అతనిం గలియుటెట్లు? ఎక్కడ యుజ్జయినీ పట్టణము! ఎక్కడ శ్రీనగరము! ఎన్నివందల యామడల దూరమున్నదే! మనశ్శబ్దము నపుంసకలింగమని పాణిని, శాకల్యుడు మొదలగు వైయాకరణులు వచించిరి, కాని యది నపుంసక లింగము గాదు, నపుంసకములకు సంచలన మెక్కడిదే! నపుంసక మైనయెడల నిమేషమాత్రమున నిన్నివందల యామడ ప్రయాణము జేసి మహానుభావుడైన మకరందుని కడ కేగుటపోగలదే? "ప్రమాదో ధీమతామపి" యన్నట్లు మహామేధావంతులగు వైయాకరణులు గూడ శాస్త్రరచనలలో పొరపడియుందురు. నా మనస్సు నిజముగా నపుంసకమైన నే నింత సంతోషింతునే? నపుంసకములైన కాళ్ళవలె తీగలవలె నిదియొక చోట బడియుండిన నెంత బాగుండునే! దీని కీ సంచలన మెక్కడినుండి కలిగినదే? ఇంతవేగ మెక్కడినుండి వచ్చినదే? ఒక్క నిముసమైన నా దగ్గరనుండదేమే? నేనన్న దీనికింత గిట్టకున్నదేమే? ఇది కోతివంటిదిగదా! దీనిని బంధించుటకే శృంఖలములు లేవుగదా? చతురమతివి నీ వట్టి సంకెళ్ళ నిర్మింపలేవుగదా? నీ తెలివి తెల్లవారినట్లే యున్నది. నాకు బదికివచ్చు నుపాయమేదియు నీకడలేదు? ఓసీ! ఆమహానుభావుని పాణిగ్రహణభాగ్యము చేకూరినను జేకూరక పోయినను చిరునవ్వు వెన్నెలలు గ్రక్కు నాతని ముఖచంద్ర మండలము నొకసారి చూపవే. ఈ మహోపకారమునకు నీ ఋణ మెన్నడైన తీర్చుకొందునే. ఆహాహా! ఏమే యా ముఖలావణ్యము. ఏమే యా కర్ణాంతములైన యా సోగకన్నులతీరు! ఏమే యా నాసికళ! సిరికి నివాసమైన తెలిదామరపువ్వుల నెవ్వడు చేసెనో యా కన్నుల

నాతఁడే చేసెను. శరత్కాల చంద్రమండల మెవ్వఁడు నిర్మించెనో యాతని మొగము నాతఁడే నిర్మించెను. బంగార మెవ్వఁడు సృజియించెనో వానినెమ్మేను నాతఁడే సృజియించెను. వెన్నెల నెవ్వఁడు గావించెనో యీ మందహాసముల నాతఁడే గావించెను. చందమామలోని లావణ్యము వసంతుని మార్ధవము పచ్చవిల్తుని చక్కఁదనము మూఁడును మూఁడుపాళ్ళువైచి చతురాస్యుఁడు తన పురుషసృష్టి సార్థకమగునట్లు వీనిం జేసియుండును. చెలీ! అట్టిపురుషుని సందర్శించు టెట్లు? ఒక్కసారి యతనిజూచి యీమేను విడువవలెనని యున్నది. ఏల యిట్టిపని యందువా విను. అతఁడతి దూరమందుండుటచేతను నావంటి కన్నియలు పెక్కండ్రు వాని కిచ్ఛామాత్రమున సులభముగా లభింపఁగలుగుటచేతను నతని కాలిగోటి కయిన బరిచర్య సేయుటకు నేను తగియుండకపోవుటచేతను నతని దాసీజనంబులోనైనఁ జేరి యాతని యూడిగము సేయ నే దలపెట్టినను నా జనకుఁడు నన్ను విడిచిపెట్టకపోవుటచేతను నా కాతని చరణంబు దుర్లభమనియు మరణంబ శరణంబనియును నిశ్చయించుకొంటిని. కాని యాతనిఁ జూచి ప్రాణంబు విడువఁదలంతు. ఆహాహా! పులుఁగులెంత యదృష్టవంతులే. రెక్కల కలిమిచే నవి యెక్కడి కరుగఁ దలంచిన నక్కడి కెగిరిపోవునుగదా! విమాన సంచారము చేయు దేవతాంగన లెంతయదృష్టవంతులే. ఎవఁడైన నొక్కజోగి మనకడకు వచ్చి ప్రవరాఖ్యునకుంబలె మనకు నొక్క పాదలేపన మిచ్చిన దాని ప్రభావమున మన మొకసారి యుజ్జయినికి రెప్పపాటు కాలమునఁబోయి యతని దర్శించి నమస్కరించి రాఁగలుగుదుముగదా! మందభాగ్యలకు మనకట్టి యదృష్టము పట్టునా? పోనీ! నిరాశఁజెందుదమన్న మేన నుసురున్నంతవఱ కాశాబంధము తెగదు. అసువులతోడనే యాశలు నశించును. స్వతంత్రించి పోవుదమన్న పనికిమాలిన యీ రాచకొలమున బుట్టితిమిగదా! అడవులలో యథేచ్ఛముగా సంచరించు చెంచుకన్నియలు తొలిమేనుల నేమి మేలు నోములు నోచిరే?

ఈ పాడు రాచకులమున బుట్టిన కతమున మావంటి కన్నియ లసూర్య పంశ్యలై చీకటులువోలె మేడలలో మిద్దెలలో నడగియుండవలయును. జంతువులకు స్వేచ్ఛయున్నది. పక్షులకు స్వేచ్ఛయున్నది. కీటకములకు స్వేచ్ఛయున్నది. సరీసృపములకు స్వేచ్ఛయున్నది. కాని చైతన్యము గలిగి జ్ఞానసంపత్తిగలిగి మెలంగు మెలంతలకు స్వాతంత్ర్యమున్నది లేదు. 'న స్త్రీస్వాతంత్ర్య మర్హతి' యని మనువు చేసిన శాసనమెట్లు లోకమున బ్రవర్తిలుచున్న దే! ఈ శాసన మెన్నటికైన మాసి పోవునే! సఖీ! నాకోరిక లిసుకపాతరలై దాగుకొనున్నవి. ఎన్నో చెప్పితినని నీకు విసుగుకలుగుచున్న దేగాబోలు. చెప్పినదిచెప్పగా నిక చెప్పవలసినది యున్నది. ఎన్నిదినములు చెప్పినను దరుగదు. చెప్పుటకు మాటలుచాలవు. వాల్మీకిగాని వేదవ్యాసుడుగాని వేదవ్యాసుని యబ్బ గాని మనసులోనున్న యూహల సరియైన మాటలలో దెలిపి సంపూర్ణ భావప్రకటనము చేయగలడే! అది కవికేగాదు గవికైన సాధ్యము గాదు. అట్టిచో నేనెట్లు నీకు నచ్చజెప్పగలను? అదియునుగాక వలపంతయొక్క తీవ్రపు వేడిమి వలవంత యను చిచ్చునంబడి మాడెడు వారికేగాని పెరవారికిం దెలియదు. కన్నియవైనను నీపుణ్యమున నీకట్టి యులమట కలుగదయ్యె. మల్లికా! తల్లికడనైన జెప్పనోల్లని గుట్టుమట్టులు నీకడ జెప్పుకొంటిని. తల్లి కని పిమ్మట మీకప్పగించినది. కావున నీవు తల్లికన్న నెక్కుడు దానవు అందుచే నాయుత్తలికము తీరునట్లు తగిన తెరంగు సేవచేయవలయు. అట్టి యదృష్టము నాకబ్బునా?" అని కన్నుదోయి నీటికతమున మంచు గ్రమ్మిన కెందామరరేకుల చందంబున నలర నామె విచారాక్రాంతయై యటమీద బలుకలేక యూరకుండెను. మల్లిక తన చెరంగుతో నామె కన్నీరు తుడిచి—"సఖీ! నేడు కడుపులోనున్న దెల్ల వెళ్ళ బుచ్చితివి. మనస్సును గలచునట్టి విషయములు వమనములవలె బైకి వచ్చునేని మానిసికి సుఖముండును. దుఃఖములు మిత్రులతో జెప్పుకొన్న గొంతవర కుపశమించును. చెలికాండ్రతో జెప్పుకొన్న

పక్షమున నానంద మతిశయించును. కావున నీకు గొంత హృదయ భారము తగ్గిపోవును. ధైర్యము దెచ్చుకొనుము విచారములవల్ల గార్యములుగావు. ధైర్యకవచము బూనినవారిని కష్టములు బాధింప జాలవు" నాచేతనైన సాయము నేజేసెద నేమి చేయుదునాయని విచారించుచున్నాను. ఉపాయము తోచకున్నది" యని బదులు చెప్పెను.

"ఓసీ! నావిచారము కొంత డీలుపడు చున్నావు. నాహృదయ మించుకేని జలకపడ లేదు, నామనోవ్యథ తగ్గలేదు. అతని కటాక్ష వీక్షణములు ప్రసరింపవలె. నామనస్సు చల్లబడవలె. నీవంటి బుద్ధిమంతురాలి కొక్క యుపాయమైన బొడగట్టకపోవుట నాదురదృష్టము. అయిన దృఢముగా నాలోచింపుము. నేనును నాతమ్ముడు విజయసేనునట్లు మగపుట్టువు పుట్టక కట్టిడి యాడుపుట్టువు పుట్టిన కతమున నిట్టి బెట్టిదంబులు వాటిల్లె. ఛీ! స్త్రీజన్మ మెత్త గూడదే. అందులో రాచకన్నియై పుట్టగిట్టదు. పేదదాననై పుట్టి యిచ్చవచ్చిన మగని చెట్టబట్టి సుఖింపనైతినిగదా!" యని కర్పూర మంజరి పలుకుచుండ మల్లిక యందుకొని—"నెచ్చెలీ! నీకష్టములు నీకున్నట్లే పేదలకష్టములు పేదలకుండును. సకల సౌఖ్యములుండి స్వాతంత్ర్యము లేక నీవు విచారించుచున్నావు. స్వాతంత్ర్యముండి యేసౌఖ్యము లేక కడలేని కడగండ్లబడు కటికిపేదల అవస్థలు వర్ణింప దరమా? జలచరములస్థితి స్థలచరములకు రాదు. జల స్థలచరములస్థితి ఖచరములగు పక్షులకు రాదు. సుఖమున్నచోట దుఃఖము తప్పక యుండును. క్రీనీడ దీపము వెనుకనే యుండును. ఛాయ సూర్యు ననుసరించియే యుండును. పేదదాననైనంత మాత్రమున సుఖపడవు. భాగ్యవంతురాల వైనంత మాత్రమున గష్టపడవు. ప్రస్తుత స్థితినిబట్టి యిట్లనుకొందువు దానికేమి? అతనితో నీకు సమాగమ మెట్లు గలుగునాయను విషయమునుగూర్చి విచారించుచున్నాను. పోనీ, ఇది విను, విదర్భరాజనందనయగు రుక్మిణి తన మనోరథసిద్ధికై

వాసుదేవునికడకు బ్రాహ్మణుని దూతిగా నంపినట్లు మనము గూడ నెవ్వరినైన మకరందునికడ కంపుదమా ?" యని పలికెను.

"పంపవచ్చును గాని మనము సంపూర్ణముగా విశ్వసింపదగిన బ్రాహ్మణుడు మన కెవ్వడు దొరకును ? రుక్మిణీదేవికున్న స్వాతంత్ర్యము మనకు గలదా ? పోతుటీగయైనను మన ఇంట జొరరాదు. ఎట్లో సూర్యచంద్రులు మాత్రము మన యావరలో బ్రవేశించుచున్నారు. మన కట్టిపురుషుని దర్శన మెట్లగును ? మాతండ్రి యింట లేనప్పుడు నీవెవ్వరినైన దోడ్కొని వచ్చుటకైన వీలు లేకుండ భద్రభట్టు హిమాలయ పర్వతమువలె మన కడ్డముగ నున్నాడు. ఇతని వైఖరి జూడ మాతండ్రి కేవో దురాలోచనలు చెప్పుచున్నట్లు తోచును. ఇతనివలన మనకు గొంత యుపకారము జరుగుచున్నదని నాయభిప్రాయము. ఎట్లైనను బ్రాహ్మణ సందేశము వలనుపడదు. మరియొక యుపాయ మన్వేషింపుము" అని ఆమె బదులు చెప్పెను.

"పోనీ యెవరిని బంపుమనియెదవు ?" అని మల్లిక యడిగెను.

"చెలీ ! ఎవ్వరి బంపుమని నేను చెప్పగలను. వెళ్ళెడువారికి ధైర్యముండవలె. ఏలయన నెక్కవలసిన పర్వతములు గలవు. దాటవలసిన యేళ్ళు గలవు. నడువవలసిన కారడవులు గలవు. మెలగవలసిన మృగములు గలవు. విశేషించి క్రూరులగు చోరులు దారులు గాచి యుందురు. వారి బారినుండి తప్పించుకొనవలయు రెండవది నెరజాణతనముండవలయు. ఏలయన—ఆ మహాత్మునికడకు బోవునప్పుడు సమయాసమయము లెరుగవలయు. ఆ సమయంబున జేసిన దర్శనము కోపహేతువుగా వచ్చును. ఆ కాలమందు నాటిన విత్తనమువలె ప్రయత్నము నిష్ఫలమగును. దర్శనము చేసిన పిమ్మట మాట నేర్పుండవలయు, సమయోచితముగా—సందర్భోచితముగా బలుక గలవారు ప్రపంచమున మిక్కిలి తక్కువగా గలరు. ఎదుటివారి మనసు నొవ్వకుండ వారి కిష్టులగువారిమీద నిందలు వేయకుండ దన కార్యంబు సాధించుకొనునట్టి నేర్పరితన ముండవలయును, ఇట్టివి

ఎన్నో గలవు. ఇట్టి గుణములు గలవారు మనకెట్లు లభింతురు ? ఎన్ని విధముల జూచిన నట్టి గుణసంపద నాచెలికత్తె యొద్దనే గలదు" అని చిరునవ్వు మొగమున దోప గర్పూరమంజరి పలుక మల్లిక—"సరిసరి ! నేనా యిట్టిపనికి జాలినదానను. ఇది పురుషులకు సాధ్యమయినపని. ఆడదాని కలవియగునే ! ఇట్టి సాహసంబు సమకట్టుటకు నేనంత వలంతినే ! కొండలెక్కగలనా ? ఏరులు దాటగలనా ? మెకముల బారినుండి తప్పించుకొనగలనా ? ముష్కరములకు తస్కరుల చేతబడకుండ దాటిపోగలనా ? ఏబాటసారుల గుంపునైన గలసి పోయి సుఖప్రయాణము చేయగలనను. ఉజ్జయిని జేరుదునను కొనుము, ఆయుధపాణులచే సురక్షితమైన రాచనగరు ప్రవేశింప కలనా ? నా కామహారాజకుమారుని దర్శనమగునా? అగుననుకొనుము. నన్నాయన పూరికిం గొనునా ? ఒకవేళ నాదరించి మాటలాడు ననుకొనుము. నేనంత జాణతనముగలిగి పూర్వోత్తర విరోధము లేకుండ సందర్భశుద్ధి చెడకుండ నాతని మనసు నొవ్వకుండ గార్యము పొసగునట్లు మాటలాడగలనా ? ఇది నాకు దగనిబరువు. నాకు శక్యముకాని కార్యము. నాకనుచితమైన కర్మము. కావున నింకొక్కని నియోగింపుము" అని యుత్తరమిచ్చి తన యసామర్థ్యమును జెప్పుకొనియెను.

"సఖి ! నీవే యిట్లన్న గార్యసాధన మగుటెట్లే ! పోనీ ప్రయత్నముడుగుదమన్న నాప్రాణ మాశయను తోడిమి నంటిపెట్టుకొని యున్నది. నిరాశ యను గాలి యించుక వీచిన నాప్రాణపుష్పము వాడి క్రిందబడును, అతనిచేత నేను నిరాకరింపబడితినా యీ మేను విడిచెద. అతని మనంబున నేమూలనైన నేనంటినా మన ప్రయత్నము సార్థకమగును. పోనీ, యీ మహారాజకుమారుని విడిచి మరియొకనిపై దృష్టిపరపుదునన్న నట్టి సాహస విక్రమార్కుడేడీ ? అట్టి దాన రాధేయుడేడీ ? అట్టి పండితారామచైత్రుడేడీ ? అట్టి రసికశిఖామణి యేడీ ? అట్టి మర్త్యమలోక మందారమేదీ ! ఏడీ ప్రేలుమడచి

చూపుము ; రత్నములలో వజ్రమట్లు, చుక్కలలో చంద్రుడట్లు, పువ్వులలో కమ్మసంపెంగయట్లు, మృగములలో సింగమట్లు, మకరందుడు తనకుదానె సాటియై, దండిమగలకు దండిమగడై, మన్మథమన్మథుడై, రాజరాజై శోభిల్లుచున్నాడు. ఇట్లనుటచే నితర రాజకుమారుల నిందించుచుంటినని తలంపకుము. అట్లుచేయుట నాసంకల్పముగాదు. మహనీయుడైన మకరందుని గుణవర్ణనము యథాస్థితిగ నేచేయుచుంటిని. అట్టివాని చెట్టబట్టనిచో నీజన్మమేల ? ఈ పుట్టుక వ్యర్థము. అడవిలో బుట్టిన పువ్వడవిలోనే నేలను రాలి చివికి మంటిలో గలిసినట్లు నాసిద్ధియు—నాశరజన్యనము—నాచక్కదనము మంటిపాలు గావలసినదే. కావున మన చిరకాల స్నేహము దలంచియైన, నాయందలి జాలిపెంపుననైన సహజమైన నీసౌజన్యాతిశయమువలననైన నాపనుపుసేయుము. సత్కార్యసిద్ధికొరకు బోవుచుంటి గావున నీకేయాపదలు రావు" అని గడ్డముపట్టి బ్రతిమాలుకొనెను.

"చెలీ! నన్ను బ్రతిమాలవక్కరలేదమ్మా! ఈ మేనుమీది. నేను తిను నన్నముమీది. నాకట్టుబట్టమీది. ఈ శరీరము మీరాయిచ్చవచ్చినట్లు చేసికొనవచ్చును. ఒకవేళ మధ్యమార్గమున నేనే బెబ్బులి నోటనైనబడి మృతినొందినను నేను విచారింపను. ఏలయన దాని యాకలి దీర్చినదాననగుదును. ఏహానిలేకుండ నుజ్జయిని జేరితినా ప్రియసఖి కార్యము జేసినదాననగుదును. ఎట్లయిన నీపనువుజేసి నాతనువు ధన్యముసేసికొనియెద. కాని, మీతండ్రితో జెప్పి యిల్లు గదలవలయు. ఏవంకబెట్టి యాయనకడ సెలవుపుచ్చుకొందును. నాతల్లిదండ్రులు మూడుగాళ్ళ ముదుసలులైరి. వారు రమ్మని నాకు వర్తమానమంపిరి. తప్పక నేపోవలెనని చెప్పిపోయెద. నీయుంగరము నాకిమ్ము, ఆయన కానవాలు జూపెదను. నీవేదైన లేఖయిచ్చెదవా ? అట్లయిన వ్రాసియిమ్ము. ఏమిచెప్పుమనెదవో చెప్పుము. ఈ రేయి మీయయ్యకడ సెలవుగైకొని రేపు బయలుదేరిపోయెద, మీనాయన

గారు నన్నొంటిగ బోనియ్యరు. నక్షత్రకునివంటి వృద్ధకంచుకుని జంబుకుని నా వెంట నంపుదురు. సరే! ఆ నల్లమందు తాతకు నాలుగు గంజాయాకు లిచ్చితినా కునికిపాట్లు బడుచు దారిలో నే చెట్టుక్రిందనో కూర్చుండును. అప్పుడు జే పరమేశా యని దాటుదును. ఇంక శాంతింపవమ్మా!" యని ఆమె చిత్త మూరడిల్లునట్లు మల్లిక పలికెను.

కర్పూరమంజరి ముఖారవిందము వికసించెను. నేత్రములు విశాలములయ్యెను. చిఱునవ్వు మొగము నలంకరించెను. శరీరమం దంతట నుత్సాహరసము వ్యాపించెను. ఆనందము పట్టజాలక యామె మల్లికను కౌగలించుకొని—"సఖిజనమనగా సుఖదుఃఖసమానమైన జనము. నానిమిత్తమున నీప్రాణములనైన విడువదలచితివిగదా! నీఋణము వేయిజన్మములకైన నేను దీర్పగలనా?" అని వెండియు నిట్లనియె—

"ఓసీ! ఏమిచెప్పుమని నీతో జెప్పుదును? అది చెప్పు మిది చెప్పు మని నే జెప్పజాలను. చెప్పవలసిన దంతయు జెప్పుము. నా యలమట యంతయు జెప్పుము. నీవు చూచినదంతయు జెప్పుము. చెప్పగూడని దంతయు విడిచిపెట్టుము. సమయోచితముగా జెప్పుము. మిక్కిలి దీనముగా జెప్పిన లోకువగును. ఎక్కువ బెట్టుసరిగా జెప్పిన గార్యముచెడును. కార్యశకటమును నడిమిత్రోవ నడిపింపవలయును. పరులతో సంభాషించునప్పుడు వారింజేరకుము. విసుగుగా నున్నప్పుడు పలుకరింపకుము. విచారాక్రాంతు డైనప్పుడు నీ సోదె జెప్పకుము. ఒంటిగానున్నప్పుడు చిత్తము ప్రసన్నమైనప్పుడు మొగము కలకల లాడుచున్నప్పుడు దీర్ఘాలోచనా పరతంత్రుడు కానప్పుడు మెల్లగ జేరి విన్నవింపుము. నాశరీరమాయనదె యనుము. నాప్రాణమాయనదే యనుము. నా మనస్సాయనదె యనుము. నా హృదయ మాయనదె యనుము. నా జీవితమతని యాధీన మనుము, పరమేశ్వరుని నమ్ముకొని ప్రయాణము సేయుము. అంతట గార్యసిద్ధి కరతలామలకము. ఇదిగో! నాయుంగరము తీసుకొమ్మ. ఇది యాతనికిచ్చిరమ్మ. ఆయన యేదేని మరలనిచ్చిన గనుల నద్దుకొందునను. పొమ్మ శుభ మగుగాక!"

ఆ రేయి మల్లిక చిత్రభానునితో మాతాపితృ సందర్శనార్థము పోవుదునని చెప్పి యాయన నొడబరచి మరునాడు వరువాతవృద్ధ కంచుకియైన జంబుకుని చిత్రభానుని యాజ్ఞాప్రకారము వెంటబెట్టుకొని బైలు దేరెను.

రెండుదినములు గడచెను. మూడవనాడు తెల్లవారుజామున వీధిగుమ్మముకడ నేడుపు వినబడెను. అప్పుడే మెలకువ వచ్చిన సేవకులు తలుపుదెరచి యదియేమోయని చూచునప్పటికి వెక్కి వెక్కి యేడ్చుచు జంబుకుడు నిలిచెను. వారు వాని నెట్లో లోపలికి దెచ్చిరి. వాకిటిలో నరుగుమీద గూర్చుండి వాడు వెక్కి వెక్కి యేడువ జొచ్చెను. సేవకులు కలవరపడిరి. అది విని యింటివా రందరు లేచిరి. వానిని లోపలికి దోడ్కొనిరమ్మని చిత్రభాను డాజ్ఞాపింప సేవకులట్లుచేసిరి. ఆ దుఃఖమునకు గారణమేమని చిత్రభానుడు, రుద్రభట్టు, వాని నెన్నివిధముల నడిగినను వాడు వారి పలుకులు వినిపించుకొనక అయ్యో! అయ్యో! నా తల్లీ! నా తల్లీ!" యని రొమ్ము మోదుకొని యేడువ జొచ్చనేగాని యుత్తర మీయజాలక పోయెను. చిత్రభానుడు చీవాట్లు పెట్టెను. సేవకు లేడువవద్దని బ్రతిమాలిరి. ఎట్టకేలకు వాడిట్లు బదులు చెప్పెను.

"ఏమిచెప్పుదును తండ్రీ! బైలుదేరిన నాటి రాత్రియే నేనును మల్లికయు నొకసత్రపు టరుగుమీద బండుకొనగా దగ్గరయడవిలో నుండి పెద్దపులి వచ్చి దానిని లాగుకొనిపోయెను. నేను దుడ్డుకర్ర పుచ్చుకొని తరిమికొట్టితినిగాని యది మల్లికనువిడువక పారిపోయెను. ముసలిముండకొడుకును నన్నైన దీసికొనిపోయినదికాదు. దుంపలాంటి బిడ్డను దీసికొనిపోయినది" అని పెద్దపెట్టున నేడ్చెను.

సేవకు లాశ్చర్యపడిరి. కర్పూరమంజరి వగపుచే నేల జదికిల బడెను. చిత్రభానుడు కటకటాయనెను, చంద్రికయు నిందుమణియు గర్పూరమంజరిని లోనికిదీసికొనిపోయి పానుపు జేర్చిరి.

ఆమె కిప్పుడు రెండు విచారములు పట్టెను. ప్రాణమిత్రి యైన మల్లిక మరణ మొందుట యొకటి తన సందేశము మకరందున కందకపోవుట మరియొకటి. ఇవి యొకదానికంటె నొకటి బలవత్తర మైన విషాదకారణములు. మధ్యాహ్నము జంబుకుని బిలిచి యామె "జంబుకా! నిజము చెప్పు. మల్లికను బెబ్బులి యీడ్చికొనిపోవు చుండ నీవు చూచితివా ?" యని గుచ్చిగుచ్చి యడిగెను. "అమ్మా! మీ పాదములసాక్షి. పెద్దపులి లాగుకొనిపోవుచుండగా నేను కన్ను లార జూచితిని." అని వాడు బదులు చెప్పెను. అన్నివిధముల దైవము తన్ను బాధ చేసెనని కర్పూరమంజరి దుఃఖపరవశయై రెండవ సఖయైన చంద్రికతో నెట్టెటో కాలక్షేపము చేయుచుండెను.

## పదునెనిమిదవ ప్రకరణము

మణివర్మ నియుక్తుడై మాధవసేనుడు రాచనగరున కరిగి కంచుకిచేత దనరాక నరవిందాదేవి కెరిగించి యామె యాజ్ఞాప్రకారము లోనికరిగి యథోచిత సత్కారముల నంది సుఖాసీనుడై మణివర్మ చెప్పినట్లు చిత్రభానుడు సేనానివేశమున జేసిన చర్యలెల్ల విని పించెను. అది వినగానే యామెగుండె జల్లుమనెను. రాజకుటుంబము నకు మూడదలచిన యాపద యామె యెట్టయెదుట గనబడెను. ప్రక్కనున్న విక్రమసేనునిం జూచి యా దేవి విచారసూచక మగు హీనస్వరముతో నిట్లనియె—"నాయనా! కాశ్మీర రాజ్యవృక్షమునకు బురుగులు పట్టినవి ఈ కీటకములు తరువును నిర్మూలము చేసినంగాని విడువవు. దొంగయు మనుష్యుడే యను సామెతనుబట్టి మనకు హితు లెవ్వరో యహితులెవ్వరో తెలిసికొనజాలకున్నాము. ఎవరిని నమ్మ వచ్చునో యెవరిని నమ్మగూడదో మన మెరుగము. ఇదిచూడ నా కొక్క శ్లోకము జ్ఞాపకము వచ్చుచున్నది చిన్ననాట మా తండ్రి

మహేంద్రదేవుడు నాకు విద్దెగరవుటకై తర్కవాచస్పతియని బిరుదు బొందిన జయదేవుడను పండితుని నియమించెను. ఆయన ప్రస్తావవశమున నొకనాడీ శ్లోకముజదివి నాకర్థముచెప్పెను. అదిమిక్కిలి రసవంతమగుటచే నేను దానిని వల్లించితిని. క్రొత్తకుండమీఁద జేసిన సంస్కారముట్లు లేతమనస్సు మీఁదబడిన భావములు మరపునకురాక యీజీవితాంతముందును గనుక నాకిప్పటికి నది జ్ఞాపకమే.

శ్లో. అగ్రే వ్యాధః కరధృతధనుః పార్శ్వయోర్జాలమాలాః
పృష్ఠే వహ్ని ర్దహతి విపినం సన్నిధౌ సారమేయాః,
ఏణీ గర్భా దలసగమనా బాలికాః పాదలగ్నాః
లక్ష్మీనాథ! త్వ మసి శరణం కిం కరోమి క్వ యామి.

" కుమారా! దీనిభావమిది. ఒకమగలేడి దురవస్థలోనుండి యిట్లు విచారించినదట. ఎట్టయెదుట జేతవిల్లుబూని కిరాతుడు నిలిచి యున్నాడు. దాపున ముందుకు బారిపోవుటకు వీలులేదు. వెనుకకు బారిపోవుదమన్న వెనుకప్రక్క భయంకరమైన కారుచిచ్చు వనముంగాల్చుచున్నది. ప్రక్కలకు బరుగెత్తుదమన్న గిరాతులు వలలు పన్నియున్నారు. సమీపమందు వేటకుక్కలు సిద్ధముగానున్నవి. ఆమలేడి చూలుదాల్చియున్నది. పరుగెత్త దలచుకొన్నను వీలులేదు. పైగా బిడ్డలు కాళ్ళకడ్డముగా దగులుచున్నవి. ఓలక్ష్మీనాథా! నీవే శరణము నేనేమి చేయుదును? ఎక్కడికి బోవుదును?"

మనయవస్థయు నట్లేయున్నది. మంత్రుల నమ్మదమన్న వారు సింధుగాంధార రాజులకు వశులై రూకలకై మనరాజ్యమును మనలను విక్రయింపదలచుకొన్నారు. చిత్రభానుడు సోదరుం గడతేర్చినట్లే యన్నను సోదరపుత్రులను రూపుమాప దలంచుచున్నాడు. నాయనా! మీరు చిన్నవాండ్రు. లోకానుభవము లేనివాండ్రు. నేనో కోటదాటి వెళ్ళుటకు వీలులేని యాడుదానను. దీనజన మందారమై దేవతాశిరోమణియై సకలలోక రక్షకుడై వెలయుచున్న శ్రీమన్నారాయణుడే మనల రక్షింపవలయు. అగతికులకు గతియు ననాథలకు

నాథుడునైన జగన్నాథుడు నాడు విరటపుత్రిక కడుపులోనున్న పరీక్షితుని సురక్షితుం జేసినట్లు మిమ్ము గాచుగాక! మనుష్యయత్న మను నడ్డుగట్లు భగవదిచ్ఛయను ప్రవాహమును వారింపజాలవు." అని నిష్ఠురముగాను దయనీయముగాను సంభాషించుచున్న దేవి నుద్దేశించి మాధవసేనుడు వినయముగ నిట్లనియె—

"తల్లీ! నేనును మణివర్మయు రాజకుటుంబము నెడ నమితవిశ్వాసముగలిగి చేతులు గట్టికొని మీ పనులు చేయుటకు సిద్ధముగనున్నను మాయెడ మీకు లేశమైన నమ్మికలేదు. మేము మీ విశ్వాసమునకు వెలియైయున్నాము. చండాలురకుం దొలగు బ్రాహ్మణులట్లు—కుష్ఠరోగులకుం దొలగు సుశరీరులట్లు—దుర్గంధమునకు దూరముగ బోవు మానవులట్లు మీరు మమ్ము బరిత్యజించుచున్నారు. చిత్రభానుని దుస్తంత్రము లనియెడు పెద్దయేరులువచ్చి మిఱ్ఱుపల్లముల నేకము జేసినవి. అందుచే నేదిమెరకయో యేదిపల్లమో తెలియక మీరు జలమంతయు మేటి మొసళ్ళతో నిండిన యపాయకర ప్రదేశమని భయమందుచున్నారు. మాయొట్లు మాబాసలు మాప్రమాణములు మాపూర్వచరిత్రములు మీకడ జెల్లిగవ్వయైన బనికివచ్చునవి గావు. మే మేమి చేయుదుము? మాయుపదేశము విషాన్నమట్లు మీకు రుచింపదయ్యె. ఇప్పటికిని మేము మీ యాజ్ఞాబద్ధులము. మీ ప్రియకింకరులము. మీకు వశవర్తులము. మాచేత మీ యిచ్చవచ్చిన కార్యములు చేయించుకొనుడు. అట్లు కానియెడల మీరట్లు తూలనాడినను మణివర్మ మరల నన్నేల మీకడ కంపును! అతడు చిత్రభానునకు మీకుగూడ విరోధియైనందుకు బిట్టు వగచుచున్నాడు. గదాధర శూలపాణులు మీకు బరమ విధేయులు రాజభక్తులు. మీతిరస్కారమున రాజభక్తులు శూరశిఖామణులగు వారిరువురు పగతురతో జేరుదురేమోగాని యింతదనుక వారు మనపక్షమే యున్నారు. మీద మీచిత్తము."

అని మాధవసేనుడు తన విశ్వాసమును దృఢముగా దెల్పుటయు విక్రమసేనుడు తల్లికిట్లనియె—"అమ్మా! నీకు నేజెప్పవలసిన

వాడనుగాను. అయినను నాపలుకులు సరిగా విచారింపుము. మాధవసేనునిమాటలు నాకు నచ్చినవి. సైన్యములు స్వాధీనము లగుచుండుటచేత గార్యభార మీ యమాత్యులమీద బెట్టి మీతండ్రియైన మహేంద్రదేవుని కడకును మాతండ్రికి పరమమిత్రమైన సుదర్శనుని కడకును సాహాయ్యము నిమిత్తము సందేశము నంపుట మంచిది. నాబుద్ధికిం జూడ మాధవసేనుడే యిప్పటికి దగినవాడు. మీద నీయిష్టము" అనుటయు నరవిందాదేవి కొంతసేపు మనంబున నాలోచించి—"కుమారా! నీవు రాజవు. శాస్త్రజ్ఞానము గలవాడవు. చక్కగా నాలోచించి యేదికర్తవ్యమో నేయుము. నాబుద్ధికేదారియు బొడకట్టుటలేదు. మనకందరు బగతురే యగుటచేత మన మాన ప్రాణములు చిత్రభానునిచేత గోల్పోవుటకంటె జిరపరిచితులైన మణివర్మ మాధవసేనులచేతనే గోల్పోవుట యుక్తము. కావున గొఱ్ఱె కటికవానినే నమ్మినట్లు వీరినే నమ్ముకొనియుందము. మణివర్మతో మంతనముండి మాధవసేనుడే సుదర్శనునికడకు మాతండ్రి కడకు సందేశము గొంపోవుగాక!" అని పలికె.

అనవుడు మాధవసేనుడు చింతిల్లుచు—"తల్లీ! మే మెన్నివిధముల మొగవెట్టుకొనుచున్నను మీరింకను మమ్ము చిత్రభాను ప్రముఖులతో సమానులుగా జేయుచున్నారు కాని కాలక్రమమున మా ప్రవర్తనమే మా పలుకులకు వ్యాఖ్యానమగుగాక! నేను మణివర్మతో నాలోచించి మహేంద్రదేవునికడకు సుదర్శనునికడకు సందేశము గొనిపోయి సాధ్యమైనంత వేగముగా వారిని సేనలతో గూడ దోడ్కొనివచ్చెద. మహేంద్రదేవునకు సుదర్శనునకును మీరు జాబులు వ్రాసి సిద్ధముగ నుంచుడు. నేను మణివర్మతో జెప్పి రేప పయనము జేసెద. నాకు సెలవొసంగుడు" అని పలికి వారి యనుమతి వడసి పోయెను. అతడు చన్నపిదప నరవిందాదేవి కుమారుని జూచి— "నాయనా! నాతండ్రికి వ్రాయవలసినజాబు నేనే వ్రాసెద. సుదర్శనుడు పరపురుషుడగుటను స్త్రీనాతనిపేర నేమియు వ్రాయనొల్ల

ఆ జాబు నీవ లిఖింపుము" అని చెప్పి తన గదిలోనికరిగి జనకుని పేర జాబు వ్రాయ దొడగెను. విక్రమసేనుడు తన జాబు వ్రాసి తల్లి కిట్లు వినిపించెను—

"శ్రీసుత్రామశివ మహీపాలురగు స్వస్తిశ్రీ సుదర్శన మహారాజుగారికి— కాశ్మీరపాలకుడగు విక్రమసేనుడు వినయపూర్వకముగా నమస్కరించి చేసిన విజ్ఞాపనము.

నాకు మీ పరిచయభాగ్యము లేకపోయినను మా జనకుడు హేమచంద్ర మహారాజుగారును మీరును వారణాసీ నగరమున సబ్రహ్మచారులై సహాధ్యాయులై ప్రాణమిత్రులై యుండినందున నేను మీకు పుత్రప్రాయుడననియు, మీరు నాకు జనకప్రాయులనియు భావించి చనవుగల్పించుకొని యీ లేఖ వ్రాసి పంపుకొంటిని. ఈ లేఖం దెచ్చిన యతడు మా కమాత్యుడు. మాధవసేనుడు. సింధుగాంధార వల్లభులు మా దేశముపై దాడి వెడలుదురని లోకమున ప్రవాదము గలిగినది. అది యటుండ మా పినతండ్రి చిత్రభానుడు మజ్జనకునిచే దేశభ్రష్టుడు గావింప బడియు నతని మరణానంతరమున శ్రీనగరము జొచ్చి చన్న యున్న మీదను నిందున్న యున్న బిడ్డల మీదను నెంతో ప్రేమ నభినయించి సేనల సేనాపతుల దనవశము జేసికొని యేదో ద్రోహము సేయదలచు చున్నాడు. మా తండ్రిగారి దారుణ మరణము దలంచియు బాలుడను నిస్సహాయుడను నైన నా దీన స్థితి దలచియు బగతుర వారినుండియు నాప్పుడట్లు మేకవన్నె పులియైయున్న మా పినతండ్రి వారినుండియు మమ్ము దప్పించి కాశ్మీరరాజ్య పరిరక్షణము సేయ బ్రార్థించు చున్నాడను. హేమచంద్ర మహారాజు బ్రతికియున్నవాడని మీరు భావింపుడు. 'మిత్ర మాపది జానీయా' త్తను న్యాయమును తెస్సగా గమనింపుడు. ఆర్త రక్షణ పరాయణులు, దయాసాగరులు, పరోపకార ధురంధరులు, నిష్కళంక చరిత్రులు, మత్పితృసఖులు నగు మీకు నేనింతకన్న విస్తరించి వ్రాయనక్కరలేదు. ఈ యమాత్యుడే తక్కిన విష

యము లన్నింటిని మీకుం దెలుపగలను. వేయేల! కాశ్మీరరాజ్య లక్ష్మి మీకు రక్షణీయ, మాళవకాశ్మీరంబు లక్క-చెల్లెండ్రట్ల యుండ వలయునని కోరెద.

ఇట్లు విన్నవించు విధేయుడు,
విక్రమసేనుడు.

ఆ జాబు నా మూలాగ్రముగ గోముకు వినుపింప విని సంతసింప యరవిందాదేవి తన వ్రాసినలేఖయు మిత్రుడు లిఖించిన జాబును మసలకించుకి యగు ముంజుని చేతికిచ్చి మణివర్మకడకంపెను. అతడది చూచి మాధవసేనుని బయనముచేసి పంపెను.

## పందొమ్మిదవ ప్రకరణము

ఒకానొక మహాకవి వర్ణించునట్లు నాటిరేయి గారుచీకటులు నరుల మేనుల నల్లపూతలు బూసినట్లు గగనమునుండి కాటుకవానలు గురిసినట్లు నలుదెసల వ్యాపించి దుష్టుడగు యజమానునికి జేసినసేవ యుంబోలె దృష్టి నిష్ఫలమగునట్లు చేసెను. శ్రీనగరమంతయు నిద్రా మోహితమై నిస్తరంగమగు సముద్రమట్లుండెను. పగలెల్ల బహు వ్యాపార పరతంత్రులై శ్రమపడి యుండుటజేసి నగరవాసులలో దాదాపుగ నందరు గాఢనిద్రం దగిలి విశ్రాంతిసుఖ మనుభవించు చుండిరి. పరద్రవ్యాపహర్తలు పరకాంతాసక్తులు మొదలగు దుర్వి నీతులుమాత్రము గుహాలవిడి యెరనిమిత్తము సంచరించు దుష్టమృగం బులవలె భయపడుచు రాచబాటలు విడిచి సందుగొందులం బడి ముసుగువై చికొని వలయు సాధన సామగ్రుల గ్రహించి తన నీడలు చూచి యామె శంకించుచు దమ దుర్యశమువలె లోకమెల్ల నిండిన యా గాఢాంధకారమున సంచరించుచుండిరి. ఆకాశలక్ష్మి తన వేయి కన్నులు దెరచి నేలపై జరుగుచున్నదంతయు గనిపెట్టుచున్నదో

యనునట్లు నభోమండలమున లెక్కలేని చుక్కలు మిణుకు మిణుకు
మని మెరయ జొచ్చెను. నూతన పురుషులు మున్నెన్నడు జొరని
సందులలో జొచ్చిన తావుల మోరలెత్తి కుక్కలు మొరుగజొచ్చెను.
నగర రక్షణము నిమిత్తమై నియోగింపబడిన రాజభటులు కొంతసేపు
తిరిగి యే యరుగుమీదనో యే స్తంభము చాటుననో నిద్రాదేవికి
విధేయులై యామె పనుపు చేయుచుండిరి. తెగుళ్ళచేత నిద్రపట్టక
బాధపడు రోగుల మూల్గులు, నిలువనీడ లేక వీధులలో నెవరి పంచనో
నిద్రించు పాంథుల గుర్రులు చెట్లమీద నడుమ నడుమ బులుగుల
యెలుంగులు పైన జెప్పిన కుక్కలు దప్ప బట్టణమున నితరశబ్ద
మేదియు లేదు.

సేనానివేశము మాత్రము మారేయి మిక్కిలి సందడి గలిగి
యుండెను. సైనికులు తమ తమ యాయుధంబుల ధరించి సమర
సన్నద్ధులై మహోత్సాహభరితులై యుండిరి. దండపాణియు, వజ్ర
పాణియు గవచంబులుదొడిగి శిరస్త్రాణంబులు ధరించి యశ్వారూఢులై
డాలు కత్తులు, విండ్లు నమ్ములు మొదలగు నాయుధవిశేషంబులబూని
సైనికులలో ముఖ్యులగువారితో వారు వారు గావింపవలసిన
కృత్యంబుల నుపదేశించుచుండిరి. సైనికులలో గొందరు దండపాణిం
గలసి—"యీ సన్నాహ మెందుక"ని ప్రశ్నింప నాతడు—
"ఈ సన్నాహము మన రాజకుటుంబ రక్షణార్థమే. గాంధార రాజ
పరిజనులు మారువేషములు వైచుకొని మన పట్టణంబున సంచరించు
చున్నారు. వారిం బట్టవలయు. అందునిమిత్తమై యాయుధహస్తులగు
వేయిమంది జోదుల మేము తోడ్కొనిపోవుచున్నాము" అని
బదులు చెప్పెను.

"అట్టివారిం బట్టుటకు వేయిమందిచాలుగదా! తక్కిన
సైనికుల నందర సిద్ధముగ నుండవలయునని యేల చెప్పవలయును?"
అని వారు మరల నడిగిరి. అందుకు దండపాణి యిట్లనియె—"మీరు
సైనికులు. మేము సేనాపతులము, మేమాయుధములు పూనుమన్న

మీరు పూనవలసినదె. ఎవరితల గొట్టుమన్న వారితల గొట్టవలసినదె. ఎక్కడికి బొమ్మన్న నక్కడికి బోవలసినదె. ఏమిసేయుమన్న నది సేయవలసినదె. ప్రశ్నలు వేయుటకు మీకధికారములేదు. ప్రబల సమరసన్నాహముచేసి దండనాయకులు దండు నడిపించునప్పుడు ప్రతి సైనికుడు నిలువంబడి యెక్కడికి? ఈ దండయాత్ర యెందుకు? ఇది న్యాయమని యన్యాయమని వితర్క మారంభించిన పక్షమున రాజ్యతంత్ర మొక్క నిముసము జరుగునా? సమరములు జరుగునా? జయములు చేకూరునా? ఎవరి ధర్మము వారు చేయవలయును. రాజాజ్ఞ మేము మన్నింపవలె, మాయాజ్ఞ మీరు మన్నింపవలె. ఇట్టి ప్రశ్నలింకెవరైనా జేసిరేని నట్టివారి శిరస్సులు వెంటనే ఖండింపబడును" అని దండపాణి కఠినముగా బలికెను. ఆ యుత్తరముతో వారు ప్రశ్నలు మానిరి. అప్పుడు దండపాణి సైనికులనందర బారులుగా నిలువబెట్టి వారితో నిట్లనియె— "ఈ సమయమున రణదుందుభులు వాయింపగూడదు. నాయాజ్ఞ లేక మీరు కేకలు వేయగూడదు. ఒండొరులతో మాటలాడగూడదు. నడచునప్పుడు కాలిచప్పుడు గాగూడదు. నేను ముందు నడచెదను. నా వెంటనే గోవు వెంట దగిలిపోవు దూడవలె మీరు రావలయును. నేనెవ్వరి యింటిదగ్గర నిలిచెదనో మీరచ్చట నిలువవలయును. నేనెవ్వరి బంధింపుమన్న వారిని బంధింపవలయును. ఏవిధమైన ప్రశ్నలనడుగగూడదు. దీపములు చేతబట్టగూడదు. అయిదుగు రొక్కబారుగా నిలువవలె. వారివెనుక నైదుగురు వారివెనుక నైదుగురు నీవిధముగా వేయిమందియు రెండువందల చిన్నబారులుదీరి నడువవలయు. యీ నిబంధనలన్నియు మనంబున బెట్టుకొని నా వెంటరండు." అని సేనాపతి యానతీయ సైనికులప్పుడే యైదుగురేసి యొక్కబారుగా జేరి యొకరివెనుక నొకరు నిలువబడిరి. మొట్టమొదట దండపాణి యశ్వారూఢుడై నడువజొచ్చెను. వజ్రపాణిసేనకు వెనుక గుఱ్ఱమెక్కి రాజొచ్చెను. నిశ్శబ్దముగా మనుష్యవాహిని ప్రవహించునట్లు చిన్నసేన నడచి పట్టణము జేరెను.

రెండుజాములు రాత్రి యయ్యెను. పట్టణద్వారముకడ నాజానే యతురంగమెక్కి కవచశిరస్త్రాణములు ధరించి యాయుధపాణియైన యొక మహాయోధుడు వారింగలసికొనెను. వాని కిరుప్రక్కల విచ్చు కత్తులతో నలుగురుజోదు లంగరక్షకులుగా నుండిరి గాఢాంధకార మగుటచే సైనికులాతనిని గుర్తింపలేకపోయిరి. కాని దండపాణి తన గుఱ్ఱము నాతని గుఱ్ఱము సమీపమునకు దీసికొనిపోయి మెల్లగా "సరిగా సమయమునకే వచ్చితివే" యని హెచ్చరించెను. ఇంతకు మున్నే వచ్చితినని యాతడు బదులుచెప్పెను. "మున్ను మన మను కొన్నట్లు వానిం బట్టుకొనవలసినదేగాదా?" యని దండపాణి యడిగెను. "ఆహా! సందియమేమి? అదే ప్రథమకర్తవ్యము. తరువాత వీలునుబట్టి రెండవపని" యని యాతడు ప్రత్యుత్తర మిచ్చెను.

ఈ సంభాషణము గుర్రమును నడుపుచునే వారుచేసిరి. సైన్యం నిశ్శబ్దముగా వెనుకవచ్చుచుండెను. వారు క్రమముగా రాజవీధిం బ్రవేశించి యటనుండి కొన్ని ప్రక్కవీథులజొచ్చి విశాలమయిన యావరణము-నర్యావరణములో రమణీయమైన యుద్యానము నయుద్యాన మధ్యమున మనోహరమైన సౌధముగల యొక స్థలము జేరిరి. సింహద్వారము బంధింపబడి యుండెను. గోడయెత్తుగ నుండెను. దండపాణి నలుగురు జోదులంబిలిచి "యీగోడదాటి లోపలికిదుమికి తలుపు దీయుడ" ని యానతిచ్చెను. వెంటనే యొక యోధుడు కూర్చుండెను. వాని భుజములపై నింకొక యోధుడెక్కెను, అంతట మొదటివాడు లేవగా వాని భుజారోహణముచేసిన సైనికుడు గోడమీదికెక్కి యాగోడదరినున్న చెట్టెక్కి మెల్లగా నావరణములోనికి దిగెను. అట్లె యిద్దరు ముగ్గురు చేసి లోనబ్రవేశించి మొదటివానికి దొడ్డై కవాటము దెరచిరి.

దండపాణి నూరుమంది జోదెల నావరణమునం బ్రవేశింపుమని తక్కినవారి నింటికి నన్ని దెసల కావలియుంచి యింటిలోనుండి యీగ యైన నావలకు దాటిపోకుండ చూడుమని యానతిచ్చెను సైనికులు కడు త్వరితముగా నట్లుచేసిరి.

లోపలిద్వారపు దలుపులకు నూఱు గ్రములుగల యినుప బొగడలు వేయబడియుండెను. గ్రంథులనడుమ నినుపరేకులు తాపటము చేయబడెను. భుజములతో గెంటిన దలుపులూడిరావని దండపాణి యుపదేశముమీద నిరువురు సైనికులు గొడ్డళ్ళుదీసికొని తలుపులు పగులగొట్ట నారంభించిరి. చప్పుడువిని యింటిలో నందరు మేల్కొనిరి. ఎవరువారని మేడమీదనుండి యొక వృద్ధుడు గంభీరముగ గేకవైచెను. మేడక్రిందనున్న వారందరు దొంగలు దొంగలని యాక్రందనము జేసిరి. చుట్టుప్రక్కల నున్నవారు కొందరా చప్పుడును గృహములోనున్నవారి యాక్రందనమును నాలకించి వీధిలోనికి రాబోయిరి. కాని సైనికులు వారినిండ్లు దాటిరాకుండ జేసిరి. తలుపులంతలో బగిలిపోయెను.

దండపాణి, వజ్రపాణి, చిత్రభానుడు లోపల బ్రవేశించిరి. గృహదీపికలు వెలుగుచుండుటచేత వాని సాయమున వారు మేడమీదికి గొందరు సైనికుల దీసికొనిపో సమకట్టిరి. మేడతలుపులుగూడ బంధింపబడెను గృహమునందున్న స్త్రీలు బాలురు సేవకులు దొంగలు దొంగలని గృహము నంతయు బ్రతిధ్వనులిచ్చునట్లాక్రందనము జేయుచుండిరి మేడ తలుపులు గూడ గొడ్డలిపెట్టువలన భేదింపబడెను! మున్ను పేర్కొనబడిన మువ్వురు నాయకులు కొంతమంది సైనికుల దీసికొని మేడమీది కరిగిరి మేడమీద విశాలమయిన చావడిలో దొంగల నదిరింపవలెనని చేత ఖడ్గములు బూని నిలువంబడియున్న వృద్ధుని మణివర్మను జూచి చిత్రభానుడు—"సైనికులారా! వీని చేతిలోని ఖడ్గము లాగుకొని రెక్కలు విరిచికట్టుడు" అని యాజ్ఞాపించెను.

అప్పలుకు లతని నోటినుండి వెలువడెనో లేదో వెంటనే యొక సేవకుడు ఖడ్గ మూడదీసికొనెను. మరియిద్దరు మాంసహీనములై శల్యచర్మావశిష్టములయిన యాతని రెక్కలం బట్టుకొని వెనుకకు దీసి మోటత్రాళ్ళతో విరిచి కట్టిరి. మణివర్మ వారిం

జూచినతోడనే విస్మితుఁడై మొదట మాటలాడలేక పోయెను. తరు వాత నించుక తొట్రుపాటులోనుండి వెలువడి మాటలాడ గమనించు చుండగనే నోటమాట రాకమునుపే యీ దాగుణాశ్చర్యము జరిగెను. " మీరా వచ్చినవారు ! అర్ధరాత్రిమున నిల్లు జొచ్చుటచేతను గోడ కన్నులో దలుపులు బగులగొట్టుటచేతను నేను దొంగ లనుకొన్నాను. దొంగలు ధనము హరింతురు మీరు ప్రాణధనము హరింప వచ్చి నారు. చిత్రభానుడువచ్చి యట్టి దుండగము సేయుటలో నాశ్చర్యము లేదు. కాని దండపాణీ ! ఆ విధమున దేవిగారియొద్దను నా యొద్దను నీవును నీ తమ్ముడును రాజభక్తి సభినయించి మీ కపకార మెన్నడు సేయనివాని నే దోష మెరుంగనివాని బిత్రువిహీనుని, విక్రమసేనుని ద్రోహభావమున విడిచి యీతని జేరుట మిమ్ము మొదటినుండియు నెంతో గారవమున జూచి మహోన్నత పదవిలోనికి దెచ్చిన నన్ను శతవృద్ధుని బద్ధుని జేయుట మహాశ్చర్యము గొల్పుచున్నది. పూవు దండ యనుకొన్నది పామయినది. ఇంద్రనీలము మసి బొగ్గయినది. మీరు గావించిన రాజద్రోహమునకు మీ యన్నదమ్ములిరువురు నిహ పరలోకముల రెంటను కూడ దగినఫలం బనుభవింతురు " అని మణి వర్మ కోపావేశమున నెఱ్ఱబారిన మొగముతో దడబడుచున్నట్లు పలుకుచుండ నంతలో జిత్రభాను డడ్డము తగిలి యీ వృద్ధామాత్యు నుద్దేశించి యిట్లనియె.

" ఓరీ ! దురాత్మా ! వృద్ధమర్కటమా ! కాదు కాదు. వృద్ధ జంబుకమా ! విక్రమసేనునకు వారు ద్రోహముచేసిరా ? ఇట్లనుటకు నీకు నోరెట్లాడెనురా ? నీ కాత్మ లేదా ? అంతఃకరణము లేదా ? సిగ్గు లేదా ? మహానుభావుడైన హేమచంద్రుని మాయోపాయములు బన్ని చంపించి విక్రమసేనునికి మహోపకారము చేసిన దుర్జనుడవు నీవు. మొదటినుండియు నాకును నా యన్నకును మనస్పర్ధలు గలిగించి వైరానలము వృద్ధినొందించి నన్ను దేశమునుండి వెడలనడపించిన పాపాత్ముడవు నీవు. విక్రమసేనుండను బాలుని పేరుపెట్టి కాశ్మీర

రాజ్యమంతయు నేకచ్ఛత్రముగ నేలుచు ప్రజలను దరిద్రులను జేసి ధనములు దోచుకొని కుబేరుడ వగుచున్న కుచ్ఛితాత్ముడవు నీవు. సింధు గాంధార మహీధవులను నిక్షేపమువంటి యీ దేశములమీద దండెత్తి రమ్మని యాహ్వానించి కొన్ని యగ్రహారములు వానివలన లంచముగా గ్రహించి దేశమును, దేశస్థులను, రాజకుటుంబమును మా కులగౌరవమును వారికి విక్రయింపదలచిన నీచాతి నీచుడవు నీవే. పాన్పుమీది పామువలె మా యన్నయొద్ద నీవు మంత్రివై యుండి యెట్టకేల కాతని దుదముట్టించిన పాతకుడవు నీవే. నిన్ను నమ్మి యాయన ప్రాణము గోలుపోయెను. రాజ్యము నీ కప్పగించి బిడ్డల నీ కప్పగించి యాయన బలవన్మరణము నొంద నీవు దేశ మితరుల కప్పగించుచుంటివి. మా యన్న బిడ్డలను భార్యను బరామర్శ చేయ నే నిటకు వచ్చియుండ నన్నూరునిడిచి పొమ్మని యాజ్ఞాపించిన యమాత్యశేఖరుడవు నీవే గావా? నన్ను బొమ్మనుటకు నీ వెవ్వడవు? ఈ రాజ్యము నీ యబ్బసొమ్మా? నీ తాత సొమ్మా! నా యన్న రాజ్యము. నా తండ్రి రాజ్యము. మా యన్న చెవులలో విసము వోసి నాడు నన్ను వెడలగొట్టించి నేడును నట్టి యాటలే యాడజూచితివి. నీ యాట లంతమొందు సమయము వచ్చినది. నీ దుశ్చరిత్రము వెల్లడియగు కాలము వచ్చినది. నీ మలినవర్తనపు గోడకు నేటిదనుక మాయయను వెల్లవైచి జగద్వంచనము జేసితివి. ఇప్పు డేమి చేసెదవు? కాశ్మీర రాజ్య ప్రధానమంత్రుల భుజములు విరిచి కట్టబడిన వేమి? మీదుస్తంత్రము లిప్పుడు సాగవేమి! ఇప్పు డయిన బుద్ధిగలిగి బ్రతుకుము" అని యతి దూరకుండ దండపాణి—

"అయ్యో! మా రాక మీ కాశ్చర్యముగా నున్నదా? మేము విక్రమ సేనుల మోసపుచ్చితిమా? ఇంకను మహాశ్చర్యము జూచెదవుగాక! నీకన్న మే మెక్కువ వంచకులముగాము. నీవు గావించిన ద్రోహముల కన్న మే మెక్కువ ద్రోహములు చేయజాలము. నీవు ద్రోహముల పుట్టవు. నీ వితరుల నేవిషయమున దూషింపనవసరము లేదు. నీచేసిన

యుపచారముల కన్నిటికి ఫలముగా భగవంతుడీ పాట్లు దెచ్చెన" ని యతడు తన్ను మొదట నాడినమాటల కుత్తరమిచ్చెను.

అప్పుడు మణివర్మ సగము పండ్లూడిపోవుటంజేసి కొంత బోసిగానున్న నోటనుండి కొన్నిమాటలు తెలియకుండునట్లు వారికిట్లనియె— "చిత్రభానుడా! పిల్లి కన్నులు మూసికొని పాలుద్రావి తన్నెవ్వరు జూడలేదని సంతసించును. అట్లే నీకావించిన మహాపాతకములు లోక మెరుగరని నీవు భ్రమించి పరమపవిత్రుడట్లు—నిష్కళంకచరిత్రుడట్లు— నిరపరాధులగు నితరులపై దోషారోపణము జేయుచుంటివి నీవర్తనము చక్కగా నరసియే నీయన్న నీవు పాముకన్న—దోడేలుకన్న— బెబ్బులికన్న క్రూరుడవని నిన్ను దేశభ్రష్టుని జేసెను. నీసంచారము లన్నియు వక్రములు. నీపలుకులన్నియు ననృతములు. నీచైదము లన్నియు దురాచారములు. నీది హృదయముగాదు. రాతిముక్క. నీకంతఃకరణములేదు. దయలేదు. దాక్షిణ్యములేదు. ఎగ్గులేదు. సిగ్గు లేదు. ఆశాదేవత నిన్నావహించినది. భ్రాతృహంతవు. ఏకగర్భ జనితుడైన సోదరుని జంపించిన మహాపాతకునకు ఆ నెత్తురు కూడు భుజించి సుఖింపదలచిన పరమదుర్మార్గునకు—జగద్వంచనమే ప్రధాన వ్యాపారముగాగల ఖలునకు నీకు గ్రుడ్డివానికి బట్టపగలుగూడ నంధ కారమయమైతోచునట్లు, మావంటి రాజభక్తులు, మావంటి ధర్మ మార్గానుచరులు, మావంటి నిరపరాధులు, దురాచారులుగా గనబడు టలో నాశ్చర్యమేమున్నది? నీవు మీయన్నగారి ధారాపుత్రుల బరామర్శించుటకు రాలేదు. ఆ పసికూలనంగూడ గడతేర్చి యీ గద్దియ నాక్రమింపదలచి వచ్చితివి. ఆ యభిప్రాయముతోనె యేవో యెరబెట్టి యీ దండనాధుల వశము జేసికొంటివి ఈ సేన స్వాయత్తము జేసి కొంటివి. ఈ మూర్ఖులు నీమాయలలో బడిరి. సింధు గాంధార రాజుల దండయాత్రా కథలు నీకల్పించిన ప్రబంధములు. అవియెల్ల నీదు స్తంత్రములు. ఈ వంక బెట్టి వీరిని జంక బెట్టుకొంటివి. హతవిధి హేమచంద్రునకు, వాని కుటుంబమునకు ప్రతికూలుడై యుండుటం

జేసి నీయాగడములు సాగుచున్నవి. పరమేశ్వరుఁ డొక్కఁడున్న పక్షమున—నతఁడు దయాళుఁడైనపక్షమున—శిష్టజన సంరక్షణంబును, దుష్టజన శిక్షణంబును వానికి నైజములైనపక్షమున—ధర్మమను నదీ ప్రపంచమున నున్నపక్షమున—'సత్యమేవ జయతే నానృతే' మ్మను వేద వాక్యములు సత్యములైనపక్షమున-వేదశాస్త్రంబులు ప్రభావంతములైన పక్షమున నేఁడుగాకున్న మరియొకనాఁడైన నీవొనర్చిన మహాపాతకములకు ప్రతిఫలముగా నీవు భగ్నమనోరథుఁడవైన సర్వవిధములఁ జెడి నీచ మరణంబు నొందకపోవు, నీచేసిన దుశ్చేష్టలు వ్రాయుచాలక చిత్రగుప్తుడు నైతము నీయంతము గోరుచుండును. నీనిమిత్తమై యమధర్మరాజు క్రొత్తనరకము నిర్మింపవలెను. విక్రమసేనుని గర్భము చెడ బుట్టితివి. కాశ్మీర రాజకుటుంబమునకు కలంకము దెచ్చితివి, హరిశ్చంద్రుడు, రామచంద్రుడు, భీష్ముడు, యుధిష్ఠిరుడు, రఘువు, రంతిదేవుడు మొదలగు మహనీయులైన రాజర్షులకు జన్మకారణమైన క్షత్రియవంశము నీవలన మలినమై యవమానితమైనది. చల్లని చంద్రుడు పొడమిన పాలసముద్రమునందు హాలాహలము పుట్టినట్లు ధర్మస్వరూపుడు హేమచంద్రుడు పొడమిన సద్వంశమున బరమ నీచుడవు, పరమ పాతకుడవు నీవు సంభవించితివి. నివెన్ని ధర్మపన్నములు జెప్పిన నమ్మువారు లేరు. నీవన్న నించుకైన నాకు గౌరవము గాని భయముగాని లేదు. నీబంట్లు నాకించుకేనియు వెరపు గొలుప లేరు" అని యంతతో నాగక మణివర్మ వెండియు రూక్షవచనంబుల బలుకబోవుచుండ నొక సేవకుడు—"స్వామీ! వీని కుత్తుకను త్తరింతునా? సెలవైన వీనితల తాటిపండువలె మీయడుగులకడ బడవేయుదు. దేవరవారికి వీనియందు నింత శాంత మెందుక" ని ఖడ్గపాణియై ముందరకు వచ్చెను. చిత్రభానుడు వానిని వారించి—

"ఓయీ! నీభక్తికి సంతసించితిని. బంటువైన నీకున్న భక్తిలో సహస్రాంశ మీపాపకర్మున కున్నపక్షమున మారాజ్య మింతవర కేల వచ్చును? కాని వీని నివుడు చంపవద్దు. ఈ చాటుచావు వీనికిం

దగదు. వీని బహిరంగ ప్రదేశమున జెట్టునకుగట్టి యూరిదీసి మాసొమ్ము దినుటచే బెరిగిన వీని మాంసము కాకులు గ్రద్దలు దినునట్లు వీని కళేబరమును రుద్రభూమిలో బడవేయవలెను. కావున వీని నిప్పటికి రక్షించితిన" ని బంటు నావలకు ద్రోసివైచెను.

"ఓహో! నన్నిప్పటికి నీవు రక్షించితివా! దయామయుడవు గావున మహోపకారము జేసితివి. నేను మరణమునకు భీతిల్లువాడను గాను. నీవంటి పందలు మరణమునకు వెరతురు గాని, నేను వెరువ. నేను వృద్ధుడను. రేపో నేడో చావవలసిన వాడను. నీచేత జచ్చినను నేడో తెగులుచేత జచ్చినను నాకొక్కటే పరమేశ్వరుడు ప్రపంచమున మానవ వినాశముకొరకు గొన్నితావుల మహామారకములైన తెవుళ్ళను, మరికొన్ని తావుల నీవంటి దురాత్ములను సృజించుచుండును. రోగములును మీవంటివారును సన్నిహిత జ్ఞాతులు జగద్వినాశనమునకై జనియించుచుందురు. నేను మరణించినను జీవించినంతకాలము విశ్వాసముతో స్వామికార్యనిర్వాహణ ప్రవీణుడ నగుటచేతను, మనోమాలిన్యము లేక నడచుటచేతను, పరవంచనా విముఖుడ నగుటచేతను, నాకుత్తమగతులు ప్రాప్తించునని నమ్మక గలదు. జన్మాంతర మొందినను నేను మరల నరజన్మమే పొందుదును. ఇంక నీవు మృతినొందితివేని మహానరకములలో స్త్రీహంతలు శిశుహంతలు గురుహంతలు మాతాపితృభ్రాతృహంతలు మొదలగు మహాపాతకులువోవు దుర్గతులకు బోవుదువు. ఒకవేళ జన్మాంతర మొందినను నుత్తమమగు మానవజన్మ మెత్తక పాము పెద్దపులి మొదలగు ఘాతుక మృగజన్మమో లేక హేయమైన కీటకజన్మమో నీవెత్తుదువు. మరణాంతరమున నాకళేబరమును నీవెక్కడ బారవైచినను నాకు విచారములేదు. నామాంసము పక్షులుతిని యాకలిదీర్చుకొనుటచే 'పరోపకారార్థ మిదం శరీరమ్మ' ను మాట యొక్కింత సార్థకమైనదని నేను సంతసింతును. శరీరము భగవానుడైన యగ్నిదేవున కాహుతియైనను, మంటిపాలైనను, విహంగముల కాహారమైన

నామనంబునకు విచారంబు కలుగదు. విగతప్రాణమైన వెనుక వట్టి కట్టెవంటి యీ దేహ మేమైననేమి? అది నీనైచ్యమునే తెలియ జేయును. నీదౌర్జన్యమునే ప్రకటించును. నీఘాతుకవృత్తినే వెల్లడించు నీక్రౌర్యమునే చాటును. అది నేనూడబోను" అని మణివర్మ నిర్భయముగా నిశ్చలమనస్సుతో చిత్రభానుని దూలనాడెను.

"ఓహో! నేను పందను, నీవు దంతిమగడవు. నీకు భయము లేదు. నిజమే! ఇదియొక్కటియే నీనోట వెడలిన సత్యము. నీకు దేవుని భయము లేదు. పాపభయము లేదు. లోకాపవాద భయములేదు. నీవంటి వారికే యుత్తమగతులు వచ్చిన పక్షమున జారుల కుత్తమ గతులు చోరుల కుత్తమగతులు, రాజద్రోహుల కుత్తమగతులు, నీవు జేరుదువేని యవి యుత్తమగతులన్న పేరు గోల్పోవును. నీపేలరి తనము మే మెరుగుదుముగా- నీవు ధనమెందు దాచితివో చెప్పుము. కాశ్మీర రాజ్యమంతయు దోచుకొని నీ యిల్లు నిధినిక్షేపములతో నింపితివని వినుచున్నాము. అవియెల్ల నిక్కడ గ్రక్కుము." అని చిత్రభానుడు వాక్రుచ్చెను.

"నేను ధనము సంపాదించినమాట కల్ల. మానధనము నాకడ గలదు. యశోధనము కొంతకలదు. ధర్మసాధనమే సాధనము. ఇంత కన్న నా దగ్గర ధనములేదు," అని మణివర్మ చెప్పెను.

"ఆహా! నీకు మానధనములు యశోధనములుకూడ కలవా! భూమిమీద నవతరించిన దంభుడవే నీవు. ఈ యాత్మస్తుతి కేమిగాని ధనమెక్కడనున్నదో చూపుము. చూపవేని నీ గుడ్లు దీయించెద. నీ నెత్తురు కుక్కలు నాకునట్లు గుఱ్ఱముల గొట్టు కశలతో జీమలచింతకు నిన్ను గట్టించి కొట్టించెద. ఓరీ! జోదులారా! గుడ్డ నాముదములో ముంచి వీని చేతులకుం గాళ్ళకుంజుట్టి నిప్పంటించుడు. అవి కాగడాల వలె వెలుగవలయు. అప్పుడుగాని వీడు ధనము దాచిన చాటు చోటులుజూపడు. నేనన్నంతపని జేయించెద. జాగ్రత్త నీవు వృద్ధుడ వని బ్రాహ్మణుడవని చూచువాడనుగాను వజ్రపాణీ! మెడదిగి వెళ్ళి

స్త్రీల శరీరములమీఁది నున్న నగలన్నియు దీసికొనిరమ్ము. తమంతటా దాము నగలనొసఁగలేని సాహసికులగు నీ బంట్లను వారిమీఁదకంపి యంగనలని సంశయింపక, సర్వాభరణముల దీయింపుము. ఆడు వాండ్రను స్పృశియించిరని యవమానించిరని పరుషోక్తులాడిరని నేను వారిని దండింపను." అని చిత్రభాను డానతిచ్చెను.

అనవుడు మణివర్మ యిట్లనియె—"నీ కావించు పాపములదండలో నింకను కొన్ని గ్రుచ్చవలసియున్నవి. ఇప్పుడు తలపెట్టిన దుష్కృత్యములు దండను పూర్తిచేయఁగలవు. కానిమ్ము! గ్రుడ్డు దీయించినను నాకు వెలితిలేదు. గ్రుడ్లున్న పక్షమున నీవంటి పాపాత్ములను జూడ వలసివచ్చును. బాహ్యనేత్రములు లేకున్నను మనోనేత్రముతో పాల నేత్రుని జూచుచు గాలముబుచ్చెద. ఎన్ని దెబ్బలు నీవునన్ను గశలతో గొట్టింతువో నన్నియు వడ్డీతో నా పక్షమున దండధరుడు నీకిచ్చును. భగవానుడైన యగ్నిహోత్రునకు నా శరీరము మరణానంతరమైన నాహుతి కావలసినదే. అది జీవించి యుండగానె యైనపక్షమున గడుంగడు మేలుగదా! రక్తమాంస హీనమై యెండుకట్టవలె నున్న నా శరీర మా మహాత్మునకు నల్పకాలమే వినియోగించునని విచారించెద. అదియునుగాక భర్త మృతినొందినప్పుడు మహా పతివ్రతలగు మనదేశపు టంగనలు మగనికాటిపై నెక్కి పదియారువన్నె పసిండికైవడుగు తమ మేనుల నగ్నిహోత్రునకు నిర్విచారముగా గంట దడియైనం బెట్టక యమ్మా యనక యబ్బా యనక యాహుతులుగా సమర్పించుచున్నారు. అట్టి యాడువాండ్రే యబలలే యిట్టి సాహసములు చేయుచుండ మగవాడ నయిన నేను క్షణమునేవు భగవానుడైన వీతిహోత్రుని గాగలించుకొని యుండజాలనా? "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని యమృత బిందూపనిషత్తు చెప్పుచున్నది. మనుష్యుని బంధమునకు గాని మోక్షమునకుగాని మనస్సే కారణము. మనస్సు స్థిరపరచుకొన్న వారికి మున్నీరు మోకాలుబంటి, గండకత్తెర, పుష్పమాల, అగ్నిప్రవేశ

మారాముప్రవేశము, మరణము దేశాంతర ప్రయాణము. కావున మమ్ము నీబెదిరింపులు వెరపింపజాలవు. అవి చిన్నబిడ్డలకడ జెప్పుము. నేను మృత్యుదేవతకు సమీపమందున్నవాడను. వాడికోరలుగల యా భయంకరముఖ మీవరకే నాకగపడుచున్నది. వృద్ధుని జంపినను నప్రతిష్ఠ నీకు వచ్చుటకై నీకీదుర్బుద్ధులు పుట్టినవిగాని నేనెట్లయిన మరణింపకమానను. నాకడ ధనము మాత్రము లేదు. నీయిచ్చవచ్చి నట్లు చేసికొమ్ము. బ్రాహ్మణుడని వృద్ధుడని శంకలుగాని జాలిగాని నీకుండునని నేనెన్నడు దలంపలేదు."

ఈ సంభాషణము జరుగుచుండగానే వజ్రపాణి సౌధముదిగి దిగువభాగమునకు వెళ్ళి మణివర్మ భార్య మొదలగు స్త్రీజనమును నిర్బంధించి సమస్తాభరణములను దీసికొనితెచ్చెను. అంతట చిత్రభానుడు—"వీడు ధనమున్న తావులు చూపలేదు కావున వీనిని క్రూరదండనల పాలుచేయవలయు. అప్పని యిచ్చట చేయదగదు. వీనిం కారాగృహమున బంధింపుము. అచ్చటనే చిత్రవధ చేయవచ్చును. వజ్రపాణీ! ఆయాభరణంబులు నీకడనే యుంచుము మోరియులవంటి నలువురు జోదులను వెంటనిచ్చి వీనిం గారాగృహమున కనుపుము. అచ్చట వీనిని బంధించి నిరంతరము పదుగురు భటులు కావలియుండ వలయును" ని యానతియ్య—"నట్లే" యని వజ్రపాణి మొరకులగు నలుగురు కరకుబంట్ల బిలిచి మణివర్మ దోడ్కొనిపొమ్మని చెప్పెను. వారాతని రమ్మని లాగి తోడ్కొనిపోయిరి.

కాలవశమున వచ్చు సుఖదుఃఖముల ననుభవింపక తీరదని లోకజ్ఞానసంపన్నుడగు మణివర్మ తన నివాసగృహమును విడిచి కారాగృహమున కరిగెను. చిత్రభానుడు ససైన్యముగా దండనాథయుతుడై పిమ్మట మాధవసేను గృహమున కరిగెను. అదియు కవాట భేదము జేసి ప్రవేశించి చూచునప్పటి కయ్యమాత్యుడు లేకపోయెను. వానిగృహము గూడ దోచుకొని వారు పిమ్మట కోడికూత వేళకు గదాధరుని యింటికింజని యాతని బంధించి యాతని యిల్లు కొల్లవెట్టి

పిమ్మట శూలపాణి మందిరమున కరిగి వాని బంధించి యాతని గృహముం దోచుకొనిరి. అంతలో ప్రభాతమయ్యెను.

## ఇరువదియవ ప్రకరణము

రాజ్యలక్ష్మి తాను చిత్రభానుని వశము గాఁ గావలసివచ్చినందుకు విలపించుచున్నదో యన్నట్లు పులుగుల యెలుంగులు నలుదెసల నెసంగెను. చిత్రభానుని బారిబడకుండ దన్ను గాపుమని యామె పరమేశ్వరుం బ్రార్థించిన తెరంగున గాకులు కావు కావుమని యఱచెను. కోపోద్దీపితమైన చిత్రభానుని నెమ్మొగంబు పగిది భానుమండలము పొడుపుగొండపై జపాకుసుమశోణంబై కనంబడెను. రాజ్యరమాదేవికి మున్నె తోడై నిలిచిన మిత్రులందరు క్రమక్రమంబుగ వెనుక బడినట్లు తారక లదృశ్యములయ్యెను. చిత్రభానుని పన్నుగడలు గూఢభావమును మాని వెల్లడియైనట్లు చీకటి యంతరించి వెలుగు దోఁచెను.

చిత్రభానుని యాజ్ఞప్రకారము సైనికులు గదాధర శూలపాణులంగూడ జెచ్చెర జెరలో బంధించి కాల్యకృత్యంబులదీర్చికొనుటకు నిజనివాసంబుల కరిగిరి. దండపాణియు వజ్రపాణియు నిర్వర్తిత కాల్యకృత్యులై చిత్రభాను సమేతముగ జాముప్రొద్దెక్కునప్పటికి సేనానివేశమున కరిగిరి. విక్రమసేనునియెడ భక్తిగల సైనికు లనేకులు మణివర్మ యొక్కయు గదాధర శూలపాణులయొక్కయు బంధనము విని శోకించిరి. వారల్పసంఖ్యాకులయినను దమ్ము నడిపింపు నాయకుడున్న పక్షమున మహోత్సాహముతో వెంటనే చని వృద్ధామాత్యుని సేనాపతులను బంధవిముక్తుల జేయదలంచిరిగాని గదాధర శూలపాణులు సయితము కారాగారబద్ధులగుటచే నత్తెరి జేయునది లేక దైవము హేమచంద్ర కుటుంబమునకు విముఖుడై యున్నాడని తలంచి యూరకుండిరి.

తక్కినవారందరు మనసులో విక్రమసేనునిమీద గొంత యభిమాన మున్నను దమ యభిమానము విప్పు యోజనమగుటచే రెండవ పక్షమున జేరుట లాభకరమని చిత్రభానుని పక్షము జేరిరి. బలహీనుల విడిచి బలవంతులజేరుట లోకులకు సైజమేగదా!

మణివర్మ ప్రముఖులను చిత్రభానుడు జెరలో నుంచెనని వారి యిండ్లు కొల్లగొనెనని నగరమంతట వెల్లడియయ్యెను. చిత్రభానుని బిట్టలుకయును పిట్టపిడుగు లింకెవ్వరిమీద బడనున్నవోయని పౌరులలో ననేకులు గుండెలు చేతబట్టుకొనియుండిరి. విక్రమసేనుని కొలువులో నున్న గొప్ప యుద్యోగస్థులుగూడ భీతచేతస్కు లయిరి. ధనవంతులు చిత్రభానుడు తమయిండ్లు కొల్లబెట్టునేమో యను భయమున దమ తమ విత్తంబుల నాభరణంబుల భూగర్భంబున నిక్షేపించిరి. ఎక్కడ జూచిన చిత్రభానుని దుండగములే ప్రజలు చెప్పుకొనజొచ్చిరి.

ఆ విషయము రాచనగరునందు గూడ దెలిసెను. విక్రమసేనుడు మిక్కిలి యాశ్చర్యము నొంది తల్లి కావార్త నెరింగించెను. అరవిందాదేవి పిడుగువంటి యవ్వార్తవిని "కటకటా! వృద్ధుడైన మణివర్మ కారాబద్ధుడయ్యెనే" యని జాలినొంది గదాధరాదులు గూడ బంధింపబడుటచే దమకు గృహమందున్న పరిచారకులుదప్ప నితరులయిన యాప్తులు నగరమందు లేరని విచారించి యేక్షణమందో దమకుగూడ నేదో మహాపాయము వాటిల్లునని నిశ్చయించుకొనిరి. మాధవసేనుడు సుదర్శునకు రాయబార మెరిగించి సాయముగొని తెచ్చునప్పటికి గార్యము పాకము దప్పుననియు దమకు రావలసిన యిక్కట్టులన్నియు వచ్చుననియు వారు తలంచుచుండిరి.

అంతలో గడచినరేయి మణివర్మ ప్రముఖుల మీదికిం జనిన సైనికసహస్రము వెంటరా చిత్రభానుడు దండపాణి వజ్రపాణులు తన కిరుగెలంకుల నడువ రాజవీధినుండి కోటవైపు జనెను. రాత్రి కొందరి వంతయినది పగలు కొందరి వంతు వచ్చినదని పురజనులు భయభ్రాంతు లయిరి. కొందరు తలుపులు మూసికొనిరి. కొందరు

మేడలెక్కి చూచిరి. కొందరు దొడ్డిదారిని బోరుగూళ్ళకు బయనమై పోయిరి. అందరు నెవ్వగచే భోజనములు మాని కూర్చుండిరి. "హా! హేమచంద్రా! నీకును నీ సంతతికి నెట్టిదురవస్థ వాటిల్లినది!" అని కొందరు వెచ్చనూర్చి విచారించిరి.

అట్లు సేనాసమేతముగ చిత్రభానుడు కోటకు జనియె. భయపడి కావలివాండ్రు నిశ్చేష్టులయిరి. ఎవరి యాటంకములు లేక స్వతముమును బాటసారులు జేరినట్లు చిత్రభానుడు ససైన్యముగ గొలువుకూటముజొచ్చి యుందాసీనుడయ్యెను. అంతఃపురమున హాహాకారములు నెలంగెను. హర్షవర్ధనుడు మిక్కిలి భయపడి యున్నకడకు బోయెను. నర్మదభయముచే గడగడవడకి యరవిందాదేవి పాదములపై బడెను. ఆమెయు నివ్వెరపడి నోటమాటలేక గోడకు జేరబడి కూర్చుండెను. అంతలో చిత్రభాను డంతిపుర పరిచారకుని రావించి విక్రమసేనుని నరవిందాదేవిని దాను చూడవలయునని చెప్పెను. ఆ కంచుకి యువ్వార్త వారికిదుపుర కెరిగించి రావచ్చునని చెప్పెను. అప్పుడు చిత్రభానుడు ఖడ్గహస్తుడై యంతఃపురము ప్రవేశించి విక్రమసేను నెదుర్కొని సన్మానింప లోపలిగది జొచ్చి యుచితాసనమున గూర్చుండెను. విక్రమసేన హర్షవర్ధనులు వాని ప్రక్క నిలువబడి యుండ వారి నతడు గూర్చుండబనిచెను. ప్రక్కగదిలో నరవిందాదేవి యుండెను. అప్పుడు చిత్రభానుడు వదినకు వినబడునట్లు కుమారులతో నిట్లనియె.

"కుమారా! నేనిప్పుడు సేనాసమేతముగ నీ కోట జొచ్చితినని భయపడనక్కరలేదు. నేను నీ కెట్టికీడు జేయదలంచి రాలేదు. నా మనస్సు స్ఫటికమువలె నిష్కళంకమైయున్నది. మీయెడ నా కెట్టి ద్వేషమునులేదు. కాశ్మీరరాజ్యము నీయది. నీవు దానికి నిరంకుశ ప్రభువవు. నీ తమ్ముడు హర్షవర్ధనుడు యువరాజు. నీవు రాజవై యుండ నీ యనుమతిలేక నీ సేనాపతులను నీ దళములను వశముచేసికొని నేను కడచినరేయి గొన్ని సాహసంబులుచేసి నేడు మహా సాహసంబున

సేనాసమేతముగ నీకోటకు వచ్చుటకు గారణంబేమియని నీవె యడుగ వచ్చును. బాలుడవగుటచే భయమున నీ వడుగకున్నను నట్టిప్రశ్న నీ వడిగినట్లే భావించి దాని కుత్తరము నే జెప్పవలసినవాడ. కాశ్మీర రాజ్యమును జూడ నెందరకో కన్నెఱ్ఱగా నున్నది. గాంధార వసుంధ రాధిపుడు దీనిపై దండు వెడలదలచి యున్నాడు. చతురంగబల సన్నాహము జరుగుచున్నది. ఈ వఱకే యాతడు బయలుదేరి యుం డును. దక్షిణమునుండి సింధునాయకుడగు పరంతపుడు బెబ్బులి మేకపై దుముకునట్లు మన విషయంబుపై నురుకదలచు చున్నాడు. పరంతపుడు పరంతపు డనుటకు సందియము లేదు. భాగ్యవర్థనుడు మన దేశము జయించి నిజభాగ్యవర్ధను డగును. ఆ నరపాలు రిద్దరు మన మంత్రులను మన సేనాపతులలో గొందరిని వశవర్తులుంగా జేసి కొని యున్నారు. మన ప్రధానామాత్యుడు మణివర్మయు, ద్వితీయా మాత్యుడు మాధవసేనుడును బరమనీచులై యాత్మలాభపరాయ ణులై ధర్మదూరులై దేశమును బరరాజులకు విక్రయింపదలచు చున్నారు. దానికిం దగిన సాక్ష్యము నాకడ నున్నది. మాయన్న వారియందే విశ్వాసముంచి చెడెను. మీరును వారి నేనమ్మి చెడు చున్నారు. మా యన్నం జంపించిన మహాపాతకుడు మణివర్మ కొన్ని గ్రామముల కాసపడి కొంతధనమున కాసపడి గొప్పబిరుదుల కాసపడి మేటిపదవుల కాసపడి కాశ్మీరమను గోవును కటికివాని కమ్మినట్లు సింధుగాంధారరాజుల కమ్మ మణివర్మ దలచుచున్నవాడు. మణివర్మ యనగా దేనెబూసినకత్తి. మణివర్మయనగా మేకవన్నె పులి. మణి వర్మ యనగా బ్రాహ్మణవేషముతోనున్న చండాలుడు. మణివర్మ ప్రక్కలో బాము. నీవు బాలుడవు. నీ తల్లి శుద్ధాంతకాంత. కావున మీ రిరువురు వ్యవహార మెట్టిదో యెఱుగరు. నీవు నీ తండ్రివలెనే మాయామర్మము లెఱుంగనివాడవు. ఎవరేమి చెప్పిన నదినమ్ముదువు. తెల్లనివన్నియు బాలనియు నల్లనివన్నియు నీళ్ళనియు విశ్వసింతువు. రాజనీతియందు నీవుసంపూర్ణకుశలుండవుగావు పాపము!నీకువయస్సేది?

ఒక చెంపగొట్టిన బాలు నొక చెంపగొట్టిన నీరుగాదు కేళిప్రాయము గదా! అంతలోనే విద్యాభ్యాసము సమగ్రము గాకుండ జనకుని చావు, రాజ్యభారవహనము, మనోవ్యథా ప్రారంభము మున్నగు నిక్కట్లు గలిగినవి. దేశమిట్టి దుర్దశలో నుండుటచే నిన్నరేయి కుతంత్రకారకుఁడును దేశద్రోహియు రాజద్రోహియునైన మణివర్మనుబట్టి బంధించితిని. మాయలాఁడు మాధవసేనుఁడు లేడట. వాఁడు వచ్చినతోడనే బంధించెదను. గదాధర శూలపాణులు మణివర్మ శిష్యులై దళములను మనకు విరుద్ధముగా నడిపింప దలంచుచున్నారని దెలిసి వారినిఁగూడ గారాగృహబద్ధుల జేసితి. సింధుగాంధార ప్రభువులు చతురంగబలముతో మహాసన్నాహముతో దండువిడిసినను మన కింక భయము లేదు. అంతశ్శత్రువులయిన మణివర్మ ప్రముఖులు బంధింపబడిరి. గావున బాహ్యశత్రువులు సులభముగా నిర్జింపబడుదురు. ఇక మీరందరు గుండెలపై జేతులువైచికొని హాయిగా నిద్రింపవచ్చును. మన సైన్యమునంతను నేనే నడిపి కదనరంగమునకుం గొంపోయి బల్లిదులగు పగతుర జయించి చెల్లాచెదరుగ దోలి కాశ్మీర రాజ్యలక్ష్మిని సుస్థిరముగ జేసెద. మీరిందే యుండుడు. నీవు చేత విల్లుదాల్పకుండ, జెక్కు చెదరకుండ, మెడలోని పువ్వులదండయైన నలుగకుండ, మేనం జెమ్మటయైన గ్రమ్మకుండ, నవలీలగ నరిబలంబుల జయింపగలవు. మేమందరము మీ బంట్లము. ఈ దండపాణియు వజ్రపాణియు నీకు ద్రోహులుగారు. రాజ్యపరిరక్షణము నిమిత్తము నీనిమిత్తము వారు నన్ననుసరించిరి. నాయన్నరాజ్యము, నాయన్న బిడ్డల రాజ్యము, పరాక్రాంతమగుచుండగా నన్నుగానట్లు నేనూరక జూచుచుండుటకంత యభిమానహీనుఁడనా? పరాక్రమశూన్యుఁడనా? పుట్టినది రాచపుట్టుకగాదా! మూతిమీదనున్నది మీసముగాదా! చేతబట్టినది ఖడ్గముగాదా! నాయన్నకు నాకు మనస్పర్థలుండిన నుండుగాక! 'మరణాంతాని వైరాణి' యని మహానుభావుఁడైన వాల్మీకి చెప్పియున్నాఁడు. ఆ మనస్పర్థలాయనతోనే పోయినవి.

పసిబాలురైన మీకాపదవచ్చిన ప్రతిక్రియ గావింపక నేనూరకుండ గలనా ! మీయాపద నాయాపదగాదా ! నీవింక భయపడకుము. శంక విడువుము. మూర్ఖులు నీకనేకవిధముల దుర్బోధ చేయుదురు. వానిం జెవిపెట్టకుము. నాయుపదేశము మనంబున నిలుపుకొందువేని నీకు మేలగు. నాయంతరంగశుద్ధియు నాధర్మప్రవర్తనము నానిష్కామ వ్యాపారము కాలక్రమంబున నీవు తెలియంగలవు. ధాత్రి నిష్కంటకము చేసి నీకప్పగించి తపోవనంబున కరుగవలెనని నాసంకల్పము. నాకేవిధమైన కోరికలు లేవు. సుఖదుఃఖముల ననుభవించితిని. శాశ్వతరాజ్యము పరమాప్తగతియు గాకుండ జూచుటయే నామనోరథము. కుమారా ! దీనికి నీవేమందువు ?" అని చిత్రభానుడు దీర్ఘోపన్యాసము జేయుటయు విక్రమసేనుడు విని యేమనుటకు దోచక పినతండ్రివైపు జూచుచుండెను "కుమారా ! నీయభిప్రాయమేమ"ని యతడు మరల నడిగెను.

"అయ్యా ! నేనేమి చెప్పగలను ? మీరు పెద్దలు సర్వధర్మములు తెలిసినవారు. సింధుగాంధారరాజుల దండయాత్రల గురించియు మనము వాని నిమిత్తమై చేయవలసిన ప్రతిక్రియల గురించియు ముందుగా నాతోడ మీరాలోచింపలేదు. మణివర్మ ప్రముఖులను గారాబద్ధులను జేయునప్పుడు నాచెవిని వేయలేదు. అన్నియు జరిగిన పిదప నన్నడిగిన నేనేమిచెప్పగలను ? మీరెట్లుండుమని సెలవిచ్చిన నట్లే యుండెద. ఏమిచేయుమన్న నది చేసెద. ఈ నగరము విడిచిపొమ్మన్న నాతమ్ముని దల్లిని వెంటబెట్టుకొని పాంచాలమునకుగాని మరియొక దేశమునకుగాని పోయెద. మీతండ్రి యెక్కినగద్దె మీరే యెక్కుడు. అందరకు రాజ్యములేయున్నవా ? అందర కైశ్వర్యములేయున్నవా ? నాయభిమత మడుగనక్కరలేదు. మీయిచ్చవచ్చిన తెరంగున మీరు సేయవచ్చును" అని విక్రమసేనుడు మొగము చిన్నవుచ్చుకొని యుత్తరము చెప్పెను.

"కుమారా ! తొందరపడకుము. మీరు దేశమువిడిచి వెళ్ళ నేల ? మణివర్మ ప్రముఖులపై నీకు సంపూర్ణ విశ్వాసముగలదు.

గావున వారిం బంధించెడు విషయము నీకసమ్మతమని ముందు జెప్పనయితి. సేనలను సేనాపతులను వశము జేసికొంటినని యంటివి. నీపని నిమిత్తము నేను వారిని దోడితెచ్చితినిగాని నాపనికిగాదు. నేను వారి వశము చేసికొనలేదు. వారికే నేను వశుడనైతిని. నీతో జెప్పి చేసినను జెప్పక చేసినను నీపని చేయుటయే నాకు ప్రధానము. కావున నిదియొక తప్పుగా బట్టుకొనకుము. నీవు మీయమ్మతోడ స్థిమితముగా నాలోచించుకొనుము" అని చిత్రభానుడు విక్రమసేనుని వీడుకొని కొలువుకూటమునకువచ్చి తన నిమిత్తమై కనిపెట్టుకొనియున్న సైనికులను సేనాపతులను గలిసికొని వారితో గూడి కోటవిడిచి స్వగృహంబునకుం బోయెను. దండనాథులు సైనికులు వానికడ సెలవుగైకొని స్వగృహములకుం జనిరి.

అట చిత్రభానుడు చన్నపిదప నరవిందాదేవి విక్రమసేనుం బిలిచి యిట్లనియె—"కుమారా! చిత్రభానుడు మనయెడ నభిమానము గల వారినందర బంధించినాడు. సైన్యమును వశపరచుకొన్నాడు. దండనాథులు వానికి వశంవదులైరి మణివర్మ మొట్టమొదటనుండి యు జేసిన యుపదేశము మనము జెవిని బెట్టక పోవుటజేసి యింతవరకు వచ్చినది. ఇతడే ఋజుమార్గవర్తనుడు. సింధు గాంధార వల్లభులం గూడి యితడు దుస్తంత్రములు పన్నెనని మనము నిశ్చయించుట పొరపాటేమో! కాని యీ జాబు లితడు వ్రాసినట్లె యెవడో సృష్టించినాడని యాతడు మొరపెట్టుకొన్నను మనము వినమైతిమి. అతని విశ్వసించినచో నింతవరకు రాకపోనేమో! 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' యను నార్యోక్తి నావంటి బుద్ధిహీనురాలి చేష్టలం బట్టి పుట్టియుండవచ్చును. ఈ వైపరీత్యమునకు నేనే కారణమునైతిని. బిడ్డా! చేతులార నీభాగ్యమును నేను వెడలగొట్టితిని. ఇప్పు డేమి చేయుదుము? మన రాజ్యవ్యాపారము చుక్కానిలేని యోడవగిది నున్నది" అని విచారించుచున్న తల్లిం జూచి విక్రమసేనుడు—

"అమ్మా! నీవు విచారింపవలదు. కార్యములు కన్నిటి కాలువలలో

మునిగిపోవును. కన్నీరు కార్యములను సరిగా జూడనియ్యదు దుఃఖము దుర్బలలక్షణము. ధైర్య మెన్నటికిని మునుగనినావ. దాని నెక్కిన వారు సురక్షితముగా దుఃఖసాగరమీాది యవ్వలియొడ్డు జేరుదురు. నీవు ధృతిదాల్చియుంటివా మే ముత్సాహవంతుల మాగుదుము. నీవు ధృతిదప్పిన మామతిచలించు. కావున ధైర్యమును నూతగోల విడువకుము " అని చెప్పి యామె నూరడించెను.

చిత్రభానుడు మధ్యాహ్నమున దండపాణి వజ్రపాణులం బిలిచి- " విక్రమసేనుడు మాతృభాతృసమేతుడై దేశము విడిచి పాంచాలము నకుం బోయెదనని చెప్పె. అతడుగాని వారి పరిజనముగాని చుట్టములు గాని కోట దాటిపోకుండ నన్ని ద్వారములయొద్ద నన్ని బురుజులయొద్ద మూకాక్కకలందేరిన మేటిమగల గావలియుంచుడు. మాధవసేనుని జాడ లరయుడు. అత డేదో రాజకార్యముమీాదనే పైకిపోయియుండునని నేదలంచెదన " ని చెప్పి వారి బనిచి మణివర్మ మాధవసేనులకు బదులుగా నూతన మంత్రుల నియమింప దలచి యెవ్వరిని నియమింతు మని రుద్రభట్టుతో నాలోచించెను. అతడు కొంచెముసే పాలోచించి- " నీకు మంత్రులెందుకు ? నీవు మహేంద్రుడవు. నేను బృహస్పతి యట్లు సకల విషయముల ధర్మోపదేశము జేయుచుండెద. నామనస్సే నీమనస్సు నేను నీకు హితమే యుపదేశింతును. నీచేత హితమే చేయింతును. ఒకవేళ మంత్రుల నియోగింపవలసి వచ్చిన నిక్కడి వారిని నియోగింపకుము. సమర్థులైన యమాత్యులను విదర్భాపురము నుండి రాపింతము. ఇక్కడివారు నమ్మదగినవారు కారు, నీబుద్ధిబలము వినియోగించి నీవొక్కడవే పాలించుచుండుము" అని యుపదేశించెను.

అది లెస్సగా నున్నదని భావించి చిత్రభానుడు నాడు మొదలు కొని ప్రతిదినము గోటకుం బోవుచు గొలువుకూటమున విక్రమసేనుని గద్దెపైనునిచి ప్రక్కను దానొక చిరుగద్దియ వేయించుకొని కూర్చుండి దండనాథులను సామంతులను నగరమందలి ప్రధాన పురుషులను రావించి కొలువుదీర్చి రాజ్యవ్యాపారములను విక్రమసేనుని పేరం జక్కబెట్టదొడగెను.

ప్రజలలో ననేకు లాతని వర్తనము జూచి సముచితముగా నున్నదని మెచ్చిరి. నగరమందలి సంక్షోభము క్రమక్రమముగా డిందు పడెను. చిత్రభానుపట్ల దుర్ణయ మెద్దియు లేదని పౌరులు చెప్పుకొన జొచ్చిరి. వ్యవహారము మిక్కిలి కట్టుదిట్టముగా జరుగ జొచ్చెను. జారులు చోరులు మున్నగు దుండగులు చండశాసనుడగు చిత్రభాను నకు భయపడజొచ్చిరి. దేశమందు బందిపోటులు మున్నగు నల్లరులు క్రమక్రమముగ నడగెను. అరవిందాదేవియు విక్రమసేనుడును చిత్ర భానుని మనస్సనెడు నోడ యేకడకు బోవునో యే రేవు జేరునో తెలియక యాతని వర్తన మంతయు నాటకమనియు నభినయమనియు దలంచుచుండిరి.

మణివర్మకడ విశేష ధనమున్నదని చిత్రభానుడు సంపూర్ణ ముగ నమ్మి యతని నెట్లయిన హింసించి యానిక్షేపమును గనుగొన వలెనని ప్రయత్నములు చేయుచుండెను. దండపాణిం బిలిచి యొకనా డతడు మణివర్మను మిక్కిలి కఠినముగా హింసించి విత్తంబులు దాచిన చోటు దెలిసికొమ్మని యానతిచ్చెను. దండపాణి "స్వామీ! ఇంటిలో నేమూలనో యాతడు సొమ్ము పాతిపెట్టియుండును. కావున మన మిల్లంతయు ద్రవ్వించి చూతము, అక్కడనది కానబడకున్నను వానిని హింసింపవచ్చు" నని యుత్తర మిచ్చెను. అది లెస్సగా నున్నదని యాకార్యమునకు జిత్రభాను డంగీకరించెను.

మరునాడు ఖనకులచేత నిల్లంతయు నొక్క నిలువు లోతు ద్రవ్వించిరి. ఎముకలు మసిబొగ్గులు పాత కుండపెంకులు కొన్ని రాగి శాసనములు మున్నగునవే కానబడియెను, గాని యొక్క రూకయైన నచ్చట గనబడలేదు. అవ్వార్త దండపాణి చిత్రభానున కెరిగింప నాతడు భగ్నమనోరథుడై మణివర్మ మరెచ్చటనో ధనము దాచి యుండునని నమ్మి వానిం క్రూరదండనల పాలుచేసిన నత్తావు బయట బడునని నిశ్చయించెను. ఒకనాడు సాయంకాలము చిత్రభానుడు దండపాణియు వజ్రపాణియు మరి పదుగురు భీకరాకారులగు బంటులు

మణివర్మ యున్న కారాగృహము జొచ్చిరి. "నీవార్జించిన ధనరాసులు మణులు మొదలగు నమూల్యపదార్థములు నీ వెచ్చట దాచితివో చెప్పెదవా లేక దారుణావస్థ పాలయ్యెదవా" యని చిత్రభాను డడిగెను.

"ధనము నాకడ లేదని ఇదివరకే చెప్పితిని. నన్ను మీ రెంత హింసించినను ప్రాణములే గాని నాణెములు నాకడ గ్రహింపలేరు. నెత్తురుచుక్కలే గాని మణులు మీకు దొరకవు. చివికిపోయిన యెముకలే గాని పసిడికణికలు మీకు లభించవు. చర్మమే గాని ధర్మము మీకు లభింపదు. ఏవో వంక బెట్టి నన్ను హింసించుటయే మీ సంకల్పమైన మీరట్లు చేయవచ్చును. పాపము మూటగట్టుకొనుటయే మీ కోరిక యైనయెడల నట్లు చేయవచ్చును. అపకీర్తి సంపాదనము నీ అభిమతమేని నన్ను నీ యిచ్చవచ్చినట్లు హింసింప వచ్చును. పరమేశ్వరుడు సాక్షిగా భూమ్యాకాశములు సాక్షులుగా నే సత్యము బలుకుచుంటిని. ధనము నాకడ లేదు. నా శరీరము వేడి వేల్పున కింధనముగా మీ రిడినను యావజ్జీవము బంధనమున నుంచినను ధనము మాత్రము నేను మీ కియ్యజాల" నని యమ్ముసలిమంత్రి యుత్తరమిచ్చెను.

"వీని ప్రమాణములు నమ్మజాలము. వీని కాలు సేతులకు గుడ్డలుచుట్టి కాల్పు" డని చిత్రభాను డానతిచ్చెను. "అట్లేగాక !" యని మొఱకులగు కరకుబంట్లాముదమునం గుడ్డలు తడిపి వాని చేతులకు మోచేతులవరకు గాళ్ళకు మోకాళ్ళవరకు జుట్టిరి. ఒకడు సమిధలు వైచి యగ్నిహోత్రము రవులుకొల్పుచుండెను. మణివర్మ లేశమైన భయపడక విషాదముం జూపక కూర్చుండి కన్నులు మూసి నమక చమకములతో మహేశ్వరుని లోలోన ధ్యానించుకొనుచు మరణమునకు సిద్ధముగా నుండెను. "ఇదే గుడ్డలకు నిప్పంటించుచున్నాము. క్షణములో భస్మమయ్యెదవు. జాగ్రత్త! ధనమెక్కడ నున్నదో చెప్పు" మని ముష్కరులగు బంట్లు మరియొకసారి యడిగిరి. మణివర్మ ధ్యానపరుడై నిరుత్తరు డయ్యెను.

"స్వామీ! యిమ్మాటికి సెలవేనా? నిప్పంటింతుమా?" యని చిత్రభానునివంక దిరిగి యొకఁ డడిగెను. చిత్రభానుడు దండపాణివంక జూచెను. దండపాణి తప్పని యిష్టము లేకపోయినను దనయేలిక కాగ్రహము వచ్చునేమో యని యతడు వగలజాలక వజ్రపాణి వైపు జూచెను. ఆ యాజానుబాహువులు ముసలితనమందైనను వన్నెదరుగని యా పచ్చని మేను విశాలమై యుప్పొంగు ముడుతలతో నిండియున్న ఫాలభాగమును మాంసహీనములై వ్రేలుచున్న చర్మమును జూడ సేనాపతుల కిరువురకు మనస్సు కరిగెను. వారు చిత్రభానున కుత్తర మీయ కూరకుండిరి.

"చంచలులారా! మీ మనస్సులు చలించినవి. మీరు సేనాపతులై పరసేనల రూపుమాపుటకేగాని పరిచితులకడ మీరు పనికి రారు. మోమోటము జాలి మిమ్ములముచున్నవి ఓరీ! నిప్పు బాగుగా మంటజేయుమురా" యని మాట సరిగా ముగించెనో లేదో యంతలో వృద్ధకంచుకి యగు జంబుకుడు వచ్చి "స్వామీ! కర్పూర మంజరి కర్పూరమంజరి" యని యేడ్చుచు బలికెను. "ఏమిరా! కర్పూర మంజరి కేమి?" యని చిత్రభానుడు తొట్రుపడి యడిగెను. "ఉరి బెట్టుకొనె నురిబెట్టుకొనె" నని వగర్చుచు వాడు చెప్పెను. చిత్రభానుడు భయసంభ్రమములతో విసవిస నడచుచు బోయెను. దండపాణి వజ్రపాణియు వాని వెనువెంట జనిరి. సేవకులు నాడా పని చాలించి మణివర్మ కట్లువిప్పి తలుపులు బిగించి యావలకుం బోయిరి. వజ్రపాణి జంబుకుని బిలిచి మెల్లగా గర్పూరమంజరి యురిబెట్టుకొనుటకు గారణమడిగెను. "చిలుక తల్లియైన మల్లిక పెద్దపులిచే బట్టువడి చచ్చిపోవుటచే బెంగపెట్టుకొని యామె మాధవీలతతో మెడ కురి పెట్టుకొన్నది." అని యతడు బదులుచెప్పెను. "బ్రతికి యున్నదా మృతినొందినదా?" యని మరల వాని నడిగెను. "ఏమో తెలియదు. మాటలేదు. చూపులేదు. నాడిలేదు. బ్రతికియున్నదో చచ్చిపోయినదో నే నెఱుగను," అని వా డుత్తరము చెప్పెను.

# ఇరువది యొకటవ ప్రకరణము

సునంద మతి యించుకేనియు జక్కబడలేదు, ఆమె యున్మాదము నానాటికి హెచ్చుచుండెను. ఇంటనున్న చెంబులు తాను మోయగల చిన్న బిందెలు తన నగలు దీసికొనిపోయి యామె దొడ్డిలో నున్న నూతిలో బడవైచుచుండును. అట్లు పారవైచిన వేమమ్మా యని సేవకు లడిగినప్పుడు "అయ్యో! కర్పూరమంజరి యెత్తుకొని పోవును, అందుకని దాచుచున్నాను" అని బదులు చెప్పెను. రమారమి సంవత్సరము వయస్సుగల యామె చిన్నబిడ్డ నొకనాడు చంక బెట్టుకొని బావికడకు గొనిపోయెను. వెంటనే పరిచారిక యొకర్తు పరుగెత్తుకొనిపోయి "ఏమమ్మా! బిడ్డ నేమిచేసెదవు?" అని యడుగ "ఓసీ! కర్పూరమంజరి వీనిం దీసికొనిపోవును. కాబట్టి యీ నూతిలో బండుకొనబెట్టెద" నని బదులు చెప్పెను. వెంటనే యప్పనికత్తె బిడ్డకు ప్రాణభంగ మగునని యామె చేతిలోనుండి బిడ్డను బలవంతముగా లాగుకొనెను. ఆ పెనగులాటలో సునంద సేవకురాలిని గట్టిగ గరచి నాలుగుమూడుచోట్ల గాయములు చేసెను. గదిలో బెట్టి తాళము వైచినప్పుడు కడుపునొప్పి వచ్చినదని కాలునొప్పి వచ్చినదని లేనిపోని వంకలు బెట్టి తలుపు దీయుమని పెద్దపెద్ద కేకలు వేయును. పరిచారకులా యరపుల సరకుసేయక పోయిరేని గదిలో దనతల గోడకుబెట్టి గట్టిగ గొట్టుకొనును. తలుపు దీసినపక్షమున నేదో చెరుపు జేయుచుండును. రెండుమూడు పిల్లికూనలను సేవకులు చూడకుండ నూతిలో బడవైచి చంపెను. ఆమె యవస్థజూచి వజ్రపాణి మిక్కిలి ఖేదము నొందుచుండెను. ఎట్టి గట్టివైద్యులచేత జికిత్స చేయించినను నామె యున్మాదము హెచ్చెనేగాని తగ్గలేదు. మనోవ్యాధికి మందు లేదుగదా! రాత్రులు సునంద తాను నిద్రపోవుట లేదు సరేకదా భర్తకుం జుట్టుపక్కలవారికి గంటిమీద గునుకు లేకుండ నరచుచుండును, ఎవరో యెదుట నున్నట్లు భావించి వారితో వాదము సేయుచుండును.

కర్పూరమంజరిని వజ్రపాణికిచ్చి వివాహము చేయుట నిశ్చయమయినదని ఈమె యున్మాదమువల్లనో ప్రధానమయిననాఁడు వచ్చిన బ్రాహ్మణుల వెంగలితనముననో యెట్లో పట్టణమునం బొక్కెను. "పెండ్లి లేదు పేరంటము లేదు. ముందు మునుపటిభార్యకు మాత్రము వజ్రపాణి పిచ్చియెత్తించినాఁడుగదా!" యని లోకులు చెప్పుకొని చాటుచాటున వాని నెగతాళి సేయఁజొచ్చిరి. ఎందరు హాసించినను నెందరధిక్షేపించినను మరెందరు నిందించినను భార్య యున్మాదినియైనను కర్పూరమంజరి ముఖము దన మనోనేత్రముతో జూచుచు సకలసంతాపహారకమయిన యామె దృఢాలింగము దనకు జేకూరినట్లు భావించుచు నప్పుడప్పుడు స్వప్నములలో నామె సమాగమ సుఖము క్షణకాల మనుభవించుచు వజ్రపాణి యిల్లాలి దురవస్థ కెడనెడ వగచుచున్నను మొత్తముమీఁద సంతోషముతోడనే దినములు పుచ్చుచుండెను. విశేషించి రాజ్యము చిత్రభానుని వశమగుటచే దన కింకను గొప్ప పదవులు చేకూరునని యాసపడి యుండెను. కర్పూరమంజరి యురిపెట్టుకొన్ననాఁడు చిత్రభానుని వెంట నరిగి యామె బ్రతికి యున్నదో లేదో తెలిసికొనుటకును రతీదేవికి బ్రతిరూపకమని పేరు వడసిన యా కన్నియ మేనివన్నియయు ముఖవిలాసమును నొకసారి జూడవలయుననియు నాతఁడు భయసంభ్రమములతో బోవుచుండ నంతలో నతని సేవకుఁడు పరుగుపరుగునవచ్చి వగర్చుచు—"మహాప్రభూ! మహాప్రభూ! ఇల్లు—ఇల్లు—" అని యరచెను. "ఏమియిల్లు? ఏమియిల్లు? వేగము చెప్పగదరా" యని యతఁ డచ్చట నాగి యడుగ—"మనయిల్లు కాలిపోవుచున్నది స్వామీ! రండి రండి" యని యేడ్చుచు బలికెను. "అయ్యో! అయ్యో! ఏమిరాయిది" యని వజ్రపాణి నడచుచు వానిని బ్రశ్నింప నాసేవకుఁడు నడచుచునే వానికిట్లుత్తరము జెప్పెను,

"స్వామీ! ఏమి చెప్పుదును? సేవకుల కందరకు నిద్రపట్టినది. అమ్మగారు దీపము చేతఁబుచ్చుకొని మీఁదు పరుపులు కుట్టించుటకై

ఈనడుమ దెప్పించిన మూడిబుంగల నంటించినారు. ఇంతటిలో నాభాగమంతయు బొత్తిగా నంటుకొన్న తరువాతగాని మాకెవ్వరికి తెలియవరాలేదు. అంతలో చుట్టుప్రక్కలవారువచ్చి ఇల్లంటుకొన్నదని కేకలు వైచిరి. పొగ నలుదెసలం గ్రమ్మెను. మంట లెగసి మిన్ను ముట్టెను, మాబిడ్డల దీసికొని మేము బయటబడుటయే మిక్కిలి కష్టమయ్యెను. ఇంటిలోని సామాను దీయుటకైనా నవకాశము లేక పోయెను. దైవానుగ్రహమువలన బిడ్డలను దేవిగారిని మాత్రము బ్రతికించితిమి. ఆమె నీవలకు రమ్మన్న రాదు. చలిమంట కాగెద నిక్కడ నుండనీయుండి యని బలుక జొచ్చెను. చేతులు పట్టుకొని యామెను బలాత్కారముగా నీవలకు లాగితిమి.”

ఈ సంభాషణము జరుగుచుండగనె వారిరువురు వారి యిల్లున్న వీధికి వచ్చిరి. ఆ కోలాహల మేమని వర్ణింపవచ్చును? ఆ కలకల మెంత యని చెప్పగలము? ఆ త్తరి గాలి విసరుగా వీచుచుండుటచే వజ్రపాణి గృహమేగాక నిరుగుపొరుగుననున్న రెండిండ్లుగూడ బరశురామప్రీతి యయ్యెను. వజ్రపాణి సర్వస్వము వీతిహోత్రునకే కాహుతి యయ్యెను. నగలు నాణెములు చీని చీనాంబరములు విండ్లు నమ్ములు నమ్ములపొదులు చిత్తరువులు రొక్కము సమస్తము దగ్ధమయ్యెను. ఇదియంతయు దగ్ధమైనను నతడు విచారింపకపోవునుగాని తన మనోరథము తన పాలిటి చింతామణి తన విధి తన నిక్షేపమునైన కర్పూరమంజరియు నురిబెట్టుకొని విగతజీవి యైనదని యతని కింతింత యనరాని విషాదము గలిగెను. కర్పూరమంజరి లేకపోవుటచే దన యిల్లు గాలినలోపము భార్య యున్మత్తయయినలోపము ఘోరముగా గనబడజొచ్చెను. పాప మతనికా రాత్రి పండుకొనుటకు దావు లేదు. మరునాడు పండుకొనుటకు నెలవు లేదు. కట్టుకొనుటకు బట్టలు లేవు. ఇంటిముందర నిలువగానే పిల్లలు తండ్రిం గౌగలించుకొని యేడ్చిరి. సునంద భర్తయెదుటకు బోయినిలిచి “ఏమండీ! బాగున్నదా? మనము క్రొత్తయిల్లు కట్టుకొందము. కర్పూరమంజరి రాకుండ

జేసితిని. చూచితిరా" యని నవ్వుచు బలికెను. అతఁడేమియు ననక స్తంభమువలె నిలువబడి తన దురవస్థను దలంచుకొని తన గృహము వలెనే మండిపోవుచున్న తన మనస్సును జల్లార్చుకొనలేక తన యింటి యెదుటనున్న యొక యరుగుపై జదికిలబడెను. బిడ్డలును వానితో జని యాతని కిరుప్రక్కల గూర్చుండి కొంతసే పక్కడనే వట్టినేల బండుకొని నిదురించిరి. తనువొత్తని మెత్తనిపాన్పుల నత్తెఱిల్లు తనబిడ్డలు బెడ్డలు గుచ్చుకొనునట్లు కటికినేల బవ్వళించి యొడలెఱుంగక నిదురింపజూచి యాతఁడు కన్నుల నీరు వెట్టుకొని యిరుగు పొరుగువారి సమాశ్వాసనమువలన నూరడిల్లి పొరుగువారు పాన్పు దెచ్చి పండుకొమ్మన్నను బండుకొనక రేయియెల్ల మేల్కొని తద్గృహ మందే దృష్టినిలిపి యుండెను. కాలుచున్న యా గృహము జూచు చున్నప్పు డతఁడు తన మనోరథములెల్ల నగ్నిదగ్ధమయినదని తన యాశ లెల్ల బూడిదయైనదని, తన సౌఖ్యములెల్ల నేలపాలయినదని విచారించి తన భవిష్యదవస్థ యెట్లుండునోయని తలపోయజొచ్చెను.

అంతలో తెల్లవారెను. తొల్లి యతిరమణీయముగానున్న తన భవన మొక్కరాత్రిలో భస్మమగుట కతఁడు మిక్కిలి యాశ్చర్య మొందెను. ఆ మాడిన బోడిగోడల నాకాలుచున్న దూలముల నాప్రేలుచున్న పెంకుల నాకూలుచున్న వాసముల జూచి యాతఁడు కాలగతి మిక్కిలి చిత్రమయినదనియు దానికన్న విచిత్రమయినది మరియొకటి లేదనియు నీశ్వరేచ్ఛ యగమ్యగోచరమనియు బ్రపంచ మంతయు వినశ్వరమనియు బెద్దలు చెప్పుమాటల స్మరించుకొనెను.

## ఇరువది రెండవ ప్రకరణము

క్షిప్రానది భాగీరథి మొదలగు మహానదులవలె మహావాహిని గాకపోయినను ముక్తిప్రదములయిన నగరములలో నొకటియని

పురాణప్రసిద్ధిగాంచి మహాకాళేశ్వర స్వామికి నిలయమై వెలయు నుజ్జయినీ నగరమున బ్రవహించుటచే నదియు నొక పుణ్యనదిగా బరిగణింపబడుచుండును. అక్కాలమున బ్రతిదినము దీర్ఘవాసులు వందలకొలందివచ్చి యయ్యేట స్నానముజేసి మహాకాళేశ్వరుని దర్శించి స్థలపురాణమునువిని గతకల్మషులైనట్లు సంతసించి పోవు చుందురు. అయ్యేటియొడ్డున రమణీయకపురాశి యనందగు పూవు దోట యొకటిగలదు. అయ్యలరుదోటనడుమ గమలాకరంబగు కమలాకరం బొండు నయనోత్సవము చేయుచుండు. దానియొడ్డున జూచువారి కన్నులకు విందుసేయు సౌధమొండు నిర్మింపబడియె. సిప్రానదీతరంగముల గౌగలించుకొని యాసంపర్కమున గడుంగడు జల్లనై యటనుండి యెలదోటజొచ్చి కుసుమ పరిమళంబుల బూర గొని మెల్లమెల్లగ మలయానిలుడు కొలంకు జొచ్చి యన్నీటి తుంపురుల మేనదాల్చి గవాక్షద్వారమున సౌధంబు బొచ్చి యందున్నవారి నానందపరవశుల జేయుచుండును. మాళవ రాజ నందనుడగు మకరందుడు తరచుగా నయ్యుద్యానమున విహరించు చుండును. ప్రాయికముగా నక్కాలంబున జలకమాడుచుండును. వేమారు వేడుక చెలికాడు చంద్రచూడునిం గూడి మేడమీద గూర్చుండి మలయమారుత సుఖ మనుభవించి యుద్యానవన రామణీయకము సందర్శించి కనులం దనుపుకొనుచుండును. వసంత సమయములందును శరత్కాలములందును రాకాచంద్రమండలము నిండు వెన్నెలలు గాయునప్పుడు నమ్మేడ నంటియున్న పాలరాతి మిద్దెపై గూరుచుండి చల్లని పండువెన్నెలల సుఖ మనుభవించు చుండును.

ఒకనాడు కర్పూరమంజరీ విరహమున నతడింటికి బోవక నాయెలదోటలో నేయుండి సాయంకాలమైనపిదప జగన్మోహనంబగు ధవళప్రభతో నుదయించిన శరత్కాల సంపూర్ణ చంద్రమండలమును జూచి దానివలన దన ప్రియురాలి మొగంబును బండువెన్నెలలవలన

నామె లావణ్యమును స్మరణకు రాగ మిద్దెపై గూర్చుండి— "యోచందమామా! మేడమీదనుండువారికి గ్రిందివారు నీయు పనులెల్ల నగపడునట్లు గగనప్రాసాద మధిష్ఠించిన నీకు సకల భూత చేష్టలు కరతలామలకముగదా! నీవు చల్లనివాడవు కావున నాగ్రహము లేనివాడవు. కాబట్టి నిన్నొక ప్రశ్న యడిగెదను. దయచేసి చెప్పుము. నీవు కాశ్మీరమున కరిగితివా? శ్రీనగరముం జూచితివా? అందు నాకర్పూరమంజరి కనబడినదా? ఆమె సుఖముగా నున్నదా? ఏమి! యుత్తరము చెప్పవు? ఔను. నీవేల చెప్పెదవు? ఆమె మొగమునకు నివాళి నిచ్చుటకైనను నీనెమ్మొగము పనికిరాదుగదా! కళంకిత మైనది నీమొగము, అకళంకమైన దామెవదనము. ఎంతవారికైన నీర్ష్య యుండకపోవునా? అందుచే సిగ్గుపడి నీవామెం జూచియుండవు. నిన్నడిగిన ప్రయోజనమేమి?" అని కామార్తుడు చేతనంబులంబలె నచేతనంబులంగూడ సంబోధింతురను నార్యోక్తి నిజముగ చిత్త వికారమున జాబిల్లిం జూచి యసంబద్ధ ప్రలాపములు చేయు మిత్రుని దగ్గరి చంద్రచూడుడు మీద జేయివైచి తట్టి తన మొగము నతని మొగముకడ జేర్చి—"వయస్యా! ఇదియేమి? నీకు వెర్రియెత్తినదా? లేక నీలేదోటలో నేదయ్యమైన సోకినదా? లేక మద్యపానము జేసితివా? చందమామకు నోరున్నదా నాలుకయున్నదా నీవడిగిన ప్రశ్నల కుత్తరము జెప్పుటకు? చంద్రుడనగా మనవంటి పురుషుడను కొంటివా? నీవు జ్యోతిశ్శాస్త్రవేత్తవు. చంద్రుడనగా సూర్యానువర్తి యగు గ్రహమని నీవెరుంగవా? చాలు చాలు! నేను హిమవంతుని వంటి ధైర్యసారము గలవాడనుగనుక భయపడలేదుగాని, మరి యొకరు నీయసంబద్ధ సంభాషణములువిన్న బెదరి మేడదూకి పారి పోదురు. నీకలాపమిక గట్టిపెట్టుము" మని మందలించెను.

అప్పుడు మకరందుడు చంద్రచూడుని చేయిబట్టుకొని మెల్లగ నిట్లనియె—"మిత్రమా! నీవు నన్నెరుగనివానివలె భాషించెదవేల? స్వప్నముననైన నేను మద్యపానము సేయుదునా? భూతములు పిశాచ

ములు పిరికివాండ్రపై బడునుగాని నాపై బడవు. కర్పూరమంజరీ వియోగదుఃఖము దుస్సహమగుటచే నే నేమేమో కొన్ని యసందర్భములు పలికియుంటిని. దానంజేసి నామతిచలించినని నీవు దలంపకుము. ఎంతవారించినను నామనస్సు కర్పూరమంజరీ సమక్షమున కదుగక మానినదిగాదు. దానిమాటలలో నెమిటీపియున్నదో—దాని మొగమున నెంత యాకర్షణశక్తియున్నదో—దానిసాన్నిధ్యమం దేమివిశేషమున్నదో—దానికన్నులలో నేమి వశీకరణ ప్రభావమున్నదో నేనెరుంగనుగాని నామనస్సు వేయిసార్లు పిలిచినను గొలుసులువైచి లాగినను నాకడకు రాకున్నది. అది దానిమాయలలో బడినది. దాని చెలిమికత్తెలు పన్నిన వలలలో నది తగులుకొనియె గావలయు! మాటలాడించు శక్తి మనస్సుదిగదా! అది దగ్గరలేనప్పుడు—దగ్గర నున్నను సరిగా లేనప్పుడు నోరు తన యిచ్చవచ్చినట్లు ప్రేలును. చంద్రచూడుడా! నీవు చూచితివో లేదో, చూచినను మెచ్చితివో లేదో. కాని కర్పూరమంజరి సౌందర్యము వర్ణనాతీతమని చెప్పుట వర్ణనముగాదు. దాని సోయగంబు గనువిచ్చి యొకసారి జూచునేని గాలకంఠుని కఠోర హుంకారంబున మూర్ఛిల్లి యాతని కంటిమంటల మ్రగ్గిన మదనుడు తన నియతిని రతినివిడిచి మరల దానికొరకై భూమండలంబున నవతరించి సాంగుడై యనంగశబ్దము బోగొట్టుకొనడె? వసంతుడు తాను జూచుభాగ్యము గలవాడగునేని చివురుటాకులు మేనుగా జేసికొని మాధవీలతాదులు కరచరణంబులుగా నిర్మించుకొని ఫలరసంబులు రక్తంబుగా నమర్చుకొని కలువరేకులు కన్నులుగా గావించుకొని దొండపండులు మోవిగా బెట్టుకొని శుకపికంబులనుండి పలుకులు పుడికిపుచ్చుకొని మాటలుగా జేసికొని మూర్తిమంతుడై దన్ను వరింపుమని దాని యడుగుదోయిపడి వేడుకొనడె? అది నలకూబరుని కంటబడిన గడు ముసలిదై శృంగారరసమెల్ల గోల్పోయిన రంభను నవ్వులకుం ద్రోసివైచి జవ్వనియగు నివ్వనజాక్షికై తహతహంబడడె? వారిమాటయేల! సంసారములరోసి

సౌఖ్యములఁబాసి కాంతారాంతరవాసులై గాలియు దుంపలు నాకులు నలములుదిని చెట్లనీడల వసియించుచు చర్మంబులందాల్చు బ్రహ్మజ్ఞాన సంపన్నులైన మౌనులున్నైతము పల్లమునకుంబోవు నీరుపగిది జపములు తపములు చాలించి నిష్ఠలు నీటఁగలిపి దాని వెంటంబడరే? ఆ చక్కదనము కవులు వర్ణింపజాలరు. చిత్రకారులు చిత్రింపజాలరు."

అనుచుండ జంద్రమాడుడు—"మిత్రమా! ఆమెకై నీవింత తహతహ పడుచుంటివి. నిన్నామె వలచునా? లేక యిది చముదు దండుగ భాగవతమా?" యని యడిగెను. "మిత్రుడా! ఆ ప్రశ్నకు నేను త్తరము జెప్పగలనా? నాచక్కదనము, నా తెలివితేటలు, నాజవ్వని యడుగు దామరలకు దాస్యము చేయుటకైన దగవని నేదలంచెద. యెందరు రాజకుమారు లామె కేలుపట్ట యత్నించుచున్నారో—యెందరు నృపకుమారుల దూతలామెకడ దర్శనముగాక వేచియున్నారో—యెందరు లేఖలువ్రాసి విజ్ఞాపనము లంపుకొనుచున్నారో—యెందరు దానితండ్రిం బ్రతిమాలుచున్నారో—యెందరు దాని పొందుగూర్చుమని దాని చెలిమికత్తెలకు లంచము లిచ్చుచున్నారో—యెందరామె మనఃప్రీతికై కట్నములు కానుకలు నంపుచున్నారో—యెందరామెచే దిరస్కృతులై లజ్జావశంబున దలయెత్తుకొనలేక యున్నారో—యెందరామె సమాగమము దమకు లభించునని యువ్విళ్ళూరుచున్నారో—నన్నా యామె వలచుట? నాకా యా సమాగమ సౌఖ్యము గలుగుట? నేనా యంత పుణ్యము చేసినవాడను! మిత్రుడా! మనస్సునకున్న వేగము మనుష్యుని కేల యుండగూడదు? తిరస్కరిణీ విద్యాప్రభావము నేడు కలియుగమందున్న పక్షమున దేవదూతయై నలుడు పరులకంట బడకుండా విదర్భాపురము జొచ్చి దమయంతీ సమాగమము బడసి యామె దర్శనంబున నేత్రంబులను సంభాషణంబున శ్రవణంబులను ధన్యంబుల జేసికొనినట్లు నేనును బ్రియురాలి దర్శించి నానయన శ్రవణంబుల జరితార్థముల జేసికొనన? చిలుక వారువము నెక్కి చిగురు విలుతుడును

గరుడగమనుడగు కమలలోచనుడును నెంత ధన్యులోగదా ! క్షణములో గామితప్రదేశంబుల కరిగి కృతార్థు లవుచుందురుగదా ! మానవుని కట్టి శక్తియు లేదుగదా ! మనుష్యుని దౌర్బల్య మిట్టి విషయములు స్పష్టముగ గనబడుచుండును. ఆమె చిత్తవృత్తి యెట్లున్నదో తెలియదు. మిత్రుడా ! నీవు మారువేసమున శ్రీనగరమునకు బోయి తెలిసికొనలేవుగదా !" అని మకరందుడు పరిపరివిధముల ప్రియురాలి చక్కదనము దలంచి గుణముల దలంచి తన కామె సంప్రాప్తించు విధ మెరుగక వ్యథలు పడుచుండ మిత్రుడగు చంద్రచూడుడు వాని విరహ సంతాపముం జూచి పరిహసించుచు నిట్లనియె—

"వయస్యా ! నీవు లేదన్నను నేను నమ్మజాల. నీతల చెడిపోయినది. ఏదో పిశాచము నిన్నావహించినది. తోటలలో దొడ్లలో నపరాహ్ణ మనక యర్ధరాత్ర మనక తిరుగగూడదు. నీకు భూతవైద్యము చేయింపవలెను. లేనిచో నిటువంటి పిచ్చియేమిటి ? ప్రపంచములో నామెకన్న సందగత్తియ లేదందువు. ఆమె తల దన్నినవా రెందరో యుండవచ్చును. కాదా యెనంటె కొంచెమెత్తర తోలు, అలుచిప్పలవంటి కన్నులు, ఈమాత్రపువారు లోకమున నుండకపోరు. తావలచినది రంభ తామునిగినది గంగ యున్నట్లు నీకంటికామె రంభలాగు మేనకలాగు కనబడుచున్నది. ఆమె నిన్ను మెచ్చకపోయినయెడల మరియొక దానిని పెండ్లిచేసికొనవచ్చునులే. పెండ్లాలు దొరకకపోరు. నావంటి దరిద్రునకు వివాహముగాదుకాని నీకేమితక్కువయ్యా ! ఈమె దాటిపోయినయెడల నేనేవెళ్ళి మరొక దానిని కుదిర్చెదనులే." అనవుడు మకరందుడు—"మిత్రుడా ! వలపెట్టిదో యెరుగని ఘోటక బ్రహ్మచారికి నీకు సుందరాంగులను మెచ్చుకొనుటగూడ దెలియునా ? వలపులోని తీపి నీకపరిచితంబు. గొడ్రాలు ప్రసవవేదన నెరుగనట్లు బ్రహ్మచారి విరహతాపము నెరుగజాలడు. ఆ యెలనాగ నాకు జేకూరదేని నేను జన్మాంతముదాక బ్రహ్మచారినై యుండెద. కాని మరియొకదాని జేలుపట్టను" అని

మరియేమో చెప్పబోవుచుండ నంతలో సేవకు డరుదెంచి—" మహా ప్రభో! ఎవ్వడో నూతన పురుషుడు మీకొర్కై వచ్చియున్నాడు. మీదర్శనము గోరుచున్నాడు " అని విన్నవించెను.

" పూవుదోటలోనున్న నన్ను నడిరేయి వెదకికొనుచు వచ్చిన వారెవ్వరు చెపుమా? సరే! తోడ్కొనిరమ్ము " అని మకరందు డానతిచ్చెను సేవకుడా పురుషుని వెంటబెట్టుకొని మకరందుని జూచి క్రిందికి దిగిపోయెను నూతన పురుషుడు మకరందునకు వంగి జోహారు చేసి నిలువంబడియెను.

తెల్లని మొగము, తలమీద తెల్లనిపాగా, మోకాళ్ళనుదాకు తెల్లని నిలువుటంగి, పాదములను స్పృశించు తెల్లనిలాగుగల యప్పురుషుని జూచి మకరందుడు—" మీదేయూరు? మీరేమి పనిమీద వచ్చిరి?" అని యడిగెను. " అయ్యా! నాది కాశ్మీర దేశము శ్రీనగరము కాపురము. నేను చిత్రభానుని సేవకుడను. నన్ను జయంధరుడందురు. ఆయన సందేశము మీకు దెచ్చితిని " అని యప్పురుషు డుత్తరము జెప్పెను.

" సందేశము నాకా? మా తండ్రిగారికా?" యని యతడు మరల నడిగెను, " స్వామీ! మీకే " యని యతడు బదులుచెప్ప– " సరే! కూర్చుండి వినిపింపుము " ని మకరందుడు పలికెను. అనవుడు జయంధరుడిట్లు విన్నవించెను–" దేవా! చిత్రభానుడు కాశ్మీరరాజ్య మును స్వాధీనము జేసికొని పాలింప ప్రయత్నించుచున్నాడు. అందు మీసాహాయ్యమును గోరుచున్నాడు. అట్లు తోడుపడుదురేని తన కూతురు కర్పూరమంజరిని మీకిచ్చి వివాహము సేయదలచు చున్నాడు " అనుచుండ జంద్రచోడు డడ్డమువచ్చి–" ఆమె కితనిపై వలపున్నదా? బలవంత వివాహమా?" యని యడిగెను, నావుడు జయంధరుడు వెండియు నిట్లనియె–" స్వామీ! చిత్తగింపుడు. ఆ మోహనాంగి మిమ్మొగాని మరెవ్వరిని వివాహమాడదట. మకరందుడే నాబహిఃప్రాణము. ఆయన నన్ను వివాహమాడడేని

నేను బ్రహ్మచారిణినై జీవితము గడపెదను గాని మరియొక రాజకుమారుని కేలుపట్టనని శపథంబు జేసెను. మీనిమిత్తమే తపము చేయుచున్నది. ఆమె శ్రీనగరముననున్నను మనస్సు నిరంతరముజ్జయినిలో నుండును. విరహతాపమున నామె చిక్కి సగమైనది. రాజకుమారా! మీరు చేపట్టలేని యామె జీవింపదు. ఆశాబంధమే యామె నింతవరకు నిలిపినది. ఆమె యవస్థజూచి తండ్రి మీకడకు నన్నుం బంపెను. మీరామెను రెండుసారులు చూచియుండిరట. వెనుక నొకసారి విదర్భలో జ్వరపీడితయైనప్పుడు మంచిమందులిచ్చి బ్రతికించిరట. రెండవసారి భిల్లుల బారినుండి తప్పించి కాపాడిరట. ఆ రక్షణము రక్షణముగాదు, నేడు గాపాడుటయే కాచుట. మీహస్తస్పర్శన మామె తాపము జల్లార్చెను. మీముఖదర్శన మామె యలమట దీర్చెను. ప్రస్తుత మామె స్వప్నములో మిమ్ము దరచుగా జూచుటం జేసియు, మీనామస్మరణంబు గావించుట జేసియు నామె జీవించుచున్నది గాని లేనిచో నీపాటి కామె మరియొకలాగైన యుండును. మరియు చెప్పవలసిన విషయము లున్నవిగాని మగవాడనగు నేను శుద్ధాంతవాసినియైన యామెదాని గుట్టు నంతకన్న విప్పి చెప్పనొప్పదు. అంతియు నీవే భావించుకొనుము" అని యూరకుండుటయు జంద్రచూడుడు—"సాహాయ్యము జేయనిపక్షమున మీరాజపుత్రుని మకరందున కీయుడా యేమి?" యని యడుగ జయంధరుడు—"స్వామీ! అట్టి పరిస్థితి తటస్థించునేని గర్పూరమంజరి చిత్తమెట్టులుండునో చెప్పజాలను. ఐన నింత వలవంతిగల కాంత కిష్టము లేకున్నను దా నెవ్వరిగూర్చి మేలుపడునో యాతనినే వరించును గాని వేరు తెరంగున జేయునా!" యని బదులు చెప్పెను.

అది విని మకరందుడు తనలో—"హృదయమా! నీకింకను శాంతిగలుగదు. ఆ యిందువదన హృదయము నిన్ను గలియగోరుచున్నదిగాని దానిలో నింకను మిషగలదు. తండ్రికి నేను సాయపడిన గాని యది చేరదు. నేనన్యథా వర్తించితినేని గర్పూరమంజరి చిత్త

వృత్తి యెట్లుండునోగదా! దేవుడు వరమిచ్చినను నర్చకుడు వరమీయడన్నట్లు కూతు మేలుపడుచున్నను దండ్రి యంతరాయము గలిగింపవచ్చునుగదా! అయినను నామీఁద నామె వలపు నిలిపినదను చల్లనివార్త శ్రవణానందకరముగా వింటిని. ఇదియేచాలు. ఈపునాదిపై నా యాశాసౌధముం గట్టవచ్చును" అని తలంచి బహిరంగముగా నిట్లనియె—"జయంధరా! సాయము చేయుటకుగాని చేయకపోవుటకు గాని నేస్వతంత్రుడను గానుగదా! ఇందుకు నాతండ్రిగారు సుదర్శన మహారాజుగారే ప్రమాణము. ఈ విషయమై వారితో నే బ్రసంగించి కర్తవ్యము గావించెద. నీవు మాయతిథివై యుండుము. మాపట్టణమున జూడవలసిన విశేషముల జూడుము. కర్పూరమంజరి నన్ను వలచి యనుగ్రహించినదని శుభవర్తమానము చెప్పుటచే నిదిగో నీహారము నీకు బారితోషికముగా నిచ్చుచున్నాను. గ్రహింపుము."

అనవుడు—"మహాప్రసాదము" ని జయంధరుడు దానిం గ్రహించి—"దేవా! మీకు నాపైగల దయకు సంతసించితిని. నేను మీయతిథినై యుండజాల. నాకీనగరమున జుట్టములు గలరు. వారికడ నుండెద. సెలవొసంగుడు" అని వంగి నమస్కరించి వాని యనుజ్ఞ వడసి యచ్చోటు బాసిపోయెను.

అవ్వెనుక మకరందుడు చంద్రచూడుం జూచి—"మిత్రమా! ఈతని వాలకము చిత్రముగా నున్నది. నడక యాఁడుదాని నడక. మాట లాఁడుదాని మాటలు. పలుకునప్పు డచ్చముగా నాఁడుదివలె గన్నులు త్రిప్పును. చేతులతో నభినయించును. ముదుకడగు బ్రహ్మదేవుడు మతిలేక యాఁడుదానిం జేయబోయి పొరపాటున మగవానిం జేసెగాబోలు!" నని యామె మాటల చమత్కృతిని సందేశార్థములను దలంచుకొనుచు నారేయి గడపెను.

తెల్లవారెను. మకరందుడు రేయి యంతయు జాగరము సేయుటచే మిక్కిలి బడలి జాగరణ భారము సడలుటకై వనలక్ష్మి మించుటద్దమువలెనున్న యక్కొలంకునీట స్నానమాడెను. చంద్ర

చూచుచు మిద్దెమీఁద గొడ్డువలె పండుకొని గాఢముగ గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండెను. ప్రభాకరుని శీతకిరణములుసయితము నాతని మేలు కొలుపలేకపోయెను. మకరందుఁడు కూర్చుండినను నిలిచియుండినను స్నానమాడుచుండినను, ఇటునటు తిరుగుచుండినను నతని మనస్సు సర్వావస్థలయందు కర్పూరమంజరి మీఁదనే యుండెను. ఆమె తన్ను ప్రేమించునో లేదో యని మనస్సు సంశయించుచుండెను. ఆమె తన్ను గాఢముగా వలచియున్నదని యిప్పుడు తెలిసినను జనకుని నియమమునుబట్టి యామె తనకు దుర్లభురాలని బెంగపెట్టుకొనెను. "ఏమిచేయుదు ఇంకెవరు నాకు తోడ్పడుదురు" రని పూఁదోటలో నడయాడుచుండ సేవకుఁ డొక్కఁడు వచ్చి "మహాప్రభూ! నాయన గారి సెలవైనది. దయచేయుఁడు" అని మనవిచేసెను. "ఇదే వచ్చుచున్నా" నని యాతఁడు వాని వెంటం జనియె.

సుదర్శనమహారాజు స్నానము చేసి శాస్త్రముల ప్రకారము నిర్వర్తింపవలసిన ప్రాతఃకాలకృత్యముల నిష్ఠాపరతంత్రుఁడై నెరపి పరిశుద్ధవస్త్రముల ధరియించి యంతఃపురమున రాయబారులకు దర్శనం బిచ్చుగదిలో నున్న యాసనంబునం గూర్చుండెను. ఆతని యెదుట వృద్ధుఁడైన యొక బ్రాహ్మణుఁడు సముచితంబగు పీఠమున కూర్చుండి సుదర్శను డడుగు ప్రశ్నల కుత్తరము చెప్పుచుండెను. అంతలో మకరందుఁ డచ్చటికిఁ బోయి తండ్రికి నమస్కరించి వాని యనుమతిని ప్రక్కం గూర్చుండెను. సుదర్శనుఁడు—"కుమారా! మన యెదుట నున్న యీ బ్రాహ్మణుఁడు కాశ్మీర రాజమంత్రులలో నొకరగు మాధవ సేనుఁడు. హేమచంద్రుని జ్యేష్ఠకుమారుఁడగు విక్రమసేనుని పంపున నన్నుం జూడవచ్చె. సందేశార్థము లన్నియు విక్రమసేనుఁడు వ్రాసి యిచ్చిన లేఖలోఁ గలవు. అది నీవొకసారి చూడు" మని యా జాబతని కిచ్చెను. మకరందుఁడు లేఖ నామూలాగ్రముగా జదువుకొని విషయములన్నియు గ్రహించి మరల దానిని దండ్రిచేతి కిచ్చెను. అంతట సుదర్శనుఁడు కుమారు నుద్దేశించి యిట్లనియె—"వత్సా! బాలుఁడైన

విక్రమసేనుని జాబు జూచినది మొదలుకొని నా కడుపు జాలిపెంపున జుమ్మలు చుట్టుచున్నది హేమచంద్రునిం దలచిన నాకిపుడు సైతము గంట నీరుగవచ్చును. అతడు నేను సహాధ్యాయులము. అతనివంటి పరిశుద్ధుడు లోకమున లేడు. మంచితనము మూర్తీభవించినదని చెప్పవచ్చును. అట్టి మహారాజ దుర్మార్గణము పాలగుటయు, మాయలమారియగు చిత్రభానుడు రాజ్యమాక్రమింప దలచుటయు, విక్రమసేనుడు బాలుడగుటయు, దండనాథాది నియోగులు స్వామిద్రోహు లగుటయు దలంచిచూడ మన మువర్ణ మూర్తికి ద్రోహపడవలయునని దోచుచున్నది. ఇంతకన్న హేమచంద్రునకు నేనేమి సాయము చేయగలను! అతడు సంతసింపకపోయినను వాని యాత్మమైన నా యభిమానమునకు సంతసించును. నీ విందు కేమందువు! ఇది నీకు సమ్మతమగునేని నేను మొదలు సమరసన్నాహంబు గావించి కతిపయదివసములలో జతురంగ బలంబులం దోడ్కొని మన దండనాథుడైన కంఠీరవ దేవుడును, నీవును శ్రీనగరమునకుం బోవలయును. నేనిచ్చట నుండి రాజకార్యముల నడిపెద. అట్లు పోవుటకు నీ కిష్టము లేదేని సేనాసమేతుడనై నేను కాశ్మీరమునకుం బోవుదు. నీవు నగరమున నుండి నా స్థానమున రాజ్యపాలనము నెరపుచుండుము."

అనవుడు తన ప్రయత్న మక్కరలేకయే పితృప్రేరణంబున దాను గాశ్మీరమునకు బోవుట కవకాశము గలిగినదని కర్పూరమంజరీ దర్శనాభిలాష ముందరికి ద్రోయ నతడు "దేవా! మీ చిత్తమెట్లో యట్లే చేసెద. నన్ను బొమ్మన్న నేనపోదు. ఇచట నుండుమన్న నుందు. దేవర వారే ప్రమాణము. కాని పెద్దలగుటచే మీరు కదలుటకు వీలు లేదు. కంఠీరవదేవుని సాయమున నేనపోయి కార్యంబు నిర్వర్తించెద" నని విన్నవించెను. "వత్సా! నాకదియే పరమసంతోషము. నీ వెంట రత్నసేనుని వాని కుమారుడగు భద్రసేనుని తీసికొనిపొమ్ము. చంద్రచూడుడు పిరికివాడు, యుద్ధమన్న వెరచును. అతడు నీతో రాడు. కావున భద్రసేనుడే నీకు చెలికాడై హితోపదేష్టయై చేదోడు వాదోడై మెలంగును" అని సుదర్శను డానతిచ్చెను.

అప్పుడు మాధవసేనుడు లేచి చేతులు జోడించి వారు గావించిన యుపకారమునకు దన కృతజ్ఞతం దెల్పుచు నిట్లనియె—"మహాప్రభూ! నేను వచ్చునప్పుడు మీరేమందురోయని మిక్కిలి సంశయించుచు వచ్చితిని. మీరు బాలుడగు విక్రమసేనునియెడ జూపిన దయ నిరుపమానము. మిత్రులన్న నాపద్బాంధవులన్న మీరె. చనిపోయిన మిత్రుని దలంచి చిన్నవాడగు వాని కుమారున కెవ్వరుపకారము సేయుదురు! 'పరోపకారార్థ మిదంశరీరము' ను వాక్యము మీయందు యథార్థమైనది! మీ రాజభక్తిమున—మీ రాజనీతిపక్షమున—నమాత్యుల పక్షమున మీకు నేననేక కృతజ్ఞతాసూచకవందనము లాచరించు చున్నవాడ. పాంచాల నరపాలుడగు మహేంద్రదేవుని దర్శనము చేసి వచ్చితిని. అతడు గూడ దన దౌహిత్రునకు సాయము చేయదలచి నాడు. మీరుభయులు గూడిరేని చిత్రభానుని బరాజితునిచేయుట మిక్కిలి సులభము. నాకనుజ్ఞనొసంగుదురేని మరల పాంచాలమున కరిగి పాంచాల సైన్యముల దోడుకొని నేను కాశ్మీరమునకుబోయి మీరాక కెదురు చూచుచుందును" ని వారిముదలగైకొని మాధవ సేనుడు వెడలిపోయెను.

అతడు నిర్గమించుటయు నకరందుడు పరిస్థితు లట్లు మారి నందుకు దనలో నిట్లు విచారించెను—"ఇప్పుడు నేనేమి చేయుదును? విక్రమసేనునకే సాయము సేయుమని మాధవసేనుడు వచ్చె. తనకు దోడుపడుమని చిత్రభానుడు దూతనంపె. చిత్రభాను పుత్రికయందు నామనసు లగ్నమైయున్నది. ఆమెకై నేనాతని జేరుట యుక్తము గాదా! కాని ధర్మమాలోచించిన పక్షమున బినతండ్రిచే వంచితుడైన విక్రమసేనునికే నేను దోడుపడవలయు. నామన స్సుయ్యెల లూగు చున్నది. ప్రాణసఖి సమాగమము గోలుపోవుదునా! ధర్మపరి త్యాగము చేయుదునా! వివాహము లేకపోయిననుసరే ధర్మము నేననుసరించెద. 'యతో ధర్మస్తతో జయః' యను నార్యోక్తి సార్థకము గాకపోవునా!

# ఇరువది మూడవ ప్రకరణము

ధర్మదేవత మూర్తిభవించినట్లు చిత్రభానుడు కాశ్మీరమున ప్రజాపాలనము సేయుచుండెను. రుద్రభట్టు ప్రజలకు బహిరంగముగ దర్శనమీయక చిత్రభానునకు సన్నివిషయముల దనుజనాయకునకు శుక్రాచార్యులట్లు హితోపదేశము జేయుచుండెను. విక్రమసేన పార్శ్వవర్తనులకు దనమీద నెంతమాత్రము ననుమానము లేకుండునట్లు చిత్రభానుడు ప్రవర్తించుచుండెను. రాజకుమారులచేత బగలు విద్యాభ్యాసము చేయించుచుండును, తగిన శిక్షకుల నేర్పరచి సాయంకాలమున వారికి విలువిద్దియ నేర్పించుచుండెను ప్రతికార్యమునందును విక్రమసేనుని యాలోచన మడుగుచుండును. సింధు గాంధార వసుంధరాధిపుల దండయాత్ర లెందుచేతనో యాగిపోయెను. రాజ్యనౌకయొక్క చుక్కాని దాను ద్రిప్పుచుండుటచే బరరాజులు భయపడిరి. దండయాత్రలు మానిరని యతడు సైనికులతోడను, దండనాథులతోడను, నృపకుమారులతోడను, నగరవాసులతోడను బలుమారు జెప్పుచు వచ్చెను. మణివర్మను మొదట దలచుకొన్నట్లు చిత్రభానుడు ధనము నిమిత్తమై హింసింపలేదుగాని కారాగృహమందు బంధించియుంచెను. అతని కెట్టిసౌకర్యములు నొనగూర్పబడలేదు. స్నానమునకు జలమైన నతనికి దుర్లభమయ్యెను, దినమున కొక్కసారి జొన్నరొట్టె లభింపజొచ్చెను. కటిక నేలబండుకొనుచుండెను. మాసిన గుడ్డలైన నుదికించుకొనుటకు నుత్తరువు లేదు. త్రాగుట మొదలయిన యెల్లపనులకు నొక్క మంటిముంత మాత్రము వానికీయబడెను. జీవముతో నయిన నుండనిచ్చుటకు దండపాణి మాటసాయమె ముఖ్యకారణమై యుండవచ్చును. పునరాలోచనమీద దండపాణి కిష్టములేనిపని గావించుట తనకు శ్రేయస్కరము గాదని తలంచి చిత్రభానుడు హింసాప్రకరణము నుండి మరలియుండ వచ్చును.

చిత్రభానుడు వేటయందు మిక్కిలి తమకము గలవాడు. మృగయాక్రీడయందు దన కుమారుడైన విజయసేనునకును విక్రమసేన హర్షవర్ధనులకును నభిరుచి గలిగించెను. వేటపేరు చెప్పిన వారు మిక్కిలి యుత్సాహముతో వెడలుచుండెడివారు. విక్రమసేనుడు చిన్ననాటనుండియు మృగయాక్రీడ కలవడినవాడగుటంజేసి వేట కతడు ముందడుగు వేయుచుండెను. రెండుమూడుసారులు పినతండ్రి వెంట వారిరువురు మృగయాక్రీడల కరిగి సాయంకాలమున కింటికి వచ్చిరి. ఎన్నడో యేదో యపకారము చేయునని మహాభయము బిడ్డలకు దల్లికి నుండినను జిత్రభానుని వర్తనము కొంతవరకు వారికి నమ్మిక గలిగించుచుండెను. అయినను వారు జాగరూకులై యుండిరి.

అట్లుండ నొకనాడు చిత్రభానుడు విక్రమసేన హర్షవర్ధనులు విజయసేనుడు దండపాణి వజ్రపాణులు మరికొందరాప్తులు బరివేష్టింప గొలువుండి నగరవాసుల వ్యవహారముల దీర్పులు చెప్పుచుండ మూర్త్యాస్తమయ సమయమున జిరుచీకటులు పడుచుండ నొక యాటవికుడు గోచిపెట్టుకొని కంబళిమీద గప్పుకొని చేత నొక దుడ్డుకర్ర బట్టుకొని పరుగుపరుగున గొలువుకూటము సొచ్చి—“దండాలు సామీ! దండాల” ని నేల సాగిలంబడి మ్రొక్కినిలిచెను. “ఎవడవురా నీవు? ఏమిపనిమీద వచ్చితివ” ని చిత్రభాను డడిగెను. అందుకు వాడు ప్రభువుతో నిట్లు మనవి చేసెను—

“నేను గొల్లల చిన్నవాడను దేవరా! మంచుకొండదగ్గర చారల మెకములు, చిరుతపులులు, సివంగులు పెచ్చుపెరిగి మాపసరములను గసగస నమలివేయుచున్నవిదొరా! పసువులమందలు తగ్గిపోయినవి, ఏలినవారు వేటలాడి యా మెకాలను చంపి మాకింత కూడు పెట్టవలె దేవరా! లేకున్న మేము బ్రతుకజాలము. పసరాలే మాసొమ్ములు. పసరాలే మా బ్రతుకులు, రక్షించు దేవరా రక్షించు!” అని మొరపెట్టెను.

వాని కుయ్యాలించి చిత్రభానుడు కన్నకొడుకును నన్నకొడుకులను జూచి—“వేటకై యరుగుదమా? గోరక్షణముకన్న బుణ్య

కార్యము లేదు. అది యుభయతారకమైన సత్కర్మ. పాపమీ పేద గొల్లలు మన కవశ్యము రక్షణీయులు" అని యనుచు వారు ముగ్గురు వల్లెయని యుత్సాహముతో బలికిరి. మరునాఁడుదయమున మృగయా క్రీడకు గావలసిన సన్నాహమంతయు జేయబడెను. ఉరులు, నుచ్చులు, వేటకుక్కలు, జిగురుగండెలు, దీపములు, బోనులు, విండ్లు, పమ్మెలు, బల్లెములు పట్టుకొని వాటి నుపయోగించుటయందు నేర్పరులగు వేటకాండ్రు మహోత్సాహముతో కొలువ జిత్రభానుడు వేటకై వెలువడెను.

" మంచుకొండ చాలదూరము. కొన్నిదినములకుగాని వచ్చుటకు వీలులేదు. ఎప్పటివార్తలప్పటికి దెలియవు. మనస్థితి బాగులేదు. ఏదిన మెట్టిదో తెలియదు. కావున మీరు పోవలదు నాయనలారా!" యని యరవిందాదేవి బిడ్డలం బ్రతిమాలెనుగాని వేట తమకము వారిని ముందుకు గెంటెను. మహోత్సాహముతో ముగ్గురు కుమారులొక రథమెక్కిరి, చిత్రభాను డొక రథమెక్కెను. పరివారము ముందునడచెను. దండపాణియు స్వల్పసైన్యముతో వారి వెను వెంట జనెను. ఆ బలగమెల్ల హిమవత్పర్వత ప్రాంతమున కరిగి గుడారములలో బసచేసి యైదుదినములు వేటాడి ముక్కడి మెకముల నెక్కంటి నుక్కడించి గొల్లపల్లియుల యిక్కట్టుల దొలగించిరి.

విక్రమసేనుడు మూడు పులులం గొట్టెను. హర్షవర్ధను డొక్క చిరుతం జంపెను. విజయసేనుడు రెండు భల్లూకముల గడతేర్చెను. చిత్రభానుడు రెండు సింగంబులం గూల్చెను. దండపాణి రాత్రివేళ మంచెమీద బొంచుండి చెరువులో నీరుద్రావుచుండ గొప్ప పులి యనుకొని యొక గాడిదను జంపెను. అయిదు దినములు వేటాడి విశ్రాంతి నిమిత్తమై వారు గుడారములు విడిచి సమీపమున నొక కొండమీదనున్న చిన్న కోటలో విడిసిరి. అక్కడ రెండు దినములు గడిపిరి. అక్కడి ప్రకృతి సౌందర్య మతిమనోహరముగా నుండెను. ఆ యున్నత ప్రదేశమునుండి చూడ ప్రథమచరమ సంధ్యారాగముల

విశేష శోభాసౌభాగ్యము పద్మరాగరమణీయ కాంతులను మించి వారి కన్నదోయి కమితానందము గూర్చెను. ఆకాశము నంటుకొనుచు హిమవంతుడు చాచిన దీర్ఘబాహువులో యున్నట్లు వెలయు సమోన్నత శృంగములతోడను, కొండరాజు తొడిగిన తెల్లని సిలువుటంగీయో యనునట్లు విలసిల్లు మంచుతోడను చేవయు నున్నతియు గట్టిమయిన యాకుల గలిమియు గలిగి సూర్యరశ్మి నడ్డగించు మహావృక్షములతోడను నింద్రధనస్సువలె నానావర్ణములు గలిగి నలుగెలకుల బరుగులెత్తు విహంగములతోడను ప్రాయములు నైశ్వర్యములు నిట్లే యతివేగంబున గడచిపోవునని లోకంబునకుం దెలుపుటకో యన నతివేగంబున మీదినుండి క్రిందికి బ్రవహించు సెలయేళ్ళతోడను, కొండగుహాలు ప్రతిధ్వనులిచ్చునట్లు బొబ్బలిడు గొప్ప మృకంబులు బెబ్బులులు మొదలగు ఘాతుక మృగంబులతోడను విండ్ల చేబూని మృగంబుల వేటాడుటకయి విసవిస నడచిపోవు వేటకాండ్రతోడను, వేటకాండ్ర వెనువెంట వారి కమ్మల నందించుచు నుత్సాహము గలిగించుచు నడచు కిరాతాంగనలతోడను విరాజిల్లు నమ్మంచుకొండ జూచి విక్రమసేనుడు పట్టణంబుల జూచినప్పుడు పొందని మహానందము నొంది తమ్మునకు విజయసేనునకు వనంబులకు నుపవనంబులకు గల భేదంబు దెలుపుచు దొల్లి యిందే మహేశ్వరుం గూర్చి గౌరి యఖండ తపంబు గావించె. ఇందే జగంబునకు మాతాపితలు పురాణదంపతులు నైన పార్వతీ పరమేశ్వరులకు గల్యాణ మహోత్సవము జరిగె, ఇందే సప్తమహర్షులు ననేక యాగములు జేసి హవిర్భాగములచే వేల్పులం దనిపిరి, ఇందే నరనారాయణ నివాసమైన బదరికాశ్రమ మున్నది, ఇందే గంగానది మొట్టమొదట నెలవు జేసికొన్నది" యని తత్సంబంధాలయిన పురాణగాథల వర్ణించుచు నా రెండుదినములు గడపెను.

రెండవనాటిరేయి వారందరు సుఖముగా భుజియించి ప్రియభాషణంబులు సలిపి పండుకొనిరి, విక్రమసేనుడు హర్షవర్ధనుడు నొక గదిలో శయనించిరి. చిత్రభానుడు విజయసేనుడు మరియొకగదిలో

బవళించిరి. కొలది పరివారము వచ్చుటనుంచి కార్యాంతరములమీద దండపాణి యా సాయంకాలమే పట్టణాభిముఖుడై పోయెను.

విక్రమసేన హర్షవర్ధనులు గాఢనిద్రవశవర్తులై యెప్పటియట్లు ప్రభాతకాలమున మేల్కొని లేచిరి. లేచి చూచునప్పటికి విజయసేనుడు చిత్రభానుడు వారికగపడలేదు. ఏబదిమంది యాయుధహస్తులైన సైనికులును తమకు వంటలు నుపచారములు మొదలగునవి చేయుటకు సిద్ధగా ముగ్గురు సేవకులు మాత్రము గనబడిరి. "పినతండ్రి యెందరిగె?" విక్రమసేనుడు సైనికులలో ప్రధానపురుషుడగు శక్తివర్మ యనువాని నడిగె. "మహాప్రభూ! ఏదో తొందరపనిమీద వారు మిమ్ము లేపుటకైన నవకాశము లేక కుమారుని మిగిలిన పరివారమును వెంటగొని నిన్న నడిరేయి పురమునకుం జనిరి. ఇట్లు మీతో మనవి సేయుమని నాకానతిచ్చిర" ని యతడు బదులు చెప్పెను.

"ఏమీ! తొందరపని గలిగినదా! మమ్ము లేపుటకైన నవకాశము లేకపోయినదా? కుమారుని బరివారమును వెంటగొని చనెనా! ఆహా! మాయమ్మ పోవలదని చేసిన హితోపదేశమును నేను నిరాకరించి మోసపోతినిగదా!" యని విక్రమసేనుడు తమ్ముని జూచి—"హర్షవర్ధనా! ఎంతయు మోసము వాటిల్లినది. మనల నిందు విడచి బుద్ధిపూర్వకముగా విజయసేనునిం దోడ్కొని చిత్రభానుడు పురమున కరిగినాడు. దురాత్ముడను వేటకు నేనొక్కడనురాక నిన్ను గూడ దీసికొనివచ్చితినిగదా! మనరాకకై యెంతో యాత్రముతో నిరీక్షించుచుండు మనతల్లి మనము గనబడకపోవుటచే నెంతగుందునో, యెంత బెంగపెట్టుకొనునో, యామె చిత్త మెంత క్షోభించునో, ఆమె హృదయము భిన్నము గాకయుండునా? ఇంక నామె యన్నము దినునా? నిదురించునా! మనకిది కారాగృహముగాని గృహము గాదు. మన మిక మీద బంధితులముగాని రాజపుత్రులముగాము. ఈ ఘాతుక కృత్యము చేయుటకే యతడీ వేట పన్నుగడ పన్నినాడు. అతని సంకల్పము ముప్పాతిక నెరవేరినది. మన మిందు దిక్కులేక

మన మొరలువినువారు లేక మన సంతాప మార్చువారు లేక మన కోరికల దీర్చువారు లేక యీ వనవృక్షములట్లు యెన్నడో నాశన మొందవలసియుండును. ఆహా! ఏమిగతి? తమ్ముఁడా నేఁటోయిన విచారము లేదు. నీవైన నమ్మకోర కుండిన బాగుండునుగదా!" యని విచారగ్రస్తుడై పలికెను.

అదివిని హరనరనుడు—"అన్నయ్యా! నీవేలపోవలె? నేనెందు నుండవలె? నేను నీతోడివాడనే. ఉండిన నిరువురముంగాము, పోయిన నిరువురము పోదము. నీవు చెప్పినట్లు తల్లిపొందు తల్లక మింతింత గాదు. ఆమె జీవింపనే జీవింపదు. అమ్మ దూరదృష్టిగలదై యిట్టి యాపదల శంకించి మనలం బోవద్దన్నది. మన మామెమాట విన్నాముకాము. మాతృశాసన తిరస్కారమునకు దగిన ఫల మనుభ వింపవలయునుగదా!" యని దీనాననుడై ప్రత్యుత్తర మిచ్చెను.

ఆ దినమున వారు వంటలుచేసి సేవకులు పిలిచినను బ్రతిమాలి నను భుజింపలేదు. శక్తివర్మ వారికడ కేగి—"ప్రభువులారా! భోజనము సేయుడు. ఎన్ని దినములు మానెదరు? ఇది యెక్కువాటిదిగాదు. మీకిది శాశ్వతమైన చెర. మీరీయిల్లుగలి యావలికి బోకుండ మమ్ము మీపినతండ్రి కాపుబెట్టెను నాదిన్నయున్నలా...! అంతటి మహారాజు గర్భమునబుట్టి, యంతటి సుహాద్దైశ్వర్యము ననుభవించి తుదకిట్టి దురవస్థపాలైన మిమ్ముజూచి మిక్కిలి కఠినుండనైన నాహృదయముగూడ చలించుచున్నది మేమేమి చేయగలము! సేవకులము. దుర్భరమైన కుటుంబరక్షణమునకు శరీర మమ్మల నమ్ము కొన్నాము. ప్రభువులయాజ్ఞ శిరసావహింపవలయు. లేనిచో మాబుర్ర లెగిరిపోవును. మాకూడు పడిపోవును. కడుపుకక్కుర్తికై ప్రభువుల కడ గొలువుచేసి యిట్టి దుష్కార్యములు చేయువలసి వచ్చినందుకు మేము మిక్కిలి దుఃఖపడుచున్నాము. మాకు స్వాధీనమైన పనిలేదు. సేవకు లంతఃకరణము చంపుకొని గుండె రాయిచేసికొని యుండ వలయు. మేము మనుష్యులలో లెక్కగాదు. కాబట్టి మమ్ముల క్షమింపుడు నాయనలారా!" యని కంటనీరు పెట్టుకొనెను.

"శక్తివర్మా! నీవేమి చేయగలవు? మేమదృష్టవంతుల మైన పక్షమున మాతండ్రి కట్టి దుర్మరణము యేల కలుగును? చిత్రభానున కట్టి దుర్బుద్ధి యేల పుట్టును? ఒకరిని నిందింపనేల? మాభాగ్యమునే నిందించుకొందుము. నీవు విచారింపకుము" అని విక్రమసేనుడు వాని నూరడించెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము

చిత్రభానుడు వేటనుండి కుమారునితోడను బలగముతోడను మరలివచ్చెనని విని యరవిందాదేవి తన కొడుకులు గూడ వచ్చుచున్నారని తలంచి యానందింప నుబలాటపడుచుండ వారెంత సేపటికి రారైరి. ఆమె సాయంకాలమువరకు వారినిమిత్తము నిరీక్షించి యాత్ర మంతకంత కెక్కువకాగ దన నందనులు రాకపోవుటకు గారణమేమో తెలిసికొనిరమ్మని దండపాణి యొద్దకు సేవకుల నంపెను. తనకావిషయ మెంతమాత్రము తెలియదని అతడుత్తరము జెప్పెను. బెంగ యినుమడింప బుత్రవత్సలయైన యాదేవి నలుగురు బంట్ల నాలుగుప్రక్కలకంపి వేటకాండ్రను దద్విషయమై కనుగొని రమ్మని పంపెను. తమకావిషయము తెలియదని వాండ్రును దెలిపిరి.

అరవిందాదేవి తొట్రుపాటు వర్ణనాతీతమయ్యెను. అప్పుడామె వృద్ధకంచుకియైన ముంజని బిలిచి చిత్రభానునియొద్ద కరిగి తద్విషయ మరసిరమ్మని పంపెను. వాడును సత్వరంబ యరిగి యతనికి జోహా రొనర్చి వినయపూర్వకముగా—"రాజకుమారు లేలరాలేద"ని యడిగెను. అతనికి జిత్రభాను డిట్లనియె—"కుమారులు సేమముగా నున్నారు. మంచుకొండ చరియలలో నొకదానిమీద మనోహరమైన కోటగలదు. వారక్కడ కొంతకాలముండి యవ్వనసౌందర్యము శైల సౌందర్యము జూడవలయునని కోరుటచే వారినక్కడ నుంచివచ్చితిని. భయములేదని మీరాణిగారితో జెప్పు. పో!"

ఆ మాటవిని ముంజుడు వెంటనే రాచనగరున కరిగి యేమి యుత్తరము వచ్చునోయని తత్తరపడుచున్న రాణి కెరింగించెను. అమ్మాటలు శూలవుం బోటులువలె నామె కర్ణములనాట నిలువలేక నేలం గూర్చుండి—" అయ్యో! నర్మదా! నర్మదా? దురాత్ముడైన చిత్రభానుడు నాకొడుకుల గడతేర్చినాడేతల్లీ! గటకటా! నాపసిపాపల నితడు తిన కడుపున బెట్టుకొననే! అయ్యో! ఏమిసేయుదునే? నర్మదా! ఏదో ఘాతుక, కృత్యము జరిగినదే! ఓసీ! నేను నిలువలేను. నాగుండెలు కొట్టుకొనుచున్నవి. మనస్సు మండుచున్నది. ఒడలు వడకుచున్నది. తల తిరుగుచున్నది. కన్నులు చీకట్లు గ్రమ్ముచున్నవి. నీవు వచ్చి పట్టుకొనవే నన్ను. ఎవరితో జెప్పుకొందునే! మణివర్మ లేడు. మాధవసేనుడు లేడు గదాధర శూలపాణులు లేరు. ఎంత దిక్కుమాలినదాననైతినే! ఇప్పుడేమియుపాయమే? ఆలోచన చెప్ప వారైనలేరే? నీవేమనియెదవే?" యని పరిపరివిధముల నాక్రోశింప దొడగెను

ఆమె దుఃఖము జూచి నర్మద వెరవుం జాలియు మల్లడికొన నేమిచెప్పుటకుం దోచక నెట్లు సమాశ్వాసించుటకు నుపాయము గానక—" అమ్మా! నేను పోయి సీమరదిగారిని గనుగొని వత్తునా?" యని యనెను. " ఓసీ! నీవుకాదు వెళ్ళవలసినది. నన్నే యచ్చటికి దీసికొనిపొమ్ము. నే నా యిందుమణి యడుగులమీదను గర్పూర మంజరి పాదములయొద్దనుబడి నాచిన్నియన్నల నాకర్పింపుమని ప్రార్థించెద. తీసికొనిరా. రథము తీసికొనిరా. జాగుసేయకు. నిమేష మాత్ర మాలసించితివా యేమి జరుగునో నీవే యెరుగగలవు" అని కఠినముగా బలుకుటయు నర్మద యప్పుని సారథి నొక్కనిం బిలిచి యరదంబు సన్నించి దేవి నందు గూర్చుండబెట్టి దాను నామె ప్రక్కను గూర్చుండెను.

కోట కావలి నిమిత్తము చిత్రభానుని నియమింపబడిన మొరకు జోదులు స్యందనము నిలిపి కోటలోనుండి యావలి కేవరిం బోనియ్య

వలదని చిత్రభానుని యాజ్ఞ యైనదని తెల్పిరి. అప్పలుకులు విని మహోగ్రహపూరితచిత్తయై కోపావేశంబున బలుకులు తడబడ నరవింద రథములోనుండి బిగ్గరగా—"ఓరీ! ఎవడురా నాస్యందన మాప గలవాడు? ఈరథ మెవ్వరిగా దలచితివి. హేమచంద్ర మహారాజు పట్టమహిషియు కుమార విక్రమసేను మాతయునగు నరవిందదిగా గ్రహింపుడు ఆపతియిచ్చుటకు చిత్రభాను డెవ్వడు? నిలుపుటకు మీరెవ్వరు? సూతుడా! రథము సాగనిమ్ము ఎవ్వరేని నడ్డము వచ్చిన నేనే రథముదిగి గుఱ్ఱముముందర నడచెద. వారి ప్రభువు నాజ్ఞాప్రకారము నన్నుం జంపుమని యీ బంట్లతో జెప్పుము" అని పలికెను. భీషణములైన యా భాషణములు ధైర్యక్షోభణము గావింప నాజోదులు భయకంపితులై యేమియు ననజాలక నొత్తిగిలిరి. రథము నిరంతరాయముగ సాగి చిత్రభానుని గృహము ముందర కరిగి నిలిచెను. కుమార వియోగ సంజనితమైన మనస్తాపమున నొడలెరుగక లేచి యెదుటనున్న వారెవ్వరో తెలిసికొనకయే నర్మద దారిజూప సింహద్వారముదాటి లోపలి కవాటములుగాటి యభ్యంతర మందిర మున కరిగిరి. అరిగి—"ఇందుమణి యెక్కడ? ఇందుమణి యెక్కడ?" యని విచారించి సేవకులవలన నామెయున్న చోటెరిగి యాతావునకుం జనెను.

అప్పుడు కర్పూరమంజరియు నిందుమణియు నొక మంచముపై గూరుచుండి యేదో మాటలాడుచుండిరి. విజయసేను డామె రాక జూచి విసవిస మేడమీది కరిగి తండ్రి కెరిగించెను. అరవిందాదేవి తన యింటికి వచ్చునని చిత్రభాను డెన్నడు దలపలేదు. అతడదరి పడెను. రుద్రభట్టు మహాశ్చర్యము నొందెను. వెంటనే చిత్రభానుడు మేడదిగి క్రిందికి వచ్చెను. అరవిందాదేవి గది ప్రవేశించిన తోడనే మహాశ్చర్యముచే గన్నులు పెద్దవిచేసి చూచి యిందుమణియు కర్పూరమంజరియు మంచముమీదనుండి దిగ్గున లేచి నిలిచిరి. అరవింద వారి యిరువుర పాదములపై బడి—"అమ్మా! పుత్రభిక్షము పెట్టుడు. పుత్రభిక్షము పెట్టుడు" అని వేడుకొనెను.

ఆ గొడవ వారేమియు నెఱుంగకపోవుటచే వారిరువురు దెల్ల బోయి చేతులతో నామె నెత్తి—"అయ్యో! ఇది యేమివెఱ్ఱి! మాయమ్మగారు మీద బడజెల్లునా? తల్లీ! మీముందర మే మెంత వారము? బిడ్డల కేమి యాపద వాటిల్లెను?" అని తొట్రుపాటుతో బలికిరి. అందు కరపిండ వారిం జూచి తన కొడుకులు చిత్రభానునితో వేటకరుగుట, బలగమంతయు వచ్చినను వారు రాకపోవుట, కొండ కోటలో నున్నారని చిత్రభానుడు చెప్పుట మొదలగు వృత్తాంత మంతయు గద్గద స్వరముతో దుఃఖాపూరితయై తెలిపి—"తల్లీ! కర్పూరమంజరీ! నీవు నాకన్నకూతువు గాకున్నను నిన్నే నాబిడ్డగా జూచుకొంటి. ఇద్దరు మగబిడ్డలు నాకొక యాడుబిడ్డయని సంతసించు చుంటిని. అమ్మా! నీతమ్ముల రక్షింపుము. తమ్ములం జూపుమని నీతండ్రి నడుగుము. చూపడేని ఇదిగో! నేను రాచకూతురను. సాహసంబులందు ముందంజ వేయుదానను. ఇదిగో! నాచిన్నకత్తి మొలలోనున్నది. ఇప్పుడె నీతండ్రి చూచుచుండ నీవును నీతల్లియు జూచుచుండ బొడుచుకొని బిడ్డలకు దూరమై, భర్తకు దూరమై, వసుంధరాదేవికిని మోయను భారమైన ఈ శరీరము మీతండ్రి పాద ములయొద్ద విడిచెదను. ఆయన కనులు చల్లబడుగాక! ఇదివరకే భ్రాతృహంతయని పేరువచ్చినది. ఇప్పుడు శిశుహంతయైనాడని నాయనుమానము. ఇప్పుడు నాచావుచే నాయన పాపశరీరమునకు మకుటమేర్పడును. బిడ్డా! కర్పూరమంజరీ! పద, నీతండ్రియొద్దకు బద, తల్లీ! యిందుమణి! పద. నీపతికడకు పద!" అని మిక్కిలి యార్తయై తీవ్రముగ భాషించెను.

చిత్రభానుడు ప్రక్కగదిలోనుండి యుప్పలుకులు వినుచుండెను. రుద్రభట్టు వానిప్రక్కనేయుండి యతని చెవిలో నేదో గుసగుస లాడుచుండెను. కర్పూరమంజరి యామె దీనదశ జూచి యామె మెత్తని చిత్తము మిక్కిలి యుత్తలపాటునొంద దత్తరంబున దండ్రికడ కరిగి—"నాయనా! ఏమిది? తమ్ములేమైరి? ఎందుండిరి? కుశలముగ

నున్నారా? ఆమె బిడ్డల నామె కప్పగింపుము. నీకీయపవాదమేల? ఇదివరకే నీతలపై బడిన లోకాపవాదములు చాలవా? ఆమర్యాదా భారమున నీవెగాక మేముకూడ గ్రుంగిపోవుచుంటిమి. ఆ యపకీర్తియను నంధకారమువలన మన కులప్రతిష్ఠ నల్లబడినది. సత్వర మామె బిడ్డల నప్పగింపుము" అని మందలించెను.

చిత్రభానుడు బిడ్డ నుడువుల నాలించి—"అమ్మాయీ! సీతమ్ములు కుశలముగ నున్నారు. ఏల యీయామె తొందర? వారు హిమవత్పర్వత సౌందర్యము జూడ నుబలాటపడుటచే నచ్చట నుంచితిని. పది దినములలో వత్తురు. మహారాజ్ఞి అంతఃపురవాసిని ఈమె యేమి, యీ రాత్రి తొందరతో వచ్చుటేమి! ఇంత మనఃక్షోభ మొందుట? ఏమి మునిగిపోయినది? ఇప్పుడు కోటకు జనుము" అని నిర్విచారముగ నుత్తర మిచ్చెను.

అది విని యరవిందాదేవి మహారోషమున నిట్లనియె—"ఏమి మునిగిపోయినదా? నామానస్సు దుఃఖమున మునిగిపోయినది. మీపలుకులు నేనమ్మజాలను. ఒకవేళ వారు బ్రతికియేయుండిన వారిని నీవు చెరలో బంధించితివి. అందుకే యమాయకులైన పసిబిడ్డలను మాయమాటలు చెప్పి వేటవంక బెట్టి దూరము తీసికొనిపోతివి. నేను రాణినా? నేను రాణినిగాను. నేను నీదాసిని. నారాణితనము నాడే పోయినది. నేను కోటకుం జనను. నాబిడ్డలులేని కోట శ్మశానముగాని కోటగాదు. నాచిన్నియన్నలులేని నగరు నట్టడవిగాని నగరుకాదు. నాబహిఃప్రాణములులేని యీ భవనము సముద్రముగాని భవనముగాదు. ఆకోట నేఁబ్రవేశింపను. నాబిడ్డల జూచినదాక యీ నగరులో నేనడుగుపెట్టను. నన్ను జంపి శవమును శ్మశానమునకైన బంపుము. లేదా నా కొడుకుల యొద్దకైన బంపుము. వారిం జూడమి నాకన్నులు వాచిపోయినవి, ఏరీ నారత్నాలరాసులు? ఏరీ నాబంగారుబొమ్మలు? ఏరీ నావరాలకుప్పలు? ఏరీ నాసింగపుగొదములు? ఏరీ నాముద్దుల మూటలు? ఏరీ నాగారాల కాణాచులు? చూపవా? ఇదిగో!

చూరకత్తితో పొడిచిచంపు. నీచేతులతోనే నన్ను నాభర్తయొద్దకు బంపు" అని యతని కాళ్ళసమీపమున నేలపై సాగిలబడెను.

అప్పలుకులు విన్నవారందరు భయమున గడగడ వడకిరి. రాతిగుండెగల చిత్రభానుని మేనుసైతము కంపించెను. "ఇది మనకు దగదు. ఆమెను బిడ్డలయొద్దకైన బంపుము లేదా, బిడ్డల నామెయొద్దకైన దీసికొనిరండు" అని యిందుమణి చెప్పెను. "తండ్రీ! నాగుండెలు వ్రీలుచున్నవి. నాతమ్ములం దీసికొనివచ్చి యామెకుం జూపుము. నేనును వారిం జూడదలతు"నని కర్పూరమంజరి జనకునితో బలికెను. అప్పలుకులు విని చిత్రభానుడు—"ఆమెయు మీరు నింత నిష్ఠురోక్తులు బలుకనేల! ఆమె నిప్పుడె బిడ్డలయొద్దకు బనిచెద. ఉండుడు" అని యవ్వలకుం జని కరటక పింగళులం బిలిచి వారితో నేదో పదినిమేషములు చెప్పి మరలవచ్చి యీ సేవకు లిరువురు నీరథముపై వచ్చి నిన్ను నీబిడ్డలున్న చోటికి దీసికొనిపోగలరు. వదినె! రథమెక్కుము. నర్మదం గూడ దీసికొనిపొమ్ము. నీవు నీబిడ్డలం గలిసి మరల నిక్కడికి సుఖముగా వత్తువుగాక!" అని చెప్పెను.

"నాకిదే మహోపకారము. ఇదే పోయివచ్చెద"నని వారి నందరి నామంత్రణముచేసి యరవిందాదేవి నర్మదంగూడి యరద మెక్కెను. కరటక పింగళులు సారథి కిరువంకల నయ్యరదముమీదనే కూర్చుండిరి. పయనము సాగెను. కరటక పింగళులు చూపిన దారినె సూతుడు స్యందనము దోలెను.

అట్లు రెండు దినములు వారు ప్రయాణముచేసి రెండవనాటి సాయంకాలమునకు నట్టడవుల నడుమనున్న యొక చిన్న కొండ కోటం జేరిరి. కోటచుట్టు గొండలు గలవు. ఒకటి రెండు చెంచుల పల్లియలు గలవు. "ప్రయాణ శ్రమచే మేము మిక్కిలి అలసితిమి. రెండుదినము లిక్కడ విశ్రమించి పిమ్మట మీకొమరులున్న చోటికి బోవుదము" ని కరటక పింగళు లాదేవితో జెప్పి మిక్కిలి కష్టము మీద నామె నొడంబరిచిరి. వారక్కడ నుండగానే ముప్పదుగురు

జోదులు సాయుధులై వచ్చి వారిం జేరిరి. "ఈ బలగ మెందుకు" ని
యరవిందా దేవి కరటక పింగళుల నడుగ—"మమ్ము కొండలోనుండి
పయనము సేయవలయు. మన కంగరక్షగా మీమరది పంపెన" ని
వారుత్తరము చెప్పిరి.

ఆ బలగము చేరిన మరునాటిరేయి నెల్లరు గాఢనిద్రం దగిలి
యుండ కరటక పింగళులు నిదురించుచున్న సూతుని మెడ కురిబోసి
వానిం గడతేర్చి యొక కొండవాగునం బారవైచి యరదము మీద
నెక్కి దానిం దోలుకొని శ్రీనగరమునకుం జనిరి. మరునాడుదయ
మున కరటక పింగళులను సూతుని గానక యరవిందా దేవి వారేమైరని
యంగరక్షకుల నాయకు నడుగ నత డిట్లనియె.

"అమ్మా! ఈ కొండకోట మీకు చెరసాల, మీ రిందుండ
వలయు. మిమ్మిటనుండి కదలనీయ గూడదని చిత్రభాను డానతిచ్చెను.
సూతు డేమయ్యెనో మే మెరుగము. కరటక పింగళులు నిన్నరేయి
శ్రీనగరమునకుం బోయియుందురు. మీకు గావలసిన సకల పదార్థ
ములు దెచ్చి యీయవలయునని మీమరది యానతిచ్చె. మీ కేవి
కావలయునో యవి నర్మదచేత మాకెరిగింతురేని మేమవి తెచ్చి మీకు
సమర్పించువారము" అని యున్న దున్నట్లుగ రక్షక నాయకుడు
పలుక దన కొమరుల నచిరకాలమున గలసికొన గలుగుదునని పుట్టె
డాస పెట్టుకొనియున్న యా దేవికి పిడుగడచినట్లు నిశ్చేష్టయై నేలం
గూలెను. నర్మదయు దుఃఖాక్రాంత మనస్కయై యామె మొగంబున
జల్లని నీరుజల్లి సాధ్యములైన శైత్యోపచారములం జేసెను. అంతం
గొండొకవడికా దేవి మూర్ఛనుండి మేల్కని—"హా! కుమారు
లారా! మిమ్మింక జూచెడు భాగ్యము నాకు లేదు. మీరు జీవించి
యున్నారను నమ్మికయే నాకు బోయెనది. ఆ దురాత్ముడు మిమ్మే
మాయోపాయములనో కడతేర్చియుండును. నన్ను మాత్రము
చేతులార జంపక మీనిమిత్త మాజన్మాంతము విలపింపుమని నాగర
కులురాని నట్టడవిలో బడవైచె. ఇక నేమి సేయుదు? నర్మదా! ఇక

నీ బ్రతుకెందుకే! తీసుకొనిరావే విసము! జానెడు త్రాడు తేవే! చిన్నకత్తి నాచేతికియ్యవే! నాచిన్న యన్నలారా! అటువంటి ప్రాణేశ్వరుడు గతించినను మీరిరువురు నారెండు కన్నులనుకొని నాబహిఃప్రాణము లనుకొని నాకన్నుల చందమామ లనుకొని నాతపఃఫలము లనుకొని నేను బోయినయెడల మీకు సుఖములు జరుగనని నేను ప్రాణేశ్వరునితో సహగమనము చేయక, తరువాతనైన నసువులు విడువక జీవించియుంటి. ఇంక నాజీవనమువలన ప్రయోజన మేమి? హా! ఎంత దురవస్థ ప్రాప్తించినది! ఓ చిత్రభాను పాతక! నా కారాగృహనివాసమునకు నేను విచారింపను. నామరణమునకు నేను చింతిల్లను రాజ్యములేదని విచారింపను. సామ్రాజ్యమంతయు నీవేలుకొన్నను సరే కోటి సామ్రాజ్యములకన్న నెక్కుడు ప్రియము లైన నాగారాబుబిడ్డల నాచిన్నికూనల నాకియ్యరాదా! వారి మొగములే నాకు సామ్రాజ్యసుఖము నిచ్చును, వారి మాటలే నాకు ధనములమూటలు. నాతండ్రులారా! జీవించియున్న పక్షమున మీరెంత దురపిల్లుచున్నరో! మీరెంత కష్టపడుచున్నారో! ఆ దురాత్ముడు మిమ్మెంత హింసల పాలుజేయుచున్నాడో! జీవచ్ఛవము నైన నన్నును బరలోకగతుడైన మీతండ్రిని దలచి మీరెంత కుందుచున్నారో! మిమ్మతడు వధించి యుండిన బలవన్మరణ సమయమున మీరెంత సంక్షోభించిరో? అయ్యో! తనయులారా! పలుకరేమి? నన్ను కౌగలింపరేమి? నాకభయ మొసగరేమి? హర్షవర్ధనా! హర్షము వర్ధిల్ల జేయువేమి? అయ్యో! హర్షముగాదు—బాష్పవర్షము వర్ధిల జేయుచున్నావు. విక్రమసేనా! రావేమి! నాయక్కఱ దీర్పవేమి! హా! హేమచంద్ర భూపాల! నీబిడ్డల గతి యెట్లయినదో చూడుము" అని విలపించుచు మాటిమాటికి మూర్ఛిల్లుచు జిత్రభానుని దెగడుచు విధిని దూరుచు దన యదృష్టమును నిందించుకొనుచు గొడుకుల సుగుణంబుల నుగ్గడించుచు సౌందర్యంబుల వర్ణించుచు మూర్తీభవించిన శోకదేవతవలె నుండెను. ఆ దినము

మొదలుకొని యామె యన్నము ముట్టదయ్యె. నిదురవోవదయ్యె. నర్మద యాత్మహత్య చేసికొనకుండ నామెను బలుతెరంగుల గాపాడు చుండెను.

అట్లయిదారు దినములు గడచిన పిదప నొకనాటి నడిరేయి రక్షకభటులు నర్మదయు నిద్రయు నిద్దురం దగిలియుండ నరవిందాదేవి చప్పుడు గాకుండ గడియలు దీసి తలుపులు తెరచి మెల్లమెల్లగ నావలకుం జనియెను. తెల్లవారువరకు నర్మదకు మెలకువ రాలేదు. మెలకువ వచ్చిన యనంతరము నామె దేవిం గానక మనంబు కలతజెంద నాగృహము నాలుగు ప్రక్కల వెదకి కావలివాండ్ర కావార్త నెరిగించెను. వారుం జుట్టుపక్కల కొండలు గుహలు వనములు వెదకి తమ కామె యెందునుం గనబడలేదని చెప్పిరి. నర్మద రాణియవస్థకు దన యేకాకిత్వమునకు బిట్టువగచుచు దన్నావలకు బోనిమ్మని కావలివాండ్రను వేడుకొనెను. రాజు సెలవులేక యట్లు చేయుటకు వీలులేదని వారు చెప్పిరి. దేవి మతిచెడి తిమ్మ బేలువుచ్చి యర్ధరాత్రమున నెందో యరిగినదని యంగరక్షకుల నాయకుడు చిత్రభానునకు దెలువు మని సేవకుల నంపెను

నర్మదను విడువవలదనియు వారందరక్కడనే యుండవలసిన దనియు జిత్రభానుడు మరల వారికుత్తరువు లంపెను. పదిదినములు గడచిన పిదప నొకనా డొకచెంచు దేవి తప్పిపోయినదని చెప్పుకొను చున్న యంగరక్షకులతో నిట్లనియె—“ అయ్యా! ఇక్కడికి నాలుగు క్రోసుల దూరమున నొక గొప్ప వాగున్నది. నేను వేటకు బోయి నప్పు డందులో నొక యాడుదాని శవము గనబడినది. మొగము చేపలు తినివేయుటచే నానవాలు తెలియలేదు. వ్రేళ్ళుకూడ చేపలు కొరికి వైచినవి. విగ్రహము చక్కనిది. అది రాణిగారి శవము కావచ్చును. మీద మీచిత్తము ” అని వాడెరిగింప నాబంటులు బద్ధకించి—“ ఇప్పుడు శవమును జూడనేల? పోయినదెట్లో పోయినది !” యని యూరకుండిరి. అవస్థలు తప్పినప్పు డెంతవారైనను దమ బంటులకు గూడ జులకన యగుదురుకదా !

# ఇరువది యైదవ ప్రకరణము

హేమచంద్రుని కుటుంబమును రాజధానికిఁ బాపి కొండలపాలు గుట్టలపాలు చేసి చిత్రభానుఁడు తాను మునుపు నివాసము చేయుచుండిన గృహము విడిచి కోటలోఁ బ్రవేశించెను. పేరునకు విక్రమసేనుఁడే రాజని చెప్పుచున్నను నిజముగా జిత్రభానుఁడే కాశ్మీరదేశ మహారాజై రాజ్యవ్యాపారములు యథేచ్ఛముగా నిరంకుశముగా నిర్భయముగా జక్కఁబెట్టుచుండెను. అంతదనుక జిత్రభానుని యింట దాగియుండి ప్రజలకు దన మోము జూప సంశయించుచుండిన రుద్రభట్టు చిత్రభానుని మంత్రియై సకల కార్యములయం దతని కుపద్రష్టయై కొలువుకూటమున నాతని ప్రక్కఁజేరి కూర్చుండి సభాసదులయు రాయబారులయు మన్ననలు వడయుచుండెను. అతని మొగము, కంఠధ్వని, బాహువులతీరు, కన్నుల పొంకము మున్ను గుహలో హేమచంద్రుని వేలువుచ్చిన హరిశర్మ మొగమువలె నున్నదని పోలికలవలన గొందరు గ్రహించి యట్లుండుటకు గారణమేమని యడుగ దలపెట్టిరిగాని చిత్రభానున కిందువలన గోపము వచ్చునేమోయని శంకించి యూరకుండిరి. విక్రమసేన హర్షవర్ధను లెందున్నవారని యెట్లున్నవారని యెవ్వరే నప్పుడే నడుగ వారు మాతృసమేతముగా హిమవత్పర్వత ప్రాంతములందలి కొండకోటలో సుఖముగా నున్నారనియు బ్రకృతి సౌందర్యము వారిని సమాకర్షించుటచే నచ్చోటు విడిచి రాజాలకున్నారనియు నిప్పటివార్తలప్పుడు తెలియుచున్నవనియు నతఁడు చెప్పుచుండెను. అమ్మాటలు విని బంధుగులును ముఖ్యముగ గర్పూరమంజరియు నమ్మి వారి కేపాయము లేదని భావించుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు వేగులవాండ్రు చిత్రభానునికడకు వచ్చి వానితో నిట్లు విన్నవించిరి, " దేవా! మాధవసేనుఁడు పురికొల్ప మాళవ రాజసైన్యములు మనపై దండు విడియుచున్నవి. ఆ సేనను వారి సేనానాయకుఁడగు కంఠీరవదేవుఁడు మొనగాఁడై నడుపుచున్నాఁడు.

మాళవ రాజనందనుడగు మకరందుడు మీతో పోరుటకు స్వయముగా నరుదెంచుచున్నాడు. ఇరువదివేలు కాల్బలము, ఐదువేలాశ్వికులు, ఏనూరు మహాగజములు వారివెంట వచ్చుచున్నవి. అవిగాక వేనవేలు శిబిరానుచరులు, బహుసహస్రములు పశువులు, పశువులకుగడ్డి, సైనికుల భోజనపదార్థములు మితిమీరి యున్నవి. వారుజ్జయినీపురము బయలుదేరగానే దేవరవారి కీవృత్తాంతము దెలియజేయ మిక్కిలి వేగముగా వచ్చితిమి. మీద దేవరచిత్తము."

అనవుడు చిత్రభానుడు త్రుళ్ళిపడి—"అలాగా! మనమింక జాగరూకతమైయుండవలయున" ని వారిం పనిచి దండపాణిని వజ్రపాణిని తక్కిన చమూపతులను బిలువనంపి చారులు తనకు విన్నవించిన వృత్తాంతమంతయు వారి కెరిగించి సమర సన్నాహము చేయింపుమని యానతిచ్చెను.

వెంటనే సేనాపతులు క్రొత్తసైనికులం జేర్చుకొని వారికి విలువిద్దియ నేర్పి సాంగ్రామిక శాస్త్రమునం బరిచితుల జేసిరి. కోట బురుజులు దృఢతరంబుగ జేసిరి. అగడ్తనిండ నీరెక్కించిరి. కోటలలో రెండేండ్లు పగతురు ముట్టడించినను సైనికులు చిక్కుపడకుండునట్లు సంభారముల నిలువచేయజొచ్చిరి. ప్రతికోటయందు ముఖ్యముగా శ్రీనగరకోటయందు శస్త్రచికిత్సకులను నియమించి వారికి గావలసిన పరికరముల సమకూర్చిరి. ముప్పదివేల కాల్బలము, పదివేల యాశ్వికబలము సహస్ర గజబలము నచిరకాలములో సిద్ధమయ్యెను.

చిత్రభానుడు తన యాప్తసేవకుడైన కరటకునిం బిలిచి యిట్లు చెప్పెను—"ఓరీ! విదర్భరాజ సైన్యములు మనకు దోడుపడుటకు బైలుదేరునని చారులు విన్న చెప్పిరి. నీవు మధ్యేమార్గమున వారిం గలిసికొని వారు కాశ్మీరమునకు వచ్చుటకు మారుగా మనపక్షమున మాళవదేశముమీద దండు విడిసి యా దేశమును స్వాధీనముచేసికొని సుదర్శనుని సింహాసనభ్రష్టుని జేయవలయునని చెప్పవలయు. ఇవిగో నాముద్రవైచిన జాబులు. జయంతునకు నుగ్రసేనునకు నేనిచ్చు

చున్నాడు. వీనిం గొంపోయి వారికిజూపుము ఇప్పుడు మాళవదేశమును జయించుట మిక్కిలి సులభము. ఏలయన వారిసేనయంతయు మన మీదికి వచ్చుచున్నది. ఉజ్జయినిలో నిప్పుడు దళము స్వల్పముగా నుండును. అందుచే నారాజ్యము నవలీలగా మనవారిచేతబడును. నేజెప్పిన మాటలేగాక నీవును నీబుద్ధిం దోచినట్లు సమయోచితములగు మాటలు చెప్పి మనపై గత్రికట్టినందున మాళవరాజునకు బుద్ధివచ్చినట్లు చేయుము. సుదర్శనుడు స్వయంకృతాపరాధవల మనుభవించుగాక! మిక్కిలి వేగముగానడచు నొంటిపై నెక్కి పదుగురాశ్వికులం దోడు కొని బేహారివేషమున నీవుపొమ్ము. నీవిదివరకు మాకై బడిన కష్టములకు నీకుమేము కాశ్మీరమునందో. మాళవదేశమునందో నీవు కోరు కొన్నచోట నాలుగుమూ డగ్రహారము లియ్యదలచుకొన్నాము నీవును బింగళుడును నాకు రెండుకన్నులై, రెండు చేతులై, రెండు కాళ్లై యుపచరించుటంజేసి నా ప్రయత్నములు ఫలోన్ముఖము లయినవి" అని పలుక కరటుడు "స్వామీ! మా వలన నేమున్నది! దేవరవారి యాజ్ఞాబలమే మా చేతనన్ని పనులు చేయించినది. అట్లే పోయివచ్చెద" నని వీడ్కొని మరునాడు పయనమై పోయెను.

మకరందుడు మహాసేనాసమేతుడై యమాత్య నందనుడగు భద్రసేనుడు తనకు సహకారియై మనోరంజనము సేయుచుండ ఛండశాసనుడగు కంఠీరవదేవుడు సేనలు నడుప మహాసన్నాహములో నుజ్జయిని వెడలి కర్పూరమంజరీ సమాగమాభిలాష తన్ను ద్వరపెట్ట నిరంతర ప్రయాణంబులు సేయుచుండెను.

చిత్రభానుడును సంగ్రామసన్నాహముల జేయుచు నొకనాటి రేయి రుద్రభట్టుంగూడి కార్యాలోచనము సేయుచు దండపాణిం బిలువనంపెను. అప్పుడు రెండుజాములు రాత్రియయ్యె. దండపాణి కోటజొచ్చి రుద్రభట్టసమేతుడై యున్న చిత్రభానుంజూచి పిలువనంపిన కారణమేమని యడిగెను. చిత్రభానుడు కొంచెము సేపు సందేహించి "శంకింపక చెప్పవయ్యా! దండపాణి మనవాడే" యని రుద్రభట్టు పురికొల్ప మెల్లమెల్లగ నిట్లనియె.

"మిత్రుడా! నీ సాయమున స్వర్గతుల్యమగు కాశ్మీర దేశము నేడు నా పాదాక్రాంతమై యున్నది. నీతోడ్పాటువలననే నే నిప్పుడు రాజమహేంద్రుడ నగుట సిద్ధముగ నున్నాడను. ఇప్పటికి నిజముగను గాశ్మీరరాజును గాలేదు. ఆ కొరతకూడ నీవే తీర్పవలయు. రాజ్య వ్యాపారమంతయు నేను జక్కబెట్టుచున్నను రాజు విక్రమసేనుడే గదా? నేను వాని సేవకుడనే గదా? నా శాసనములపయి వానిపేరు, వాని రూపము ముద్రింపవలయుగదా! రాయబారులతో వాని ప్రతినిధినని మాటలాడవలయు గాని 'యహ మస్మి' యని స్వతంత్రముగ నేను బలుకుటకు వీలులేదుగదా? ఈ నైచ్యము నా కెంతమాత్రము సమ్మతముగ లేదు. నన్నీ బంధమునుండి తొలగింపవలసినవాడవు నీవు. నీకన్న సమర్థులు లేరు" అని వెండియు బలుకబోవుచుండ దండపాణి వాని మాట కడ్డముపోయి "ఇందు నే జేయవలసిన దేమున్నది? మీరు రాజైతిరిగదా! పట్టాభిషేకము సేయుదమన్న మేము జేసెదము. అట్లు చేయుదుమని సెలవా?" యని యడిగెను.

అడుగుటయు జిత్రభాను డిట్లనియె—"మిత్రుడా! రెండు ప్రక్కల రెండు బల్లెములట్లు విక్రమసేన హర్షవర్ధనులు జీవించియుండ నేను పట్టాభిషేక మెట్లు చేసికొందును? నేను రాజు నెట్లగుదును? రాజ్యము నిష్కంటకమైన తరువాతగదా నేను గద్దెనెక్కుట. ఆ రెండు ముండ్లు పెరికివైచిన తరువాత సుఖముగా నేను గద్దెమీద గూర్చుండెద. అప్పుడు పట్టాభిషేకము జేసికొనియెద."

"అట్లయిన నిప్పుడేమి చేయవలయు?" నని దండపాణి యాత్రముతో నడిగెను. "ఏమి చేయవలయునో యెరుగవా?" యని చిరునవ్వునవ్వి చిత్రభానుడు రుద్రభట్టు మొగము జూచెను. రుద్రభట్టు దండపాణిమీద జేయివైచి—"కర్తవ్యము నీకు మేము దెలుపవలయునా? ఆ రాచబిడ్డల కిద్దర నీవు కడతేర్చితివా మన మొత్తికోలు తుదనెగ్గును. ఇది నీచేతిలోని పని" యని పలికెను.

అప్పలుకులు దండపాణి శ్రోత్రములకు మిక్కిలి దారుణములై వినంబడెను. అతి డదరిపడెను. గుండె జల్లుమనెను. "అయ్యో!

రాజకుమారులం గడ తేర్చుటా ? అబ్బబ్బ ! అది నాకిష్టము లేదు. ఆపని నేను చేయుటా ? హరిహరీ ! ఎంతమాట ! ఆ పలుకులు నాతో జెప్పకుడు. రాజ్యవిహీనులై వా రేకొండకోటలలోనో వారితల్లి కడుపుచల్లగా హేమచంద్రుని పేరుగా బ్రతికి యుండవలయునుగాని, యిట్టి దుర్దశ పాలుగాఁగూడదని నాయభిప్రాయము. ఛీ ! ఛీ ! ఈ పాపమునకు నేనొడిగట్టజాల. ఇది చేయజాలను, వినజాలను " అని భయకంపితుఁడై పలికెను.

అతని వాలకము జూచి చిత్రభానుఁడు ముసిముసినవ్వులు నవ్వి యిట్లనియె—" దండపాణీ ! నీవు పేరునకు దగినట్లు యమధర్మరాజు వలె నిర్దయుఁడ వనుకొంటినిగాని యింత దుర్బల హృదయుఁడవని నేననుకొనలేదు. భయపడకు. ధైర్యము దెచ్చుకో ! సేనాపతులు యమ ధర్మరాజట్లు—మృత్యుదేవతయట్లు—జాలి లేక యుండవయు. "

" అయ్యో ! వారు నాకేమపకారము చేసిరని వారిని నేను గడ తేర్చుదును ? చందమామకు వన్నెలు దిద్దునట్టి యీ ముద్దుమొగ ములు జూచిన వారి నెవఁడు హింసింప జేతులు చాపగలడు ? వారిని జంప నెవరి మనసొప్పును ? అంతు విక్రమసేనుడు వెనుక నన్నొకసారి బ్రదికించెను. నాకొడుకు నొకసారి బ్రతికించెను. రాజభక్తి యుండ వలదా ? దానికేమి. కృతజ్ఞత యుండవలదా ? కృతజ్ఞతకేమి, మానవ లక్షణమైన జాలి యుండవలదా ? అబ్బబ్బ ! ఆమాట నాతో జెప్ప వద్దు. మనకు రాజ్యము స్వాధీనమైనది. వారిజోలి మనకెందుకు ? వారి దారిని వారినుండనీ ! వారు బిచ్చమెత్తుకొనియైన బతుకగలరు " అని దండపాణి స్పష్టముగా బలికెను.

అది విని చిత్రభానుఁడు వెండియు వాని మనసు నొడం బరుప నిట్లు వాక్రుచ్చెను—" దండపాణీ ! నీవు దప్పుదారిం బడు చున్నావు. రాజభక్తి యేమిటి ? నీకు విక్రమసేనుఁడు రాజుగాఁడు. నేను రాజును, నాయెడల నీవు భక్తికలిగి నాశాసనము నీవు శిరసా వహింపవలయును. కృతజ్ఞత యనునది యర్ధములేనిమాట. అది

తెగివితక్కువవాండ్ర నుడి. జాలియనునది భీరుజన లక్షణము. మన హృదయము లొకప్పుడు వజ్రకఠినములై యుండవలయు. నొకప్పుడు పుష్పసుకుమారములై యుండవలయు. రాజకార్య ధురంధరులు—ముఖ్యముగా దండనాయకులు జగన్నిర్మూలన పరాయణుడగు రుద్రుడట్లు—జంతుజాల గ్రసన తత్పరయైన మృత్యుదేవతయట్లు—జాలి యనుమాట దరిరాకుండ వర్తింపవలయు. ముద్దుమొగము లనుచుంటివి. మృత్యుదేవత యెంతెంతో ముద్దుల మూటగట్టు చిన్నబిడ్డల నెందరి గబళించుటలేదు ! దాని కోరలు జాలినెరుగునా ! వారు నాకేమపకారము జేసిరంటివి ? అట్లయిన నీకెన్నడు నపకారము నేయని శత్రుసైనికుల వేలకొలది యుండియు యుద్ధములో నిష్కారణము నీవేల చంపుచుంటివి ! వారెన్నడైన నీకెగ్గు లాచరించిరా ? అపకారముచేయనీ, యుపకారముచేయనీ పగతుడు పగతుడే. కావున వారి సౌందర్యము నీపని కడ్డము రాగూడదు. నీప్రతిజ్ఞ నీకార్యమున కంతరాయము గలిగింపగూడదు. రాజభక్తి నీమార్గము నిరోధింపగూడదు. కావున నక్కమానుల నిద్దర బరరాజ కంతలుంతన మాచరించు నీవాడికత్తికి నెర శేయవలయు. ”

అనుచుండ రుద్రభట్టంతలోనందుకొని వానినిట్లు హెచ్చరించె—“ దండపాణీ ! నీకించుక మరణతత్త్వ మెరిగించెద వినుము. మరణము సకల జంతువులకు సహజము. ఎప్పుడో ప్రతిజంతువు చావక మానదు. మరణము విధి నిర్ణయము. జంతువులం బలాత్కారముగ జంపు నప్పుడు కత్తియెట్టి నిమిత్తమాత్రమో చంపువాడునట్టి నిమిత్తమాత్రుడే. భగవానుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో నీవలెనే కరకుదనము విడిచి పరికితనముబూనిన యర్జునున కేమియుపదేశించెను ? నీవు శరీరమునేగాని యాత్మను హింసింపజాలవు. ఆత్మకు జావులేదు. దానికి నాశములేదు. శరీర మాత్మతొడిగెడు యంగీ. నరుడు ప్రాతబట్టల విడిచి క్రొత్తబట్టలగట్టుకొన్నట్లే, ప్రాతయిల్లు విడిచి క్రొత్తఇంట ప్రవేశించినట్లే. మునుపటి దేహమువిడిచి యాత్మ క్రొత్తదేహము

స్వీకరించును. బ్రహ్మ యీ విధముగా నా శిశువుల కిద్దరకు మరణము విధించెను. విధినిర్ణయ మనతిక్రమణీయము. నీవుగాకున్న మరియొకడైన వారిం జంపును. అకాలమరణము వారి మొగముల మూఁదుబంతుల వ్రాసియున్నాఁడు. అది నీవు తుడిచివేయఁజాలవు. ఈ పని చేసిన నీకు దోసము లేదు. ఒకని శిరస్సు ఖండింపుమని రాజానతిచ్చెను. అట్లు ఖండించిన సేవకుని కేమైనపాపముగలదా? పాపముగాని, పుణ్యము గాని యది రాజుదే. అదియునుగాక నే నేజంతువును జంపనని నీవు ముక్కుమూసికొని కూర్చుండఁగలవా? వేటాడి యెన్నిజంతువులం జంపుచున్నావు? నీ పొట్టనింపుకొనుటకై యెన్ని మెకముల నెన్ని పులుగుల హింసించుచున్నావు? ఎన్ని నల్లుల జంపుచున్నావు? జలముద్రాగు నప్పు డెన్ని కీటకముల నీ వెఱుఁగక మ్రింగుచున్నావు! ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములలో వాయువుతోఁ గలసి నీకంటికగపడని పరమాణుతుల్యములగు కీటకము లెన్నివేలు నీకడుపులోనికి బోవుచున్నవో యెఱుఁగుదువా? అదియెల్ల హింసగాదా? హింసలేకుండ నీవు క్షణమైన జీవింపఁగలవా? ఈ వెఱ్ఱిమాటలు విద్వాంసులకడ గట్టిపెట్టుము. లోకములో జంపువాఁడు లేడు, చంపఁబడువాఁడు లేఁడు. స్వలాభము నిమిత్తమై మనము పేలనుజంపినట్లు—నల్లుల నలిపినట్లు—క్రూర మృగముల గూల్చినట్లు—మన కడ్డమువచ్చిన మానవుల నయితము దయాదాక్షిణ్యము లేక సంహరింపవలయు."

అనుచుండ చిత్రభాను డడ్డమువచ్చి—"మిత్రుఁడా! అన్నిటి కేమి! ఈవిషయ మాలోచింపుము. విక్రమసేన హర్షవర్ధనులు బ్రతికి యుండిన నేమి మాళవరాజు వచ్చుచున్నట్లై మనపై కోపము వచ్చి నప్పుడు పరరాజులు వారిని గద్దె నెక్కించుటకై వచ్చుచునే యుందురు. వారున్నంతకాలము మనకు యలజడియున్నదే. వార లస్తమించినగాని మనకీ క్లేశ మస్తమింపదు. అదిగాక యీ రాజ్యము నాదియని నీవు తలంపకుము. నేనిప్పుడు గద్దె యెక్కినను వయస్సు మళ్ళినవాఁడ నగుటచే నచిరకాలమున మృతినొందుదును. అటమీఁద రాజు

గావలసినవాడు నీయల్లుడు విజయసేనుడు. ఆ బాలకుల సంహరించుట నానిమిత్తముగాదు. నీయల్లుని నిమిత్తము. నీకూతురు నిమిత్తము. జాగ్రత్తగా నాలోచించుకో! మాళవసైన్యము రాకముందే మనమీ పని చేయవలయును. వారినీలోపల గడతేర్చితిమా మాళవసైన్యములు తమ ప్రయత్నములు వ్యర్థమని మరలిపోవును. ముందువెనుక లాలోచించుకొనుము" అని కొంత యుత్సాహముతో వచ్చజెప్పెను.

రుద్రభట్టు చేసిన తత్త్వోపదేశము కొంతవరకు దండపాణి మతిని మార్చెను. పిమ్మట విజయసేనునిదే కాశ్మీరరాజ్యమని చిత్రభానుడు వక్కాణించినతోడనే దండపాణి మనస్సు సంపూర్ణముగ మారెను. విక్రమసేన హర్షవర్ధనులు తన యల్లుని సింహాసనారోహణమున కంతరాయము గలిగించునట్టి కంటకములని వారికిం దోచెను. ఆత్మలాభపరాయణత వాని మనస్సులోనున్న కృతజ్ఞతను రాజభక్తిని జాలిని ద్రోసివైచి యాస్థానము నాక్రమించెను. అతని హృదయమప్పుడు రాయియైపోయెను. అప్పుడతడు—"సరే! మీచిత్తము వచ్చినట్లు చేసెద. ఏనాడు నేన మీవశము జేసితినో యానాడే నాశరీరము గూడ మీవశము జేసితిని. ఈచేతులుమీవి. వీనిచేత మీయిచ్చవచ్చినపని జేయించుకొనుడు" అని యుత్తర మిచ్చెను.

అప్పుడు చిత్రభానుడు సంతసించి వానిం గౌగలించుకొని— "మిత్రుడవన్న నీవే మిత్రుడవ" ని ప్రశంసించెను. "దండపాణి వంటి మనుష్యుడు ప్రపంచమున మరియొకడు లేడ" ని రుద్రభట్టు కొనియాడెను. అప్పుడు చిత్రభానుడు వెండియు నాతని కిట్లనియె— "నీవు రేపుదయముననే పొమ్ము, అక్కడ కీర్తివర్మ యున్నాడు. అతడు నీకీవిషయమున దప్పక తోడుపడును. వాడు మనకు విధేయుడు. కార్యశూరుడవైన నీకు నేను వేరు చెప్పనక్కరలేదు. నీకు శుభమగుగాక! పొమ్ము" అంతట రుద్రభట్టునకు నమస్కరించి చిత్రభానునికడ సెలవుగైకొని పోయెను.

# ఇరువది ఆరవ ప్రకరణము

దండపాణి వడిగా బయనముచేసి రాజకుమారులు వసియించు కొండకోటకు మిక్కిలి సమీపమునను న్న ఒక పల్లియం జేరి అందలి గ్రామాధికారియింట విడిసి తన రాక రాజపుత్రులకు దెలియకుండ శక్తివర్మను బిలుచుకొని రమ్మని యొక సేవకు నంపెను. వాడును సత్వర మరిగి సేనాధిపతి సెలవైనదని రహస్యముగ దెలిపి శక్తివర్మం దోడ్కొనిపోయెను. దండపాణి వానిం జూచి సముచిత సత్కార ములు జేసి పరిజనంబునంతను నావలకంపి వాని నొక గదిలోనికి బిలుచు కొనిపోయి చిత్రభానుని శాసనంబున దాను గావింపదలచిన దారుణ కర్మ మతని కెరిగించి తనకు సాయము జేయుమని కోరెను.

ఆ నుడువులు చెవిని బడినతోడనే శక్తివర్మ భయంబును విస్మయంబును మనంబున బెనగొన దండపాణి కిట్లనియె—" అయ్యా ! నీవు పిల్లలుగలవాడవు, నేనును బిడ్డలం గన్నవాడను. కటికవాడైన జేయ వెరచు నీఘోరకృత్యమును నీవు స్వయముగా జేయ నెట్లు వచ్చితివో నేనూహింప జాలకున్నాను. మిక్కిలి యల్పపదవిలోనుండి మిక్కిలి యున్నతపదవికి నిన్ను దీసికొనివచ్చి నీవృద్ధి కెల్ల గారణమైన హేమచంద్రుని దలచియైన నీపని మానవచ్చునే ! బెబ్బులిబారినుండి నిన్నును జలగండమునుండి నీకొడుకును బ్రతికించిన విక్రమసేనుని దలంచియైన నీ క్రూరకర్మము మానవచ్చునే ! అనాథయై దిక్కుమాలి విలపించుచున్న యరవిందాదేవిని స్మరించియైన నీపాపకర్మమునకుం బోలగగ వచ్చునే ! ముద్దుల మూటగట్టు నాబిడ్డల చక్కదనమును సౌకుమార్యమును జూచియైన నీదుష్కార్యము విడువ వచ్చునే ! ఆ కుటుంబముతో జిరకాలసంబంధము గలిగి వారివలన బాగుపడిన నీకు నిప్పని సేయుటకు మన స్సెట్లు లొప్పినయ్యా ? నీమన సొప్పిన నొప్పుగాక ! ఇట్టి దుష్కార్యమున నీకు నేదోడుపడజాల. నాయుద్యో గమునుండి నన్ను రాజు తొలగించినను సరే—నాకు మరణదండన

విధించిననుసరే— నేనిప్పని యొల్ల. రాజకుమారవధము జేసి ఆ నెత్తుటి కూడు దినుమనుటకంటె నాకలిచే జచ్చుట మంచిది. చావలేకున్న బిచ్చమెత్తి బ్రతుకుట మంచిది. గోచిపెట్టుకొని అడవిలో ముక్కు-మూసికొని తపము సేయుట మంచిది. అంతేగాని యీపని నేజేయజాలన" ని కూర్చున్న చోటునుండి చివాలున లేచి నిలిచెను.

దండపాణియు దన పీఠమునుండి లేచి శక్తివర్మ చేయిపట్టుకొని- "ఓయీ! నీమాటల ఫలమేమో నీవూహింపలేకున్నావు. రాజాజ్ఞా తిరస్కారము కోడెత్రాచుతో జెరలాటము వంటిది. అది కత్తిమీది సాము. నిప్పులు కొంగున గట్టుకొనుట. జాగ్రత్త! అతడలిగినా నీశిరచ్ఛేదము జేయింపక మానడుసుమీ!" యని బెదరించెను.

"ఇటువంటి సత్కార్యమున శిరస్సు పోయినను మంచిదే. నీబిభీషికలకు నేను భయపడువాడనుగాను. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో యట్లు జరుగుగాక!" యని శక్తివర్మ యవ్వలకు బోయెను. పోయి యతడు తనకు ప్రాణమిత్రుండు రక్షకభటులలో ముఖ్యుడు నయిన చండుని బిలిచి తనకును దండపాణికిం జరిగిన సంభాషణ మంతయు రహస్యముగ నెరింగించి కర్తవ్యమేమని యతని నాలోచన మడిగెను. చండుడు శక్తివర్మవలెనే దుష్కార్య విముఖమయిన చిత్తవృత్తి గలవాడగుటం జేసి యతడు చేసినపని ప్రశస్తముగా నున్నదని ప్రశంసించెను. "మిత్రుండా! నీవు మెచ్చుటం జేసి నాకెంతో ధైర్యము వచ్చినది. అట్లయిన మనకు రాదలచిన యుపాయము దప్పించుటకయి నాకొక యుపాయము దోచుచున్నది. అది వినుము" అని శక్తివర్మ చండుని చెవిలో రహస్యముగా గొంతసేపు గుసగుసలాడెను.

అంతలో సాయంకాలమయ్యెను. కాలపురుషుని శరీరమందలి వ్రణమువలె సూర్యబింబ మెర్రనై పశ్చిమాద్రి సంగమమున గానబడియెను. ఆ వ్రణమునుండి దొరంగు క్రొన్నెత్తురో యన సంధ్యారాగము కెప్పెర్రనై దెసలవ్యాపించెను. వ్రణబాధచేత గాలపురుషుండు మూల్గుచున్నప్పుడు గల్గు ధ్వనియో యన గూడుల జేర బాలువులుగుల

మొలుగు లెసంగెను, నెత్తురు గడిగివైచి కాలపురుషుని పానుపుపై బరచిన నల్లదుప్పటియో యనునట్లు కారుచీకటులు విశ్వమంతయు వ్యాపించెను. వ్రణాసంబంధమయిన దుర్గంధము పొడమకుండ నా పానుపైన వయిచిన హారతి కర్పూరపు బలుకులో యనునట్లు నభోభాగమున నక్షత్రములు విరాజిల్లెను.

విక్రమసేన హర్షవర్ధనులు సూర్యాస్తమయము మైనతోడనే పరమేశ్వరుని హృదయపీఠమున నునిచి ధ్యానముచేసి మాతృవియోగదుఃఖమున నన్నముసరిగా రుచింపకున్నను నేదో విధముగా సేవకుల వేడికోలుచే గొంచెము భుజించి పడకగదిజేరి యేదో యాలోచించుకొనుచు నొండొరులతో బలుకక యూరకుండిరి. కొంత సేపటికి "తమ్ముడా ! ఏమిటి నీ వాలోచించుకొనుచున్నావు ?" అని విక్రమసేనుడు హర్షవర్ధను నడిగెను.

"అన్నయ్యా ! మరేమియు లేదు. నిన్నరాత్రి మనయమ్మ కనబడినట్లు, నా చెక్కిలి నొక్కి ముద్దాడినట్లు, ఇంత చిక్కిపోయినా వేమితండ్రీ యని నన్నడిగినట్లు నన్నుజూచి కన్నీరు వెట్టుకొనినట్లు నే కలగంటిని. అందుచేత నే నుదయమునుండి విచారముగా నున్నాను. భాష్పపూరితమయిన మనయమ్మ మొగము నా కిప్పుడుగూడ గనబడుచున్నది. అన్నయ్యా ! ఇక మన యమ్మ మొగ మెప్పుడు జూడలేము గదా ? ఆమె యొడిలో దలపెట్టుకొని పండుకొను భాగ్యము కలుగదు కదా ! నిండారు ప్రేమతో నామె మనకు బసిడిగిన్నెలో పాయసము పెట్టించి యారగింపుమని బతిమాలు సుఖదినంబులు రావు గదా ! ఆహా ! అన్నయ్యా ఎన్నడు తల్లితో గలిసియుంటిమో యెన్నడు సుఖపడితిమో యవన్నియు స్వప్న వృత్తాంతములే యయ్యెను." అని బదులుచెప్పి వెక్కివెక్కి యేడ్చెను.

విక్రమసేనుడు తొట్రుపాటుతో దన మంచముమీదినుండి లేచి తమ్మునికడకు బోయి తమ్ముని మంచముమీద గూర్చుండి వెనుకప్రక్కనుండి రెండుచేతులుచాచి తమ్ముని కౌగిలించి "నాయనా

విచారింపకుము. కలిమి లేములు కావడికుండలు. ఐశ్వర్యమనుభవించి కష్టమువద్దన్న బోవునా! సుఖదుఃఖములు దివారాత్రములు వలె బర్యాయమున వచ్చుచుండును. వానిని వారించుట కేరికిం దరము గాదు. ఇక నిమ్మను జూచుభాగము మనకు గలుగదు. ఏమన భర్తృవియోగముచే నిదివరకే యామె కృశించి యున్నది. ఈ పుత్రశోకమున నామె యీపాటికే మృతినొందును. చిత్రభానుడు మనల గూడ బ్రతుకనియ్యడు. ఏదో యుపాయమున మనలంగడతేర్చి సింహాసన మెక్కుటకై యతడు ప్రయత్నించుచుండును. అందుచే మనకష్టములు చాలకాల ముండవు. బంధమునుండి గాకపోయినను దేహబంధమునుండి మనకచిరకాలములో విముక్తి కలుగును. అదియును మేలే. ఈ జీవస్మరణముకన్న నిజమైన మరణమే మనకు మహోపకారము గావచ్చును" అని విక్రమసేనుడు పలుకుచుండ నంతలో దండపాణి వీధిగుమ్మము కడకు బోయెను. సింహద్వారముకడ చండుడు శక్తివర్మయు నేదో మాటలాడుచుండిరి. దండపాణిం జూచి వారిరువురు లేచి నిలిచిరి. "శక్తివర్మా! నీనిశ్చయము మారలేదు గదా?" యని యతడడిగెను. "అయ్యా! మిమ్ము విడిచివచ్చినపిదప నేను ముందువెనుక లాలోచించుకొని నీకు దోడ్పడుటకే నిశ్చయించుకొంటిని. ఈవరకు నాచేసినతప్పు క్షమింపుడు! ఈ చండుడుగూడ మనకు సాయపడును" అని శక్తివర్మ బదులు చెప్పెను.

"శహబాస్! మంచిపని చేసితివి. రా నావెంటరా. తలుపు దీయుము" అని దండపాణి చెప్పెను. అప్పుడు శక్తివర్మ తాళముదీసి తలుపు తెరచెను. రక్షకభటులు లోపలి సేవకులు గాఢనిద్రం దగిలి యుండిరి. చండుడు శక్తివర్మ వెంటరా దండపాణి లోనబ్రవేశించి తలుపులు బిగించి—"చండుడా! ఈ గృహావరణమున నీవొక గోయి త్రవ్వి సిద్ధముగానుంచుము. బాలుర నందు వెంటనే పూడ్చిపెట్ట వలయును" అని యానతిచ్చెను. వాడట్లుకాకయున దొడ్డిలోని కరిగెను. తలుపు చప్పుడువిని—"యిప్పు డిచ్చటి కెవ్వరు వచ్చు

చుండుర" ని వారు సంశయపడుచుండ మిణుకు మిణుకు మను దీపపు వెలుంగున నెవరో మనుష్యులు వచ్చుచున్నట్లు గానబడెను. "నేను దండపాణిని; ఇతడు శక్తివర్మ" అని కఠిన స్వరముతో మాట వినబడెను "ఓహో! దండపాణియా? ఏమిది మామీద నింతదయ వచ్చినది? చిన్ననాయనగారు మా సేమమరసి రమ్మని మిమ్ము బంపిరా? లేక కార్యాంతరములమీద నీప్రాంతములకువచ్చి పూర్వ ప్రేమచే మాకుశల మరయుటకు మీరే స్వయముగా వచ్చిరా? ఎట్లైననేమి! మీరాకవలన మాకిప్పుడు పంచప్రాణములు లేచి వచ్చినవి. ఎల్లచుట్టములం జూచినంత యానందము మాకిప్పుడు కలుగుచున్నది ఓహో! ఇది యెంతసుదినము? నేటి ప్రాతఃకాలమున మే మెవ్వరి మొగము జూచితిమో కాని మీదర్శన లాభము గలిగినది. రమ్ము! రమ్ము! ఈ పానుపుమీద గూర్చుండుము. మాయమ్మ సుఖముగా నున్నదా? మావియోగదుఃఖమున మేనువిడిచినదా?" యని విక్రమసేనుడు వానిని సబహుమానముగా గారవించి పలికెను. తల్లి సేమముగురించి యేమి చెప్పునో యని వినుటకై హర్షవర్ధనుడు మిక్కిలి తత్తరపడుచుండెను. అప్పుడు దండపాణి పరుషస్వరముతో— "మీయమ్మ యెట్లున్నదో నేనెరుగను. చిత్రభానుడు పంపుటచేత నేనిక్కడకు వచ్చితిని" అని బదులు చెప్పెను.

"ఆహా! మాచిననాయన దయార్ద్రహృదయుడై మమ్ము బంధవిముక్తుల జేయుమని నిన్నంపెనా? మాకు మేలుదినములు వచ్చినవా? కాని మాయమ్మ యెక్కడనున్నదో నీ వెరుగవా? మాతాత మహేంద్రదేవు డామెను దీసికొనిపోయెనా?" యని విక్రమసేనుడు కొంత సంతోషముతోను గొంత విచారముతోను బలికెను. "ఆహా! దేహబంధ విముక్తుల జేయుమని మీచిననాయన నన్ను బంపినాడు" అని తనలో ననుకొని దండపాణి బహిరంగముగా నిట్లనియె—

"కుమారులారా! నేను మీకిప్పుడు గొప్పయప్రియము దెలుప వచ్చితిని. నేను మిక్కిలి మందభాగ్యుడను ఘోరవార్త తెలుపుట

ఘోరకృత్యము సేయుటకు నాపాలబడినది. ఇది రాజశాసనమగుటచే జేయకతప్పదు. నేను చెప్పుట కెంతో శంకించుచున్నాను—" అనవుడు విక్రమసేనుడు చిన్నవోయి మెల్లగా—" అయ్యా! మీరు చెప్ప దలచినది చెప్పవచ్చును. చేయదలంచినది చేయవచ్చును. మీ కార్యము వలదనువారు లేరు. అడ్డగించువారు లేరు." అని పలికెను. హర్షవర్ధనుడు నిశ్చేష్టుడై కూర్చుండెను. అంతట దండపాణికిని విక్రమసేన హర్షవర్ధనులకు నీక్రింది విధముగా సంభాషణ జరిగెను.

దండ—కుమారులారా యీ రాత్రి మిమ్మిద్దర సంహరింప వలసినదని చిత్రభానుడు నన్నుబంపె.

విక్ర—ఆఁ! ఆఁ! సంహరింపుమనియె పంపెనా?

హర్ష—అయ్యో! తల్లీ! (అని పాన్పుపై మూర్ఛవోయెను)

విక్ర—అప్పని చేయనిశ్చయించి నీవు వచ్చితివా?

దండ—ఆహా! నిశ్చయించుకొనియే వచ్చితిని. (అని యొర నుండి కత్తిదీసెను)

విక్ర—ఈ ఘాతుకకృత్యము జేయ మనసొప్పినదా?

దండ—మనసొప్పిననేమి, యొప్పకున్ననేమి? రాజాజ్ఞ చేయక తప్పదుగదా?

విక్ర—ఎవడు నీ రాజు? నేను కానా?

దండ—చిత్రభానుడు మా రాజు నీవు కావు. నీవు కారా గృహవాసివి.

విక్ర—ఎవడు నన్ను కారాగృహవాసిని జేసినది? ఎవడు నన్ను రాజ్యభ్రష్టు జేసినవాడు?

దండ—నీ పినతండ్రి చిత్రభానుడు.

విక్ర—అయ్యో! దండపాణీ! నీనోట నెటువంటి నిష్ఠురోక్తులు వినవలసివచ్చెను. నా తండ్రి మరణమునకు గారణభూతుడయిన మా పినతండ్రి మాయలలోబడి నీవు నీ రాజునుజంపవచ్చితివా? చిన్నికుమా రులమనియైన సందియములేదా నీకు? అగతికులమన్నమాట యయిన

నీకు దోచలేదా? నీది హృదయముకాదా? నీవు మానవుడవుకావా? ఘాతుకమృగంబవా? దానవుడవా? ఘాతుకమృగములు సయితము తమజాతి మృగములజోలికిఁ బోవు. దానవులు వైరములేకుండ దమ తోడిదానవుల దుదముట్టింపరు. నీకు నాకు నెందైన వైరమున్నదా? నిన్నెన్నడైన నే దూలనాడితినా? నీ మనసు నొచ్చునట్టి పరుషోక్తు లాడితినా? నీ కార్యములకు నే నాటంకము గల్పించితినా! ఏలనాపై నీకింత నిష్కారణ క్రోధము? ఏల యింతనిర్దయ? నీ హృదయము పుష్ప సుకుమారమైనదే' ఇంతకఠిన మెట్లయ్యెను. ఈకాఠిన్యము మున్నెన్నడు నే జూడలేదే! నామీఁద నీవు చూపెడు నా దయారస మెందుబోయె? ఆ ప్రేమపూర్వక భాషణంబు లెందరిగె? అయ్యో! దండపాణీ! నీ వెంతలో నిట్లుమారితివి? నీహృదయము మారినను నా హృదయము నీ దెస మారలేదు. నీవు నాకు నెనుకటి దండపాణివై యున్నావు. నాఁడు వేటలో బెబ్బులి గొబ్బున నీపై బడుచుండ విసవిస వెంట నమ్మెదొడిగి నేను దానిం గూలనేసి నీ ప్రాణము రక్షించినప్పుడు నీపై నాకెట్టి ప్రేమగలదో నేఁడును నాకట్టిప్రేమయే కలదు, నేను మహారాజనందనుఁడ నయ్యు, కుసుమసుకుమారుడనయ్యు నత్తరి విలువగల దువ్వలువలు నాల్చియున్న వాడనయ్యు, జెరువులోబడి మునుకలు వేయుచు ప్రాణములు గోల్పోవసిద్ధముగానున్న నీ కొమరుని గాపాడుటకై చెరువులో నురికిననాడు నీపై నాకెట్టి కూర్మిగలదో నేఁడు నట్టి కూర్మియే గలదు. ఈ హృదయము నీ హృదయమువంటిది కాదు. కాకపోయినందుకు దీనిని దప్పక దండింపవలయు. కావున నీ చేతిలో దీపపువెలుగున దళదళ మెరయుచున్న నీ ఖడ్గపుగొనతో ముందుగా నా హృదయముం బొడిచి దాని నీవలకు దీయుము, ఇదిగో! నా హస్తము. నాఁడు బెబ్బులిని నీ నిమిత్తమై కోలం గూలనేసిన హస్తమిది. నీ కరకుగత్తితో నీ చేతిని ముందుగా నరకుము. నీ కుమారుని నిమిత్తమై ముందువెనుక లాలోచించకుండ జెరువులోబడిన యీ శరీరమును నీ వాఁడికత్తితో దుత్తునియలు చేయుము. ఇదిగో! నా శరీరమును నీ కప్పగించుచున్నాను.

అంతలో నతని చేతి కత్తి పిడిదగ్గర జమట పట్టుటంజేసి యా ఖడ్గము జారి క్రిందబడెను. అప్పుడు విక్రమసేనుడు మరల సంభాషణ మందుకొని యిట్లనియె—

"దండపాణీ! సంపూర్ణజ్ఞానముగలిగి, చైతన్యముగలిగి, యుక్తాయుక్తవివేకముగలిగి, ఘాతుకకృత్యము చేయదలచి వచ్చిన నీకన్న చైతన్యశూన్యమైన యీ కత్తియే మంచిదని తోచుచున్నది. ఈదుష్కార్యము చేయజాలక కాబోలది క్రిందబడెను. అయినను నీవు చిత్రభానున కెట్లు వశవర్తివో యీ కత్తియు నీకట్లు వశవర్తిని యగుటచే మాపినతండ్రి చెప్పిన చొప్పన నీవు చేయదలచుకొనినట్లే, నీవు సేయుమన్న ట్లీకృపాణియు జేయుదలచుచున్నది. నాప్రాణముల మీద నాకంత యాసలేదు. ఈ కారాగృహావాసముకన్న స్వర్గలోక వాసమే నాకు సౌఖ్యప్రదము. అచ్చట మాతండ్రి తోడనే నేగూర్చుండెదను. మాపినతండ్రివలన భయము లేనిచోట దండపాణి ఖడ్గమునకు ప్రచారము లేనిచోట రాజద్రోహులు లేనిచోట ధనముకై యెట్టి ఘాతుకకృత్యమైన జేయనొడంబడెడు నీచులు లేనిచోట నేను సుఖముగా నుండెద. కాని యదిగో నీయెట్టయెదుట నామంచముపై మూర్ఛిల్లియున్న యాపసిపాపని నాగారాబు తమ్ముని హేమచంద్రుని రెండవపుత్రుని నరవిందాదేవి ముద్దులపట్టిని సకలజన నయనానంద కరుని నిండుచంద్రునకు వన్నెలుదిద్దగల మొగముగలవాని చక్కెర విల్తుని దలపించు చక్కదనమువాని నీవెన్నిసారులో జిన్ననాట నెత్తికొని ముద్దులాడినవాని, మాహర్షవర్ధనుని బ్రతికింపుము. మాతండ్రి నిమిత్తమై యాతనిని జీవింపనిమ్ము, మహా శోకసముద్రమునమున్న మాతల్లినిమిత్తమై యాతనిని బ్రతికియుండనిమ్ము. నానిమిత్తమై యతనిని జీవింపనిమ్ము. హేమచంద్రుని వంశము నిర్మూలముగాకుండ నీమొలకకు నీదయారసముపోసి పెంచుము. ఈతడు మీచిత్రభానుని రాజ్యమున కడ్డురాడు. వానికి సన్న్యాసమిప్పించి వనాంతరముల కంపుము. ఇదిగో! వానిని బ్రతికింపుమని చేతులు జోడించి నీపాదము

లకు మ్రొక్కుచున్నాను. నీవు బాసచేసితివేని నేను సుఖముగా శరీరము బాయుదును. నాకు నీకడగల చనవు పెంపున నీవరమిమ్మని నిన్ను వేడుకొనియెద."

దయనీయములైన యాతని పలుకులు శక్తివర్మ హృదయమును గరగించి కన్నీరు స్రవింపజేసెను. కాని స్వలాభపరాయణతచే శిలీభూతమైన దండపాణి హృదయమునుమాత్రమవి కరగింప లేక పోయెను. "విక్రమసేనా! నీవేడికోలు నిష్ప్రయోజనము. చిత్రభానునియాన నేను సంపూర్ణముగా జెల్లింపవచ్చితిని. మీయిరువురం జంపిగాని నేనిచ్చోటు విడువ. నీతమ్మునిచావు నీవు చూడలేవు గావున ముందు నిన్నే వధించెద. నేను సగము సగము పనులు చేయువాడనుగాను" అని దండపాణి ప్రత్యుత్తర మిచ్చుచుండ నంతలో హర్షవర్ధనుడు మూర్ఛదెలిసి—"అన్నయ్యా! అన్నయ్యా! బ్రతికియున్నావా! అన్నయా! అన్నయ్యా! నన్నొకసారి కౌగలించుకొనుము" అని కోరెను.

విక్రమసేను డట్లు చేయుట కటుపోవుచుండ దండపాణి వాని నాపి—"కౌగలింతలు గివుగిలింత లిప్పుడెందుక" ని బిగ్గరగా బలికెను. అప్పుడు హర్షవర్ధనుడు మెల్లగాలేచి—"దండపాణీ! మాయన్నను జూడకుండ నజీవింపజాలను. నాకీ బ్రతుకుమీద నేవ పుట్టినది. కావున నన్ను జంపి మాయన్నను బ్రతికింపుము మాయన్న చాల మంచివాడు, చదువుకొన్నవాడు, నాకడపటిప్రార్థన మంగీకరించి వానిని జీవింపనిమ్ము. వానికి మీరాజ్యమక్కర లేదు. ఏగాంధారదేశమునకైన బోయి బ్రతుకున" ని కేలుమోగిచి మ్రొక్కెను. "ఓహో! అన్నను బ్రతికింపుమని తమ్ముడు, తమ్ముని బ్రతికింపుమని యన్న ప్రార్థనలు చేయునారంభించిరా! మీ టక్కరితనములు నాకడ సాగి రావు మీ పంచాంగము కట్టిపెట్టుడు." అని దండపాణి నిష్ఠురముగా బలికి హర్షవర్ధనుని దనచేతితో నొక ప్రక్కకు నెంటి "శక్తివర్మా వీని నావలి కీడ్చుకొనిపో" యానతిచ్చెను. శక్తివర్మ యా బాలునిం

బట్టుకొని ప్రక్కనున్న మరియొక గదిలోనికి తీసికొనిపోయి లోపలబెట్టి తలుపువైచెను.

"అయ్యా! అయ్యా దండపాణీ! అయ్యా! శక్తివర్మా! కడపటిసారి మా యన్నను గౌగలించుకొననిండు కడపటిసారి మా యన్న ముఖారవిందము జూడనిండు! చివర కతని సన్నిధినే నన్నుండనిండు!" అని హర్షవర్ధనుడు మొరపెట్టజొచ్చెను.

"దండపాణీ! దండపాణీ! ఒక్కనిమిషమాగుము. ఒక్కసారి నన్నావలి గదిలోనికి బోనిమ్ము. ఒక్కసారి నా తమ్ముని నాలింగనము జేసికొననిమ్ము! ఒక్కసారి వానిని ముద్దాడనిమ్ము. అధమపక్ష మీవరమయిన నాకు దయచేయుమయ్యా! నీకెంతో పుణ్యముండును." అని విక్రమసేనుడు ప్రార్థించెను.

"చాలుచాలు! నీ కలాపము గట్టిపెట్టుము. పండుకొనుము. ఇప్పుడే ముందుగా నీ శిరఃకర్తన మాచరించెద" నని దండపాణి పలుకుచుండ నంతలో గోయిత్రివిక్రమ చండుడచ్చటికి వచ్చెను. "చండా! శక్తివర్మా! వీనిని నేలబడవయిచి కాలుసేతులు పట్టుకొనుడు" అని యాతడానతిచ్చెను. "అయ్యా! నన్ను బలాత్కారముగా బండుకొనబెట్ట నక్కరలేదు. నా కాలుసేతులు పట్టుకొననక్కరలేదు. నేనీ సమయమున గూడ మీ కేవిధమయిన కష్టమును గలిగింపను ఇదిగో! పండుకొనుచున్నాను" అని విక్రమసేనుడు నేలబండుకొని చేతులు జోడించి—"నారాయణా! నారాయణా! నారాయణా!" యని హరినామస్మరణ చేయుచుండెను. దండపాణి ఖడ్గమునెత్తి యే ప్రక్కనుండి గొట్టిన నొక్కయేటున శ్రమలేకుండ దల తెగిపడునో యా ప్రక్కను నిలిచి ఖడ్గ మెత్తెను. అంతలో శక్తివర్మ కనుసన్న సేయు వెంటనే చండుడు దండపాణి మెడలో నొక త్రాడు తగిలించి త్రాడు కొననున్న యుంగరములోనుండి రెండవకొన పోనిచ్చి శక్తికొలది లాగెను.

ఇది రెప్పపాటుకాలమున జరిగెను. లాగినతోడనే చేతిలోనున్న కత్తి చేతిలోనుండగానే దండపాణి 'ఆ! ఆ!' యని మూల్గుచు గురక

విడుచు వెనుకకు బడెను. నిముసములో నతని ప్రాణముపోయెను. కన్నులు మూసికొని హరిధ్యానము సేయుచున్న విక్రమసేనుడు కన్నులు తెరచి చూచునప్పటికి శక్తివర్మయు జండుడును నేలబడి యున్న దండపాణిని దలయొకరు, పాదములొకరు బట్టుకొని యావలకుం గొనిపోవుచుండిరి.

అన్నయ్యా! అన్నయ్యా! యని యావలిగదిలోనుండి హర్షవర్ధనుని మొరలతని చెవిలో బడుచుండెను. విక్రమసేనుడు లేచి కూర్చుండి భయవిస్మయ సంభ్రమంబులు మితిమీరి పరవశుని జేయ నేమిదియని యడుగజాలక గ్రుడ్లప్పగించి చూచుచుండెను. చండుడును శక్తివర్మయు దండపాణి కళేబరమును బాలుర నిమిత్తము త్రవ్వియుంచిన గోతిలో బడవయిచి పూడ్చిరి.

పరమేశ్వరుని లీల లెవ్వడు గ్రహింపగలడు? ఆత్మలాభపరాయణుడై యధర్మమనక యకార్యమనక ఘాతుక మృగములీల రాజనందనుల ప్రమాదింపదలచి వచ్చిన దండపాణి కృపాణినైన నెత్తక మునుపే యసువులుబాసి క్షణములో దండధరుని వీటికి విందయ్యెను. ఉత్తరక్షణము మనదిగాదని పెద్దలు చెప్పుమాట నిశ్చయముగదా! మానవుడు తన మనంబున నాకసంబున మేడలుగట్టి పదునాల్గు లోకముల బాలింప జూచుచుండును. దైవము వాని సంకల్పముల విఫలముల జేయుచుండును.

అట్లు వారిరువురు దండపాణిని మహీగర్భమునబూడ్చి రాజనందనులకడకువచ్చి గదితలుపుదీసి హర్షవర్ధను నీవలకు దీసికొనివచ్చి— "కుమారులారా! దండపాణి తాను త్రవ్వుకొన్న గోతిలో దానే పడెను. ఆ దురాత్ముని పాపమే యాతని జంపినది. మీరింక లెండు. మిమ్ము చెరనుండి విడిపించి యావలకు దోడుకొని పోయెదము. మీరు మావలన నెట్టి యుపాయమును శంకింపకుడు. మేము రాజభక్తులము, మీపాదసేవకులము. చిత్రభానుని దుండగములు మేము సహింపజాలక వానిచే ప్రేరితుడై మిమ్ము వధింపవచ్చిన దండపాణిని దుద

ముట్టించితిమి. మిమ్ము సురక్షితముగా గాంధారదేశమునకుం గొంపోయెదము. మీాద దైవమున్నాడు. మనభాగ్యము సరిగా నుండు నెడల భాగ్యవర్ధనుడు మీారు దోడుపడవచ్చును. ఇచట నాలస్యము చేయుటకు వీలులేదు. రండు! సేవకులు మేలుకొనకమును పే పోవుదము."

అనవుడు నక్కుమారులు—"శక్తివర్మా! మీాయిష్టము వచ్చి నట్లు చేయుడు" అని బదులు చెప్పిరి. అంతట శక్తివర్మయు చండు డును వారిచేతులు బట్టుకొని నిశ్శబ్దముగా నావలకు దోడ్కొని పోయిరి. అప్పటికి రెండుజాముల రాత్రి యయ్యెను. సేవకులలో నెవ్వరు మేలుకొనలేదు. చప్పుడు గాకుండ దలుపువైచి వారు నలుగురు నాగాఢాంధకారమున బైలుదేరి మెల్ల మెల్లగా నడచి తెల్లవారు నప్పటి కొక యామడపోయి యొక పల్లియ జేరిరి. ప్రాతఃకాల కృత్యము లచ్చట దీర్చుకొన్నపిదప శక్తివర్మ చండుని బిలుచుకొని పోయి రహస్యముగ నిట్లనియె—"రాకొమరులును, దండపాణియు, నీవును నేనును హఠాత్తుగా నదృశ్యుల మైతిమని కావలివాండ్రు నేటి యుదయమున దెలిసికొని భయంపడి వడివడిగాబోయి చిత్రభానున కెరిగింతురు. దండపాణి బిడ్డలం జంపక తన్ను వంచించెనేమోాయని శంకించి యా రాజు బిడ్డలను మనలను వెదకుటకై నలుదెసలకు సేనల నంపును. అత డావలించినవారి ప్రేవు లెంచును. మనము పట్టుబడితిమా భంగము వాటిల్లు కావున నీవు చిత్రభానుని కడకు బోయి యాతనిం దప్పుదారిం బెట్టుము, ఈ విధముగా నతనితో జెప్పుము" అని యాతని చెవిలో నొక రహస్యము చెప్పి పొమ్మని యెను. చండుడును నతని యుపదేశము మంచిదేయని రాజసుతులం జూచి—"తక్షశిలలో నేను మెండియు గలిసికొనియెద. మీారక్కడ నుండుడు" అని చెప్పి వారిని వీడ్కొని పోయెను.

విక్రమసేనుడు చండ శక్తివర్మలకు దన కృతజ్ఞతం దెలిపి— "ముందు జేయువలసినపని యేమ"ని శక్తివర్మ నడిగెను, "గాంధార

దేశమున కరిగి భాగ్యవర్ధనుని సాహాయ్య మడుగుట సమంజసము" ని యతఁ డుత్తరము జెప్పి వారి నందు కొడంబరచి దారిబత్తెము నిమిత్తము విక్రమసేనుని మేనిమీఁదనున్న యాభరణంబులలో నొక దానిని విక్రయించి రొక్కము చేబూని వారి యన్నపానాదులకు గరవు లేకుండ జేసి మార్గాయాసము లేకుండ బండ్లమీఁద నెక్కించి వారి మనఃఖేదములు బాపుటకు వినోదములైన కథలు జెప్పుచు గ్రామాంతముల చిత్ర చిత్రములైన యాచార వ్యవహారములం జూపుచు బయనము చేయించుచుండెను.

కొండకోటకడ గావలియున్న సైనికులు వంటవాండ్రు మొదలగు పరిచారకులు బాలకులను చండశక్తిసర్మలం గానక యేదో మోసము జరిగినదని చండశాసనుఁడగు చిత్రభానుని యలుకకు భయపడి తమలో నొక పెద్దం బిలిచి యువ్వార్త రాజునకు విన్నవింప బనిచిరి.

## ఇరువది యేడవ ప్రకరణము

"ఈ పాటికి దండపాణి గ్రామదేవతకు మేకపోతును బలి యిచ్చిన చందమున నా దారిలో ముండ్లవలెనున్న యా డింభకుల నిరువుర నరికియుండును. బ్రతికియున్నప్పుడువలెనే యా కుర్రలిరువురు నొండొరుల కేలువట్టి యమునియింటకేఁజని యీ పాటికి బ్రాతకాపులై యుందురు. ఉయ్యాలలో నిద్రపోయినట్లు వారీ పాటికి గోతిలో బెద్ద నిద్దురపోవుచుందురు. ఇప్పుడో రేపో మాపో యాశుభవార్త నాకు రాకమానదు. ఇంక వారితల్లింగూడ దెగటార్చినంగాని నా వ్రతము సమాప్తముగాదు." అని చిత్రభాను డొకనాడు తనలో దాను వితర్కించుకొనుచుండ నంతలో ద్వారపాలకుఁడు—"దేవా! దండ పాణికడనుండి మన చండుఁడు వచ్చియున్నాఁ" డని విన్నవించెను.

సత్వరము ప్రవేశపెట్టుమని యతడాజ్ఞనొసగ జంబూడు ద్వారపాలక ప్రేరితుడై రాజదర్శనముజేసెను. చిత్రభానుడు వాని నేమడిగి దండపాణి పంపిన సందేశమేమనియడుగ నతడు వినయంబున నిట్లనియె,

"దేవా! దండపాణి విజ్ఞాపనమిది—స్వామీ! దేవరవారి యాజ్ఞానుసారముగ నేను సురక్షితముగా మంచుకొండకు బడమటి ప్రక్కనున్న మన కొండకోటజేరి, చండ శక్తివర్మల సాయమున నిరువుర బాలకుల నాకత్తి కెరజేసి, లోభి ధనమును నిక్షేపించినట్లు వారిం గోతిలోబెట్టి పూడ్చి కృతకృత్యుడనై దేవరవారి యనుగ్రహమునకుం బాత్రుముడనైతిని. స్వామికార్య నిర్వహాణ ప్రవీణుడనగుటచే నేను జరితార్థుడనైతిని. కాని పితృహీనులై యనాథులైన బాలకుల నిష్కారణముగా వధించుటంజేసి నామనస్సు మిక్కిలి దుఃఖపరవశమైయున్నది. ఈ మహాపాతకము బాపుకొనుటకు నేనును శక్తివర్మయు దీర్థయాత్రలు సలుపవలెనని సంకల్పించుచుంటిమి. ఈ మహాదోషపంకమును జగత్రయ పావనకరమగు భాగీరథీ జలమె కడుగవలయు. బదరీనారాయణసందర్శనమే మా యాత్మలకు ప్రశాంతి నొసగవలయు. కురుక్షేత్ర నివాసమే మా చిత్తసంక్షోభంబు మాన్పవలయు, సరయూనదీ జలపానమే మా హృదయములను జల్లపరుపవలయు కావున నీ మహాక్షేత్రముల కరిగి మేము పావనులమగుటకు దేవరవారు సెలవియ్యవలయునని ప్రార్థించుచున్నాము, మాళవరాజ్య సైన్యములు మన ప్రాంతముల వచ్చి విడియునప్పటికి మేము వెండియు దేవరవారి దర్శనముజేసి వారితో సమరంబు గావించెదము నేనెప్పుడు మీకు విధేయుడైన బంటనే కావున నన్ను మన్నింపవలయు' నని మహాప్రభూ! దేవరవారితో సేనాపతి మనవి సేయుమనియె"

అప్పలుకులు విని చిత్రభానుడు యనుకొన్నట్లు రాజనందనుల దండపాణి ప్రమదింపజేసినందుకు మిక్కిలి సంతసిల్లి "చండుడా! దండపాణి ఛాందసుడు రాచపుట్టుక పుట్టినవాడు రుద్రుండునుం బోలె మానవ సంహారంబు సేయుచుండు. అందుచే ననుదినము విచా

రించుచునే యుండవలయు. ఇంతమాత్రమున కతడు పశ్చాత్తప్తుడై తీర్థయాత్రలు చేయువలయునా ? ఎట్లో యతడు మనశ్శాంతి గావించు కొనుగాక !" యని యా దారుణ కృత్యమునకు దోడ్పడినందు కతడు చండున కొక ప్రశస్తమైన ముత్యాల సరమొకటి పారితోషికముగా నిచ్చెను. ఆపసదనంబు గైకొని చండుడు తన కృతజ్ఞతం దెలిపి చేతులు జోడించి తనకు గూడ తీర్థయాత్రలు సేయు కుతూహలము గలదని విన్నవించి శక్తివర్మ దండపాణులం గలసికొనుటకు సెల విమ్మని ప్రార్థించెను. అట్లకాక యని నృపతి యానతియ్య నతడు యథేచ్ఛంబని నిరంతర ప్రయాణంబుల రాజపుత్ర సమేతుడయిన శక్తివర్మం గలిసికొని తనకును జిత్రభానునకును జరిగిన సంభాషణ మంతయు జెప్పి వారల సంతసింపజేసెను. వారు నలుగురు క్రమ క్రమంబుగా నడిచి కాశ్మీర గాంధార దేశముల సరిహద్దు జేరిరి.

ఇక జిత్రభానుడు మరునా డుదయమున దన ప్రియసేవకు నొక్కని బిలిచి వాని చెవిలో నేదో రహస్య ముపదేశించెను. అది విని వాడు తన పనిమీద బోయెను. ఆ సాయంకాలమున గొండకోట కడనున్న రక్షకభటులలో పెద్దవచ్చి " రాజపుత్రులు, దండపాణియు, జండశక్తివర్మలు నాకస్మికముగ నదృశ్యులయి" రని చిత్రభానునితో విన్నవించిరి. అదివిని చిత్రభానుడు—" తద్విషయము మేమెరసెదము. మీరక్కడ గావలి యుండనక్కర లేదు. సత్వరమురండ" ని యాన తిచ్చి వానిం బంపెను. రాత్రి జాముగునప్పటికి వగర్చుకొనుచు నొక సేవకుడు పరుగు పరుగునవచ్చి తక్షణమే రాజదర్శనము కావలెనని కోరెను. ద్వారపాలకులు వానిరాక నరపాలున కెరిగించి వారి సెలవు గైకొని యా సేవకుని లోనికంపెను. అప్పుడు వాడు చిత్రభానునకు సాగిలబడి ప్రమొక్కి వెక్కి వెక్కి యేడ్వనారంభించెను. చిత్రభానుడు తొట్రుపడిన ట్లభినయించి కారణ మడిగెను. ఇంటిలోని సేవకులు, కంచుకి, జనము చుట్టుపక్కలజేరి యక్కజంపడి చూచుచుండిరి. అప్పుడా సేవకుడు వానితో నిట్లు విన్నవించెను—" స్వామీ ! ఏమని

విన్న వింతును ? విక్రమసేన హర్షవర్ధనులు శక్తివర్మతో గలిసి కొండకోటనుండి బైలుదేరి సింగముల వేటాడుటకై పరిసరారణ్యముల కరిగిరి. ఒక యాడుసింగము రెండు మగసింగములు నొక పొదలో నప్పుడే చంపి తెచ్చిన యొక యెద్దును భక్షించుచుండెను. ఆ మహావీరులు ముగ్గురు విండ్లనారితో డిగి తీవ్రబాణంబును సంధించి మూడు సింగంబులపై మూడు బాణంబుల నేసిరి, ఎరమీఁదనున్న వేమో యా సింగములు ప్రళయకాలరుద్రుడట్లు మహాక్రోధపరవశములై తమపై బడిన బాణము లెంత వేగమున బోయెనో యంత వేగమున వచ్చి ముగ్గురపై బడి తక్షణ మాముగ్గురం గడతేర్చెను. శక్తివర్మ కేమికాని మహాప్రభో ! రాజకుమారులు పోయినందుకు నేను మిక్కిలి విచారించుచున్నాను. ఇంతకు దైవనిర్ణయ మిట్లున్నది ” యని మరల నేడ్వజొచ్చెను.

అవ్వచనంబులు కర్ణంబుల సోకుటయు—“హా! కుమారులారా!” యని యతడు మూర్ఛిల్లెను. సేవకులందరు మిక్కిలి కలతనొంది హాహాకారములు చేసిరి. ఇందుమణియు గర్పూరమంజరియు లోపలి నుండివచ్చి శైత్యోపచారములు చేయించి కారణ మేమని యడిగిరి. వార్తాహారుడైన యా కింకరుడే యా వృత్తాంతము మరల జెప్పి పెద్దపెట్టున నేడ్చెను. కర్పూరమంజరి యవ్వార్తవిని యతిశోకమగ్న యయ్యెను. ఇందుమణి కన్నులనుండి బొటబొట బాష్పములు దొరగెను. సేవకు లందరు—“ కటకటా ! ఎంతకష్టము ” ని విలపించిరి. చిత్రభానుడు శైత్యోపచారమువలన నెద దేరి—“హా! కుమారులారా! మిమ్ముబాసి నేనెట్లు జీవింతునురా ! మీతల్లి యీవార్తవిని యెంత శోకించుచున్నదో కదా ? అయ్యో ! మాయన్నగారివంశమైన లేక పోయినదే. ఓ మాలదైవమా ! నాడు హేమచంద్రునకట్లు దారుణ మరణము విధించితివి. గుణరత్నాకరులు—లోకైకసుందరులు—నగు నాతని బిడ్డలనైనం జూచి సంతసించకుండ వారింగూడ నీపొట్టం బెట్టుకొంటివా ! పాపాత్ములారా ! మృత్యుదేవీ ! నీకంటికి బేలగింజయు

బెద్దయయ్యెనే ? నీయాకలి దీర్చుకొనుట కింతకన్న నీకు మరియొక జంతువు దొరకలేదా ? ఆ చక్కదనమేమి ! ఆ లావణ్యమేమి ? ఆ వినయసంపద యేమి ? ఆ విజ్ఞానమేమి ? హా ! అంతటి గుణవంతులను భగవంతుడు బ్రతుకనిచ్చునా ? అయ్యో ! మీరు సంచరించిన యీ కోటలో నేనెట్లు తిరుగనేర్తు ? ఆ కొలువుకూటములో నేనెట్లు కూర్చుండగలను ? నాయనలారా ! ఏది చూచినను మీరే జ్ఞాపకము వచ్చుచున్నారు. అయ్యో ! ఏమిచేయుదు ? విజయసేనుడితో నాకు ముగ్గురు కుమారు లనుకొంటిని. ఆ కొండకోటలో నుండవలదని నేనెన్నివిధముల బతిమాలినను యువజన సులభమైన యుత్సాహముచే వారు నామాట పెడచెవింబెట్టి యచ్చోటు విడనరైరి. విధినిర్ణయ మిట్లుండ నాపలుకులు వారికేల రుచించు ? అయ్యయ్యో ! ఆ పాడు సింగపువేట యేల వచ్చెనో ? శక్తివర్మా ! వయోవృద్ధుడవు. ప్రాజ్ఞుడవు. నీవైన నాచిన్నిపాప మృగయాక్రీడనుండి మరల్పజాలవైతివే ? మృత్యుదేవత సిగబట్టుకొని యీడ్చుకొని పోవుచుండ నీవేమి చేయగలవు ?" అని పలుతెరంగుల విలపింప దొడగెను.

అప్పు డందరు కన్నీరు విడిచినవారై అందరు హాహాయన్నవారే. కర్పూరమంజరి విషాదము వర్ణనాతీతమైయుండెను. ఆమె నిజముగా విక్రమసేన హర్షవర్ధనులు తమ తమ్ములేయని భావించుచున్నందున నివ్వార్త యామెకు దుర్భరమై యుండెను. ఆ రాత్రి యామె నిదురయేపోలేదు. జగన్మోహనాకారులైన యా యిరువురు బాలకులు చిరునవ్వులు తళుకొత్తు నెమ్మొగములతో దన యెట్ట యెదుట నిలిచి మాటాడినట్లు మనఃప్రీతికరమైన కథలు చెప్పినట్లు నామె భావింప జొచ్చెను. రెండుజాముల రాత్రి యైనపిదప జిత్రభానుడు గాఢముగా నిద్రించి ప్రభాతమున లేచి మరల దుఃఖంప నారంభించెను. గడియ ప్రొద్దెక్కు నప్పటికి రాజపుత్రుల మరణవార్త పట్టణమంతయు వ్యాపించెను. హేమచంద్రుడు మృతినొందిననాడు పట్టణ మెట్లు దుఃఖాంధకార మగ్నమయ్యెనో నాడు నట్లేయుండెను.

ప్రతిగృహమునుండి హాహాకారములు చెలగెను. చిత్రభానుడే వారిం జంపించి యుండునని కొందరనిరి. వేటలో సింగము వేటు తప్పించుకొని మీఁదబడినప్పుడు చిత్రభాను జేమిచేయఁగలఁడని కొందరు వచించిరి. తండ్రికిం గొడుకులకు గూడా దారుణ మరణమే విధి నిర్ణయించుట యాశ్చర్యమని కొందరు భాషించిరి. ఆనాఁడు చంటిబిడ్డలు, రోగులు, వృద్ధులు దక్క దక్కిన పురజనులు భోజనము లే చేయలేదనుట యతిశయోక్తిగాదు.

మరునాఁడుదయమున జిత్రభానుఁడు కొలువుకూటమున కరుగలేదు. వజ్రపాణి ప్రముఖ సేనాపతులు చిత్రభానుని సందర్శించి పరామర్శచేసిరి పురజనులలోని ప్రముఖులు గూడ నట్లు చేసిరి. చూడ వచ్చినవారి యందర యెదుట జిత్రభానుఁడు గోడ్డురచిన ట్లరచి యేడ్చుచు బహువిధముల రాజకుమారుల గుణముల ప్రశంసించుచు దన దుఃఖమును బ్రకటింప జొచ్చెను. ఆ నాటకమంతయు నెరిగియు రుద్రభట్టు తక్కినవారివలె దుఃఖోపశమన వాక్యములం జెప్పుచు నితిహాసంబులలోని గాథలు దెలుపుచు బ్రక్కన గూరుచుండెను. అది మొదలుకొని దుఃఖాతిశయమున జిత్రభానుఁడు పదిదినములు కొలువుకూటమునకు బోవనే లేదు. రాజ్యవ్యాపారముల జూడనే లేదు. రాయబారులకు దర్శన మియ్యనే లేదు. ఆలుబిడ్డలతోనైన మనసిచ్చి మాటాడ లేదు. ఇది నటనయని కొందరు, నిజమని కొందరు పురజనులు చెప్పుకొన సాగిరి.

## ఇరువది యొనిమిదవ ప్రకరణము

పాంచాల దేశాధీశ్వరుడగు మహేంద్రదేవుఁడు తన కూతురు మనుమలు మహోపద్రవ సముద్రమున మునిగిపోవుదురని మాధవసేనుఁడు తెలిపిన తోడనే వృద్ధుడయ్యు గాంభీర్యముపై దండు విడియు

టకు జిత్రభానుని దండించుటకు సమర సన్నాహము జేసెను. ఆలస్య మమృతం విషమన్నట్లు వారి సన్నాహము సిద్ధమగునప్పటికి హేమ చంద్రుని కుటుంబమునకు రావలసిన కష్టము లన్నియు వచ్చెను. అయినను వారది గుర్తెరుంగక కాశ్మీరముపై దండయాత్ర జరిపిరి. మహేంద్రదేవుడు వృద్ధుడు. ఆతనికి కొమరులు లేరు. అధికారము వహించిన యోధులందరు పరస్పర మత్సరగ్రస్తులై రాజకార్య నిర్వాహణముకన్న నొండొరులయెడగల తమ ద్వేషమునకు బ్రతి క్రియలు చేసికొనుటలో నెక్కువ శ్రద్ధగలిగి నిరంతరము దుస్తంత్ర ముల బన్నుచుండిరి. ఆ కారణమున బాంచాలసైన్యము దుర్బలమై యుండెను. మహేంద్రదేవుడు కాశ్మీరమునకుబోయి తన మనుమల దన కప్పగింపుమనియు దేశము విడిచిపొమ్మనియు జిత్రభానునకు సందేశమంపెను. చిత్రభానుడా రాయబారిని బరాభవించి తగిన యుత్తరము జెప్పకయే పంపెను. పాంచాల సేనాపతులలో గొందరు లంచగొండులై చిత్రభానునకు వశులైరి. పాంచాల కాశ్మీర సైన్యము లకు యుద్ధము జరిగెను. మహేంద్రదేవుడు యుద్ధమున బరాజితుడై రాజధానికి బారిపోయెను. రాజభక్తిగల సైనికులెల్ల దమ కోపిన కొలది పోరాటము సల్పిరి. కొంతమంది ప్రాణభీతిగల యోధులు చిత్ర భానునికోడి నలుదెసలకుం బరుగులెత్తి ప్రాణముల గాచుకొనిరి. మాధవసేనుడును భగ్నమనోరథుడై పలాయనమే శరణంబుగా జేసికొనెను. పాంచాలదేశమును గొల్ల వెట్టింపవలెనని రుద్రభట్టు నుపదేశమున జిత్రభానుడు సంకల్పించెనుగాని మహా సంరంభముతో మాళవరాజసైన్యములు దమపై వచ్చుచుండుటంజేసి యతడా సంకల్పమును వదలుకొని మకరందుని దాకుటకు సర్వసన్నాహములు సేయుచుండెను.

అంతలో మకరందుని సేనలు పొడకట్టెను. మాళవసైనికులు మహోత్సాహముతో బోరాటంబున కెదురుచూచుచుండిరి. నగరంబు నకు బడమటివైపున మాళవసైన్యములు విడిసెను. కాశ్మీరనగరము

చూచినతోడనే మకరందునకు కర్పూరమంజరి జ్ఞప్తికి వచ్చెను. తన కామెపై నెంతవలపున్నను నామెకు దనపై నెంత మక్కువ యున్నను దానామెతండ్రికి విరోధియై కాశ్మీరముపై దండువిడియుటచే నతఁడా కన్నియ దన కీయఁడనియు కన్నియయు దండ్రికిం బగతుఁడైన రాకొమరుల కేలుఁబట్టుట కిచ్చగింపదనియు నిశ్చయించి తన దురదృష్టముం గూర్చి వగచుచుండెను. మకరందుఁడు యుద్ధసన్నద్ధుఁడై వచ్చియున్నవాఁడని వినినది మొదలుకొని కర్పూరమంజరి తనపై నతని కనురాగమున్నను బగతునిబిడ్డ యగుటచే దన కేలుఁబట్టదనియు, దన తండ్రి తమ సమాగమమునకు శక్యమైనన్ని యంతరాయముల గల్పించుననియు నిశ్చయించి తన యాశ యడుగంటెనని వాపోవ జొచ్చెను

ఉజ్జయినిలో నాఁడు మకరందునకు జిత్రభానుని సందేశ మెరిగింపఁబోయిన జయంధరుఁడు మాళవరాజ స్కంధావారముతో గలిసి పయనము జేసిన పక్షమున సురక్షితముగా దన యూరు జేర వచ్చునని దాని ననుసరించి పోయి రెండుదినములు శిబిరముననుండి యాకస్మికముగా నదృశ్యుఁడై కాశ్మీర నగర ద్వారముకడ నిలిచి మకరందుని రాయబారినని చెప్పి కోటలో బ్రవేశించి క్రమక్రమంబున గక్ష్యాంతరంబులు గడచి ద్వారపాలకునిచేత జిత్రభానుని సమీపము నకు గొనిపోఁబడెను. చిత్రభానుఁడు వానిం జూచి—“మకరందుఁడు మాకేమి సందేశముల బంపెను” ని యడిగెను.

అనవుడు జయంధరు డిట్లనియె—“దేవా! ఆగ్రహింపకుందు రేని జిన్న విన్నపము జేసెద. నా చేసిన యపరాధంబు క్షమింపుడు నేను మకరందుని రాయబారినిగాను. మీ యంతఃపుర పరిచారికయైన చంద్రిక నా ప్రాణమిత్రము, ఈ సందడి సమయమున నన్ను లోపలికి మీ బంట్లు రానీయరని శంకించి మకరందుని దూతనని చెప్పితిని. చంద్రికతో నొక్కసారి మాటలాడవలయు, దేవరవా రనుజ్ఞనొసగుదు రేని యట్లు చేసిపోయెద.” అనవుడు విస్మితుఁడై చిత్రభానుఁడు—

"ఏమిరా! చంద్రిక మిత్రమువానివు? సరే! అట్లయిన దానిం బిలిపించెద నుండుము" ని చంద్రికను రావించెను. అదివచ్చి యాతని మొగము జూచి—"ఇత డెవరో నేనెరుగన" ని చెప్పెను. "అయ్యో! నన్నెరుగవటే! ఇంతలోనే మరచితివటే! మహాప్రభూ! దేవరవారే నన్ను గుర్తింపలేదా? నేను మీయింటనే పెరిగితిని. మీయడుగుల నీడనే బ్రతికితిని. మీయనుగ్రహముచేతనే వర్ధిల్లితిని. అమ్మగారు నన్నెరుగుదురు. మీయమ్మాయి నన్నెరుగును. దేవరవారు రాజ కార్యముల గొడవలోనుండి మరచిరి" అని జయంధరుడు నవ్వుచు బలికెను.

ఆ కథ కడు జిత్రముగా నుండుటచే జిత్రభానుడు కర్పూర మంజరిని నిందుమణిని నచ్చటికి రావించి యప్పురుషుని గుర్తింపుమని చెప్పెను. "అమ్మా! నన్ను మీ రెరుగరా?" యని జయంధరుడు గంఠధ్వనియు దనకు బూర్వపరిచితములైనట్లు తోప జప్పటులుచరచి—"నాయనా! ఈ విగ్రహము పురుషవిగ్రహముగాదు, మల్లికయే మారువేసము వైచికొని యిట్లు వచ్చెనని నాకు దోచుచున్నది" యని నవ్వుచు జెప్పెను. అప్పలుకులు విని చంద్రిక—"ఔనండీ! ఇది నిజముగా మన మల్లికయే. ఏమే! నీసరసము చట్టుబండలుగాను" అని దగ్గరకుబోయి తలపాగ నూడదీసెను. అప్పుడు దీపముల వెలుగున దానిమొగము విస్పష్టమై కనబడెను. "అయ్యో! నిన్ను పెద్దపులి యీడ్చుకొనిపోయి చంపెనని జంబుకుడు చెప్పె. ఎట్లు బ్రతికి వచ్చితివే!" యని చిత్రభాను డడిగెను. "స్వామీ! మనజంబుకుడు గంజాయిద్రాగి యామైకముతో బండుకొని నన్ను బెబ్బులి యీడ్చుకొని పోయినట్లు కలగనియుండవచ్చును. దానిమత్తుచేత బయనములో నాకు సాయముచేయుటకుమారుగా నాకంతరాయములు గలిగించుటం జేసి వానిని వదలించుకొని నేనావలికిబోతిని. ఆ లాహిరికాడు కలయే నిజమనుకొని తన్ను వంచించిపోయిన నన్ను గానక మీతో నట్లు మనవిచేసి యుండవచ్చును" అని మల్లిక మందహాస సుందరమైన

వదనముతో నుత్తరమిచ్చెను. అది విని నవ్వి చిత్రభానుడు—" ఓసీ ! నీయీవేసముకన్న మగవేసమే బాగున్నదే! చాలు నీవు చేసిన ప్రజ్ఞ చాలును. నీప్రజ్ఞకు సంతసించితిమి. ఈపాటికి నీవభ్యంతర మందిరమునకుఁబో !" అని మందలింప జంద్రిక దానిచేయి బట్టుకొని లోపలికి తీసికొనిపోయెను. ఇందుమణియు గర్పూరమంజరియు లోపలి కరిగిరి. పిమ్మట గొంతకాలము పరస్పర వియోగ దుఃఖమున సంతప్తలైన నెచ్చెలులకు విస్రంభ సంభాషణ మారంభమయ్యెను. అప్పుడు చంద్రిక ముందుగా నిట్లనియె—" ఓసీ! మల్లికా! నీవు మృతినొందితివని మేమతిదుఃఖముపాలైతిమి. నీనిమిత్తము బెంగ పెట్టుకొని కర్పూరమంజరి యురి పెట్టుకొన్నది. ఆయుశ్శేషముండుట చే తోడనే యది కనిపెట్టి పెద్దపెట్టున మొఱ్ఱలు పెట్టితిని నాకుయ్యాలించి వెంటనే కంచుకులు పరుగెత్తుకొనివచ్చి యీమెను రక్షించిరి. మెడ కీమె తగిలించుకొన్నతీగ త్రాడు దీయుటకైన నాకు జేతులు వచ్చినవికావు. నాయొడలు నేనెరుగను. దైవానుగ్రహమున నెట్లో బ్రతికినది."

"అయ్యో! ఉరి పెట్టుకొన్నదా? అయ్యో! ప్రాణసఖీ! ఎంతపని చేసితివమ్మా! నీవు లేనియెడల సంసార మసారము. మధ్యమ లోకము దీపరహితము. గజము జీర్ణారణ్యము. మానవుల నేత్ర నిర్మాణము నిష్ఫలము. మాకు మరణమే శరణము. లోకమును శోక మగ్నము జేసెదవా? మన్మథుని గర్వహీను జేసెదవా? నీకింత సాహసము గూడనా! నావంటి నెచ్చెలులు నీకెందరో లభింతురు. నాకొరకై ప్రాణము విడువదగునా?" యని యామె సాహసమును గర్హించి మల్లిక తన ప్రయాణ విశేషంబుల జెప్పి వారిని బ్రొద్దు పోవువరకు వలరించెను. ఆ మాటలు వినుచు జంద్రిక మెల్లగ నిద్ర పోయెను.

అనంతరము కర్పూరమంజరి మల్లికను దనకు మిక్కిలి దగ్గరగ రమ్మని పిలిచి యిట్లనియె—" మల్లికా! నిన్ను జూచి కొన్ని

మానసములే యయినను జిరకాలమునుండి చూడనట్లు కన్నులు వాచి పోయినవే. నిన్ను జూడగా నా ప్రాణము లేచివచ్చినది. హృదయము ముప్పొంగినది. మనస్సు సంతోషమున బట్టజాలకున్నది. కన్ను... [illegible] తీరినది. నీవొక్కతెవైనను వేయిమంది చుట్టములు వచ్చినట్లు [illegible] ఇంతకు గార్యసిద్ధియైనదా లేక నీ ప్రయాణమునకు దేహశ్రమమాత్రమే ఫలమా?" అని పలుక స్నేహస్నిగ్ధ భాషణముల కలికి మరల నచ్చెలి కిట్లనియె—" సఖీ! నీకు నాయెడ జిన్ననాటనుండియు నిట్టి ప్రేమయె గలదు. అట్లు నీవనుకొనుటకు నీసౌజన్యమే కారణముగాని నాయందలి గుణవిశేషముగాదు. జెంకపెట్టుకొనకు. కార్యసిద్ధి కొంతవరకైనది. నా ప్రయాణము వ్యర్థముకాలేదు. బహుశ్రమయలుపడి నేనుజ్జయినిజేరి వేడుక చెలికానితో గూడి వెన్నెలలో ముచ్చటలాడుచున్న మకరందుని జూడ మగవేసముతో వెళ్ళితిని మగవేసమేల ధరింపవలెనందువో? మహాత్ముడైన మకరందుడు పరస్త్రీలతో మాటలాడడు, జవ్వనుల మొగమైన జూడడు. కావున నాగుణరత్నాకరుని మగవేసమునం జూచుట మంచిదని యట్లుచేసితి. నీహృదయ మాతనియందు లగ్నమైనమాట విన్నవించితిని. అతఁడును నీయం దత్తము పరితపించుచుండెనని వేడుక చెలికాడగు చంద్రహాసునివలన దరువాత వింటిని. కాని యతను మాతండ్రిపై నాడి వెడలియున్నాడు. మునుపే నీతండ్రి పిలుచుట్లు దన మొల్లకయున్నాడు. ఇప్పు డీవిషయమై మా మీయయ్య యడుగ నూరకెట్లు పోవును. కావున సుఖసుఖాన మీతండ్రి నిన్నతని కియ్యడు. ఇందుకు దైవమే స్వయముగా దౌత్యము వహింపవలెనుగాని మనుష్యులవలనగాదు. పరమేశ్వరుడఘటనఘటనా సమర్థుడు."

అదివిని కర్పూరమంజరి—"ప్రియసఖీ! నీపలుకులలో గొంత యాస యున్నది. కొంత యాసలేదు. అతడు నాయందనురక్తుడై యుండుటం జేసి యాశాబంధము తెగకయున్నది. మాయయ్యకు విరోధి యగుటం జేసి వెంటనే నిరాశ యంకురించుచున్నది. ఆశా

నిరాశల నడుమ నామనం బూగాడుచున్నది. ఈ కలహ మెట్లు పరిణమించునో తెలియదు. అందు మాకరందునకు మరణమే సంభవించు నేని నామనోరథము లాతనితో మంటగలియును గదా! లేక పోరి తంబున మాయయ్య కడ తేరు నేని దండించి జంపినవాని నెట్లు చేపట్ట గలను! దైవమొక్కడే యిందు సాయము సేయదగినవాడు. నేను గౌరీ సేవానిరతురాల నగుదు నేని భగవతి కాత్యాయని నామనోరథ మీడేర్చుగాక!" యని తన మనోవేదన చెలిమికత్తె కెరిగించి రేయి చాల గడచుటచే నిట్టూర్పు విడుచుచు బండుకొని కన్నుమూసెను. మల్లిక మార్గాయాసముచే మిక్కిలి యలసియుండు కతన బడినదే పాటుగా గాఢనిద్ర సుఖమనుభవించెను.

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము

ప్రభాత మయ్యెను. తీర్థయాత్రలు సేవింప నరిగిన దండపాణి రాకపోవుటం జేసి చిత్రభానుడు విషణ్ణహృదయుడై వుండెను. వజ్రపాణి యంతకుమున్నె రెండు మూడు సారులు తన యన్న యెందుండెనని చిత్రభాను నడుగ నతడు కార్యాంతరంబుల దేశాంతరంబుల కరిగెనని యుత్తరము చెప్పె నేకాని యథార్థము వచింపనే లేదు. అన్న రాక దవ్వయినకొలది వజ్రపాణి కనుమానము హెచ్చెను. అతని మనంబు పరిపరి విధంబులం బోయెను. ఏమహారాజు నొద్దకైన జిత్రభానుడు వానిని రాయబారిగాబంప నారాజు వాని యసువు లపహరించి యుండునా? మార్గమాధ్యమున జోర కిరాతాది భయంబున మ్రంది యుండునా? రోగపీడితుడై దేహత్యాగము చేసియుండునా? వైరాగ్యంబున సన్యసించియుండునా!" యని వజ్రపాణి పలు తెరంగుల నూహించుచు నిదమిద్ధమని నిశ్చయము చేయలేక యానాడుదయమున జిత్రభానుని సందర్శించి తన సోదరుని విషయమున దనకుగల సందియముల నెరిగించి నిశ్చయవార్త దెలుపుమని వేడెను. చిత్రభానుడు

వాని సంశయములఁ బాప నత్తరి యథార్థమంతయుఁ జెప్పి యిట్లనియె— "నీ అన్నను గూర్చి నీ వెంత బెంగ గొంటివో నేనును నంత బెంగ గొని యున్నవాఁడ. అతఁడు లేకపోవుటచే నా సేనాముఖము తిలకహీనమై యున్నది. నా కుడిచేయి పడిపోయినట్లున్నది. మాళవ రాజసైన్యములు పెచ్చు పెరిగి యున్నవి. అతఁడు లేడన్న మాట వారికి దెలిసి కాబోలు గర్వోన్మత్తులై వారు సంచరించుచున్నారు. నీవు మేటి మొనగాఁడవు, మహాశూరుఁడవు నని నేనెరుఁగుదును. అయినను నతనికి నీవు నీవతనికి దోడైనయెడల మాళవ సైన్యంబులేగావు—మహేంద్ర సైన్యంబులైనను దైన్యంబు నొందక మానవు. నీవొంటిగాఁడ వైతివని నేను విచారించుచున్నాను. నేనొంటి రెక్కతోనున్న పక్షివలె నున్నాను. నీవు మీ యన్నకొరకై బెంగపెట్టుకొనకుము. ఈ యుద్ధమైన వెంటనే కరటక పింగళులను గాశీ హరిద్వార బదరీ నారాయణాది క్షేత్రముల కంపి మీ యన్న నిమిత్తమై వెదకింతము. చిత్రభానుఁడే మీ యన్న యనుకొనుము."

వజ్రపాణి కా పలుకులంత దుఃఖోపశమనము జేయకపోయినను సంశయనివృత్తి జేసినందున నాతని మనస్సు కొంత ప్రశాంతిఁ జెందెను. ఆమరునాఁడు యుద్ధము సేయుట కిరువురు నిశ్చయించుకొనిరి. ఉభయ సైన్యంబుల భేరీ భాంకరణంబులు దెసల మారుమ్రోగెను. ఉభయ సేనలలోని బంట్లకు నుత్సాహము మిక్కుటమై యుండెను. గజ బృంహితంబులు, హయహేషితంబులు, రథనేమిధ్వనులు, పదాతుల ఉత్సాహ రసభరిత వచనములు మిన్నుముట్టెను. ఆనాటి రేయి నా ప్రక్క చిత్రభానుఁడు వజ్రపాణి మొదలగువారును నీ ప్రక్క మకరందుఁడు, కంఠీరవదేవుఁడు మున్నగువారును దమ దమ నెలవుల నుచితస్థానముల నిలిచి పిరికితనము పటాపంచలై పోవునట్లు—వీర రసము మనంబుల నిండి యుండునట్లు గయ్యంబులకు సైనికులం బురికొల్పుచుండిరి

అంతలో దెల్లవారెను. ఉభయుల మనంబుల నెలకొన్న క్రోధాగ్నివలె భానుమండలము గానబడియెను. ఆ క్రోధాగ్ని

మంటలో యున దొలిసంజకెంజాయ దెసల నలముకొనెను. మంట లెగసినతోడనే నంతరించు పొగచందంబున మంచు క్రమక్రమంబుగ నదృశ్యమయ్యెను. సైన్యంబులు మేనం బూసికొన్న పీగగంధముల చందంబున లేయెండలు వ్యాపింప దొడగెను. రణదుందుభులు మొరసి సన్నసేయ నుభయ సేనలు తలపడెను ఏనుంగుల నేనుంగులు దాకెను. అశ్వికు లాశ్వికులం దలపడిరి. పదాతులు పదాతులం గలిసి పోరాడిరి. సాయంకాలమునకు గయ్యము ఘోరముగా జరిగెను. ఒకమారు జయము వారికి జేకూరినట్లు మరియొకసారి వీరికి జేకూరినట్లు దోచెను.

కంఠీరవదేవుడు కంఠీరవంబట్లు పోరాడి యపరాహ్ణంబున వజ్రపాణి ప్రయుక్తమైన వాలుటమ్మున దెగటారి నేలంగూలె. అతి డిల్లిన కొంతసేపటికి జిత్రభానుండు ప్రయోగించిన కరకుటమ్మున మకరందునకు గాయము తగుల నతడు మూర్ఛిల్లె. చికిత్సకొరకు పరిజనులు స్కంధావారమునకు వానిం గొనిపోయిరి. మదపుటేనుగు మీద మకరందుడు కనబడకపోయినతోడనే పరసైన్యంబులు మకరందుడు మ్రందెనని కోలాహలముచేసి సంతోషసూచకముగా రణదుందుభులు మ్రోయించిరి. భద్రసేనుడు తన మిత్రునకు ప్రమాదకరమైన గాయంబు తగిలెనేమో యని శంకించి చికిత్సకులచేత వ్రణపట్టికలు వేయించి సమయోచితమైన యుపచారంబులు చేయించుటకు వెంటనే శిబిరంబున కరిగెను.

పరసైన్యంబుల కోలాహలంబులు విని మాళవసైన్యంబులు భీతిల్లి పలాయనము సేయజొచ్చెను. తెలివివచ్చినతోడనే తనగాయము నైన లెక్కసేయక జొటజొటగారు ప్రొన్నెత్తురు సోనలతో మకరందుడు మరల నశ్వము నెక్కి యెలుగెత్తి కయ్యమునకు దన సైన్యంబుల బురికొల్పె గాని వంచినతల యెత్తక భటులు పోయిన పోకం బోయిరి. విజయలక్ష్మి చిత్రభానునిం జేపట్టెను. పరసైన్యంబులు మాళవులం దరిమి తరిమి కత్తుల నరికియు, బల్లెములం బొడిచియు, నమ్ముల నేసియు, గదలం జరిమియు నాశనము చేయజొచ్చెను.

మకరందుడు ధైర్యము విడువక రణముఖంబున నిలువ భద్రసేనుడు మరికొందరు భటులు వాని కపాయంబు శంకించి బలిమిని గుఱ్ఱ మెక్కించి యావలకు దీసికొనిపోయిరి. గాయములకు జికిత్స చేయబడలేదు. నెత్తురోడిక గట్టిపారుచుండెను. దాహముచే నాలుక యిగుర్చుకొనిపోవుచున్నను వెనుక పగవారు తరుముచున్న కతమున మంచితీర్థము త్రాగుటకయిన నవకాశము లేకపోయెను. నెత్తురు మిక్కిలి మేననుండి పోవుటచే నతడు దుర్బలుడై సోలిపోవజొచ్చె. భద్రసేను డాతని గుఱ్ఱముమీదనే యెక్కి వానిం దన రొమ్మునకుం జేరవైచుకొని పట్టుకొనియుండెను. అశ్వము సుశిక్షితమైన దగుటచే యజమాను నవస్థ నెఱిగి మిక్కిలి వేగమున బరుగెత్తజొచ్చెను. శిబిరము విడిచి కొంతదూరము వారు పరుగెత్తి యొక చిన్న పల్లియం జేరిరి. అప్పటికి సాయంకాల మగుటచే శత్రువులకు వీరిజాడ తెలియలేదు. కావున వారు మిక్కిలి వేగమున ముందుకు సాగిపోయిరి. భద్రసేనుడు మకరందుని మెల్లగా దోడ్కొనిపోయి ప్రణచికిత్సకు డా గ్రామమున నున్నాడా యని యడిగి తెలిసికొని గ్రామీణు లొక మంగలివానిం జూప వానిచే నారేయి యా రాకొమరునకు దగు చికిత్సలు చేయించెను.

మకరందునకు దీవ్రమైన జ్వరము వచ్చెను. కలత నిద్దరయే గాని గాఢమగు నిద్దుర పట్టలేదు. నాలుగైదు సారులు దాహము త్రాగెను. పెక్కుసారులు పలుపరించెను. అందొకసారి "కర్పూరమంజరీ! ఎంతకాలమునకు గనబడితివి!" అని నిదురలోనే మందహాసపురస్సరముగా బలికెను. వెంటవచ్చిన నలుగురు సేవకులు మార్గమధ్యమున శత్రుబాణ ప్రహారముల నీల్గుటచే వాని కంగరక్ష సేయవలసిన వాడు భద్రసేను డొక్కడే యయ్యెను.

ఎంతదూరము పోయినను మకరందుని జాడలు పొడకట్టమి మకరందుం బట్టుకొనుటకై వెడలిన చిన్న బలగము వెనుకకు దిరిగి వచ్చి పరిసరంబున నున్న పల్లియాల శోధింపదొడగెను. గాయము

తగిలిన మూడవనాడు మంగలి కట్టువిప్పి పుండు మానుదలపట్టె దనియు ప్రాణాపాయము లేదనియు జెప్పెను. అదివిని మకరందు డిట్లనియె—"భద్రసేనుడా! సంగ్రామమున గాయము దగిలి నేను మూర్ఛిల్లినప్పుడు నన్నక్కడ నుండనీయక నీవు నన్ను శిబిరమునకుం గొనిపోయి మిక్కిలి తప్పుచేసితివి. మన సేనలు పలాయనము లగుచున్నప్పుడు గాయము లెక్కచేయక యశ్వారూఢుడనై నేను మరల సమరరంగమునకు వచ్చినప్పుడు నీవు నన్నక్కడ నిలువనీయక పగతురు పట్టుకొందురని భయపడి యిటు తీసికొని వచ్చితివి. నీ విట్లు చేయని పక్షమున నేనీ పాటికి మృతినొంది వీరస్వర్గమునం బ్రాతికాపునై యుందునుగదా! నాకట్టి గౌరవము గలుగనీయక పోతివి. నా ప్రాణరక్షణమే చూచుకొంటివి గాని దీనికన్న వేయి మడుంగు లధికమైన నా ప్రతిష్ఠారక్షణము జూడవయితివి. నీ యుద్దేశము మంచిదయినను నీ కార్యము శ్లాఘాపాత్రము గాదు. రణముఖంబున క్షత్రియుడు మడమ తిరుగక వెనుకంజ యిడక పగరతో బోరవలయు. లేదా తనకై ప్రాణంబుల నర్పించిన వీరయోధసహస్ర మధ్యమున దానుంబడి ప్రాణములు విడిచి కదనరంగ మలంకరింపవలయు. అట్టి పుత్రునివలననే తల్లి వీరమాత యగును. అట్టి మగనివలన భార్య వీరపత్ని యగును. నామరణము కన్న మకరందుడు పందయై పొలికలను విడిచి పారెనని లోకులు చెప్పుకొందురేమో యనుసరికి నే నెంతయు భయపడుచున్నాడ. ప్రాణాపాయము లేదని చికిత్సకుడు చెప్పినందుకు నాకు సంతసము లేదు."

అనవుడు భద్రసేనుడు—"మిత్రుడా! 'జీవన్భద్రాణి పశ్యతి' యను నార్యోక్తి వినవే? బ్రతికియుండిన నెన్నో శుభములు గానవచ్చు. ఎందరో పగతుర గెలువవచ్చు ఎన్నో విజయములం బడయవచ్చు. ఎంతో యశోధనము నార్జింపవచ్చు. ఊరక మృతి నొందిన నేమి ప్రయోజనము? 'శరీర మాద్యం ఖలు ధర్మసాధన' మ్మనుమాట వినవె? నిన్నెరిగినవా రెవ్వరు నిన్ను బిరికిపందయని

యధిక్షేపింపరు. సమరములో నీవు మహాద్భుతముగ బనిసేయలేదే! అదిగాక సమరమును నీయంతట నీవు విడిచిరాలేదు. నీవు సొమ్మసిల్లి నప్పుడు దుర్బలుడవై నప్పుడు నిన్ను బలిమిం దోడ్కొని వచ్చితిమి. గాయము మానిన వెనుక కాయము దృఢమయిన వెనుక నీవు మరలం బగతురపై బని గెలువవచ్చు." అని యక్కుమారుని సమాశ్వాసించెను.

మకరందు నిమిత్త మన్వేషించుచున్న సైనికుల నాయకుడు ప్రసేనుడు నాటి యుదయముననె యా పల్లియ జొచ్చి గ్రామాధికారులం బిలిపించి మకరందుని జాడలం దెలియునా యని యడిగెను. నిజముగా వారతనిని జూడకపోవుటచే దా మేమియు నెరుగనట్లు చెప్పిరి. అతడది నమ్మక ప్రతియిల్లు శోధింపుమని సైనికుల కానతిచ్చెను. ఇచ్చినదే చాలునని దుండగులయిన యా సైనికుల వంటయిండ్లనక పడకగదులనక యటకలనక దొడ్లనక తోటలనక యెల్ల తావుల వెదకి యంగనల నవమానించి తమకు గావలసిన పదార్థముల నెల్ల జెప్పియు జెప్పకయు దీసికొనిపోయిరి.

అట్లు వెదకుచు నిల్లిల్లు దిరుగుచుండ నొక మంగలి యింటిలో గంబళిపరచిన నులకమంచముపై బండుకొన్న యొక పురుషుడు వానిప్రక్కం దాటియాకుల చాపపై గూర్చున్న యొక్క పురుషుడు సైనికుల కగపడిరి. ఆ మంగలి గుడిసెలో వారు దీపముల యట్లు వెలుగుచుండిరి. ఇద్దరు సుందరపురుషులే. ఇద్దరు విశాలనేత్రులే. ఇద్దరు మనోహర వర్చస్కులే. ఇరువురు నాజానుబాహులే. ఇరువురు స్ఫురద్రూపులే. అగుటచే మాళవ రాజనందనుడు వారిలో నొకడై యుండునని ప్రసేను డూహించి మంచముపై బండుకొన్న పురుషునిం జూచి నీ పేరేమని యడిగెను. "నాపేరు మకరందు" డని యతడుత్తరము చెప్పెను.

వెంటనే భద్రసేనుడు లేచి—"అయ్యా! మకరందు డతడు గాడు. నాపేరు మకరందుడు" అని పలికెను. "నిజము చెప్పుడు.

ఇందెవ్వరగు మకరందుఁడు ?" అని మరల నతఁడడిగెను. "నేనే మకరందుఁడ. నేనే సుదర్శన నందనుఁడన"ని మకరందుఁడు వెండియు నుత్తరమిచ్చెను "అతఁడు కాఁడు. నేనే మాళవరాజనందనుఁడన"ని భద్రసేనుఁడు బదులు చెప్పెను. "మిత్రుఁడా ! అబద్ధమాడకుము ?" అని మకరందుఁడు, "మిత్రుఁడా ! అసత్యము పలుకకుము" అని భద్రసేనుఁడును నొండొరులం గర్హించుకొనుచు మాటలాడిరి "అతఁడు మాతండ్రి మంత్రికుమారుఁడైన భద్రసేనుఁడు. నేను మకరందుఁడన"ని మరల నాతఁడు పలికెను. "అయ్యా ! అతఁడు నామిత్రుఁడు భద్రసేనుఁడు. నేనే మకరందుఁడన"ని వెండియు భద్రసేనుఁడు వక్కాణించెను.

వారిసంభాషణము ప్రసేనునకును, సైనికులకును, జికిత్సకుఁడగు మంగలికిని, నచ్చట గుమిగూడిన గ్రామీణులకును మహాశ్చర్యము గలిగించెను. అత్తరి ప్రసేనుఁ డిట్లనియె— "ఆహా ! మీచరిత్రము మిక్కిలి చిత్రముగా నున్నది. ఎవ్వఁడు రాజనందనుఁడో యెవఁడు వాని మిత్రుఁడో తెలియుటలేదు. మీరు మాకు శత్రువులైనను మీయుదార భావమును మేము ప్రశంసింపక తప్పదు. ఇందు మంత్రినందనుఁడు తన స్వామికుమారుని ప్రాణమునుగాచి తన ప్రాణము పగర కప్పగింప దలచుచున్నాఁడు. ఓహో ! అతని చరిత్రము మిక్కిలి శ్లాఘ్యము. రాజనందనుఁడు తన మేను దాచుకొనక తనకొఱకై నిష్కారణముగా దన మిత్రుఁడేల పోవలెనని యథార్థము చెప్పుచున్నాఁడు. మంత్రి నందనుఁడు బొంకుట పరోపకారార్థము, రాజనందనుఁడు సత్యము పలుకుట పరోపకారార్థము. వీరిం గన్న తల్లిదండ్రులు ధన్యులు వీరి జన్మలు చరితార్థములు. అయినను మాకు బగతురగుటచే వీరినిరువుర నేనిప్పుడు బంధించి మా రాజుకడకు గొనిపోక తప్పదు. ఓహో ! క్షాత్రధర్మము నిష్కరుణముగదా ! నేనన్యథా వర్తింతునేని నా చేతులతో నాకంఠము గోసికొన్నవాఁడ నగుదును. అయ్యా ! మీరిరువురు లెండు. నా వెంట రండు."

అనవుడు భద్రసేనుడు ప్రసేనునిం జూచి—"అయ్యా! మీరు నూరుగురున్నారు. మేమిద్దరమున్నాము. నీవామూకకు మొనగాడవు. నీవొక్కడ నాయుధముబూని మాతోఁబోరి మమ్ము గెలిచి యటమీఁద మమ్ము బంధించి తీసికొనిపొమ్ము. లేదా మమ్ము జంపుము. అంతియ కాని క్షత్రియవంశమునంబుట్టి మీ వెంట బందెరదొడ్డికిఁబోవు పశువులవలె మిన్నక వత్తుమె?" యని వీరరస ముట్టిపడునట్లు ప్రత్యుత్తర మిచ్చెను. నావుడు ప్రసేనుడు—"నీమిత్రుని రమ్మను. నీవు కాదు" అని పలియింప మకరందుడు చివాలున మంచమునుండి లేచి—"వద్దు. వద్దు. నీగాయము ప్రమాదకర మగున" ని వెనుక భద్రసేనుడు వాదించి వారించుచున్నను వినక ప్రక్కనున్న ఖడ్గము దీసికొని—"వీరుడా! నీమాటయే చెల్లుగాక!" యని ప్రసేనుని యెట్ట యెదుట నిలిచెను.

భద్రసేనుడు వానిని వారింప బహువిధ ప్రయత్నముల జేసె గాని గాయపడినవానిని సులభముగా గెలువవచ్చునని నీచమతితో ప్రసేనుడు వానినే గోరుకొనుటచేతను మకరందుడు లేనియుత్సాహము దెచ్చుకొని సమరసన్నద్ధు డగుటచేతను, భద్రసేనుడు చేయునది లేక కను లప్పగించి చూడవలసి వచ్చెను. అప్పుడు ప్రసేనునకు మకరందునకు భయంకరమగు ఖడ్గయుద్ధము జరిగెను.

ఖడ్గముల పరస్పర సంఘట్టనమువలన జనించిన విస్ఫులింగములు ప్రసేన మకరందుల నేత్రగోళములనుండి వెలువడు క్రోధాగ్ని విస్ఫులింగములతో వియ్యమొందెను. ప్రసేనుడు భీషణ భాషణంబులతో మాళవరాజనందనుని బలుసారు లధిక్షేపించెనుగాని యతడు వాటికి దన కటుకత్తిపోటులచేతనే గాని మాటలచేత ప్రత్యుత్తర మియ్యలేదు. ప్రేక్షకులు మహోత్సాహముతో నా ద్వంద్వయుద్ధము దిలకింప జొచ్చిరి. వెనుకటి గాయముచేత రక్తక్షయము జెందిన తన చెలికాని కే సమయమున నెట్టి యపాయము సంభవించునోయని భద్రసేనుని గుండె కడు భయంబున గొట్టుకొనుచుండెను. ఎట్టకేలకు నూతనముగా

గర్వమునకు దలపడిన ప్రసేనునికన్న మహాయుద్ధ పరిశ్రాంతుడై గాయమునజిక్కి ప్రసక్తియున్న మకరందుడే మిన్నయని యెల్లవారికిం దోచెను.

ప్రసేనుడు పరిశ్రాంతుడయ్యెను. మకరందుని ఖడ్గప్రహారమున నాతడు చేయితెగి నేలంబడెను. మకరందుడును మేన ముచ్చెమటలు గ్రమ్మ పరిశ్రాంతుడై నేల జదికిలంబడెను. అప్పుడు ప్రసేనుని బంటులు తమ నాయకుడు నేలం గూలుట జూచి సైపక హుమ్మని యుంకించి మకరందునిమీదికి దుమికిరి. తోడనే భద్రసేనుడు యొరలో నుండి తన కరవాల మూడబెరికి యమ్మూకపై బడి ముందుకువచ్చిన యేవురుబంట్లను నరికి తక్కిన వారిపయిబడెను. వెంటనే వారు వాని యెదుట నిలువలేక గాలికెగిరిపోవు దూదిపింజలచందమున నలుదెసకుం బరువెత్తిరి.

చూపరులు మకరందుని యొక్కయు, భద్రసేనుని యొక్కయు సౌజన్యంబును, సౌహార్దంబును, విక్రమంబును వేనోళ్ళం గొనియాడిరి. అప్పుడు భద్రసేనుడు తా మచ్చోటనుండుట క్షేమంబు గాదని మిత్రునకు దెలిపి ముందుగా నయ్యూరు విడిచి పరిసరంబుననున్న యడవికిం జని యటమీద దమ కర్తవ్యమును విచారింపజొచ్చిరి.

## ముప్పదియవ ప్రకరణము

అరవిందాదేవి నర్మద గాఢనిద్రలో నున్నప్పుడు కావలివాండ్ర కుం దెలియకుండ నిజవాసంబు విడిచి నడిరేయి యెందేనిం జనియెనని చెప్పబడియెగదా ! అంతఃపుర మెన్నడు విడిచి యెరుగని యో సుకుమారి, యసూర్యంపశ్యయైన యా మహారాజ్ఞి, మేడనెక్కిన నలసిపోవు నా మెలతమిన్న, పెలుగుల యెలుంగుల విని కలంగు నయ్యాదిత్యేశ్వరి, మహాటవులలో నెండయనక గొండయనక మిట్టయనక పల్లమనక వెనుదిరిగిచూడక యాహారంబు వర్జించి యే మృగంబులైన

మదయాకలి దీర్చుకొనుటకుకయి తన్ను భ్రమింగిన బాగుంపువనియే పామయిన గరచినమేలని యే సెలయేటినయిన గొట్టుకొని పోయిన యుక్తమనుచు నడచిపోవజొచ్చెను. ముండ్లు గ్రుచ్చుకొనుటచే నామె పాదములు వుండ్లయ్యెను. పొదలకుం దొలగక వానిం దాకిపోవుటచే మేను గీచుకొనిపోయి నెత్తురు లోడుచుండెను. ఎండలో నడచుటచే నడుగులు పొడపొడ జొక్కెను. శిరోజములు మొగమున వీపున జెల్లాచెదరై పడియుండెను.

మూడవనాడు మధ్యాహ్నము రెండుజాములవేళ నామె దుర్భరముగా నున్న తన జీవితమును దుదముట్టింపవలె నని సంకల్పించి రొక యేటియొద్ద జేరి వస్త్రము బిగించి కట్టుకొని సూర్యునికి నమస్కారములు చేసి యెత్తుగానున్నచోటు జూచుకొని యటనుండి గుభాలున నయ్యేటినీటధుమికెను. దుమికి రెండు మునకలువైచెను. రెండవ మునకవైచి తేలునప్పటికి నామె శిరస్సు కాషాయాంబర ధారియగు నొకబిక్షువు చేతంబట్టి శిరోజములు గ్రహించి యవ్వలి కీడ్చెను. కడుపునిండ నీరుండుటచే నామెకు సరిగా స్మారకము లేదు. ఆ బిక్షువు తన శిష్యుని సాయమున నామె నొకచెట్టుక్రింద బడవైచి సమయోచితోపచారముల జేసి నీరు గ్రక్కించెను. అంతట నామెకు దెలివి వచ్చెను. పిమ్మట నాభిక్షు వామెను జూచి యట్టి యాత్మహత్యకు గారణమేమని యడిగి యామె పూర్వవృత్తాంతమును గూర్చి ప్రశ్నించెను. ఆమె కొంతసేపు ప్రత్యుత్తరము జెప్పుట కిష్టపడక మౌనముద్రవహించి యగ్గురుశిష్యులు ప్రశ్నలనిడుచు ముండ్లు మాటి మాటికి గ్రుచ్చుటచే సహింపక యెట్టకేల కిట్లనియె—

“అయ్యా! మీరు నాకు బరమశత్రులుగాని మిత్రులుగారు. నామనంబు నతిదారుణంబుగా బాధించుచున్న దుర్వార వేదననుండి నేను విముక్తి నొందుటకు సాధన మేర్పరచుకొన నది సాగనీయక నాకు మీరు మహాపకారము జేసితిరి. మీకిందువలన బాపమే కాని పుణ్యము లేదు పుత్రశోక జ్వరపీడితనైన నాకు జల్లని యా నదీ

జలములు సుఖప్రదాయకములగును. కావున నిప్పుడైన నన్నందు బోవనిండు! ఈప్రాణములమీద నాకాశ లేదు. గర్భమందున్న విషము గ్రక్కు-వరకు నరుడు బాధపడునట్లు నేనీప్రాణములు బోగొట్టుకొను వరకు నతి బాధపడుచున్నాను. ప్రాణత్యాగమే నాకు సుఖము. శరీర విసర్జనమే నామనోవేదనమునకు జికిత్స. కావున నాయం దనుగ్రహ ముంచి నన్ను జావనిండు !"

అని వేడుకొన నాభిక్షువు లక్కజంపడి—"తల్లీ ! మేము భిక్షువులము. బౌద్ధులము. జీవహింసకు బరాఙ్ముఖులము. చూచిచూచి నిన్ను జావనిత్తుమే ? నీకు మరణమే విధింపబడినయెడల మాకంట బడక పోయియుందువు. మేము తక్షశిలకు బోవుచున్నాము. అక్కడ వేనవేలు యోగినులున్నారు. నిన్నక్కడికి మేము గొంపోదుము. మావెంటరమ్ము. భగవానుడైన శాక్యసింహుని ధర్మంబులువిని నీకిష్టమైన పక్షమున వాని ననుసరించి దుఃఖసాగరము నీదగలవు. నీవైఖరి జూడ మహారాజాంతఃపురవాసినివలె గానబడుచున్నావు. నీకిష్టమగునేని నీచరిత్రము మాకు జెప్పుము" అని పలికిరి. అప్పు డామె తన వృత్తాంత మంతయు వారి కెరిగింప వారు కాశ్మీర మహా రాజపత్నియు పాంచాల రాజనందనయునైన యాదేవికి ప్రాప్తించిన దురవస్థకు నంతేని పరితపిల్లి యతిగౌరవంబున గడు నాదరంబున నింతింత యనరాని వినయంబున నామె కుపచారంబులు సల్పి నెమ్మ నంబున ధైర్యము పురికొల్పి యాత్మహత్య మహాపాతకమని దానిపై రోత బుట్టించి తక్షశిలం జేర్చిరి. అక్కడ నుపనిషద్రహస్య పరిజ్ఞాతలై వైదిక మతావలంబకులైన సన్యాసులను, శాస్త్రాధ్యయనముల నిమిత్తమైవచ్చి విద్యాలంకరించుచున్న బ్రహ్మచారులను, ధమ్మపదము, త్రిపిటకము, హీనాయానము, మహాయానము మొదలగు బౌద్ధగ్రంథ పఠనంబులచే ధన్యులై, విశాలములగు విహారములందు విడిసియున్న బౌద్ధభిక్షువులను, పరమనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మచర్యవ్రత దీక్షాపర తంత్రలై యగ్నిశిఖలవలె బవిత్రలైన భిక్షుణీజనమును జూచి సంతసించి యాభిక్షుణీ సమూహముతో గలిసి కాలక్షేపము జేయజొచ్చెను.

అట్లు శక్తివర్మ సింగవుంగొదమలవంటి రాకొమరుల దీసికొని కాశ్మీర గాంధార దేశముల సరిహద్దులం జేరునప్పటికి జందుడు నిరంతరములైన ప్రయాణంబులం జేసి వారిం గలిసికొనెను. గాంధార దేశపు సరిహద్దులం బాలించు వీరసేనుడు లోకోత్తర లావణ్య విశేషంబులుగల రాకొమరుల నెమ్మొగములు జూచి వారు సామాన్యులు కారని గ్రహించి వారిని రావించి వారి చరిత్రము లడిగి శక్తివర్మ ముఖమున నంతయు దెలిసి జాలినొంది యతిస్నేహంబున వారిం గారవించి రాజకుమారులకుం దగిన యుపచారంబుల జేయించి యందలములెక్కించి చందునకు శక్తివర్మకు నశ్వములనిచ్చి ఇట్లనియె- "మా మహారాజుగారు భాగ్యవర్ధనుడు సత్పురుషుడు. మీ చరిత్రము విన్న జాలినొంది మీకు సాయము జేయును. ఆయనకుం గొడుకులు లేరు. సౌదామిని యను కూతురు గలదు. పదునాలుగేండ్ల ప్రాయము గలది. మిక్కిలి చక్కనిది. తగిన వరుని సంపాదింపలేక యాయన మేరమీరిన విచారము నొందుచున్నాడు. అందుచే నాయనకు మీ రాక పరమసంతోష జనకమై యుండును. కావున మీరీ వాహనంబు లెక్కి యచ్చోటికిం జనుడు. నేనును మీ రాక వారికి ముందుగా దెలియబరచెద."

అనవుడు శక్తివర్మ మహాప్రసాదమని వాని మన్నన నంగీకరించి కృతజ్ఞత దెలిపి బాలకులం దోడ్కొని గాంధారమునకు జని యెను. గాంధారనాయకుడగు భాగ్యవర్ధనుడు వీరసేనుని జాబు చూచుకొని సంతసించి రాజకుమారులకు నెదురుకోలు సల్పి తోడుకొని రమ్మని తన యమాత్యు నంపి వారు తన యంతికమున కరుదెంచినపిదప వారిని కౌగలించుకొని యెంతయు సన్మానించి సంపంగి నూనెతో రాకొమరులకు దలయంటించి యమూల్యవస్త్రా లంకారముల నలంకరింపజేసి యభ్యంతర మందిరంబున విడియంజేసెను. చండ శక్తి వర్మలకును దగిన గౌరవంబు సలిపెను. ఆ రేయి కుమారులవలన శక్తివర్మవలన మంచుమలకడనున్న కొండకోటలో జరిగిన దారుణ

వృత్తాంతమంతయు విని భాగ్యవర్ధనుడు వాని మంత్రులు మహాదుఃఖ పరవశులై దాని నాపుఁగొనలేక బాలకు లట్లేడ్చి చిత్రభానుని దౌర్జన్యమును వేయితెరంగుల గర్హించి యక్రూరాతునకు భగవంతుడు తగిన దండనము చేయడేయని యొక్కపెట్టున బలికిరి. బాలకులం జూచినది మొదలుకొని భాగ్యవర్ధనుడు వారియెడ నత్యంత స్నేహంబు గలిగి విక్రమసేనునకు దన గారాబు కూతురగు సౌదామిని నిచ్చి పెండ్లి చేయవలెననియు దన తమ్ముని కూతురైన చిత్రరేఖను హర్షవర్ధనునకిచ్చి వివాహము సేయవలెననియు నిశ్చయించి జ్యేష్ఠుని గాశ్మీర సింహాసనమున గూర్చుండ బెట్టవలెనని సంకల్పించెను. తన మనోనిశ్చయమును మంత్రులకు సేనాపతులకు రహస్యముగ జెప్పి దండయాత్రా సన్నాహమును జేయింపుమని ఆనతిచ్చెను. ఆనతిచ్చుటయే తడవుగా రాజకార్య పరతంత్రులగు మంత్రులు గజతురగ పదాతి సైన్యంబుల నాయత్తము సేయజొచ్చిరి.

గాంధార రాజాంతఃపురమున రాజకుమారులు సకల సౌఖ్యముల ననుభవించుచున్నను దల్లి జాడ తమకు దమజాడ తల్లికి దెలియక పోవుటచే నెల్లయపుడు మాతృవియోగ దుఃఖమున గ్రుక్కుచుండిరి. ఆమె జాడ నరయుటకై నిపుణులగు వేగులవాండ్ర బంపుమని భాగ్యవర్ధనునిం బ్రార్థించిరి. ఆతడు వారి యభీష్టప్రకారము జేసెను.

మాధవసేనుడు మహేంద్రదేవుని బలములు పరాజయము నొందినతోడనే తాను పరాజితుడై మహేంద్రదేవునితోడ బాంచాల పురమున కరిగి యపజయమువలన నిర్వేణుడై యున్న ఆ ముదుసలి కేనికి ధైర్యము గొలిపి యుత్సాహము పుట్టునట్లు పూర్వరాజుల చరిత్రంబులు పురాణగాథలు జెప్పి జయము తప్పక సేకూరునని నమ్మకపుట్ట బలికెను. అతడును మాధవసేనుని దనకు హితోపదేశకునిగా నేర్పరచుకొని రాజభక్తి శూన్యులైన నియోగుల నొలగించి స్వామిభక్తియుక్తుల నధికారములందు నియోగించి మరల సమర సన్నాహము జేయింప జొచ్చెను. ఈసారి యుద్ధములో

జయమైన సేకూరవలయు లేదా, తన ప్రాణములైన సమరరంగమున కర్పింపవలెననియు మాధవసేనుడు నిశ్చయించుకొని యతడు దృఢ ప్రయత్నము చేయజొచ్చెను,

అట రత్నసేనుడు మాళవరాజసైన్యము లోడిపోయి నానా ముఖంబులకుం బరుగులెత్తుటజూచి మరల సేనం గూడగట్టుటకు బహు ప్రయత్నముల గావించెను. అతని ప్రయత్నము లరణ్యరోదనము లయ్యెను. ఆతని మనస్సు పరాజయమువలన జనించిన పరాభవమునను దనకొడుకు రాజుకొడుకుం గానబడమి బొడమిన విషాదమువల్లను మిక్కిలి దుఃఖనిలయమై యుండెను. "నన్ను నమ్మి నాసామర్థ్యమందు విశ్వాసము గలిగి తనకొడుకున కేయపాయము రాకుండ నేను జేయగలనని మనోనిశ్చయము గలిగి సేనల నావశముజేసి పంపినందుకు నేనెంత చేసితిని! పోనీ, జయాపజయములు దైవికములు. వాటి కేమి? మరియొకసారి గెలువవచ్చునను కొందము, అతడు తన కుమారుని నాకప్పగించె. చంద్రప్రభాదేవి పంచప్రాణము లాతనిమీదనె పెట్టుకొనియుండు. ఆ తలిదండ్రులు నాకొడుకేడని యడిగిన నేమిచెప్పుదును? ఇంక మాభద్రసేనునిమాట నేనేమనుకొందును? పరమమిత్రులైన యక్కుమారు లిరువురు సమరమున మడిసి యుందురా? పగతురచే జిక్కియుందురా? ఏమిగతి! ఏమైననేమి? నేను మాళవంబున కరిగి సుదర్శనునిగాంచి దండయాత్రా విషయము లాతనికి జెప్పి సమాశ్వాసించి మరల యుద్ధసన్నాహము జేయించెదను. ఈ పరాభవవ్రణము విజయంబను నౌషధంబునంగాని కుదురదు" అని రత్నసేనుడు తనలో వితర్కించి యోడ నడిసముద్రమున బగిలినప్పుడు దాని చెక్క నొకదానిం బట్టుకొని సాగర మీది ప్రాణములు దక్కించుకొను బాటసారివోలె నాతడు హతశేషమైన సేనం గూర్చుకొని యుజ్జయినీ నగర సమీపమునకుం బోయెను. పోవునప్పటికి మాళవదేశస్థితి యెట్లుండవలెనో యట్లుండెను.

మగటిమి నెరపగల సైనికులందరు గాశ్మీరదేశముపై దండు విడియుటకు బోయినందున విదర్భరాజసైన్యంబులు గట్టిగొళ్ళైములు

లేని తలుపులు గలయింట సులభముగ జొచ్చినట్లు లాహారశూన్యమై కృశించియున్నవాని మేన రోగములు దూరినట్లు మాళవముజొచ్చి యానాయానమున నిలిచియున్న యల్పసైన్యముల నోడించి రాజధాని నాక్రమించుకొని సుదర్శనునిం బారద్రోలి కోటలో విడిసెను.

సుదర్శనుడు సకళత్రముగ సపరివారముగ ఘూర్జర దేశము జొచ్చి యారాజు తనకు బూర్వమిత్రు డగుటచే వాని కతిథియై వాని సాయమున మరల మాళవరాజ్యముపై దండు విడియవలయునని ప్రయత్నము సేయుచుండెను.

రత్నసేనుడా వృత్తాంతమంతయు విని విధి కాశ్మీర రాజ కుటుంబమున కేగాక మాళవ రాజ కుటుంబమునకు గూడ విముఖుడై యుండుట దెలిసికొని రాజధానికిం బోవక తనవెంటనున్న యల్పపరివారముతో ఘూర్జర దేశమునకుంజని యా రాజున కాశ్రయుడై దీనుడై యున్న సుదర్శనుంగాంచి దండయాత్రా పర్యవసానము జెప్పి మకరంద భద్రసేనుల జాడలు తెలియలేదని విన్నవించెను. పుత్రవియోగము రాజ్యభ్రంశముకన్న నానరపాలున కధిక సంతాపము గలిగించెను. ఎల్ల దేశములందు వానిజాడలు భద్రసేనుని వార్తలు దెలిసికొనుటకై సమర్థులగు పురుషులను బంపుమని యతి డానతిచ్చెను. నిజపుత్ర వియోగముచే గుందుచున్నను రత్నసేనుడు మాళవ రాజ్య సింహాసనమునందు సుదర్శనుని మరల బ్రతిష్ఠించుటయే ప్రధానకర్తవ్యముగా జేసికొని ఘూర్జరనాయకుని యనుగ్రహమునకు బాత్రమై సేనల ప్రోగుచేయుటలోను దదితర సన్నాహము జేయుటలోను శక్యమైన కృషి చేయుచుండెను.

మకరందుడు సమరమున బరాజితుడై గాయపడినాడని కర్ణాకర్ణిగవిని కర్పూరమంజరి మితిలేని విషాదమునొంది నిద్రాహారంబులు వర్జించి ఆతని నిమిత్తము పరితపింపజొచ్చెను. ప్రసేనుడు కడతేరినతోడనే భయభ్రాంతులై పారివచ్చిన హతశేషసైనికులు చిత్రభానున కా వృత్తాంత మెరిగించుచుండ జాటుననుండి విని మల్లిక

పరుగుపరుగున గర్పూరమంజరికడకు బోయి సఖీ! నీకు ప్రియమెరిగించెద" ననియెను. "ఓసీ! మరణమునకు సిద్ధముగా నున్నదానికి ప్రియమేమున్నదే?" యని యామె విసుగుతో బలికెను. "సఖీ! అమంగళము నోటరానీయకుము. మకరందుడు సుఖముగా నున్నాడు. గాయము కుదిరినదట. అది కుదురుటయే గాదు. మన సేనాధిపతులలో నొకఁడైన ప్రసేనుని ద్వంద్వయుద్ధమున నాకి గూల్చునంతటి బలము గూడ నతనికి గలిగినదట శౌర్యరాశియైన ప్రసేనుడు చచ్చినందుకు మీ తండ్రిగారు చింతిల్లుచున్నారు" అని మల్లిక విన్నవించెను.

అప్పలుకులు కర్ణరంధ్రముల జొచ్చినతోడనే పండుకొనియున్న కర్పూరమంజరి దిగ్గున లేచి పాన్పుపై గూర్చుండి—"మల్లిక! ఏమేమి! ఆయన సుఖముగా నున్నాడా? నిజముగా నాకు ప్రియమెరిగించితివే! ఇదిగో! ఈయుంగరము నీవు పారితోషికముగా గ్రహింపుము. నాకాయన ప్రాణిగ్రహణభాగ్యము లభించినను లభించకపోయినను జీవించియున్నవాఁడనియు, సుఖముగా నున్నవాఁడనియు వింటి నదియె చాలు!" నని పలికి కొంత యూరటగలిగి వెండియు—"నెన్నఁడైన నాతని సందర్శనము జేయు పుణ్యకాలము లభింపజేయుము" ని కాత్యాయనీ దేవిని ప్రార్థించెను. మల్లిక—"యామె కోరిక నెరవేర్పుము" ని భగవతి గౌరిని దానును వేడుకొని—"సఖీ! తప్పక నీకాతని సమాగమము గలుగునని యెందుచేతనో నాకు గొప్పయాస గలదమ్మా! అందుచేత నీవూరటగలిగి యుండుము" అని ధైర్యము జెప్పెను. "ఓసీ! నీవంతకన్న నేమనియెదవు? నీప్రియసఖి చెంగటిల్లి చిక్కి శల్యమై మృతినొందునను భయమున నీవాశా గుటికలు నాచేత మ్రింగింప జూచుచున్నావు? ఏమైన నగుగాక! మన మేమిసేయ గలము?" అని నిట్టూర్పు విడిచి వెండియు బాన్పుపై బండుకొనెను.

అట్లరణ్యమునందు మకరంద భద్రసేనులు కొండొక వృక్షచ్ఛాయ జేరి యెటుబోవదగునని సమాలోచనము సేయజొచ్చిరి. అప్పుడు మకరందుడు తన మిత్రుని కిట్లనియె—"భద్రసేనా! నేనుజ్జయి

నికి బోజాలను. ఏలయన నేనెంతో మొనగాడనని మహాసైన్యము గూర్చుకొని కాశ్మీరముపై దండువెడలి యుద్ధమునం దోడిపోయి గాయపడి పందనై రణరంగము విడిచి పారిపోయి యిప్పుడేమొగము బెట్టుకొని యుజ్జయినిం బ్రవేశింతును? నాయం దెంతో గౌరవముగల యుజ్జయినీపురవాసుల మొగము లెట్లు చూతును? సిగ్గులేక నాతండ్రి నెట్లు చూతును! నేనాయన కడుపు చెడబుట్టితిని. నాజననమువలన బవిత్రమైన మాళవ రాజవంశమునకు కళంకము గలిగినది. చంద్రప్రభాదేవి వీరమాత యగుటకు మారుగా భీరుమాతయైనది. కర్పూరమంజరీ పాణిగ్రహణము నాకు సంప్రాప్తింపక పోవుటయే మేలయ్యె. నావంటిపందను బెండ్లిచేసికొన్న పక్షమున నామె వీరపత్నిగాక భీరుపత్నియై సాటి రాజకన్యకలలో దలవంచుకొనవలసి యుండును. హేమచంద్రుని తనయులకు సాయముజేసి వారి నుద్ధరింపవలెననివచ్చి నేనింత జేసితినిగదా! ఆబిడ్డలేమైరో తెలియదు. ఛీ! నాబ్రతుకేల? మిత్రుడా! నేనింక నింటికిరాను. భగవానుడైన బుద్ధదేవుని కపిలవస్తు నగరమున కరిగి భిక్షువునై యుండెద. లేదా భిక్షుకసహస్రములుగల తక్షశిలకుజని వారి శిష్యుడనై జ్ఞానసంపాదనము జేసెద. పరాభవాగ్ని దగ్ధమగుచున్న నామనస్సునకింతకన్న దారి పొడకట్టుటలేదు."

అధైర్యద్యోతకములైన యాతని వచనముల నాలకించి భద్రసేనుడు నవ్వి—"మిత్రమా వజ్రము మెత్తపడినది. అగ్ని వేడింగోల్పోయినది. ఏమి! యీవిచిత్రము! నీకింత యధైర్యము గలుగ నేల? యుద్ధములు జూదములవంటివి. రణముల జయాపజయములు జూదమందలి జయాపజయములవంటివి. చెట్టు నెక్కెడువాడే పడును వాడు. భారతయుద్ధమున పాండవులు కౌరవులచే నెన్నిసారులు భంగపడలేదు? కాన యెట్టకేలకు వారు గెలువలేదే! శ్రీమన్నారాయణుని యవతారమైన కృష్ణుడు జరాసంధునిచే బలుసారులు కయ్యమున నోడిపోయి యెట్టకేలకు వానిని భీమార్జునసహాయంబున సంహరింపలేదే? కావున నొకసారి యోడితిమని వీరుడు సిగ్గుపడి సమర

పరాఙ్ముఖుడు కాగూడదు, నరుడు కార్యసిద్ధికై యాజన్మాంతము ప్రయత్నించుచుండవలసినదే. అధైర్యము మానవుని వెలుతురునుండి తీసికొనిపోయి గాఢాంధకారమున బడవేయును. ధైర్యమను తెప్ప విపత్సముద్రముల నీదుటకు సాధనము. ధైర్యమువంటి మిత్రము మరియొకటి లేదు. ఏమిత్రమును విడిచినను భయము లేదు కాని ధైర్య మిత్రమును విడిచితిమా చెడిపోదుము. కావున వైరాగ్యమును విడిచి మీవియోగమునకై దల్లడిల్లుచుండు తల్లిదండ్రులను సందర్శించి దుఃఖోపశమనము జేయుము. మరల మహోత్సాహము జేసి కాశ్మీరముపై దండువిడిసి చిత్రభానునిం గెలువుము. జయమువలన గలిగెడు మహాయశస్సు నేటి పరాభవ కళంకమును గప్పిపుచ్చగలదు. లెమ్ము! లెమ్ము!'' అని యుత్సాహ రసపూరితమైన పలుకులు పలికెను. అప్పలుకులు విని మకరందుడు—"మిత్రుడా! పరాభవంబను మేఘపటలముచేత మెండుగ నాక్రమింపబడి నామనస్సు జ్ఞానతేజముం గోల్పోయి యుండుటచే నట్లంటి. నీపలుకులు యుక్తియుక్తములై యున్నవి. నీచెప్పినట్లు చేసెద కాని మార్గాయాసమున నేను మిక్కిలి డస్సినాడ. త్రాగుట కించుక మంచినీరు దొరకిన నేదదేరి పయనము సేయగలుగుదు. అది ఈ నట్టడవిలో నెట్లు లభించు?'' నని నిట్టూర్పు విడిచి చెట్టునీడం బండుకొనియెను. "మిత్రుడా! భయపడకు. అడవులో నేరులు, వాగులు, చెరువులు నుండకపోవు. నేనీసమీపమున నెందైనా జలాశయమున్న దేమో యరసి యుదకం దెచ్చెద. ఈ నీడను విశ్రమింపుము" అని పలికి తోడనే యాతడు జలము నన్వేషింప బైలుదేరెను,

అమితమైన మార్గాయాసమున నలసియున్న కతమున మకరందునకు మహీరుహచ్ఛాయను బండుకొనినతోడనే నిద్రపట్టెను. నిద్ర సుఖమెరుగదన్న సామెత నిజముగదా! చంద్రశాలలలో దాసదాసీ విలాసినీ జనములు వట్టివేళ్ళ వీవనల విసర మెత్తని హంసతూలికా తల్పంబులపై బవ్వళించు మహారాజకుమారుడు నట్టడవిలో జెట్టునీడ

పట్టినేల బండుకొన్నను సుఖనిద్రపట్టెను. భద్రసేనుడు వనంబున గొంతదూరగ మరిగి మనోహరములైన తామరపూవులతోడను, జల్లని తియ్యనీటితోడను విలసిల్లు నొక్క చెరువుం గనుగొని రాశీభూతమైన భగవంతుని దయారసముగా దానిని భావించి విశాలములైన తామరాకులు దొన్నెలుగా గుట్టి నాలుగు దొన్నెలనిండ నీరునించి మిత్రుని నోరెండిపోవునేమోయను భయమున నతివేగంబున వచ్చి చెట్టుకడ జూచునప్పటికి మకరందు డక్కడ లేకపోయెను. భయము, విస్మయము, సంభ్రమము మనంబున మల్లడిగొన నలదు దాహమున రాగలేక ఏరుకొర కెందైన జనియెనేమో యని శంకించి—"మకరందుడా! మకరందుడా!" యని యెలుగెత్తి పిలిచెను. అప్పలుకుల కుత్తరము లేదు. వెంటనే సందియములు హెచ్చెను. మనస్సు విషాదాక్రాంత మయ్యెను. శరీరమందు జేవ డిందుపడియెను. నిలువలేక చెట్టునకు జేరబడి కూర్చుండి యతి డీల్లు విచారించెను. "ఇతఁ డేమైయుండును? అతిపిపాసావశమున మృతినొందినచో గళేబర మిందుండవలయును గదా? అట్లుకాదు. దుష్టమృగము లేవైన దప్పి బలహీనుడై యున్న యీతని గొనిపోయియుండునా? లేక చోరులో, కిరాతులో వీనిం జంపియుందురా? హా విధీ! అబాల్యవర్ధిత స్నేహితులమగు మాకు మహారణ్యమధ్యమున నెడబాటు గలిగించితివే? ఏమిసేయుదును. నెవ్వరి నడుగుదును, నెందుబోదు? ఈ యడవులందు నెదకుచు గానబడదేని యుండదే శరీరమును విడిచెదన" ని గట్టిగాన మదియందు నిర్ణయించు కొనకయె మిత్రు నన్వేషించుటకై పయనము చేసెను.

## ముప్పది యొకటవ ప్రకరణము

పట్టినదెల్ల బంగారమైనట్లు చిత్రభానునకు దలపెట్టిన తరువాత జయము తరువాత జయము చేకూరుటచే లోకమున నతనికి గొప్ప ఖ్యాతి గలిగెను. కాశ్మీరదేశ ప్రజలెల్ల మాళవ పాంచాలుర

పరాజయము దెలిసిన తరువాత—"భళి! చిత్రభానుడా భళి!" యని ప్రశంసింప జొచ్చిరి. ఆ విజయములు వాని పూర్వదోషముల మరపింప జొచ్చెను. ప్రజలు విక్రమసేన హర్షవర్ధనుల మాటయే మరచిపోయిరి. అరవిందాదేవి మెచ్చుటనున్నది! యని యనుగువారే తక్కువైరి. రాజభక్తులు, సదాచారులు మాత్రము చిత్రభానుడు సింహాసనము నిమిత్తమై చేసిన దురితములను గర్హించి విక్రమసేన హర్షవర్ధనుల గురించియు దల్లిం గూర్చియు విచారించుచుండిరి. చిత్రభానుని గర్వమునకు మేరలేకపోయెను. అతడు నేలనుండియు నభోవీథిని సంచరించునట్లు వర్తింపజొచ్చెను. దానికిం దగినట్లు రుద్రభట్టు పలు తెరంగుల వాని విక్రమంబుల వినుతింప దొడగెను.

ఒకనాడు వారిరువురు గూర్చుండి మాట్లాడుచుండ ప్రసంగవశమున రుద్రభట్టిట్లనియె—"రాజా! నా చెప్పిన చొప్పున నీవు రాజవైతివిగదా! మహేంద్రదేవుడోడె. మాళవసైన్యమోడె. మకరందుడు కథావశేషుడయ్యె. సుదర్శనుడు రాజ్యహీనుడయ్యె. నీ ప్రతాపాగ్నికి బగతుర దళములు మిడుతలై పోయినవి. భరతఖండమునందు నేటికాలమున నిన్నుమించిన రాజులు లేరు. రామరంతిదేవ నహుష మాంధాతృ ప్రముఖులగు రాజన్యులతోడ సమానుడవైతివి. నీయశోలతలు హిమాలయము మొదలుకొని రామసేతువు వరకుగల భారతవర్షమంతట నలముకొన్నవి. అనేక మహీపాలురు నీసఖ్యము నపేక్షించుచున్నారు. రత్నగర్భలవంటి భూములుగల మాళవ పాంచాల దేశంబులు నీపాదాక్రాంతములై యున్నవి. రాజులు నీయాన బూలదండవలె శిరంబున ధరించుచున్నారు. రాజన్య మకుట మాణిక్య కాంతులు నీపాదపద్మములకు నీరాజనము లిట్టు కాలము సంప్రాప్తించినది. కష్టములు గట్టెక్కినవి. ఇంక నీవు పట్టాభిషేకము జేసికొమ్ము. తద్విషయిక ప్రయత్నము జేయించెద. నీవనుజ్ఞ నిత్తువేని దానికిం దగు సుముహూర్తము నిర్ణయించి వలయు పనులం బ్రారంభించెద" అని పలుక జిత్రభానుడు—"పట్టాభిషేకమున కంత

తొందరయేమి? ఎప్పుడో చేసికొనవచ్చును. మాళవ పాంచాలురు మరల వత్తురేమో చూడవలయునుగదా !" యని బహులు చెప్పెను.

"మాళవ పాంచాలురు మరల వచ్చుటా! చచ్చినవాడు మరల బ్రతుకడు. పగిలినకుండ మరల నతుకుకొనదు. నేల నొరిగిననీరు మరల నెత్తుట సాధ్యమా? మహేంద్రదేవుడు శతవృద్ధుడు. రాజ్య వృక్షమునకు జీడపురుగులు పట్టినవి, మాళవుడు బౌద్ధుడు. నాస్తికుడు. పరమేశ్వరుడు నాస్తికుల దల యెత్తనిచ్చునా? ఆ నాస్తికులలో నగ్రగణ్యుడవైన నీచేత భక్తవత్సలుడగు పరమేశ్వరుడు లోక ద్రోహులగు బౌద్ధులను నాశనము జేయింప దలచినాడు. కాని యీ సందర్భమున నినొకవర మడిగెద. అది యేదన క్రొత్తగా జయింపబడి మన యధీనమయిన మాళవదేశమునకు నీ కుమారుని విజయసేనుని రాజుగాను నన్నాతని మంత్రిగాను నీవు నియోగింప వలయునని నా కోరిక. ఈ ముద్దు చెల్లింపుము. ఈ వేడుకోలు ననుగ్ర హింపుము. ఈవర మొసంగుదువేని మున్ను నష్టమైన నా ప్రతిష్ఠ మరల ప్రతిష్ఠింపబడును. సుదర్శనుడు చేసిన పరాభవమువలన నేను తొల్లి పూవు లమ్మిన యూరిలో గట్టెలమ్మితిని. నీ యనుగ్రహమున్న పక్ష మున వెండియు గట్టెలమ్మిన యూరులో బూవులమ్మెద. పూవు లమ్ముటయే కాదు. ఉజ్జయినీ పట్టణమును బంగలమునం బెట్టి వేయించెద. బౌద్ధవిహారముల నెల్ల నేలమట్టము జేయించెద. వాటి తావున శివా లయముల నిర్మించెద. నాస్తికాధముడయిన సుదర్శనుని నివాసమువలన నపవిత్రములయిన యా యంతఃపురములు, మేడల, మిద్దెల బరశు రామప్రీతి గావించి నిర్మూలించి యచ్చట ముండ్లకంపలు వేయించి జిల్లేడు మొలకల నాటించెద. అంతేగాదు సుదర్శనుడు నన్ను నిండు కొలువుకూటములో బరాభవించి దేశభ్రష్టుని జేసినాడు. సభాభవన మందుండియు నన్ను బహిష్కరించుకొని యొక్క మాటయిన నాడక యూరకుంచిన యా భటుల సాదర బుద్ధి నన్నువట్లు తగురీతి దండించెద. అదియునుగాక పలుమారు నాతో దైవనాస్తిక్యమును గూర్చియు

వేదప్రామాణ్యాదుల గూర్చియు, వాదులుసల్పి రాజు వారిపక్షమున నున్న కతమున వారి బలమున నన్నోడించి యుపహసించిన దేవసింహుడు, హిరణ్యమిశ్రుడు సత్యమిహిరుడు మొదలగు మానవాధముల నాస్తికబుద్ధుల బౌద్ధపాంసనుల బందు లొలిచినటుల మేనితోళ్ళ నొలిపించియు బ్రతికియుండగాని గడ్డివాములలోబెట్టి కాల్పించియు జెరుకుగ్రలట్లు గానుగలలో వైచి యాడించియు, నానాహింసల పాలుజేసి చిరకాలంబుననుండి నా మనంబున మండుచున్న క్రోధాగ్నిని వారి నెత్తురువలన జల్లార్చుకొనియెద, కేసరియును నమాత్యు నొక్కనే రక్షించెద. అతండెప్పటికిని నా పక్షమువాడే. మొన్న జరిగిన కయ్యంబునగూడ నాతడే వైదర్భుల కాయువుపట్లు చెప్పి కోట మనవారి యధీనము జేసినాడట! ఇదియె నీవు నాకు జేయవలసిన మహోపకారము.” అని తీవ్రముగా రుద్రభట్టు విన్నవింప జిత్రభానుడు చిరునవ్వునవ్వి—“మహాత్మా! చిరకాలమునుండి మీ మనఃపేటికలో నడగియుండిన క్రోధసర్పము నేడు లేచి పడగ విప్పి యాడుచున్నదే. ఇంత దనుక రాజుచున్న క్రోధాగ్ని నేడు మండుచున్నది. ఈ శాంతమూర్తిలో నింత దారుణమైన క్రోధానల మెట్లడగియున్నదో యెరుంగకున్నాను. మీరు మహానుభావులగుటచే నింద్రియములు మీ యధీనములు. క్రోధాదుల నడంపగలరు, ఇచ్చవచ్చినప్పుడు ప్రజ్వలింపజేయగలరు, అట్లే మీ కోరికప్రకారము జేసెద. ముందుగా నేనును వజ్రపాణియు, మాళవమునకరిగి యచ్చటి పరిస్థితుల స్వయముగా దెలిసికొని దేశ మధీనము జేసికొని మరలివత్తుము. వచ్చినతరువాత నాపట్టాభిషేక మైనవెనుక విజయసేనుని, మిమ్ము మాళవమున కంపెద. మీరు నాకు జేసిన మహోపకారములకు నేనీపాటి చిన్నపని మీకొరకై చేయుట యబ్బురమా? మీరడిగినది మిక్కిలి తక్కువకోరిక, సద్బ్రాహ్మణు లగుటచే మీరు నిస్పృహులు అశ్వము లడిగితిరా? యాందోళిక లడిగితిరా? గజము లడిగితిరా? కాంచనము లడిగితిరా! హారము లడిగితిరా? యగ్రహారము

లడిగితిరా ! ఈపాటి చిన్నకోరిక తీర్పనియెడల నాజన్మమేల ? ఈ కోరికయేగాదు. రాజ్యమంతయు మీపాదములకడ సమర్పించెద. రాజ్యమే కాదు — ప్రాణములైన నిచ్చెద " అని కృతజ్ఞతా పూర్వకముగా సంభాషించి వరమిచ్చినట్లు మాటయిచ్చెను.

ఆతని వినయంబునకు కృతజ్ఞతకు జాల సంతసించి రుద్రభట్టు— "రాజా! బూడిదబూసికొని కాషాయిగుడ్డలు గట్టుకొని పండ్లు, పాలు, దిని తపంబు జేసికొను పరమవైదికునకు నాకు సర్వము లేల, యాందోళిక లేల, హారము లేల, యగ్రహారము లేల, అవి యాగర్భ శ్రీమంతులై భగవంతునివలన ప్రజాపాలనాధికారము జన్మతోడనే వహించిన మీవంటి ప్రభువులకు విధినిర్ణీతములు, కృష్ణాజినములు, దర్భాసనములు, రుద్రాక్షములు, జటాజూటములు మొదలయినవి మా నిమిత్తము నిర్మింపబడినవి, ఆశలు జయించినవారు బ్రాహ్మణులుగదా ! అసంతుష్టిగల బ్రాహ్మణుడు సంతుష్టిగల క్షత్రియుడు చెడుదురని వినలేదా ? రాజా ! ఇంక నీ పట్టాభిషేకప్రయత్నము జేయించెద. సామంతరాజులకును సాటిమేటి నృపులకును నభిషేకమహోత్సవమునకు రమ్మని సగౌరవంబుగా నాహ్వానముల బంపించెద, సింధువు, సరస్వతి, భాగీరథి యమున మొదలగు పవిత్రనదీనదంబుల జలములు స్వాధ్యాయవేత్తలయిన బ్రాహ్మణోత్తములచేత దెప్పించెద. ప్రతి దేవాలయమున నీ యభ్యుదయము నిమిత్తమై యభిషేకముల జేయించెద, నగరమందంతటను సూర్యరశ్మి గనబడకుండ బందిళ్ళు వేయించి యరటికంబముల నాటించి తోరణముల గట్టించి వీధివీధులయందు శృంగారలక్ష్మి ఘల్లుఘల్లు మని తాండవనృత్యము సలుపునట్లు—దేవేంద్రుడు తన వీటికన్న నిది యందముగా నున్నదని వేయికన్నుల దెరచి చూచి నెరగుపడునట్లు—పుర మలంకరించెద, దేశమందున్న భూసురోత్తముల నందర రావించెద, సంతర్పణముల సమారాధనముల జేయించెద, భూరిదక్షిణలచే వారిని దనివి నొందించెద. బ్రాహ్మణాశీర్వాదములతోడను, ప్రజల యానందధ్వనులతోడను, మంగళతూర్యారావం

బులతోడను, వారవిలాసినీ గానధ్వానములతోడను, భూనభోంతరములు నిండునట్లు—దశదిశలు మాఱుమ్రోయునట్లు—గగనము బీటలువారునట్లు—మహేంద్రుడు నన్నుమించిన భూమండలాఖండలుడు వీడెవడురా నూతనముగా నచ్చెనని గుండెలు పీచుపీచుమన బెదరి బెదరి చూచునట్లు—చూపఱు నీపురము కలియుగ వైకుంఠమని యానందించునట్లు—నీకీర్తి యాచంద్రతారార్కము భూమిపై నిలుచునట్లు—మహోత్సవము జేయించెద జూడు" అని యుత్సాహ రసము వెల్లివిరియ బలికెను. చిత్రభానుడు రుద్రభట్టుం జూచి ముసిముసి నవ్వులు నవ్వి తల యూచెను.

అనంతరము వజ్రపాణి వచ్చుటయు నతనిని జయముల విషయమై ప్రశంసించి పట్టాభిషేకానంతరము నాపచ్చని పందిళ్లలోనే కర్పూరమంజరి నిచ్చి వివాహము జేయించునట్లు జెప్పి పంచెను. వజ్రపాణి యాసన్న వివాహ మహోత్సవమున కువ్విళ్లూరుచు బిచ్చిదైన తన యిల్లాలిని బిడ్డలను వివాహమున కడ్డురాకుండ నామె పుట్టినింటికి బంపెను.

## ముప్పది రెండవ ప్రకరణము

పూర్వప్రకరణమున వర్ణింపబడిన ప్రసంగము జరిగిన రెండవ నాడు చిత్రభానుడు రుద్రభట్టు కోటలో నొక గదిలో గూర్చుండి రాజ్యవ్యవహారములగూర్చి ప్రసంగించుచుండ బదుగురు రాజభటులతోగూడి సుషేణుండను చిన్న సేనాపతి దర్శనాపేక్షియై ద్వారపాలకులచేత దనరాక రేని కెఱింగించెను. రావచ్చునని ప్రభువానతీయ నతడు లోని కరిగి జోహారుచేసి యిట్లు విన్నవించెను— " మహాప్రభూ ! దేవరవారి పంపున నల్పసేనం దీసికొనిపోయి యొక యడవిలో మాళవ రాజకుమారుడగు మకరందుని బట్టుకొంటిని. ఆతడు ప్రయాణ ఖేదమున గాబోలు చెట్టునీడను సొమ్మసిల్లి నిద్ర

పోవుచుండె. నిద్రాపరవశుడై యుండగాని కాళ్ళకు చేతులకు సంకెళ్ళు దగిలించి గుడ్డతో నొక డోలికగట్టి యందు వానిం బడవైచి తోడ్తెచ్చితిని."

అది విని చిత్రభానుడు మహా సంతోషముతో—"ఏడీ! ఆకుత్రవాడేడీ?" యని ససంభ్రమముగా బలికెను. "ఆ పాపాత్ముడు పట్టువడినాడా?" యని రుద్రభట్టరచెను. "స్వామీ! యతడు వీధిలో నున్నాడు. సెలవైనయెడల దోడ్తెచ్చెద" నని సుషేణు డుత్తరము జెప్ప—"తోడ్కొనిరమ్మ" ని రాజు సెలవొసంగ నావలి కరిగి డోలికనుండి మకరందుని ప్రభువు సన్నిధికి నడిపించెను. సంకెళ్ళ బరువున నతడు సరిగా నడువలేక తొట్రుపడుచు రాజసన్నిధిం జేరెను.

వెనుకటి కయ్యమున గలిగిన గాయములవలన రక్తహీనుడై సొక్కినవాని—మార్గాయాసమునం బడలి వాడిన పూవుదండమువం బోలె నవసియున్నవాని—శృంఖలాబద్ధములైన కాలుసేతులుగలవాని—నల్లకలువ రేకులకు వన్నెలుదిద్దు విశాల నేత్రములవాని—నవమదనునైన మెచ్చని సోయగమువాని—శరత్కాల చంద్రమండలమునకు సాటి యగు నెమ్మొగమువాని—మాళవరాజు కుమారుని గనుంగొని చిత్రభానుడు వాని చెలువంబునకు నచ్చెరువడి—"అహా! ఏమి చక్కదనము? ఏమి యీ ముఖవిలాసము? ఏమి యీ కన్నులతీరు? నాజన్మమధ్యమున నేనింత చక్కని రాకొమరునిం జూడలేదు. ఇందుచేతనే మాకర్పూరమంజరి మనస్సు వీనియందు లగ్నమై యున్నది. ప్రాయమునందున్న జవ్వని యీభూలోకమన్మథుని జూచిన పక్షమున వీని పొందునకై యాసింపకుండునా? ఇట్టి సుకుమారుని—నిట్టి జగన్మోహనాకారుని నేనెట్లు కారాగృహబద్ధు జేయుదును? అయినం బగవాడుగదా!" యని తనలో వితర్కించి—"సుషేణా! ఇతనిని గారాగృహమున బంధింపుము" అని యానతిచ్చెను. "పాము పిల్లను వెంటనే చంపక విడుచుట ధర్మముగాదు. రాజా! మీద నీచిత్తము" అని రుద్రభట్టు చెప్పెను.

"ఓహో! నీవు రుద్రభట్టువు కావా? మాతండ్రిని వంచించి తత్ఫలముగా దేశభ్రష్టుడవై యిందు జేరి యీరాజునకు దుర్బుద్ధులు గరపుచుంటివా? మరణమన్న నాకించుకయు భయములేదు. పాప కర్ముడవైన నీకే మరణభయముగలదు. పుట్టినవాడు గిట్టకమానడు; గిట్టినవాడు పుట్టక మానడు" అని మకరందుడు రుద్రభట్టున కుత్తరము చెప్పెను. అంతలో సేవకులు వానిని మెల్లగా నావలకు దీసికొనిపోయి కారాగృహమున బంధించిరి.

"మల్లికా! నీవేమో చంద్రికతో రహస్యముగా జెప్పుచుంటి వదియేమే? మీప్రసంగములో మకరందు డనుమాట నాచెవిని బడెను. యథార్థము జెప్పవే! అత డేమైనాడే? ప్రాణముతో నున్నాడా? నామీద దయయుంచి చెప్పవే!" యని కర్పూరమంజరి యడుగ మల్లిక యెప్పటికైన నది యామెకు దెలియక మానదని మకరందుడు కారాబద్ధుడైన వార్త యామె కెరిగించెను.

అది విని కర్పూరమంజరి యింతింత యనరాని వంతందగిలి మల్లికం జూచి యిట్లనియె—"ఓసీ! మెత్తని చిగురుటాకుల మెచ్చని యా యడుగులు సంకెళ్ళ నెట్లోర్చునే? ఆ బాహులతికలు శృంఖలా బద్ధములై యెంతసలిగెనో నిరంతర మంతఃపురవాసము జేయు నాసుకుమారి కారాగృహంబున నెట్లుండగలడె? కటికినేలం బవ్వళింప గలడే? తినుటకు వీలులేని యామోటకూడు నాసుకుమారి తినగలడటే? అయ్యయ్యో! ఎంతకష్ట మెంతకష్టము! అది యటుండ నాతండ్రి వానిం బ్రతుకనిచ్చునటే? అతడొకవేళ బ్రతుకనిచ్చినను క్షుద్రమనస్కుడైన రుద్రభట్టు వానిని వధింపుమని నాతండ్రిం బురికొల్పి కృతకృత్యుడు గాకపోవునే? అయ్యయ్యో! నేనున్న తావుననే వాని కవసానదశ సంప్రాప్తించుచున్నదా?" యని పరిపరిభంగుల విలపింపజొచ్చెను. నాటంగోలె నామె నట్టినేలం బవ్వళింప నారంభించెను. ఆహారము వర్జింప సంకల్పించెను. చెలికత్తెలు బ్రతిమలాడ నించుకించుకదిని యూరకుండును. చెరసాలలో నతడెట్లు కష్టపడు చుండెనో యంతఃపురమందుండియు దాను నట్టికష్ట మనుభవింపవలెనని

సంకల్పించెను. వివాహమైన తరువాత భార్య పతివ్రతయై భర్త మార్గ మనుసరించుట లోకము దున్నదిగాని పాణిగ్రహము గాక మును పే కామించిన పతితోడిదే లోకమని యాతనికొరకై కష్టములు పడుట యెందు జూడలేదని చెలికత్తె లామెతో నని యప్పటినుండి మరల్ప బ్రయత్నించినను నామె మానదయ్యె.

అట మకరందుడు కారాగృహవాసి యయ్యు దన హృదయమున గర్పూరమంజరిని నిలుపుకొని యన్నపానాదుల దెచ్చిన పరిచారకులను గావలివాండ్రను గర్పూరమంజరీ కుశలవార్తల నడుగుచు నామెంగూర్చియే స్వప్నముల గాంచుచు నామెతో మనస్సమాగమ సుఖము బడయుచు నామెం గలిసికొనుటకు నుపాయ మేదియైన లభించునాయని నిరంతరము జింతించుచు గాలము పుచ్చుచుండెను.

మకరందుని జూచినది మొదలుకొని సుదర్శనునిమీద గల దీర్ఘక్రోధముచేత రుద్రభట్టు మకరందుని జంపింపవలయునని దృఢ సంకల్పము గలిగియుండెను. వాని చక్కదనము జూచియు, వానిపై దనకూతున కనురాగముండుటచే వానిసవధించిన దనకూతు రేమగునో యని సందేహము గల్గియు రుద్రభట్టు ప్రేరణ చేసినను జిత్రభానుడు మాళవరాజ నందనుని జంపింపక యూరకుండెను. అందుచే రుద్రభట్టుకు మనస్తిమితము లేకపోయెను. త్వరితముగా వానినెట్లు తుదముట్టింపవచ్చునని యుపాయములు వెదకుచు నొకనాడు వజ్రపాణిం బిలిచి యిట్లనియె—"వజ్రపాణీ! నీకొక్క హితోపదేశము జేసెద, అది నీమనస్సులోనే యుంచుకొమ్ము! చిత్రభానునకైన నిది తెలియ నియ్యవద్దు. ఈ యుపదేశము నాకడుపులో జన్మించి నీకడుపులో నస్తమింపవలయు. కర్పూరమంజరిని జిత్రభానుడు నీకిచ్చి వివాహము సేయదలచినమాట నిజము. కాని కర్పూరమంజరి యీ మకరందుని వలచినది. నీయం దామెకు లేశమైన ననురాగము లేదు. అనురాగము లేకపోవుటయేగాదు. నీపేరువిన్న నామెకు దలయేరు. దానికి దోడుగా వీడిక్కడికి వచ్చుట యనర్థకము. వానిని వెంటనే సంహరింపవలసినదని

చిత్రభానునితో నేను రెండు మూడుసారులు చెప్పితిని, ఎందుచేతనో యతడు సంహరింపక యూరకున్నవాడు. కావున నక్కుమారుని దెగటార్పుమని నీవును బట్టుపట్టి చిత్రభాను నొడంబరవుము. వానిరక్తము కన్నుల జూచినగాని నీవు నిద్రపోకుము. వానిమీద నాకేమియు గోపములేదు. కాని, నీవివాహము నిమిత్తమై నేనీయలమట బొందుచుంటిని. నీవు కర్పూరమంజరి కేలుపట్టిననాడు నాకన్నులు చల్లబడును. చిత్రభానుని పట్టాభిషేకముజూచి, నీపాణిగ్రహణ మహోత్సవముజూచి యనంతరము నేను తపంబు జేసికొన హిమాలయమున కరిగెద, ఈ రెండే నాసంకల్పములు. అందు మొదటిది జరిగినట్లే, రెండవదియు జరిగినట్లే గాని వీనిం దెగటార్చిన నిస్సందేహముగా నది జరుగును. కావున నప్పని యతివేగంబున జరుగునట్లు ప్రయత్నింపుము."

ఆ పలుకులు చెవిని బడినతోడనే వజ్రపాణి వజ్రహృదయము నీరై పోయెను. పోవుటయు నతడు కఠిన స్వరముతో రుద్రభట్టున కిట్లనియె—"అయ్యా! కర్పూరమంజరి నన్నే వలచినదని నానిమిత్తమే పరితపించుచున్నదని నానామమే స్మరియించుచున్నదని ప్రధానమైన నాడు నీవేగదా చెప్పితివి. ఆ నోటితోనే యామెకు నాయందనురక్తి లేదని నాపేరువిన్న దలయేరని యెట్లు చెప్పుచుంటివి? ఈ రెండు మాటలలో నేది నిజము?" అని యడిగెను. అడుగుటయు రుద్రభట్టు తిన మాటలకుగల పరస్పర వైరుధ్యము మనంబునకుదట్ట నయ్యిక్కట్టు నుండి తప్పించుకొనుటకు వెంటనే యుపాయ మన్వేషించి యిట్లనియె— "ప్రధానమైన దినములలో నాబాలిక యట్లె నిన్ను వలచియుండెను, ఈ నడుమ మకరందుని జూచెనట! చూచినదాదిగా వానికై పరితపించుచున్నదట! పడుచుకన్నెలకు బాగోగులుగలవా? ఎదుటనున్న వాడె పెండ్లికొడుకు. అంతేగాని నామాటలలో వైరుధ్యము లేదు, కావుననే నీమేలుకోరి వెంటనే చెప్పితిని. నాడట్లు నీతో జెప్పితినన్న మాట నాకు జ్ఞాపకము లేదా? కావున నీవు నామీద ననుమానపడక నీకార్యసిద్ధికై పాటుపడుము."

ఆ మాటలు వజ్రపాణికి నచ్చెను. మరునాడా విషయమై చిత్రభానునితో నొక్కి చెప్పవలెనని యతడు సంకల్పించుకొని యింటికి జనెను. అతడు పోవునప్పటికి వాని యత్తవారియూరినుండి వచ్చిన యొక సేవకుడు నమస్కరించి యొక జాబు చేతికిచ్చెను. ఆ జాబు తీసికొని యామూలాగ్రముగ జదువుకొని—"హా! దైవమా!" యని నేల గూర్చుండెను. సేవకులు—"స్వామీ! ఏమి యాపద వాటిల్లె" నని యడుగ నతడుత్తరము చెప్పక జాబు చేతికిచ్చెను. వారు జాబు చదువుకొని—"అయ్యో! సునందాదేవి యనామ్రదవశమున నూతిలో బడి మరణించెనట! తల్లి లేని యా పిల్లల దుఃఖము వర్ణనాతీతమైనదట! హా! యెంతకష్టము! ఇల్లు కాలిపోయినది, ఇల్లాలు కూలిపోయినది. గోరుచుట్టుపై రోకటిపోటన్నమాట నిజమైనది" అని విచారింప నొడగిరి. అప్పుడు వజ్రపాణికి దుఃఖముతో గాఢపశ్చాత్తాపము గలిగెను. తన యనాదరమువల్లనే, తన యప్రియ సంభాషణములవల్లనే, తన యజాగ్రత్తవల్లనే యామెకు మనశ్చాంచల్యము గలిగినదనియు నెట్లయిన నామె మరణమునకు దానే కారణమనియు భావించి వాపోవజొచ్చెను. ఆ వార్త తెలిసినతోడనే మంత్రులు బంధువులువచ్చి సమయోచిత సంభాషణంబుల నూరడించిరి. వజ్రపాణి మరునాడుదయమున నవ్వార్త జిత్రభానునకు దెలిపి పయనమై యత్తవారియూరు జేరి మాతృహీనులైన బిడ్డల నోదార్చి యుత్తరక్రియలు సమాప్తమగువరకు నక్కడనే యుండెను.

ఇల్లాలి మరణవార్త వినినతోడనే యతడు విషాద విపరీత మనస్కుడైనను దినములు గడచినకొలది దృఢచిత్తుడై కర్పూరమంజరీ పాణిగ్రహణమునకు మొదటి యాటంకము భార్య మరణముతో దీరినదనియు, మకరందుని వధతో రెండవది గతించిపోవుననియు, దైవము తన కనుకూలుడై యపకార రూపకమైన యుపకారము చేసెననియు భావించి యొక విధముగా సంతసింప జొచ్చెను,

# ముప్పది మూడవ ప్రకరణము

జనకుని క్రూరస్వభావమును, రుద్రభట్టుయొక్క దుష్టవృత్తియు లెస్సగా నెరిగినదగుటచే కర్పూరమంజరి మకరందునకు వారిరువురి వలన నేదే నపాయము వాటిల్లవచ్చునని శంకింప జొచ్చెను. అతనికి బంధమోక్షణము చేయవలెనని మల్లికతో బలుమారు జెప్పుచుండును, ఎన్నివిధంబుల జూచినను శక్యముగాకపోయెను. అందువలన కర్పూర మంజరి మనస్సు తామరాకులోని నీటివలె స్థిమితము లేకయుండెను. మల్లిక కర్పూరమంజరికి మనస్సంతోషమునుగూర్ప మకరందుని చెరనుండి విడిపించుటకై యెన్నో పన్నుగడలు పన్నుచుండెను. అట్టి సమయమున జిత్రభానుడు మృగయాక్రీడ నిమిత్తము రాజధాని విడిచి సపరివారముగా నరణ్యముల కరిగెను. విజయసేనుడు రుద్రభట్టు రాజ్య వ్యాపారముల జూచుటకై నగరమం దుండెవి. అత్తరి కర్పూర మంజరి మల్లికం బిలిచి—“ ఓసీ ! మాయయ్య వేట కరిగెను, నిన్న సాయంకాల మాయన యభ్యంజన స్నానముచేసి వ్రేలి యుంగరము దీసి యొక పీటపై బెట్టెను. నేటి ప్రాతఃకాలమున వేట కరుగునప్పుడు దానిని దీసికొనుట మరచిపోయెను. అది నాకు దొరికినది. ఆ యుంగు శీయక యు నీకిచ్చెద, మాళవ రాజనందనుని బంధమోక్షణమున కది యుపయోగపడునేమో విచారింపుము. ఇట్టి విషయములలో నీవు మిక్కిలి నిపుణురాలవు. కావున లెస్సగా నాలోచించి మాళవ రాజ కుటుంబము నుద్ధరింపుము, మాతండ్రి రాకమునుపే యీపని జరుగ వలయు. అతడు వచ్చెనా యిక నాసయుండదని నాయభిప్రాయము. మకరందుడు తనమీద గత్తిగట్టి కయ్యమునకు వచ్చెనని యాయన మీద మాయయ్యకు క్రోధము. శత్రువైన సుదర్శనుని నూను డగుటచే రుద్రభట్టునకు ద్వేషము. వజ్రపాణికి నాకతమున వానిపై మత్సరము. కావున నీవగర మతని నగ్నిహోత్రవుం బుంత, ఎంత వేగముగా విమోచనమైన నంతక్షేమము, పాణిగ్రహణమైననుసరే,

కాకపోయినను సరే! ఆ మన్మథ మన్మథుడు బ్రతికినం జాలును. ఇందు నీవు కృతకృత్య వగుదువేని నాకు మహోపకారము జేసినదాన వగుదువు" అని బహువిధముల బ్రతిమాలి చెప్పెను.

"అమ్మా! ఉంగర మిటు దెమ్ము. దీనివలన గార్యసాధన మయ్యెనా మంచిదె. కానియెడల నీయుంగరము నీకు దెచ్చి ఇచ్చెద. ఎట్లయిన నాతని బంధవిముక్తుని జేయవలయుననియే నాసంకల్పము. ఆ సుకుమారుని గారాగృహమున నుంచుట దిరిశనపువ్వు నెండలో వైచుటయని నేనెంతో విచారించుచున్నదానను. నాకే యింత మనోవ్యథ యుండగా నీమనస్సెంత మరుగుచున్నదో చెప్పవలయునా?" యని యంగుళీయకము దీసికొని యారేయి చాలసేపు నిద్రపోవక దాని నుపయోగించువిధము నాలోచింప దొడగెను. ఎట్టకేల కామెకొక యుపాయము పొడకట్టెను. మరునాడుదయమున గర్పూరమంజరినిజూచి—"మీతండ్రి వ్రాసినలేఖ యేదైనా నీయొద్ద గలదా?" యని యడిగెను.

"మున్ను విదర్భలో నున్నప్పుడు మాయయ్య వ్రాసిన జాబొకటి నాకడ గలదు. అది యెందుకు? కావలసిన నిచ్చెద" నియామె బదులు చెప్పెను. "ఎందుకని నీవడుగకు. పనియైనపిదప దాని ప్రయోజనము జెప్పెద, ముందా లేఖ నిటుదెమ్ము." అని ఆమెకడనుండి జాబుం గైకొని రహస్యముగా నొకగదిలో గూర్చుండి యేదో వ్రాసి యేదో పన్నుగడ బన్ని కర్పూరమంజరికడ సెలవు గైకొని యందే నరిగెను.

సాయంకాల మయ్యెను. ప్రభాకరు డస్తమించెను జగమునందెల్లెడ నిండియున్న యజ్ఞానమువలెనే కారుచీకటులు పలుదెసల వ్యాపించెను. చరమాద్రి గ్రుంగిన భానుడు ధరించిన యనంతకోట్యవతారములో యనునట్లు దీపములు ప్రతి గృహంబున నలంకరించెను. సుషేణుడు తన గృహంబున బిడ్డల ముద్దులాడుచు నుండెను. అప్పుడొక సేవకుడు వానిదర్శనము జేసి నమస్కరించి యెట్టయెదుటనిలిచెను.

"నీ వెవ్వడవు ? ఏమి పనిమీద వచ్చితివి ?" అని యాతఁ డడుగ నా సేవకు డిట్లనియె—"మహాప్రభూ ! చిత్రభాను మహారాజుగారి సన్నిధి నుండి వచ్చితిని. ఆయన యీ జాబు మీ కిమ్మని నా చేతి కిచ్చె." నని యొక లేఖ చేతి కిచ్చెను. సుషేణుఁడు దీపపు వెలుఁగున దానినిట్లు జదువుకొనెను—

"చిరంజీవియైన సేనాపతి సుషేణునకు కాశ్మీరమహీపాలుఁడు చిత్రభానుఁడు వ్రాసిన శాసనము. మకరందుని తండ్రియగు సుదర్శనునకును, మాకును సంధిజరిగినందునను, సుదర్శనుఁడు మాకు విధేయుఁడై సామంతరాజై ప్రతియేట గప్పముగట్ట నొప్పుకొనినందునను మకరందుని బంధమునుండి మేము విడిపింప నిశ్చయించినారము కావున నీవీ జాబుఁజూచిన యీ క్షణమే యా రాకుమారుని జెరనుండి విడిపింప వలసినది. ఇతఁడు మాళవరాజసచివుఁడు. వీనిపేరు వినయంధరుఁడు మాకును మాళవరాజునకును వీని ద్వారముననే యుత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నవి. నీకు నమ్మకము కలుగుటకై నా నామాక్షరములుగల యంగుళీయకము వీని చేతికిచ్చి పంపుచున్నాఁడను. ఇది యానవాలుగా గ్రహించి నీవు వెంటనే వాని విడిపింపవలసినది.

ఇట్లు
కాశ్మీర నాయకుఁడు. చిత్రభానుఁడు."

లేఖ జదువుకొని సుషేణుఁడు ప్రభువుగారి యుంగర మేదియని యడిగెను తోడనే వినయంధరుఁడు దాని నతని కిచ్చెను. అది పుచ్చుకొని యా సేనాపతి దీపపువెలుఁగున దానిని బలుమారు శోధించి యది తన ప్రభువుదే యని తెలిసికొని తత్క్షణమే వినయంధరుని వెంటబెట్టుకొని కారాగృహమున కరిగి తలుపుదెరపించి మకరందుం జూచి "నిన్ను విడువుమని మహారాజుగారి యానతియైనది. నీ యిచ్ఛ వచ్చిన చోటికి బొమ్ము !" అని చెప్పెను. మకరందుఁడు మిక్కిలి యాశ్చర్యపడి పెద్దపులినోట దలయిడి చావకుండ బైకి వచ్చినవాని యట్లు తన్ను భావించుకొని చిత్రభానుఁడు తన్ను విడిపించుట కేమి

కారణ ముండుననుచు వితర్కించుచు గారాగృహమునుండి వెలుపలి వీధిలోనికి వచ్చెను. అత్తఱి వినయంధరుడు వానిం గలిసికొని "దేవా! నేను మీ కాపుడను. మీరు నన్నిప్పుడు గుర్తింపలేరు. మీరిప్పుడు బంధవిముక్తు లయినను మీ కపాయము తప్పలేదు. ఇచ్చోటు విడిచి ఈ క్షణమే మీరు వెడలిపోవలయు. నగరము వెలుపల మీ నిమిత్తమై నేను కళ్యాణలక్షణ సంపన్నమై యతివేగవంతమైన యాజానేయ తురంగమును సిద్ధముచేసి యుంచితిని. అచ్చోటనే మీ కాహారము గూడ నేర్పరచితిని. నా వెంటవచ్చి యా యాహారము భుజించి యా యశ్వమెక్కి పయనముజేసి తెల్లవారకముున్న జాలదవ్వరుగవలయు ఎందుకని ప్రశ్నింపక నా చెప్పిన చొప్పున మీరు చేయుడు. కర్పూర మంజరి పాణిగ్రహణమైన తరువాత నేనిట్లు చేయుటకు గారణము లామెవలననే తెలియగలవు." అని విన్నవించెను. అప్పలుకులు విని వెండియు నెట్టి ప్రశ్నముల నడుగక మకరందుడు వినయంధరుని వెంట నరిగి యాహారము భుజించి యా హయము నెక్కి యథేచ్ఛం జనియెను. వినయంధరుడు వానిని సాగనంపి నగరంబు ప్రవేశించెను.

మరునా డుదయమున మల్లిక కర్పూరమంజరిం గలిసికొని మకరందుడు బంధముక్తుడై కడచినరేయి సురక్షితముగా నావలకు బోయెనని విన్నవించెను. కర్ణామృతము లయిన యప్పలుకులు విని కర్పూరమంజరి సంతోషమున వికసితముఖియై "సఖీ! నన్ను గాగ లించుకొనుము. నీవు నా కవేంద్రునకు బ్రాణభిక్షము బెట్టితివే. సఖి వన్న నీవే సఖివి. ఉపదానవన్న నీవే యాదుదానవు. వేయిజన్మలకైన నీ ఋణము దీర్చుకొనగలనటే!" యని కృతజ్ఞతం దెలిపి బహూక రించెను. అప్పుడు వారీ క్రిందివిధముగా మాటలాడిరి.

మల్లిక—అమ్మా! నేను చేసిన దేమున్నది! దైవమనుకూల మైన పక్షమున నెట్టికార్యమైన జుల్కనగా సాధింపవచ్చును. అప్పుడు గుండులు నీటిలో దేలును. ప్రతికూలమైన బెండులు మునుంగును. మన యత్నము నిమిత్తమాత్రము. కార్యసిద్ధి యీశ్వరాయత్తము. ఇంతకు నీవు సంకల్పసిద్ధురాలవు.

కర్పూర—ఓసీ! అతడెట్లు విముక్తుడయ్యెనో చెప్పవే!

మల్లిక—చెప్పదనుటే తొందరేమి? అత్రము కొంతసేపు నడంచుకొనుము.

కర్పూర—పోనీ, యుంగర మెక్కడయున్నదో చెప్పుము.

మల్లిక—ఉంగరము సుషేణుని యొద్దనున్నది.

కర్పూర—అతనియొద్ద కెట్లు పోయినది?

మల్లిక—వినయంధరు డాతని కిచ్చెను.

కర్పూర—వినయంధరు డెవ్వడు?

మల్లిక—నీకు నమ్మకనబంటు.

కర్పూర—ఏమిది! నానమ్మకనబంటా? నాకడ నెవ్వడైన మగవాడు పనిచేయుచున్నాడటె? మన కంచుకి జనములోనైన నట్టివాడున్నాడా?

మల్లిక—ఉండనీ, లేకపోనీ. అతడు నీవంక.

కర్పూర—(కోపముతో) ఓసీ మల్లికా! మద్యపానము జేసితివా? లేక నిన్నేదేని పిశాచ మావహించినదా?

మల్లిక—మహారాజులకు, మహారాజపుత్రికలకు మద్యము సులభముగా లభించునుగాని పేదదానికి నాకెట్లు దొరుకును? నేనే పిశాచమునై యెల్లవారి నన్నమునకు, వస్త్రమునకు బీకికొని తినుచుండ నన్నువేరొక పిశాచ మావహించునా?

కర్పూర—ఈ యసందర్భ ప్రలాపముల జూడ మకరందుడు సురక్షితముగా నటనుండి దాటెనో లేదో యని సందియము గలుగుచున్నది.

మల్లిక—నేను మల్లిక నగుదునో కానో యను విషయమును గూర్చి సందేహపడుచున్నావా?

కర్పూర—నీవు మల్లికవే! సందియములేదు.

మల్లిక—అట్లయిన మకరందుడు దాటిపోవుటలో సందియము లేదు.

కర్పూర—ఓసీ! నీవక్రోక్తులు క్షణము కట్టిపెట్టి వినయంధరు డెవ్వడో సరిగ జెప్పవే?

మల్లిక—అమ్మా! నాటి జయంధరుడే నేటి వినయంధరుడు.

కర్పూర—జయంధరు డెవ్వడే? నాకు జ్ఞాపకము లేదు.

మల్లిక—కర్పూరమంజరి పక్షమున నుజ్జయిని కరిగి యామె వలపు మకరందుని కెరిగించినవాడె జయంధరుడు.

కర్పూర—(సంతోషముతో) ఓసీ! నీయిల్లు బంగారంగాను, నీవు మగవేషము దాల్చి వినయంధరుడని పేరుపెట్టుకొని సుషేణుని వంచించితివా యేమి!

మల్లిక—అమ్మా! నాచేత బగటివేషములు రాత్రివేషములు వేయించి మీరంతఃపురమున గూర్చుండి మీ తలపెట్టిన కార్యములందు సిద్ధిగాంచుచుందురు.

కర్పూర—ఓసీ! నీప్రజ్ఞ శ్లాఘాపాత్రమే! నీ వేమహారాజు నొద్దనైన మంత్రిత్వము జేయదగుదువే.

మల్లిక—నీవు మకరందుని జేపట్టి మాళవంబునకు మహారాజ్ఞి వైనప్పుడు నీకడ మంత్రిత్వము జేసెదనులే. అప్పుడు మాత్రము నన్ను మరచిపోకుము.

కర్పూర—సఖీ! నాశరీరమును నేను మరతునేని నాప్రాణమును నేను మరతునేని నిన్ను మరతును. కాని వక్రసంభాషణము లేకుండ జరిగిన వృత్తాంత మంతయు జెప్పుము.

మల్లిక—అమ్మా! చెప్పుట కేమున్నది? పరిచారికనైనను జదువుట, వ్రాయుట లెస్సగా నేర్చినదాన నగుటచే మకరందుని వెంటనే విడిపింపుమని మీ యయ్య వ్రాసినట్లొక జాబు వ్రాసితిని, అక్షరములు మీ యయ్య వ్రాసిన యక్షరములవలె నున్నవి.

కర్పూ—గదిలో గూర్చుండి చేసినపని యదియా!

మల్లిక—మరేమి చేసితి ననుకొంటివి? తలుపులు మూసికొని తపము జేసికొంటి ననుకొంటివా? ఆ జాబునకు దోడుగా నుంగరమానవాలు జూపితిని, దానితో నంతపని జరిగినది.

అని తన కావించిన కృషి యంతయు మల్లిక సవిస్తరముగా జెప్పి యానె నానందసముద్రమున ముంచెను.

## ముప్పది నాలుగవ ప్రకరణము

అట్లరణ్యమున బ్రియమిత్రునిం గానక భద్రసేనుడు పొదలు గుహలు చెరువులు వాగులు మొదలగు సమస్త ప్రదేశములు వెదకి వెదకి వేసారి మకరందుని దశను గూర్చి నిదమిద్ధమని నిర్ణయింపజాలక స్వదేశమున కరుగుట కంతకుముందే యిష్టములేక పాంచాలదేశము నకుంబోయి యటనుండి మిత్రుని జాడ లరయవచ్చునని రాజధానియైన కన్యాకుబ్జమునకు జనెను. చని తనరాక మంత్రుల కెరిగించుటయు వారు మాళవరాజ సచివుడైన రత్నసేనుని కొడుకగుటచే వానిని గనుంగడు గారవించిరి. పూర్వపరిచితుడగు మాధవసేనుడు వాని రాకకు మిక్కిలి సంతసించి మకరందుని జాడ లడిగి తెలియజాలక యొంతేని వగచెను.

మకరందుడు నాటి రేయియెల్ల నయ్యుత్తమ తురంగంబు నెక్కి తెలవారునప్పటికి జాలదవ్వరిగి యచ్చట ప్రాతఃకాలకృత్యముల నిర్వర్తించుకొని గుఱ్ఱమునకు మేతవైచి దానికి విశ్రాంతి నొసంగి దాను నొక్కచోట విశ్రమించి మధ్యాహ్నము మరల బయనమై సాయంకాల మగునప్పటికి గాశ్మీరదేశపు బొలిమేర దాటి పాంచాల దేశముం జొచ్చెను. ఒక గ్రామమునం దారాత్రి విశ్రమించి యపాయము గతించినందున స్థిమిత మనస్కుడై యతడు మెల్ల మెల్లగా బయనముజేసి తాను మిక్కిలి డస్సిపోకుండ ప్రాణాపాయము దాటించిన గుఱ్ఱము చెడిపోకుండ బయనంబులు సేసి కతిపయ దినంబులకు రాజధానియగు కన్యాకుబ్జము జేరెను. చేరి రాచనగరు ముందట గుఱ్ఱము నిలిపి తన నామధేయాదులు ప్రతిహారివలన మహేంద్ర దేవునకు విన్నవింప నారాజన్యుడు మకరందుని దన మందిరమునకు

రావించి సన్మానించి యతనివలన రణమందలి పరాజయమును, దాని వెనుక జరిగిన కారాగృహ నివాసాదులును విని విస్మయమును జాలియు నొంది యచ్చట గొన్నిదినము లుండుమని వేడెను. అట్లుకాక యని బహువిధముల వారిచే సత్కృతుడై యచ్చటనుండి తన మిత్రుడగు భద్రసేను నచ్చటం గలిసికొని కౌగిలించుకొని అకస్మికముగా దా నగపడకపోవుట చిత్రభాను ప్రేరితులైన సైనికులు తన్ను బట్టుకొనుటయే కారణమని చెప్పి తన చరిత్ర కథనముచేత వానిం దుఃఖపరవశుం జేసెను.

అంతరంగము గలిసిన మిత్రులు కలిసినప్పుడు గల్గు నానంద మనుభవైకవేద్యమే గాని వర్ణింప నలవిగాదు. అయ్యిరువురు దమ క్షేమవార్తలు దమజాడలు దెలియక దూరపిల్లుచుండు తల్లిదండ్రులకు దెలియజేయింపదగునని మహేంద్రదేవునితో జెప్ప నాతడు విశ్వాసము గల బంట్లనప్పనికై మాళవంబునకు బంపెను. పిమ్మట గొన్నిదినము లచ్చటనుండి కాశ్మీరరాజ్యముపై మరల దండు వెడలవలయునని మహేంద్రదేవునితో జెప్పి మాధవసేనునితోడను, దక్షిణ పాంచాల మంత్రులతోడను, మంతనంబుండి ఆసారి వేరువేరుగాగాక మాళవ పాంచాల సైన్యము లేకమై పోరాటము సల్పిన దప్పక జయంబు సేకూరునని యట్లు చేయునట్లు వారి నొడంబరచిరి. అవ్వల మకరంద భద్రసేనులు పయనమై తమదేశంబునం జనిరి. వారరుగునప్పటికి సుదర్శనుడు రత్నసేనుడు ఘూర్జరంబున నుండిరి. అందుచే వారు రాజధానికిం జనక ఘూర్జరవిషయంబునకుం జని మహారాజాధిరాజై శ్రీమంతుడై పండితులకు గవులకు బీదలకు సాదులకు నాశ్రితులకు నాశ్రయుడై సుగుణరాశియై భూలోకమందారమైయున్న సుదర్శన మహీపాలుడు కాలవక్రగతిచేత రాజ్యభ్రష్టుడై కుంజరంబు దోమ కుత్తుకం జొచ్చిన తెరంగున దనకన్న నన్నివిధంబుల దక్కువవాడగు ఘూర్జరనరేంద్రుని యింట నతిథియై వానిపంచ నుండవలసి వచ్చినందుకు దద్దయు విచారించి ముందుగా నమ్మహీపాలునిం గనుంగొనిరి.

సుదర్శనుడు తన బిడ్డను, మంత్రిబిడ్డనుంగూడ గౌగిలించుకొని—"నాకు నేడు వేయిరాజ్యములు చేకురినట్లు సంతసించుచున్నాడను. ఇక రాజ్య సంపాదనము సులభము. మీ యాగమనమే శుభాగమనము. ఈదినము సుదినము. దుర్దినములు నేటితో గతించినవి. నాకు చిరమిత్రుడును, సాధుశీలుడునైన ఘూర్జరనాయకుడు సేన నాయత్తము చేసియున్నాడు. ఇక మనమీసేనం గైకొని మన రాజ్యంబు మరల సంపాదింపవలయు"నని చెప్పి మితిమీరిన యానంద మొందెను. రత్నసేనుడు కుమారాగమనముచే నానందపరవశుడయ్యెను. చంద్రప్రభాదేవి మరల వచ్చి తన కంటబడి యడుగులకు మ్రొక్కిన కొడుకును లేవనెత్తి హర్ష బాష్పములచే నాతని మూర్ధము నభిషేకించెను.

సైన్యము దండయాత్రకు దగియుండుటచే మకరందుడు సేనాపతియై ఘూర్జరసైన్యమును మాళవదేశంబునకు దీసికొనిపోయెను. రాజ్య మాక్రమించుకొని యుండిన వైదర్భులకును, మకరందుని నాయకత్వమునను న్న ఘూర్జరులకును, సందడికయ్యము జరిగెను. మాళవేంద్రకుమారుని ప్రతాపాగ్నికి వైదర్భులు శలభములైరి. రాజవాహనుని సేన సంపూర్ణముగా బరాజయ మొందెను. హతశేషులు నానాముఖముల బరుగులెత్తిరి. మకరందుని సుదర్శనుని మరల మాళవరాజ్య సింహాసనము నందు బ్రతిష్ఠించెను. రత్నసేనుడు యథాపూర్వకముగ నమాత్యుడయ్యెను. కేసరి రెండవసారియు ద్రోహియై వైదర్భులతోఁగూడి వారివలన లంచములు గ్రహించి దేశాపకారి యగుటచే వానింబట్టి సుదర్శనుడు కారాగృహంబున నుంచెను. దేశమునం బ్రశాంతము నెలకొన్నపిదప మకరందుడు కాశ్మీరదేశ దండయాత్రకై సైన్యసన్నాహము జేయబూనెను.

అటం జిత్రభానుడు వేటనుండి రాజధానికి మరలివచ్చినపిదప సుషేణుడు వానినిదర్శించి "దేవరవారి యాజ్ఞాప్రకారము మకరందుని విడిచిపుచ్చితి" నని మనవిచేసెను. అదివిని చిత్రభాను డదరిపడి— "ఏమీ! నా యాజ్ఞాప్రకారము మకరందుని విడిచితివా? మూర్ఖుడా!

అనృతములాడి నన్ను వంచించెదవా ?" యని బిట్టులుకతో బలికెను. " దేవా ! శాంతింపుడు ఇదిగో ! మీ జాబు, ఇదే మీ రాణవాలుగా బంపిన యుంగరము." అని సుషేణుడు రెండింటిని జూపెను. " ఎవడీ యుంగరమును దెచ్చినవాడు ?" అని మరల నడిగెను. "ఎవడో విప్ర యుంధరుడట! మాళవసచివుడట! మీరు పంపవచ్చినాడట" యని సుషే- ణుడు బదులుచెప్పెను. అదివిని చిత్రభానుడు త్రాచుబాముపలె నెగిరి పడి—"దురాత్ముడెవడో మోసముచేసెను. నా యుంగరము నా వ్రేలి నుండి జారిపోయి యుండవచ్చును. అది తీసికొని నా సేవకులు నన్ను వంచించి యుందురు, అంతఃపురమందు నగరమందుగూడ నెందరో ద్రోహులున్నారు, ఆ ద్రోహులలో నీ వొకడవై యుండవచ్చును. అయ్యయ్యో! పరమశత్రువు దాటిపోయెనే! వాడు మనకడ నుండిన సుదర్శనుడు కాళ్ళబేరమునకు వచ్చునే! ఛీ! దురాత్మా! నీమొగము జూడగూడదు. ఇదియంతయు నీవలననే జరిగినది. అతని స్థానమున నిన్నే కారాగృహమునం దుంచెదన"ని రాజభటులం బిలిచి— " చెరలో సుషేణుని బంధింపుము"ని యానతిచ్చెను. నిర్దోషియైన సుషేణుడు నిష్కారణముగా బంధింపబడినందుకు గర్పూరమంజరి మనస్సున మిక్కిలి విచారించెను. చిత్రభానునకు నంతఃపుర సేవకులపై నెంతో యనుమానము గలిగెనుగాని కర్పూరమంజరిపై గలుగలేదు. నిజస్థితి దెలియక పోవుటచే నత డెవ్వరిని దండింపజాలకపోయెను. గంజాయిమత్తుచేత జంబుకుడు చిత్రభానుని ప్రశ్నలకు నసందర్భములైన యుత్తరములు చెప్పుటచే బెత్తముతో నాలుగుదెబ్బలు తినెను.

అట గాంధారవల్లభుడైన భాగ్యవర్ధనుడు విక్రమసేనుని గద్దె నెక్కించుటకు నిశ్చయించి కాశ్మీరముపై దాడివెడలుటకు మహా సన్నాహము సేయుచూని తనకడనున్న శక్తివర్మం జూచి యిట్లనియె— " ఓయీ! నీవు మాపక్షమున పాంచాలవల్లభుడైన మహేంద్ర దేవునికడకు సందేశము గొనిపోవలయు. మహేంద్రదేవుడును సమర సన్నాహము చేయుచున్నాడని చారులవలన వినియుంటిని. అతడొకసారి

మే మొకసారి వేర్వేరుగా జిత్రభానునిం దాకిన జయము చేకూరక పోవచ్చును. ఉభయ సైన్యంబులు కలిసి యేకముఖముగా బోరిన జయము నవలీలగా జేకూరును. కావున శరత్కాలమున గార్తీకమాసమున శుద్ధపూర్ణిమనాటికి దన సైన్యమును దోడ్కొని కాశ్మీరము బ్రవేశింపుమని యీ మహారాజుతో జెప్పుము. ఆనాటికి మనమును గజరథ తురంగాది చతురంగ బలంబులతో నా దేశము బ్రవేశింతము. నాముద్రగల జాబులుగూడ నిచ్చుచున్నాను. ఇది యాషాఢమాసము గదా! వర్షకాల మాసన్నమగుచున్నది. అది యుద్ధమునకు పీలైన సమయముగాదు. నీవు స్వల్పపరివార సమేతుడవై వెంటనే పొమ్ము" అని యానతిచ్చుటయు శక్తివర్మ మహాప్రసాదమని జాబుల నందుకొని మితపరివారముతో బాంచాలమున కరిగి రాజధాని బ్రవేశించి మహేంద్రదేవుని సందర్శించి సందేశార్థ మెరిగించెను. అతడు సందేశార్థములకు సమ్మతము దెలిపి తన మనుమలు భాగ్యవర్ధనుని చింతినున్న కుశలవార్తవిని మిక్కిలి సంతసించి దౌహిత్రుల ప్రాణములు రక్షించినందుకు శక్తివర్మకు రత్నాభరణములు పారితోషికముగ నిచ్చి గారవించెను.

పిమ్మట శక్తివర్మ యా నృపాలునికడ సెలవు గైకొని గాంధారమున కరిగి మహేంద్రదేవుడు సందేశార్థము నంగీకరించెనని విన్నవించెను. మాళవ పాంచాల గాంధార దేశములం దొక్కసారిగా దండయాత్రా ప్రయత్నములు మిక్కిలి త్వరితముతో జరుగజొచ్చెను. కార్తీకమాస శుక్లపక్షమున కాశ్మీరమునకు ససైన్యముగా రావలయునని మహేంద్రదేవుడు సుదర్శనునకు రాయబార మంపెను. అతడు దాని కంగీకరించెను. మాధవసేనుడు శక్తివర్మవలన రాజకుమారుల క్షేమ మెరిగి మువ్వురు రాజు లేకమగుటచే దప్పక జిత్రభానుడు కూలిపోవునని నిశ్చయించి—"కార్తీకమాస మెప్పుడువచ్చు. నెప్పుడు సేనలు కాశ్మీరముజొచ్చు. నెప్పుడు చిత్రభానుడు జచ్చున" ని యా శుభదినముల కెదురు చూచుచుండెను.

విద్యాపీఠమైన తక్షశిలలో నేటేట శ్రావణమాసమున గొప్ప విద్యాపరీక్ష జరుగుచుండును. అత్తరి విద్యార్థులు వారు వారు నేర్చిన శాస్త్రములలో బండితులు పరీక్షించి యుక్తులగువారికి విద్యానిధి సాహిత్య చక్రవర్తి వేదాంతకేసరి మొదలగు బిరుదములును మిక్కిలి విలువగల శాలువలును ధనమును బారితోషికములుగా నొసంగబడు చుండును. ఆ విద్యాపీఠమంతయు గాంధార రాజుల పోషణముక్రింద నుండుటచే భాగ్యవర్ధను డేటేట నప్పరీక్షా సమయమున కక్కడికి వచ్చుచుండును. ఆ సంవత్సరమును భాగ్యవర్ధనుడు విక్రమసేన హర్ష వర్ధనుల వెంటబెట్టుకొని తక్షశిలకు బోయెను. పండితులచే విద్యార్థులు పరీక్షింపబడిరి. శ్రోతలు మహానందభరితులగునట్లు సామవేదగానము చేయబడెను. మందిరములు ప్రతిధ్వనులిచ్చునట్లు ఋక్కులు యజస్సులు నధ్యయనము చేయబడెను. పూర్వమీమాంసకులు నుత్తర మీమాంసకులు, నుచ్చైస్స్వరములతో తమతమ శాస్త్రము లే సరియని సిద్ధాంతీకరించుటకు మహావాదములు సలిపిరి. కపిలుని నిరీశ్వర సాంఖ్య ము౦ పతంజలీశ్వరి సాంఖ్యము, గౌతమకాణాదుల మతములు. పండితుల జిహ్వారంగముల యందు నాట్యము చేసెను. బుద్ధదేవప్రోక్తములయిన త్రిపిటకములయందును, దమ్మపదాది గ్రంథములయందును దగు పరీక్షలు జరిగెను. భిక్షుకులకు, సన్యాసులకు గాషాయాంబరములు, విద్వాంసులకు విలువగల శాలువలు, విద్యార్థులకు వస్త్రములు, వైదేశికులకు పండితులకు ధనములు మొదలగునవి భాగ్యవర్ధనుడు ఘనవిగా నిచ్చి విద్వజ్జన వంద్యుడయ్యెను.

విక్రమసేన హర్షవర్ధనులు తత్పురము జూడబోయి యొక బౌద్ధ విహారమున భిక్షుణీవేషముతో నున్న యొక యంగనం జూచి మొదట నెవ్వరో యనుకొని సాగి కొన్ని యడుగులు నడిచి మరల ననుమానము దోప వెనుకకునడిచి యా పడతి యెట్టయెదుట నిలిచిరి. ఆమె తలవంచి వారిపంక జూడక యేదో యాలోచించు చున్నట్లుండెను. " అన్నయా ! అమ్మ-అమ్మ-మూడు చూడు " అని హర్షవర్ధనుడు మెల్లగా ననెను.

"ఔను! ఆనవాలు పట్టుటకు వీలులేకుండ వెర్రిదానివలె నున్నది." అని విక్రమసేనుడు దగ్గరకుబోయి "అమ్మా! అమ్మా!" యని పిలిచెను. ఆమె తలయెత్తి చూచెను. ఎట్టయెదుట నామె తపఃఫలములు వలె బంగారు బొమ్మలవలె నిరువురు సూనులు గనబడిరి. కనబడిన తోడనే యామె యానందపరవశయై లేచి నిలువబడి యిరువురు బిడ్డల నొక్కసారి కౌగలించుకొని "నాయనా! బ్రతికియున్నారా? నాయనా! నీవు విక్రమసేనుడవేనా? నాయనా! నీవు హర్షవర్ధనుడవేనా! మీరు నా చిన్ని యన్నలేనా? దృష్టిదోషముచేత నే నెవరిబిడ్డలనో నాతనయులుగా భావించుచున్నానా?" యని మహాసంభ్రమముతో బలికెను. "అమ్మా! నేను విక్రమసేనుడనే, నేను హర్షవర్ధనుడనే, తల్లీ! నీ వెంత మార్పు జెందితివి? మేమే సరిగా గుర్తింపలేకపోతిమి." అని వారు తల్లిని గౌగలించుకొనిరి భిక్షుభిక్షుణీ జనములు మాతాపుత్రుల సమాగమ సౌఖ్యమును గన్నులార జూచి సంతసించి యభినందించిరి. బిడ్డలు తల్లిని భాగ్యవర్ధనునివిడిదికిం దీసికొనిపోయి యాతని కెరిగించిరి. అతఁడామెను బహూకరించి మాతాపుత్రుల సమాగమము భావికాల శుభమునకు సూచకమని వక్కాణించెను. తల్లియు బిడ్డలు దమతమ కష్టముల నొండొరులకుం జెప్పుకొని తత్తత్సమయోచితముగా దుఃఖమును నానందమును నొందుచు వచ్చిరి. అచ్చట గొన్ని దినములుండి భాగ్యవర్ధనుడు విక్రమసేన హర్షవర్ధనులను నరవిందాదేవిని దోడుకొని స్వనగరంబున కరిగి యుద్ధసన్నాహముల జేయుచుండెను.

ఆ వర్షర్తు వతిరమణీయముగా నుండెను. గ్రీష్మకాలమున బ్రభాకరుని చండమయూఖముల తైక్ష్ణ్యమునకు గగనమంతయు బీటలు వార గాలపురుషుడు బీటలు గానబడకుండ మెత్తిన బురదయో యనునట్లు నభోమండలమంతయు మేఘపటలసంఛన్నమై కనబడెను. భీష్మంబగు గ్రీష్మమున దాపమునకోర్వలేక తహతహంబడిన భూదేవి మేన జల్లుకొన్న పన్నీరోయన వెల్లివిరిసి నేలంబడుచున్న యాకాశగంగయోయన వర్షములు సాంద్రములై కురిసెను. ఉరుము ఢణంఢణ

ధణధ్వానములతోడను, నడనడ ఘణిల్ఘణిల్ఘణిల్మని పడియెడు పిట్ట పిడుగుల చప్పుడులతోడను, బెకబెకలాడు బోదురుకప్పల యులివుల తోడను బ్రహ్మాండము ప్రతిధ్వనించుచుండెను. భగ్నమనోరథులై పరితపించువారికి నెడనెడం బొడకట్టు నల్పాశలంబోలె దళతళతళమని కన్నులకు మిరుమిట్లు గొలుపునట్లు మెరుపులు మెరయజొచ్చెను. గ్రీష్మకాలమున ప్రభాకరుని చండతైక్ష్ణ్యముచేత నెండి శుష్కిన జలాశయ శిశువులను పెండియు ప్రకృతిలక్ష్మి దృఢగాత్రులం జేయుటకు నొసంగెడు స్తన్యమో యన పయోధరములనుండి శుద్ధ పయోధారల వెల్లివిరియున ట్లొసంగెను. నదీనదంబులు పొంగెను. వాగులు నిండెను. తటాకములు జలపూర్ణములయ్యెను. ప్రపంచ మంతయు జలమయమయ్యెను. మార్గంబు లరికట్టబడెను. ప్రయాణములు దుస్సాధ్యములయ్యెను. ప్రపంచమంతయు జల్లగా నున్నను నావర్ష కాలమున మకరందుని మనస్సు వియోగ వేదనా సంతప్త మగుటంజేసి యతడు సౌఖ్యముం గనక నిరాశా మేఘచ్ఛన్నములైన యీ దినములను దుర్దినములుగా భావించి కాల మెట్టటో గడుప జొచ్చెను. కర్పూరమంజరియును మకరందుడట్ల ప్రియవిరహ సంతాపమున బొక్కుచు నాదుర్దినము లెన్నటికైనా గతింపకపోవునా యని మంచికాలమున కెదురుచూచుచుండెను.

## ముప్పది యైదవ ప్రకరణము

శరత్కాలము ప్రాప్తించెను. అయ్యాది పరమేశ్వరుని సృష్టికి ప్రతిసృష్టి చేయంజాలు మహాకవి వాక్ప్రౌఢిమకును జిత్రకారుని తూలికా నైపుణ్యమునకును నతీతమై సౌందర్యనిలయమై యతి శోభావంతమై యలరజొచ్చెను. భూమండలమున రాజేంద్రులు ధనుస్సులు పూని విజృంభింతురు గావున తన ధనుస్సుతో నింక బనిలేదని కాబోలు మహేంద్రుడు తన చాపంబును గగనమందు ప్రదర్శింపక

దాచెను. వానకారున మేఘమండలముచే నాచ్ఛాదితుండైన సహస్ర మయూఖుడు బంధవిముక్తుడైన మహాతేజశ్శాలియుంబోలె మున్ను జడమైన బ్రహ్మాండమున కంతకు వెండియు నఖండ చైతన్యము గలుగునట్లు దేదీప్యమాన ప్రభలతో వెలుగజొచ్చెను. దిక్కులు ప్రసన్నములయ్యెను, బురదలేడి నేల గట్టిపడెను. జనుల గమనా గమనముల కనుకూలముగా బాటలేర్పడెను. మున్ను కూలంకషములై దేశంబులపై దండువెడలి గృహారామక్షేత్రాదుల నాశనంబు జేసిన మహావాహినులు తమ గాంభీర్యముం గోల్పోయి విజృంభణము వెడలి సామాన్యజనులు తమ్ము దాటిపోవు పాటి రేవులుగలిగి కల్మషరహితము లైన నిర్మలోదకములుగలిగి యక్కడక్కడ దమ తిప్పలు బైలుపడ దొంటి యైశ్వర్యమంతయు గోలుపోయి గర్వహీనులై నెల్లవారికి జులకనై పేదలట్లుండెను, సరోవరములు పగలు వికసించి కనుల పండువుసేయు తామరలతోడను, రాత్రులు వికాసముజెంది నయనాభి రామంబులగు కలువలతోడను వెలయుచు నిరంతర మందహాసమున గలకలలాడు నెమ్మొగంబులుగల విలాసవతులట్లు శోభిల్లుచుండెను. పసరసుడు తన యింటికి వచ్చిన నాపరసుని కౌగిటజేర్చి యాదరించు వెలవెలదుకలట్లు సరోవరంబులు పట్టపగంట దర్శనంబిచ్చు ప్రభాకరుని రేలగానబడు శీతమయూఖుని బద్మదళ హస్తములతోడను గలువ రేకుల చేతులతోడను గౌగిలించుకొనుచు వారి కరస్పర్శల ధన్యత నొందుచుండును. ఆకాశమున నగస్త్య నక్షత్రము తోచెను. రాకాచంద్రమండలము విశల నిష్కళంకమై నిరుపమానమై నితాంత మనోహరమై నేత్రపర్వమైన పండు వెన్నెలలు గాయజొచ్చెను. నిశాలక్ష్మి వెన్నెల యను తెల్ల దువ్వలువగట్టి నక్షత్ర మాలిక యను ముత్యాలసరము దాల్చి వర్ణనాతీతమైన శోభ గలిగి విరాజిల్లు చుండెను. పొలము లన్నియు బండబారెను. వసుంధర సస్యభరితమై చూలుదాల్చి నెలలు నిండిన పడంతుకవలె దర్శనీయమై యొప్పెను. ఎప్పుడు శరత్కాలమువచ్చు నెప్పుడు మహావాహినీ సమూహములగోని

కాశ్మీరముపై దండు విడియనగునని నిరీక్షించుచున్న గాంధార పాంచాల మాళవేంద్రులకు రూపు దాల్చిన తమ మనోరథముంబోలె నాశరదృతువు కనబడెను.

గాంధార సైన్యంబులు భీష్మంబులై గ్రీష్మంబట్లు పరసైన్యంబుల శోషింపజేయ గలిగియుండె. బాణవర్షంబుల బగతుర ముంపజాలి పాంచాల సైన్యంబులు వర్షర్తువులట్లుండెను. మాళవేంద్ర సేనలు శీతాకాలంబట్లు తెల్లవారి గడగడ వడకింపజాలి యుండెను. బాణంబులు, తూణంబులు, నరవంబులు, ద్విరదంబులు, ధనుస్సులు, క్షుభిత మనస్సులు, హయంబులు, భటచయంబులు గలిగి మూడు సేనలు నేకకాలమున సన్నిధియైన ముక్కారులట్లు, ముచ్చిచ్చులట్లు ముక్కరలదేరి మువ్వన్నెనలువలు దాల్చిన జోదులు గలిగి బైలుదేరి కార్తీకశుద్ధ పూర్ణిమనాటికి గాశ్మీరదేశముం బ్రవేశించెను. తనచే బరాజితులైన మాళవ పాంచాల భూపతులు మరల మూకలం గూర్చుకొని తనపై నెత్తివత్తురని చిత్రభానుడు తలంచుచుండెనుగాని గాంధారనాయకుడు తనపై దాడివెడలునని యాతడెన్నడును దలంచి యుండలేదు. ముగ్గురు రాజులును సకల సమర సన్నాహంబు చేసికొని దనపై దండు విడియుచున్నారని చారులవలన విని చిత్రభానుడు తత్తరపడి తన సేనల జక్కజేయ జొచ్చెను. విశ్వసింపదగిన బంట్లను దండపాణిని వెదకుటకై కాశీ మొదలగు మహాక్షేత్రములకు బంపెను. క్రొత్తజోదుల సేనలో జేర్చుకొనెను. మగటిమిగల జోదులను జిన్న దండనాథులుగ జేసెను. వలయు ప్రయత్నము లన్నియు జేసెను. వైదర్భులను సాయమురమ్మని సందేశ మంపెనుగాని వారు మకరందునిచే బరాజితులై నిశ్శేషముగా జెదరిపోవుటచే నట్టి సాహాయ్యముం జేయజాలరైరి. కావున జిత్రభానుడసహాయుడై తనలావును నమ్మకొని యుండవలసినవాడయ్యెను.

యథానిర్దిష్టముగ గార్తీకశుద్ధ పూర్ణిమనాటికి మూడు సైన్యములు శ్రీనగర పరిసరంబుల విడిసెను. గాంధారవల్లభుడు, పాంచాల

నాయకుడు, మాళవ రాజనందనుడగు మకరందుడు నొండొరులం గలిసికొని కుశలంబు లరసి సమరం బెట్లు జరుగవలయునో యా విధాన మునుగూర్చి తర్కించిరి. భార్గవవర్ధన మహేంద్రదేవులు తమ దళంబు లకుం గూడ మకరందుని దండనాథునిజేసి యాతని యాజ్ఞ ప్రకారము నడువవలసినదని తమ సేనానాయకుల కాజ్ఞనొసంగిరి. భార్గవవర్ధనుని వెంట వచ్చిన విక్రమసేన హర్షవర్ధనులు పాంచాల సైన్యముతో వచ్చిన మాధవసేనుని గలిసికొని తమకై బెంగపెట్టుకొనిన యా వృద్ధ మంత్రి కానందము గలిగించిరి విక్రమసేనుడు గాంధార సైన్యమున నొక భాగమునకు దండనాథుడై మకరందుని యాజ్ఞ నిర్వర్తించు చుండెను. గాంధారవల్లభుడు మకరంద మహేంద్రదేవులతో నాలోచించి తన యమాత్యుడైన జీవసిద్ధిని జిత్రభానునికడకు రాయబారిగా బంపెను. అతడును గాశ్మీర నరపాలునికడ జెప్పవలసిన సందేశార్థము లన్నియు జాగరూకతతో సంగ్రహించుకొని చిత్ర భానుని సందర్శనము వేడి వాని యనుమతమున సన్నిధి కరిగి సత్కృతుడై తన సందేశమును నెరిగింప ననుజ్ఞ వేడెను. అప్పుడు వారిక్రిందివిధమున ముచ్చటించిరి.

జీవ—మహారాజా! మా ప్రభువగు భార్గవవర్ధనుడు సంగ్రహ ముగా సందేశ మెరిగించి రమ్మని పంపెను. ఆ సందేశ మిది; గతించిన దానిని మరల ద్రవ్వుకొనుట నిష్ప్రయోజనము. విక్రమసేనుని గాశ్మీర సింహాసన మెక్కించి హర్షవర్ధనుని యువరాజుజేసి నీవు పరిటంబ ముగా గాశ్మీర రాజ్యము విడిచి పోదువా లేక కయ్యమునకు గాలు ద్రొక్కొందువా? ఇందు నీకేదియిష్టమో దానిం జేయుము. ఇంతే సందేశము.

చిత్ర—ఇంకను విక్రమసేన హర్షవర్ధను లెక్కడ? వారు మృతినొందిరి. చచ్చినవానిని రాజుం జేయుటెట్లు? యువరాజుం జేయుటెట్లు?

జీవ—రాజా! నీవు మేలుకొనియు గలగనుచున్నావు. విక్రమ సేన హర్షవర్ధనులు జీవించియున్నారు. దండపాణి త్రవ్వించిన గోతిలో

దండపాణియే పడియెను. రాజపుత్రులం జంపదలచివచ్చి తాఁజచ్చి నీమాయాసముద్రంబున మునిగిపోక రాజపుత్రులు సురక్షితులై గాంధారమునకువచ్చి నేఁడీ సేనతో నిటకు వచ్చియున్నారు.

చిత్ర—(తెల్లబోయి) ఏమేమి! బ్రతికియున్నారా! ఇది పరిహాసమా? నీవు మతి దప్పి మాటాడుచున్నావా?

జీవ—పరిహాసముగాదు, మత్తసంభాషణముగాదు. నిజము.

చిత్ర—బ్రతికియున్న మనసరే! చచ్చినమనసరే! రాజ్యము నేనియ్యను. వెంటనే యిచ్చోటు విడిచిపొమ్ము. లేకున్న నీప్రాణములు దక్కవు.

జీవ—చిత్తము, ఇదే సెలవు పుచ్చుకొనుచున్నాను. (అని వెడలిపోయెను)

అప్పలుకులు వినినదాదిగా జిత్రభానుని మనస్సు మిక్కిలి సంక్షోభిత మయ్యెను. "ఏమీ! దండపాణి మృతినొందెనా? రాజకుమారులు బ్రతికియున్నారా! రాకొమరులం చచ్చిరని దండపాణి తీర్థయాత్రలు సేవించుచున్నాడని చండుఁడు చెప్పినమాట యబద్ధమా? చండశక్తివర్మలు వంచించి యుందురా? అయ్యయ్యో! సర్వము జెడిపోయినది, నా కట్టిన మేడలు కూలిపోయినవి." అని తనలో జింతించుచుకొనుచు గ్రుద్ధభట్టుకడకు బోయి జీవసిద్ధిసందేశ మెఱింగించెను. అతఁడును మొదట నమ్మకట నమ్మక యెట్టకేలకు రాయబారమునం దబద్ధముండదని నిశ్చయించి యెట్లయిన సమరసన్నాహమే కర్తవ్యమని యుపదేశించెను.

చిత్రభానుని ధైర్యము సడలెను. సందేశార్థము విని గడచి నట్లు వాని యుత్సాహము నడంచెను. దండపాణి వచ్చునను నాస యడుగంటెను. అట్టి కష్టసమయమున భ్రాతృమరణవార్త వజ్రపాణి కెరింగింపఁగూడదని యవ్వార్త దన మనంబుననే యడంచుకొనెను. దండపాణి లేకపోవుటయు వెనుకటి యుద్ధములో మిరియులవంటి పొదులు, దండనాథులు హతులగుటయు, బొక్కసములోని ధనము

తన్నిమిత్తమై వ్యయమగుటయు రాజకుమారులు బ్రతికియుండుటయు మున్నగు విషయములు చిత్రభానున కమితవిషాదము గలిగించెను. ధనము చాలమి నగరమందున్న సంపన్నులగు బేహారులను నితర గృహస్థులను రావించి యుద్ధము నిమిత్తము కొంత సొమ్ము గావలెనని చెప్పి యిమ్మని యడిగెను. ఇచ్చినవారిని మరికొంత హెచ్చుగా నిమ్మనియు, లేదన్నవారిని దప్పక యియ్యవలసినదనియు నిర్బంధించి హింసించెను. ప్రజలు భయభ్రాంతులై చిత్రభానుని దూషించి వాని వినాశమును గోరిరి. కొందరు పారిపోయిరి. పరుగెత్తినవారిని యతడు పట్టి తెప్పించి శిరచ్ఛేదము జేయించి వారియిండ్లు దోపించెను. తన జయము నిమిత్తము దేవాలయంబుల ప్రార్థనలు చేయవలసినదని బ్రాహ్మణోత్తముల నియోగించెను. రాజువలన భూరిసంభావనల నపేక్షించిన బ్రాహ్మణోత్తములు వానికి జయము ప్రసాదింపుమని పరమేశ్వరుం బ్రార్థించిరి. దేశాభిమానులగు బ్రాహ్మణులు మరల వాని కపజయమును మరల విక్రమసేనుని ప్రతిష్ఠము గావలెనని సర్వేశ్వరుని వేడుకొనిరి. రుద్రభట్టు చిత్రభానుని విజయమునిమిత్తమై గ్రహశాంతులు సేయనారంభించెను. గ్రహదోష నివారణార్థము బ్రాహ్మణులకు భూరిదానము లిప్పించెను.

జీవసిద్ధి తన సందేశ పర్యవసానమును భాగ్యవర్ధనాది ప్రభువుల కెరిగింప వారు యుద్ధసన్నద్ధులైరి. రణభేరులు మ్రోగి కోటలోనున్న యుంగనల గుండియలు జల్లుజల్లుమన జేసెను. ఆ భయంకర ధ్వానము లకు నభమున బారెడు పిట్టలు చుట్టచుట్టుకొని బిట్టరచుచు నేలం బడియెను. గాంధార సైన్యములు పట్టణమున కుత్తరమునను, పాంచాల వాహినులు పడమటను, మాళవ సైన్యములు దక్షిణమునను విడిసి స్కంధావారమును నిర్మించుకొనెను. ఊరికి దూర్పున సింధువున కుపనదియైన జీలమునది ప్రవహించుచుండుటచే నచ్చట నెవ్వరును విడియుటకు వీలు లేకపోయెను. కార్తీకశుద్ధ పంచమినాటి యుదయమున యుద్ధ మారంభమయ్యెను. చిత్రభాను డిష్టదేవతలకు గృహదేవతలకు వేదవేదాంగ పారంగతులగు విప్రులకు రుద్రభట్టునకు నమస్కరించి

వారి కడపటి యాశీర్వచనముల బడసి కవచంబును శిరస్త్రాణంబును దొడిగి విల్లుబూని వజ్రపాణియు కుమారుడు విజయసేనుడు దక్షిణ సేనాపతులు వెంటరా రణరంగము జొచ్చెను. అతడు తన సైన్యమును మూడు భాగములు చేసి యొక భాగంబునకు దాను మొనగాడై భాగ్యవర్ధనునిమీదికి నడిపెను. రెండవ భాగమునకు దన కుమారుడైన విజయసేనుని దండనాథునిగ జేసి కొందరు చిన్ని సేనాపతులను వానికి సాయమిచ్చి మహేంద్రదేవునిమీది కంపెను. మూడవ భాగము వజ్రపాణికిచ్చి మకరందునిమీది కంపెను. నాలుగు సైన్యంబుల ఘోషము నాలుగు సముద్రముల మహాఘోషము ననుకరించెను. సమరము కురుపాండవ యుద్ధమును జ్ఞాపకకు స్మరణకు దెచ్చెను. ముందుగా చిత్రభానుడు భాగ్యవర్ధనుం దలపడెను. విజయసేనుడు మహేంద్రదేవుని దాకెను. వజ్రపాణి మకరందుని మీదికిం జనెను. గ్రద్దరెక్కలు గట్టిన వాలుటమ్ములు యోధుల చేతులనున్న విండ్లనెడు క్రొక్కారుమబ్బులనుండి వర్షధారలట్లు రివ్వురివ్వున బడజొచ్చెను. ఖడ్గపాణులగు జోదులచే నరుకబడిన వీరుల శిరంబులు మృత్యుదేవత తిని పారవైచిన తాటిపండ్లయట్లు ముంజెలట్లు నానె పానపాత్రంబులట్లు తోచెను. పాదంబులు తెగిన యూర్ధ్వభాగంబులు శిరంబులులేని మొండెంబులు, బాహువులు తెగి కొమ్మలు తెగిన మ్రానులట్లుగ చూపట్టు కళేబరములు మిక్కిలి భయంకరములై కానబడియెను. చచ్చినవారు, మరణవేదన బడుచున్నవారు, ప్రాణములు గుటగుటలాడుచున్నవారు, కట్టకడపటి శ్వాసలు విడుచుచున్నవారు, దాహపీడితులై మాటాడలేక సన్నలు చేయువారు, వెదచూపులు చూచువారు, ప్రాణావసాన సమయమున గూండ్రించువారు, బాధపడలేక యరచువారు, హాహారీ యనువారునై పడిన జోదులు పలుతెరంగులగు నవస్థలకు బాలయిరి.

కయ్యము మూడు దినములు జరిగెను. మొదటినా డెవ్వరు గెలిచిరో యెవ్వరోడిరో చెప్పుటకు వీలులేకపోయెను. రెండవనాడు విజయసేనుడు మహేంద్రదేవుని వాలుటమ్ముల మూర్ఛిల్లి యొడలు

తెలియక పడియెను. తోడనే యంగరక్షకులు వానిని శిబిరమునకుం గొంపోయిరి. వాని సైనికులు పగరకు వెన్నిచ్చి పరుగిడిరి. చిత్రభానుడవ్వార్తవిని తన గారాబు కొడుకున్న నెలవున కరిగి శస్త్రవేదనా పరవశుడైన యాతనిం జూచి జీవనాశ లేదని విచారాక్రాంతుడయ్యెను. మునుపున్న యుత్సాహము గూడ వానిని విడిచెను. "కుమారా! నీనిమిత్తమేగదా యీరాజ్యము సంపాదించుట? నీనిమిత్తమేగదా మాయలుపన్ని యెన్నెన్నో పాపములు చేయుట? తండ్రీ! నీవులేనిచో నాకీసమరమేల? సామ్రాజ్యమేల?" యని గుట్టుగలవాడగుటచే లోలోపల దుఃఖపడి పైకి గాంభీర్యము వెలిపుచ్చి సైనికుల మనంబుల నుత్సాహము బురికొల్పుచు కుమారునకు దగు చికిత్సలం జేయింప జొచ్చెను. చిత్రభానుని యుత్సాహ మట్లే వాని సైన్యమును రెండవ నాటికి బలుచబడెను. మూడవనాటి మధ్యాహ్నమున మకరందునిచే వజ్రపాణి తెగటారెను. పాప మాతనికి కర్పూరమంజరీ పాణిగ్రహణ మహోత్సవము లభింపకున్నను వీర పురుషోచితమైన శస్త్రమరణము గలుగుటచే మందారమంజరీ సమేతలైన యచ్చర మచ్చెకంటుల కేలు వట్టు భాగ్య మొదవెను. దండపాణి లేకపోవుటచేతను, విజయసేనుడు గాయపడుటచేతను, వజ్రపాణి నిహతుండగుటచేతను, చిత్రభానుని యుత్సాహాగ్ని చల్లవడెను. వాని సేనలు గాంధారుల పోటులకును, పాంచాలుర యేటులకును, మాళవుల ప్రహారములకును నిలువలేక వెనుకదిరిగి చూడక పరుగెత్తిరి. కొందరు మొసళ్ళపాలయిరి. దూరము కొట్టుకొనిపోయిరి. యుద్ధభూమి గుఱ్ఱములయు, బదాతులయు నేనుంగులయు బీనుంగులతోడ నతి భయంకరమై హేయమై మృత్యుదేవత రాజధానివలె నుండెను.

చిత్రభానుడు శత్రువులు తరిమి తరిమి మీది మీదికి రాగ సేనలు లేక యుత్సాహము లేక నూరుమంది సైనికులతో యుద్ధభూమి విడిచిపోయెను. జీవసిద్ధి కొంత సేనతో వాని వెనువెంట నంటి పోయి తరిమి దాదాపుగ నందరం జంపె. చిత్రభానునకు రెండు కన్నులట్లు రెండు చేతులట్లు బనిచేసిన కరటకపింగళులు వెంటరా నతడు గత్యంత

రము లేక ప్రాణరక్షణము కొరకు జీలమునదిలో బడెను. ఈతయందు మిక్కిలి పరిశ్రమ చేసినవాఁ డగుటచేతను నప్పటికి సాయంకాల మగుట చేతను జీకటిచాటున నెట్టెటో దూర మీఁదికొనిపోయి రెండుజాముల రాత్రివేళ కవ్వలియొడ్డుం జేరి తడిబట్టలతో గడగడ వడకుచు నేకాకియై యవ్వలియొడ్డు జేరి తన యవస్థం గూర్చి భవిష్యత్కర్తవ్యమును గూర్చి తనలో తాను వితర్కించుకొనుచుండ గరటక పింగళులును దడిసిన బట్టలతో వచ్చి వానిం గలిసికొనిరి. ఆ సాయంకాలమున యుద్ధభూమి యందు నెత్తురు లేరులై ప్రవహించెననుట యతిశయోక్తి గాదు. ఏనుగు తొండములనెడు తూములనుండి నెత్తుటి వరదలు వసుంధరపై విచ్చలవిడిగ బ్రవహించెను. ఆ నెత్తురు వసుంధరాదేవి దాల్చిన కుసుంభారుణవస్త్రమట్లు మృత్యుదేవత యింట సంతోషమున జల్లుకొన వసంతమట్లు, నాకసమునుండి నేలకువిజృంభించిన సంజకెంజాయయట్లు నెరసెను.

చిత్రభానుఁడు రణరంగము విడిచి పారిపోయినపిదప మకరందుఁడు "భాను డస్తమించె. చిత్రభాను డస్తమించినట్లె యింక సైన్యములు శిబిరమునకుం జనుం" డని యానతిచ్చి కోటచుట్టు గొంతసేన గావలి పెట్టెను. చిత్రభానుని పరాజయమును బలాయనమును విని రుద్రభట్టు తద్దయు వగచి కోటయొక్క దొడ్డిగుమ్మము దెరచి పారిపోవుచుండెను. మాళవసైనికులలో గొందరా ప్రాంతమును గాచుచుండుటచే వా రాతనింబట్టి మకరందుని కప్పగించిరి. మకరందుఁడు వానిని మాధవసేనునికడకు గొంపోయెను. అతఁడు పేదకు బెన్నిధి దొరికినట్లె సంతసించి కాలు సేతులు గట్టిగా బంధింపజేసి వానినొక గుదారమున బడవైచి చుట్టు నమ్మికగల బంట్లం గావలియుంచెను.

## ముప్పది యారవ ప్రకరణము

మరునాఁ డుదయమున భాగ్యవర్ధనుఁడు మకరంద మహేంద్రదేవులను దన స్కంధావారమునకు రావించి కోట స్వాధీనము జేసి

కొనుటకై పోవలెనని చెప్పెను. అప్పుడు మకరందు డిట్లనెను-"కోటలో చిత్రభానుని కుటుంబమున్నది. వారు శుద్ధాంత కాంతలు. చిత్రభాను డనేక దురితములు చేసియుంట నిజము. కాని యాతని యాలుబిడ్డలా దోసములం బాలుకొనలేదు. కావున వారి కేవిధమైన యవమానంగాని, యగౌరవముగాని మనము తలపెట్టగూడదు. అదియునుగాక గాయపడిన విజయసేనుడు గూడ గోటలోనున్నాడు. అతనియెడ మన మనాదరణము జూపగూడదు. మరియొకమాటగూడ జెప్పదలంచితిని. సమర విజయగర్వముచే మనసైనికులు సేనాపతులు శ్రీనగరము గొల్లగొట్ట నుబలాటపడుచుందురు. పురజనుల కించుకేనియు నలజడి కలుగగూడదని నా మతము. వారుచేసిన యపరాధ మేమియు లేదు. నా పలికిన పలుకులు మీకు సమ్మతము లగునేని మనమందరము కోట నాక్రమించుకొందము" అనవుడు విక్రమసేను డిట్లనియె—"మకరందుని పలుకులు నాకు సమ్మతములు. మా పినతల్లి యిందుమణి సాధుశీల. కర్పూరమంజరి తన సోదరుడగు విజయసేనునియెడ నెంతయభిమానము గలిగియున్నదో మాయెడ నంత యభిమానము సంత్రేమ కలిగియున్నది. విజయసేనుడు దుర్జనుడుగాడు. తండ్రి దుశ్చరితుడను కారణమున పినతండ్రి దనయుని హింసించుట ధర్మముగాదు. నా పినతండ్రి దండ్యుడు గాని తత్కుటుంబంబు గాదు. పురజనులు నాయందనురక్తులు. కావున వారు మన యాదరంబునకుం బాత్రములు."

వారిరువుర పలుకులు సహేతుకముగా నుండుటచే మహేంద్ర భాగ్యవర్ధనులు వారు చెప్పిన చొప్పున నడువ దలంచిరి. వారందరు మాధవసేనునిగూడ వెంటబెట్టుకొని యాయుధపాణులైన కొందరు సైనికుల దోడ్కొని కోటం బ్రవేశించిరి. వారివలన దమ కేమి యపాయము వాటిల్లునో యని భయపడుచున్న యంతఃపుర జనంబునకును బరిజనంబునకును నభయప్రదానంబు చేసిరి. విక్రమసేన హార్షవర్ధనులు జీవించియున్నారని తెలిసినప్పటినుండియు గర్పూరమంజరి మిక్కిలి సంతసించి వారిం జూడ నభిలషించుచుండెను. విక్రమసేనుడు భార్యాసమేతుడై యంతఃపురమున కరిగి యిందుమణికి నమస్కరించి మెట్ట

యెదుట నిలిచెను. ఆమె వానిని మెల్లగా దీవించి తన భర్తవిషయమై విచారించుచు దలవంచుకొని యుండెను. కర్పూరమంజరి విక్రమసేన హర్షవర్ధనులను కౌగలించుకొని హర్షవర్ధనుని ముద్దుపెట్టుకొని—"తమ్ములారా! మీరు మరల నాకంట బడినందుకు నా మనస్సు పరమానందము నొందుచున్నది. వెనుకటిదంతయు మరచిపోయెదు. మీయమ్మ యెక్కడనున్నది?" అని వారిం బరామర్శ చేసెను. అప్పుడు విక్రమసేనుడు—"అక్కా! దైవానుగ్రహమున వెండియు మిమ్ము జూచు భాగ్యము గలిగినది. ప్రాణపగను వెండియు నుజ్జీవింపజేయ దలచుకొనలేను. మీకు మావలన నెట్టిభయము లేదు. చేతులార జేసికొన్న దుష్కృతఫలము మీ తండ్రి యనుభవించెను. విజయసేనునెడ గూడ మా కెట్టి చెడ్డతలంపులు లేవు. మీరు నిర్భయముగా నుండుడు." అని చెప్పి యనంతరము విజయసేనునికడకు బోయి వానికి గూడ నభయంబొసగి వ్రణవైద్యుల రావించి వానికిం జికిత్సలుచేయ బనిచెను. పిమ్మట వారందరు వెండియు స్కంధావారంబునకు జనిరి.

మాధవసేనుడు పట్టణంబునకుంజని మణివర్మయొక్కయు శూలపాణి గదాధరుల యొక్కయు, దుస్థితి దెలిసికొనివచ్చి వారిని బంధవిముక్తుల జేయుమని విక్రమసేనునితో జెప్పెను. అట్లుకాక యుని కొంత పరివారమునిచ్చి యుతడా కార్యము చేయుటకు మాధవసేనుని నియోగించెను.

మాధవసేనుడు పరివార సమేతుడై కారాగారంబున కరిగి యుపవాసంబులచేతను, దేహపీడచేతను మనోవిచారముచేతను మిక్కిలి కృశించి యానవాలుపట్టుటకయిన వీలులేని స్థితిలోనున్న తన మిత్రుని మలినవస్త్రధారుని గృశీభూతగాత్రుని మణివర్మం గనుగొని కన్నుల వేడికన్నీరొలుక గాఢాలింగనము జేసికొని సమరవృత్తాంత మంతయు నాతనితో జెప్పి విక్రమసేనుని విజయ మెరిగించి బంధవిముక్తుని జేసెను. అనంతరము గదాధరశూలపాణుల గూడ నాతడు విడిపించెను. వారు మువ్వురును తోడనే గృహములకుం జనక తమకృతజ్ఞతను రాజభక్తిని బాలుడైన విక్రమసేనునకుం దెలుప నాతని నిలయంబునకుం బోయి

యెట్టయెదుట నిలిచిరి. మణివర్మం జూచినతోడనే విక్రమసేనుడు లేచి నమస్కరించి కౌగలించి—"తాతగారు! మాకొరకై మీరు చెప్పరాని యిడుములు బడితిరి. మిమ్ము వెండియు మేము చూతుమనుకొనలేదు. మొదట ప్రతికూలముగా నున్నను దైవము తుదకు మన కనుకూలు డయ్యె" నని పరామర్శపూర్వకముగు పలుకులు పలికెను. మణివర్మ వానిని దమ్ముని గనుగొన గల్గినందుకు సంతసించి యుక్తే మూర్ధాభిషేకము జరుగునని సూచించుటకో యన నానందాశ్రువులచే వారి శిరంబుల నభిషేకించి—"నా చిన్నయన్నలారా! మృత్యుదేవత కోరల నడుమ జిక్కియు నదృష్టవశమున జీవింపగల్గితిరి. దురాత్ముడయిన చిత్రభానుడు రణమున జచ్చినాడా? చేసినపాపము వడ్డితో గట్టి కుడువకపోవునా? లేదా వ్రణశేషము, రణశేషము, ఋణశేషము నుంచగూడదని పెద్దలు చెప్పుదురు. వానిని విచ్చలవిడిగా జరింప నిచ్చితిమా పిచ్చికుక్కను గ్రామమున విడిచినట్లె. కావున సైన్యము నంపి వానింబట్టి తెప్పింపుము." అని బహూకరించి హితోపదేశముజేసి సెలవు గైకొనియెను. గదాధర శూలపాణులును దమ కృతజ్ఞతం దెలిపి చనిరి.

అనంతరము రుద్రభట్టు నేమిచేయ దగునని భాగ్యవర్ధనుడు మకరంద మహేంద్రదేవులను, మాధవసేనుని విక్రమసేన హర్షవర్ధనులను బిలిపించి యడిగెను. మకరందుడు వానిని దేశమునుండి వెడలగొట్టుట కర్తవ్యమని పలికెను. వానిని యావజ్జీవము కారాగృహమున నుంచదగునని విక్రమసేనుడనెను. "బ్రాహ్మణో న హంతవ్యః" యని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. గనుక నామనుమడు చెప్పినట్లు మకరందుడు చెప్పినట్లు జేయుట సముచితమని వృద్ధుడైన మహేంద్రదేవుడు వాక్రుచ్చెను. మాధవసేనుడు వారిమాటల కిష్టపడక రోషావేశముగలిగి యిట్లనియె—"అయ్యా! మీరందరు మూర్ధాభిషిక్తులు ధర్మాధర్మ విచక్షణులు. మీ రెరుగని ధర్మములు లేవు. నేను మీ కేవిషయమునం జెప్పదగినవాడనుగాను. అయినను నాదొక్క

చిన్న మనవిగలదు, ఇతడు బ్రాహ్మణుడగుటచే నవధ్యుడని పాంచాల వల్లభుడు పలికె. ఆ యభిప్రాయముచేతనే విక్రమసేనుడు యావజ్జీవ కారాగారగృహవాసము విధించె. పరమదయాళువగుటచే మకరందుడు వానిని దేశభ్రష్టు జేయుమనియె. ఈమాటలు నాకు సరిపడవు. వాడు బ్రాహ్మణుడు గాడు ఛండాలుడు ఛండాలుడనుట కూడ ఛండాలుర నవమానించుటే, ఛండాలురు గూడ వీనికర్మలంజూచి సిగ్గుపడవలయును. కటికవాండ్రు సైతము వీనిచర్యలుజూచి కంపింతురు. వీడే హరిశర్మయను పేరుపెట్టుకొని చిత్రభానుం గూడి హేమచంద్ర మహారాజుం జంపించెను. వీనియుపదేశంబుననే చిత్రభానుడు బాలకుల దారుణంబుగ జంపింపదలచె. అగ్నికి వాయువుతోడైనట్లు దురాచారుడైన చిత్రభానునకు వీడు మంత్రియై యుపదేష్టయై యుండెను. వీడు చేయనిపాతకము లేదు, వీనియెడ దయజూపుట యనుచితము. వీనియెడ జాలిజూపుట పాతకమున కభ్యుదయము గలిగించుట. అధర్మమును ప్రోదిసేయుట. జాతిచేత విప్రుడైనంత మాత్రమున దురాచారుల క్షమించుట శ్లాఘాపాత్రముగాదు, కావున వీనిని దారుణవధము పాలు సేయుట మంచిది, ఏనుగు కాలిక్రిందవైచి త్రొక్కించియో కొరత వేసియో వీనిని దుదముట్టింపవలయు" అప్పలుకులు విని భాగ్యవర్ధనుడు వానినట్లు చేయుట యుక్తమని పలికెను. మీ యిష్టమని మహేంద్రదేవు డూరకుండెను. అంతకుమున్ను పెద్దలు చెప్పినట్లు వినకపోవుటచే దమకెన్ని యిడుములు కల్గినవని యెరిగి విక్రమసేనుడు వారిమాట కెదురాడడయ్యె. మకరందుడు వధింపవలదని పలుమారు చెప్పెను. గాని వానిమాట సాగదయ్యె. రుద్రభట్టుం దోడ్కొని రమ్మని భాగ్యవర్ధను డాజ్ఞయిచ్చెను. సంకెళ్ళబరువున మెల్లమెల్లగ నడుగులిడి నడచుచు గతగర్వుడై దీనాననుడై రుద్రభట్టు రాజసన్నిధిం బ్రాపించెను. అతనిం జూచి భాగ్యవర్ధను డిట్లనియె—"బ్రాహ్మణుడా! చిత్రభానునితో గలిసి కాశ్మీర రాజకుటుంబమునెడ నీవొనర్చిన మహాఘాతుక కృత్యములకు నీకు మరణదండన విధించినారము. మదపుటేనుగు కాలిక్రిందవైచి త్రొక్కించి నిన్నంతమొందించుట సముచితం

బని సభాసదులు నిర్ణయించిరి. నీ వర్చస్సుచూడ బ్రహ్మతేజ ముట్టిపడు చున్నది. అదిగాక నీవు వేదవేదాంగ పారంగుడవనికూడ వింటిని. అట్టి నీవ యుక్తాటికము లేక యుక్తాటికవాని చందమున దుష్కార్యంబుల నొనర్చితివి కావున దత్ఫల మనుభవింపుము." అని యానతీయ రుద్ర భట్టు బాష్పాకులితలోచనుడై —"మహా ప్రభువులారా! నావయస్సును నా కులమును, నా విద్యను, మీరాలోచించి నన్ను క్షమింపవలయు నని ప్రార్థించుచున్నాడ. నా యాలుబిడ్డలకు దిక్కెవ్వరు లేరు. నేను మిక్కిలి పేదవాడను. మీ శరణము జొచ్చినాడను. మీ పాదము లాశ్రయించి బ్రతుకవలసినవాడను." అని బాలుడట్లు వెక్కి వెక్కి యేడ్చెను.

హుకరందుడు చూడలేక యాచోటువాసి యవ్వలికిం బోయెను. మాధవసేనుడు—"మహారాజులారా! ఇతడు నాటకమందలి పాత్ర మట్లు సకలరసము లభినయింపగలడు. ఇప్పుడేడ్చి మీ హృదయంబులు కరగింపగలడు. కావున మీరు మొత్తపడవద్దు. ఈత డింతకన్నను దారుణమైన శిక్షల కర్హుడు. బ్రతికియుండగా వీనిం గాల్చినను దోసము లేదు. ఇట్టి కలుషాత్ముని సంపర్కమువలన నతిపవిత్రమగు నగ్ని పవిత్రుడు మలినుండగును. కావున నిదే వీనికి దగినశిక్ష" యని కఠినముగా బలికెను.

"బ్రాహ్మణుడా! నీ మీద నెవ్వరికి జాలిలేదు. 'అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ' మని మీవంటి పెద్దలే చెప్పినారు. కావున నీవు చేసిన వ్యవసాయమున బండినపంట నీవ కుడువవలయు. కార్యమొకడు చేయు ఫలము మరియొక డనుభవించునా? మాయా రూపముదాల్చి హేమచంద్రునివంటి రాజచంద్రుని పొట్టం బెట్టు కొంటివి. అట్టి నృపచంద్రుడు మరల మనకులభించునా! ఛీ! నీ మొగం జూడగూడదు పొమ్ము" అని భాగ్యవర్ధనుడు కోపోద్రేకుడై పలికెను. సేవకు లాతని నవ్వలికిం దోడ్కొనిపోయిరి.

గాంధార రాజులయొద్ద కాళరాత్రి యను మదపుటేనుగు కలదు. సేవకులు దానిం దోడితెచ్చి గాంధారస్కంధావారమునకు నెట్టయెదుట

నిలువబెట్టి వలదు వలదని పెద్దపెట్టున నేడ్చుచున్న రుద్రభట్టును లాగియు గెంటియు ద్రోసియు నా దంతావళమానసాంతికమునకు దీసి కొనిపోయి యొక యినుపగొలుసు దెచ్చి రుద్రభట్టు నడుమునకుఁ గట్టి దాని నేనుగు కాలికి బంధించిరి. అప్పుడు రుద్రభట్టు తన కట్టి దారుణ మరణము విధి నిర్ణయించెనని మనస్సమాధానము జేసుకొని కన్నులు మూసికొని పరమేశ్వరుని ధ్యానము జేసి నేలఁ బండుకొనియెను. మావటీఁడు మత్తేభము నంకుశంబునం బొడిచి ముందుకు నడిపించెను. తోడనే యయ్యది ఘీంకరించి యతిభారములై రోళ్ళవలె నున్న తన పాదములు రుద్రభట్టు వక్షస్థలంబున బెట్టి త్రొక్కి తొండమున వాని శిరసెత్తి గిర్రునం ద్రిప్పి నేలం బడవైచెను. రుద్రభట్టు క్రొన్నెత్తురులు గ్రక్కుకొని యమమందిరమునకు జనియెను. సైనికులందరు మహాభయముతో విస్మయముతో నాతని దుర్మరణము జూచి జాలినొందిరి. శ్రీనగరపౌరు లాబాలగోపాలముగ నవ్వార్తవిని సంతసించిరి.

గాంధారనాయకుడు మణివర్మ చేసిన హితోపదేశము ననుసరించి చిత్రభానుని బట్టి చంపుటో లేక బ్రతికియుండగా శ్రీనగరంబునకుం గొని తెచ్చుటో కర్తవ్యమని కొంతసేనతో జీవసిద్ధిని వాని కొరకై పంపెను. జీవసిద్ధియు నది దాటి వానిజాడ లరయుచు బరిసరంబులనున్న యరణ్యములు వెదకుచు గొంతదవ్వరిగెను. ఒక యేటియొడ్డున నొక కొండగుహాలో చిత్రభానుఁడు కరటక పింగళ సమేతుఁడై తన యాప్తసేవకులు పిట్టలం గొట్టి తెచ్చి యిచ్చిన మాంసంబును గొన్ని పండ్లను మెసవి కాలక్షేపము సేయుచుండెను. ఒకనాటి సాయంకాలము చీకటి పడిన వెనుక నాగుహాలో మువ్వురు గూర్చుండి తమ దురవస్థకు వగచుచుండ బింగళుడు విచారాక్రాంతుఁడై యిట్లనియెను—"మహాప్రభూ! దేవరవారి నిమిత్తమై మేము మేను దాచుకొనక యేపని జేయుమన్న నాపని జేసితిమి. మీరు మీయన్నం జంపునపుడు మేమెంతో సాయము జేసితిమి. ఎన్నో మాయవేషములం దాల్చితిమి. నేను విశారద నామముతో

మాళవదూతవని బొంకి మీయున్న మనసు కలచితిని. గాంధారదేశ బ్రాహ్మణవేషము, సాయిలవానివేషము కరటకుడు వైచి యెంతో చిత్రముగా గథాకలాపము వినిపించి సైనికుల కుద్రేకము గలిగించెను. నేనును మహేంద్రదేవుని పురోహితవేషము వేసి యాయన యుంగరము దొంగిలించుకొనివచ్చి రాజకుటుంబము మనసు కలచితిని. మీరు వేటకు వెళ్ళదలచినప్పుడు నేనె గొల్లవాడనైతిని. రాకొమరులు పులినోటబడి చచ్చిరని నేనె బొంకితిని. మీయీవదాటక యెన్ని దుష్ప్రయత్నములనైన బన్నితిని. కాని దైవము మన కనుకూలముగ లేకపోవుటంజేసి మన ప్రయత్నములన్నియు భగ్నములయ్యెను. ఇక నేమి చేయుదము ! ఎందుబోవుదము ! మాబ్రతుకు, మాసుఖము మీతో నున్నది. ఆలుబిడ్డలకు దూరమైతిమి అన్నవస్త్రములకు వాలిరైతిమి, పరమేశ్వరుడు మనమీద నిర్దయుడగుటకు గారణ మేమో " యని యుసురులార్చుచుండ జిత్రభానుడు దైన్యసూచకమగు హీనస్వరముతో—" ఓరీ ! మీవలన లోపము లేదు. నే నేయాట లాడుచున్న నది యాడితిరి. అయినను మనము దైవోపహతుల మగుటచే నపజయమైనది. అయినను మేన ప్రాణములుండ మన ప్రయత్నము విడువదగదు. ఈ యాటవికులం గూర్చుకొని క్రమ క్రమముగా దేశపుంగొననున్న గ్రామముల నాక్రమించి మెల్లగ విజృంభింతము " అని పలుకుచుండ మనుష్యులు నడచి వచ్చుచున్న జాడ వారికి వినవచ్చెను. వెంటనే పింగళుడు గుహ వెలుపలికివచ్చి శబ్ద మాలకించి—" మనుష్యుల యడుగుల చప్పుడువలె గొంతదూరమున వినబడుచున్నది. మనలం బట్ట బగతురు వచ్చుచున్నారేమో ! ఈవలకు రండు పారిపోదము " అని తొట్రుపాటుతో బలికెను. అది విని వెంటనే లోపలనున్న యిరువురు వెలుపలికివచ్చి శబ్ద మాలకించిరి. అంతలో జీవసిద్ధి సైన్యము మిక్కిలి దగ్గరకు వచ్చుటయు సేవకసమేతుడై చిత్రభానుడు ప్రాణరక్షణమునకై పరువెత్త సాగెను. అది కనిపెట్టి జీవసిద్ధియు సైనికులును వారిం దరుమ నారంభించిరి. కాలిలో ముండ్లు విరుగుటంజేసి పింగళకుండు నడువలేక

యొకచోటబడెను. సైనికులు వానింబట్టి తుత్తునియలుగా నరికివైచిరి. చిత్రభానుడు తన పాదములు పరుగెత్తనిచ్చినంత వేగముగా పరువెత్తుచు నొక చెంచుపల్లియ డాసి యయ్యూరు వెలుపలనున్న పాడునూతిలో బడెను. చీకటిచాటున నది కానబడక పోవుటచే నట్టి ప్రమాదము సంభవించెను. అందు నీరు లేదు గాని పాములు, జెర్రులు, కడిచీమలు మొదలగునవి విశేషముగనుండెను. తేళ్ళు కుట్టెను, పాములు కరచెను, కండచీమలు పీకెను. ఆతడా బాధలుపడలేక పెద్దపెట్టున నరచి మరణవేదన బొందెను. చెంచు పల్లియలోని వారందరు నదలి మేల్కాంచిరి. అంతలో నాత డెక్కడున్నాడో నెవ్వరు జెప్పనక్కరలేకయే వాని యునికి యెరిగించుటచే జీవసిద్ధి యానూతికడకుపోయి సైన్యసమేతుడై దాని యొద్దున నిలిచెను. కొంతసేపటికి క్రమక్రమముగా జిత్రభానుడు స్మారకముదప్పి హీనస్వరంబున నేమేమో గొణుగుకొనుచు గాలధర్మము నొందెను.

మరునా డుదయమువరకు జీవసిద్ధి యచ్చటనుండి శవముం దీయించి సైనికులతో నిట్లనియె—"అహా! చూచితిరా? యెంత యున్నత వంశమునన్ జన్మించెను, ఎన్ని విద్యలనో నేర్చెను. కాని దురాశాపీడితుడై దుస్సహవాసములం జేసి దుర్నయంబున కొడిగట్టి దుస్తంత్రంబులబన్ని దుష్కార్యము లాచరించి తుదకీ దురవస్థం దెచ్చికొనియె. రాజద్రోహియయ్యెను. భ్రాతృద్రోహి యయ్యెను, దేశద్రోహి యయ్యెను. శిశుహంతకాదలచెను. తరువాత నరకమున్నదో లేదోగాని యీ నూతిలోబడినది మొదలుకొని ప్రాణము పోవువరకు భూలోకమందె నరకక్లేశమనుభవించెను. శిష్టజనసంరక్షణంబును దుష్టజన సంశిక్షణంబును జేయ దీక్షవహించిన దాక్షాయణీ వల్లభుడు పరమేశ్వరుడు పాపఫలంబు దురాత్ముల ననుభవించునట్లు జేయక పోవునా? పాప మెన్నటికి జయము గాంచదనియు, సత్యమే జయించుననియు ధర్మమే సర్వోత్కృష్టమై వర్ధిల్లుననియు దుదకు వారికి మిగిలినది పాపమేయనియు వీని చరిత్రమువల్ల నేర్చుకొనవచ్చును."

అని యుపన్యసించి శవమును భాగ్యవర్ధన విక్రమసేనులకు జూపదలచి కటుకుగట్టించి దానిపై బెట్టించి సేవకులచేత మోయించుకొని నదియొడ్డున బెట్టించి నది దాటి తాను స్కంధావారమునకుం జని విక్రమసేనునకు భాగ్యవర్ధనునకు మకరందునకు మాధవసేనునకు నవ్వార్త జెప్పి రహస్యముగ వారిని నది దాటించి యావలి యొడ్డునకు దీసికొనిపోయి శవముం జూపెను. చిత్రభానుడస్తమించెనని వారప్పుడు నిజముగా నెరిగి సంతుష్టులైరి. విక్రమసేనుడు వాని దురవస్థకు విచారించి భాష్పాకులితలోచనుడయ్యెను. మాధవసేనుడు చేతులార జేసికొన్నది యనుభవింపక తప్పునా యనెను, మకరందుడు జాలిపడెను. మరల నడవికిం గొనిపోయి యచ్చటనే దహనసంస్కారము చేయుడని భాగ్యవర్ధను డాజ్ఞయిచ్చెను. ఆ వార్త చిత్రభానుని కుటుంబమునకు దెలియకుండ రహస్యముగ నుంచుమని కాలాంతరమున దెలియజేయవచ్చునని విక్రమసేనుడు వారిని గోరెను. శాస్త్రచోదితములైన యుత్తరక్రియలు లేక తనకొరకు విచారించి నాప్తజనము లేక దిక్కులేక చిత్రభానుడు వనమధ్యంబున నెండుటాకులు రాలినట్లు దగ్ధుడై యపకీర్తి కాయమును లోకంబున విడిచి పోయెను. చిత్రభానుడు నూతబడిన రాత్రి కరటకుడు పేరాకలిగొన్న పెద్దపులి వాతంబడి యంతక పురంబు జేరెను.

## ముప్పది యేడవ ప్రకరణము

చిత్రభానుడు మృతినొందిన వెనుక నొక మాసమువరకు నూరకుండి భాగ్యవర్ధనుడు మకరంద మహేంద్రదేవులతో నాలోచించి విక్రమసేనునకు బట్టాభిషేకము సేయ నిశ్చయించెను. మాతామహుండైన మహేంద్రదేవుడు నానాదేశాధీశ్వరులకు మనుమని యభిషేక మహోత్సవమునకు రావలయునని యాహ్వానంబుల నంపెను. మాళవేంద్రుడైన సుదర్శనుడు సింధునాయకుడైన పరంతపుడు ఘూర్జర

వల్లభుడైన కువలయేశ్వరుడు మున్నగు మహీనాయకులు తమతమ పరివారములతో మహావైభవమున వచ్చి శ్రీనగరమున దమ నిమిత్త మేర్పరుపబడిన విడిదలలో విడిసిరి.

నగరమంతయు సింగారింపబడెను. ఎచ్చోటజూచిన బచ్చని పందిళ్ళు, ఏద్వారమున జూచిన గనులపంటువుసేయు తోరణములు, ఏగుమ్మముముందర గనుగొన్న గెలలతో నిండిన యరటి కంబములు, ఏగోడలు వీక్షించిన నతిమనోహరములైన చిత్తరువులు, ఏమేడలు జూచిన బట్టుపతాకములు, ఏనెలవు దర్శించిన సర్వాలంకార శోభితలైన విలాసవతులు, యమున, సింధు, భాగీరథి, సరస్వతీ ప్రముఖము లగు పుణ్యవాహినుల తోయంబులు హేమకుంభములతో దెప్పింపబడెను. ప్రకృతి జనంబులలో ముఖ్యులు తన్మహోత్సవ దర్శనార్థమై వచ్చిరి. భాగ్యవర్ధనుని యానతిబూని చండశక్తివర్మలు తగు పరివారముతో గాంధారి నగరమున కరిగి కుమారాభిషేక మహోత్సవము గనుగొనుటకై యరవిందాదేవిని దోడితెచ్చిరి. తల్లియుం గొమరులు గలిసికొని పరస్పరాలింగన సుఖంబు ననుభవించిరి.

సిద్ధాంతులు నిర్ణయించిన సుముహూర్తంబున మహారాజులయు, సామంతులయు, మంత్రులయు, జట్టములయు, ప్రకృతి జనంబులయు సన్నిధిని బురోహితుడగు నిగమశర్మ విక్రమసేనుని గాశ్మీర సింహాసనంబున గూర్చుండబెట్టి పుణ్యనదీ తోయంబులతో నభిషేకించెను. అరవిందాదేవి సహజమగు మాతృవాత్సల్యముచేత గన్నుదమ్ముల నుండి దొరగు నానంద బాష్పములతో బుణ్యనదీజలముల బవిత్రమైన కుమారుని మూర్ధమున వెండియు నభిషేకించెను. ఉదయశైలము నలంకరించిన భానుమండలమట్లు నవరత్నఖచితమైన సువర్ణపీఠము నధిష్ఠించిన దేదీప్యమాన ప్రభలతో విరాజిల్లు మాణిక్యమకుటంబునొ దలదాల్చి కుమారభావంబుదాల్చి వచ్చిన హేమచంద్రుంబోలె వెలయు విక్రమసేనునిం జూచి మహేంద్రదేవ ప్రముఖ బాంధవులు సుదర్శనాది మిత్రులు, భాగ్యవర్ధన ప్రముఖులగు నాప్తులు నానందించిరి. వందిమాగధులు కైవారము జేసిరి. వైతాళికులు జయ

గీతములు పాడిరి. వృద్ధు లాశీర్వదించిరి. ప్రకృతి జనంబులు భళి భళి యని ప్రశంసించి సంతసించిరి. విరివిగా జరిగిన యన్నదానమున బేదలు సంతుష్టులైరి. భూరిసంభావనల నందుకొని కవులు, పండితులు బహుశ్లోకగర్భితములైన దీవనలనిచ్చిరి నగరమంతయు నుత్సవ మయ్యెను. ఒకచో విప్రుల వేదఘోషములు, వేరొకచో బుణ్యాంగనల యాటలు, గొండొకచో బుణ్యాంగనల పాటలు, నొకయెడ గాన వినోదములు, నొక నెలవున బండిత శిరోమణుల వాదములు, నొక తావున మిత్రుల సరసపల్లాపములు, నొకయెడ బాంధవుల పరస్పర పరామర్శలు నిట్లు నగరమంతయు మహానందమయమై నయనపర్వమై మనోహరమై యుండెను.

ఉత్సవానంతరమున విక్రమసేనుడు తనకుం దమ్ముని కు ప్రాణ ప్రదాతలైన చందుని శక్తివర్మను బిలిపించి వారి రాజభక్తి కొని యాడి చెరియొక గ్రామములు పన్నులు లేకుండ నగ్రహారములుగా నొసగెను. అదియునుగాక దమనిమిత్తమై కష్టపడినవారికి, ప్రాణములు గోల్పడినవారికి నుచితరీతిని బారితోషకముల నొసంగి వారి కుటుంబ ములకు జీవనాధారము గల్పించెను. చిత్రభానునియొక్కయు, దండ పాణి వజ్రపాణులయొక్కయు దురోద్బోధనలవలన వికలచిత్తులై తనపై దిరుగుబాటుచేసిన సైనికుల నందరను క్షమించి మరల సైన్యమున జేర్చుకొనెను. మణివర్మను, మాధవసేనుని మంత్రులుగా నియ మించెను. గదాధర, శూలపాణులు సేనాపతులైరి.

భాగ్యవర్ధనుడు తన గారాబుకూతురైన సౌదామినిని విక్రమ సేనునకును, దన తమ్ముని కూతురగు చిత్రరేఖను హర్షవర్ధనునకును నిచ్చి వివాహముసేయ సంకల్పించినట్లు మహేంద్రదేవునితోడను, వరనిందాదేవితోడను జెప్పి వారి యనుమతి వడసి మాఘమాసంబున గళ్యాణంబులు జరుపదలచి సుముహూర్తము నిశ్చయించెను. మహేంద్రదేవుడు తానతివృద్ధుడై రాజ్యభారము నిర్వహింప లేకుండుట చేత దన రాజ్యమున హర్షవర్ధను నభిషేకించి వారికి యుక్తవయసు వచ్చువరకు దానాతనికి దోడైయుండి యనంతరము దపోవనమున

కరుగ నిశ్చయించెను. భాగ్యవర్ధనుడును దనకుం దమ్మునకు బురుష సంతతి లేనందున దన పరోక్షమున విక్రమసేనుడే గాంధారదేశమునకు గూడ నేలికగాగలడని యెల్లరాజులయెదుట నొక్కి వక్కాణించెను.

సుదర్శనుడు మకరందుని మిత్రుడగు చంద్రచూడునివలన దన కుమారుడు కర్పూరమంజరిపై వలపు నిలుపుట వినియున్న కతమున విక్రమసేనుని పట్టాభిషేక మహోత్సవము నిమిత్తము నిర్మింపబడిన పచ్చనిపందిళ్లలోనే కర్పూరమంజరిని మకరందునకు వివాహము సేయు టుచితమని యరవిందాదేవికిని నిందుమణికిని నిగమశర్మ ముఖమున సందేశమంపెను. అరవిందాదేవి ఆసందేశము నాదరముతో విని యీ వివాహము నంగీకరించెను. భర్తృమరణవార్త తెలియక పోయినను నిందుమణి మహాపతివ్రత యగుటచే నాతనికొరకై బెంగ గొని యన్యులతో మాటలాడక సరిగా నన్నము ముట్టక నిదుర పోవక దుఃఖపరవశయైయుండియు, సంప్రాప్తయౌవనయైనకూతు నవివాహితగా జిరకాలముంచుట యనుచితంబని తలంచి యనుకూలుడైన వరుడు చేకూరినప్పుడు వాని కామె నీయక పోవుట యధర్మమని భావించి యరవిందాదేవిం బిలిచి యిట్లనియె—“ అక్కా ! మీయమరదితోబాటు నేనును మీకు లేనిదాననే యని భావింపుడు. మీయమరదివలన మీకైన మహోపకారములనెల్ల మరచిపోండు. చిన్ననాటనుండి కర్పూర మంజరిని నీవే పెంచితివి. అది నీబిడ్డకాని నాబిడ్డకాదు. కడుపున గాంచుటచే నేను తల్లినైతిని. పెంచుటచే నీవు తల్లివైతివి. దానికి నామీదకన్న నీమీదనే మక్కువ మెండు. నేను బహుకారణములచే ప్రజల ముఖము జూడజాల. కావున గర్పూరమంజరిని మాళవ రాజ నందనుడగు మకరందునకిచ్చి పెండ్లిచేయింపుము. జనకునికి జడిసి యుబ్బాలిక పైకి జెప్పలేదుగాని యామె రహస్యముగ బౌద్ధమతమును స్వీకరించినది. వెనుక దండ్రితోగూడ నొకసారి బుద్ధదేవుని సిద్ధాంత ములు బ్రసంగించుచు గంభీరముగా మాటలాడెను. అందుచే బౌద్ధ ధర్మప్రకార మామెకు వివాహము సేయింపుము” అని పలికి యాగకుండవచ్చు బాష్పధారలను చీరచెరగుతో దుడుచుకొనియెను.

"ఇందుమణీ! విచారింపకుము, నీమనోభీష్టము నేను నెరవేర్చెద. నీకు విక్రమసేన హర్షవర్ధనులతో ముగ్గురు కొడుకు లనుకొనుము. నీవు చెప్పినట్లు కర్పూరమంజరి నాబిడ్డయే. కర్పూరమంజరికి శుభముహూర్తమున వివాహము చేయించెదన" ని యరవిందాదేవి నుడివి యామె యలమటదీర్చి వివాహమునకు ముహూర్త మేర్పరచి ఆవార్త సుదర్శనున కెరింగించెను. సుదర్శనుండును వెంటనే వార్తాహరుల నుజ్జయినికంపి చంద్రప్రభాదేవిని రత్నసేన ప్రముఖులగు మంత్రులను రావించెను. అరవిందాదేవి వేగగమనముగల యొంటెలమీద ప్రయాణనైపుణిగల పరిజనుల విదర్భకంపి వివాహము నిమిత్తము సకుటుంబ సపరివారముగా రాజవాహనుని రమ్మని యాహ్వాన మంపెను. అందరును వివాహ మహోత్సవ దర్శనార్థము వచ్చిరి. తక్షశిల నుండియు మరి తదితర ప్రదేశములనుండియు బౌద్ధభిక్షుక భిక్షుణీ జనములు తండోపతండములుగ వచ్చి శ్రీనగరమున విడిసిరి. కామందకి యను బౌద్ధయోగినియు, జినదాసుడను బౌద్ధగురువును విజయము చేసి సౌగత ధర్మప్రకారము సకల బంధుమిత్ర సమక్షమున కర్పూరమంజరిని మకరందునకిచ్చి వివాహము చేసిరి. ఆ దంపతులం జూచి జయ జయ ధ్వనులు సేయువారు, భళీయని ప్రశంసించువారు— "అహో! బ్రహ్మ నిర్మాణ కౌశలమ్మన" నివారు, "దాంపత్యమన నిదే దాంపత్యము" ని యనువారు, సంతోష మొందనివారు, హర్ష సూచకముగ జప్పటులు చరువనివారు నచ్చట గుమిగూడిన జనులలో లేరు.

ప్రపంచములో ననుకూల దాంపత్యము కుదురుట యరిది యగుటచే విధాత తుల్యగుణములు తుల్యరూపములు తుల్యశీలములు గల దంపతులను గూర్చి నేటికాలమునకు లోకనింద బాసెనని జనులు చెప్పుకొనిరి. వివాహము మహావైభవముతో జరిగెను. పేదలకు మృష్టాన్నము లభించెను, పండితులకు బారితోషికములు దొరకెను. భిక్షుక భిక్షుణీ జనంబులకు దగు పసదనంబు లీయబడెను మకరందుని మనోరథము సిద్ధించెను, కర్పూరమంజరి కామితము కడముట్టెను.

వివాహానంతరమున సుదర్శనుడు విజయసేనుని, విందుమణిని, నరవిందాదేవిని, విక్రమసేనుని నాడంబరరిచి కోడలైన కర్పూరమంజరిని నుజ్జయినీ పురంబునకు దోడ్కొనిపోయెను. రతీమన్మథులవలెనున్న యా సతీపతులం జూచి యుజ్జయినీ పురవాసులు మహానందభరితులై వారిరువుర సమాగమము బహువిధముల బ్రశంసించిరి. సుదర్శనుడును జంద్రప్రభాదేవియు గుమారుని మాళవరాజ్యమున కభిషిక్తుని జేసి తాము మందిరము విడిచి యొక విహారమునం బ్రవేశించి బుద్ధదేవోపదిష్టములైన ధర్మముల బారాయణము సేయుచు బారమార్థిక చింతతో గాలము గడుపదొడగిరి. మకరందుడు సతీసమేతుడై ప్రత్యహము దల్లిదండ్రుల సందర్శించి వారి దీవనల బడసి వచ్చి ధర్మమార్గానుసారముగా బ్రజాపాలనము సేయుచుండెను. ప్రతిగ్రామమున నతడు చెరువులు, నూతులు, బావులు త్రవ్వించెను. పల్లెపల్లెయందు బాలుర విద్యాభివృద్ధికై పాఠశాలలు నెలకొల్పెను. దుర్గమములగు మార్గముల జక్కని రాచబాటలు నిర్మించెను. విశాలములైన యా బాటల కిరుప్రక్కల సుందర పుష్పములను, మధుర ఫలంబులను, శీతల చ్ఛాయలను నొసంగు వృక్షముల నాటించెను. ఎల్లరు ఫలంబుల ననుభవింపవచ్చును. ఎల్లరు పుష్పముల స్వీకరింపవచ్చును ఎల్లరు నీడల సుఖింపవచ్చును. క్రోసుదూరమున కొకచోట బాటసారులు విడియుటకై సత్రముల గట్టించెను. రోగుల చికిత్సల నిమిత్తము ధర్మవైద్యశాలలు స్థాపించెను. తెగులుగొంట్లగు పసరములకు సైతము నట్టి చికిత్సశాలలే నిర్మింపబడెను. మాంసభక్షణము దేశమందంతట నిషేధింపబడెను. జీవహింస యారుదయ్యెను. జంతువులయెడ నహింసను నిష్కారణముగా బ్రవర్తించినవారు రాజదండనలకు బాత్రములైరి. తల్లిదండ్రులయెడ భక్తి, గురుజనంబులయెడ గౌరవము, క్షుద్ర జంతువులయెడ దయ, పరస్త్రీలయెడ సోదరీభావము, వికలాంగులయెడ నిరుపేదలయెడ జాలి మొదలగు సద్గుణంబులు 'యథా రాజా తథా ప్రజా' యను సామెత నిజముగా రాజు నడతనుండి ప్రజలు నేర్చుకొని ధర్మాచరణముచేత రాజు మనస్సు రంజింపజేసిరి. మకరందునకు

బరరాజులలో శత్రువులు లేకపోయిరి. అజాతశత్రుఁడను శబ్దము సరిగా పదునొకండక్షౌహిణుల శత్రువులుగల యుధిష్ఠిరునకు జెల్లినదనియు నిజముగా నమ్మాటలు మకరందునికే జెల్లుననియు నాకాలపువారందరు జెప్పుకొనుచుండిరి. మగధనాయకుని మందిరములందు మకరందుని కీర్తియు, ఘూర్జరాధిపుని కొలువుకూటంబున మకరందుని ప్రశంసయు, శూరసేన నృపాలుని శుద్ధాంతములయందు మకరందుని పేరే వెయ్యేల! దేశమందెల్లెడ నాతని యశోలతలు ప్రాకెననుట యతిశయోక్తి గాదు. మకరందుఁడు తన ప్రజలలో దండ్రిలేనివారికి దండ్రియై, భాతృహీను లకు భాతృఁడై, మిత్రులు లేనివారికి మిత్రుఁడై, ధనము లేనివారికి ధనమై, బలములేనివారికి బలమై ‘దుర్బలస్య బలం రాజా’ యను లోకోక్తిని సార్థకము జేసెను. అతఁడు దురాచారులకు దుర్నిరీక్ష్యుఁడై, యుత్తముల కుపగమ్యుఁడై, విద్వజ్జనులకు వేలుపుంజెట్టయి, పేదల పాలిటి పెన్నిధానమై, సర్వజన రంజకుఁడై, దుష్టజనభంజకుఁడై, ప్రజ తనకు శరీరముగా, ప్రజా శరీరమునకు దానాత్మగా నుండునట్లు మెలంగి ధర్మమార్గమునుండి యించుకేనియుం దొలగక దనచేత నితర నేతలకు మార్గదర్శకములుగా మహీపాలనము చేయుజొచ్చెను. కర్పూరమంజరి సహధర్మచారిణీ యను పేరు సార్థకమగునట్లు, కాంతలలో నీయింతి మేలుబంతి యని పేరువచ్చునట్లు, మహాపతివ్రత లలో నగ్రగణ్యయై, యత్తమామలకు విధేయురాలై, బంధువులకు బరమానురక్తయై, మహారాజపత్నియయ్యు గరువం బించుకయు లేక యెల్లయంగనలకు దర్శనంబిచ్చుచు సాదరంబుగ మాటలాడుచు దల్లి లేనివారికి దల్లియై, యాఁడుబిడ్డలు లేనివారికి బిడ్డయై. గతిలేనివారికి గతియై, జనుల ప్రేమకు భక్తికి బాత్రమై యుండెను. ఆమె పేదలగు బాలింతరాండ్రకు బథ్యపానంబు లంపును. చూలింతరాండ్రకు నూడిద లంపును. పేదల యూరుకుటిండ్లకు గుడిసెలకు స్వయము బోయి వారి సుఖదుఃఖముల నరయుచుండును. వారికి గావలసిన ధనసాహాయ్యము జేయుచుండును. ఆ దంపతులు ప్రజలనే బిడ్డలుగా భావించి వారి యానందము తమ యానందముగ, వారి యభ్యుదయము తమ

యభ్యుదయముగ, వారి కష్టములు తమ కష్టములుగ, వారి కలిమి తమ కలిమిగ, వారి లేమి దమ లేమిగ భావించి వారి సుఖమునకై యెల్లపుడు పాటుపడుచుండురు.

కర్పూరమంజరికి లోకైకసుందరుడగు నొక కుమారుడును, జగన్మోహనాకారయగు నొక కూతురుం గలిగిరి. పాడిదప్పక రాజు పాలించుటం జేసి జనులు పాడిపంటలుగలిగి సిరిసంపదలుగలిగి వర్ధిల్లుచుండిరి.

భాగ్యవర్ధనుని మరణానంతరమున విక్రమసేనుడు గాంధారమునకు గూడ రాజయ్యెను. మహేంద్రదేవుని పరోక్షమున హర్షవర్ధనుడు పాంచాలమునకు ప్రభువయ్యెను. మాళవ పాంచాల గాంధార కాశ్మీర దేశంబు లక్కసెల్లెండ్రట్లు బరస్పర మైత్రిగలిగి సిరులతో దులదూగుచుండెను. ఇందుమణియు, విజయసేనుడును కర్పూరమంజరీ వివాహమైన వెనుక గొన్ని మాసములుదనుక శ్రీనగరమునందుండి పిమ్మట మకరందు డాహ్వానముసేయ సుజయునికింబోయి యచ్చటనే నివసించియుండిరి. విజయసేనుడు కాలక్రమంబున మాళవ సైన్యంబున కధిపతియై మేటి దండనాయకుడని పేరుపొంది మకరందుని యాదరమునకు భాజనమయ్యెను. అనుకూలవతియగు కర్పూరమంజరి యిల్లాలుగ, భద్రసేనుడు మంత్రిగ, విజయసేనుడు దండనాథుడుగ, ధర్మము మిత్రంబుగ, సత్యంబు చుట్టంబుగ మకరందుడు జూదమాడి సిరులు గోల్పోవని నలుడు, చండాలసేవ జేయని హరిశ్చంద్రుడు, వేశ్యాలోలుడుగాని పురూరవసుడు నని ప్రజలు ప్రశంసింప జిరకాలము రాజ్యపాలనము జేసెను.

సమాప్తము.

రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.